తెనుఁగులెంక

# తుమ్మల సీతారామమూర్తి

## కవిత్వం - వ్యక్తిత్వం

అమూల్యశ్రీ

రత్నజ్యోతి పబ్లికేషన్స్
6/12 బ్రాడీపేట - గుంటూరు - 522 002

ముద్రణ - మార్చి 1995

ప్రతివెల - రు 75/-

ప్రతులకు
1) గ్రంథకర్త
6/12 బ్రాడీపేట - గుంటూరు - 522 002

2) కొల్లా శ్రీకృష్ణారావు
స్వతంత్రవాణి - లక్ష్మీపురం
గుంటూరు - 522 007

## కృతజ్ఞత

ఈ గ్రంథం తెలుగు విశ్వవిద్యాలయంవారి ఆర్థిక సహాయంతో ప్రచురితం. గ్రంథంలోని రచయిత అభిప్రాయాలతో విశ్వవిద్యాలయానికిఎలాంటి సంబంధం లేదు.

ముఖచిత్ర రచన :
దేవీప్రసాద్ - గుంటూరు

ముద్రణ :
శ్రీ లక్ష్మీగణపతి ప్రింటర్స్, బ్రాడీపేట, గుంటూరు.

## నా మాటగా

తుమ్మలవారి సాహిత్యంతో నాకు నాల్గు దశాబ్దాల పైబడిన పరిచయం ఉంది. ఆయన రాష్ట్రగానం కర్షకుడు-సంక్రాంతిపద్యాలు నాకు బలేయిష్టం ! "కలదోయి తెలుగుజోదుల తుటారి కటారి/ చెలరేగి పగఱజీల్చిన దినంబు" వంటి (తెలుగువీరుల శౌర్యప్రతాపాల్ని చాటే) పద్యాలు, "బిందెలతోడ బాల్ పిండెదుగాని, నీ/ కంచంబులోనికి గంజినీళ్ళే" వంటి (రైతుల కష్టాల్ని తెలియజేసే) పద్యాలు - మేము చదువుకొన్నరోజుల్లో ఆడిన సాంఘికనాటకాలలో సమయసందర్భం చూచి, ఏ పాత్రధారునిచేతనో పాడించేవాడిని !

అయితే తుమ్మలవారితో వ్యక్తిగత పరిచయం రెండుదశాబ్దాల నుండి మాత్రమే ! 1969లో గాంధీజీ శతజయంతి ఉత్సవాల సందర్భంగా - నేను 'గాంధిశతకం' రాయడం జరిగింది. శ్రీ బోయి భీమన్న శ్రీ సి.నా.రె. (డా॥ సి. నారాయణరెడ్డి) శ్రీ తుర్లపాటి కుటుంబరావు (ప్రముఖ పాత్రికేయుడు) గార్ల "అభిప్రాయాలు" సంపాదించాను. కాని "గాంధికవి"గా లబ్ధప్రతిష్ఠుడైన తుమ్మలవారి అభిప్రాయం గూడా నా "గాంధిశతకానికి" ఉంటే బాగుంటుందని దానికి విలువుంటుందని నాకు ప్రగాఢమైన కోరిక గల్గింది. అయితే అప్పటికి తుమ్మలవారితో నాకింక వ్యక్తిగత పరిచయం లేదు.

అదే సమయంలో తుమ్మలవారి ప్రియశిష్యుడు శ్రీ కాకరపర్తి వేంకటేశ్వర్లు బాపట్ల నుండి పాలకొల్లు జీవితభీమా సంస్థలో "డెవలప్ మెంటు ఆఫీసరుగా" రావడం, అనతికాలంలోనే ఆయనతో నాకు పరిచయం కలగడం, నాగాంధిశతకానికి తుమ్మలవారి అభిప్రాయం సంపాదించాలన్న నాకోరిక ఆయనితో చెప్పడం, యిద్దరం

పాలకొల్లు నుండి అప్పికట్లవెళ్ళి శ్రీ తుమ్మలవారిని కలుసుకోవడం జరిగింది ! (నేనప్పుడు పాలకొల్లులో ఉద్యోగం చేస్తున్నాను) అదే మొదటసారి నేనాయన్ని కలుసుకోవడం ! బహుశా అది 1973 జనవరి - ఫిబ్రవరి ప్రాంతం. కొద్దిరోజుల్లోనే నా గాంధిశతకానికి "తోచినమాట" రాసిచ్చాడు. అప్పటినుండి గాంధికవి శ్రీ తుమ్మల వారితో నాకు సన్నిహితసంబంధాలు పెంపొందాయి. శ్రీ కాకర పర్తి గూడా నాకు ఆత్మీయమిత్రుడయ్యాడు స్వల్పవ్యవధిలోనే శ్రీ తుమ్మల 'అత్యంత ఆత్మీయులలో నొకణ్ణి అయ్యాను. కవితా రచనారీతులలో తెనుగులెంక నుండి నేనెన్నో 'మెలకువలు' తెలుసుకున్నాను. వృత్తిరీత్యా ప్రభుత్వోద్యోగంచేస్తూ ప్రవృత్తి రీత్యా కవితావ్యాసంగం కొనసాగించే నన్ను ఆయన ఎంతో ప్రోత్సా హించేడు.

ఆమాటకొస్తే - తుమ్మలవారికంటే ముందునుండీ - నేను విద్యార్థిగానున్న రోజులనుండి నాకవితాకృషిని మెచ్చుకొంటూ నన్ను ప్రోత్సహించినవాడు - నేటికీ ఇస్తున్నవాడు పద్మశ్రీ బోయి భీమన్నగారిని మొదట చెప్పాలి. తర్వాతనే తెనుగులెంక. ఆ తర్వాత శ్రీ జ్ఞానానందకవి, కరుణశ్రీ, డా॥ సి. నారాయణరెడ్డి, ప్రొఫెసర్ కొత్తపల్లి వీరభద్రరావు ప్రభుతులొస్తారు.

ఇక రెండో విషయం తుమ్మలవారి 'నీతినిజాయితీ'లు నన్ను బాగా ఆకట్టుకున్నాయి. మనిషైనవాడికి 'శీలం' ప్రాణంకన్న మిన్న అన్నది ఆయన నమ్మిఆచరించినవాడు. "శీలంలేని మనిషికి పశువుకు భేదం" లేదన్నదిగూడా నాదృఢవిశ్వాసం ! అయితే నేను గొప్ప నీతిమంతుడనని కోతలు కోయడంకాదు ! నేను ఎటువంటివాడనో ప్రజలు చెప్పాలి ! లోకం చెప్పాలి ! ఇక అది అలావుంచండి ! తుమ్మలవారి కవిత్వం - వ్యక్తిత్వం - యీ రెండిటిలో ఏదిగొప్ప

అన్న 'మీమాంస' వస్తే నేనుమాత్రం ఆయన కవిత్వానికి 49 మార్కులు, ఆయన వ్యక్తిత్వానికి 51 మార్కులు వేస్తాను.

తుమ్మలవారు తన "కదంబకైత" ఖండకావ్యం నాకు "ఉడుగర"గా నిచ్చారు. అలాగే శ్రీ బోయి భీమన్నగారి 'మోక్షం నా జన్మహక్కు' శ్రీ జ్ఞానానందకవిగారి 'రాజధాని' ఖండకావ్యం 'అంకిత' మందుకొన్న అదృష్టవంతుణ్ణి నేను! అయితే ప్రథమంగా నన్ను తన కావ్యంనకు కృతిపతిని చేసిన ఘనత తుమ్మలవారిదే!

తుమ్మలవారి సాహిత్యంపై నేనెన్నో కవితలు వ్యాసాలు ముఖ్యంగా ఆయన స్వర్గస్థులైన (1990-మార్చి) తర్వాత రాసాను. వివిధ దినపత్రికల్లో - కూడా వచ్చాయి.

తుమ్మలవారి స్మృతిచిహ్నంగా గుంటూరులో సాహితీపీఠం పెట్టాలని - తుమ్మలవారి ఆత్మీయులు అభిమానులూ నేనూ "పగటి కలలు" కన్నాం, కంటున్నాం కూడా! మరి యీ 'కల' కార్యరూపం దాలుస్తుందో లేదో చెప్పడం కష్టం. ఇంతలో చీరాలలో శ్రీ కాకర పర్తి శ్రీ నన్నపనేని మార్కండేయులు తదితర పెద్దలు తుమ్మలవారి పేరుమీద 'సాహితీపరిషత్తు'ను నెలకొల్పారు! గుంటూరులో 'తుమ్మలవారి పీఠం' కలగానే మిగలడం నాకు కాస్తబాధ వేసిన మాటనిజం! కనీసం ఆయన సాహిత్యంపై ఒక పరిశీలనాత్మక రచన చేయాలని తీవ్రమైన ఆలోచనలో పడ్డాను ఇంతలో - షుమారు ఒక సంవత్సరం క్రిందట ఒకనాడు శ్రీ శ్రీనివాసమూర్తి శ్రీ కాకరపర్తి గుంటూరులో ఏదో కార్యక్రమానికివచ్చి - నన్ను కలిసారు. మాటలసందర్భంలో "జాషువాగారిమీద మీరు వ్రాసిన గ్రంథం (జాషువా కవితా వైభవం) నకు మంచిపేరు వచ్చిందిగదా! తుమ్మల వారి సాహిత్యంపై మీరెందుకు గ్రంథం రాయకూడదు! తెనుగు లెంకకు మీరుగూడా ఆత్మీయులేకనుక అసలీపాటికే మీరు

ఆయనపై గ్రంథం రాసివుండవలసింది" అంటూ మిత్రులు శ్రీ కాకరపర్తి తన మనస్సులోనిమాట బయటపెట్టాడు—మిత్రుని మాటలు నన్ను కాస్త "కదిలించాయి !" కర్తవ్యాన్ని గుర్తుచేసాయి! "సరే అలానే త్వరలోనే రచనచేస్తానని" వారిద్దరితో అన్నాను.

అలాఅన్నదే తడవుగా రచన మొదలుపెట్టాను. తుమ్మల వారి సాహిత్యాన్ని వివిధ దృక్కోణాలనుంచి పరిశీలించి - వివిధాంశాలమీద - ఆయన విశిష్టవ్యక్తిత్వంమీద వ్యాసావళి (అధ్యాయాలు) రాసి పూర్తిచేసేసరికి మోయరానిభారంగా "పెద్దగ్రంథ" మైంది ! ఇంతపెద్ద గ్రంథ ముద్రణ మాటలా ! ఎంతోఖర్చు అవుతుంది ! ఆచార్య గంగప్పగారి సలహాపై తెలుగు విశ్వవిద్యాలయంవారికి 'ఆర్థికసహాయంకొరకు విజ్ఞప్తి చేసాను. అదృష్టవశాత్తు విశ్వవిద్యాలయంవారు ఆర్థికసహాయం చేయటానికి అంగీకరించారు అందుకు తెలుగువిశ్వవిద్యాలయంవారికి, ప్రత్యేకించి దాని ఉపాధ్యక్షులు, 'చేతనావర్తకవి' శ్రీ పేర్వారం జగన్నాథంగారి కృతజ్ఞతలు తెల్పుకుంటున్నాను.

అయితే- యింతపెద్ద గ్రంథముద్రణకు విశ్వవిద్యాలయంవారి సహాయం ఏమూలకు ! ఈ గ్రంథరచనకు మొదట నాకుస్ఫూర్తి నిచ్చిన శ్రీ కాకరపర్తితో విషయం చెప్పాను ! తానూ తనశక్తి కొలది ఏదోవిధంగా సహాయం చేస్తానన్నాడు. అటు తుమ్మలవారి మీద 'భక్తి' భావం ! యిటు ఆత్మీయమైత్రీబంధం ! శ్రీ కాకరపర్తికి కృతజ్ఞతలు చెప్పడంకాదు యీగ్రంథం ఆయనకే అంకితం యిస్తున్నాను ! తుమ్మలవారి శిష్యుడుకావడం నాకు మిత్రుడు కావడంతోపాటు తుమ్మలవారి జీవితాశయాలైన "గాంధేయ జీవిత విధానం - నైయత్తికంగా మంచినడవడి - (శీలం) యీ రెండూ శ్రీ కాకరపర్తిలో వున్నాయి కనుక ! అంకితమిస్తున్నాను అంతే

కాని, ఆయనదో 'సాయం' చేస్తాడని మాత్రంకాదు. తుమ్మలవారి మీాద రాసిన గ్రంథం తుమ్మలవారి ఆశయాలకనుగుణంగా మెలిగే 'వ్యక్తిత్వమున్న' వారికే అంకితమివ్వాలనుకున్నాను కనుక !

తుమ్మలవారి సాహిత్యం - జీవితం - వ్యక్తిత్వం- కవిత్వం - మొదలగు అంశాలపై అన్నికోణాలనుండి పరిశీలించి తులనాత్మక మైన - సమగ్రమైన రచన చేసేనన్న తృప్తి నాకుగల్గింది ! మరి తెలుగు కవిపండితులు సాహితీప్రియులు - పాఠకులు నాకృషిని ఎంతవరకు మెచ్చుకొంటారో అది నాఅదృష్టం !

ఎంతజాగ్రత్త తీసుకున్నా - గ్రంథముద్రణలో 'ముద్రా రాక్షసం' క్షుద్రముద్రలు ఎక్కువగా నేపడ్డాయి. ముఖ్యమైన వాటికి 'తప్పొప్పులు' పట్టికనీయడం జరిగింది. మిగిలిన చాలాచిన్నతప్పులకు మన్నించగలరు. తప్పులు గ్రహించగలరు.

**కృ త జ్ఞ త లు**

1) గ్రంథముద్రణకు ఆర్థికసహాయంచేసిన తెలుగువిశ్వవిద్యాలయం వారికి—

2) కోరినంతనే స్వల్పవ్యవధిలో సమగ్రంగా నాయీగ్రంథాన్ని "సమీాక్షాదర్శనం" చేసి తన అమూల్యాభిప్రాయం రాసి యిచ్చిన / విద్వత్కవి శేఖర 'పండిత' శ్రీ చిన్నం రామయ్య చౌదరిగారికి—

3) కోరినంతనే నాగ్రంథంనకు "అభినందన"గాతనఅమూల్యమైన 'అభిప్రాయం' రాసియిచ్చిన - ప్రముఖ కవిపండితులు- నాగార్జున విశ్వవిద్యాలయ విశ్రాంత తెలుగుప్రాచ్యభాషాచార్యులు డా॥ బొడ్డుపల్లి పురుషోత్తంగారికి—

4) తుమ్మలవారి కావ్యాలతో పాటు ఆయన కుటుంబవిశేషాల సమాచారమెంతో అందించిన తుమ్మలవారి కుమారులు శ్రీ శ్రీనివాసమూర్తి శ్రీ రాయలుగార్లకు—

5) కావలసిన గాంధి సాహిత్యం - సర్వోదయ సాహిత్యం - తన దగ్గరున్న తెనుగులెంక కావ్యాల్ని అడిగినతడవుగా అత్యంత శ్రద్ధతో సేకరించి నాకిచ్చిన 'నిర్విరామ సర్వోదయకార్య కర్త' శ్రీ వట్టికూటి వేంకటసుబ్బయ్యగారికి—

6) ఈ రచన మొదలుపెట్టిన దగ్గరనుండి - రచన ముద్రణపూర్తి అయి - గ్రంథం సర్వాంగసుందరంగా తీర్చిదిద్దుటలో నాకు ప్రతిక్షణం - ప్రతివిషయంలో నాకు 'చేదోడువాదోడు'గా నున్న స్వతంత్రవాణి వారపత్రిక సంపాదకులు - కవి శ్రీ కొల్లా శ్రీకృష్ణారావుగారికి—

నా హృదయపూర్వక కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను !

చివరగా - యింతపెద్ద గ్రంథాన్ని శ్రమకోర్చి ముచ్చటగాముద్రించిన శ్రీలక్ష్మీగణపతిప్రెస్ అధినేత శ్రీB V.సుబ్రహ్మణ్య శాస్త్రిగారికి - ముఖచిత్రపత్రం అందంగా రూపొందించిన శ్రీ దేవీ ప్రసాద్ గారికి అభినందించడం నాధర్మం ! సెలవ్ !

—రచయిత

# విషయసూచిక

## I అభిప్రాయాలు



## అనుబంధం

# సమీక్షా దర్శనం

— పండిత శ్రీ చిన్నము రామయ్యచౌదరి
రిటైర్డు తెలుగు పండితుడు, గుంటూరు.

తెనుగులెంక శ్రీ తుమ్మల సీతారామమూర్తిగారి సాహిత్య సర్వస్వాన్ని, జీవితాన్ని, వ్యక్తిత్వాన్ని సమగ్రంగా పరిశీలించి పరామర్శించి 'అమూల్యశ్రీ' శ్రీ జూపూడి అమ్మలయ్యగారు రచించిన 'తెనుగులెంక తుమ్మల సీతారామమూర్తి కవిత్వం-వ్యక్తిత్వం' అనే సమీక్షాగ్రంథాన్ని చదివాను. ఉన్నత పట్టభద్రుడై ఉద్యోగధర్మంలో మునిగి తేలుతుకూడ నిరంతర సాహితీ వ్యాసంగంతో కళాతపస్విగా ప్రసిద్ధిపొందాడు. కవి పండిత సదస్సులలో పాల్గొని సాహితీవేత్తలను సన్మానించడం ఆయన ఆర్ద్రహృదయానికి నిదర్శనం. కవి పండితుల ఆశీస్సులతో "కవికులాలంకార" అనే బిరుదం ఆయన్ని వరించింది. పద్యకవితలు వ్రాశారు. సమీక్షా వ్యాసాలు వెలయించారు. "అమ్మలన్న పదాలు" అనే ముక్తక కావ్యాన్ని రచించారు. రేడియో నాటికలు వంటి ఆధునికసాహితీ ప్రక్రియలను ప్రకటించారు.

తుమ్మలవారి సాహిత్యాన్ని ఎన్నుకొని ఆయన జీవితాన్ని, వ్యక్తిత్వాన్ని సమీక్షించడంలో ఏదో సమానధర్మం ఈ ఇరువురికి ఉంటుందని ఊహించడం సహజం. ఆయన సాహిత్య జీవితాన్ని వివిధరీతులలో విభజించి ఆయన సమగ్రస్వరూపాన్ని చిత్రించడం పరమ రమణీయంగా ఉంది.

## సమీక్షా దర్శనం

తిక్కనగారి కవిత్వాన్ని తుమ్మలవారు ఎంత అభిమానించి అనుకరించారో అంతకుమిన్నగా అమూల్యశ్రీ గారు తుమ్మల

వారిని అభిమానించి ఆయన సాహితీ జీవితాన్ని చిత్రించారు గాంధికవిగా, రాష్ట్రకవిగా, జాతీయకవిగా, అభినవతిక్కనగా నవ్య సంప్రదాయకవిగా ఆయన జీవితాన్ని వ్యక్తిత్వాన్ని బహుధా ప్రశంసించారు.

గాంధీకవినని సీతారామమూర్తిగారే స్వయంగా చెప్పుకొన్నారు. గాంధీకవి అనటానికి అమూల్యశ్రీగారు ఇచ్చిన వివరణలు, ఉదాహరణలు సోపపత్తికంగా నిరూపింపబడ్డాయి. గాంధీగారిని గూర్చి వ్రాసిన కవులు ఆ రోజులలో ఎక్కువగానే ఉన్నారు. కాని వారికి గాంధీకవులమని చెప్పుకొనే అర్హతలేదు. మనసావాచా కర్మణా గాంధీ జీవించినట్లే జీవించి 'ఆత్మకథ'ను తుమ్మలవారు విరచించారు. ఆయన నడపిన ఉద్యమాన్ని 'మహాత్మకథ' పేరుతో చక్కని సన్నివేశాలతో చిత్రించారు. ఖద్దరు కట్టుకొన్నారు. నూలు వడికారు. అహింసా వ్రతం అవలంబించారు. సత్యనిష్ఠ నెఱపినారు. మలమెత్తినారు. 'గాంధీగానం' చేశారు. ఇన్నివిధాలుగా జీవితంలో గూడ గాంధీగారిని అనుసరించారు. గాంధీ నడపిన ఉద్యమంలో కవి గూడ పాత్రధారి. కథానాయకునకున్న వినయసౌశీల్యాలు కవికి గూడ సమృద్ధిగా ఉన్నాయి. ఆయన కథనే ఆత్మకథ పేరుతో తీర్చిదిద్దాడు. సామాన్యంగా కవిత్వం రసానందజనకంగా ఉండాలని ఆలంకారికులంటారు. ఆత్మకథలో రసానందానికి తావులేదు. గాంధీగారు వ్రాసికొన్న స్వీయచరిత్రకు మార్పులు చేర్పులు చేయటానికి వీలుండదు. ఇలాంటి కథలను కవిత్వంలో వ్రాయాలంటే కవికి అసిధారా వ్రతమే ఎదురౌతుంది. అయినా కమ్మని తెలుగుదనం ఉట్టిపడే విధంగా ఆత్మకథను సంయమనంతో సత్యనిష్ఠతో వ్రాసి రామలింగారెడ్డిగారి ప్రశంసలనందుకొని 'అభినవ తిక్కన'గా గౌరవింపబడ్డాడు. మహాత్ముని ఆస్థానకవిగా పేరుపొందాడు. ఈ తెనుగుదనం తుమ్మలవారికి తిక్కన్న పెట్టిన భిక్ష. ఆత్మకథలో కథానాయ

కుడు గాంధి. జీవితంలో నడవడిలో, వేషధారణములో సత్యవ్రతం మున్నయిన నియమావళిలో గాంధీగారికి కవిగారికి ఎన్నో సాదృశ్యాలు చూపించి అమూల్యశ్రీగారు తుమ్మలవారిని నూటికి నూరుపాళ్లు గాంధికవిగా సమర్థించారు.

'మహాత్మకథ'లో గాంధీగారి ఉద్యమచరిత్ర విశేషంగా చోటుచేసికొన్నది. నాన్యతోదర్శనీయంగా చిత్రింపబడ్డది. కవిగారు గాంధిగారిలో దేవతాత్మను సందర్శించాడు. దీనినే పాశ్చాత్యకవులు డివైన్ దర్శనం అంటారు. కవిగారు జ్ఞాననేత్రంతో చూచిన గాంధీ దర్శనాన్ని వివరిస్తూ అమూల్యశ్రీగారు ఉదాహరించిన పద్యాలు ముగ్ధమనోహరంగాఉన్నాయి. వ్యాఖ్యకూడ అపూర్వరమణీయంగా ఉన్నది.

ఇక తిక్కనగారితో అభినవ తిక్కనగారికున్న పోలికలు చక్కని పరామర్శతో కూడుకొనియున్నాయి. కొట్టరువు వంశంలో తిక్కన ఏడవతరంవాడని, తాత భాస్కరమంత్రియని రామాయణాన్ని మొట్టమొదట తెలుగులోవ్రాసిన మహాకవియని, గుంటూరు విభుడని పేర్కొన్నాడు. తండ్రి కొమ్మనామాత్యుడు నెల్లూరు ప్రభువైన సిద్ధయతిక్కశౌరికి దండనాథుడుగా ఉన్నాడని, మహాపరాక్రమశాలియని వివరించాడు. తిక్కనగారు ఉభయకవిమిత్రుడు. పూర్వకవులు కావ్యాలను గద్యపద్యమిశ్రితంగా వ్రాస్తుంటే అయన కేవలం పద్యమయాత్మకంగా నిర్వచనోత్తరరామాయణం వ్రాసి ఒక విశిష్టతను నెలకొల్పాడు. మహాభారతం పదునేనుపర్వాలను రసాభ్యుచిత పదబంధంతో ఆంధ్రావళిమోదముం బొరయునట్లు తెనిగించి కవిలోకానికి తలమానికంగా ప్రకాశించాడు. సంస్కృతాంధ్ర భాషలలో పెక్కుకావ్యాలు వ్రాసినట్లు కేతన వివరించాడు. యుద్ధ తంత్ర విశారదుడు, మహామాత్యుడు, మహాకవి, కవిబ్రహ్మ, మనుమసిద్ధిరాజ్య పునః ప్రతిష్ఠాపకుడుగా అజరామరకీర్తి నార్జించు

కొన్నాడు. మదనసముడు అని ఆయన ఆకార సౌందర్యాన్నిగూడ సమకాలికులు పేర్కొన్నారని అమూల్యశ్రీగారు తిక్కనచరిత్రను సమగ్రంగా పరిశీలించి చెప్పాడు.

తుమ్మలవంశంలో ప్రధానపురుషుడు టేకన్నగారు. ఆయన చంద్రగిరి ప్రాంతాన్ని పాలించిన విజయనగరరాజులయొద్ద దండనాథుడుగా ఉన్నాడు. ఆ రాజుల రాజ్యపతనానంతరం టేకన్న వంశీయులు గుంటూరు కృష్ణాజిల్లాలలో ప్రవేశించి కొంతకాలం వీరభటవృత్తి నడిపి తరువాత సేద్యవృత్తిని చేపట్టినారని, ఆ టేకన్నకు అభినవతిక్కనగారు పదవతరమువాడని పేర్కొన్నాడు. తుమ్మలకవి తండ్రి నారయ్యగారు ధర్మజ్యోతిగా, అహింసావ్రతుడుగా, సత్యనిరతుడుగా పేరుప్రతిష్ఠలు గడించుకొన్నాడని ఆ ధర్మజ్యోతికి ఆత్మజుడుగా పుట్టి సంస్కృతాంధ్రభాషలలో పాండిత్యాన్ని సంపాదించుకొని సీతారామమూర్తిగారు గాంధికవియైనాడని, "అభినవ తిక్కన" బిరుదుపొందాడని అమూల్యశ్రీగారు వివరించారు.

తిక్కన్నగారు శైవ వైష్ణవ మత సామరస్యంకోసం హరిహరనాథమూర్తిని సృష్టించి అద్వైతమతస్థాపనకు పూనుకొని ప్రజానీకంలో శాంతిపథాన్ని ప్రచారంచేశాడు. అభినవతిక్కన గాంధేయమార్గంలో మతసామరస్యాన్ని నెలకొల్పి దేశభక్తిప్రేరితుడై అహింసావ్రతుడై రాష్ట్రగానంతో కలిపి ఉదయగానము, సర్వోదయగానముచేసి సమతాధర్మాన్ని నెలకొల్పాడు. ఈవిధంగా అమూల్యశ్రీగారు తిక్కనకు-అభినవతిక్కనకు సాదృశ్య సమీచీనత్వాలు పేర్కొని సమతౌల్యాన్ని సాధించటానికి చేసిన ప్రయత్నం సాహసోపేతంగా భాసిస్తున్నది. తిక్కనగారు హరిహరుల ఐక్యరూపాన్ని చిత్రిస్తే అమూల్యశ్రీగారు కవిబ్రహ్మ - గాంధిమహాత్ములఐక్యరూపంగా తుమ్మలకవిని సృష్టించాడు. తిక్కనవంటివాడు ఆంధ్రసారస్వత ప్రపంచంలో మఱియొకడు లేడు. రవిఅస్తమింపని సామ్రా

జ్యాన్ని నిర్జించినవాడు గాంధిమహాత్ముడు తప్ప మఱియొకడు లేడు. ఈఇద్దరి స్వరూప స్వభావాల సమగ్రమూర్తిగా తుమ్మలవారిని చిత్రించడం అమూల్యశ్రీగారు తప్ప మఱియొకడు చేయలేడు. తిక్కన-గాంధీ-తుమ్మల అనే మూర్తిత్రయాన్ని వేదత్రయిలాగ హృదయంలో ప్రతిష్ఠించుకొన్న అమూల్యశ్రీగారు చరితార్థులు.

నవభావవిప్లవ కవిగా తుమ్మలవారిని అమూల్యశ్రీగారు పేర్కొన్నారు. అభ్యుదయకవిత్వం అంటే ప్రగతిశీల కవిత్వమనే కదా అర్థం. ప్రజలకోసం ప్రజాభాషలో ప్రజాహితంగోరి వ్రాసే ఏ కవిత్వమైనా అభ్యుదయకవిత్వమే అవుతుంది. సీతారామమూర్తి గారు వ్రాసిన కావ్యాలన్నీ ప్రజలకోసం, రాష్ట్రసిద్ధికోసం, దేశ ప్రయోజనంకోసం వ్రాసినవే. ఆ కవిత్వం అభ్యుదయ కవిత్వంగాక మఱియేమాతుందని అమూల్యశ్రీగారు ప్రశ్నించారు. అయితే ఆధునికలు అభ్యుదయ కవిత్వలక్షణాలను నిర్వచించినతీరుచూడండి. 'లెనినిజం, మార్క్సిజం' లక్షణాలు ప్రతిబింబించాలి. ఛందోబద్ధంగా ఉండగూడదు. వ్యావహారికభాషలో వచనంలో రచనలు చేయాలి. దీనిలో ఆముష్మికచింతన ఉండరాదు. కర్మసిద్ధాంతానికి తావులేదు. విధిని నమ్మరాదు. గతానుకరణంగావచ్చు సంప్రదాయాన్ని ఈ కవిత్వం నిషేధిస్తుంది. పద్యాన్ని తిరస్కరిస్తుంది. వర్గసంఘర్షణ శ్రామికవర్గాధిపత్యం, ఆర్థికసమానత్వం అనే త్రివేణీ సంగమమే అభ్యుదయవాదమనిపించుకొంటుంది. ఈ లక్షణములులేనిది అభ్యుదయకవిత్వంకాదు అని స్పష్టంచేశారు. అమూల్యశ్రీగారు అభ్యుదయకవిత్వలక్షణాలు అన్ని చదివారు. తుమ్మలవారి కవితలో ఆ లక్షణాలన్నీ ఉన్నాయని పెక్కుపద్యాలు ఉదాహరించారు. కవిగారు కర్మసిద్ధాంతాన్ని నమ్మరు. యజ్ఞయాగాదులను గౌరవింపరు. వర్గచైతన్యాన్ని ప్రోత్సహిస్తారు. ధనికవర్గాన్ని ఈసడిస్తారు. కాబట్టి ఆయన అభ్యుదయకవియే అవుతాడని ఎన్నో పద్యాలను ఎత్తి

చూపాడు. అయితే ఛందస్సును, పద్యాన్ని నిరసించే అభ్యుదయ వాదం ఛందస్సుందరమైన తుమ్మలవారి పద్యకవిత్వాన్ని అభ్యుదయ కవిత్వంగా ఎలా ఒప్పుకుంటుంది? అనే ప్రశ్న మిగిలేయున్నది. దానికి సమాధానం అమూల్యశ్రీగారు చెప్పవలసియుంటుంది. చెప్పేఉంటారేమో? అభ్యుదయ కవిత్వలక్షణం రసానందంకాదని, చైతన్యమని డాక్టరు వేల్చూరి నారాయణరావుగారన్నారు. సీతారామమూర్తిగారు రసానందంకోసం గాంధీచరిత్ర వ్రాయలేదు. వర్గచైతన్యంకోసమే వ్రాశారు. ఈవిధంగా నవ్యసంప్రదాయ విప్లవకవిగా రచయిత సమర్థించాడు.

కవి జీవితచరిత్ర సమగ్ర స్వరూపం ధరించింది. రచయిత కవి గారి గ్రంథాలన్నీ క్షుణ్ణంగా చదివి దీనిని రూపొందించారు. విద్యార్థిదశ, కర్షకజీవితం, సాహితీసంస్కారం, కావ్య నిర్మాణం, సత్యనిష్ఠ, అహింసావ్రతం, నిరాడంబరత్వం, వ్యక్తిత్వం, త్యాగం, హాస్యం మున్నగు అనేకాంశాలు కవికి ఎలా వన్నెతెచ్చాయో వ్యాఖ్యానించి చెప్పారు. తుమ్మలవారి సాహిత్యంతోనేకాక ఆయన జీవితంతోగూడ అమూల్యశ్రీగారికి అవగాహనమైన పరిచయ మున్నది. ఆ స్నేహబంధమే తుమ్మలవారి సమగ్రజీవితాన్ని, వ్యక్తిత్వాన్ని, వివరించటానికి రచయితను పురికొల్పింది. నేను, నా కథలు, ఎక్కట్లు, చక్కట్లు మున్నగు కావ్యాలలో కవిగారి సౌశీల్యానికి సంబంధించిన సన్నివేశాలు కుప్పలు తెప్పలుగా ఉన్నాయి. కావ్యాలు వ్రాయటంలోను, కృతిభర్తలను ఎన్నుకొనటంలోను, కావ్యాలను సొంతఖర్చులతో అచ్చొత్తించి అభిమానులందరికీ పంపటంలోను తుమ్మలవారికున్న ప్రత్యేకత మరేకవికిలేదు. కవితో పరిచయంలేని సారస్వతేయులు ఈభాగం చదువుకొంటే ముకుళిత హస్తులై కవిగారికి జోహారులర్పిస్తారు. ఈభాగాన్ని రచయిత విస్తరించి వ్రాశారు.

తుమ్మలవారి కవితా కమనీయతలో అమూల్యశ్రీగారు అమూల్యమైన పద్యరత్నాలనెన్నింటినో ఉదాహరించారు. కవి ఉభయభాషాప్రవీణుడు అని నిరూపించటానికి తెలుగుదనం జీర్ణించు కొన్న పద్యాలను, సంస్కృతపదభూయిష్ఠాలుగాఉన్న పద్యాలను ప్రత్యేకంగా చూపించారు. కవిసంస్కృతపదభూయిష్ఠాలైన కావ్యాలను ఇనుపసుద్దలని. తెలుగు తియ్యదనంతో ఉన్న కావ్యాలను లడ్డు ముద్దలని అన్నాడు. కాని ఆయన సంస్కృతపదప్రయోగంతో జటిలంగా వ్రాసిన పద్యాలెన్నో ఉన్నాయి.

"ఒకనాడు శాక్యమూనికి జయధ్వనులిచ్చి కరుణా సుధావృష్టి కురిసినాడు"—అనే పద్యంలో తెలుగులగుణ లుబ్ధత్వాన్ని అద్భుతంగా వివరించాడు. గాంధీమహాత్ముని రాట్నంతో పోలుస్తూ చెప్పిన ఈ పద్యం చూడండి.

"బడలెదవేకువోలె మన భాగ్యముపంటకు, రాట్నపాకుగా
నుడివడె దార్తరక్షణకు, సూత్రమువై సకల ప్రజావళిన్
పడుగున పేకతో కలిపి పట్టెద. వెట్టి విపత్తు వచ్చినన్
జడియక నిచ్చలున్ బిగియసాగెదురా! కదురైమహాప్రభూ!"

కవి రాట్నంలో మహాత్ముని దర్శించాడు. వడుకగా వడుకగా - ఏకు నూలుగా మారి రూపురేకలు కోలుపోతుంది. ఇది మహాత్ముని త్యాగాన్ని, రాట్నపాకు క్రిందుమీదౌతు వలయంగా తిరుగుట ఆయన పడిన కష్టనలయాలను, దారము పడుగు పేకలరూపంలో వస్త్రంగా తయారుకావటం దేశప్రజలను ఏకంచేయటాన్ని, ఎన్ని కష్టాలు ఎదురైన నిర్భీకంగా ఉండి మరింత బలపడటాన్ని కదురు సూచిస్తాయి. మహాత్ముని ఉద్యమచరిత్రనంతా రాట్నరూపంలో వర్ణించి చూపిన మహాకవి ఉపజ్ఞా ప్రభావాన్ని వేనోళ్ళకొని యాడాలి. ఈ పద్యం పాఠకుని భావలహరిలో ముంచివేస్తుంది.

ఈభాగానికి "కవితా కమనీయత" అనే పేరొక్కటే చాలదు. ఛందోరమణీయత అని చేర్స్తే బాగుండేది. అక్కరలు దేశీయ ఛందాలలో, శాసనాలలో ప్రముఖపాత్ర వహించాయి. తుమ్మల వారు నవాక్కర, అభినవాక్కర అనే రెండు అక్కర్లను క్రొత్తగా సృష్టించారు. పూర్వులు వాడిన మహాక్కర, మధ్యాక్కరలను గూడ ఉదాహరించారు. ఈ అక్కర్లలో తెలుగుదనాన్ని బాగా ప్రదర్శింపవచ్చుననో, ప్రాచీనకవులకు అభిమానపాత్రములనో ఆయనకు వానిపై గౌరవభావమేర్పడి ఈ సృష్టిచేసినట్లు తోస్తున్నది.

"అమూల్యశ్రీ"గారు తుమ్మలవారు రచించిన వివిధచ్ఛందో రీతులను విస్తరించిచూపించారు. వచనకవిత్వంగూడ తుమ్మలవారు వ్రాశారని ఉదాహరించారు. ఉత్పలమాలికలు, ద్విపద మాలికలు, మంజరీద్విపదలు విస్తృతంగా రచించారని రచయిత ఉదాహరించారు. కవిగారు చేసిన అనువాదాలనుగూడ రచయిత వదలలేదు. భర్తృహరి సుభాషితాలను, లక్ష్మీనృసింహస్తోత్రాన్ని, భజగోవింద శ్లోకాలను అనువదించిన పద్యాలను ఉటంకించారు. వానిలో భర్తృహరి సుభాషితానువాదాన్ని గమనించుదాము. ఈ శ్లోకాలను ఎల కూచిబాలసరస్వతి, పుష్పగిరి తిమ్మన, ఏనుగు లక్ష్మణకవి తొలుత తెనిగించారు. అనంతరం తుమ్మలవారు తెనిగించారు. ఆ పద్యాలలో ఒకటి చూడండి.

"ఆకాశంబున నుండి శంభుని శిరంబందుండి శీతాద్రి, సు
శ్లోకంబైన హిమాద్రినుండి భువి, భూలోకంబునందుండి య
స్తోకాంభోధి, పయోధినుండి పవనాంధోలోకముంజేరె గం
గా కూలంకష, పెక్కుభంగులు వివేకభ్రష్ట సంపాతముల్

తుమ్మలవారి పద్యం—

"గంగ దివిని వీడి కఱకంఠు తల వీడి
అద్రిపతిని వీడి యవని వీడి
జలధి వీడి తుదకు జనె పాపగడ్డకు
తెలివిసెడినవారి యలతలిట్లె."

ఈ రెండు పద్యాలను పోల్చిచూచినపుడు లక్ష్మణకవి పద్యం. మక్కికిమక్కి అనువాదమై సరళంగా సాగింది. తుమ్మలవారి అనువాదం స్వతంత్రంగా ప్రౌఢంగా తెలుగుదనం ఉట్టిపడుతుంది లక్ష్మణకవి శార్దూలంలో వెల్లడించిన భావాన్ని తుమ్మలవారు ఆటవెలదిలో రమ్యంగా వెల్లడించటం విశేషం. అలతి అలతి తెలుగు పదాలను అదికి కుదించటం తుమ్మలవారి సొమ్ము.

అమూల్యశ్రీగారు అభినవ తిక్కనలో విశిష్ట సంప్రదాయాలను ఎన్నింటినో వ్యక్తపరిచారు. ఆయనవాడిన పదాలు, జాతీయాలు, సామెతలు, లోకోక్తులు వివిధ చ్ఛందోరీతులు ఏర్చికూర్చి ప్రకటించారు. సర్వసమగ్రమైన కవిగారి సౌశీల్యాన్ని, వైవిధ్యంగా ఉన్న కవితారీతులను మనోజ్ఞంగా వెలువరించారు. తుమ్మలవారి సాహిత్యంలో రసవత్తరమైన కమ్మని పద్యాలను సోదాహరణంగా వివరించి పాఠకులకందించిన అమూల్యశ్రీగారు అభినందనీయులు. ఆయన ఇతోధిక సాహితీతపస్విౖమై వర్ధిల్లునట్లుగా విద్యాధిదేవతలు ఆశీర్వదింతురుగాక !

ఇతిశమ్

గుంటూరు
3-3-95

(సం) చిన్నము రామయ్యచౌదరి

ఆచార్య బొడ్డుపల్లి పురుషోత్తం
తెలుగు, ప్రాచ్యభాషావిభాగం
పూర్వాధ్యక్షులు
నాగార్జున విశ్వవిద్యాలయం

విద్యాలంకార్ (బి.31.)
శ్రీనివాసనగర్, గుంటూరు-6

5-3-95.

# అభినందన

అమూల్యశ్రీగారి నవాక్షరరచన- 'తెనుఁగులెంక' తుమ్మల సీతారామమూర్తి కవిత్వం - వ్యక్తిత్వం, సాకల్యంగా చదివే అదృష్టం (దృష్టి కొంతలోపించిన తరుణంలో) లభించింది. మద్గురువర్యుల జరామరణరహిత వినిర్మల యశశ్శరీరం సందర్శింపజేసిన అమూల్యశ్రీగారి సాహిత్య వరివస్య అభినందనీయం.

శ్రీ తుమ్మలవారు మాకు మొదటిఫారం నుండి స్కూల్ ఫైనల్ వరకు నిష్ఠతో తెలుగు బోధించిన నిస్తుల గురువులు. మొదటి ఫారంలోనే బాలవ్యాకరణమంతా చెప్పారు. ఇప్పుడు యం.ఏ. తరగతుల్లోకూడా అంతటి నిష్ఠ లుప్తం. బాలవ్యాకరణం పూర్తిగా అర్థమౌతుందని కాదు. ఆ సూత్రాలా వయస్సులో కంఠస్థం కావాలని వారి ఆకాంక్ష. వారి ఆగ్రహమటువంటిది.

శ్రీ తుమ్మల దేశికుల సాహిత్యదీక్ష అమోఘమైంది. వారి వ్యక్తిత్వం విలక్షణం. రాజీపడని ధోరణి. వారి నైతిక, కార్మిక, సామాజిక, ధార్మిక, ఆధ్యాత్మిక, వాఙ్మయ దృక్పథం దృఢమైంది. వివిధకృతుల ద్వారా ఆవిష్కరింపబడిన ఈ దృక్పథం, ఈ గ్రంథంలో చక్కగా చిక్కగా ప్రణాళికాబద్ధంగా, పరిష్కృతమైంది. ఈ సాహిత్య కృషీవలుణ్ణి ఏ విశ్వవిద్యాలయమైనా డి.లిట్ బిరుదంతో సత్కరించటం సముచితం.

తెలుగుభాషా సాహిత్యాధ్యయనాలు తెలుగు బోధకుల లోనే మృగ్యమౌతున్న కాలమిది. అటువంటిది, ఒకానొక ఉన్నత ప్రభుత్వోద్యోగి, ఇంతటి సాహిత్యరచనోద్యోగి కావటం, అసాధారణం.

భావనలోను, భాషాఛందోరీతుల్లోను తుమ్మలవారిలోని పరిణతిని, పట్టి ప్రదర్శించారు,అమూల్యశ్రీ. రాష్ట్రకవిగా, జాతీయ కవిగా, గాంధేయకవిగా, సర్వోదయకవిగా త్రివిక్రమపరాక్రములు- తుమ్మలవారు.రానురాను చేంతాడువృత్తాలనేత విడనాడి, దేశికవితా నేతగా ప్రఖ్యాతి వహించారు. అన్యభాషాప్రభంజనానికి నిర్జీవమై నశించే అనేక దేశిపదాలకు తమకవితను మృతసంజీవిని కావించారు

కృత్రిమ రత్నాలవంటి కేవల కల్పనా కథలుగాక,జాతికి చేవ చేకూర్చే మహాత్ముల జీవితచరిత్రల్ని, ప్రబోధాల్ని ఇతివృత్తాలుగా స్వీకరించి రసనిర్భరమొనరించిన ఉదాత్త కవీశ్వరులు శ్రీ తుమ్మల.

తుమ్మలవారివి మాటలుగాదు— మంత్రాలు. అవి అగాధ సత్యహృదంతర సముద్దీప్తాలు. (Where words come from the depth of truth.)

చాలామంది ప్రముఖకవులవలెగాక పోతనకవి రీతిగా, శ్రీతుమ్మలవారినిత్యజీవితానికి, సాహిత్యజీవితానికివ్యత్యాసంచాలా స్వల్పం. రెండింటిలోను ఆయన మంచిపొదుపరి. మనిషిమాత్రం పొడుగరి. నిరాడంబర జీవనులు. నిస్తుల జాతీయభావుకులు వీరు.

మనిషి వ్యక్తిత్వాన్ని ఒరపిడి పెట్టేవి ముఖ్యంగా రెండు. అవే కామ కాంచనాలు. ఈ రెండింటిని ధర్మబద్ధం కావించుకొన్న ఋషి, శ్రీ తుమ్మల. ఆయన కీర్తికాంతను వెంబడించలేదు. తన్నువలచి వచ్చిన కీర్తినే ఆదరించారు. ఇతర వ్యామోహాలతో కృతు లమ్ముకోలేదు. ఉపాధ్యాయవృత్తికి స్వస్తిచెప్పలేదు. 'అభినవతిక్కన' అనే

అహంకార బిరుదు విసర్జించి, తనకుతానే 'తెనుఁగులెంక' అయినారు. 'సోఽహం' మార్గంవిడనాడి, తెలుగుతల్లికి దాసోఽహామన్న మనీషి. ఈయన, తల్లిమ్రోలతప్ప, ఇంకెక్కడా తలవంచనిధీరుడు. ఈ విధంగా ఎంతచెప్పినా ఆ వ్యక్తినిగూర్చి, కొంతే చెప్పినట్లా తుంది. రచయిత యథాశక్తిని ఈ విషయాలన్నీ విమర్శించారు.

అమూల్యశ్రీ తన శక్తివంచనలేకుండా నిజనిసర్గశైలిలో ఆ దివ్యసాహితీమూర్తిని మనముందు చిత్రించి, నేటి యువతకెంతో ఉపకారం చేసారు. ఆ అక్షరమూర్తిని ఎంతగా దర్శిస్తే అంతగా తెలుఁగుఁదనం పెరుగుతుంది. వినిర్మలజాతీయజీవన మలవడుతుంది అమూల్యశ్రీ వారి సాహిత్యవరివస్య సార్థకమౌతుంది. అస్తు.

ఈ గ్రంథం మిత్రశ్రీ కాకరపర్తివారికంకితం గావించటం, ఔచితీభరితం. వంకలేని తెనుఁగులెంక లెంక శ్రీ కాకరపర్తి. ఆయన సుకృతి, సుమతి.

(సం) బొడ్డుపల్లి పురుషోత్తం

**అవునయ్యా! భవదీయ దివ్యకవితా వ్యాసంగమున్ జూడ, స త్కవి నామంబున కీవ యర్హుడవు, హృద్యంబైన పద్యాల మూ టవినూత్నంబగు రాష్ట్రగానమున వాడన్ వాడలన్ శౌర్య పుం జవిఁజూపించిన సద్గురూత్తమ నమస్కారంబు లర్పించెదన్.**

**ఆచార్య బొడ్డుపల్లి పురుషోత్తం**

ఓగేటి పశుపతి
కవి, ప్రముఖ గాంధేయవాది

విద్యాక్షేత్రం
యాజలి, (గుంటూరు జిల్లా)

# మనసులో మాట

ఉత్తమకవులు ఎప్పుడూ, సహృదయులు, సుహృదయులుగా వుంటారు. వారిలో భగవదంశ ఎక్కువగా వుంటుంది. "సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వామాం శాంతి మృచ్ఛతి" అని భగవంతుడు గీతలో చెప్పియున్నాడు! అట్టి కవులలో శ్రీ సీతారామమూర్తి గారు ఒకరు. వారితో ఒకసారి పరిచయం ఏర్పడిన వారెవ్వరూ వారిని విడిచిపెట్టలేరు. అట్లా వారికి అపారమయిన మిత్రబృందం ఏర్పడింది. అందులో నేనొకణ్ణి. శ్రీ అమ్ములయ్యగారు కూడా ఒకరు. నాకు తుమ్మలవారితో ఏబది సంవత్సరాల గాఢస్నేహాను బంధంవుంది. కాని నావంటి వారి వల్ల కాని పనిని "తెనుగులెంక తుమ్మల సీతారామమూర్తి కవిత్వం - వ్యక్తిత్వం" అను ఈ గ్రంథ రూపంలో నెరవేర్చి అమ్ములయ్యగారు ఆంధ్రులకు అమూల్యశ్రీ అందించారు. గుణగరిష్ఠులు, దేశభక్తుల చరిత్రలు వ్రాసి తుమ్మల వారు జగద్ధితమయిన చేతచేస్తే, గుణగరిష్ఠుడు, దేశభక్తుడు మహాకవి అయిన సీతారామమూర్తి కవిత్వం- వ్యక్తిత్వం పై రచనచేసి జగద్ధితమయినచేత చేశాడు అమ్ములయ్యగారు.

"సత్యమననెవ్వడు వాని భజింతు నిచ్చలున్" అని ఆత్మకథ ప్రారంభప్రార్థన పద్యంలోఅంటారు శ్రీతుమ్మల. ఇక్కడసత్యమంటే ఎవ్వరోకాదు. కవిగారి దృష్టిలో సాక్షాత్తు గాంధీమహాత్ముడే. మహాత్ముని తుమ్మలవారు ఎప్పుడూ అరకొఅమనిషిగా చూడలేదు. పరిపూర్ణుడుగానే చూచారు. గాంధీజీకంటే అభ్యుదయమార్గంలో తుమ్మలవారు కొంత ముందడుగువేశారనీ, తుమ్మలవారు గాంధీ అంత ఛాందసుడుగాడనీ అమ్ములయ్యగారు భావించడం కొంత సాహసమే అవుతుంది గాంధీజీని సరిగ్గా అర్థంచేసుకోని చాలామంది

ఆయన్ని ఛాందసుసిగా చిత్రించారు. గాంధీజీ వాస్తవంగా ఛాంద సుడు కాడు. అసలు - సిసలైన ఛాందసుడాయన. ఛందస్సు అంటే యిక్కడ వేదమనిఅర్థం. యజుర్వేదాంతర్గత మయిన ఈశావాస్యోపనిషత్తులోని ప్రథమమంత్రం "ఈశావాస్యమిదగ్ం సర్వం" గాంధీ సర్వస్వం. ఈ ఒక్కమంత్రం వుంటేచాలు భారతీయ సంస్కృతి నిలుస్తుందంటాడు మహాత్ముడు. ధర్మకర్తృత్వ సిద్ధాంతమునకు మూల బీజమీమంత్రం గాంధీజీ దీనిని సంపూర్ణంగా విశ్వసించాడు.

శ్రీ అమ్మలయ్యగారు, తుమ్మలవారిని అభినవతిక్కనగా తీర్చిదిద్దినతీరు ప్రశంసనీయం. ఆ విషయాన్ని ఒకవిధంగా కాదు బహుభంగులుగా వింగడించారు. గుండెనిండా భవ్యకవితావేశంగల కవులు ఋషులవంటివారు మహాకవులకు కరుణరసమే రసరాట్టు బీభత్సంకాదు. తిక్కన వ్రాసిన మహాభారతము, తుమ్మలవ్రాసిన ఆత్మార్పణం, ఆత్మకథ, ధర్మజ్యోతి మొదలగునవన్నియూ కరుణ రసప్రధానములే. ఆ ఒక్కరసమే నరుణ్ణి నారాయణున్ని చేస్తుంది.

కరుణరసం అమృతం అందిస్తే, బీభత్సరసం (క్రోధం) మానవుణ్ణి దానవుణ్ణి చేస్తుంది. విషం గ్రక్కుతుంది. యువకులను రేచు కుక్కలుగా మారుస్తుంది. రక్తం వెల్లువలు కట్టిస్తుంది. బీభత్సకవులు మహాకవులై కూర్చున్న ఈ అంధకారపురోజుల్లో తుమ్మల, జాషువా, విశ్వనాథ, కరుణశ్రీవంటి మహాకవులు సమాజంనకు ఆశాదీపాలైనారు.

అంతటి మహాభారతము పూర్తిచేసి శ్రీ హరిహరనాథునకు సమర్పించుకొని, "హరిహరనాథ! సర్వభువనార్చితా! నన్ దయచూడు మెప్పుడున్" అంటూ హరిహరనాథుని ప్రసాదంకోసం— వినమ్రుడై చేతులుజోడిస్తాడు తిక్కన. ఇక మన (అభినవ) తిక్కన అంతటిఆత్మకథవ్రాసి, "మదిన్ నెఱనేర్పులేనిపేదను, అలంతిసిస్రాయ

పుంబాదులు సైతమున్ కదల బారిన వాడను, తండ్రీ ! దయచూడు మిప్పటికిదే, బదివేలుగ" అంటూ మహాత్ముని, ప్రసాదంకోసం వినమ్రుడై దోయిలిస్తాడు.

కవిత్వ పరమార్థం విశ్వశ్రేయస్సు. అది చేకూర్చే ఏ కవిత్వమయినా అభ్యుదయ కవిత్వమే. ఇంతకూ వచ్చిన చిక్కేమిటంటే— గతి తార్కిక, భౌతిక కవిత్వమే విశ్వశ్రేయస్సు కలిగిస్తుందని కొందరూ, దానికి వెన్నుదన్నుగా స్థితి, విశ్వాస, ఆధ్యాత్మికములు వుంటేనే అది విశ్వశ్రేయోదాయకం కాగలుగుతుందని మం కొందరూ నమ్ముతున్నారు మొదటిది కేవల దేహసంబంధి. రెండవది దేహాత్మల సంబంధి. ఈ రెండవదానిని తుమ్మలవారు త్రికరణ శుద్ధిగా అనుసరించారు. మొదటిదాని నిరర్థకత యిప్పటికే ప్రపంచంలో ఋజువయింది రెండవదాని సార్థకత గూడ ఋజువయింది. అందువల్ల అమ్మలయ్యగారు వ్రాసినట్లు తుమ్మలవారు నూటికి నూరుపాళ్లు అభ్యుదయకవి.

నాకు తెలిసినంతలో ఏకవిపండితుడూ, ఏరచయిత ద్వారా తుమ్మలవారికి జరగని పురస్కృతి ఈ గ్రంథరూపంలో తుమ్మలవారి కందించిన అమ్మలయ్యగారికి నా హార్దిక అభినందనలు సెలవు.

విద్యాక్షేత్రం,
యాజలి
9-3-95

(సం) ఓగేటి పశుపతి

తుమ్మల శ్రీనివాసమూర్తి ఎం. ఎ.
ప్రిన్సిపాల్-పి.బి.యన్-కాలేజి నిడుబ్రోలు

# కృతజ్ఞతాభి వందనములు

ఆధునికాంధ్ర కవితాజగత్తులో సంప్రదాయబద్ధ పాతతరం అభ్యుదయకవులలో కవిరాజు శ్రీ త్రిపురనేని రామస్వామిచౌదరి, మహాకవి శ్రీ గుఱ్ఱం జాషువా, తెనుగులెంక శ్రీ తుమ్మల సీతారామమూర్తి, కరుణశ్రీ మున్నగువారు పేర్కొనదగినవారు, కళ కళకోసమే అన్న ఛాందసవాదనను త్రోసిరాజని కళ సమాజము కొరకు, ప్రజల జీవనపరిస్థితులను మెరుగుపరచుటకొరకు అని వారు విశ్వసించినారు. సమాజమును సంస్కరించుటకు వారు తమ కవితా ప్రస్థానమును సాంఘికోద్యమమునకు చైతన్యశక్తిగా మలచినారు. అందువలననె వారు అసలైన, సిసలైన ప్రజాకవులైనారు.

వీరిలో తుమ్మలవారికి ఒక ప్రత్యేకస్థానము కలదు. ఈ శతాబ్దమున, తుమ్మలవారు తెలుగుజాతికి లభించిన ఒక అపూర్వమైన కానుక. పేదరైతు కుటుంబమునందు జన్మించి, ఒకప్రక్క హాలముపట్టి పొలముపండించి, మరొకప్రక్క కలముపట్టి-'అజరామరమైన కవితను పండించారు వారికవిత నవ్యమైనది, భవ్యమైనది, విస్తృతమైనది, పశ్యజనీనమైనది. వారి కవితకు గాంధిధర్మము పట్టుగొమ్మ. సంప్రదాయము, సర్వోదయము, సౌందర్యము, సౌలభ్యములు వారి కవితాలక్షణములు. వారి కవితలో జాతిజీవనము సర్వతోముఖముగా ప్రతిబింబించుచుండును. మానవతా సువాసనలు గుబాళించుచుండును. వారి సందేశము కళానిత్యము వారి రచనలు మానవ

జాతికి మేల్కొల్పులు అభ్యుదయభావములతో వారు ప్రాచీనకవితా శిల్పం అంతరించకుండా దానికి నూతనజవమును, జీవమును కలిగించి, ప్రకాశింపజేసిరి. వారి రచనలు యుగధర్మమునకు నెలవులు. కవితా గానమును ఒక సామాజిక బాధ్యతగా భావించి, వారు కవితారూప మున మానవసేవచేసినారు. "తుమ్మలవారి 'ఆత్మకథ' కావ్యము యొక్క శైలి యించుమించు ఆంధ్రమహాభారతమునకు ప్రతిబింబ మ"ని శ్రీకట్టమంచి రామలింగారెడ్డిగారివంటి విమర్శకమూర్ధన్యులు ప్రకటించుట - తుమ్మలవారి కవితావైభవమునకు పట్టముకట్టుట!

కవిగారి వ్యక్తిత్వము ఇంకనువిశిష్టమైనది. వారు మహాత్మాగాంధి మహనీయగుణములకు కుదురై, మాటదారి, బ్రదుకుదారి ఒకటిగా, మచ్చుమసకలేని మనుగడను సాగించి, ఆదర్శకవులుగా కీర్తిగాంచి నారు. అటువంటి మహాకవిని కనిన తెలుగుగడ్డ, తెలుగుభాష ధన్యములైనవి. వారు "మా అమూల్యసంపద, మా గౌరవపతాక" అని జాతి గర్వించదగిన మహాకవులు తుమ్మల సీతారామమూర్తి గారు.

కవి లోకహితమెంచి కృతులు రచించును; బుధుడైన విమర్శ కుడు వాటిని మథించి, వాటి అందచందములను లోకమునకు చాటును. శ్రీ అమ్మలయ్యగారు ఈగ్రంథముద్వారా తుమ్మలవారి అపూర్వమైన, కమనీయమైన కవితావైభవమును జీవితమును మనో హరమైనశైలిలో, సోదాహరణముగా విశదీకరించినారు. శ్రీ అమ్మ లయ్యగారు కవులు, విమర్శకులు, మానవతావాదులు. వారి రచనా శైలికి ఒక ప్రత్యేకత కలదు. అది చాలసరళముగ, సూటిగ, ఆకర్ష ణీయముగనుండును. వారి గ్రంథము చదువుచున్నపుడు వారు మనతో మాట్లాడుచున్నట్లుండును. వారిది సంభాషణాశైలి అని అనవచ్చును. ఈ విధముగా వ్రాయుట కష్టము. ఇప్పటికే వారు డా॥ అంబేద్కరుగారిమీద, మహాకవి జాషువాగారిమీద కమ్మని

గ్రంథములను వ్రాసియున్నారు. అవి అందరి ప్రశంసలను పొందినవి ఇప్పుడు అదే శైలిలో ఈ గ్రంథమును అలవోకగా వ్రాసినారు.

గ్రంథరచయిత శ్రీ అమ్ముల్లయ్యగారు, గ్రంథస్వీకర్త శ్రీ వెంకటేశ్వర్లుగారు తుమ్మలవారికి సాహితీ అల్లుళ్ళు. తుమ్మల వారి "కదంబకైత" అను కావ్యకన్యకు భర్త శ్రీ అమ్ముల్లయ్య గారు; కవిగారి "ఎక్కట్లు" అను కావ్యకన్యకు భర్త శ్రీ వెంకటేశ్వర్లుగారు. వీరిద్దరు ఈ గ్రంథముద్వారా తమకు సాహితీ మామ గారి పట్లగల కొండంతభక్తిని ప్రకటించినారు; అంతేగాదు వీరు తమ కవితాఋణమును కూడ తీర్చుకొనినారు.

మా తండ్రిగారైన శ్రీ తుమ్మల సీతారామమూర్తిగారిని గూర్చి ఒక గనపత్తరమైన పరిశీలనాత్మక గ్రంథమును వ్రాసినందులకు దానిని స్వీకరించినందులకు శ్రీ అమ్ముల్లయ్యగారికి, శ్రీ వెంకటేశ్వర్లుగారికి నాహృదయపూర్వక కృతజ్ఞతాభివందనములు.

ఇట్లు
విధేయుడు

విద్యానగర్,
నిడుబ్రోలు,
14-3-95

(సం) తుమ్మల శ్రీనివాసమూర్తి



"సేవాభారతి"
Ln కాకరపర్తి వేంకటేశ్వర్లు B.A.
(L.I.C. డెవలప్ మెంటు ఆఫీసరు)

"లక్ష్మీనిలయం"
ముత్యాలంపేట, చీరాల
ప్రకాశం జిల్లా

# కృతజ్ఞత

అప్పికట్ల హైస్కూలులో నేను చదువుకొన్నప్పుడు శ్రీ తుమ్మల సీతారామమూర్తిగారు మా తెలుగుమాస్టారు. వారప్పటికే ఆత్మకథ - రాష్ట్రగానము, ధర్మజ్యోతి, అమరజ్యోతి, పఱిగపంట వంటి గొప్పకావ్యాలు వ్రాసినారు. గాంధికవి అనేవారు ఆయనను అందరు. నిప్పులాంటి నిజాయితీపరుడు. ముక్కుసూటి మనిషి. మాట కటువు. మనస్సు వెన్న. ఆయనంటే, అందరి మాస్టార్లకంటే, నాకు భక్తిభావమేర్పడినది. నేను క్లాసులీడరుగా, ఉన్నందువల్లనో మరేమో నేనంటే మాస్టారికి అభిమానమేర్పడినది.

S.S.L.C ప్యాసయి, టీచరు ట్రైనింగు పూర్తిచేసి, ఎలిమెంటరీ స్కూలుటీచరుగా పనిచేస్తూ ప్రైవేటుగా బి.ఏ. చదివినప్పుడు మాస్టారు నాకు తెలుగుసబ్జక్టు బాగా చెప్పారు. మాగురుశిష్యుల మధ్య సన్నిహిత ఆత్మీయానుబంధము మరింతగా బలపడినది. వారి బిడ్డలతో సమానంగా నన్ను చూసారు మాస్టారు. అది నా అదృష్టము. నాపూర్వజన్మ సుకృతమనుకొంటాను. నేను నాజీవితములో మెట్టుపైనుండి మెట్టు ఎక్కుతూ పైకిరావటానికి - దైవకృపకు తోడు - మాస్టారి ఆశీస్సులుగూడా ఉన్నాయని నానమ్మకము. "గురుర్బ్రహ్మః గురువిష్ణుః ... ... గురుసాక్షాత్ పర బ్రహ్మ... గురవేనమః" అని మాస్టారి గురించి నాకు "ఆరాధనా" భావం! మావూరు (జన్మస్థలం నరసాయపాలెంలో)— తర్వాత

చీరాలలో మాస్టారికి ఏర్పాటుచేసిన సన్మానాలలో 'ఉడతా' భక్తి శక్తి- నాపాత్రవుంది. మాస్టారు పరమపదించిన తర్వాత చీరాలలో వారి పేరుమీద 'సాహితీపరిషత్' స్థాపించాం! నేను కవిత్వము వ్రాయలేకపోయినా, మాస్టారి పుణ్యమువలననే హాహితీప్రియత్వము నాకబ్బినది.

తెనుగులెంక రాష్ట్రసిద్ధికొరకు రక్తమ్ముగార్చిన "రాష్ట్రకవి" "గాంధియుగమునబుట్టి, గాంధీనమువు నుద్యమంబుల నలగి," గాంధి కవిత (ఆత్మకథ, మహాత్మకథ, అమరజ్యోతి - గాంధీగానము) వ్రాసిన సిసలైన గాంధికవి "[illegible]చ్చమునకలేని మనుగడ" 'సాగించిన మనీషి ఆయన. "మనకాంధ్రత్వము ప్రాణము తనువుసుమీ భారతీయ ధర్మమసి" భారతీయ సంప్రదాయాన్ని - సంస్కృతిని గౌరవించన జాతీయకవి. "సామాజిక కల్యాణం కాముంచి" కవితల్లిన "అభ్యుదయకవి. "శీలము" లేకయున్న "ఏలా వ్రతములు తీర్థములు జన్నములు చదువులేలా" అనిన వ్యక్తిశీలానికి అత్యంతప్రాధాన్యతనిచ్చిన విశిష్టవిలక్షణవ్యక్తి! "సర్వోదయ మార్గమ్మున "ఉర్వికి తేవలయు శాంతి" అన్నది ఆయన నినాదం.వాదంగూడా!

మనిషి వ్యక్తిత్వము, గాంధేయ సర్వోదయము, సామాజిక శ్రేయస్సు, దేశాభ్యుదయము - తెనుగులెంకకు కవితావస్తువులైతే- ఆంధ్రత్వము, భారతీయత్వము (జాతీయత)- గాంధేయ సత్యాహింస జీవనవిధానము విశ్వమానవ కల్యాణము తుమ్మలవారి సందేశమని నానమ్మకం. తుమ్మలవారు యీ యిరవయ్యో శతాబ్దపు "యుగ కవి"

ఇక, అమ్మలయ్యగారు నాకొకనాడు ఫోనుచేసి తాను తుమ్మలవారిమీద వ్రాసిన గ్రంథము నాకంకితమిస్తానంటే నమ్మలేక పోయాను. కాదనలేకపోయాను. ఈ గ్రంథమునకు 'కృతిస్వీకర్త'

కావడం నాఅదృష్టంగా భావిస్తున్నాను. గ్రంథమూ మాగురువు గారిగురించి! అమ్ముల్లయ్యగారూ నాకు ఆప్తమిత్రుడు. మంచి రచయిత ! మాయిద్దరిమధ్య స్నేహము రెండుదశాబ్దములకు పైబడినది. పాలకొల్లులో ఉద్యోగము చేసినప్పటినుండి మాకుస్నేహము. ఆయన వ్రాసిన 'గాంధిశతకము'నకు అభిప్రాయము కొరకు మాస్టారి దగ్గరకు నేనే ఆయన్ని తీసుకువెళ్ళి పరిచయము చేయించినట్లు గుర్తు. అనతికాలములోనే అమ్ముల్లగారున్నూ మాస్టారికిగూడా సన్నిహితుడయ్యాడు.

విచిత్రము, విశేషముఏమంటే, మాస్టారు నాకు "ఎక్కట్లు" "బహూకృతి"గా నిచ్చారు. "కదంబకైత"ను మాస్టారు అమ్ముల్లయ్యగారికి 'ఉడుగర' గానిచ్చాడు. అమ్ముల్లయ్యగారు మాస్టారి సాహిత్యముమీాదరాసిన యీ గ్రంథమును నాకంకితమిచ్చాడు ఈ విధముగా మా ముగ్గురిమధ్య 'ఆత్మీయబంధము' ముప్పేటగా బలపడి స్థిరపడినది. ఇది త్రివేణీసంగమముగా పవిత్రబంధమైనది!

ఈ గ్రంథమును అమ్ముల్లయ్యగారు నాకు అంకితమిచ్చినందులకు ఆయనకు కృతజ్ఞతలు తెలుపుకొంటున్నాను.

ఇట్లు
భవదీయుడు
(సం) కాకరపర్తి వెంకటేశ్వర్లు

చీరాల
14-3-95

# మరొక చిన్నమాట

తెలుగు విశ్వవిద్యాలయంవారు యీ గ్రంథ ప్రచురణకు కొంత ఆర్థికసహాయం చేసియున్నారు. కనుక వారి నియమనిబంధల ప్రకారం కొన్ని గ్రంథాలు వారికి ముందుగాపంపవలసిన సమయం మించిపోవుచున్నందుననూ— శ్రీ ఓగేటి పశుపతిగారు, శ్రీ శ్రీనివాసమూర్తిగారు, శ్రీ కాకరపర్తి తమ తమ అభిప్రాయాలు కాస్త ఆలస్యంగా పంపించడంవలననూ ముందుగా వారికి కృతజ్ఞతలు గ్రంథ ముఖంగా చెప్పలేకపోయాను.

కనుక ఇప్పుడు చెపుతున్నాను. కోరిన తడవుగా—

1) "మనస్సులోమాట" తెలిపిన శ్రీ ఓగేటి పశుపతి (తుమ్మల వారి బాల్యమిత్రుడు - కవి - గాంధేయవాది) గారికి—

2) "కృతజ్ఞతాభివందనములు" తెలియజేసిన శ్రీ టి. శ్రీనివాస మూర్తి (నిడుబ్రోలు పి. బి. యన్. కాలేజి ప్రిన్సిపాలు- తుమ్మలవారి కుమారుడు) గారికి—

3) "కృతకౌతుక" పరచిన మిత్రులు శ్రీ కాకరపర్తి వెంకటేశ్వర్లు (కృతిస్వీకర్త) గారికి—

నా కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను. —రచయిత

# అంకితం

శ్రీ వేంకటేశ్వరుండిల
"సేవాభారతి"కి "సంఘసేవకరత్న
శ్రీ" వేంకటేశ్వరునకున్
జీవితభీమాధిపతికి సేమముకూర్చున్

ఇరువదియేండ్లు పైబడిన యిద్దరిమధ్యన స్నేహబంధమే
అరమరలేక మెల్గెదము ఆప్తసహోదరులట్లు నేటికిన్
గురువు తెనుంగులెంక మన కూరిమిపేరిమి కోరియుంట, ఆ
గురుతుగ తుమ్మలాన్వయుని గూర్చిన నాకృతి నీకునిచ్చెదన్

నిమ్మయ నర్సమాంబల కనిష్ఠకుమారుడవై జనించియున్
తుమ్మలవారి శిష్యుడయి తుమ్మలవారికి పుత్రతుల్యుడై
తుమ్మలవారి కల్లుడయి దొడ్డగుణాఢ్యుడవై మదీయ గ్రం
థమ్మును స్వీకరించితిగదా ! యశమందగ మిత్రరత్నమా !

నీకు నిండు మూడేండ్లైన నిండకుండ
అమ్మ మరణించగ అనాథమైన నిన్ను
అక్క తాయారుమాంబ నిన్నక్కుజేర్చి
పెంచిపెద్దజేసెను మాతృప్రేమజూపి

అక్కతాయారు పెంచిన అమ్మకాగ
మరొకఅక్క సత్యవతిసమార్తయైన
అన్నపూర్ణను నీకిచ్చి అత్తయయ్యె
ఎంత ఆత్మీయబంధమో యెఱుగదరమె.

స్వీయకృషి పట్టుదలతోడ బీయె చదివి
బాలలకు విద్యనేర్పిన పంతులయ్యి
బ్రతుకుబడిలోన 'అనుభవ' పాఠములను
చదివి బ్రదుకును సరిదిద్దు చతురమతివి.

పట్టుదల స్వయంకృషియున్న బాధలధిగ
మించి ఉన్నతస్థితిని సాధించవచ్చు
ననెడి పరమసత్యమునకీ వానవాలు
ప్రగతికోరువారలకు సీబాట తగును.

ఆకలిమంట లోర్చుచు అహర్నిశలున్ చెమటోడ్చి యోడ్చుటన్
శోకముమ్రింగి ముందునకె చొచ్చుకుపోయెడి లక్ష్యముండుటన్
లౌకిక వృత్తిధర్మము అలౌకిక ధర్మము వీడకుండుటన్
కాకరపర్తి వంశమున ఖ్యాతిగడించిన వేంకటేశ్వరా !

ఆర్యవైశ్య కులము నందుద్భవించిన
మంజుభాషనుండు మహితగుణుడు
శాంతభూషనుండు సౌజన్యవారాశి
కలుపుగోలుతనము గలుగువాడు.

ఎల్లెసి ఏజంటుగ
చల్లగ సంస్థలో అడుగిడి సామర్థ్యముతో
ఎల్లెసి డి.వో.గా
జిల్లా భీమాధికారి శ్రేష్ఠుడవైతే !

ఆశ్రయించిన పేద అనదల దయగని
        తృణమో పణమొ దానమిచ్చువాడు
యాచించునార్తుల తోచినరీతిగా
        కృపనుజూచుచు నాదరించువాడు
సహకారమాసించు సాహితీపరులకు
        భారమనక సాయపడెడువాడు
అర్థించు పేదవిద్యార్థి బృందమునకు
        ఒక్కింత చేయూతనిచ్చువాడు

చిన్నతనమున తనపేద జీవితమ్ము
మరచిపోవక దీనులదరికి జేర్చు
"సంఘసేవక"రత్న నిస్స్వార్థపరుడు
భవ్యసద్గుణ కాకరపర్తి సుకృతి

నీ బాధామయ జీవితంబు గని ఆ నీదైవముప్పొంగెనో
నీ భల్లూకపు పట్టు నీదు కృషియున్ నీదీక్షయున్ పండెనో
నీభార్యామణి అన్నపూర్ణ సతియే నీయింటి వెల్గాయెనో
"వైభోగంబుగ" నీకుటుంబమిల సౌభాగ్యంబులన్ తేలెడిన్

పైనయు నానసేయకయె భాసురలీల 'కదంబకైత' నా
దోసిటపెట్టి నన్ తనిపె తుమ్మలవార;ది పెద్దబాకిగా
వ్రాసితి తుమ్మలాభిదుని భవ్యకవిత్వ విమర్శగ్రంథమున్
బాసితి నాఋణమ్మిటుల: పట్టెదనంజలి తెన్నులెంకకున్.

తనువున్ వీడిన తుమ్మలాన్వయుడు సీతారాముడెందుండెనో
తన సాహిత్యము జీవితమ్ముపయి ఉద్గ్రంథమ్మునే వ్రాసి, దా
నిని నీకంకితమిచ్చినందులకు తానెంతేని హర్షించుచున్
మనకున్ దీవెనలంపుచుండెనని సంభావింతు సద్భక్తితో

కలముచేతబూని కైతలల్లకయున్న
సాహితీరసజ్ఞ సరసగుణము
ప్రాకటముగనచ్చె కాకరపత్రికి
పూజ్యతుమ్మలకవి పుణ్యమద్ది

ప్రియతనయు లిరువురు శ్రీధర్ కిషోరులు
లక్ష్మిదేవివంటి లక్ష్మితనయ
అన్నపూర్ణ గృహిణి - అన్నపూర్ణ గృహము
ఏమిలోటు వేంకటేశ్వరునకు.

నిష్కళంక గాంధి నిక్కంపు లెంకయై
తెనుగులెంక గాంధి తీర్చినాడు
వంకలేని తెనుగులెంకకు లెంకయై
వేంకటేశ్వరుండు పేరుగాంచె.

కంటికిన్ రెప్పవంటి మీయింటివేల్పు
కన్యకాపరమేశ్వరి కరుణజూడ
ఏడుకొండలస్వామి మిమ్మేలుచుండ
సకలభోగభాగ్యాల్ మీకు సంతరించు.

— అమరాల్యశ్రీ

# పరిశంసలు

తుమ్మల వంశసన్మణి బుధుల్ గని మెచ్చెడి ప్రజ్ఞవాడు, శ్రీ
కమ్మకులమ్మువాడు, కడుకమ్మనికైత రచించువాడు, రా
ష్ట్రమ్మునుగూర్చి గానమునుసల్పి జగమ్మున బేరుగాంచి నా
డిమ్మహితాత్మ నామమిట నేమిటికిన్ వచియింపగావలెన్.

—శతావధాని శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి

జిలుగున్ మువ్వల శారదాచరణ మంజీరస్వనా భోగముల్
తొలి మైనాక సహోదరీ విమల పాథోరమ్యముల్ తావి పూ
వులకున్ బుట్టిన యిండ్లు నీదుకవనంబుల్ సాధుగేయా! సితో
పల వాగ్జాల విధేయ! తుమ్మల సుధావారాశి చంద్రోదయా!

—కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ

నన్నయ తిక్కనాది కవినాథులు త్రొక్కినత్రోవద్రొక్కి;యు
త్పన్న మొనర్చినావు రసవత్కృతులెన్నియొ వంకలేని నీ
చన్న పథంబులో నడుగుసాగుట దుస్తరమిట్టి నీ కళా
భ్యున్నతి మెచ్చదగ్గది, సహోదర సత్కవి లోకభూషణా!

—నవయుగ కవిచక్రవర్తి-గుఱ్ఱం జాషువా

కమ్మని కావ్యమల్లు కవిగాడెవడైన సవాలొనర్చి, మా
తుమ్మలవారి యాత్మకథతోఁదులఁదూగెడు జానుతెన్గు క
బ్బమ్ము రచింపలేడనెడు వాదొకడున్నది అక్షరాల, ని
క్కమ్మదిగాక నీ కలము కమ్మదనమ్మటు జిమ్మిరేగెనో!

—కవిబ్రహ్మ ఏటుకూరి వేంకటనరసయ్య

# తెనుగులెంక



రాష్ట్రగానమ్ము చేసిన రైతుసుకవి
గాంధికవిత వెలార్చిన గాంధిసుకవి
మచ్చుమసకలేని మహితమాన్యమూర్తి
తెనుగుదనము రూపుగొనిన తెనుగులెంక

# కృతి స్వీకర్త



గాంధి కులమున బుట్టిన ఘనత నీది
గాంధికవి ప్రియశిష్యుడా ఘనత నీది
గాంధికవి పైని నేగూర్చు గ్రంథమునకు
"పతి" యగు ఘనత, కాకరపర్తి! నీదె!



కాకరపర్తి వేంకటేశ్వర్లు – ఆయన సతీమణి అన్నపూర్ణ



అమూల్యశ్రీ జె. అమ్మలయ్య – ఆయన సతీమణి రత్నజ్యోతి

కృతి కర్త _ కథానాయకుడు _ కృతిస్వీకర్త
(అమూల్యశ్రీ) (తెనుగులెంక) (కాకరపర్తి)



భవ్య గురుశిష్య గతజన్మ బంధమేమొ
మామ అల్లుళ్ళుగా మును మారినారు.
తోడి అల్లుళ్ళు కోరి యీనాడు చూడ
మామ అల్లుళ్ళుగా వియ్యమందినారు.



బారిష్టర్ గాంధి (1890 దశకం)
(దక్షిణాఫ్రికాలో)



గాంధికవి (1930 దశకం)
(ఆత్మకథ కావ్యకర్తగా)



గాంధి (1940 దశకం)
(స్వాతంత్ర్య సమర నేతగా)



గాంధికవి (1950 దశకం)
(మహాత్మ కథ కావ్యకర్తగా)

# ఆధునికాంధ్ర సాహితీ జగత్తులో - తెనుగులెంక

''బడలి బడలి తల్లి బాసకూడెము సేయు
కవిని నేను దేశకవిని నేను— ''తెనుగులెంక

వెయ్యేండ్లకు పూర్వం 'గాసట-బీసట'గా ఉన్న తెలుగు సాహితీ నందన వాటికని చక్కబెట్టి తీర్చిదిద్ది- 'దేశి-మార్గ' రీతుల పాదులు కట్టి-కమనీయ-రమణీయ కవితా తీవలకు ఛందోరీతుల పందిళ్ళువేసి ఘుమ్మను పరిమళాలు వెదజల్లి 'కావ్య' కుసుమాలు పూయించారు నన్నయాది కవిత్రయమున్నూ-పాల్కురికిసోమనాది శివకవులున్నూ. ఈ తెలుగు సాహితీనందన వాటిక ప్రబంధయుగంలో శృంగార రసమాధుర్యంతో - భక్తిరస బంధురంగా 'మూడు పూవు' లారుకాయలుగా వర్ధిల్లింది. సాహితీసౌరభాలు నేలనాల్గు చెరగుల గుబాళించాయి- కావ్యఫలాలు ఏపుగా కాచి- సురుచిర మధురరసాలు తెలుగు సాహితీ లోకానికి ఇబ్బడిముబ్బడిగా- రసానంద భూతిని కలిగించాయి.

దరిమిలా దురదృష్టవశాత్తు-తెలుగు సాహితీ లోకంలో 'ప్రొద్దువాలి' పోయింది! సాహితీ పరిమళాల 'గుభాళింపులు' తగ్గి పోయాయి. సాహితీకాపు సన్నగిల్లింది! మునుమాపువేళకు- ''క్షీణ (యుగ) దశ దాపురించింది. ఆ సంధ్యాసమయంలోనే 'పచ్చి శృంగార' కవిత్వం-భక్తిపారవశ్య పదసాహిత్యం—శతక వాఙ్మయం— సాహితీప్రియుల్ని పారవశ్యంలో ఓలలాడించాయి. ఆ పారవశ్యం లోనే— అర్ధరాత్రి- అంధకార (అంధ) యుగంలో 'అనూహ్య నిశ్శబ్ద నిశీథిలో - గాఢ-సుదీర్ఘ - నిద్రావస్థలోనికి— తెనుగు సాహితీనందన వాటిక జారుకొంది!

అయితే! బయట ప్రపంచం అందుకు భిన్నంగా వుంది! అప్పుడది- పందొమ్మిదవ శతాబ్ద్యంత్యం - ఇరవయ్యో శతాబ్ది ప్రారంభ-సంధియుగ సమయమది. భారతదేశాన్ని బ్రిటీషు పాలకులు పాలిస్తున్న రోజులవి! పారతంత్ర్యానికి వ్యతిరేకంగా దేశంలో జాతీయోద్యమం నడుంబిగిస్తున్న తొలి రోజులవి! అయితే బ్రిటీషుపాలన పుణ్యమా అని దేశంలో ఆంగ్లసాహిత్య ప్రభావం-ముఖ్యంగా కాల్పనిక ప్రణయసాహితీ ప్రభావం బాగా సాహితీపరులపై బడ్డ రోజులవి.

మరో ప్రక్క యావత్ ప్రపంచంలో-వైజ్ఞానిక శాస్త్రీయ - రాజకీయ-సాంఘిక రంగాలలో వూహించరాని యెన్నో మార్పులు త్వరితగతిని చోటుచేసుకున్నాయి. 'రాచరికాలకు' చెల్లుచీటీ ట్టి 'ప్రజాస్వామిక-సోషలిష్టు వ్యవస్థలు పాదుకొంటున్నాయి. శ్రామిక లోకం-ధనిక భూస్వామిక- పెట్టుబడిదారీ 'దోపిడీ' విధానంపై ధ్వజమెత్తి-తిరుగుబాటు చేస్తున్న రోజులవి. వైజ్ఞానిక శాస్త్రాభివృద్ధితో-దినదినాభివృద్ధి చెందుతున్న ప్రసారసాధనాలు-ప్రయాణ (రవాణా) సదుపాయాలు- "దూరం"నకు 'అర్థం లేకుండా చేసాయి' సుదూర "విదేశాలు" యిరుగుపొరుగులై సమీప సన్నిహిత సంబంధాలు నెలకొల్పుకోసాగాయి. తద్వారా 'విశ్వమానవతా' దృక్పథం మానవాళిలో పెల్లుబికి వెల్లివిరియసాగింది. సాంఘిక-మత - మూఢ వమ్మకాల మీద-దురాచారాల మీద 'మానవుడు' తిరగబడి-సమకాలీన సమాజాన్ని 'సంస్కరించా'లన్న తపనతో సాటి మానవుని సహాయంతో' వుద్యమిస్తున్న రోజులవి.

వివిధ రంగాలలో వస్తున్న మార్పులు సహజంగానే సాహిత్య రంగాన్ని గూడా ప్రభావితం చేసాయి. వంగదేశంలో మహారాష్ట్ర పంజాబు రాష్ట్రాలలో లేచిన సంస్కరణోద్యమాలు- తదనుగుణంగా రూపుదిద్దుకొన్న 'సాహితీ' నవ్యరీతులు - తెలుగు నేలను గూడా

తాకాయి. బ్రిటీషు పాలనలో ఆంగ్లసాహిత్య ప్రభావంతో ముఖ్యంగా కాల్పనికప్రణయ-కవిత్వ ప్రభావం తెలుగు సాహితీరంగాన్ని బాగా ఆకట్టుకొంది. ఇంతకుముందు మనం చెప్పుకొన్నట్లు-గాఢ తమస్సులో పడియున్న తెలుగు సాహితీనందన వాటికలో-కొందరు 'అభ్యుదయ' భావాలున్న 'జమిందారీ' ఉదాత్తవదాన్యులైన ప్రభువుల పుణ్యమా అని గాఢనిద్రలో వున్న తెలుగుసాహితీ-వాటికపై 'ఉషోదయ' కిరణాలు ప్రసరించాయి!

విచిత్రం-విశేషం - ఏమంటే యిన్నాళ్ళుగా-యిన్నేళ్ళుగా-'అంధ' క్షీణయుగంలో-'స్తబ్ద'గా గాఢనిద్రావస్థలో పడియున్న తెలుగు సాహితీపరుల హృదయాల్లో ఒక్కసారిగా "నవ్యసాహితీ" వెలుగులు తళుక్కొత్తాయి. మెల్ల మెల్లగానవ్యకవి-పండితులొక్కొక్కరు తామరతంపరలుగా పుట్టగొడుగుల్లా' నిద్రలేచి-కళ్ళు తెరిచి-కలంపట్టి-గళమెత్తి' క్రొత్త గొంతుకులతో క్రొత్తరాగాలు తీయసాగారు.

మునుముందుగా - ఓ కోరమీసాలు - తలపాగా-జమీందారీ దర్జాఉట్టిపడుతున్న ఓ బక్కపలచని ఆయన "క్రొత్తపాతల మేలు కలయిక క్రొమ్మెరుంగులు జిమ్మగా - గుత్తునా ముత్యాల సరములం" టూనే గొంతు సవరించి "దేశమంటే మట్టికాదోయ్ - దేశమంటే మనుజులోయ్" అంటూ 'సంస్కరణాభిలాష'తో రంగప్రవేశంచేసి-'వేగుచుక్క'లా తళుక్కొత్తి వెనుతిరిగాడు[1] వైతాళికుడై

ఇంతలో యింకో భావోద్వేగ సంప్రదాయవాదిగా కనిపించినా-సంస్కరణాభిలాషి అయిన ఓ కవి"కలికి కోయల గొంతులో మొలక గీతి సోయగపు బూలపొత్తులన్ తీయతేనె పోసితో యెప్పుడప్పుడే పులకరించె నా హృదయ శయ్య కవితోపగూహనమున" అంటూ జడకుచ్చులల్లుకొంటూ- మరోప్రక్క దేశాభిమానం వెల్లివిరియ "ఏ దేశమేగినా ఎందు కాలిడినా ఏ పీఠమెక్కినా - ఎవ్వరే

---

1. గురజాడ అప్పారావు

మనినా పొగడరా నీ తల్లి భూమిభారతిని నిలుపరా నీజాతి నిండు గౌరవము" అంటూ దేశభక్తి గీతమాలపిస్తూ వేదికనెక్కాడు[1] ఇంతలో యింకో ఛాందస శిష్ట సంప్రదాయ ఆత్మాభిమాన కవితా స్రమాట్టు వేయిపడగల గొడుగు చేతపట్టుకొని "నటనాలు మొదలెట్టెనే క్రొన్నీటి తుటుములా కదలాడనే (కిన్నెరా) అంటూ కిన్నెరసానిలా కూనిరాగాలు తీస్తూనే గొంతు కొంత సవరించి- "విమల కృష్ణానదీ సైకతములయందు కోకిలపు బాట పిచ్చుక గూళ్ళు కట్టి నేర్చుకొన్నది పూర్ణిమ నిశలయందు యాంధ్రజాతి అక్షరజ్ఞాన" మంటూ ఠీవిగా గర్వాతిశయంతో రంగస్థలం మీాదికేతెంచాడు[2].

గిరజాల జుట్టు- సిల్కులాల్చీ చలువ కళ్ళజోడు పెట్టుకొని దీర్ఘాలోచనతో "నా కుగాదులు లేవు-నా కుషస్సులు లేవు. నేను హేమంత కృష్ణాసంతశర్వరిని" అన్న 'నిర్వేదం'తో వ్యథ చెందుతూనే- "ఆకులో ఆకునై పూవులో పూవునై యీ అడవి దాగిపోనా" అని భావావేశంతో భావగీతం రాసుకొంటూ మూగవోయిన కంఠంతో- భావరాగ పూానమూర్తి మత్వంతో ఓ భావ కవితాకోకిలస్వామి ముందుకొచ్చాడు[3] ఇంకో గుండ్లకమ్మ మాస్టారు" త్రిభువనమ్ములలో రసోద్దీపనమ్ము వెల్లివిరియించు ప్రణయ రూపిణివి నీవుదైవతమ వీవు నీదు ప్రత్యక్షమునకు గడియలెంచుచునుండు భక్తుడను నేను" అంటూ నిదానంగా మరో ప్రక్కనుండి వేదికనెక్కాడు[3] ఇంతలో యింకో గౌతమీకోకిల గొంతెత్తి "ఆమె నవనీత హృదయ నాయంతరంగ శాంతిదేవత ఆశాపథాంతరాళ

---

1. రాయప్రోలు 2. విశ్వనాథ 3. దేవులపల్లి.

3. నాయని సుబ్బారావు.

పారిజాతమ్మ ప్రేమజీవన విధాత కై కేకీగీతి నా తపః కల్పవల్లి" అని పాడుకొంటూ వచ్చారు[1]

ఇంతలో యింకో రాయలసీమ సరస్వతీ పుత్రరత్నం "శివుడూ తాండవము సేసేనమ్మా శ్రీగౌరిసుందర" అంటూ "ధిమిధిమి ధ్వని సరిద్గిరి గర్భములు తూగ నమిత సంరంభ హాహాకారములు రేగ ఆడెనమ్మా శివుడు పాడెనమ్మా శివుడు" అంటూ శివమెత్తి పారవశ్యంతో నాట్యమాడుతూ స్టేజీ యెక్కాడు[2] ఇంతలో ఓ గండు మీసాల నల్లనాయన-సిల్కులాల్చీ ఖద్దరు వేష్టుకోటు వేసుకొని "పచ్చిబాలెంతరాలు మా భరతమాత మాతలకు మాత సకల సంపత్సమేత" అని దేశాభిమానంతో- "నా కవితా వధూటి వదనంబు నెగాదిగజూచి, రూపురేఖా కమనీయ వైఖరులగాంచి భళీ భళీ యన్నవాడె! నీదేకులమన్న ప్రశ్న వెలయించిచివాలున లేచిపోవుచో- బాకున గ్రుమ్మినట్లగును పార్థివచంద్ర! వచింప సిగ్గగున్" అని తన హైన్యస్థితి చెప్పటానికి సిగ్గుపడుతూ- "నాదు కన్నీటి కథ సమన్వయము సేయ ఆర్ద్రి హృదయము గూడ కొంతవసరమ్మ" అంటూ- ఓ నవయుగ కవి చక్రవర్తి ఓ ప్రక్కగా ధైర్యంగా- తన దీన గాధను' కరుణ వీరరసముట్టిపడేట్లు 'పంచమ స్వరం'తో తన "గంభీర విషాద గాథను' వివరిస్తూ మెల్లగా వేదిక నెక్కాడు.[3] "విరిదండ మెడలోన వేయుటేగాని కన్నారనీమూర్తి గాంచనే లేదు ప్రణమిల్లి యడుగుల బడుటయేగాని చేతులారగ సేవ జేయనేలేదు" అంటూ ఓ జంటకవులు 'ఏకాంతం'గా పాడుకొంటూ ముందుకొచ్చారు[4] "కవిని తెచ్చితి దోసిట గన్నెపూలు

1. వేదుల సత్యనారాయణశాస్త్రి 2. పుట్టపర్తి నారాయణాచార్యులు

3. జాషువా.

4. వేంకటపార్వతీశ కవులు.

బలివితర్దిక నితరంబు వెలుగునటుల హృదయపు సుగంధ దీప మర్పింతుగొనుము" అని భక్తిభావంతో పాడుకొంటూనే- "అంతము లేని యీ భువనమంత పురాతన పాంథశాల" అంటూ 'సాకీ' చేతబట్టుకొని ఓ 'పానశాల' రసిక కవి- వేదికపైకి వచ్చాడు[1].

"బూతుపురాణము గాదిది ప్రాతపురాణమును కాదు పాత కహారమా నూతపురాణంబియ్యి" అంటూ ఓ సంస్కరణాభిలాషి- "ఏరగంధము తెచ్చినారము వీరులెవ్వరో తెల్పుడీ" అంటూ ధీర గంభీర వదనుడు-గుబురుమీసాల కవిరాజు కాయాన రాచఠీవితో మెల్లగా వేదికనెక్కాడు[2]. "మామిడిచెట్టును అల్లుకొన్నదీ మాధవి లత యొకటీ యేమా రెండిటి ప్రేమ సంపదా ఇంతింత అనలేమూ "అని పాడుతునే" ప్రేమించు సుఖముకై ప్రేమించు ముక్తికై ప్రేమించు ప్రేమకై ఏమింకవలయురా అంటూ ఓ ప్రేమ పిపాసి ప్రేమగీతిక నాలపిస్తూ రంగస్థలంపై కొచ్చాడు[3] "ఎంకివంటి పిల్ల లేదోయ్ లేదోయ్ యెంకి నావంకింక రాదోయ్ రాదోయ్" అంటూ ఓ నాయుడుబావగారు పాడుకొంటూ వేదికపైకొచ్చాడు[4]

"పొలములన్ రేల గ్రుడ్డివెన్నెలలోన గుప్పలన్ నూర్చు కాపులు గొంతులెత్తి పదములన్ బాడదొడగిరి" అంటూ సంక్రాంతి కబుర్లు చెబుతూ ఓ జంటకవులు వేదికపైకి వచ్చారు[5] "చెల్లియొ చెల్లకో తమకుచేసిన యెగ్గులు సైచి చిరందరున్" తొల్లి గతించె నేడు ననుదూతగ పంపిరి సంధిసేయ "అని ఒకాయనంటే" జెండాపై కపిరాజు ముందు శితవాజి శ్రేణియుం గూర్చి నేదండ ముంగొని తోలు చందమున" అంటూ ఇంకో ఆయన- పోటా

1. దువ్వూరి రామిరెడ్డి 2. కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరి
3. బసవరాజు అప్పారావు 4. నండూరి సుబ్బారావు

5. పింగళి కాటూరి.

పోటీగా - కృష్ణార్జునుల్లా - ఓ జంటకవులు పద్యాలాపన చేస్తూ - పరదాగా-హుషారుగా రంగస్థలం పైకివచ్చారు[1] అంతలో "పైరుచేల గట్టులలో పచ్చగడ్డి పువ్వులలో పల్లెటూరి పడుచులతో పాటలెన్నో పాడుకుంటూ" ఓసుతిమెత్తని మనసున్నా చురకత్తిలాంటి మాటలతో "స్వప్నజీవిగ నన్ను చాటుచేయకు కన్ను కలచూపు లేనిదే కలరూపు కలుగదే కలలేనిదే చెలీ ఇలలేదె ఓ చెలీ" అంటూ రసాద్వైత ప్రేమ గీతిక ఆలాపిస్తూనే- "శక్తిరూపిణి భారతజాతి మెడకు కుటిలతరమైన ఉరిత్రాళ్ళు కులమతాలు నిష్కలము నిర్మితము చేయ నేర్చి జాతి నుద్ధరింపగ లెండిక యువకులారా "అంటూ కుల మత నిర్మూలనకై యువతకు ప్రబోధమిస్తూ ఓ కోనసీమ పాలేరు కవి రంగస్థలంమీాది కొచ్చాడు[2]. ఇంతలో-" సంజవెలుంగులో పసిడి ఛాయల ఖద్దరు చీరకట్టి నారింజకు నీరువోయు శశిరేఖవే నీవు "అని ప్రేమగీతి పాడుతూనే ఊలు దారాలతో గొంతుకురి బిగించి ముడుచుకొందురు ముచ్చట ముడుల మమ్ము! అకట! దయలేని వారు మీా ఆడువారు "అంటూ సున్నిత మనస్కుడైన-కరుణాంత రంగుడైన" పూలబాస తెలిసిన ఓ నెమ్మదస్థుడైన కవికుమారుడు చిరునగవుతో స్టేజీ మీాదికి వచ్చాడు[3].

"తెలంగాణము రైతుదే-ముసలి నక్కకు (నైజాం నవాబు) రాచరికమ్ము దక్కునే- నా తెలంగాణ- కోటిరత్నాలవీణ" అంటూ అగ్నిధార కురిపిస్తూ- ఓ స్వాతంత్ర్య సమర కవి వేదికపైకొచ్చాడు[4] "నాకున్నది కోరిక నా గొడవ నీకు రాసిన ఉత్తరంగా ఉండాలని బ్రతుక్కి బాసటగా ఉండాలని జాతికి నీతిగా ఉండాలని దివిని భువికి దించేదిగా వుండాలని ధాత్రిని ధాత్రిగా వుంచేదిగా వుండాలని

---

1. తిరుపతి వేంకటకవులు 2. బోయి భీమన్న 3. కరుణశ్రీ

4. దాశరథి.

మనిషిని మనిషిగా చేసేదిగా ఉండాలని నాకున్నది కోరిక'' అంటూ తన "గొడవ" ఏకరువు పెడుతూ ఓ తెలంగాణా ఋషికవి ముందుకు వచ్చాడు[1]. "ఎగరాలి ఎగరాలి మన ఎఱ్ఱజెండా"- సామ్రాజ్య వాదంబు సమసిపోవంగా- ధనికవాదంబింక దగ్ధమైపోవా'' అంటూ ఎఱ్ఱజెండాపట్టుకొని ఓకామ్రేడ్ కవి ఆవేశంగావేదికనెక్కాడు[2] "ఒక వీరుడు మరణిస్తే వేలకొలది ప్రభవింతురు- ఒక నెత్తుటి బొట్టులోనె ప్రళయాగ్నులు ప్రజ్వరిల్లు "నంటూ" వజ్రాయుధం పట్టుకొని ఓ పిఠాపురం యువకవి ముందుకొచ్చాడు[3].

"ఉదయం నా హృదయం 'అంటూ' మార్పు నాతీర్పు' అని 'ఇంటిపేరు చైతన్యం'గా తేజస్సు (తన) నా తపస్సుగా'' "ఈకాళ్ళే ఎవరెస్టులు ఈ నోళ్ళే శతఘ్నులు ఈ కళ్ళే త్రేతగ్నులు'' అంటూ- "నా వాదం సామ్యవేదం కవిత్వం నా మాతృభాష ఇతివృత్తం మానవత్వం'' అని "అక్షరాల గవాక్షాల'' గుండా "విశ్వంభర''ను తిలకిస్తూ- తెలంగాణా జావళీలు తెలుగు 'గజళ్ళు' పాడుకొంటూ ఓ యువకవి ముందుకొచ్చాడు[4]. ఇంతలో- మోకాలిక్రిందికి వేలాడు తున్న పొడుగు లాల్చీ-కోరమీసాలతో బొబ్బిలి పెబ్బులి తాండ్ర పాపయను స్ఫురింపచేసే ఓ కాకినాడ కవితా శ్రీనాధుడు- "ఖండ ఖండాంతరముల నఖండ కీర్తి తేజరిల్లి వర్ధిల్లె నీ తెలుగుతల్లి కాని నీ యనైక్యమ్ముకతానమాసె స్నిగ్ధరాగాలు. మరల పండింపవోయి'' అంటూ వేదిక మీదికి వచ్చాడు.[5] "భస్మమైనది పలనాటి ప్రాభవమ్ము మాయమైనది ప్రజకైకమత్య బలము వైష్ణవమ్మని బ్రహ్మన్న వరుసదప్పె శైవమని నాగసాని వచ్చుకుబెనంగె'' అంటూ 'నాటు పుగాకు చుట్టదమ్ము పీలుస్తూ- అచ్చమైన పలనాటి రైతులా

---

1. కాళోజీ 2. తుమ్మల వెంకటరామయ్య 3. సోమసుందర్
4. సి. నారాయణరెడ్డి. 5. జ్ఞానానంద కవి.

కనిపించినా- చేతిలో గొడుగు-కోటు-పంచెకట్టు స్కూలుమాష్టా రొకడు స్టేజీ మీదికి వచ్చాడు[1].

ఇంతలో పాంటుషర్టు వేషంలో- అరుణపతాకం చేతపట్టు కొని- ఆవేశంతో— "మరో ప్రపంచం మరో ప్రపంచం పిలిచింది- పదండి ముందుకు - పదండి త్రోసుక - పోదాం పోదాం పైపైకి" అంటూ ఓ యువకవి తోసుకొని స్టేజీమీదికి వచ్చాడు[2]. "నాయీ వచన పద్యాలనే దుడ్డుకర్రల్తో పద్యాల నడుముల్ విరగదంతా" నంటూ ఓ "అహంభావ కవి" వేదికనెక్కాడు[3] "బ్రెయిన్‌లో బ్రెన్ గన్ రెయిన్‌లా ఆలోచనల బ్రెయిన్ గ్లూమీ తిమిరాలు చెరిపించి- సైతాను మనల్ని పరిషించునపుడు" అంటూ గడ్డంమీసాలతో బైరాగిలా కనిపించినా - ప్రగతిశీల భావాలున్న ఓ "త్వమేవాహ కవి రంగప్రవేశం చేసాడు[4].

ఈ విధంగా- "క్షీణ- అంధ యుగంలో 'స్తబ్ధు'గా పడియున్న తెలుగు సాహితీనందన వాటికలో- కాలమహిమచే- ఉషోదయవేళ- నవయుగ వైతాళికులు- నవ్యసంప్రదాయ వాదులు - భావకవులు- కోకిలస్వాములు- గౌతమీ కోకిలలు- నవయుగ కవిచక్రవర్తులు - కవి కోకిలలు అనుభూతి కవులు- అరసంకవులు- విరసంకవులు సంస్కర ణాభిలాషులైన హేతువాద కవిరాజులు - అభినవ కవిబ్రహ్మలు- జంటకవులు- శతావధాన కవులు- ఎందరెందరో 'తామరతంపర'గా మేల్కొని కలంపట్టి గళంఎత్తి తమ తమ 'నవ్య రీతు'ల కవితా గానం చేయసాగారు !

ఈ నవ్య సాహితీ వేదికపైకి 'యెందరెందరో మహాను భావులు- నవ్య మహాకవుల మధ్యలోనికి— "ఆంధ్రుడవై జన్మిం చియు / ... ఆంధ్రత్వం లేని బ్రతుకు నాశింపకుమీ" అంటూనే-

1. ఏటుకూరి వేంకటనరసయ్య 2. శ్రీశ్రీ 3. పట్టాభి. 4. ఆరుద్ర

"పలికెడిది గాంధి కథయట / ... పలికించెడివారు తెనుగు ప్రజలట/ ... పలికెద నిక నొండు మఱచి బాపు చరిత్రన్" అంటూ మాటలో- రూపులో తెలుగురైతులా కనిపించినా - తెలుగుదనం- గాంధేయవాదం నరనరాన జీర్ణించుకొన్న ఓ "తెనుగులెంక" రంగం మీదికి వచ్చాడు! ఆయన మాటలో కమ్మని తేటతెనుగుదనం - గాంధేయ 'సర్వోదయ' ధర్మం- నీతి ధర్మనిరతి- గల్గి ప్రత్యేక విశిష్టత రూపుగొన్న అయన్ని కొందరు చూచి మెచ్చుకొన్నారు! మరికొందరసలు ఆయన్ని చూడనేలేదు. కొందరు "ఎగాదిగ" చూచీచూడనట్లు ప్రక్కకు తప్పుకొన్నారు! ఇంకొందరు ఆయన్ని ఆపాదమస్తకం పరికించి- ఆయన మాటవిని- ఆయన పద్యం విని - ఆయన నడవడి చూచి — "ఈయన సామాన్యుడు కాడురా బాబూ చూట్టానికి ఓ పల్లెటూరి రైతులా వున్నా ఈయిన 'అభినవ తిక్కనరా' అని జేజేలు పలికారు. ఆయన్ని అభినందించారు! మొత్తంమీద అధిక సంఖ్యాకులు ఆయన కవిత్వం తియ్యదనాన్ని గొప్పదనాన్ని - ఆయన విశిష్ట వ్యక్తిత్వాన్ని కారణమేదైనా- గుర్తించినట్లు కనిపించలేదు. రంగస్థలం మీదికి వచ్చిన ఆ తర్వాత వచ్చినవారితో సహా బహుకొద్దిమంది కవుల చుట్టూ వ్రేళ్ళమీద లెక్కపెట్టగల వారిచుట్టూ అటు కవులేకాదు ఇటుసభలోని (ఆంధ్ర సాహితీప్రియులు) అధికభాగం సభికులు చేరి- వందిమాగధులుగా తయారయై- స్తోత్రపాఠాలు వల్లిస్తూ- జయజయ నాదాలు చేస్తూ కనిపించారు!

ఆ కోలాహలంలో ఆ 'గుంపు'లో ఆ కవితాజనసందోహంలో మన కథానాయక కవి— తెనుగులెంక- ఓ ప్రక్కకు తప్పుకొని - ఓ మూల కూర్చొని- ఆవేశకావేశాలకు లోనుకాకుండా- భూషణ దూషణల్ని లెక్కచేయక తనను గుర్తించనందుకు నిరాశా నిస్పృ

పాలకు లోనుకాకుండా - కలం పట్టి - గళమెత్తి పుంఖాను పుంఖంగా కవితలు వెలయించాడు !

యథార్థానికి యీ యిరవయ్యో శతాబ్దం పూర్వార్థంలో తెలుగు సాహితీ జగత్తులో పుట్టిన బహు కొద్దిమంది అగ్రశ్రేణి కవుల్లో మన తెనుగులెంక ఒకడు ! ఏపూర్వ "పుణ్యలేశాన", తెలుగువాడిగా పుట్టి- తెలుగుతల్లి "పదార్చకులలో" నొకడుగా- "నినుజూచి నినుబాడి నినుగొల్చు" భాగ్యమబ్బినందుకు ఉబ్బి తబ్బిబ్బై తన "అదృష్టాన్ని" తలంచుకొని- మురిసిపోయిన "అచ్చమైన పదసారసాలాంధ్రు డాయన ! "భావతార్చకులందునన్ బంతి చివరవానిగా నుంచినను దృష్టిపడెదనంచు !" అంటూ వాగ్దేవిని వేడుకొన్న అల్ప సంతోషి ఆయన ! చిన్ననాటనే కాదు- బజ్జగా గడిపిన నడివయస్సులో గూడా "మడికినొక్క పూట బడి కొక్కపూటగా" బ్రతికిన రైతుకవి. "రాష్ట్రసిద్ధి కొఱకు రక్తమ్ము గార్చిన" రాష్ట్ర (గాన) కవి ఆయన ! "కళకొఱకే కవిత్వమని గంతులు వేయక" నైతిక పునరుజ్జీవన జాతీయ వికాస విశ్వజనతా శ్రేయః ప్రీత" మైన కవిత్వం రాసిన అభ్యుదయ కవి ఆయన ! "బడలి బడలి తల్లి బాస కూడెము" నేసిన 'దేశికవి' ఆయన ! "మచ్చుమసకలేని మనుగడ నర్థించి మలగి 'వెతల నలిగిన' విశిష్ట వ్యక్తిత్వము నిలుపుకొన్న తెనుగు కవి ! "ఎవ్వరెందఱెంతదవ్వైన నేను భాషా విపర్యయమ్ము సైపలేనని "భీష్మించుకొని" సామాజిక కల్యాణము కాంక్షించి నవ్యభవ్య కవితా సృష్టి గావించిన తెనుగు లెంక ! "కాసులకు దాసుడగుచు ముక్కిడిని బొగడి కల్లకైతల నల్లక' గుణగరిష్ఠుడు దేశభక్తి పరాయణుడైన జాతిపిత గాంధి చరిత్రన్ తీర్చిదిద్దిన 'గాంధి కవి' ఆయన ! "కాసులకు నాసచేయక వ్రాసిన కబ్బములనెల్ల వరణీయ కథాభాసురలకు" తన కావ్య కన్యల్ని 'కన్యాదానం' చేసిన ఆదర్శ విశిష్ట కావ్య కన్యాదాత !

"అంతుపొంతులేని యాస్తుల నార్జింపగడగు వారి పప్పులుడకవికను" అంటూ "సంపన్నులు తమ బంగరు గంపలకున్ దాము ధర్మకర్తల మని భావింపవలయు" నన్న భావ విప్లవ సంప్రదాయ కవి. "సర్వో దయ మార్గమ్మున నుర్వికి తేవలయు శాంతి" యనియు "మొత్తము ప్రజకింపొదవించు' సర్వసమత గలిచినసర్వోదయమ్ము"ను వలచిన సర్వో దయకవి! "ఒక్క గోంగూరన్ కుండెడు కూడు మెక్కి"- "గట్టితనమ్ము చిందబిడికట్టకు సాగిన దెబ్బదెబ్బకున్ బుట్టెడు" కుసుమల్ రాల్చి రాశిపోసిన రైతు బిడ్డ! "అన్నము దిన్నచేతి తడియాఱియు నాఱక ముందె" "తిన్నది గొంతు దాటిపోకున్నను" బరుగుల్ నురుగుల్ వెడలించి రొప్పుచు పిల్లలకు పాఠముల్ నుడివిన ఆదర్శ ఉపాధ్యా యుడు— ఒజ్జమేల్బంతి!

ఇలా రాష్ట్ర కవిగా- గాంధికవిగా- రైతుకవిగా- సర్వోదయ కవిగా - భావ విప్లవ కవిగా ఆవిష్కరించుకొన్న తెనుగులెంక కవి త్వం గురించి విపులంగా చర్చించుకుందాం!

[Note :- ఈ అధ్యాయంలో పేర్కొన్న ఆధునికాంధ్ర కవులు వారి కావ్యాలు-కవితలు - "క్రమానుగతి"[Chronology]ననుసరించి- వరుసక్రమంలో లేవనీ కవులందరినీ పేర్కొనలేదనీ పాఠకులకు వేరుగా గుర్తుచేయవలసిన అవసరం లేదనుకొంటాను. ఈ యిరవయ్యో శతాబ్దం పూర్వార్థంలో ఆధునికాంధ్ర సాహిత్య వేదిక స్వరూపాన్ని రేఖా మాత్రంగా చెప్పడం నా ముఖ్యోద్దేశం. ఆ వేదికనలంక రించిన మహాకవి పండితులు ఎందరో- మరెందరో మహానుభావులు. వారందరికీ వందనాలు. అభివందనాలు. అందర్నీ పేర్కొంటూపోతే అదే ఒక ఉద్గ్రంథ మౌతుంది కనుక యీనా ప్రస్తుత గ్రంథరచన ధ్యేయ మదికాదు కనుక కొందరిని మాత్రమే పేర్కొనడం జరిగింది.]

# రాష్ట్ర (గాన) కవిగా

ఆంధ్రుడవై జన్మించితి
వాంధ్రుడవై యనుభవింపు మాయుర్విభవం
బాంధ్రుడవై మరణింపుము
ఆంధ్రత్వము లేని బ్రతుకు నాసింపకుమీ

(రాష్ట్రగానం) —తుమ్మల

"జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ" అన్నారు. జన్మ నిచ్చిన కన్నతల్లి - జన్మించిన భూమి స్వర్గంకన్న మిన్న ! నిజమే ! నవమాసాలుమోసి కని పెంచినతల్లి-కన్నతల్లి గర్భంనుండి బయటబడ్డ నాటినుండి 'ఆధారభూతమై' బ్రతికినంత కాలం- నిలిచేది మెలిగేది చివరకు తాను మరణించిన తర్వాత తనను తనలో కలుపుకొనేది నేలతల్లి ! కన్నభూమి - పుట్టిమెట్టిగిట్టిన మట్టిగడ్డ ! ఇట్టి కన్నభూమిని కవి పండితులంతా తమ తమ శక్తికొలది స్తుతించారు.

మాతృదేశాన్ని - మాతృభాషను పలు విధాలుగా తెలుగు కవిపండితులు గొనియాడారు. గొనియాడతారు ! "దేశభాషలందు తెలుగులెస్స" అని ఏనాడో శ్రీనాథ మహాకవి - శ్రీకృష్ణదేవ రాయలు లెస్సగా పలికారు. తెలుగుభాషా మాధుర్యాన్ని - తెలుసు కున్న పాశ్చాత్య కవి పండితులు తెలుగును "Italian of the East" గా ప్రస్తుతించారు. అంటే పాశ్చాత్య దేశాలలో "ఇటలీభాష ఎంత మధురంగా మనోజ్ఞంగావుంటుందో ప్రాచ్యదేశాలలో తెలుగు భాష అంతమధురంగా మనోజ్ఞంగా వుంటుందని అర్థం ! "దివ్యమై చావులేనిది తెలుగుభాష' అని విశ్వనాథ వారన్నారు. "తేనె తేటల నవకంబు సోనలకును, సాటియగును మా తెలుగు భాషామతల్లి" అని "గోల్కొండ" సురవరం ప్రతాపరెడ్డి శ్లాఘించారు "ఎంత

దివ్యమైనది యీ తెలుగు సరస్వతి" అంటూ తెలుగు భారతిని మెచ్చుకున్నాడు బోయి భీమన్న. "తేనెకన్న మధురంరా తెలుగు, ఆ తెలుగుదనం మాకంటి వెలుగురా" అంటూ ఆరుద్ర గొని యాడాడు. "ఎంత చక్కని దోయి యీ తెలుగుతోట- ఎంతపరిమళ మోయి యీతోట పూలు" అని కందుకూరి వీరభద్రరావుగారు మురిసిపోయారు.

"ఖండఖండాంతరములన్ ప్రకాశమయ్యె తెలుగుతల్లి లలాటికాతిలక దీప్తి" అని రామప్రోలు వారు తెప్పపలికారు. "జయమహాంధ్ర జనయిత్రీ- జయప్రియాంధ్ర జనయిత్రీ జయజయ ప్రియతమ భారత ధాత్రీపుత్రీ శుభధాత్రీ" అంటూ దేవులపల్లి వారు కీర్తించారు. "చేయెత్తి జైకొట్టు తెలుగోడా! గత మెంతో ఘనకీర్తి గలవోడా" అని వేములపల్లి శ్రీకృష్ణ కొని యాడాడు. "మా తెలుగుతల్లికి మల్లెపూదండ మాకన్న తల్లికి మంగళారతులు"అని హారతులు పట్టాడు శంకరంబాడి సుందరాచారి. "తెలుగు పతాకం యెగురనిదిశయే లేదు తెలుగు దివ్వె వెలగనట్టి దిశయేలేదు" అని దాశరథి ప్రస్తుతించాడు. "తెలుగుదేశము పురిటి గడ్డరా" అని కవిరాజు త్రిపురనేని కొనియాడాడు. "ఆంధ్రుడై పుట్టి పుణ్యంపు పంటలెంచి నాలోననేనె గర్వించు కొందు" అని పుట్టపర్తి వారు గర్వపడతారు. "అన్నపూర్ణమ్మ మన ఆంధ్ర పూర్ణకుంభ సుజల సస్యశ్యామలాంబ" అని కాళోజీ అభివర్ణించాడు. "ఖండ ఖండాంతరముల అఖండ కీర్తి తేజరిల్లి వర్ధిల్లె మా తెలుగుతల్లి" అని జ్ఞానానంద కవి అభిభాషించాడు. "దిగ్దిదిక్కుల కీర్తిచంద్రికల నింపి వెలుగులు వెలార్చుకొనియె మా తెలుగుతల్లి" అని కరుణశ్రీ అభినుతించాడు. "అందాల నిండు జాబిల్లి ఆనందాల కల్పవల్లి

అదే నా (నీ) తెల్గుతల్లి" అని శ్రీ శ్రీ శ్లాఘించాడు. "తెలుగు రోషము, తెలుగు చేవయు, తెలుగు తెగువయు, తెలుగు బలిమియు వెల్లివిరియా"లని దుగ్గిరాల బలరామకృష్ణయ్య అభిభాషించాడు. "తెలుగుతల్లీ వెలుగువల్లీ తీయందనాల వల్లీ" అంటూ పైడిపాటి వారు పరవశించిపోయారు. "గడనకెక్కిన ఆంధ్ర పుత్రుడను నేను" అనీ "మడమ ద్రిప్పని యాంధ్రవీరుడను నేను" అని జాషువాకవి సగర్వంగా చెప్పుకున్నాడు. "పంచెకట్టుటలో ప్రపంచాన మొనగాడు కండువా లేనిదే గడపదాటని వాడు" అని సి.నా.రె. తెలుగువాడి వేషాన్ని కన్నులకు గట్టినట్లు అభివర్ణించాడు! ఇలా యెందరెందరో తెలుగు కవులు మాతృదేశాన్ని మాతృభాషకు బహుభంగుల ప్రస్తుతించారు.

పోతే- ఆంధ్రుల చరిత్రను రమణీయంగా వర్ణించిన మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారి 'ఆంధ్రపురాణం' ఆంధ్రవిష్ణువు మొదలు ఆంధ్ర రాష్ట్రావతరణం వరకు గల ఆంధ్రుల చరిత్రకు అద్దంపట్టిన జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారి 'ఆంధ్రసామ్రాజ్యము' అమ్మిశెట్టి లక్ష్మయ్యగారి "ప్రభాతము" (రాజ్మహేంద్రకులో త్తుంగచోళ రాజ్య పట్టాభిషేక గాథ" మరియు' చంద్రగిరి దుర్గము') శిష్ట్లా లక్ష్మీకాంతశర్మగారి 'ఆంధ్ర విష్ణువు' పండిత సత్యనారాయణరాజుగారి 'ఆంధ్రౌన్నత్యము' బోడేపూడి వేంకట రావుగారి 'ఆంధ్ర తేజము' (తల్లికోట యుద్ధంలో రామరాయల ఓటమిగాథ) కొడాలి సుబ్బారావుగారి 'హంపీక్షేత్రము' ఆచార్య గంటి జోగిసోమయాజిగారి 'రామచంద్రుని హంపీయాత్ర' పుట్టపర్తి నారాయణాచార్యులగారి 'పెనుగొండ లక్ష్మి' కోట శ్రీనివాస సోదర కవుల 'ఓరుగల్లు కోట' ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారి 'దక్షారామము' కొండూరి వీరరాఘవాచార్యులుగారి 'అమరావతి'

ఇత్యాది కావ్యాలెన్నో- ఆంధ్రుల గతవైభవ ప్రాభవాల్ని- ధైర్య సాహసాల్ని - శౌర్య ప్రతాపాల్ని - వర్ణిస్తూ - తెలుగు ప్రజకు స్ఫూర్తినిస్తూ- చైతన్యవంతుల్ని చేస్తూ - మాతృదేశాభిమానాన్ని రేకెత్తిస్తూ- పరోక్షంగా ప్రస్తుత కర్తవ్యాన్ని ప్రబోధిస్తూ- కార్యోన్ముఖుల్ని గావించటానికి తోడ్పడ్డాయి.

అటు బ్రిటీషు పాలకుల పరాయి పెత్తనాన్ని- యిటు అరవల 'జులుం'ను 'ఆత్మాభిమానం' గల తెలుగువారు తీవ్రంగా వ్యతిరేకించారు. గాంధీజీ పిలుపునందుకొని దేశస్వాతంత్ర్యం కోసం ఒక ప్రక్క జాతీయోద్యమంలో తెలుగువారు క్రియాశీలక ప్రముఖ పాత్ర వహించి మరో ప్రక్క ఆంధ్రులకు ప్రత్యేక రాష్ట్రం కావాలని ఆందోళన లేవదీసారు తెలుగువారు. తెలుగుకవులు ప్రత్యేక రాష్ట్ర ఉద్యమకారులకు 'ఊతమిస్తూ- ఉత్తేజపరుస్తూ కవితాగానం చేసారు.

తన 'ఆంధ్రదేశ ప్రశంస' 'ఆంధ్రమాత' కవితల్లో ఆంధ్రుల శౌర్యప్రతాపాల్ని- వైభవ ప్రాభవాన్ని కొనియాడుతూ ఆంధ్రాభిమాన కవిత్వానికి బీజావాపనం గావించిన మంగిపూడి వేంకటశర్మను మనం ముందు చెప్పుకోవాలి. రాయప్రోలువారు "నాదు జాతి నా దేశము నాదు భాష ? అను అహంకార దర్శనమందు మాంధ్ర !" అంటూ "జాతిన దేశ గౌరవము చక్కనదిద్దు... సమాన రాష్ట్రమున్ కూరిమి నాసజేయు తెనుంగు బుడమిన్ కయిసేయ" తెలుగువారంతా నడుంబిగించి ముందుకు నడవండంచూ తన 'ఆంధ్రావళి' లో ఆంధ్రుల పురాతన వైభవాన్ని శ్లాఘిస్తూ ప్రత్యేకాంధ్ర రాష్ట్రం కోసం ఆరాటపడుతూ కవిత్వం రాసాడు. ఆంధ్రుల గత వైభవ ప్రాభవ శౌర్యప్రతాపాలకు ఏతామెత్తి 'కవితాబద్ధ' మొనర్చిన విశ్వనాథవారు తన 'ఆంధ్రప్రశస్తి- ఆంధ్ర పౌరుషం'

కావ్యాలలో "నేటితో నస్వతంత్రతా నియతమైన యీ బ్రతుకు తెన్గువారు భరించలేర'సి బాధ వ్యక్తం చేశారు. "దృఢమనస్కులై యత్నించిన సడలిపోదా దాస్య బంధము" అంటూ మల్లంపల్లి సోమశేఖరశర్మ ఆకాంక్ష వెలిబుచ్చారు. "చేవగలిగిన చాలొక చిటికెలోన / నాంధ్ర రాష్ట్రము సాధింపనగును మనకు" అంటూ శ్రీనివాస సోదరకవులు అభిప్రాయబడ్డారు. "లెమ్ము లెమ్మిక నడుము గట్టుము తెన్గువారలనెల్ల నీవొక్క రాష్ట్రమునందు గూర్పగ గట్టియత్నము జేయుమా అంటూ కవిరాజు త్రిపురనేని సమగ్రాంధ్ర దేశంకోసం అర్రులు చాచారు. తమ "ఆంధ్రమాతృసమాశ్వాసము" లో పిప్పర సోదరకవులు "గత విభవంబు పోయె నేడని దురపిల్లకమ్మ శుభమయ్యెడు నీకిక నాంధ్రమాతరో" అంటూ "మేలుకలుగం గలదింక క్రమక్రమంబుగాన్" అని ఆశాభావం వ్యక్తం చేసారు !

మరోప్రక్క నైజాం నవాబు కరకు క్రూరపాలన క్రింద క్రుగ్గుతున్న తెలంగాణా ప్రజలు స్వేచ్ఛకొరకు గొంతెత్తి ఐక్యతా గీతినాలపింప సాగారు. సాయుధపోరాటం సాగించారు. "కండ కండగకోసి కాకులకు వెయ్యాలె కాలంబురాగానె కాటేసి తీరాలె" అంటూ నిజాం నవాబుపై కాళోజీ నానా (నా) "గొడవ" చేస్తారు. "తెలంగాణా రైతుదే- ముసలి నక్కకు (నైజాము) రాచరికమ్ము దక్కునే-" అంటూ - "ఓ నిజాము పిశాచమా... నా తెలంగాణా కోటిరత్నాల వీణ" అని దాశరథి గొంతెత్తి పాడిన స్వాతంత్ర్య సమరయోద్ధ కవి ! "పగలేయి నిజాం కోట - ఎగరేయి ఎర్ర బావుటా" అంటూ రెంటాల పాడారు. "ఖబడ్దార్ ! నైజాం పాదుషాహే - నీ నిరంకుశత్వాన్ని పాతేస్తాం" అంటూ "వజ్రాయుధాన్ని" పట్టుకొన్నాడు సోమసుందర్ ! ఆరుద్ర (త్వమేవాహాం) గంగినేని (ఉదయిని) రమణారెడ్డి (భువనఘోష) - యిలా తెలం

గాణా విముక్తికోసం ఎందరెందరో అభ్యుదయ కవులు - విప్లవ కవులు - నైజాం నిరంకుశత్వం మీద - రజాకార్ల దుర్మార్గాలమీద తిరగబడ్డారు ! కవితా వీరశంఖం పూరించారు.

ఇక తెనుగులెంక తెలుగుదేశాభిమానం చూడండి !

శ్రీ తుమ్మలవారు ఆంధ్ర జనయిత్రిని ప్రస్తుతించిన తీరు చూడండి!

సీ॥ వ్యాసవాణి తెనుంగు బాస వ్రాయించిన
వేగివిభున కుగ్గిపెట్టినమ్మ
సమతా మహాయోగ సంధాతయైన రే
చెర్ల బ్రహ్మన్న బెంచిన సవిత్రి
మగవారి కచ్చెరువగు రీతి రిపుల నో
ర్చిన రుద్రమను దిద్దగనిన తల్లి
శ్రీరామనామ మూరూర బల్కించిన
గోపన్ననొడి నోముగన్న జనని

తే॥గీ॥ మూఢవిశ్వాసములు ముచ్చముడుగు పొంటె
గా సిలిన కందుకూరిని గన్నమాత
నా తలంపులు పండించుగాత నిరత
మాంధ్ర జనయిత్రి విశ్వకల్యాణ ధాత్రి !

(మహాత్మకథ)

వ్యాస భారతాన్ని తెనిగించటానికి ప్రేరేపించిన రాజరాజ నరేంద్రుని, "అందరినీ-కులమత భేదం లేక— ఒకే పంక్తిలో 'చాప కూడు' బెట్టించిన 'సమతామహాయోగి పల్నాటి బ్రహ్మన్నని- మగసిరిగల వారినే తికమకలు పెట్టగల ధైర్యసాహసాలు - వీరపరాక్రమాలు గల్గిన రుద్రమదేవిని, ఊరూర శ్రీరామనామము పల్కించిన 'రామదాసు'ని, మూఢవిశ్వాసములపై తిరుగుబాటు చేసిన కందుకూరిని కన్న- తెలుగుతల్లి - ఆంధ్ర జనయిత్రి-" విశ్వకల్యాణ ధాత్రిగా ప్రస్తుతించారు శ్రీ తుమ్మల.

ఇంకో ఉదాహరణ—

నన్నపాచార్య తిక్కనాది కవికోటి
యేతల్లి కురువుపై నెక్కి యాడె
కృష్ణరాయాదిక క్షితిపాలురే తల్లి
జోలపాటలలో సుషుప్తి గనిరి
రావెళ్ళ మల్లన ప్రముఖ వీరవరేణ్యు
లొత్తిల్లిరే తల్లి యుదరసీమ
త్యాగరాజాది భక్తసమాజమే తల్లి
యందిచ్చు వెన్నల నారగించె
గీ॥ గౌతమాపత్య కృష్ణవేణీ తరంగ
పాళియే తల్లి తూగుటుయ్యాల లయ్యె
దీక్షమై గొల్తు నయ్యాంధ్రదేశ జనని
విమల చరణద్వయంబు హృద్వీధి నిల్పి—

—రాష్ట్రిగానం.

నన్నయ తిక్కనాదులు యేతల్లి భుజాలపై నెక్కి యాడారో-శ్రీకృష్ణదేవరాయలు వంటి రాజన్యుల్ని యేతల్లి జోలపాడి నిద్ర పుచ్చిందో - రావెళ్ళ మల్లన వంటి వీరమల్లులు యేతల్లి యుదర సీమలో ఒత్తిగిల్లారో - త్యాగరాజాది భక్తిసంగీత సుధాధీనిధులకు యేతల్లి వెన్నల గోరుముద్దలు తినిపించిందో గౌతమీకృష్ణవేణీ తరంగడోలికలపై యేతల్లి 'తూగుటూయేలవూగిందో(వూగుతుందో) అట్టి ఆంధ్రదేశమాత చరణద్వయాన్ని గొలుస్తా నంటాడు శ్రీ తుమ్మల.

పోతే తెనుగు తేనెవాగు; తెనుగమృతాసార సారధార "నాకు సంఘటిల్లు"నని చెప్పుకొన్నాడు.

తెనుగుమాట తీరు తెలిసికోవలెనన్న
కోర్కి వెడలినపుడు కోమలి నడుగు
డరక దున్నువారి నడుగుడు కవులార
చాలదిచట గోశ సముదయంబు

—సందేశ సప్తశతి

అచ్చమైన తెలుగంటే- పల్లెవాసులు మాట్లాడే 'జాను' తెలుగని - దానిని గ్రంథస్తం చేయటానికి 'ఏ డిక్షనరీ' అంటే 'పదకోశ సముదయంబు' చాలదంటాడు.

కమ్మని తెల్లటంచు నుండి కారము సొంపుల నీవిశాల వి
శ్వమ్మున దీనిబోలిన వచస్సునభస్సుమ మంచు వేయి వా
క్యమ్ముల నేను మెచ్చుటయకాదు రసజ్ఞులుదారులెల్ల ఖం
డమ్ముల మెచ్చిరిచ్చిరి వినమ్రతమై గపుటంపు టారతుల్

—రాష్ట్రగానము

తెనుగు తీరు తీయాలు నిగ్గుజగ్గులు చూచి బ్రౌను దొర బ్రహ్మారథం పట్టాడు! తెనుగు ఠీవి, హొయల్ బెడంగులు మెచ్చి ఇబ్రహీమ్ కానుకలిచ్చాడు. తెనుగు సొంపు పెంపులు ఒయ్యారాలు చూచి 'శాహాజీ' సపర్యలొనర్చాడు! తెనుగు తేట - పాటనీటు చూచి - తమిళతంబీలు దాసోహమన్నారు!

ఇకపోతే- తెనుగులెంక శ్రీ తుమ్మలవారికి తెలుగుభాష పట్లనున్న అభిమానం అపురూపమైనది, విశిష్టమైనది, విలక్షణమైనది, అసాధారణమైనది తెనుగుదేశమన్న - తెనుగు సంస్కృతియన్న ఆయనకు ప్రాణంతో సమానం. తెనుగుభాషాభిమానాన్ని- దేశాభిమానాన్ని ఆయన కీర్తించిన విధం విశిష్టమైనది విలక్షణమైనది కూడా. తెలుగుదేశాభిమానం - తెలుగు భాషాభిమానం తెలుగు లెంక నరనరాన - జీర్ణించుకొని పోయాయి. ఆయన జీవితాంతం

రక్తంలో కణకణాన - సజీవంగా ఉరకలేస్తూ పరవళ్ళు తొక్కాయి. తెలుగులెంక ఆపాదమస్తకం అణువణువున తెనుగుదనం - ప్రతి నిత్యం- జీవితాంతం - ఉజ్వలంగా వెలుగొందింది! ద్విగుణీకృతంగా తేజరిల్లింది. ఉమ్మడి మద్రాసు రాష్ట్రింలో తమిళతంబిల చెప్పుచేతల క్రింద– ఆత్మాభిమానం చంపుకొని- అణగిమణగి బ్రతుకుతున్న తెలుగువారి పట్ల ఆయనకు కోపం - కోపంతోపాటు జాలి - సానుభూతి పెరిగాయి. అప్పటికే ప్రత్యేక రాష్ట్రిం కోసం ఆంధ్రలో అలజడి మొదలయింది. ఆంధ్రుల గతవైభవ ప్రాభవ శౌర్య ప్రతాపాల్ని ఉగ్గడిస్తూ- సాటి ఆంధ్రుల్ని మేలుకొలుపుతూ- కర్తవ్యముఖుల్ని చేస్తూ తెనుగులెంక గళం నుండి వెలువడ్డ 'రాష్ట్రిగానం' నభూతోనభవిష్యతి.

"తెనుగుతల్లీ నీకు జోహారు! తెనుగుతల్లీ నీకు జేజేలు—— నిను జూచి- నిను బాడి- నిను గొల్చువేళ నాకను లాణిముత్యాల గనులుగా నగునహో" అని పరవశుడై పోయాడు "తెలుగు దేశము- తెలుగుభాష- తెలుగు చరిత్ర తెలుగు ప్రజ - తెలుగు సంస్కృతి" అంటే ఆయనకు 'ఒడలు పులకరించి' పోతాయి. "అవి నాకు ప్రాణకల్ప విషయాలు" అంటాడాయన! 'తెలుగువాడ' నన్న 'అహంకారం' ఆయన కెక్కువ! ఈ అహంకారమే "నన్ను కవినిచేసినదని" నిర్ద్వంద్వంగా చెప్పాడు. "ఇట్టి నాజాతియు నాభాషయు పరకీయ సంస్కారము నాశ్రయించి ప్రాచీన గౌరవము" కోల్పోయినందులకు అనుక్షణం ఆరాటపడ్డాడు. ఈ ఆరాటంనకు ఆయనలోని 'జీవుడు' 'కదలి'నాడు' ఆ కదలికయే 'రాష్ట్రిగాన' మైనది. తెనుగులెంకకున్న 'అహంకారము' 'దురహంకారం' కాదు. అది ఆత్మగౌరవం! ఆత్మాభిమానం! ఈ 'అహంకారం' వలన యితర భాషల్ని నిరసించలేదు! ఇతర భారతీయుల్ని యీసడించలేదు. "మాతృమహీ

గౌరవములు మానవునకు ప్రాణమ్ములన్నీ విశ్వాసమున్నవాడు. "మన కాంధ్రత్వము ప్రాణము, తనువు సుమీ భారతీయ ధర్మము" అని నొక్కి వక్కాణించాడు. "దేశభాషకు తోడు జాతీయభాష యాంధ్రతకు తోడు భారతీయత్వము" ఉండాలన్న విశ్వాసమున్న వాడు అయితే తెలుగువాడిగా పుట్టి— తెలుగుదేశము "పరకీయ సంస్కారము నాశ్రయించి" నందులకు అంటే దెనుగుదేశం ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో భాగంగా వున్నప్పుడు 'తమిళుల' పెత్తనాన్ని- వాళ్ళ 'దార్జన్యాన్ని' చూచి సహించలేకపోయాడు.

దేశంలో 'భాషాప్రయుక్త రాష్ట్రాలవాదం' బాగా బలపడుతున్న రోజులవి. అందుకు నాంది పలికినవారు ఆంధ్రులు. 'ప్రత్యేకాంధ్ర రాష్ట్రం' కావాలని ఆంధ్రులు అలజడి లేవదీసిన రోజులవి. ఆ అలజడికి ఆరాటపడిన తెలుగు కవి పండితులలో తెనుగులెంక "అగ్రాసనాధిపత్యం" వహిస్తాడు 'రాష్ట్రగానం' చేసాడు! "చాలిన జాతిరా ! తెలుగుజాతి నిరంకుశ వీరజాతిగా నేలినజాతిరా" అని తెలుగుజాతి వైభవ ప్రాభవాల్ని "వేరువేరున" గుర్తు చేసాడు. తెలుగు రాజన్యుల వీరగాథల్ని తెలుగువీరుల పౌరుష ప్రతాపాల్ని తెలుగుకవుల రసమయ కవితా మాధుర్యాన్ని- తెలుగు గాయకుల కమనీయ గానామృతాన్ని- తెల్గు శిల్పుల శిల్పకళా నైపుణ్యాన్ని తెలుగు వనితల అందచందాల్ని- శీలసంపదల్ని- యిలా తరతరాల తెలుగు 'వెలుగుల్ని' పేరెత్తి చూపించాడు. తెలుగు పౌరుషాన్ని- తెలుగు వీరత్వాన్ని- తెలుగు సంస్కృతిని 'తెలుగు చరిత్రలోని ముఖ్యమైన- వీరపౌరుష చారిత్రిక - ప్రసిద్ధ పురుషుల్ని సకల కళా సంఘటనల్ని సన్నివేశాల్ని కన్నులకు కట్టినట్లు వర్ణించాడు.

కలదోయి ! తెలుగు జోదుల తుటారి కటారి
చెలరేగి పగఱ జీల్చిన దినంబు
కలదోయి ! తెలుగు రాజులు గంగ గట్టుపై
దీంౘడించి పడగలెత్తిన దినంబు
కలదోయి ! తెలుగు పల్కుల వెలంది - వెలంది
వెలుగు లెల్లెడల బర్విన దినంబు
కలదోయి ! రేవురేవుల తెలుంగు సరంగు
పెనగి లంగర్లు దింపిన దినంబు
తెలుగుదాతల దాన జలవేణిలో గిరుల్
తెప్పలై పరువులెత్తిన దినంబు
తెలుగువారల భోగముల గాంచి పాక శా
సనుడు గ్రుక్కిళ్ళు మ్రింగిన దినంబు
తెలుగు టొజ్జల పాదముల చెంత జగమెల్ల
విజ్ఞాన మధువు ద్రావిన దినంబు
తెలుగు బిడ్డలు కులమ్ములకు మన్నా చెప్పి
యన్నంబు నొకచాప దిన్న దినము

కలదు కలదోయి తెల్గు ప్రెగ్గడలు మన్ను
మిన్ను తాళంబు వైచి పేర్గన్న దినము
నేటి నీపాటునెంచి కన్నీటి నిడకు
నిలుచునే కాలమొకలీల తెలుగు బిడ్డ !

—రాష్ట్రగానం

"ప్రాతవడినట్టి యాంధ్రభూపతుల కథలు / చదువుడొకసారి కండలు కదలియాడ" అని తెలుగుల గత వైభవాల్ని పేరుపేరున గుర్తు చేసాడు తెనుగులెంక ! "పుక్కిటి పురాణములుగావు పూర్వచరిత / తలచి కన్గొను డాంధ్ర సోదర్యులార" అంటూ "గత ఆంధ్రుల చరిత్ర పుక్కిటి పురాణం కాదని" మొక్కవోని ధైర్య శౌర్యాల్ని- చెక్కు-చెదరని- ధైర్యసాహసాల్ని- బక్క-జిక్కి- శిథిలావస్థలో వున్న

గతవైభవ ప్రాభవాల్ని ఒక్కసారి వెనక్కితిరిగి చూడండి! చదవండి. నెమరువేయండి అంటున్నాడు తెనుగులెంక! "కొమ్ముదిరిగిన వారలే కొలువుసేయ దిక్కులొత్తిన మొనగాడు తెలుగువాడ"నీ "ఉత్తమోత్తమ ధర్మమెందున్న దాస - కొలువు మరగెడివాడు మా తెలుగువాడు" అనీ తెనుగులెంక ఉప్పొంగిపోతాడు!

అటు పరాయి బ్రిటీషు ప్రభుత్వ పాలననీ ఇటు 'తమిళ' తంబీల పెత్తనాన్ని సహించలేని 'ఆత్మాభిమాన' మున్న తెనుగులెంక— తెలుగు రాజన్యుల — తెలుగు కవుల - తెలుగు నాయకుల శౌర్యప్రతాపాల్ని— పురాతన తెలుగు ప్రాభవ వైభవాల్ని ఒక్కసారి గుర్తుచేసుకోమని సాటి తెలుగు సోదరులకు గుర్తుచేస్తున్నాడు. "చతురంతధారుణీ చక్రంబు" శాసించిన ప్రతాపరుద్రుని- "పరవీర్యలుంటాక బాహాబల ప్రౌఢి" గల బాలచంద్రుని- "ఖడ్గంబు నందిచ్చి కదన భూమికి" నాథుని నడిపిన మాంచాలని- "కండలన్నదలించు కైత నామెతలిచ్చు" తిక్కనామాత్యుని- "ఆంధ్రరాజ్య స్థాపనాచార్యుడైన" ఆంధ్ర విష్ణువును "రణకళానిధి సుశర్మను జంపి మగదోర్వి శాసించిన" శ్రీముఖ చక్రవర్తిని- "కలము ఖడ్గము పట్టగల నేర్పు వడసిన" రెడ్డి నాగమ్మను - "జగముగంటిమి నాంధ్రజగతి పాలించిన" రుద్రమాంబాదేవిని- "గండికోటను మల్కదండుపై దూకిన" గోవిందమాంబను "మానంబుకై నిజప్రాణంబు బలి యిచ్చిన" మల్లమ్మను- గుర్తుతెచ్చుకో మంటున్నాడు కవిగారు.

"పీష్వాల యేల్బడి పెంచి మంత్రిత్వంబు" నెఱపిన పింగళి మోరోపంతుని- "ఖండఖండాంతర ఖ్యాతుడైన" సిద్ధనాగార్జునుని- కైవల్య కల్యాణ ఘంటాపథముగన్న" యోగి వేమన్నని— "బొందితో నపవర్గ మందిన (రామ) భక్తుండు" గోపన్నని- "తన దాన ధారచే తెనుగు గడ్డను" పవిత్ర మొనర్చిన "భాస్కర

మంత్రిని- "తన ప్రజ్ఞచే మన్నుమిను గుప్పిటఁబట్టిన" ప్రగడ తిమ్మరుసుని-" తన (భక్తి) గీతిచే జగమ్మునకు జీవము పోసిన త్యాగయ్యను- "అఖిల ప్రజకు శాసనీయపద పీయూషంబు" కురిసిన వీరబ్రహ్మ గురువరుని- జ్ఞప్తికి తెచ్చుకోమని తెలుగు సోదరుల్ని వేడుకొంటున్నాడు.

"పాటలీపుత్రమ్ము కోట కొమ్ములమీద తెలుగు జెండాలు నర్తించిన "దినాన్ని-" ఢిల్లీ గుండెదిరి చెండాడిన" నవలక్ష తెలుగు విలుకాండ్రు "ఓరుగల్ కవిసిన "దినాన్ని-" కొల్లకొల్లగ [illegible]లు పల్లె రేవున బిసాళించు కస్తూరిని దించిన-" దినాన్ని— "రతనాల ముత్యాల రాసులు పోసి రాయల రాచపేటిలో అమ్మిన-" దినాన్ని "మందారమకరంద మాధుర్యమై యోరుగంటు కవిత్వం" చెప్పిన దినాన్ని- ఒక్కసారి గుర్తుకు తెచ్చుకోమంటున్నాడు!

"మన టంగుటూరిలో మల్లడించిన తెల్గుల పరాక్రమ రేఖనీ రామలింగార్య (కట్టమంచి) లో సడలని ఆంధ్ర విజ్ఞాన తేజః పుంజాన్ని- "పట్టాభిసచివు కేల్" పట్టుకొని - చెదరిపోని ఆంధ్ర శేముషీసంపత్తిని- "నాగేశ్వరునిలో" (దేశోద్ధారక) బెనంగి - బీజు వోని "ఆంధ్ర వీర దాతృత్వంబు-"ను చెళ్ళపిళ్ళ కలమునందు కులుకులూ తఱిగిపోని తెల్గుకైతల పసందును - మరిచిపోవద్దని తెలుగు సోదరులకు మనవి చేస్తున్నాడు.

పరభాషా వ్యామోహంలోపడి మాతృభాషాభిమానాన్ని స్వదేశాభిమానాన్ని మంటగలుపుతున్న తెలుగువారికి తుమ్మల హెచ్చరిక కూడా చేసాడు- 'తులసిదాసుని కైత' కాదు ముందు 'పోతన్న కలము సొంపుల నెఱుంగు' మన్నాడు. మేవాడ పతనంబు మెచ్చక ముందు బొబ్బిలి కథలోని దెబ్బచూడమన్నాడు! హైమ్సు-హిందూ పత్రికల్ని చదవడం కాదు. ముందు ఆంధ్రపత్రికని చదవమన్నాడు. "గామాను" కాదు ముందు కోడిరామమూర్తి బలశక్తిని

కొనియాడమన్నాడు. ఎలిజబెత్తు మహత్త్వం కాదు ముందు రుద్రమదేవి పౌరుషం గురించి తెలుసుకోమన్నాడు. అయ్యరు గూడకట్టు గుజరాతి టోపీ- అరబ్బుల లుంగీలు కాదు. మన తాతల తండ్రుల 'జుట్టు పంచెకట్టు బొట్టు' ధరించమన్నాడు ! "పరవేష భాషా సపర్యతారకమాట / నాంధ్రత్వమే నగంబడిగి పోయెడనీ" మా (తెలుగు) శిల్పంబులు శాస్త్రముల్ కవితలున్ మరాదలున్ శేముషీ వైశారద్యములన్య దుర్లభ యశస్స్వాంతంబు" లైనందుకు కవిగారు వేదన చెందాడు "యావదాంధ్ర విషయమ్ము నొక్క-రాజ్యమ్ము జేసి / విజయ దుందుభిపై దెబ్బవేయు వఱకు / తెలుగు బసిపాపకైన నిద్రింపదగునే" అని హెచ్చరించాడు.

తెలుగుభాష 'తీరుతీయముల్' తెలుగుభాషతీవి హొయల్ సొంపు పెంపులు- తేటనీటు పాటల విశిష్టతను 'పేరుపెట్టి గుర్తుచేసాడు. "తల్లి సంకెలలో దల్లడిల్లువేళ / నాకమైనను నరకంబుగాకయున్నె" అంటూ "తెలుగుతల్లికి దేజముల్ తెచ్చుకొఱకు నడుముకట్టుడు రాష్ట్రంబువడయు కొరకు" అని తెలుగువారిని నుత్తేజపరచాడు ! "నా రాష్ట్రంబు గడించి తీరెదను నానా విఘ్నముల్ వచ్చినను" "కార్యమున్ బ్రారంభించిన తెన్గుబిడ్డ నెదిరింపన్ బ్రహ్మరుద్రాదులే చేరంజాలరు" అని దీక్ష బూనాడు ! వేఱిమి లేదు లేదు మము వేఱుగ జూడకు వచ్చమైన మీ కూరిమి పేరిమిన్ బడయ గోరిన తమ్ములమేము" అని తమిళ సోదరులకు విన్నవించుకొన్నాడు. ప్రత్యేకాంధ్ర రాష్ట్రంలో తాము భాగస్వాములం కాబోమని రాయలసీమ ప్రజలలో ఒక "పుకారు" పుట్టింది. అందుకు తెనుగు లెంక "మీకునే మాకును లేవు భేదములు ధుర్మేశాపులాంధ్రేతరుల్ మాకున్ మీకును దంపివెట్టి బ్రదుకన్ మల్లాడుచున్నారు" చెప్పుడు మాటలు వినొద్దు. తస్మాత్ ! జాగ్రత్త అంటూ "అపరాధంబులు

లేవు సహా పలస నేయూవంత కాన్పించివన్ గృహం సైపుడు దారతో సఖులు మీారలని పశ్చిమాంధ్రులకు (రాయలసీమ సోదరులకు) విజ్ఞప్తి చేసాడు.

తుమ్మలవారి 'రాష్ట్రగానం' తెలుగువారి ను త్తేజపరిచింది. కాంగ్రెస్ ను ఖుల్ని చేసింది. ప్రత్యేక ఆంధ్రరాష్ట్రానికి 'నాయకులు' సాగించిన ప్రత్యక్ష పోరాటానికి- ఉద్యమానికి తెలుగులెంక రాష్ట్రగానం ప్రాణమిచ్చింది. సంఘటిత పరిచింది. చివరకు పొట్టి శ్రీరాములు 'ఆత్మఆహుతి'తోగాని ఆంధ్రరాష్ట్రం ఉద్భవించలేదు! "శుద్ధ స్వమూర్తి సుతుడొక్కడాహుతి పోవువరకు దరలిరావు నీవు" అని ఆవేదన చెందాడు.

ప్రత్యేక రాష్ట్రమొచ్చిందని సంతోషం కాదు. 'వివాదముల్ బడక యుండాండి' అని హెచ్చరిస్తారు. 'మేలు తెలుగుం బతాకకు, జేలాంధ్ర ప్రజకు మాత్ర సేవారకకున్ శ్రీలు తెనుగుంకృతికి' జేజేలు పలికాడు. రాజధాని సమస్య గూర్చి - పదవుల కట్లాడ గురించి - అధికార భాష గురించి - వాడుకభాష గురించి - యిలా 'రాష్ట్రం' 'వచ్చిన' తర్వాత తలెత్తిన అనేకానేక సమస్యల్ని తెలుగులెంక తన 'ఉదయగానం'లో కవితాచర్చ చేసారు. తెలుగువారంతా ఐకమత్యంగా 'ఏకకుటుంబం'గా అన్యోన్య ప్రేమానురాగాలతో మెసలాలన్నది కవి ముఖ్యోద్దేశం. "విశాలాంధ్ర" ఆవిర్భవించాలని ఆయన ఆశించారు. ఆశించినట్లే దరిమిలా "ఆంధ్రప్రదేశ్ అవతరించింది.

భర్తృహరి నీతి శతకాన్ని తెలుగులో కావ్యబద్ధం చేస్తూ దానికి 'తెనుగునీతి' అని పేరు పెట్టాడు. తనకు నెల్లూరులో యిచ్చిన 'అభినవ తిక్కన' అనే బిరుదుకంటే - 'తెనుగులెంక' అని తనకు తాను పెట్టుకొన్న 'పేరే' యిష్టమని స్పష్టపరిచాడు !

"నా రాష్ట్రంబు గడించి తీరెదను నానా విఘ్నముల్ వచ్చినన్" అని తెనుగులెంక 1936లో వెలువడ్డ 'రాష్ట్రగానం'లో ఆకాంక్ష వెలిబుచ్చాడు. కవివాక్కు ఋషివాక్కు - బ్రహ్మవాక్కు సత్యవాక్కు అది నెఱవేరి తీరుతుంది ! "రవి కానరిది కవి గాంచ గలడు" అన్నారు, అనుభవజ్ఞులైన పెద్దలు. అంటే కవి క్రాంతదర్శి! భవిష్యద్దర్శి ! తెనుగులెంక సత్యనిష్ఠాగరిష్ఠుడైన మహాకవి కనుక ఆయన వాక్కు వ్యర్థం కాలేదు. ఆయన ఆశించిన విధంగా 1953లో ఆంధ్రరాష్ట్రం సిద్ధించింది.

అలానే తెలంగాణంతోసహా బృహత్ ఆంధ్రరాష్ట్రం కావా లన్నది ఆయనఅసలుఆశయం. అంటే తెలుగు మాట్లాడేవారి ప్రాంత మంతా ఒక రాష్ట్రంగా ఏర్పడాలన్నది తెలుగువారి కోరిక "నడుము కట్టవోయి నాతమ్ముడా ! విశాలాంధ్రమునకు భాగ్య కేంద్రమునకు" తుమ్మలవారు వెంపర్లాడాడు ! "చూతును బృహదాంధ్రము- నెవరే తంత్రము పన్నినను జయింతును" అని ఆయన ఆత్మవిశ్వాసం ప్రక టించాడు. అలానే 1956 నవంబరు 1వ తారీఖున ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడింది. ఆ శుభ సమయమున తెనుగులెంక ఆనందంతో పాడినపాట వినండి

వాడిపోయిన తల్లి మొగమున
నాడెరా జాబిల్లి రేకలు
మూడు కోట్ల తెలుగు లిప్పుడు
ముక్తినందిరిరా

ఆనాడు ఆంధ్రులు మూడుకోట్లు మాత్రమే ! (ఈనాడు ఆరుకోట్లు గదా)

విత్తునాటిన జొన్నవిత్తుల కులమౌళి
గురునాథునకు నేటికోళ్ళు పల్కి
పాదికట్టిన తెల్గు బంగారుకొండకు
వెంకటప్పయ్య కష్టవిధులు దీర్చి

నీరోసి పెంచిన నెఱదాత కాశినా
థునకు భక్తి ప్రపత్తులు వెలార్చి
బడలెఱుంగని కాపుగడ కోర్చి నిల్చిన
పానుగంటికి బరాబరు లొసంగి

సాగిసాగిన యీతెన్గు దీగ చివర
దళుకులెగజిమ్ము విరికి నెత్తావియైన
పొట్టిరామయ్య కారతి పట్టవోయి
తమ్ముడా ! నూత్న రాష్ట్రావతరణ వేళ !

ఆంధ్రులకు ప్రత్యేక రాష్ట్రం కావాలని మొదట గొంతెత్తి బీజావాపనం చేసినవాడు కొండ వెంకటప్పయ్య పంతులు. విత్తిన విత్తనం మొలకెత్తగా - పాదుకట్టినవాడు దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులు. ఆపాదునకునీరుపోసి పెంచి పెద్దది చేసినవాడు కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు. ఆ లతాంకాపుగడగా - కాపుదలగా అండ నిల్చినవాడు పానుగంటి లక్ష్మీనరసింహం పంతులు. తీవలుతీసి లతాంతములు పూయించటానికి ఆత్మబలిదానం చేసినవాడు పొట్టి శ్రీరాములు, రాష్ట్రావతరణ శుభసమయాన- వీళ్ళందరినీ స్మరించి- ఏడుకోళ్ళు పలుకుతున్నాడు తుమ్మల. మనచేత జేజేలు పలికిస్తున్నాడు.

ఈ విధంగా తెనుగులెంకకున్న దేశాభిమానం - భాషాభిమానం యితర కవులకున్న అభిమానం- కన్న భిన్నమైనది. మిన్నయైనది. ఈ అధ్యాయంలో వివరించిన విషయాలే అందుకు సాక్ష్యం! రాష్ట్రగానం ఉదయగానాలలో- తెలుగువారి చరిత్ర వుంది. పౌరుషముంది. శౌర్యముంది ! వైభవ ప్రాభవాలున్నాయి. కర్తవ్య నిర్దేశముంది ! కవి సామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు 'రాష్ట్రగానం'నకు పీఠిక రాస్తూ" ఈయన (తెనుగు లెంక) ప్రాణములో హృదయములో మనస్సులో శరీరములో నాంధ్రుడు... అహో !

ఓయి ఆంధ్రుడా - నీవీ కవికంటి వాడవగుదువేని పతితమైన యాంధ్రజాతి ఒక్క నిమిషములో తొలినాటి గొప్పదనము పొందదా" అని అభిభాషించారు !

ఈ అధ్యాయం ముగించే ముందు మనమొక మాట చెప్పు కోవాలి ! అది 'రాష్ట్రగానం' కావ్యం గురించి ఇందు కథావస్తువు లేదు. ఇది ప్రబోధ గీతి ! ఇట్టి ప్రబోధ కావ్యాలకు 'శాశ్వత' విలువ వుండదనీ- ఆశించిన తాత్కాలిక తక్షణ లక్ష్యమే వాటి లక్ష్యమని విమర్శకులంటారు ! అట్టి విమర్శ అర్ధసత్యమే కావచ్చు కాని. తుమ్మలవారి 'రాష్ట్రగానం' విషయంలో యది అన్వయించదు. అందులో కథలేకపోవచ్చు గాని. ఆంధ్రుల గత చరిత్ర గత వైభవ ప్రాభవాన్ని చెప్పే తెలుగు సంస్కృతి పుష్కలంగా వుంది ! తెలుగు చరిత్ర పరిశోధించి అందలి ముఖ్య చారిత్రిక సంఘటనల్ని- చారిత్రిక పురుషుల్ని (రాజులు - కవులు - కళాకారులు - చిత్ర కారులు వగైరా) చారిత్రక ప్రదేశాల్ని 'సూచన' మాత్రంగా ఛందోబద్ధం చేసాడు తెనుగులెంక ! విశ్వనాథవారు రాష్ట్రగాన రచనలోని 'పరిశోధన'ని మెచ్చుకున్నారు.

ఈ 'రాష్ట్రగానం' సమకాలీన ఉద్యమ నాయకుల్ని ప్రభావితం చేసింది. సాహితీప్రియుల హృదయాల్ని ఆకట్టుకొంది ! తెలుగు వారిలో 'ఆంధ్రాభిమానం' పెంచింది. ప్రత్యేక రాష్ట్రం కోసం కార్యోన్ముఖుల్ని చేసింది. ఫ్రెంచి రచయితలు - వాల్టేరు - రూసోల రచనలు ఫ్రెంచి ప్రజలను ప్రభావితం చేసి ఫ్రెంచి విప్లవానికి కారణమైనట్లు- కారల్ మార్క్స్ రచనలు - లెనిన్ నాయకత్వాన రష్యా విప్లవానికి మార్గదర్శకమైనట్లు - తెనుగులెంక రాష్ట్రగానం తెనుగుప్రజల ప్రభావితం చేసి- కార్యోన్ముఖుల్ని గావించింది !

అయితే రాష్ట్రగానంలో తెనుగులెంక - అరవలగూడ కట్టు మనకెందుకనీ- తెలుగు పత్రికల్ని త్రోసిరాజని హిందు - టైమ్స్, మెయిల్ పత్రికల్ని చదవడమెందుకనీ- సూరన్న కవిత్వాన్ని మెచ్చు

కుండా- షేక్స్పియరు కవిత్వాన్ని మెచ్చుకోనడమెందుకనీ - రుద్ర మాంబ పౌరుషాన్ని ప్రస్తుతించిక- రాణి ఎలిజబెత్తుని శ్లాఘించట మెందుకనీ దామెర్లవారి చిత్రాల్ని మెచ్చుకోనకుండా అవనీంద్రు ఠాగూరు చిత్రాల్ని మెచ్చుకోనడాన్ని- మెట్టూరు డాము కట్టిన మనకొరిగే దేమిటనీ- తెనుగులెంక 'యీసడించి' నందుకు ఆయనలో 'సంకుచిత' భావమున్నట్లు కొందరు విమర్శించారు. "రామా! ఎవడబ్బ సొమ్మనుకున్నావని" రామదాసు అన్నంత మాత్రాన అతని రామభక్తిని శంకించడమా! ముందు మన 'కట్టు' మన సంస్కృతి అన్నాడు తెనుగులెంక! కొంచెం 'అధిక్షేపం' ఉన్నంత మాత్రాన ఆయనలో 'సంకుచిత్వం' వున్నట్లా!

ఇకపోతే "తెనుగు తేనెవాగు, తెనుగమృతాసార సారధార నాకు సంఘటిల్లు" అని మాతృభాష మీాద ఉన్న మమకారాన్ని విస్పష్టంగా చెప్పాడు. "ఏపుణ్యలేశమ్ము నాపాలిదాయెనో నా పూజకేలోకనాథుండు పొంగెనో - నీపావనోదర శ్రీపరంపర లలో నీ పదార్చకులలో నేను నొక్కడ నైతి" అంటూ తెలుగు భాషామతల్లిని సేవించే భాగ్యం అబ్బినందులకు ఉబ్బితబ్బిబ్బై పోయాడు!

"ఎట్టి కఠోర దీక్షలు సహించితినో తొలుబామునందు నీ
కెట్టి దళంబు లెట్టి విరులిచ్చి నమస్యలొనర్చి నాడనో
పుట్టితి నీ సుతుండనయి పోడిమిగంటిని తల్లి! వీనికిన్
బెట్టుము భిక్ష నీయనుగు బిడ్డడుగా నెపుడున్ జనింపగన్"

తెలుగువాడిగా బుట్టినందులకు పూర్వజన్మ సుకృతాన్ని తలంచు కొంటున్నాడు! అంతేకాదు! మళ్ళీ తెలుగువాడిగానే బుట్టేందుకు 'బిక్ష' బెట్టమని తెలుగుతల్లిని అర్థిస్తున్నాడు! 'వచ్చేజన్మ' లోనే కాదు "నెపుడున్" అంటే 'జన్మజన్మాలకూ' తెలుగువాడిగానే పుట్టా

లని తెలుగుభాషకు సేవ చేయాలని తెలుగులెంక ఆకాంక్ష! ఓహో! ఏమా మాతృప్రేమ! మాతృభాషానురక్తి! ఇలా ఏ తెలుగుకవి అనలేదంటే అతిశయోక్తికాదేమో! ఆంధ్రుడైపుట్టడం తన 'పుణ్యంపు పంట'గా భావించి తనలోనె తాను గర్వపడుతున్నానని పుట్టపర్తి వారన్నారు. ఆంధ్రుడనన్న 'అహంకార' మందు మన్నాడు రాయప్రోలు. ఇలా మరికొందరు కవులని వుండవచ్చు కాని 'జన్మజన్మలకి' తెలుగువాడిగా పుట్టాలని ఆకాంక్షించడం ఒక్క తెనుగులెంక అభీష్టం మాత్రమే. అది ఆయన తెలుగుతల్లి తెలుగుభాషపట్ల ఉన్న 'స్వచ్ఛ పీరాభిమానానికి' తార్కాణ! పైగా

ఆంధ్రుడవై జన్మించితి
వాంధ్రుడవై యనుభవింపు మాయుర్విభవం
బాంధ్రుడవై మరణింపుము
ఆంధ్రత్వము లేని బ్రతుకు నాసింపకమీ

ఆంధ్రుడుగాపుట్టి— ఆంధ్రుడిగాజీవించి-ఆంధ్రుడిగానే మరణించమనీ- 'ఆంధ్రత్వం లేని బ్రతుకు ఆశింపవద్దని - తనకు తాను చెప్పుకొన్నాడు. ఇతర తెలుగువానినీ 'ఆంధ్రత్వం' లేని బ్రతుకు ఆశింపవద్దని ధ్వనిమాత్రంగా సూచిస్తున్నాడు. "ఆంధ్రత్వం" అంటే అభినవ తిక్కనకున్న అభిమానమటువంటిది. "బడలి బడలి తల్లి బాస కూడెముసేయు కవిని నేను దేశకవిని నేను" అని తేటతెల్లంగా చెప్పుకున్నాడు.

పైగా ఆయనింకొక మాటంటున్నాడు- "బాస చెడె నేని కవితావాసన చెడు" అంటూ 'ఎన్న రెందరెంత దవ్వైనగాని- భాషా విపర్యయమ్ము సైపనేను' అని ఖరాఖండిగా అంటున్నాడు- 'భాషా సంకరం' ఆయనికి గిట్టదన్నమాట! మరి వ్యావహారిక భాషకే పట్టం కడుతున్న- వచన కవిత్వానికి ప్రాముఖ్యమిస్తున్న యీనాటి

తెలుగు కవిపండితులు 'ముఖ్యంగా' అభ్యుదయ ప్రజాకవులు తెనుగులెంకతో ఏకీభవించరని వేరే చెప్పనక్కరలేదు !

తెనుగులెంక ఆకాంక్ష చూడండి

తెలుగువానికైత దేశదేశాలకు
నొజ్జబంతియగుచు విజ్జగాక
ప్రాజ్ఞుడై కలాతపస్వియై విశ్వ సా
హిత్య రాజ్యమాంధ్రుడే గాక

తెలుగు కైత దేశదేశాల కైతలకు మేలుబంతి కావాలని, ఆంధ్ర కవి విశ్వసాహిత్య రాజ్యాన్ని ఏలాలని ఆకాంక్షిస్తున్నాడు ! తెలుగుదనం తన శరీరంలో 'నరనరాన జీర్ణించుకొన్న తెనుగులెంక తెలుగుతల్లి పట్ల తెలుగుభాష పట్ల అంతటి గాఢానురాగాన్ని ప్రదర్శిస్తున్న తెలుగుకవి పండితుల్లో అంతటివారు లేరంటే అతిశయోక్తి అవుతుందేమోకాని, నూటికి నూరుపాళ్ళు "ఆంధ్రాభి" మాన మున్న తుమ్మలవంటి తెలుగు సాహితీమూర్తులు తెలుగు సాహితీ జగత్తులో 'అరుదు'గా వ్రేళ్ళమీద లెక్కించగలవారు మాత్రమే వుంటారని ఘంటాపథంగా చెప్పుకోవచ్చు.



ఇద్దరు తెల్గువాండ్రు తమ యింటివి కష్టసుఖాలు చెప్పుకో
నద్దిర మాతృభాష తగదా ! మరి యింకొక పెద్ద రోగమే
కద్దు ! వచింతు, నాంగ్లము మొగంబు నెఱుంగని శ్రోతముందు దు
ర్బుద్ధులు వాగుచుంద్రు పలుపోకల బొంగుచు- నింగిలీసులన్

—రాష్ట్రిగానం

# గాంధీ కవిగా

గాంధి యుగమున బుట్టితి గాంధి నడుపు
నుద్యమంబుల నలిగితి నోపినంత
గాంధి నీక్షించితిని గాంధి కవితవ్రాయ
గంటి నీజన్మమునకు నీపంట చాలు—

—తెనుగులెంక

ఈ యిరవయ్యో శతాబ్దం పూర్వార్థంలో బ్రిటీషుపాలనకు వ్యతిరేకంగా భారతదేశంలో సాగిన జాతీయోద్యమ ఘట్టం ప్రముఖమైనది. ముఖ్యంగా గాంధీజీ నాయకత్వాన విజయవంతంగా సాగిన శాంతియుత మహోజ్వల స్వాతంత్ర్య సమరోద్యమం అపూర్వమైనది అసాధారణమైనది అనితరసాధ్యమైనది. సత్యనిష్ఠా గరిష్ఠుడైన మహాత్మాగాంధి అనుసరించిన శాంత్యహింసా విధానం- సత్యాగ్రహ వ్రత విధానం- అసహాయోద్యమం- గాంధీలోని 'త్రికరణ శుద్ధి' ఆయన విశిష్ట వ్యక్తిత్వం - విభిన్న కులమత భాషా ప్రాంతీయులైన - భారతీయులందరినీ ఒక త్రాటిమీద నిలబెట్ట గలిగాయి. ఒక బాటలో నడిపించాయి. ఆసేతుహిమాచల పర్వతం- ఆబాల గోపాలం-ఆడా మగా భేదంలేకుండా- దేశస్వాతంత్ర్యంకొరకు బాపూజీ అడుగుజాడలలో నడిచింది. సుభాస్‌చంద్రబోస్ వంటి 'అతివాదులు' గాంధీజీ నాన్చుడు "శాంతి విధానాన్ని దుయ్య పట్టినా- అస్పృశ్యులకు ప్రత్యేక హక్కులు మొదట వద్దన్న గాంధీజీని డా॥ అంబేద్కర్ తీవ్రపదజాలంతో విమర్శించినా- సిద్ధాంతపరంగా అవలంబించిన విధానంతో గాంధీజీతో కమ్యూ నిష్టులు సైతం విభేదించినా- దేశస్వాతంత్ర్య విషయంలో 'గాంధీజీ' పాత్ర అపూర్వమైనది. విశిష్టమైనది. విలక్షణమైనది కూడా!

"స్వరాజ్యం విషయంలోమాత్రం వీరంతా గాంధీని వ్యతిరేకించలేదు! దేశీయులేకాదు విదేశీయులు సహితం గాంధీని రాముడు- కృష్ణుడు- క్రీస్తు- బుద్ధుడు-కోవకు చెందిన అవతారపురుషుడుగా శ్లాఘించారు.

మహాకవి జాషువా అన్నట్లు "ఆయనే భరతవర్షం - భరత వర్షమే బాపూజీ. ఆయనొక ప్రత్యేక వ్యక్తికాదు - నలుబదికోట్ల భారతీయులతేజం" ఆనాడాయనే భారతదేశం! భారతదేశమే ఆయన! కాంగ్రెస్సే గాంధీజీ. గాంధీజీయే కాంగ్రెస్. ఆనాడాయన మాటకు తిరుగులేదు; ఎదురులేదు - ఆయన మాట శిలాక్షరం! ఆయన వాక్కు- బ్రహ్మవాక్కు - ఆయన మాట వేద వాక్కు- ఆయన భారతీయులలో 'అత్యధిక భాగానికి' - అవతార పురుషుడు- ఆరాధ్య దైవం. ఇటువంటి గాంధీజీని - నాయకులతో పాటు కవిపండితులు కూడా బహుధా శ్లాఘించడం సహజం!

తెలుగు సాహిత్యలోకంలో గాంధీజీని అవతారమూర్తిగా- కారణ జన్ముడిగా- కర్మయోగిగా - కవిపండితులు కొనియాడారు. కవితలు రాసారు- కావ్యాలల్లారు-పాటలురాసారు "కొల్లాయి కట్టితే నేమి మాగాంధి కోమటై పుట్టితేనేమి" అనీ గాంధి"నాల్గుపరకల పిలకనీ" నాల్గువేదాలు నాట్యమాడే పిలకగా -గాంధీజీ కాలు కదిపితే- 'జగతి కంపించింది' అనీ- గాంధివాక్కు బ్రహ్మవాక్కని బసవరాజు అప్పారావు బహుదా కీర్తించాడు. విశ్వనాథవారు గాంధీజీని 'రాజు'గా కీర్తించాడు. "భార్యబిడ్డలున్న ప్రత్యక్ష దైవంబ"ని జాషువా అభివర్ణించాడు. "సబర్మతి సన్మునికిన్ కుమారుడన్ (హరిజనుడన్న భావంతో) అని చెప్పుకున్నాడు. "లోకోత్తర పురుషుడని" శ్రీపాద కృష్ణమూర్తి పేర్కొన్నాడు. గాంధీజీ జీవితాన్ని 'హిమాలయోత్తుంగ శృంగం'గా పోల్చాడు అడివి బాపిరాజు - ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి "మన సారథి మన సచివుడు - మన

విభుడు - గురుడు" అని కీర్తించాడు. డా॥ సి. నారాయణరెడ్డి మహాత్ముని స్వరూపాన్ని "తుహినాద్రికి సంక్షిప్త రూపం"గా అభివర్ణించాడు. కవిబ్రహ్మ ఏటుకూరి వేంకటనరసయ్య 'ఆసియా జ్యోతి'గా అభివర్ణించాడు. బొడ్డు బాపిరాజు 'యుగప్రవక్త'గా పేర్కొన్నాడు. "పుడమి నడుగిడు పురుషోత్తముడని" నాయని వారన్నారు. "దుర్బలుడవయ్యు నెంతటి దోర్బలమ్ము" అని దాశరథి కొనియాడాడు! "చరాచర ప్రపంచానికి క్షమా మార్గదర్శి" అని శ్రీ శ్రీ వంటి 'అభ్యుదయ కవి' మెచ్చుకున్నాడు. 'భారతీయసముద్రగర్భంలో దొరికిన మానవ (మేలి) ముత్యం'గా అభివర్ణించాడు ప్రజాకవి కుందుర్తి.

ప్రఖ్యాత శాస్త్రజ్ఞుడు- "సాపేక్ష సిద్ధాంత" కర్త (Theory of Relativity) ఐన్‌స్టీన్ గాంధీజీని గురించి-"గాంధీవంటి మహావ్యక్తి రక్తమాంసాలుగల శరీరంతో యీ భూమిపై ఒకప్పుడు నడయాడాడు అంటే భావితరాలవారు నమ్మకపోవచ్చు" అని ప్రశంసించాడు. దీనినిబట్టి గాంధీజీ మహోన్నత వ్యక్తిత్వాన్ని యెవరైనా వూహించుకోవచ్చు. అలానే - ప్రసిద్ధ ఆంగ్లసాహిత్యవేత్త- "అపర షేక్స్‌పియర్'గా యెంచబడుతున్న జార్జి బెర్నార్డ్‌షా గాంధీజీని గురించి- "ఆయనొక మధుర ప్రకృతిగాని మానవమాత్రుడు కాడని" ప్రస్తుతించాడు.

దీనినిబట్టి గాంధీజీ విశిష్ట వ్యక్తిత్వం మనం వూహించుకోవచ్చు! ఇలా యెందరెందరో విదేశీయ ప్రముఖులు గాంధీజీ విశిష్ట వ్యక్తిత్వాన్ని- ఆయన చేపట్టిన వినూత్న శాంతియుత జాతీయోద్యమాన్ని కొనియాడారు! ఇక భారతీయులు సరేసరి. గాంధీజీని "దేవుడు"గా భావించారు- ఆరాధించారు.

పోతే- తెలుగు కవుల్లో - కవితా ఖండికలు వెలయించినవారు కోకొల్లలు కాగా- "గాంధీ దేవుడు" అన్న కావ్యాన్ని

రచించాడు మునగపాటి విశ్వనాథశాస్త్రి. మధురకవి నాళం కృష్ణారావు "గాంధీమహాత్ముని దశావతార లీలలు" అన్న లఘు కావ్యాన్ని రచించాడు. కొప్పరపు సోదరకవులు "గాంధితాత" అన్న పేరున కావ్యమొకటి రాసారు. మహాకవి జాషువా "బాపూజీ" అన్న కావ్యాన్ని వెలయించారు ఆయన మరణించిన తర్వాత ! శ్రీ మంగిపూడి వేంకటశర్మ "శ్రీ గాంధి చరితామృతం" డా॥ సి. నారాయణరెడ్డిగారి 'గాంధేయం' పుట్టపర్తి దంపతుల గాంధీజీ మహాప్రస్థానము జ్ఞానానందకవి "మహాగీతి -" రేప్రాని సుబ్బారావు "భారతజ్యోతి" మానేపల్లి సంగమేశ్వర కవి "పరంజ్యోతి" పల్లిపూర్ణ ప్రజ్ఞానందచార్యులు "ఆత్మసమర్పణం-" అల్లంరాజు రంగనాయకులు "శాంతియాత్ర-" గురజాడ రాఘవశర్మ 'నవకాళి' చెప్పుకోదగిన 'గాంధీజీ' మీద కావ్యాలు !

అయితే యీ కవులందరూ గాంధీజీని ప్రస్తుతించిన విధమొక యెత్తు. గాంధీని గాంధికవి శ్రీ తుమ్మలవారు ప్రస్తుతించిన విధం ఒక యెత్తు. కవులలో చాలామంది గాంధీజీ అనుయాయులుండొచ్చు. గాంధేయవాదులుండొచ్చు. గాంధీ భక్తులుండొచ్చు. వీరంతా సమయ సందర్భాల్నిబట్టి కవితావేశంతో గాంధీపై కవిత్వం చెప్పియుండవచ్చు. కాని తుమ్మలవారు గాంధేయవాదాన్ని గాంధీజీ వ్యక్తిత్వాన్ని నరనరాన జీర్ణించుకున్నాడు. గాంధీని 'త్రికరణశుద్ధి' గా నమ్మాడు. గాంధి అడుగుజాడల్లో నడిచాడు గాంధీలా జీవించాడు; గాంధీ కవిత్వం రాసాడు. ఒక విధంగా చెప్పాలంటే గాంధీ వ్యక్తిత్వంతో తన వ్యక్తిత్వం 'తదాత్మ్యం' గావించుకొన్నాడు. గాంధీజీ ఆశయాలతో-గాంధీ ఆశయాల సిద్ధికి కలం పట్టుకొన్నాడు. కావ్యాలు రాసాడు. అంటే తానూ - తన కవిత్వం గాంధేయవాదానికి" అంకితమై పోయారన్న మాట. కారణం- సత్యనిష్టయే. నీతి నిజాయితీకి ప్రతిరూపమైన "నారయ్య" కుమారుడు కావడం

ఒకటి కాగా- జాతీయ భావాలతో గాంధీజీ ఆశయాలకు నిలయమైన 'కావూరు' (వినయాశ్రమం) లో పుట్టడం మరొక కారణం. దేశ స్వాతంత్ర్యం కోసం సత్యనిష్ఠతో - శాంతియుతంగా గాంధీజీ "కృష్ణసారథ్యం" వహించడం అసలు కారణం.

గాంధీజీ అంటే తుమ్మలవారి దృష్టిలో 'దేవదూత' 'వేల్పు' 'జగచ్ఛాంతిదాత' 'విశ్వమానవ కల్యాణ విధి విధాత' 'అహింసా రణాచార్యుడు' భువన కల్యాణదాత' తల్లియు దండ్రియున్ గురుడు దాతయు నేతయు నెయ్యలియ్యముల్ చల్లెడు మిత్రుడున్ సచివ సత్తముడుత్తమ బంధువిశ్వసుండు." తుమ్మలవారి దృష్టిలో "రాముని సత్యము. కృష్ణుని ప్రేమము గౌతముని కరుణ పెనగొని యోగి గ్రామణి బాపూ బ్రతుకు'గా రూపుదిద్దుకొంది ! "ఇతడ హింసా పరాయణుడితడనంత భువన కల్యాణదాత." "ధర్మసంస్థాప నార్థమీ ధరణియందు బుట్టినటువంటి కృష్ణుడీపుణ్యుడన" శ్రీ తుమ్మల గాఢ విశ్వాసం ఆ కాలమ్మున గౌతము / డీకాలము నందు గాంధి యిద్దరు హింసా / వ్యాకుల జగతికి శాంతి / శ్రీకరులు దయా విధేయ జీవన నిరతుల్" ఆనాడు బుద్ధుడు - యీనాడు గాంధి - అహింసా మూర్తులు - శాంతిప్రియులు ! తెనుగులెంకకు "గాంధీజీ నవభారతస్రష్ట" సాత్త్విక నిరోధ సంగరస్రష్ట "వర్తమాన యుగాచార్య వర్యుడు" "అతని పల్కు- వేదము" కిరీటము వలవ నట్టి దేవదూత "ఋషి", "ఆచార్యుడు" "దేశికుడు" "అభేద్య సత్యకవచుడు" "భువనైక శాంతిదూత" "దేవుడు" "అవతార పురుషుడు"

తుమ్మల వారంటారు "బాపుగా కర్మయోగంబు రూపు దాల్చె" కర్మయోగంగా బాపూజీ పుట్టాడట ! అంటే— బాపూజీని ముందు చెప్పి తర్వాత కర్మయోగాన్ని పేర్కొనాలి !

అంటే- గాంధీజీ నూటికి నూరుపాళ్ళు - నిలువెత్తు - సిక్కారైన- "కర్మయోగి" అని అర్థం. గాంధీజీ అంటే అంతటి భక్తి విశ్వాసాలుండబట్టే- గాంధీజీవలె నిరాడంబరంగా- సత్యనిష్ఠా గరిష్టంగా- నిష్కల్మషంగా వైయక్తికంగా గాంధీజీ అడుగుజాడల్లో నడిచాడు. జీవించాడు. కవిగా బాపూజీ ఆత్మకథను- తెనుగులో కావ్యబద్ధం చేసాడు. జాతీయోద్యమ చరిత్రను 'మహాత్మ' కథగా మలచాడు. గాంధీజీ మరణించినపుడు 'అమరజ్యోతి' ఖండకావ్యాన్ని వెలయించాడు. ఎన్నో కవితలు- కవితా ఖండికలు రాసాడు. అప్పటికీ తృప్తిపడక- అవసానదశలో గాంధీజీ జీవితాన్ని "గాంధిగానం" పేరుతో మొత్తం మరలామంజరీ ద్విపదలో కావ్యంగా తీర్చిదిద్దాడు.

ముందుగా బాపూజీ ఆత్మకథను తెనుగులో కావ్యంగా మలచాడు. తర్వాత 'మహాత్మకథ' రాసాడు మహాత్మ కథాకావ్యం వ్రాయబూనినపుడు "ఈ సృష్టి నిర్విఘ్నమై తేజస్వంతమై సాగునట్లా మహాత్ముని పవిత్రాత్మ నాకెల్లయెడల వెలుగునిచ్చుగాక" అని బాపూజీని దైవసమానంగా సంభావించి తాను గాంధి కవితను వెలయించినట్లు విస్పష్టంగా పేర్కొన్నాడు.

పలికెడిది గాంధి కథయట
పలికించెడు వారు తెనుగు ప్రజలట దీనిం
బలికిన నూఱట యౌనట
పలికెదనిక నోండు మఱచి బాపు చరిత్రన్

పోతనామాత్యుడు భాగవతం రాస్తూ- 'పలికించెడువాడు రామభద్రుండట' అన్నాడు. కాని తుమ్మలవారు 'గాంధి కథ'ను పలికించెడువారు తెలుగు ప్రజలంటున్నాడు. పైగా - దీనిని పలికితే 'నూఱట' యౌనట అనిగూడా అంటున్నాడు. అంటే బాపూజీ అంటే ప్రజాబాహుళ్యానికి గాంధిజీ అంటే అంత భక్తి- అభిమాన

మున్నదన్న మాట ! గాంధీ కవికి సరే ! "ఊరట" యూనసుట ప్రజలకు అవునోకాదో చెప్పలేముకాని తుమ్మలవారికి మాత్రం అవుతుందన్న దాంట్లో సందేహం లేదు. గాంధీపట్ల నున్న 'వీరాభిమానం'తో గాంధి కవిత్వం రాయాలన్న 'ఆరాటం'తో 'వూరట' కలిగేది ఆయనకే. పోతనకు 'రామభక్తి' యెట్టిదో తుమ్మలవారికి 'గాంధిభక్తి' అట్టిది. పోతనకు రాముడు దేముడు. తుమ్మలవారికి 'గాంధి'— "వేల్పు" "ఈశ్వరుడు". పైగా యింకొక విషయంగూడా విస్పష్టంగా చెప్పాడు. "ఏ సూరినో పెరినో సుబ్బినో నిల్పి పచ్చి సింగారంబు పల్కుకంటె" "హేతువాదమ్మున కింత నిల్వగలేక బూతుల బుంగలై" కోతరాజేయునట్టి పురాణమ్ములన్ బూని వ్రాయుకంటె "గుణగరిష్ఠుల దేశభక్తుల చరిత్ర చెప్పుట జగద్ధితంబైన చేతగాదె" అని నిర్ద్వందంగా చెప్పాడు. అంటే పరోక్షంగా భావ కవిత్వాన్ని భావకవుల్ని ఆయన నిరసించాడన్న మాట ! రాయప్రోలువారి 'లలిత' దేవులపల్లివారి 'ఊర్వశి' నండూరివారి 'యెంకి'- ఆత్మాశ్రయ ప్రణయ కవిత్వానికి ప్రతీకలు. ఇలా ప్రేమ కవిత్వం రాయడం తనకు ఇష్టంలేదని ధ్వనించాడు. విశ్వనాథవారి 'రామాయణ కల్పతరువు' దృష్టిలో వుండియున్నదేమో 'కోత పుట్టించే పురాణాల జోలికిగూడా పోనన్నాడు ! గాంధీజీవంటి 'గుణగరిష్ఠుల దేశభక్తుల చరిత్ర' చెప్పడం తనకూ - ప్రపంచానికి శ్రేయమన్నాడు. గాంధి కవిత్వాన్ని వ్రాయటాన్ని తన్ను తానిలా సమర్థించుకొన్నాడు !

పైగా చేసిన పుణ్యమై తనకు జిక్కిన కైతఫలింత భక్తిమై" "ఆత్మకథ" వ్రాసినాడని చెప్పుకొన్నాడు. గాంధి కవిత రాయడం పుణ్యప్రదమన్నాడు. తాను చేసుకొన్న సుకృతమదియన్నది ధ్వనింప చేసాడు. "సత్యసంశోధనా సక్తి సందడింప బాపూజీ నిర్వహించిన బ్రహ్మచంద మేబదేండ్ల చరిత్ర 'మహాత్మకథ'గా తీర్చిదిద్దా

నన్నాడు. "ఆత్మపరిశోధనైక దృష్టితో సమగ్రముగనం దొరపిడి వహుచున్ ప్రకటించుకొన్న దాత్మకథ కేవల భక్తివిశ్వాసములకతన కృతజ్ఞతా సూచకమ్ముగా నభివర్ణించు నవీ మహాత్మకథ" అని సెల విచ్చాడు. ఆత్మకథ "తత్త్వసమీక్ష 'అయితే' మహాత్మ కథ కథా కావ్యమన్నాడు." మహాత్ముని పవిత్రాత్మ నాకెల్ల యెడల వెలుగు నిచ్చుగాక 'అంటూ' మహాత్ముని దివ్యాత్మ తనకు మార్గదర్శక మన్న భక్తివిశ్వాసములు ప్రకటించుకొన్నాడు. దీనినిబట్టి తుమ్మల వారికి గాంధి అంటే యెంతటి 'దైవీయభావమో' భక్తిప్రపత్తులో మనం అర్థం చేసుకోవచ్చు. ఆత్మకథ వ్రాసినప్పుడు ప్రముఖ సాహితీ విమర్శకుడు శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి శ్రీ తుమ్మలను" గాంధీ ఆస్థానకవిగా అభిభాషించాడు. "అభినవ తిక్కన" అన్న బిరుదు గూడా వచ్చింది. విశ్వనాథ అంతటివారు గూడా బిరుదాన్ని సమ ర్థించాడు.

గాంధి వ్యక్తిత్వాన్ని గురించి తుమ్మలవారి భావనయెట్టిదో చూడండి.

ఉత్తమ వాగ్మినా నొప్పారె నురక గ
ర్జించియా కాదు వర్షించి సుడులు
అతిలోక బలసమంచితుడయ్యె గండలు
పెంచియా కాదలయించి యొడలు
చిరజయశ్రీ ధురంధరుడయ్యె రిపుల ఖం
డించియా కాదు పండించి కృపలు
అమృతత్వమందె యాగము లాచరించియా
కాదు నిష్కామ యోగము వరించి
యతడు సామాన్యుడెట్లు వీరతకపూర్వ
జీవములువోసి వాసిదెచ్చిన మహాత్ము—డతడు.

గాంధీపలుకు వేదవాక్కు అయ్యింది అంటే ఆయన మౌనవ్రతం పూనడంవల్లనే! అవును మౌనముద్ర వహించి తపస్సుచేసే ఋషులు చెప్పే మాటలు ఋక్కులే గదా! నిరశన వ్రతాలతో దేహాన్ని కృశింపజేసి ఆయన అతిలోక బలసంపన్నుడయ్యాడు! కండబలం కన్న బుద్ధిబలమే మిన్నయన్నది గాంధి విషయంలో ఋజువయ్యింది రాజాధిరాజులను లొంగదీసుకున్నాడంటే ఖడ్గంతో వారిని దునుమాడి (ఖండించి) కాదు దయార్ద్రదృష్టులతో వారిని జయించాడు! క్రీస్తు ప్రభువు - గౌతమబుద్ధుడు 'కరుణాదృష్టి' వల్లనేగదా లోకాన్ని తమ పాదాక్రాంతం చేసుకున్నారు. గాంధీ విషయంలో గూడా అంతే! యజ్ఞయాగాలు చేసి ఆయన అమృతత్వం పొందలేదు నిష్కామకర్మయోగం వల్లనే! అదేకదా, భగవద్గీత నొక్కి చెప్పేది! ఇలా మౌనవ్రతంవల్ల - శరీరాన్ని కృశింపచేయడంవల్ల నిష్కామ కర్మయోగంవల్ల - శాంత్యహింసా (కరుణాస్వభావం) విధానంవల్ల గాంధీజీ యావత్ భారతదేశాన్నే కాదు యావత్ ప్రపంచాన్ని 'పాదాక్రాంతం' చేసుకొని 'అసమాన్య మహాత్ముడ' య్యాడని శ్రీ తుమ్మల అభివర్ణించాడు.

"మహాత్మకథ" వాస్తవానికి 'మహాత్ముని' జీవితగాథ కాదు. నిజానికది జాతీయోద్యమ చరిత్ర. దేశస్వాతంత్ర్యోద్యమానికి గాంధీజీ నాయకత్వం వహించిన నాటినుండి ఆయన హత్యగావింపబడిన నాటివరకు గల స్వరాజ్యోద్యమ చరిత్రను - గాంధీజీ మీది భక్తి విశ్వాసముల వల్లను - ఆయన జాతీయోద్యమానికి నాయకత్వం వహించినందువల్లనూ - గాంధీకవి 'మహాత్మకథ'గా కావ్యం రచించాడు.

నీ పల్కుగాక యీనిఖిల భారత మహీ
　　చక్రంబు ద్రిప్పు శాసనము గలదె
నీ యున్కిగాక పండిన పాపములనెల్ల
　　రాపాడు పుణ్యతీర్థమ్ము గలదె
నీకిన్కగాక మాఁసి గుండెలో చూఱి
　　చెడుగుపాడు పెకల్చు శిక్షగలదె
నీకూర్మిగాక నిర్నిద్రయోగ సమాధి
　　బడలి సంపాదించు పదవిగలదె
కలదె నీజీవన పథమ్ముగాకలోక
శర్మ సంపత్తి నొదవించు ధర్మశాస్త్ర
మద్వితీయంబు నీతపస్యా విధాన....ము.

గాంధీ పల్కు- యావత్ భారతానికి శిలాశాసనం! ఆయన దర్శన భాగ్యమే సర్వపాప పరిహారణం! ఆయన కోపం యెదుటివారి 'చెడుగు' ను చెండాడునట్టిశిక్ష! ఆయన కూర్మి- తపోసిద్ధి! ఆయన జీవనపథమే- లోకానికి శుభదాయక ధర్మశాస్త్రం!

"యుగయుగమ్ముల భారతోర్వీతపఃపుంజమెసరేగి జగములకిడిన పంట"గా తరతరమ్ముల నుండి తరలని దాస్యమ్ము కట్లుత్రెంచిన శాంతి కదనయోద్ధగా "నరనరమ్మున జీవనజ్యోత్స్నగా నహింసను సహించిన యోగిసత్తముడి"గా "పదపదమ్మున సత్యభాషా సనాతన సౌరభ్యములు చిమ్ము సాధుశీలుడి"గా మహాత్ముని విశిష్ట వ్యక్తిత్వాన్ని అభివర్ణించాడు తుమ్మలవారు. "చిరదాస్యమున క్రుంగి పిఱికివాఱిన జాతి కలవరించితివి సాహసికముద్ర" "మోకరించి కృపాణములు సలాములుసేయు నస్త్రమెత్తితివి సత్యాగ్రహంబు" అంటాడు. పిరికి బారిన భారతజాతికి ధైర్యసాహసాలు నూరిపోసాడు. కత్తులెత్తిన శత్రువులు గులాములై సలాముచేయు శక్తి ఆయన సత్యాగ్రహవ్రతమునకున్నది! "ఎవని సేవాత్యాగసవనంబు భారత మాతృదాస్యము మాన్చు మంత్రమయ్యె" ఎవని ధర్మంబు సర్వ

వసుంధరా ప్రజా సంతానమునకు మేల్బంతియయ్యె" అంటాడు. ఆయన నిస్వార్థ సేవానిరతివల్లనే గదా మాతృదేశం బంధవిముక్త మైనది ! ఆయన శాంత్యహింసా ధర్మమే లోకానికి ఆదర్శప్రాయ మైనది !

గుడుల కేగలేదు గుహలకు బోలేదు
ప్రజల నడుమ గడపె బ్రతుకునెల్ల
ఒడలు దేశసేవకెడద రామునిసేవ
కప్పగించి ముక్తినందె గాంధి" — అంటాడు

సన్యాసి (ముని)లా గుహలలో తపస్సు చేయలేదు. ప్రజల మధ్యనే జీవించి ఒకప్రక్క ప్రజా (దేశ) సేవ మరొకప్రక్క ఆధ్యాత్మిక చింతనచేసి ముక్తిగాంచి గాంధి ధన్యజీవి అయ్యాడంటాడు తుమ్మల గాంధీజీ రాజకీయంగా కాంగ్రెస్ కండగానుంటూ జాతీయోద్యమ సారథిగా దేశస్వాతంత్ర్యం కోసం పోరాట నాయకత్వం వహిస్తూనే- మరోప్రక్క సాంఘికంగా మరియు మతపరంగా వ్యక్తి జీవితాన్ని తీర్చిదిద్దటం లక్ష్యంగా పెట్టుకొని - ఆయన నెలకొల్పిన ఆశ్రమా లలో నిత్యకార్యక్రమాల సూత్రావళిని రూపొందించి - అమలు చేయించేవాడు. ఆచరణలో ఆయనే అందరికీ ఆదర్శప్రాయుడుగా వుండేవాడు. ఆ సూత్రవళి ఏమిటంటే

గాంధి పేర్కొన్న సప్తపాపాలు— 1) చిత్తశుద్ధిలేని రాజకీయాలు 2) శ్రమలేని సంపద 3) నీతిలేని వ్యాపారం 4) వివేకం లేని విద్య (ప్రయోజనకారి కాని చదువు) 5) ఆత్మదూరమైన ఆనందం (భౌతికానందం) 6) మానవతలేని శాస్త్రం 7) త్యాగం లేని ఆరాధన.

నిత్యజీవితంలో ప్రతివాడు పాటించవలసిన నియమాలు గాంధీ ఆశ్రమంలో విధిగా ఆశ్రమవాసులు తూ.చ. తప్పకుండ పాటించబడేవి, అవి ఏకాదశ సూత్రాలు.

అహింసా - సత్యఅస్తేయ - బ్రహ్మచర్య - అసంగ్రహ
శరీర శ్రమ - అస్వాద - సర్వత్ర భయవర్జన
సర్వధర్మ సమానత్వ - స్వదేశీ - స్పర్శభావనా-
వినమ్రవ్రత నిష్ఠాసేయే ఏకాదశ సేవ్యహై

1) అహింస 2) సత్యం 3) బ్రహ్మచర్యం 4) అస్వాదు (రుచికొరక కని తినకుండా వుండుట) 5) అస్తేయం (దొంగిలించక పోవడం) 6) అపరిగ్రహం—— (అవసరం లేని వస్తువుల్ని పరిగ్రహించడం) 7) అభయం (నిర్భయం) 8) అస్పృశ్యతా నివారణం 9) శరీర పరిశ్రమ (కాయకష్టం - భుక్తిశ్రమ) 10) సర్వమత సమభావం - (మతసహనం - పరమత గౌరవం) 11) స్వదేశి (దేశీయత - జాతీయత)

ఇకపోతే - 1934లో 18 అంశాల (అష్టాదశ) దేశపునర్ నిర్మాణ కార్యక్రమం గాంధీజీ రూపొందించారు—— 1) మతసామరస్యం 2) అస్పృశ్యతా నివారణం 3) మద్యపాననిషేధం 4) ఖాదీ ప్రాముఖ్యత- 5) గ్రామ (కుటీర) పరిశ్రమలు 6) గ్రామ పారిశుద్ధ్యం 7) బేసిక్ విద్య 8) వయోజన విద్య 9) స్త్రీవిముక్తి 10) ఆరోగ్య నియమావళి శిక్షణ 11) స్వదేశీ 12) ఆర్థికసమానత 13) రైతు జీవిత వికాసం 14) కార్మిక సమైక్యత - సంక్షేమం 15) జాతీయభాష 16) ఆదివాసుల వికాసం 17) కుష్ఠురోగుల సేవ 18) విద్యార్థుల జాగృతం. గాంధీజీని 'త్రికరణశుద్ధి'గా నమ్మిన తెనుగులెంక యీ గాంధీజీ ఆశయాలను త్రికరణశుద్ధిగా నిజజీవితంలో పాటించారు. కాప్రాసు వినయాశ్రమంలో నడిపిన తిలక్ జాతీయ పాఠశాలలో యీయన తెనుగు బోధించారు. విశ్రాంతి సమయాలలో చుట్టుపక్కల గ్రామాలు తిరిగి ఖద్దరు వస్త్రాలు అమ్మారు. గాంధీజీవలె తుమ్మలవారు నిరాడంబరంగా స్వయంగా జీవితాంతం 'ముతక' ఖద్దరు ధరించారు! పొరుగూరు వెళ్ళితే

తన సంచిని తానే మోసుకొనిపోయేవాడు! తనతోపాటు 'దంపుడు బియ్యం' పట్టుకెళ్ళి విడిదిచేసిన 'అతిథేయుల గృహం'లో అన్నం వండించుకొని తినేవాడు. గాంధీజీలాగా 'అర్ధపక్వశాకాదులనే' భుజించేవాడు. మాంసాహారం పూర్తిగా నిషిద్ధమాయనకు. గాంధీజీ చెప్పిన "అస్వాదు" అంటే యిదే కదా!

గాంధీజీ ఆశయం హరిజనోద్ధరణం! "నన్ను బ్రతికింప నెంతురేని అన్నలార / చంపుడ స్పృశ్యతను దీని సాకనిచ్చ/గింతురేని ననుంజంపుడని" "నామరూపాలు లేక హిందూమతమ్ము క్రుంగి కూలిపోయిన నియ్యకొందుగాని యంటరానితనమ్ము ఘోరాఘమెల్ల కాలమంటకు నోడబడజాలనేను" ఈ ప్రపంచమెల్ల నెదురైన మత్ప్రాణ మప్పగించియైన నంటరానితనము పేర భారత సవిత్రి కడుపున జిచ్చుపెట్టువారి జెనకి నిల్తు" (మహాత్మకథ) అని గాంధి నొక్కి చెప్పాడు.

దక్షిణాఫ్రికాలో నుండగా భార్య కస్తూరిబాయి మొదట వ్యతిరేకించినా ఒక హరిజన క్రైస్తవుడికి గాంధీజీ తన యింటిలో ఆశ్రయం యిచ్చాడు. భారతదేశం వచ్చాక- అహమ్మదాబాదులో సబర్మతీ ఆశ్రమంలో అగ్రకులాలకు చెందిన ఆశ్రమవాసులనుండి మొదట తీవ్రవ్యతిరేకత వచ్చినా గాంధీజీ అస్పృశ్య కులానికి చెందిన ఒక నిరుపేద - కుటుంబాన్ని ఆశ్రమంలో చేర్చుకున్నాడు గాంధి. "లక్ష్మి" అనే ఒక హరిజన బాలికను గాంధీజీ పెంచి పెద్ద చేసాడు. ఢిల్లీలోవున్న రోజుల్లో పాకీవాడలు "భంగి" కాలనీల లోనే గాంధీజీ మకాం చేసేవాడు. అస్పృశ్యులు గూడా అందరి లాగా దేవుని బిడ్డలే అని సాటి భారతీయులకు నచ్చచెప్పటానికి పంచములకు "హరిజను"లు అని పేరు పెట్టింది గాంధీజీ. ఇందుకు డా॥ అంబేద్కర్ తీవ్ర అభ్యంతరం తెలిపాడనుకోండి అది వేరే

విషయం! "హరిజన్" అనే పత్రికనుకూడా గాంధీజీ నడిపారు. ఒకప్రక్క స్వరాజ్యోద్యమానికి నాయకత్వం వహించి ఉధృతంగా ఉద్యమం నడుపుతూనే- 1935 సం-కి హరిజనోద్ధరణ కార్యక్రమం ముమ్మరంచేసి హరిజన సేవక సంఘం స్థాపించి - దేశంలోని గ్రామాలందున్న హరిజనవాడల పారిశుధ్యం హరిజన బాలబాలిక లకు విద్యావ్యాప్తి తదితర కార్యక్రమాలు కొనసాగించారు.

సోదరుల మాలలను దయాహీనవృత్తి నణగద్రొక్కుట పాడికాదయ్య" అని హెచ్చరిస్తూ "అంటరానితనము గెంటిన నాడు హిందూ సమాజమునకు వాసివచ్చు"నని హితం చెబుతారు తుమ్మలవారు. ఆయన వ్యక్తిగతంగా అస్పృశ్యతను పాటించ లేదు! అందుకొక చిన్న వుదాహరణ :- అస్పృశ్యతా దురా చారం ప్రబలంగా ఆచరిస్తున్న రోజుల్లో - గాంధీజీ యింకా హరిజనోద్ధరణోద్యమం ముమ్మరంగా చేపట్టకముందే— నిజాంపట్నం సముద్ర స్నానానికి వెళ్ళినప్పుడు కావూరులో పుట్టి నిజాంపట్నం కోడలిగా కాపురానికొచ్చిన ఓ హరిజన (మాదిగ) యువతి కనిపించింది. తన్నుతాను పరిచయం చేసుకొంది. మాటల సందర్భంలో ఆయన అన్నం తినలేదని గ్రహించింది! తాము అంటరానివారమని ఆవిడ బాధపడుతుండగా "నీవ నీ యింటవండి వడ్డింపుము తినెదనిండు వేడుకను నాయుల్ల మిట్టిభేదములు మన్నిం చునది కాద"ని అన్నారు ఆమె ఆశ్చర్యపడింది. భయపడింది. అయినా తుమ్మలవారు పట్టుపట్టడంవల్ల యింట్లో వంటచేసి పెట్టింది "పేరునేయి ముంతపెరుగు చిక్కుడుగాయ కూర యెఱ్ఱగడ్డకారం" "యింకేమి కావలయుననుచు" తుమ్మలవారు తృప్తిగా ఆమాతంగ గృహంలో కమ్మని భోజనం భోంచేసారు! తుమ్మలవారికది 'మఱవ రాని దినం' అయింది! ఈ సంఘటన గురించి చెబుతూ అది తనకు

'జ్ఞానస్నానము'ని అభిభాషించాడు ! ఈ సంఘటన గూర్చి తన 'నాకథలు'లో వివరించాడు.

గాంధీజీ మద్యపాన నిషేధం కావాలని గట్టిగా కోరాడు మద్యపానంవల్ల పేదకుటుంబాలు కూలిపోతున్నాయని మద్యనిషేధం చేయాలన్నాడు. తుమ్మలవారు గూడా మద్యనిషేధాన్ని సమర్థించాడు. "నీతినిజాయితిసిగ్గు విడిచి" 'అణుమాత్రము సిగ్గులేక' 'బుద్ధిబలకాయ బలమ్ములు పూపుపూపి' చేతికి చిప్పనిచ్చు - మధు సేవ 'తగదు తగదని' తుమ్మలవారు హెచ్చరిస్తున్నాడు. గాంధీ జీవితం మద్యం ముట్టలేదు. గాంధీ కవికూడా ముట్టలేదు.

గాంధీ అత్యంత ప్రాధాన్యత నిచ్చింది సత్యనిష్టకు ! 'సత్యమేదైవ' మన్నది ఆయన నమ్మకం (Truth is God.) తన ఆత్మకథ (ఆటోబయోగ్రఫీ)కి "మదీయ సత్య సంశోధన" లేక "ఆత్మశోధన" (My Expe iments with Truth) అని పేరు పెట్టుకున్నాడు.

చిన్నతనంలో గాంధీజీ సత్యహరిశ్చంద్ర నాటకం చూసాడు. 'సత్య' నిష్ట అంటే ఆయనకు చిన్ననాడే గాఢంగా మనస్సులో నాటుకుంది. చిన్నతనంలో చెడుస్నేహం వలన ఆయన సిగరెట్టు పొగ పీల్చాడు. మాంసం తిన్నాడు. తానుచేసిన పని 'చెడ్డ'దని గ్రహించాడు. చిన్నతనం కనుక తండ్రికి చెప్పే ధైర్యం చాలలేదు; తానుచేసిన తప్పు కాగితంమీద వ్రాసి తండ్రి టేబుల్ మీద పెట్టాడు. తండ్రి చూచి కుమారుని క్షమించి యిలాంటి చెడ్డపను లెప్పుడిక చేయవద్దని నోముగా మందలించాడు. ఇక జీవితంలో గాంధీజీ జీవితాంతం అబద్ధమాడలేదు. మాంసం తినలేదు. సిగరెట్టు త్రాగలేదు. మద్యం ముట్టలేదు. "సత్యమే" ఆయనకు దైవమైనది ! దైవమేకాదు సత్యం అంటే గాంధీకి 'ప్రాణం' 'ఊపిరి ! సత్యనిష్టకు గాంధీజీ యిచ్చినంత ప్రాముఖ్యత మరేదానికి యివ్వలేదంటే

అతిశయోక్తి కాదు; అహమ్మదాబాదులోని సబర్మతీ ఆశ్రమం గాంధీజీ మొదటపెట్టిన పేరు "సత్యాగ్రహ ఆశ్రమం" తనకు నచ్చక - అంగీకారం కాక, తాను తెలిపే నిరసనను, తాను చేపట్టిన అనంగీకార చర్యను గాంధీజీ 'సత్యాగ్రహవ్రత' మని పేరు పెట్టాడు. గాంధీజీకున్న యీ 'సత్యనిష్ఠ' 'త్రికరణ శుద్ధి' గుణం బహుశా, గాంధీజీని జాతీయోద్యమ నాయకత్వానికి దోహదం చేసిందనీ, రవి అస్తమించని బ్రిటీషు పాలకులను ఎదుర్కొని స్వరాజ్యం సాధించడంలో బాగా తోడుపడిందని మనం గమనించవచ్చు !

గాంధీకున్న సత్యనిష్ఠ తుమ్మలవారిని ఆకట్టుకొంది! కన్నతండ్రి నారయ్య నీతిమంతుడు. ఆయన తన కొడుక్కి 'నీతి నేర్పె ధర్మనిరతి నేర్పె నుదారసరణి నేర్పె జపసంధ్య నేర్పె.' అందుకే ఆయన చెప్పుకున్నాడు "సత్యనిష్ఠ నాకు సాజముగాన మో / మోటలేని కూచి మాట నాది" అని. కనుకనే "మచ్చమసక లేని మనుగడ నర్థించి మలగినాడ వెతలనలగినాడ" అనీ చెప్పుకున్నాడు. గాంధీకవి సత్యనిష్ఠకొక ఉదాహరణ - పల్లీలమ్ముకొని బ్రతికే ఓ పేదవాడు తుమ్మలవారుంటున్న యింటికెదురుగా వుండేవాడు అతడికీ యీయనకు స్నేహమేర్పడింది "ముక్కుపొడుం" మూలంగా ! అతడికి డబ్బు దాచుకొంటానికి బీరువా లేదు. ఐదు వేలు రూపాయలు చెక్కపెట్టిలో పెట్టినవి మాయమైనవని ! ఆ పేదవాడు కీలాపడ్డాడు! "కొంపమునిగిందని" గగ్గోలు పెట్టాడు. తుమ్మలవారికి చెప్పుకున్నాడు. పెట్టెలో డబ్బుమూట పొరపాటున చాపక్రింద పెట్టి పల్లీకాయ లమ్ముకుంటానికి వెళ్ళాడు ! ఆ సంగతి అతడికి గుర్తులేదు ముక్కుపొడుంకోసం వెతుకుతుంటే ఆ మూట తుమ్మలవారి కంటబడింది "దిగులుపడకుమయా - యింత మతిమరుపు తగునా" అని మందలిస్తూ ఐదు వేల రూపాయల గుడ్డమూట యిచ్చాడు. తుమ్మల

వారు 'నీతిగలవారు' కనుక డబ్బు యిచ్చాడు! ఇవ్వక తానుంచు కొంటే పల్లీ కాయలవాడికి నష్టంకాని తుమ్మలవారికి లాభమేగదా! 'ధనమూల మిదమ్ జగత్' అన్నారు. ధనం పాపిష్టిది కనుక. ధన విషయంలో ఎవర్నీ నమ్మకూడదంటారు. అయితే తుమ్మలవారి విషయంలో 'నమ్మ' వచ్చన్న నగ్నసత్యం తెలిసింది. ఆయన నిజా యితీ ఋజువైనది! గాంధీజీ బోధించిన "అస్తేయమ"ంటే యిదే కదా. ఇలాంటిదే యింకో సంఘటన. వయస్సులో ఉన్న తరుణంలో తుమ్మలవారికి చిరుతిండి తినే దురలవాటుండేది! చిరుతిను బండా శాల కొట్లో ఖాతా పెట్టాడు. నెల పూర్తిఅయ్యాక బాకీ యెంత అన్నాడు పద్నాలుగు రూపాయల యిరవైపైసలన్నాడు కొట్టువాడు. కాదు నీ లెక్క తప్పు నా లెక్క ప్రకారం పదహారు రూపాయలంటూ బాకీ మొత్తం తీర్చివేసాడు. బేరగాడు "వెల్ల బాతి" / తెల్లబోయి "మీవంటి మహాత్ములెందఱుందురని" తుమ్మలవారిని మెచ్చు కొంటూ కృతజ్ఞతలు తెలియజేసాడు! కొట్టువాడు చెప్పినట్లు పద్నాలుగు రూపాయలిచ్చివుంటే - తుమ్మలవారికి రెండు రూపా యలు మిగిలివుండేవి! కాని 'సత్యనిష్ట' కలవాడు కనుక ఖచ్చితమైన బాకీసొమ్ము మొత్తం తీర్చివేసాడు— ఎంతైనా 'నీతిపరుడైన' నారయ్య కొడుకుగదా? మీదు మిక్కిలి గాంధీజీ అనుయాయుడు గదా! ఇటువంటి నిజాయితీ సంఘటనలు తుమ్మలవారి జీవితంలో ఎన్నో!

గాంధీజీకి పాకీపనిచేసే 'బంగీ'లంటే సానుభూతి ప్రేమ. మనిషి విసర్జించిన పెంట (విష్ట)ను మరొక సాటిమనిషి శుభ్రం చేయుట హేయమైనపని అని ఆయన విశ్వాసం. దక్షిణాఫ్రికాలో ఉండగా ఒకనాటి పాకీవారి సమ్మెవల్ల 'మరుగుదొడ్లు' కంపెత్తిపోయి ఆరోగ్యభంగమేర్పడిన దుర్భరపరిస్థితుల్లో భార్య "కస్తూరిబాయి"

వ్యతిరేకించినా గాంధీజీ మరుగుదొడ్లు శుభ్రం చేశాడు. ఢిల్లీలో మకాంచేసినప్పుడల్లా ఆయన 'భంగీల' కాలనీలోనే బసచేసేవాడు. సబర్మతి ఆశ్రమ ప్రాంగణంలోని మరుగుదొడ్లు ఆయన స్వయంగ శుభ్రంచేసిన సందర్భాలున్నాయి. గాంధీకవి అయిన తుమ్మలవారు పాకీపనివారిపట్ల 'సానుభూతి' కనపరచారు ! "కలమెత్తిన హాల మెత్తిన మలమెత్తిన వారినొక్కమై జూడవలెన్" అని వృత్తి గౌరవం గూర్చి అభిభాసించాడు. "మఱుగుదొడ్డి నూడ్చిమనెడి పాకీకంటె మణికిరీటధర్త ఘనుడుగాడు"— పాకీవానికంటె "ప్రభువు" గొప్పకాదని అభిభాషణ "మలమునెత్తగా సమాజ మందొకవర్గ ముంటవలయునంట యొప్పజాలన"ని గాంధీజీ పాకీ వృత్తి నిర్మూలించాలని ఆనాడు 'సెప్టిక్ లెట్రిన్స్' వున్నాయో లేకో కాని, ఎవరి 'మలమూత్రాల్ని' వారే గుంటతీసి పూడ్చివేయా లని తన సర్వోదయాశయాలలో పేర్కొన్నాడు !

తుమ్మలవారు స్వయంగా పాకీపనిచేసిన సంఘటనలు గూడా వున్నాయి మచ్చుకొకటి— ఆయన పనిచేసిన పాఠశాల వూరికి కాస్తదూరంలో వుండేది. సంధ్యాసమయంలోను - ప్రభాత సమ సమయంలోను ఆవూరివారు స్కూలుకుపోయే దారిలో "దొడ్డికి" కూర్చునేవారు. ఆదారిపొడవునా దుర్గంధభూయిష్టంగా వుండేది ! ఆ ప్రాంతమంతా 'నరకకూప' మయ్యింది. అదిచూచి తుమ్మలవారు సిగ్గుపడ్డాడు. స్కూలు గంటకొట్టక ముందుగానే స్కూలుకెళ్ళి మల మెత్తేవాడు. ఈయన చేసిన హేయమైనపనికి కొందరు 'నవ్వారు' కొందరు ఆశ్చర్యపడ్డారు. ఒకనాడు ప్రొద్దుక్రుంగిన తర్వాత కొంద రాడవాండ్రు 'దొడ్డి' కచటకేతెంచారు. వారిని అర్థించాడు పాఠశాల 'పవిత్రస్థలం జ్ఞానపీఠం ఇచట మలం విసర్జించుట పాడి కాదు' అని అల్లంతదూరాన 'రెండుగుంటలు' త్రవ్వాను మీరచట

నా కాలకృత్యము తీర్చుకోవచ్చు అని మరీమరీ వేడుకొన్నాడు. ఆయన విశ్వాసం మన్నించి ఆనాటినుండి ఆవూరి ఆడా మగా చిన్నా పెద్దా - మొదలా ఆ పాఠశాల మార్గంలో మలవిసర్జన చేయడం మానివేసారు! అదంతా తుమ్మలవారిమీద గాంధీ మహాత్ముని ప్రభావమే గదా!

గాంధీజీ స్త్రీ జనాభ్యుదయం కోరాడు. స్త్రీలు విద్యావంతులు కావాలనీ, పురుషులతో సమాన గౌరవం కలిగివుండాలనీ ఆయన ఆశయం. తల్లులవలె కూతులవలె / జెల్లెంద్రవలెన్ సమస్త సీమంతినులన్ / మల్లీమంజరికెనయగు / నుల్లముతో" గాంధీ స్త్రీలపట్ల గౌరవభావంతో మెలిగాడు. వందసంవత్సరాలకు పూర్వం స్త్రీని కేవలం "వంటయిట్టి పనిముట్టు"గా చూస్తున్న రోజుల్లో గాంధీజీ తన భార్యను గౌరవంగా చూసాడు. ఆమె మాట మన్నించాడు. ఆమెకు స్వేచ్ఛనిచ్చాడు తన ధర్మబద్ధ నిర్ణయానికి, ప్రజాహిత కార్యాచరణ విధానానికి - ఆమె అడ్డుచెప్పిన సందర్భాలలో ఆమెమాట త్రోసి రాజన్నరోజులున్నాయనుకోండి. సరోజనీ నాయుడువంటి దేశనాయకురాండ్రతో ఆయన గౌరవంగా - వారి సలహాలను తీసుకొంటూ - మెలిగాడు.

గాంధీకవి గూడా గాంధీ అడుగుజాడల్లో నడిచాడు. "మగవారలెంత చెడినను మగువలు రక్షించుచున్ద్రు మన ధర్మంబున్" అని అభిభాషించాడు. ఇంటిని, పెనిమిటినీ - పిల్లల్ని కాపాడేది స్త్రీలోని "యిల్లాలితనం" "పతివ్రత ధర్మమే! అందుకే ఇంటికి యిల్లాలే దీపమన్నారు. భారతీయ వైవాహిక వ్యవస్థపట్ల - ఆదర్శ దాంపత్యంపట్ల బాపూజీకెంతటి గౌరవమో గాంధీకవి'ని అంతియే" వలపు ధర్మపుకూడి వివాహరూపమందుకొనె భారతీయ గేహమ్మునందు 'అని తుమ్మలవారి అభిభాషణ' 'మగువల' ధీరతావైభమ్ము-

వితరణ సాహసంబు - యింద్రియ నిగ్రహమ్ము - వివరించటానికి మాటలు చాలవంటాడు శ్రీ తుమ్మల. "సాహసికు నాశ్రయం బాత్మ శక్తికిరవు కరుణకున్ ప్రేమమునకున్ గాణయాచి" అని గాంధీకవి అభిభాషణ ! "సంయమనమ్మున కాకృతి, చాగమునకు మూదల, అహింసకున్ నెత్తావాదు నెలది" అనీ తెనుగుచరిత్రలో నతివ తేజము దొడ్డదంటాడు తెనుగు లెంక ! "కలిమిలేములలో భాగంబుగొనుచు, మంచిచెడ్డలలోన పాల్పంచుకొనుచు మెలగు నర్థాంగి" మగనికాధారమని గాంధీకవి అభినుతించాడు.

మతసామరస్యం - పరమత గౌరవం - హిందూముస్లిం సఖ్యతల్ని గాంధీజీ నొక్కివక్కాణించాడు. "ఈశ్వర అల్లా తేరేనాం" అన్నది గాంధీ నిత్యప్రార్థనా గీతావళిలోని ముఖ్య నినాదం ! నౌకాళీలో - బెంగాల్ - బీహార్ - ఢిల్లీలలో 'హిందూ - ముస్లిం మధ్య' పెద్దగా హింసాకాండ ప్రజ్వరిల్లినపుడు - గాంధీ సత్యాగ్రహం చేశాడు. హింస, విధ్వంసకాండ చెలరేగిన నౌకాళీ మొదలగుచోట్ల స్వయంగా శాంతియాత్రలు చేశాడు. "దేశాన్ని చీల్చి పాకిస్తాన్" విభజనకు "నాశరీరాన్ని రెండుముక్కలుచేసి తర్వాత దేశాన్ని విభజించండ"ని నాటి దేశనాయకులను హెచ్చరించాడు. ముస్లింలంటే గాంధీకి ఎక్కువ అభిమానమనే హిందూ మతోన్మాది ఆయన్ని కాల్చిచంపాడు. తుమ్మలవారి గాంధీ ఆశించినట్లు "హైందవులు ముస్లిములు సిక్కులన్నదమ్ములట్లు "జీవించాలని ఆకాంక్ష వెలిబుచ్చుతాడు.

గాంధీజీ నూలు వడకడానికీ ఖద్దరు వాడకానికీ అధిక ప్రాధాన్యత యిచ్చాడు. "నూలుతీత నాకనుత్తమ విధి; విడరాని చేత; యందు దీనుజూతు" అని గాంధీజీ ఉవాచ ! గాంధీజీ నిత్య కృత్యాల్లో 'చరఖామీద నూలువడకడం ! ప్రధానమైనది. సేవా

గ్రామంలోను, సబర్మతీ ఆశ్రమంలోను ఆశ్రమవాసులు - రాట్నం మీద నూలుతీయడం ముఖ్యమైన నిత్యకృత్యం. ఆనాడు గాంధీజీ ప్రభావంతో దేశంలో ప్రతిగ్రామంలోను చాలా గృహాలలో రాట్నంమీద నూలువడకడం నిత్యకృత్యమైనది. ప్రతివారూ రాట్నంమీద నూలువడకాలనీ ఆ నూలుతో నేసిన ఖద్దరు మాత్రమే భారతీయులు ధరించాలనీ గాంధీజీ "స్వదేశీ" సూత్రం! గాంధీజీ 'చరఖానూలు' ప్రచారం - ఆచరణ - ఆనాడు విదేశీవస్త్రధారులకు - మిల్లు నూలు యజమానులకు 'కంటక' ప్రాయమైనది. కొంత నిరసన వ్యతిరేకత కూడా వచ్చింది. అయితే గాంధీ వ్యక్తిత్వం - గాంధీ నిర్ణయం ముందు అవి నిలవలేదు.

గాంధీజీవలె గాంధికవి ముతకఖద్దరునే వాడాడు. కావూరు వినయాశ్రమంలో నుండగాను - తర్వాత ఉపాధ్యాయుడిగానున్న మొదట్లో తుమ్మల రాట్నంమీద నూలువడికాడు. "మగ్గములు రాట్నములు మన మందిరముల (గృహముల) నాడవలయునని" కదురుగల-చోట, కవ్వంబు కదులు-చోట కరువు' లుండవంటాడు శ్రీ తుమ్మల. "ఖద్దరు పేదలకున్ పెన్నిధి అది జాతీయతకు చిహ్నమ'ంటాడు తెనుగులెంక! కావూరి వినయాశ్రమంలోని తిలక్ జాతీయ పాఠశాలలో ఉపాధ్యాయుడిగా పనిచేసినపుడు సెలవు దినాల్లో కావూరులోని చుట్టుప్రక్కల గ్రామాలలోను ఖద్దరు వస్త్రాలు అమ్మాడు గాంధికవి.

గాంధీజీ గ్రామస్వరాజ్యం - రామరాజ్యంగా కలలుకన్నాడు. మనదేశంలో పట్టణాలకంటే పల్లెలే - గ్రామాలే అధిక సంఖ్యలో వున్నాయి కనుక గ్రామాభ్యుదయం ఆకాంక్షించాడు గాంధీజీ. గ్రామాల అభివృద్ధి సేద్యం - కుటీర పరిశ్రమలమీద ఆధారపడి వుంది. కనుక గ్రామాలలో కుటీర పరిశ్రమలు నెలకొల్పబడాలనీ-

రైతుల జీవనవికాసం వర్ధిల్లాలనీ గాంధీజీ నొక్కిచెప్పేవాడు. "పొండి పల్లెలకు" (go to villages) అన్నది గాంధీజీ పిలుపు. "భారత సవిత్రికి నాయువుపట్టులైన" పొలములు మన్నుడని రైతులకు విజ్ఞప్తి చేసాడు. ఆర్తప్రాణబంధుడు రైతే రాజ్యంబున కష్టుడ"ని గాంధీ నొక్కిచెప్పాడు.

రైతు కుటుంబంలో పుట్టి - గాంధీ ఆశయాలతో జీవించిన శ్రీ తుమ్మల రైతులప్రగతి, కుటీర పరిశ్రమల అభివృద్ధికోరి ఎన్నో కవితలల్లాడు! "రైతేకదా దేశమునకు వెన్నెముక" అనీ "కాపే కదా లోకకల్యాణదాత" అంటూ శ్రీ తుమ్మల కర్షకునికి పట్టం గట్టాడు "మన కుటీరపరిశ్రమల్ మనుచుకొన్న నుండునా దేశ మున నిరుద్యోగ బాధ" అంటాడు మనకవి. 'కుమ్మరికి గమ్మరికి దిండికొఱత వడిన 'గ్రామసీమలు బాగుపడవంటాడు! "చేతిపను లింటనింట భాసిల్ల" వలయుననీ "పల్లెకొక పాఠశాల" నెలకొల్ప బడాలనీ- "వాడవాడ నొక్క వైద్యు"డుండాలనీ "బస్సునకు బండి కనువైన బాటలు" గ్రామసీమలకు వేయాలనీ శ్రీ తుమ్మల అభి భాషణ! గ్రామప్రాంతాలు 'బాగు' పడాలంటే - రైతుజీవితం, గ్రామపరిశ్రమలు వృద్ధిచెందడమే కాదు - ప్రతిపల్లెలో విద్యా వ్యాప్తికి 'పాఠశాల' ఆరోగ్య పరిరక్షణకు "వైద్యశాల" బస్సు సౌకర్యం రోడ్డురవాణా సౌకర్యం తప్పనిసరిగా వుండాలనీ -గాంధీజీ ఆశయాలను గాంధీకవి నొక్కి చెబుతాడు.

గాంధీజీ జాతీయ సంపద ఒకరిసొత్తుకాదని అది అందరిసొత్తని నొక్కి చెప్పాడు. అలానే అక్రమార్జనతో కూడబెట్టిన సంపన్నుల 'సంపద' గూడా జాతీయ సంపదే అంటాడు గాంధీజీ. ఆ విషయాన్ని తెనుగులెంక "సంపన్నులు తమ బంగరు గంపలకున్ దాము ధర్మ

కర్తలయుని భావింపవలయు"నని ఛందోబద్ధంగా చెప్పాడు. అందుకే అంటాడు "దాపరాదు నరుడు తన యక్కఱ"కు మించి అంటాడు.

గాంధీజీ "శరీరపరిశ్రమ" గూర్చి నొక్కి చెపుతాడు. "పరాన్నభుక్కులు" సోమరిపోతులు ఎవరూ కాకూడదని ఆయన భావన! అందుకే గాంధిజీకి రస్కిన్ వ్రాసిన "unto This Last" రచన బాగా నచ్చింది. దాన్నే గాంధి "సర్వోదయ" మన్నాడు. శరీరపరిశ్రమ - వృత్తిగౌరవం సర్వోదయ సిద్ధాంతం. గాంధిజీ "Bread Labour" (భుక్తిశ్రమ)కు అనేకప్రాధాన్యత నిస్తాడు. ప్రతి వారూ కాయకష్టంచేసి తమ 'భుక్తి' సంపాదించుకోవాలనీ ఆయన ఆశయం. గాంధిజీ ఆశయాన్ని గాంధికవి— "శ్రమపడుచే జాతికి సిరి - శ్రమపడుచే రాజ్యమునకు సంపద" అనీ "చెమటనోడ్చి నరుడు జీవింపదగుగాని తేరసామ్ము మెక్కి బ్రతేపరాదని" కవితరీతిలో చక్కగా చెప్పాడు.

సత్యనిష్ఠతోపాటి 'శాంత్యహింసా' మార్గాన్ని బాపూజీ అనుసరించి ఆచరించి ఆదర్శప్రాయుడైనాడు. శాంతిమార్గాన్నే 'రవి అస్తమించని బ్రిటీషు సామ్రాజ్యనిపతుల లొంగదీసుకున్నాడు. స్వరాజ్య సాధనకు మూలపురుషుడయ్యాడు. ఈ శాంత్యహింసా విధానాన్ని గాంధికవి కూడా సమర్థించాడు; అనుసరించాడు. "ప విప్లవమునకైనను జీవమహింసా వ్రతంబెచిరతరమగు" నంటాడు "సర్వోదయ మార్గమ్మున నుర్వికిదేవలయు శాంతి' నంటాడు "వినయము సత్యమహింసా ప్రణయము లేనప్పుడెన్ని భాగ్యము లున్నన్" దనుజునకు మనుజుడు 'అనుంగు తమ్ము'డౌతాడని చమత్కరించాడు.

ఈ విధంగా బాపూజీ ఆశయాల్ని ఆకళించుకొని - అణు వణువున జీర్ణించుకొని కవితాభినివేశనంతో 'గాంధి' గానం చేసాడు

తుమ్మలవారు. గాంధీ హత్యచేయబడిన 30-1-48 రోజుని 'మర్దినం' గా పేర్కొన్నాడు. "సిన్నం గొల్చినట్లు కాల్చి సిను ఫ్లాస్ చేసిరే గోముఖ వ్యాఘ్రములు వేషమోముఖ విషప్పాలుల్ దయాసూనృతసక్కన్నుల్" అని కన్నీరుమున్నీరుగా కవితాగానం చేసాడు.

బాపూజీ మరణానంతర భారతదేశంలో నెలకొన్న దుస్థితికి గాంధికవి మనోవేదన చెందుతాడు. "ఇంతటి గాంధి నేడు గూడ కెంతయు దవ్వాయిపోయె వాని సిద్ధాంతము విస్మరించితి మనము !' అని వాపోతాడు— 'గాంధితో నడంగె కర్తవ్యనిష్ఠ' అంటూ భారతోర్విని పుడు పదవులకాట్లాట తక్కనేమి గలదు నిక్కమరయ' అని నిష్కర్షగా యదార్థం మాట్లాడాడు 'త్యాగమును మరచి రన్నలు భోగమ్ములకై రణాలబ్బుంగిరి' అని వాపోతాడు.

గాంధీ మరణానంతరం వచ్చిన గాంధీ శతజయంతినాడు 'ఎవరు బాబూ నీవు యింతడస్సియున్నావు ! నడచినడిచి అసు రుసులై తడిచెమటల వచ్చితివి' అంటూ 'మహాత్మునిపై నున్న మమకారంతో' గాంధివచ్చినట్లు తీయని కలకంటాడు. "అచ్చముగా నీవు మహాత్ముడవే ! అనుమానం లేదు లేదు ! రమ్మురమ్మిస్వామి మాగృహము పావనమ్ముసేయ రమ్మురమ్ము' "ఉండుముండుము స్వామీ ! యీ ఖద్దరునూలు దండ నీమెడలో వేయనీ ! ఈకట్టి లేని మేకపాలు స్వామీ ! దెచ్చితిమి స్వీకరింపుము "భక్తికావలసి నంతకలతగాని భవదుపదిష్ట ధర్మాచరణముపట్ల రక్తియే కొఱవడినది మాకు బాబూ !" అంటూ పూజ్య బాపూజీని సంస్మరించు కొంటాడు. గాంధీ అంటే తుమ్మలవారికి అంత భక్తి !

గాంధిజీ అంటే యింతటి భక్తిప్రపత్తులున్న గాంధికవికి 'గాంధిలోవున్న' లౌక్యం శాంతస్వభావం కాస్త కొరవడిందనిపిస్తుంది !

ఈయన 'ముక్కుసూటి మనిషి' నచ్చకపోతే - యెదుటి మనిషైన విషయమైన గిట్టకపోతే 'కస్సుబుస్సు' మనే తత్త్వం! అదీ క్షణ భంగురం! పోతే - రూపం చూస్తూ - గాంధీజీ 'నకళ్ళ' వున్నట్లు తోస్తుంది! గాంధీజీకంటే గాంధికవి కాస్తపొడగరి అనుకోండి! గాంధీజీ కంటే షుమారు నాలుగు దశాబ్దాలుపాటు ఎక్కువ జీవించాడు శ్రీ తుమ్మల. ప్రపంచంలో - దేశంలో - సమాజంలో - మానవఆలోచనా విధానంలో వచ్చిన 'మార్పుల' ప్రభావం కావచ్చు! గాంధికంటే తుమ్మలవారు అభ్యుదయపథంలో కాస్త 'ముందడుగు' వేసేరనే చెప్పవచ్చు. ఈ విషయం మరొకచోట విపులంగా చర్చించుకుందాం. కాని, మచ్చుకు ఒకటిరెండువిషయాలు సూచనప్రాయంగా యిక్కడ చెప్పుకుందాం.

గాంధీజీ 'శుద్ధసాంప్రదాయవాది' మనువు ప్రతిపాదించిన వర్ణాశ్రమ ధర్మాలు పాటించడం - కులవృత్తుల్ని గౌరవించడం మంచిదని గాంధి అభిప్రాయం. అస్పృశ్యతా నివారణకై అస్పృశ్యుల ఉద్ధరణకై గాంధిజీ ఉద్యమస్థాయిలో కార్యక్రమాలు చేపట్టి- 'హరిజన్ సేవక్ సంఘ్' స్థాపనద్వారా పెద్దయెత్తున ఉద్యమం నడిపిన మాట నిజం! కాని 'కుల నిర్మూలన' గూర్చి ఆయన నోరెత్తలేదు. కులనిర్మూలన కానిదే అస్పృశ్యత పోదని డా॥ అంబేద్కర్ వాదన. గాంధిజీతో డా॥ అంబేద్కర్ యీ విషయంలోను, దళితుల హక్కుల విషయంలోను పూర్తిగా విభేధించాడు.

తుమ్మలవారు కులమతాల్ని నిరసించాడు. 'మొదట లేదంట! తరువాత మొదలైనంట కులము - కులమేటికి చెప్పు?' అని ప్రశ్నిస్తాడు తుమ్మల. వర్ణాశ్రమ ధర్మస్థాపనకు కులవృత్తుల పునాదులకు మూలపురుషుడైన 'మనువుమాట తన సమాజమునకు; మన

మహాటయన్న మన సమాజమునకో' అని నూతన సామాజిక ధర్మం యీనాడు చెల్లదని తుమ్మల ధ్వనింప చేస్తున్నాడు.

అలానే మతం విషయంలో గాంధీజీ శాస్త్ర ఛాందసుడనే చెప్పాడు. రోజూ ప్రార్థన సభ నిర్వహించేవాడు - అయితే చిన్న నాడేమోగాని — మహాత్ముడైన తర్వాత ఆయన ఏ గుడులకు పోలేదు— తనకు ప్రియమైన 'రఘుపతి రాఘవ రాజారాం' అనే గీతం పాడిపించేవాడు. 'ఈశ్వర్' అల్లా 'తేరేనాం' అన్నా దేవుని పట్ల - మతంపట్ల గాంధీజీకి అపారమైన శ్రద్ధాశక్తులుండేవి. అయితే తుమ్మలవారు గాంధీజీ అంతటి ఛాందసుడు కాదు. మత మూఢాచారాన్ని - గుడ్డినమ్మకాల్ని ఆయన నిరసించాడు. 'హరి' కోవెలలో - గంగానది రేవులలో (గంగాస్నానం) లేడంటాడు "దీనాని యెడద కరుణకు నావాలంబతని యందహరి" వసించునంటాడు. 'దేవుడన మాతృదేశము, దేవతలన ప్రజలని' నిర్ద్వందంగా చెప్పాడు. "గుడికాదు నేడు నరునకు బడికావలె" అని నొక్కి వక్కాణించాడు! "ప్రాతవడె మతమ్ములు - రాజనీతి క్రుళ్ళె కలదువలదిక వీనితో వాదులాట" అని తేల్చినాడు "సుందర భారతదేశం బందఅకున్ గుడియగున్ మహాతీర్థమగున్" అని తన మహోన్నత భావాల్ని వ్యక్తం చేసాడు. "పేదలె మనవేల్పుల"ని ఖరాఖండిగ చెప్పాడు.

మనమిదివరకు చెప్పుకొన్నట్లు, తెలుగుకవిపండితుల్లో ఎవరూ చేయనివిధంగా - బాపూజీ 'ఆత్మకథ'ను 'మహాత్మకథ' పేర బాపూజీ నాయకత్వాన దేశస్వాతంత్ర్య సమరోద్యమ చరిత్రను— మహాకావ్యాలుగా తీర్చిదిద్దడమేకాదు గాంధీజీ హత్యగావింపబడినపుడు 'అమరజ్యోతి'ని తర్వాత 'గాంధీగానం' చేసాడు. గాంధిజీ విశిష్ట గుణగణాల్ని - గాంధీజీ ఆశయాల్ని - జాతీయోద్యమంలో

గాంధీజీ వహించిన ముఖ్యపాత్రని – స్పృశిస్తూ - ప్రశంసిస్తూ తెలుగు సాహితీలోకంలో యే తెలుగుకవీ వెలయించనన్ని కవితలు - కవితా ఖండికలు గాంధీకవి వెలయించాడు. స్వారాజ్య సన్నివేశముల ప్రస్తావన వచ్చినపుడు – ఆగస్టు పదిహేనువంటి జాతీయ పర్వదినాలు వచ్చినపుడు - దేశాభ్యుదయం - సామాజిక శ్రేయస్సు - వైయక్తిక నిజాయితీల ప్రస్తావన వచ్చినపుడు గాంధీకవి, గాంధీజీని ఉదాహరిస్తూ— "గాంధీ" పేరెత్తి చెపుతూ— ఆయన చెప్పిన కవితలు ప్రతి ఖండకావ్యంలోను దర్శనమిస్తాయి. అవన్నీ కలిపితే రెండు మూడొందల పద్యాలుంటాయి. మచ్చుకు కొన్ని మాత్రమే తెలుసుకుందాం.

బ్రదుకునంద హింస పాటించిగెల్చిన
ఘనులు కొందరవని గలరుగాని
గాంధి తక్కనెవడు కలడహింసను రాజ
నీతిలో బిగించి నెగ్గినతడు— సందేశ సప్తశతి.

క్రీస్తుప్రభువు – గౌతమబుద్ధుడు వంటి అవతారపురుషులు "అహింస"ను పాటించారు. వారు "రాజకీయాల" జోలికిపోలేదు. కాని బాపూజీ – అహింసను రాజకీయాలతో జోడించి నెగ్గినాడని తెనుగులెంక అభిభాషణ ! ఎంతటి నగ్నసత్యం ! నిజమే. హింసావిధానమవలంబించి, శాంతియుత సత్యాగ్రహవ్రతాన్ని బూని— గాంధిజీ విజయవంతంగా జాతీయోద్యమాన్ని నడిపాడు. నెగ్గాడు ! రాజకీయాలలో గాంధిజీ విజయవంతంగా ప్రయోగించిన "ప్రథమ"- అహింసాస్త్రం !

తన బోసినవ్వు ముత్యాల పంటలు ప్రజా
హృదయ దారిద్ర్యంబు కదలద్రోయ
తనచూపు జిగి రసాతల తమః కూపస్థ
జంతుకోటికి తెల్వి సంతరింప

తన పల్కులుపనిషత్సార నిష్యందులై
　　సమతామనోజ్ఞ సస్యములు పెంప
తనబాట క్రేవ సత్యము నహింసయు దరు
　　చ్ఛాయలై పాంథుల శ్రమమడంప
తన పతాక పరమ ధర్మచక్రాంకిత
　　మై సమస్తజగతి కభయమొసగ
తనదు బ్రదుకు బ్రదుకు జనని దాస్య విముక్తి
　　కప్పగించు గాంధికం జలింతు ! —పలిగపంట.

బోసినవ్వుల బాపూజీని చూస్తే — పేదలు తమ బాధల్ని మరిచిపోయేవారు ! గాంధీజీ కరుణామయమైన 'జాలిచూపులు' వివేకం లేని మూగజంతుకోటిలో "ఆనందాన్ని" ఉత్సాహాన్ని కలిగించేవి ! గాంధిజీ ఉపనిషద్వాక్యాలు - మధురమంజుల సమతసస్యాలు పండించేవి ! గాంధిజీ సత్యాహింసా తరుచ్ఛాయలలో పాంథులు (ప్రజలు) విశ్రమించి 'సేద' తీర్చుకొనేవారు ! గాంధీజీ రాట్నచిహ్నంగల 'జాతీయ కాంగ్రెస్' పతాకం సమస్త జగానికి 'పరమ ధర్మాంచిత అభయహస్తం అయ్యింది ! గాంధీ యావజ్జీవితం మాతృదేశ విముక్తి ధారపోసాడు? అట్టి మహాత్మాగాంధికి 'అంజలి' ఘటిస్తున్నాడు గాంధీకవి !

నిను రామాదులజేర్చి మెత్తురది మన్నింపన్ రిపుగ్రీవముల్
రణరంగమ్మున గోసిరక్త ఝురిలో రామాదులోలాడిరా
పనికిన్ నీకును లేదు పొత్తు, రిపుతన్ బాధించి విద్వేషిపై
నెనరుం జిమ్మెదవీవు ! చిక్కదు ప్రభూ ! నీయోగ మెవ్వానికిన్
—అమరజ్యోతి

సత్యధర్మపరాయణుడైన 'శ్రీరామచంద్రుడు' లంకలో రావణునితో తలపడిన సంగరంలో ఉభయపక్షాలవారు - ముఖ్యంగా రావణుని పక్షం రాక్షసులు లక్షలాదిగా నిహతులై రణరంగం 'రక్తసిక్తమై' పోయింది. కాని 'రవి అస్తమించని' బ్రిటీషు సామ్రాజ్యంతో శాంతి యుతంగా తలపడిన గాంధిజీ జాతీయోద్యమ సమరంలో కొందరు బ్రిటీషు సైనికుల తుపాకుల గుళ్ళకు బలియై మరణించి యుండవచ్చు గాని - 'రామ - రావణ' యుద్ధంలో 'పారిన నెత్తురుటేరులు' గాంధిజీ నాయకత్వాన సాగిన స్వాతంత్ర్యోద్యమ సమరంలో అంతటి 'నెత్తురు టేరులు' పారలేదని గాంధికవి ఎంతటి పరమసత్యాన్ని పలికాడు ! అంటే 'దేవుడైన' రామునికంటే 'జాతిపిత' గాంధి 'మిన్న' యని గాంధికవి 'ధ్వని' పూర్వకంగా చెప్పాడు ! ఎంతటి ఉన్నత భావన ! ఎంతటి పరమసత్యం !

అపవర్గ బాంధవం బడికి లౌకిక ధర్మ
 మాలపించితి నందబాలునట్లు
కనుదిక్కులేక సోలిన మూగజీవాల
 మూల్గు మాన్పితి శాక్యముని విధాన
సతత క్షమాప్రేమ శరణమైన నరదైత్య
 కిల్బిషం బోర్చితి క్రీస్తువోలె
ఆత్మనిత్యము, దైవమదియొండెయని, ప్రతి
 ష్ఠింపజాలితి సోక్రటీసు కరణి
 బానిసము వ్రేగుడించి కింపాక జాతి
 క్రండగా నిల్వబడి తబ్రహీము పగిది
 నద్భుతంబాయె మనుగడ యందకాక
 మృతివిధిన్ వీరి ననుసరించితె మహాత్మ

—అమరజ్యోతి

కురుక్షేత్ర యుద్ధరంగంలో శ్రీకృష్ణుడు పార్థునికి 'కర్తవ్యబోధ' గీతను ప్రబోధించినట్లు - దేశప్రజలకు గాంధీజీ దేశస్వాతంత్ర్యం కోసం కర్తవ్యబోధ చేసాడు ! బుద్ధభగవానుని జీవకారుణ్యాన్ని గాంధీజీ 'అహింసా' విధానంలో అనుసరించాడు ! ప్రేమ - క్షమాగుణాలు గల క్రీస్తు ప్రభువు - గాంధీజీ బ్రిటీషు పాలకులైన 'దైత్యుల' పై పగచూనలేదు ! ప్రేమతో సామరస్య పూర్వకంగా - బ్రిటీషు ప్రభువులతో సమస్య పరిష్కరించుకొని, స్వరాజ్యం సాధించి పర ప్రభువుల్ని మెల్లగా పారద్రోలాడు.

సోక్రటీసువలె – సత్యనిత్యమైన ఆత్మగీత దైవాన్ని గుర్తించాడు గాంధీజీ. నీగ్రోబానిసల పాలిటి దేవుడులాంటి అబ్రహాం లింకన్‌లాగా గాంధీజీ 'దీనహరిజనుల' పాలిటి రక్షకుడయ్యాడు ! ఈ విధంగా కృష్ణునిలాగా, బుద్ధునిలాగా, సోక్రటీసులాగా - 'లోక కల్యాణార్థమై "మనుగడ" సాగించి - చివరకు వారిలాగా గాంధీజీ కూడా 'మృత్యువు' పాలైనాడని గాంధీకవి 'లెస్స' పలికాడు ! బుద్ధుడు "చుంద" అనే కమ్మరి యిచ్చిన విందారగించిన తరువాత తీవ్ర అస్వస్థతకు గురియై చివరకు మహాపరి నిర్యాణం" చెందాడు ! యూదులు క్రీస్తును శిలువ వేస్తారు. సోక్రటీసుని విషమిచ్చి చంపారు! శ్రీకృష్ణుని బోయవాడు 'పక్షి'గా భ్రమించి బాణంతో ప్రాణాలు తీసాడు. గాంధీజీని 'మతఛాందసవాదులు "మట్టు" (హత్య) పెట్టారు. జీవితంలోను - మరణంలోను వారికీ - గాంధీజీకి వున్న 'సామ్యాన్ని' గాంధీకవి బహుచక్కగా వర్ణించాడు !

మగువనంటక మద్యమాంసంబు లోల్లక
　　పొగడిక్కల్ గనె భోగభూమియందు
చేసినదోసముల్ మూసిపెట్టక చాటి
　　మప్పె బారమ్ము సమాజమునకు

జగమాల్చినట్టి లక్షలకొలంది ధనమ్ము
వెచ్చపెట్టెను ప్రజావితతి కొఱకు
గుడులలో లేడయా గుహలలో లేడని
చూపించె నీశ్వరు సూవృతమున
లోకమెల్ల నెదుర్కొనుగాక నిలిచి
గెలిచె నసిలేని - కసిలేని - కలను దీర్చి
బాపూజీ యెట్లుపడసె నీ ప్రాభవమ్ము
కన్నవారల నడవడికతన గాక !

ఈ పద్యం గాంధిజీ విశిష్ట వ్యక్తిత్వానికి జయపతాక!— కదంబకైత - విద్యార్థిగా లండన్‌లో చదువుకొన్న నాడేకాదు - పెరిగిపెద్దై జాతీయోద్యమానికి నాయకత్వం వహించి - చివరకు చనిపోయే వరకు - మగువను, మద్యం, మాంసం గాంధిజీ ముట్టలేదు. దక్షిణాఫ్రికాలోనే కాదు మాతృదేశంలోను 'స్వరాజ్యనిధి'కి లక్షలు వచ్చినా - గాంధీజీ ఆ ధనాన్ని ప్రజల క్షేమముకొరకే ఖర్చుచేసాడు. ముక్కుపచ్చలారని చిన్ననాడే కాదు - బ్రతికినంత కాలం - మూడుకాళ్ళ ముసలియై కాటికి పోయేవరకు గాంధీజీ తన తప్పుల్ని దాచుకోలేదు ! దోషాల్ని మూసివేసుకోలేదు. దేవుడన్నవాడు గుడులలో - గుహలలో లేడు— "సత్యమే నాకు దైవం" అని నిర్ద్వంద్వంగా చెప్పాడు గాంధి. లోకమంతా ఒకటై ఎదురు నిలిచినా తాను అనిన మాటమీద నిలబడ్డాడు. తాను 'మంచిపని' అనుకొన్న దానిని చేయటం మానుకోలేదు ! ఆయన చేతిలో (అసి) కత్తిలేదు ! ఉన్నది 'త్రికరణశుద్ధి' మాత్రమే ! ఆయనకు 'కసి' లేదు. ఎవరిమీద పగలేదు. వైరం లేదు. ఈ సుగుణాలన్నీ గాంధిజీ తన మాతాపితల నుండి "వారసత్వం"గా పుణికి పుచ్చుకొన్నాడు. ఇట్టి సుగుణాల్ని గాంధికవిగూడా తన తల్లి దండ్రుల నుండి 'వారసత్వం'గా పుణికిపుచ్చుకొన్నాడు. పైగా

గాంధీజీ వ్యక్తిత్వం తనకు అన్నివిధాల సచ్ఛసంకలన, తెనుగులెంక, తనలోని సుగుణాలకు "పుటం" వేసి వన్నెదిద్దుకొన్నాడు. గాంధీజీ వలె తుమ్మలవారు తన జీవితంలో మదిర, మగువ మాంసం ముట్ట లేదు. తెనుగులెంక 'కాసులకు నాసచేయ' లేదు. తాను రాసిన కావ్యాల్ని తన సొంత ఖర్చులతో అచ్చువేయించి "వదాన్యుల" గుణభాసురులకు అంకితం ఇచ్చాడు. అయితే ఆయనకు గుర్తింపు వచ్చిన తర్వాత సన్మానాల సందర్భాలలో - పురస్కారాలు వచ్చిన వేళల్లో లభించిన ధనాన్ని తన రచనలు అచ్చువేయించుకొంటానికి, సంసారపోషణకు పిల్లల చదువులకు వెచ్చించాడు తప్ప "ఆస్తి పాస్తులు" సంపాదించలేదు. అప్పికట్లలోని "గృహం" తన 'అభి మానులు' ఏర్పరచినట్టిదే. గాంధీజీలాగా, తుమ్మలవారు కూడా చిన్ననాట సంగతేమోగాని, పెరిగి పెద్దయి విద్యాబుద్ధులు నేర్చు కున్నాక - 'వివేక' వంతుడయ్యాక గుడులకు పోలేదు ! "పేదలే దేవుళ్ళనీ," గాంధీజీయే తనకు ఆరాధ్యదైవంగా భావించి "సమాజ వికాసం" కోసం 'విశ్వజన శ్రేయస్సు'కోసం కవిత్వం రాసాడు. గాంధీజీలాగా గాంధీకవిగూడా తెలిసి ఏతప్పు చేయలేదు. చేసిన తప్పును గుప్పెట్లో దాచిపెట్టుకోలేదు !

రాజదండము వలదు స్వర్గంబు వలదు
జనన మరణార్తులంటని జగము వలదు
తెలుపిలేని దిగుళ్ళతో దేవురించు
జనులదేర్చుట వలయు నాకనియె నితడు

—సమదర్శి

రాజ్యాధికారం కాదు - పరలోక సౌఖ్యం కాదు - ముక్తి కాదు. దీనజన సేవయే తన ధ్యేయమనీ ఆ ధ్యేయంతో దీనజన సేవ- హరిజన సేవ చేస్తాడని కవి అభిభాషణ

చేసిచెప్పెగాని చేయక యొరులకే
మంచిపనియు గాంధి మప్పలేదు
మలమునెత్తె గలిమి వలదనె జెలకేగి
నుపవసించె జాతి కుసురులిచ్చె— ఎక్కట్లు

గాంధీజీ 'త్రికరణశుద్ధి'గా జీవించాడని కవి భావన! పాకీపని చేసాడు. దేశంలో 'జాతిపిత'గా 'మహాత్ముడు'గా ఎదిగియు తాను "శాణీ" (పైసా) ఆర్జించుకోలేదు. స్వారాజ్యంకోసం ఉపవాసాలు చేసి కృశించిపోయాడు. చివరకు దేశసేవలో 'బలి'యై పోయాడు. ఎంతభావాన్ని యింత చిన్న పద్యంలో యిమిడ్చాడు తెనుగులెంక! అదీ కవికున్న కవితాశిల్పం! రచనా చమత్కారం!

"పచ్చిపేదకరణి బ్రతికె సత్యాన్వేషి" అంటూ- దిసమొలకు అంగవస్త్రం ధరించి - నిరాడంబరంగా - అతిసాధారణమైన శాఖాహారం భుజిస్తూ - అంతటి 'జాతిపిత' అయ్యును - "పచ్చిపేద" వాడిలాగా జీవించాడని గాంధీకవి అభినుతించాడు, "కపటమెఱుగని-యపజయాక్రాంతి కదరి ధృతిదొఱంగని రాజనీతిజ్ఞు"డని గాంధీజీని గాంధీకవి ప్రస్తుతించాడు. ప్రముఖ శాస్త్రవేత్త ఐన్‌స్టీన్ చెప్పిన విషయాన్ని తెనుగులెంక "బాపూజీ మర్త్యుడను మాట రేపువచ్చు నరులు నమ్మర"ని చక్కగా ఛందోబద్ధంగా వెలయించాడు అందుచేతనే తుమ్మలవారు "పుణ్యములు పండి చూచిరీనాడు. కొందరాసుకృతి" అనీ గాంధీని చూచిన సమకాలీనులు "పుణ్య" వంతులని గాంధికవి భావన!— ఈ బోసినోటి ముదుకడే యాంగ్ల సర్పము నదిమిపట్టి వాడిగల వేడిగల కోఱలూడబెరికె" అంటూ— భయంకర 'విషసర్పం' వంటి బ్రిటీషు ప్రభుత్వాన్ని పాములవాడు నాదస్వరమూది ఆడించి - వశపరచుకొన్నట్లు - గాంధీజీ "శాంత్యహింసా" సత్యాగ్రహవ్రతమనే "నాదస్వరం" వూదుతూ - మెల్లగా దువ్వుతూ - మంచిగా బుజ్జగిస్తూ - నచ్చచెప్పి - లొంగదీసుకొని

స్వారాజ్యం తెచ్చాడని "ధ్వనింప" చేశాడు జాతీయకవి. "అతని ముందు కల్ల యనదమై మరపిల్లె - తల్లడిల్లి పిరికితనము పరచె; ముచ్చముడిగె బొగరు, చచ్చెగామాదులు" (ఎక్కట్లు అంటాడు కవి గాంధీజీ ముందు 'అసత్యం' అనదయై పోయిందట. "పిరికితనం" పారిపోయిందట. "పొగరు" తోకముడిచిందట ! "కామక్రోధాది అరిషడ్వర్గాలు నిర్జీవమై పోయాయట ! అంటే— గాంధీజీ అంతట సత్యవంతుడనీ, ధైర్యశాలియనీ 'వినయ' సంపన్నుడని (సౌజన్యుడని) అరిషడ్వర్గాల్ని జయించిన 'స్థితప్రజ్ఞుడని గాంధీకవి భావన !

"నియతిలేని రాజనీతి, వేసటలేని
కలిమి, నడతలేని తెలివి, పాడి
లేని బేర, మీావిలేని పూజావిధి
చెనటి తప్పులని వచించె గాంధి

—సందేశ సప్తశతి

గాంధిజీ పేర్కొన్న "సప్తపాపాల" గురించి యింతకుముందు తెలుసుకున్నాం. అందుని "పంచపాతకాలు" ఛందోబద్ధంగా చక్కగా - సరళంగా - చెప్పాడు గాంధీకవి !

బాపూజీ విశిష్ట వ్యక్తిత్వం - బాపూజీ జీవన విధానం ఆకళింపుకొన్న తుమ్మలవారు బాపూజీలాగా జీవించడమేకాక, తన వ్యక్తిత్వాన్ని గాంధీజీవలె నిలుపుకున్నాడు. తన వ్యక్తిత్వాన్ని గాంధిజీ వ్యక్తిత్వంతో పోల్చుకొని అలా జీవించడం ఒక ఎత్తు కాగా, గాంధిజీ జీవితతోద్దేశ్యమైన "స్వారాజ్య" సాధనకై గూడా తుమ్మలవారు తనవంతు కృషి తానుచేసాడు. "తల్లి సంకెలలో దల్లడిల్లువేళ నాకమైనను నరకంబుగాకయున్నె" అంటూ బాపూజీ పిలుపునందుకొని సన్నుల నిరాకరణోద్యమంలో శ్రీ తుమ్మల పాల్గొన్నాడు. చీరాల - పేరాలలో దుగ్గిరాల

బలరామకృష్ణయ్య, పెదనందిపాడులో పర్వతనేని వీరయ్య వంటి దేశాభిమానులైన నాయకులు గుంటూరు జిల్లాలో పన్నుల నిరాకరణోద్యమాల్ని ఉధృతంగా చేపట్టారు. కావూరు గ్రామంలో తప్పెట అరుంధతీయుడు భయపడి 'పప్పెట' వేయనిరాకరించాడు. తుమ్మల వారు ఆ తప్పెట తీసుకొని, కావూరులోను చుట్టుప్రక్కల గ్రామాలలోను పన్నులు చెల్లించవద్దని 'టముటమా' వేసాడు. "తప్పెటబ్బాయి" అన్న "నిక్‌నేమ్" కూడా అందుచేత తెనుగులెంకకు వచ్చింది. ప్రభుత్వంవారు అందుకాయనకు "అపరాధ రుసుం" (జరిమానా) విధించింది కూడా. "లెమ్మిక మీాన మేషములు లెక్కలు మానుము భావదాస్య బంధమ్మును త్రెంచి వేయు"మనీ "సంగరము సేయుడు త్రోయుడు మాతృదుఃఖమున్" అంటూ జాతీయస్ఫూర్తితో దేశప్రజలను ఉత్తేజపరుస్తూ - బాపూజీ నాయకత్వాన నడుస్తున్న స్వరాజ్యోద్యమంలో దుమికి దేశ స్వాతంత్ర్యం కోసం పోరాడమని గాంధీకవి దేశసోదరులకు విజ్ఞప్తి చేసాడు.

గాంధీజీ 'హత్యావార్త' విన్న గాంధికవి క్షణంపాటు నిశ్చేష్టుడయ్యాడు. అచేతనుడిగా కుప్పకూలిపోయాడు. అంతలో తెప్పరిల్లాడు. భోరున పిల్లవాడిలా ఏడ్చాడు. గుండె దిటవు చేసుకున్నాడు. కలం పట్టుకొన్నాడు. 'అమరజ్యోతి' వెలయించాడు.

క్రుళ్ళిన యెముకకై కుక్క గుంపులవోలె
    నధికారమునకు గారాడు వారి
లంచాల గడ్డికాసించి సేవాధర్మ
    నియమముల్ బలిసేయ నేర్చువారి

కుహనావణి జోశ్యపగూహ నోద్రిక్తులై
సుధవోలె బ్రజనేతు జుజ్జువారి
పరమత ద్వేషాగ్ని మరగినారీ వృద్ధ
శిశుమండలిని జీల్చిచెండువారి
దేశ హితకృత్యముల పేరదెచ్చు నర్థ
మాత్మ బంధువులకు బంచునట్టి వారి
బ్రతుకు గనలేక కన్నుమూసితివిగాని
కలడె నీగుండెపై బ్రేల్వగల మగండు.

కుళ్ళిన ఎముకలకోసం కొట్లాడుకొనే కాకులలాగా పదవులకోసం వెంపర్లాడుతూ పోట్లాడుకొనే వారిని చూడలేక - లంచాల గడ్డి కాసించి - నీతీనియమాలకు తిలోదకాలిచ్చే వారిని చూడలేక - ప్రజలను పీల్చిపిప్పిచేసే - దొంగ వ్యాపారస్తుల నల్లబజారు కల్ల చేష్టలు చూడలేక - పరమత ద్వేషంతో - చిన్నా పెద్దా ఆడామగా తేడాలేకుండా హింసించే మూఢమతోన్మాదుల దుష్టకార్యాల్ని చూడలేక - ప్రజాసేవ పేరుమీద - దేశసేవ పేరుమీద - అక్రమంగా గడించి - తామూ - తమ బంధువర్గం కులుకుతున్న 'కుహనా నాయకుల' కపట నాటకాల్ని చూడలేక - గాంధీజీ కన్ను మూసాడట గాని ఆ దివ్యశక్తిస్వరూపుడైన గాంధీమహాత్ముని చంపగల వాడెవ్వడని గాంధీకవి గొప్పగా చెప్పాడు.

"నశ్వరమైన కాయము వినాయక ధూర్తుడు కూల్చెగాని నీ శాశ్వతమైన యాత్మనెటు చంపగలండతడు" అంటూ "మనుజుడవు నీవు కోమటిగావు / ఒకడలిపోయిన భారతీయుడవు గావు / కావు గాంధివి, లోకలోకముల వెల్గు / జూపు నిరవధికామరజ్యోతివోయి" అంటూ గాంధీజీ దివ్యాత్మను 'అమరజ్యోతి'గా కీర్తించాడు గాంధీకవి శ్రీ తుమ్మల !

"ప్రల్లదు జేచి ప్రేల్చిన తుపాకికి నీ హృదయమ్ము (గుండె) వ్రయ్యలై" - బాపూజీ రుధిరమ్ము వెల్లువకట్టి హస్తినాపురి వీధుల పాఱిందని తెనుగులెంక వాపోతాడు. "త్రుళ్ళెడి దుష్టశక్తుల నెదుర్చుటకందలి చుక్క-చుక్క-కున్ బల్లిదు విద్ధవీర పరిపాలకులెందరు పుట్టి" వస్తారని ఆశాభావాన్ని వ్యక్తం చేసాడు. గాంధీజీని చంపామని సంతోషంతో మిడిసిపడే దుష్టశక్తులను దునుమాడటానికి, ఢిల్లీరాజవీథులలో వరదలై పారిన బాపూజీ రక్తఝురులనుండి ఒక్కొ-క్క నెత్తుటిబొట్టు నుండి ఒక్కొ-క్క వీరవరేణ్యు లుద్భవిస్తారని ఆకాంక్ష వెలిబుచ్చుతాడు గాంధీకవి. ఒక నెత్తురుబొట్టులోన వేయిమంది ఉద్భవింతురని ఓ అభ్యుదయ కవి అన్నమాటలు గుర్తుకొస్తాయి కదూ ! "రామా ! నన్ గరుణించితే పిలిచితే రమ్మంటివే జీవనస్వామీ ! ధన్యుడనైతి నంచు భగవత్ సామ్రాజ్యముం జేరితే" అని తెనుగులెంక అభిభాషించాడు. బాపూజీ గుండెలో తుపాకిగుళ్ళు దూసుకొనిపోగానే "హే రామా !" అని నేలకొరిగాడు ! రాజ్‌ఘాట్‌లో గాంధీజీ సమాధిమీద "హే రామ్" అన్న పదం చెక్కారు ! జీవించినంత కాలంలో నిత్యం తాను జరిపించిపాల్గొన్న ప్రార్థనా సమావేశాల్లో "రఘుపతి రాఘవ రాజారామ్-పతితపావన సీతారామ్" అనే గీతాన్ని ఆలాపింప జేసాడు గాంధి ! అందుకే తెనుగులెంక గాంధీజీ గురించి "రామా ! దయ కల్గిందా ! రమ్మంటావా ! అలానే వస్తున్నా" నని గాంధి తుదిశ్వాస విడిచినప్పుడు "హేరామా" అన్నమాటకు తెనుగులెంక యిలా భాష్యం చెప్పాడు.

తుదిశ్వాస విడుస్తూ గాంధీజీ నన్ను చంపిన దుష్టుణ్ణి శిక్షించవద్దని క్షమిస్తున్నాననీ - మీరు ప్రజలు - ప్రభుత్వం క్షమించి వదలిపెట్టమని ఆఖరిసారిగా కోరతాడు ! ఆ విషయాన్ని గాంధీకవి

"నాపై బాంబులు ప్రేల్చినట్టి మనుజున్ నాపాలి చుట్టమ్ముగా నా పుణ్యమ్ముల పంటగ దలచి" విడిచిపెట్టమన్నాడని కవితాకీర్తిలో వెలయించాడు.

"నీబూదిన్ గొని తెచ్చు రైలుగను వో నేత్రమ్ములంధమ్ములై - బాబూ మూర్ఛకు జిక్కినాడమన యీ బంధంబ నేమందునో"... నాడెల్ల వేసారితిన్... నీ బంధుత్వము నాదు భాగ్యమనుకొంటిన్ భక్తి సముద్రుండనై" అంటూ—— గాంధీజీ 'చితాభస్మ కలశాల్ని' 'రైలు'లో ప్రజల అంతిమ దర్శనార్థం (ఢిల్లీలో గాంధీజీ అంతిమ యాత్ర చూడని కోట్లాది దేశీయులు కొరకు) దేశం నలుమూలల ప్రదర్శించారు; ఆ "చితాభస్మ కలశాన్ని" చూచిన గాంధీకవి మూర్ఛపోయాడు ! గాంధీజీ అంటే గాంధీకవికి ఎంతటి భక్తిప్రపత్తులో ! ఇలాంటి వాళ్ళింకా లక్షలమంది వుంటారనుకోండి !

శతజన్మార్జిత మామకీన సుకృతస్థానమ్ముగా నీజగా
బ్రతుకున్ జాటెడి కావ్యమున్ దెనుగునన్ బండించి నిండించి నా
బ్రతుకున్ ధన్యము జేసికొంటిని జగద్బంధూ ! దయా సత్యని
ష్ఠిత మౌతావకమూర్తి నల్లడల గంటిన్ నేటికిన్ మాటికిన్

—అమరజ్యోతి

తాను చేసుకున్న 'శతాధిక జన్మల' పుణ్యఫలాన సత్యసంశోధిత గాంధీజీ ఆత్మకథ - మహాత్మకథ వెలయించి - తన జన్మాన్ని 'ధన్యం' చేసుకున్నానని తుమ్మలవారు తన జన్మ 'తరించి'నట్లు తల పోసాడు !

'ఆత్మకథ'ను వెలయించి తాను "శాంతిపట్టభద్రుడ" నయ్యానని సంతసించాడు ! అంటే "కత్తిమీదిసాము" వంటి గాంధీ ఆత్మకథను తెనుగులో కావ్యంగా మలచి గెలిచాడని ఆయనకు తృప్తి.

"ముప్పదియేండ్లనుండి తృణమోకణమో తినుచున్నవాడనో
యప్ప ! భవద్వచో విభవమన్య డెఱుంగకపోవు గాక యీ
యప్పు భరింపరాని బరువై నిను నచ్చపు తెల్గుబాస నీ—
చొప్పున దీర్చుకొందు ఋణబద్ధికిదే సరిపుచ్చుకొందువా !

—ఆత్మకథ

ఆత్మకథ రాసి ఇలా చెప్పుకొన్నాడు గాంధీకవి ! 1936లో ముందుగా ఆత్మకథలోని కొంతభాగాన్ని పద్యగద్యాత్మకంగా తీర్చి దిద్ది వెలయించాడు. ఆయనకు మంచి గుర్తింపు వచ్చింది. అభినవ తిక్కన బిరుదు వచ్చింది. కట్టమంచివారు 'తుమ్మలవారిని మహాత్ముని శాశ్వత ఆస్థానకవిగా అభివర్ణించాడు ! కావ్యం బాగా అమ్ముడుపోయింది. సొమ్ములు చేసుకున్నాడు అందుకన్నాడు ! 'తృణమోకణమో తిన్నానని' ఆ ఋణవిముక్తికీ కావ్యం వెలయించానన్నాడు తెనుగులెంక !

గాంధీజీ మరణంతో 'కొద్దికాలం' దేశంలోను - దేశప్రజలలోను ముఖ్యంగా ఆయన అనుచరులు - అనుయాయులు - సహచరులు ఆయన అభిమానులలోను 'అంధకారం' అలుముకొంది. 'నిరాశానిస్పృహలు' "నిర్లిప్తత" చోటుచేసుకున్నాయి. దేశం ఎటుపోతుందని ఆందోళన చెందినవారు లేకపోలేదు; గాంధీజీని 'ఆరాధ్య దైవంగా' భావించి కొలిచి గాంధీ కవిత్వం పుంఖానుపుంఖంగా వెలయించి ఆయన అడుగుజాడల్లో నడిచిన తుమ్మలవారిలో గూడా ఎంతో నైరాశ్యం చోటుచేసుకొంది. "సగం చచ్చిన" వాడైపోయాడు "ఇంతటి గాంధి నేడు మనకెంతయు దవ్వాయిపోయె"నని వాపోయాడు. "గాంధితో నడంగె కర్తవ్యనష్ట" అని వేదన చెందాడు.

కాని, కవి అయినవాడు ఆశాజీవి. క్రాంతదర్శి "పుణ్య మూర్తుల తలపులు పొల్లుపడవు. బాపూజీ కన్నకలలు దబ్బరలు కావు" అని ఆకాంక్ష వెలిబుచ్చాడు. గాంధీజీ 'అడుగుజాడ'ల్లో సహస్రా ఆయన ఆశయాల్ని సఫలీకృతమొనర్చిన సమాజం - దేశం - లోకం సుఖశాంతులతో విలసిల్లుతుందని గాంధీకవి ఆకాంక్ష. "ఇతడు (గాంధి) లేడని ప్రజలకేల యుమ్మలిక / ... మేల ప్రమానాలు" అని అంటూ "ఇతని - మన్గడచందమిచ్చ బాటించి / జగము౦గు కొనుగాక సర్వధా జయము జనమందుకొనుగాక సర్వధా శుభము" అన్న ఆశాభావం వ్యక్తం చేస్తాడు. (గాంధిగానం)

అంతేకాదు. గాంధీజీని దీనులలో చూస్తూనే వున్నాడు తుమ్మలవారు "దీనమగు కుక్కకిడి - తినజూచు భిక్షుకుని కంటిలో నున్నాడురా ! బాపూజీ ! కన్నువిప్పు సోదరా" (దివ్యజ్యోతి) అంటాడు తెనుగులెంక "మట్టితట్టలు మోసి చెమ్మటలు గురిసి/ గాసిపడు పేదనోదార్చగదలి వచ్చు / మలయ పవనమ్ములో సబర్మతి మహర్షి / కృపను కూర్మినిగని పులకింతు నేను" (చకట్లు)— పేదవారికి సేదతీర్చే (ఎంత కష్టించినా కడుపు నిండదుకనుక) చల్లని పిల్లగాలిలో (పంచభూతాల్లో కూడా) గాంధీజీని దర్శిస్తాడు గాంధీకవి ! "తిట్లుసైచి తిరిసితెచ్చిన కూడెల్ల / జంటవెంటనున్న సంతు మెసవ / రిత్తపొట్టతోడ నత్తమిల్లిన బిచ్చ / గత్తెయందు గంధు గాంచె నేను"— ఆకటి-ఎచ్చుతో మలమల మాడుతూ 'నకనక' లాడు నికృష్ట నిరుపేదల్లో - బికుగాళ్ళలో గాంధీని చూస్తానంటాడు గాంధీకవి !

తెనుగులెంక - కవిత్వం రాయడం మొదలెట్టింది మొదలు కన్నుమూసేవరకు ఆ న రాసిన కావ్యాలలోని పద్యాలు - యితర గేయాల కవితలు మొత్తం ఇరవైవేలు కవితలుంటాయని ఓ లెక్క-

అయితే అందులో యీనాడు సిక్కచ్చిగా లభ్యమయ్యే పద్యాలు పునరుక్తాలతో సహా - షుమారు పదిహేను వేల పద్యాలని లెక్క. మరి, గాంధీమీద రాసిన కవితలు - ఆత్మకథ - మహాత్మకథ - అమరజ్యోతి - గాంధిగానం కావ్యాలలోని పద్యాలు - గాంధీజీపై యితర కవితాఖండికల్లోని పద్యాలుకలిపి లెక్కవేస్తే ఆయన రాసిన మొత్తం పద్యాలలో రెండువంతులు అంటే షుమారు పదివేలుంటా యని ఘంటాపథంగా చెప్పవచ్చు! "నరనరమ్మున జీవనజ్యోత్స్నగా "నహింస"ను సహించిన యోగిసత్తముడ"ని గాంధీజీ గురించి గాంధి కవి అన్నాడు. అయితే గాంధీతత్వాన్ని తుమ్మలవారు "నరనరాన జీర్ణించుకొన్నాడ"ని మనం నిర్ద్వంద్వంగా చెప్పుకోవచ్చు. గాంధీజీ 'ఆత్మకథ'ను చదివిన కట్టమంచివారు తుమ్మలవారిని "మహాత్ముని ఆస్థానకవి"యనీ "ఆస్థానము శాశ్వతమైనద"నీ అభిభాషించాడు! అలానే గాంధీజీ "శాశ్వత ఆస్థానకవి"గా గాంధీమీదనే యెక్కువ కవితలు వెలయించి ఆపేరు సార్థకం చేసుకున్నాడు. "శబల" కావ్యానికి పీఠికరాస్తూ విశ్వనాథవారు "సీతారామమూర్తి చౌదరిగారు గాంధీజీయొక్క సిద్ధాంతానుయాయి. ఇది వారి కవనము నకు పట్టుగొమ్మ! వారి బాపూజీ ఆత్మకథయే దీనికి సాక్ష్యము. ఈ సిద్ధాంతము (గాంధీ సిద్ధాంతం) వారి సర్వకవిత్వమునందును (కావ్యాలలో) మణులలోని దారమువలె అనుస్యూతముగా వచ్చు చునే యుండును (యున్నది) ఇది వారి కవితాసరస్వతికి జయపతాక" అని 1955 లోనే అభిభాషించాడు— "మహాత్మకథ" 1968లో గాని వెలువడలేదు! తర్వాత గాంధీమీద ఎన్నో కవితాఖండికలు- ఆఖరికి 'గాంధిగానం' విశ్వనాథవారి మాట సత్యమైనది! తుమ్మల వారిని 'గాంధికవి'గా యెందరో ప్రశంసించారు. ఎందరో యెందుకు తుమ్మలవారే తనను గూర్చి 'గాంధికవి'నని సగర్వంగా చెప్పు కొన్నాడు. అది సార్థకమైనది!

తుమ్మలవారు ఈ విధంగా 'అంకితభావం'తో ముమ్మాటికీ గాంధీజీని నమ్మాడు. 'త్రికరణశుద్ధిగా' ఆయన ఆశయాల్ని పాటించాడు. గాంధి జీవితాన్ని కావ్యబద్ధం చేసాడు. గాంధీజీ సిద్ధాంతాలకు 'ప్రాణంపోసి' కవితాగానం చేసాడు. మహాభారత కావ్యకర్త వ్యాసుడు శ్రీకృష్ణుని పాత్రను రాజనీతిజ్ఞుడైన 'దైవీయ వ్యక్తి'గా తీర్చిదిద్దినట్లు - రామాయణ కావ్యకర్త 'వాల్మీకి' శ్రీరామచంద్రమూర్తి 'మానవాదర్శమూర్తి'గా దైవాంశ సంభూతిగా తీర్చిదిద్దినట్లు - తుమ్మలవారు 'గాంధీజీ'ని 'సత్య శాంత్యహింసా' మూర్తిగా - కర్మయోగిగా తీర్చిదిద్దాడు. శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు అన్నట్లు "తుమ్మల సీతారామమూర్తి మహాత్ముని యొక్క ఆస్థానకవి. ఈ స్థానము శాశ్వతము" అని అభిభాషించాడు.

> గాంధియుగమున బుట్టితి గాంధినడుపు
> నుద్యమంబుల నలగితి నోపినంత
> గాంధి నీక్షించితిని - గాంధి కవిత వ్రాయ
> గంటి నీ జన్మమునకు నీ పంటచాలు"—

గాంధీయుగంలో జన్మించి గాంధీని కళ్ళారగాంచి గాంధీ నడిపిన జాతీయోద్యమంలో 'ఉడతాభక్తి'గా తాను పాల్గొని - గాంధీ మీద కావ్యాలురాసి ధన్యత చెందినట్లు తుమ్మలవారి ఆత్మవిశ్వాసం - నిశ్చితాభిప్రాయం! అని తుమ్మలవారే స్వయంగా చెప్పుకున్నారు! "ఈ పంటచాలు అని 'తృప్తి' చెందడం ఎంతటి మహద్భాగ్యం! నిజంగా తుమ్మలవారు ధన్యజీవి! 'రాష్ట్రసిద్ధికొరకు రక్తంబుగార్చిన' గాంధికవిని నేను అని ఆయన స్వయంగా చెప్పుకొన్నాడు. 'రాష్ట్రం' అంటే 'దేశం' అన్న అర్థంగూడా వస్తుంది. 'రాష్ట్ర'మని చెప్పుకోవచ్చు! రాష్ట్రపతి అని అంటున్నాం గదా దేశాధ్యక్షుణ్ణి! 'రక్తం కార్చడం' అంటే— నిజంగా రక్తం చిందించడం కాదు! "ఒక్కొక్క పద్యమునకు నొక్కొక రక్తపుబొట్టు తక్కువగా" రచించినాడనని జాషువా - ఫిరదౌసి కవిచేత చెప్పించాడు. (ఫిరదౌసి కావ్యంలో) నిజంగా ఆత్మకథ - మహాత్ము

కథ - అమరజ్యోతి - గాంధిగానం - వేలాది పద్యాలున్న యీ కావ్యాలు రాయటానికి యితరత్రా గాంధీజీపై కవితాఖండికలు రాయటానికి తుమ్మలవారు తన మనోబలాన్ని శరీరబలాన్ని పిండి పిప్పిచేసి శ్రమటోడ్చి - రక్తం చిందించాడంటే అందులో లవలేశం గూడా అతిశయోక్తిలేదు !

తుమ్మలవారికి గాంధిజీ రూపురేకలు కొన్ని వున్నాయి. అటు వయస్సులో నున్నప్పుడు - తర్వాత ముదిమిలోను వారిని చూసినవారికీ - వారి ఛాయాచిత్రాలలోను - యీ 'సారూప్యం' కనిపిస్తుంది. సత్యాహింసా గుణాల విషయాలలో 'గాంధిజీ'ని తెనుగు లెంక త్రికరణశుద్ధిగా అనుసరించిన గాంధీకవి ! గాంధీ భక్తుడు ! గాంధీ జీవితాన్ని - గాంధేయ సిద్ధాంతాన్ని తెనుగులెంక తన తనుప్రన అణువణువున జీర్ణించుకొని - ఆచరణాత్మకంగా జీవించిన వాడు తెనుగులెంక కవిత్వంలో గూడా గాంధేయ సర్వోదయ సిద్ధాంతం - గాంధీజీ సత్యనిష్టాగరిష్టం 'అడుగడుగున' ద్యోతకమౌతుంది! గాంధిజీ యింతగా నమ్మినవాడు - యింతగా ఆచరించినవాడు— యింతగా కవిత్వం 'రూపం' కల్పించినవాడు తెలుగునాట - తెలుగు సాహిత్యలోకంలో మరొక కవి లేనేలేడని నిర్ద్వంద్వంగా ఘంటాపథంగా చెప్పవచ్చు ! గాంధిజీ వ్యక్తిత్వాన్ని-గాంధిజీ సిద్ధాంతాన్ని తెలుగు సాహిత్యంలో శాశ్వతమైన స్థానం కల్పించటమే కాదు; అంతటి 'ఉదాత్తమైన స్థానాన్ని' అనితరసాధ్యమైన - అపూర్వమైన 'మహోన్నత స్థానాన్ని' కల్పించాడు. క్రీస్తు - మహమ్మదు— నానక్ - బుద్ధుడు - ప్రజల హృదయాలలో వున్నట్లు గాంధీజీ వుంటాడు. గాంధీజీ 'సత్యాహింస' విధానాలు దేశంలో - యావత్ ప్రపంచంలో 'సజీవంగా వున్నంతకాలం' తెలుగు సాహిత్యంలో 'తుమ్మలవారి' గాంధి నైయక్తికపరంగాను - సైద్ధాంతికపరంగాను సజీవంగా వుంటాడు !

# జాతీయ [వాద] కవిగా

మాతృమహీ గౌరవములు
మనకు ప్రాణములు
స్వాతంత్ర్యం లేని జాతి
చచ్చుజాతి - మచ్చజాతి —(యుగకవిత)

జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపిగరీయసి" అని ఆదికవి వాల్మీకి యేనాడీ సత్యవాక్కును తననోట పలికాడో - ఆ వాక్కు ఆనాడేకాదు— నేడేకాదు - యేనాడునూ అమృతవాక్కయి - నిత్యసత్యమై ప్రజల నాల్కలమీద తాండవిస్తూ వుంది! పరమసత్య శోభితమై ఆద ర్శంగా నిలిచింది. కన్నతల్లీ - కన్నభూమి 'స్వర్గం' కన్న మిన్న అంటే 'స్వర్గాన్ని' చూచినవారు లేరు. కాని కన్నతల్లీ - కన్న భూమి - మనకు జన్మనిచ్చారు. మన కనులయెదుట నున్నారు. మన జీవితాలకి ఆధారభూతమయ్యారు. "ప్రాచీనాంధ్ర సాహిత్యంలో దైవభక్తి రసస్ఫూర్తితో పోషింపబడింది. దేశభక్తి ఆధునిక సాహి త్యంలో గోచరిస్తుంది. భక్తిరస పోషణంలో దేశభక్తి ఒక నవ్య సమన్వయ దృక్పథాన్ని తెలుగు సాహిత్యానికి అందించింది. దేవుని స్థానంలో దేశం నిలిచింది. దేశం తల్లిగా శక్తిగా దర్శనమిచ్చింది. మాతృదేవోభవ అన్నది ప్రాచీనసూక్తి అయితే మాతృదేశమే నాదేవత నాశక్తి నామాతృమూర్తి అన్నది నవ్యసంప్రదాయ సూక్తి" అని జి. వి. సుబ్రహ్మణ్యంగారు వివరించారు. (సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలు.)

కన్నతల్లిని యెవరైనా దూషిస్తే చూస్తుండగా యెవరైనా వూరుకుంటారా! కన్నభూమినెవరైనా దురాక్రమణ జరిపితే,

ఆక్రమిస్తే - దోచుకుంటుంటే— "నిజమైన కన్నబిడ్డ" అయిన వారెవరైనా చూస్తూ ఊరుకోరు ! బ్రిటీషువారు మనదేశాన్ని - మంచిగా - వంచనతో స్వాధీనపరచుకొంటే - భారతీయ పుత్రులు చూస్తూ వూరుకుంటారా ! లేదు. 1857లో బ్రిటీషు పాలకులపై 'తిరుగుబాటు' లేదా 'ప్రథమ సంగ్రామం' చేసి తాంతియాతోపే - నానాసాహెబ్ ఝాన్సీరాణి - రాజులు - రాణులు - తాత్కాలికంగా ఓటమి పొందారు. బలవంతులైన బ్రిటీషువారి చేతుల్లో మరలా పందొమ్మిది వందల శతాబ్ది ద్వితీయార్థంలో దేశాభిమానులైన సాధారణ భారతీయులు సంఘటితపడి స్వరాజ్యోద్యమం లేవదీసారు. బాలగంగాధరతిలక్ - గోపాలకృష్ణ గోఖలే - బిపిన్ పాల్ చంద్ర - లాలాలజపతిరాయ్ చిత్తరంజన్ దాసు వంటి నాయకత్వంలో జాతీయోద్యమం ప్రజల్లో చైతన్యం తెచ్చింది. ఈ యిరవయ్యో శతాబ్దం పూర్వార్థంలో గాంధీజీ జాతీయోద్యమానికి నాయకత్వం వహించిన దరిమిలా, అది జవం, జీవం పోసుకుంది ! బలం పుంజుకొంది. మలుపు తిరిగింది. ఆసేతు హిమాచల పర్యంతం - ఆబాల గోపాలం - గాంధీజీ మాటవిన్నారు. ఒక మాటమీద నిలబడ్డారు. ఒక బాటమీద నడిచారు. నెహ్రూ - వల్లభాయిపటేల్ - రాజేంద్రప్రసాద్ - అబ్దుల్ కలాం అజాదు - ప్రకాశం - పట్టాభి - రంగా - రాజాజీ - మదనమోహన్ మాలవ్య - కృపాలనీ - అరుణా అసాఫాలీ - సరోజినీనాయుడు ఇలా యెందరెందరో ఉద్దండనాయకులు - గాంధీజీకి అడ్డంగా నిలబడ్డారు.

జాతీయోద్యమంలో కొందరు క్రియాశీల పాత్రవహిస్తే కవి పండితులు తమ రచనలతో ప్రజల్ని ఉత్తేజపరిచి - జాతీయోద్యమ స్ఫూర్తి కలిగించారు. బెంగాల్‌లో "స్వరాజ్యం నా జన్మహక్కు" అని తిలక్ నిర్భయంగా అన్నాడు. 'వందేమాతరం' బంకించంద్ర

ఛటర్జీ జాతీయ గేయం - విశ్వకవి రవీంద్రుని 'జనగణమన అధినాయక' గీతం— 'సారేజహాసే అచ్ఛా హిందూస్థాన్ హమారా హమారా' ఇక్బాల్ కవి గీతం ప్రజల్ని ఉత్తేజపరిచాయి. ఉద్రూత లూగించాయి. జాతీయోద్యమ కర్తవ్యోన్ముఖుల్ని గావించాయి.

ఆంధ్ర దేశంలో కవిపండితులు కూడా మాతృదేశాభిమానంతో జాతీయ గీతాలెన్నో రాసారు. తెలుగువారిలో తెలివిడి కలిగించారు. జాతీయోద్యమోన్ముఖుల్ని గావించారు. "భరతఖండంబు చక్కని పాడియావు / హిందువులు లేగదూడలై యేడ్చుచుండ / తెల్లవారను గడుసరి గొల్లవారై / పితుకుచున్నారు మూతులు బిగియగట్టి" అని చిలకమర్తి లక్ష్మీనరసింహంపంతులుగారు ధైర్యంగా గళమెత్తి కవితాగానం చేసారు— చిలకమర్తి వారే యింకా "భరతఖండంబె యొక పెద్ద బందెఖాన / అందులోనున్న ఖయిదీలు హిందు జనులు" అంటూ "స్వాతంత్ర్యము లేని బ్రతుకు బ్రతుకే తలపన్" అని స్వాతంత్ర్యకాంక్షను వెలిబుచ్చారు. "దేశమును ప్రేమించుమన్నా మంచియన్నది పెంచుమన్నా"— అంటూ "దేశమంటే మట్టికాదోయ్ - దేశమంటే మనుజులోయ్" "చట్ట పట్టాల్ పట్టుకొని దేశస్థులంతా మెలగవలెనోయ్" అంటూ వట్టి మాటలు కట్టిపెట్టోయ్" గట్టిమేల్ తలపెట్టాలనీ' ఉద్బోధ చేసారు గురజాడ. దేశమంటే ప్రజలనీ - అందరూ సంఘటితంగా వుండాలనీ - గట్టిమేల్ (స్వరాజ్యం) చేయమన్నాడాయన. "ఏ దేశమేగినా ఎందుకాలిడినా పొగడరా నీతల్లి భూమిభారతిని నిలుపరా నీదేశ నిండు గౌరవము" అని రాయప్రోలువారు ప్రజలలో దేశాభిమానం రేకెత్తించారు. "జన్మభూమియే, స్వదేశమే యీనాటి దైవం" అని 1912 లోనే మంగిపూడి వేంకటశర్మ ఆశాభావం వ్యక్తం చేసారు. "పరతంత్రత సౌఖ్యహారము, పరతంత్రత ప్రాణ మానభంగ

కరంబున్" "పరతంత్రత బహు హేయము"ని నొక్కి చెప్పాడు శర్మగారు. "నా మాతృదేశమా - నా ప్రాణప్రదము... నా ప్రాణములకన్న నామేనికన్న నతిగాఢముగ నిన్ను నాత్మ ప్రేమింతు" నని తన దేశభక్తిని వెల్లడించాడు. "మేలుకో భారతకుమారా మేలుకోరా తరుణధీరా" అని దుప్పూరి రామిరెడ్డిగారు భారతీయుల్ని మేలుకొలిపాడు! "మాకొద్దీ తెల్లదొరతనమని" గరిమెళ్ళ సత్యనారాయణగారు గొంతెత్తి పాడాడు." ముప్పదికోట్ల ప్రజలు రాంభజన - పంజరబంధమైనారు రాంభజన - స్వరాజ్య మంత్రం రాగభజన ఒక్కటే మంత్రం రాంభజన-" అని "రామదండు" దుగ్గిరాల బల (గోపాల) రామకృష్ణయ్య "రాంభజన" చేసాడు. "స్వాతంత్ర్యముంగోరి సంగ్రామసీమ చావు మంచిది సేవకావృత్తి కన్న" అని బోయి భీమన్న బానిస బ్రతుకును నిరసించాడు— "మాతృదేశముకంటె మరి దైవతము లేదు" అని టేకుమళ్ళ కామేశ్వరరావు నిజం పలికాడు. "స్వతంత్రపాలన స్వర్గలోకమూ- పరాయిపాలన పాపకూపమూ" అని మొక్కపాటి శ్రీరామశాస్త్రి లెస్స పలికాడు. ఇలా ఎందరెందరో తెలుగుకవులు దేశభక్తిని ప్రదర్శించారు. ప్రజలకు మార్గదర్శులయ్యారు.

అయితే మనమిక్కడొక వాస్తవాన్ని గుర్తించాలి. జాతీయ స్థాయిలో గాంధీజీ నాయకత్వాన 'స్వరాజ్యోద్యమం' ఉద్ధృతంగా సాగుతోంటే - మన ఆంధ్రదేశంలో 'ప్రత్యేక' ఆంధ్రరాష్ట్రం కోసం 'ఉద్యమం' ఉధృతం చేసారు. అంటే జాతీయస్థాయిలో 'స్వరాజ్యోద్యమం' రాష్ట్రస్థాయిలో 'ప్రత్యేక రాష్ట్రోద్యమం' రెండుపాయలుగా సాగిందన్నమాట. తదనుగుణంగా ఆధునికాంధ్ర కవుల 'దేశభక్తి' కూడా రెండుపాయలుగా సాగింది! ఈ వాస్త

వాన్ని డా॥ సి. నారాయణరెడ్డిగారు "ఆధునికాంధ్ర కవిత్వంలో దేశభక్తి రెండుపాయలుగా ప్రవహించింది. ఒకటి జాతీయాభిమాన సంబంధి - రెండవది ఆంధ్రాభిమాన సంబంధి." అని ఎన్నగా చెప్పారు. దీనికితోడు స్వరాజ్యోద్యమానికి గాంధీజీ నాయకత్వం వహించడం వలన, గాంధీజీ విశిష్ట వ్యక్తిత్వాన్ని - గాంధీ చేపట్టిన జాతీయోద్యమాన్ని - మేళవించి తెలుగుకవులు "గాంధీకవిత్వం" వెలయించారు. మొత్తంమీద, భారతదేశాభిమానం - జాతీయోద్యమ స్ఫూర్తిని ఆంధ్రదేశాభిమానం - రాష్ట్రోద్యమ స్ఫూర్తిని - గాంధీజీని - ఆయన నాయకత్వం వహించిన జాతీయోద్యమ దీప్తిని - యిలా మూడు "పాయలు"గా తెలుగునాట "దేశభక్తి" కవిత్వం ప్రవహించింది. ప్రజల్ని ఉత్తేజపరిచింది. కొందరు కవులు గేయాలు, పాటలు రాసిపాడితే - మరికొందరు కవితాఖండికలు, మరికొందరు కావ్యాలు వెలయించారు. కొందరు జాతీయోద్యమంలో పాల్గొన్న నాయకుల్ని - వారి దేశాభిమానాల్ని - వారి ఉద్యమాన్ని ప్రశంసిస్తూ కవితలురాస్తే మరికొందరు పూర్వచరిత్ర ప్రసిద్ధ పురుషుల్ని - సంఘటనల్ని తీసుకొని, కవితలు - కావ్యాలు రాసారు. "రాష్ట్రకవి" "గాంధీకవి" అధ్యాయాల్లో తత్సంబంధిత దేశభక్తి ప్రబోధిత కవితలు - కావ్యాలు రాసిన తెలుగుకవుల్ని గురించి ముచ్చటించుకొన్నాం !

చారిత్రిక నాయకుల లేదా చరిత్ర ప్రసిద్ధపురుషుల వీర గాథల్ని తీసుకొని పరోక్షంగా దేశాభిమానాన్ని - జాతీయ స్ఫూర్తికి కలిగించిన రచనలుచేసిన కవుల్లో చెప్పుకోదగ్గవారు— వారి రచనలు— 1) దుర్భాకరాజశేఖరశతావధాని రాసిన— రాణాప్రతాపసింహచరిత్ర మరియు అమరసింహచరిత్ర (యీ తండ్రీకొడుకులు అక్బరు నెదిరించిన దేశీయ వీరరాజన్యులు)

2) గడియారం వేంకటశేషశర్మ రాసిన "శివభారతము" (ఔరంగజేబుని ఎదిరించిన ఛత్రపతి శివాజీ గాథ) 3) మంగిపూడి వేంకటశర్మ రాసిన 'దుర్గావతి' కథాకావ్యం (గోండు వీరవనిత అక్బరు నెదిరించుట) 4) విశ్వనాథవారి ఝాన్సీరాణి మరియు శివార్పణం. 5) పుట్టపర్తి నారాయణాచార్యులు రాసిన 'షాజీ' 6) దువ్వూరి రామిరెడ్డిగారి "ద్రౌపతి సందేశము" 7) కరుణశ్రీ రాసిన విజయశ్రీ (అర్జునునికి శ్రీకృష్ణుడు యుద్ధకర్తవ్య బోధచేయుట) 8) ఏటుకూరి వేంకటనరసయ్యగారి పల్నాటి "వీరభారతము" (అసంపూర్ణం) 9) పల్నాటి (కన్నెగంటి) సోదరకవులు రాసిన నవభారతం (అసంపూర్ణం) 10) జాషువాకవి శివాజీ (కొన్ని భాగాలు మాత్రమే వెలుగుచూసాయి) మరియు గబ్బిలం (దేశారాధనకు సంబంధించిన పద్యాలు) బోయి భీమన్న 'మధుబాల' (సంగీత నృత్యగేయ నాటిక)— ఇలాంటి రచనలు ఎన్నో! ఎందరో మహానుభావులైన కవులు! అలానే విశ్వనాథవారి 'ఏకవీర' బద్దన్న సేనాని, కడిమిచెట్టు, అడవిబాపిరాజుగారి 'హిమబిందు, గోనగన్నారెడ్డి- అడవిశాంతిశ్రీ, నోరి నరసింహశాస్త్రిగారి రుద్రమదేవి. మల్లారెడ్డి నవలలు పరోక్షంగా జాతీయ స్ఫూర్తినిచ్చాయి. "నవ్యసంప్రదాయోద్యమ కవులకు చారిత్రక కావ్యప్రక్రియ, వచన చారిత్రక నవలాప్రక్రియ, యీ రెండూ జాతీయోద్యమానికి చక్రాయుధంలా పనిచేసిన రెండువరాలని జి. వి. సుబ్రహ్మణ్యంగారి అభిభాషణ.

మరోప్రక్క- జాతీయోద్యమాన్ని - ఆ ఉద్యమంలో ప్రత్యక్షంగా పాల్గొన్న దేశనాయకుల్ని ప్రస్తుతిస్తూ - రాసిన కవితలు- కావ్యాలు రెండవవర్గం - అందులో ముఖ్యంగా చెప్పుకోదగ్గ కవులు వారి రచనలు— 1) బలిజేపల్లి లక్ష్మీకాంతంగారి స్వరాజ్య

రథము 2) దుప్పూరి రామిరెడ్డిగారి 'స్వాతంత్ర్య రథము మరియు భారత మాతృప్రబోధం 3) జాస్తి వేంకటనరసయ్యగారి జయభేరి 4) దేవులపల్లి రామానుజరావుగారి పచ్చతోరణం 5) పుట్టపర్తి వారి 'సిపాయి పితూరి' 6) రాయప్రోలువారి గోఖలే నిర్యాణం 7) చెళ్ళపిళ్ళవారి లోకమాన్యతిలక్ 8) సి. నారాయణరెడ్డిగారి ఎర్రగుర్బీ 9) జాషువాగారి బాపూజీ - నేతాజీ కావ్యాలు 10) కొండవీటి వేంకటకవిగారి నెహ్రూ చరిత్ర (ఆత్మకథ అను వాదం) 11) చెరుకువాడ వేంకట్రామయ్య - గాదె జగన్నాథ స్వామిగార్ల లాలాలజపతిరాయి 12) మంత్రిప్రగడ భుజంగరావుగారి దాదాభాయినౌరోజీ 13) మరింగటి శేషాచార్యులుగారి శ్రీగాంధి భారతం - మహాభారతంలోని శ్రీకృష్ణునితో గాంధీజీని పోలుస్తూ- స్వరాజ్యోద్యమాన్ని మహాభారతంతో పోల్చిచేసిన రచన 14) ముదికొండ వీరభద్రమూర్తిగారి భారతస్వాతంత్ర్య సంగ్రామము (1857 లో జరిగిన భారతీయ రాజులుచేసిన తిరుగుబాటు (సిపాయీల తిరుగుబాటు) నుండి జాతీయోద్యమ చరిత్రచెపుతూ చివరకు దేశ ప్రజల మద్దతుతో సైనికవిప్లవం ద్వారానే స్వరాజ్యం సిద్ధిస్తుందని ఊహించి రాసిన రచన) మరియు "వందేమాతరం" 15) వడ్డాది సీతారామాంజనేయులు, పెద్ది కాశీవిశ్వనాథశాస్త్రిగార్ల స్వరాజ్య గీతామృతం 16) మహావాది వేంకటరత్నంగారి విశ్వభారతి-ఇలా ఎన్నో రచనలు - 'ఉమర్ అలీషాకవి' జన్మభూమి దేశమాత దండకం - పండిత సీతారామశాస్త్రిగారి ప్రబోధకవి, కొండల వేంకటరావుగారి మాతృదేశ సంకీర్తనము, పైడిపాటి సుబ్బరాయశాస్త్రి, గురజాడ రాఘవశర్మగారి 'స్వరాజ్యపథము' చన్నాప్రగడ భానుమూర్తిగారి 'వందేమాతరం' భారత ధర్మదర్శనం చెప్పుకోదగ్గవి

ప్రముఖ సాహితీవేత్త సాహితీ విమర్శకుడు శ్రీ జి. వి. సుబ్రహ్మణ్యంగారు— "దేశభక్తి" కవిత్వం గురించి వివరిస్తూ

"సమకాలీన రాజకీయోద్యమ స్ఫూర్తితో జన్మించి వికసించి-జీవించి ప్రజలను కూడా అందులో జీవింపజేసి ఒక నవ్యమైన అనుభవాన్ని ఆంధ్రులకూ ఆంధ్ర సాహిత్యానికి అందజేసింది దేశభక్తి కవిత్వమే "అందువలననే దేశభక్తి కవితలను జాతీయోద్యమ కవిత్వంగా కూడా సాహిత్య చరిత్రకారులు వ్యవహరిస్తున్నారు" అంటూ "ఆధునిక సాహిత్యంలో దైవభక్తికి దీటుగా దేశభక్తిని నిలిపింది, దేశభక్తిని దైవభక్తికి సాధనంగా సంభావించగలిగిందీ గాంధేయ సిద్ధాంత దర్శనమే, నవ్యసంప్రదాయోద్యమమే" (సాహిత్యంలో చర్చనీయాంశాలు) అని అభిభాషించారు! అంటే జాతీయోద్యమం - గాంధేయవాదం - రెంటినీ స్వీకరించి వెలువరించిన కవిత్వం 'దేశభక్తి' కవిత్వమని శ్రీ జి. వి. యస్. అభిభాషణ. మన తెనుగు లెంక కవిత్వమంతా "దేశభక్తి" కవిత్వమే గదా !

ఇక తెనుగులెంక శ్రీ తుమ్మలవారి 'జాతీయ స్వరూపం' చూస్తాం. "రాష్ట్రసిద్ధికొరకు రక్తంబుకార్చి" రాష్ట్రగానం - ఉదయగానం - చేసిన 'రాష్ట్రకవి'గా గాంధీ విశిష్ట వ్యక్తిత్వానికి - గాంధీ నడిపిన జాతీయోద్యమానికి ప్రభావితుడై బాపూజీ 'ఆత్మకథ' మహాత్మకథ - గాంధిగానం - అమరజ్యోతి వంటి కావ్యాలురాసిన "గాంధీకవి"గా తుమ్మలవారి 'ఆంధ్రాభిమానం' "గాంధీభక్తి" యెంతటిదో మనం మరొకచోట విపులంగా చర్చించుకున్నాం. మరి గాంధికవి అయిన తుమ్మలవారు జాతీయవాది కాకుంటాడా అన్న సందేహం వస్తుంది. నిజమే ! గాంధేయవాదులంతా జాతీయవాదులే అయితే జాతీయవాదులందరూ 'గాంధేయవాదు'లని చెప్పలేం. గాంధీ విశిష్ట వ్యక్తిత్వాన్ని మెచ్చుకొన్నవారు ఆయన దేశ స్వాతంత్ర్యం కోసం అనుసరించిన 'నాన్చుడు' విధానంతో ఏకీభవించనివారు దేశంలో ఎందరో నాయకులున్నారు. కాంగ్రెస్ పార్టీ

లోనూ వున్నారు. కమ్యూనిస్టులు - సోషలిస్టులు సుభాస్‌చంద్ర బోస్ - డా॥ అంబేద్కర్ వంటివారు 'జాతీయవాదులే! దేశానికి స్వాతంత్ర్యం కోరినవారు. అందుకు శక్తివంచనలేకుండా శ్రమ పడ్డారు. అయితే వారు గాంధేయవాదాన్ని గాంధేయవిధానాన్ని కాదనిరాజన్నారు. ఇది చాలా సన్నితమైన స్వల్పమైన తేడా! కనుక జాతీయవాదులంతా గాంధేయవాదులు కాదు!

మాతృదేశాన్ని అభిమానించడం - దేశాన్ని ప్రేమించడం- దేశభక్తి కలిగివుండడం - దేశప్రతిష్ట - దేశగౌరవం - దేశసమగ్రత - దేశభద్రత - దేశరక్షణకోసం 'ఉడుతా' భక్తితో పాటు పడడం - జాతీయతగా చెప్పుకోవచ్చు. దేశం పరప్రభువుల పాలనలో మగ్గిపోతూవుంటే దేశ దాస్యవిముక్తికి - దేశస్వాతంత్ర్యం కోసం తనవంతు కృషిచేయడం గూడా దేశభక్తి క్రిందకు వస్తుంది. దేశస్వాతంత్ర్యం కోసం జాతీయోద్యమ నాయకుడిగా జీవితాంతం 'త్రికరణశుద్ధి'గా జీవితం ధారపోసిన గాంధీజీని వైయక్తికంగాను- జాతీయ స్ఫూర్తితోను 'త్రికరణశుద్ధి'గా నమ్మి ఆచరణలో గాంధీజీ అడుగుజాడలో నడిచి - గాంధీ కవిత్వం రాసిన 'గాంధికవి' శ్రీ తుమ్మల నిస్సందేహంగా జాతీయవాది — జాతీయకవి!

శ్రీ తుమ్మల జాతీయ కాంగ్రెస్‌పార్టీలో క్రియాశీలసభ్యుడు- కార్యకర్త! తాలూకా కాంగ్రెస్ కార్యదర్శి గూడా. గాంధీజీ పిలుపుమేరకు 'పన్నుల నిరాకరణోద్యమం'లో పాల్గొని కావూరు లోను చుట్టుపట్ల పన్నులు చెల్లించవద్దని తప్పెట 'టముటమా' వేసి బ్రిటీషు అధికారులచే 'అపరాధ రుసుం' విధింపబడినవాడు! కావూరులోని తిలక్ జాతీయ పాఠశాలలోపనిచేసాడు. కాకినాడలో జరిగిన అఖిలభారత కాంగ్రెస్ సమావేశాలకు హాజరైనాడు.

తెలుగులెంక భరతమాతను వర్ణించిన తీరు విశిష్టమైనది. చూడండి.

సీ॥ వెన్నతోడెనె చతుర్వేద బుక్కలుపంచి
సుతులకే జనయిత్రి చుంచుదువ్వెఁ
త్రిజగంబు లన్యథా సృజియించు గడుసరి
కొసరి యేతల్లిచన్ గుడిచి తనిసె
ఱాలు విత్తినచో వరాల గుత్తులు పండు
నవని పైనే రాణిహక్కను వడసె
పాత్రంబులగు నిహామాత్ర సంపదలిచ్చు
తటిను లేదేవి పూదండయయ్యె
తే.గీ॥ మూడు సంద్రాలు నగరాజు మోకఱించి
యే మహాశక్తి నర్చింతురెల్ల దెసల
నమ్మహేశ్వరి కఖిల కల్యాణ ఖనికి
భారతసవిత్రి కర్పిస్తె ప్రాంజలింతు—

(పఱిగపంట)

భారతీయులకు వేదబుక్కలు 'వెన్నతో పెట్టిన' వాక్కులు ! ఈ దేశంలో రాళ్ళు విత్తినా రతనాలు పండుతాయి ! అంటే అంతటి సారవంతమైన దేశం ! జీవనదులు ప్రవహించు దేశం ! మూడు ప్రక్కలనున్న సముద్రాలు – హిమాలయ శిఖరం - యీ భారత మాతకు "నతశిరస్కలౌ" తాయట ! అట్టి కల్యాణఖని భారత జననికి అంజలిస్తున్నాడు. సరళమైన భాషలో జీవం - జవం ఉన్న ఉన్నతభావం ! సహాజమైన వర్ణన

శా॥ వీరుల్ త్యాగులు దేశభక్తులు జగద్విఖ్యాత కీర్తిప్రభా
శ్రీరోచిష్ఠులు బుద్ధశంకర శివాజీ గాంధి గంగాధర రా
న్నారీ ముఖ్యులు పుత్రులే జననికిన్ జన్మించి రగ్గార వా
ధారన్ భారతమాత నెంతు జరితార్థత్వంబు నర్థించుచున్

(ఆత్మకథ – కృతజ్ఞత)

ఈ పద్యంలో 'ఊహాలోకం'లో భావావేశంతో - భారతమాతను 'శ్లాఘించడం' జరగలేదు. ఇందులో దేశమాతను 'యదార్థదృష్టితో', హేతుదృష్టితో - వీరుల్ని త్యాగుల్ని - దేశభక్తుల్ని - విశ్వ విఖ్యాతులైన బుద్ధుని - శంకరుని - శివాజీని — గాంధీజీని — గంగా ధరునివంటి ప్రముఖుల్నికన్న మాతృమూర్తిని స్మరించుకున్నాడు కవిగారు ! ఎంత నగ్నసత్య వర్ణన ! ఎంత సహజసిద్ధ వర్ణన

ఇంకో చక్కని వర్ణన చూడండి.

సీ॥ తన ప్రేమసూత్ర మార్త క్షోణికి నశోక
రాజ్యమై ధర్మచక్రమును ద్రిప్ప
తన త్యాగనిరతి యాత్మబలి ప్రధాన రా
మ రహీమమై జగన్మతము జాట
తన సరస్వతి మహాతత్త్వోపనిషదభి
రామమై యజరామరత వెలార్ప
తన యశోరాశి శీత నగేంద్రమైనభః
కషతమై నిల్చి నల్లడను దేర్ప
తే.గీ॥ తన తనూవల్లి జహ్నుజాతాముఖోత్థ
మాపగా శీకర పరంపరా పునఃపు
నప్ప మార్ద్రమై క్రొంగొత్త ననలుతొడగ
నలరు భారత జనయిత్రి కంజలింతు

—మహాత్మతథ

భారతమాత యొక్క ప్రేమసూత్రం అశోకుని రాజ్యంగా రూపొంది ధర్మచక్రాన్ని త్రిప్పింది. ఆ తల్లియొక్క 'త్యాగనిరతి' గాంధీజీలో 'ఆత్మబలం'గా నిరూపించి — "రామ — రహీము భేదరహిత' విశ్వ మతంగా చాటింది ! ఆ తల్లియొక్క "వాక్కు" ఉపనిషత్ "వాక్యమై" అభిరామమై — యజరామరంగా వెలుగొందుతున్నది!

ఆ భారతమాత "యశస్సు" హిమాలయోత్తుంగ మహోన్నతమై- నింగిని తాకుతూ విశ్వం నాల్గుదెసల తలెత్తుకొని సగర్వంగా చూస్తూ పరిఢవిల్లుతున్నది. పావనగంగాది జీవనదుల ప్రభావంతో భారతీయతా తనూవల్లి క్రొంగొత్త ననలుతొడిగి నిత్యనూతనంగా - పరిఢవిల్లుతోంది. అట్టి భారత జనయిత్రికి అంజలిస్తున్నాడు తెనుగులెంక !

తుమ్మలవారు - స్వాతంత్ర్య సమరగాథ అనదగ్గ 'మహాత్మ కథ' రాయకపూర్వం - తన 'పఱిగపంట' ఖండకావ్యంలో తేజ బహద్దూర్ సిక్కుగురూత్తముని "ఆదర్శవీరుడి"గా తీసుకొని- కవితా ఖండికను వెలయించారు. తేజబహద్దరు మొగలు పాదుషా ఔరంగ జేబునకు పట్టుబడిన సంఘటనను తీసుకొని - కవితా ఖండికను వెలయించాడు. మొదల్ పాదుషాకు 'దాసోహమంటానికి' సిక్కు వీరుడు నిరాకరిస్తాడు. తనని చంపితే ప్రతి రక్తపుబొట్టు నుండి వెయ్యిమంది వీరులు జన్మిస్తారని - మహమ్మదీయుల పీచమణుస్తారని సిక్కువీరు డంటాడు" భారత పుత్రులాత్మ జననీదాస్యంబు మాయింప దుర్వారోత్సాహంబు నన్నింజాగము తృణప్రాయంబు గానిత్తు అని సిక్కువీరునిచేత కవి చెప్పిస్తాడు. మాతృదేశంకోసం భారతపుత్రులు తమ ప్రాణాల్ని సహితం పణమొడ్డుతారని కవి యిక్కడ ధ్వనింపజేసాడు.

అలానే పల్నాటివీర పౌరుషగాథలోని బాలచంద్రుడు రణ రంగంలో దూకబోవు సమయంలో తల్లి 'ఐతాంబ' ఉద్బోధ చేసిన సన్నివేశాన్ని తీసుకొని 'వీరధర్మము' అనే కవితాఖండికలో- వీరధర్మాన్ని - రాజపుత్ర ధర్మాన్ని - దేశరక్షణ ధర్మాన్ని గుర్తు చేసాడు కవి ! "మాతృదేశం బన్యమనుజేశ్వరునిచేత జిక్కి స్వాతంత్ర్యంబు దక్కి తనదు జాతీయతను బాసి' నపుడు— ఆతల్లి 'నీచదాస్యమున మునింగి' శోకించు వేళ' తల్లి మొఱ నాలకించక

"కొంచమేని నా మెకు దోడ్పడలేని ఒడ్డబతుకదేటికి ధాత్రికి బరువు చేటు" అని కొడుకుని "ఎత్తిపొడుస్తూ" అతనిలో "పౌరుషం" ప్రజ్వరిల్లే విధంగా మాతృదేశ రక్షణ ప్రతిపడ్డ విద్యుక్త ధర్మమునీ తన కవితలో 'ధ్వనింప' చేసాడు తెనుగులెంక ! ఇలానే తుమ్మల వారి "విద్యార్థి" "పాదధూళి" స్వతంత్ర భారతము నేతాజీవంటి కవితాఖండికలు తుమ్మలవారి దేశభక్తికి ప్రబల నిదర్శనం.

గాంధీకవి రచించిన 'ఆత్మకథ' బాపూజీ నిజాత్మకథ అయితే "మహాత్మకథ" నిజానికి గాంధిజీవితకథ కాదు. గాంధీ నాయకత్వంలో విజయవంతంగా సాగిన 'భారత స్వాతంత్ర్యసమర గాథ" భారతదేశ స్వాతంత్ర్యం కోసం గాంధీజీ చేపట్టిన వివిధ ముఖ్యఘట్టాల్ని తీసుకొని 'మహాత్మకథ'గా వెలయించాడు గాంధికవి. "మానవవేట" అనదగ్గ జలియన్‌వాలాబాగ్ దురంతాలు, సహాయనిరాకరణోద్యమం, పన్నుల నిరాకరణ, కోర్టుల బహిష్కరణ - విదేశ వస్త్రదహన కార్యక్రమం - శాసనోల్లంఘనం - సైమన్‌కమీషన్‌పట్ల భారతీయుల వ్యతిరేకత - మహాత్మాగాంధీ దేశపర్యటన - ఆంధ్ర పర్యటన - సంపూర్ణ స్వాతంత్ర్యమే కాంగ్రెస్ లక్ష్యమన్న జాతీయ కాంగ్రెస్ తీర్మానం - ఉప్పు సత్యాగ్రహం - లండన్‌లో జరిగిన వలయత సమావేశాలు (Round Table Conferences) క్విట్ ఇండియా ఉద్యమం - నేతాజీ సుభాస్‌చంద్రబోస్ నిర్వహించిన పాత్ర— పలు సందర్భాలలో గాంధీజీ చేపట్టిన నిరాహారదీక్షలు ఆమరణ నిరాహారదీక్షలు - సత్యాగ్రహవ్రతాలు - గాంధీజీతో పాటు దేశనాయకులు అనేకసార్లు జైళ్ళపాలుకావడం - కాంగ్రెస్-ముస్లింలీగుల మధ్య యేర్పడిన ప్రతిష్టంభన - నెహ్రూ నాయకత్వంలో ఏర్పడిన తాత్కాలిక జాతీయ ప్రభుత్వం - దేశస్వాతంత్ర్యం సిద్ధించుట - పాకిస్థాన్ విభజన - కాశ్మీరుపై పాకిస్థాన్ దురా

క్రమణ - గాంధీ హత్య - యిత్యాది దేశస్వాతంత్ర్యం కోసం సాగిన చారిత్రకముఖ్యసంఘటనల్ని తీసుకొని 'మహాత్మకథ'గా వెలయించాడు తుమ్మలవారు. మహాత్ముని పట్ల గాంధికవికున్న 'అభిమానం'తో 'మహాత్మకథ' అని నామకరణం చేసేడేతప్ప నిజానికిది దేశస్వాతంత్ర్య సమరగాథ - జాతీయోద్యమంలో భాగంగా విద్యార్థుల్ని నుద్దేసించి— "దాస్యస్ఫూర్తి జింతాభరా పాద్యంబై భరతోర్వి నేడు విలపింపన్ సాగ" దద్రోదన వీనులజొరదా! విద్యార్థీ! నిన్ను గన్నతల్లి మొఱ నీ వెయిట్లు పేక్షింతువా" అంటూ "లెమ్మిక మీనమేషములు లెక్కలు మానుము భావదాస్య బంధమ్మును త్రెంచివేయుము" అని కర్తవ్యాన్ని బోధిస్తాడు. "ధర్మసమరంబిది భారతజాతి ముక్తికై సాగినదోయి" అంటూ "సంగరము సేయుడు త్రోయుడు మాతృదుఃఖమున్" అని గాంధీ నాయకత్వాన సాగిన సహాయనిరాకరణోద్యమం గురించి వివరించాడు. "తెగబడె భారతోర్వి" అంటూ శాసనోల్లంఘన ఉద్యమం గురించి ఒక్కమాటలో చెప్పాడు. ఇంతటి భారతస్వాతంత్ర్య సమరగాథను 'మహాత్మకథ'గా మలిచిన గాంధికవి నిజంగా జాతీయవాది - జాతీయకవి! తుమ్మలవారు తెలుగువాడు అందునా 'ఆంధ్రాభిమాన మెక్కువగా వున్నవాడు కనుక మహాత్మకథలో ఆంధ్ర దేశంలోని స్వరాజ్య సమర ఘట్టాలు— పల్నాటి హనుమంతు - పెదనందిపాడు - చీరాల పన్నుల నిరాకరణ ఘట్టాలు - అల్లూరి సీతారామరాజు చరిత్ర వగైరా విపులంగా చెప్పాడు! బాగానే వుంది; అయితే "త్యాగానికి దేశాభిమానానికి మారుపేరు అయిన 'భగత్ సింగు' కథనం- "విపులంగా" రాయకపోవడం కాస్త బాధవేస్తుంది!

తెంగోని 'స్వరాష్ట్రోద్యమం' "తెలుగువాడనన్న" అహంకారం నాకెక్కువ "ఈ అహంకారమే నన్ను కవిని చేసినది" అని

కరాఖండిగ చెప్పిన తుమ్మలవారు 'నా జాతియు నా భాషయు పరకీయ సంస్కారముతో పరతంత్రములై' పోవుట సహించలేక పోయాడు. మనస్సులో అనుక్షణం ఆరాటపడ్డాడు. "ఈ ఆరాటము నకు నా జీవుడు కదలినాడు - ఆ కదలికయే రాష్ట్రగానం" అని చెప్పుకొన్నాడు. స్వరాష్ట్రం వచ్చాక 'ఉదయగానం' లో తెలుగు వారికి కొన్ని సలహాలు హెచ్చరికలు చేసాడు. "తెలుగుతల్లికి దేజముల్ తెచ్చుకొరకు నడుముగట్టుడు రాష్ట్రంబు వడయుకొఱకు" అని రాష్ట్ర కవితాగానం చేసి తెలుగు ప్రజలకు స్ఫూర్తినిచ్చాడు. రాష్ట్రగానంతో తెలుగులెంక చేసిన ప్రబోధం - యిచ్చిన స్ఫూర్తి- 'రాష్ట్రోదయమైన' తర్వాత ఆయన తెలుగువారికిచ్చిన 'హెచ్చరికలు' గూర్చి యింకొక-చోట (రాష్ట్రకవిగా) విపులంగా చర్చించడం జరిగింది. కనుక ఆ విషయం యిచ్చట చర్చించడం లేదు.

ఇలా సమకాలీన జాతీయోద్యమ స్ఫూర్తితో స్వరాష్ట్రోద్యమ స్ఫూర్తితో పుంఖానుపుంఖంగా కవితలు వెలయించాడు తుమ్మల. "నేను తెలుగువాడనను అహంకారం నాకెక్కువ" అని తెలుగులెంక సగర్వంగా - కరాఖండిగా చెప్పుకున్నా "దేశభాషకు దోడు జాతీయభాష" "యాంధ్రతకు దోడు భారతీయత్వము"ండ వలెనని ఉద్బోధ చేసాడు. "మాతృమహీ గౌరవములు మానవునకు ప్రాణమ్ములు - స్వాతంత్ర్యము లేనిజాతి చచ్చుజాతి మచ్చుజాతి" అని అభిభాషించాడు. "దేవుడన మాతృదేశము దేవతలన ప్రజలు" అనిగూడా అభిభాషించాడు. మాతృదేశం అంటే దైవసమానమని, ప్రజలంటే దేవతలని ఆయన అభిభాషించడం గమనించదగ్గది! "సుందర భారతదేశం బందఱకున్ గుడియగున్ మహాతీర్థమగున్" అనిగూడా అభిభాషించాడు! గుడిలో దేవుణ్ణి నిత్యం ఆరాధించి నట్లు - భారతమాతను నిత్యం ఆరాధించాలని కవి భావన!

దేశభక్తి రసం నవ్యసంప్రదాయ సాహిత్యోద్యమానికి ఆత్మచైతన్య మిచ్చిందని, గాంధీదర్శనం మానవ వికాసంగా జాతి జీవనపరంగా విశ్వమానంగా నిరూపించిందని సెలవిచ్చినజి.వి. సుబ్రహ్మణ్యంగారు గాంధీకవి, మహాత్ముని ఆస్థానకవి, రాష్ట్రగానకవి అయిన తుమ్మల వారిని తమ "సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలు"లో పేర్కొనక పోవడం దురదృష్టకరం. (దేశభక్తి రచనలు చేసినవారినెందరనో చెప్పాడు)

ఈ విధంగా జాతీయోద్యమ కవిత్వాన్ని - రాష్ట్రోద్యమ కవిత్వాన్ని వెలయించిన తెనుగులెంక ముమ్మాటికీ యెన్నటికీ 'సిసలైన' జాతీయవాది - జాతీయకవి ! ఇట్టి జాతీయకవిని యిటు రాష్ట్రప్రభుత్వంగాని - అటు భారతప్రభుత్వంగాని 'జాతీయ స్థాయి'లో గుర్తించకపోవడం దురదృష్టకరం ! అలా గౌరవించక పోవడం - రాష్ట్ర భారతప్రభుత్వాల "చిన్న" మనస్సును చాటుతుందితప్ప 'ఆత్మాభిమాని' యైన తెలుగులెంకకు అది లెక్క కాదు! అది అగౌరవం కాదు ! ఆయన కవిత్వం ఆయన జాతీయత- అమరం - ఆయన అజరామరుడు !



క్రొత్తయుగమ్ము వచ్చినది కోర్టుల రోసిరి న్యాయవాదు లీ
వృత్తి మహాఘమూలమని విత్తము వందలువేలు తెచ్చు భూ
భృత్తుల కొల్వుమానిరి వివేకులు కొందఱు: నీచదాస్య ధీ
విత్తనమాంగ్ల విద్యయని వీడిరి కుఱ్ఱలు పాఠశాలలన్
[సహాయ నిరాకరణోద్యమ ఘట్ట వర్ణన] **(మహాత్మకథ)**

# సర్వోదయ కవిగా

పదుగురులో నాయకుఁడకున్
ముదమిడు రాజ్యమ్ము కాదు మొత్తము ప్రజ కిం .
పొదవించు ప్రభుత కావలె
నిదె సర్వోదయ విధానమిదె కామ్యమగున్

— ఎక్కిరాల

సర్వోదయమనగానే వినోబాభావే - ఆయన చేపట్టిన భూదాన యజ్ఞ నిర్వహణ భూదానసేకరణ కార్యక్రమాలు మనకు స్మరణకొస్తాయి. సర్వోదయ సిద్ధాంతానికి - దాని ప్రచారానికి - దాన్ని ఆచరణలో పెట్టటానికి - తన శాయశక్తులా పాటుపడ్డవాడు వినోబాభావే కావచ్చుకాని. అసలా 'సర్వోదయ' పదసృష్టికర్త - ఆ సర్వోదయ సిద్ధాంతానికి ప్రపథమంగా మనదేశంలో జీవంపోసిన వాడు మహాత్మాగాంధిజీ ! అంటే చాలామందికి ఆశ్చర్యం వేస్తుంది !

గాంధీజీ దక్షిణాఫ్రికాలో భారతీయులకోసం ఉద్యమం నడుపుతున్న రోజులలో 'పోలక్' అనే ఆయన విదేశీమిత్రుడు 'రస్కిన్' రాసిన "అంటు దిస్ లాస్టు" (Unto This Last) అనే చిన్న పుస్తకాన్ని గాంధీజీకిచ్చాడు. ఆ పుస్తకం గాంధీజీనెంతో ప్రభావితం చేసింది. భగవద్గీత - ఆర్నాల్డు రాసిన ఆసియాజ్యోతి (Light of Asia) బైబిల్‌లోని 'కొండమీది ప్రసంగం' (Serman on the Mountain) గాంధీజీని ఎంతగా ప్రభావితం గావించాయో - రస్కిన్ రచనగూడా అంతగా ప్రభావితం చేసింది.

చదివిన ముక్కలు నాల్గును
హృదయమ్మున కతికిపోయె నీ కొంచెములో
బ్రతుకుం బ్రన్నగ దిద్దిన
యది, రస్కిను వాణియొకడయని వ్రాక్కుత్తున్

(ఆత్మకథ)

ఆ "మేలితరము" కృతి గాంధీజీని అంతగా ఆకట్టుకొనడమే కాదు అది ఆయన 'బ్రదుకుం బ్రన్నగ దిద్దినది' అని గాంధీజీయే తన ఆత్మకథలో చెప్పుకొన్నాడు.

ఆ రస్కిన్ రచనకు గాంధీజీ 'సర్వోదయ' మను పేర గుజరాతు భాషలోనికి తర్జుమా చేసాడు గూడా.

"ఏవే భావాలు నాయెడద దాగి" యున్నవో "వాని ప్రతి మరె రస్కిన్ వాణిలోగంట" నని గాంధీజీ చెప్పాడు. పైగా "నిది నన్ను నేలకోగల్గె దనకు నిచ్చయగు నడుగు వేయించితీరె" నని గూడా చెప్పుకొన్నాడు. రస్కిన్ రచన తన యిష్టమొచ్చిన రీతిని గాంధీజీచే 'అడుగువేయించి' తనను 'ఏలుకోగల్గినద'ట ! గాంధీజీని మరియెంతగా రస్కిన్ రచన ప్రభావితం చేసిందో మనం అర్థం చేసుకోవచ్చు !

అంతటి గాంధీజీనంతగా ప్రభావితంచేసిన రస్కిన్ రచనలోని ముఖ్యాంశము లేమిటంటే— 1) సర్వజనుల శ్రేయస్సునందే ప్రతి వ్యక్తి శ్రేయస్సు ఇమిడివుంది. కనుక వైయక్తిక శ్రేయస్సునకు-సమిష్టి శ్రేయస్సుకు ప్రతివ్యక్తి శ్రమ చేయవలయును. 2) ఒక న్యాయవాద వృత్తి విలువఎంతో ఒక మంగలివృత్తి విలువగూడా అంతే 3) భూస్వామియు - రైతుకూలీ విలువయు సమానమే అట్టి జీవితం ఉత్తమము అంటే ఒక వృత్తి గొప్పది మరొకటి నీచ

మైనది కాదు. వృత్తులన్నియు సమానముగా గౌరవింపదగ్గవి. అంటే వృత్తి గౌరవము (Dignity of Labour) అందరు గుర్తించి మన్నించవలెను. కష్టంచేసి ప్రతివాడు జీవించుటయే సహజమైన జీవితం. అనగా సోమరితనం లేకుండా పరాన్నభుక్కులు కాకుండా స్వయంకృషిమీద స్వశక్తిమీద (స్వయం ఉపాధి) ప్రతివారును జీవించవలెను.

"ఈసూత్రమ్ములు మీాటికి / దాసుడనై నాదు జీవితంబును దిద్దన్ / జేసితి జతనము విజయ / శ్రీసంధిల జేయుమని భజించితి నీశున్" రస్కిన్ చెప్పిన సూత్రాలకు గాంధీజీ దాసుడైపోయాడట! రస్కిన్ సూత్రబద్ధంగా జీవితవిజయం చేకూర్చమని ఈశ్వరుణ్ణి గూడా వేడుకున్నాడు గాంధీజీ! అంటే గాంధీజీ 'సర్వోదయ' సిద్ధాంతాలకు జీవితమంతా కట్టుబడి పోయాడన్నమాట. విశేషమేమంటే తన స్వీయగాథలో గాంధీజీ యీ రస్కిన్ రచనపై "ఒక రచన మహిమ" అన్న పేర ఒక అధ్యాయమే రాసుకున్నాడు!

గాంధీజీ తన ఆత్మకథలో రస్కిన్ రచన ప్రభావంపై ఒక అధ్యాయం రాసుకొంటే - శుద్ధగాంధేయవాదియైన తెనుగులెంక 'సర్వోదయగానము' అనే కావ్యాన్నే రచించాడు. అందులో వినోబాభావే విశిష్ట వ్యక్తిత్వం గూర్చి— 'సర్వోదయ' సిద్ధాంతంపై వినోబా చేసిన ప్రవచనాలు (భావే చక్కట్లు) భూదానయజ్ఞ నిర్వహణలో భాగంగా వూరూరా - గ్రామగ్రామాన వినోబా తిరిగి భూస్వాముల నుండి సామాన్యుల నుండి 'స్వచ్ఛంద'ంగా దానంచేసిన 'భూ' సేకరణ సన్నివేశాల్ని 'పవిత్ర సన్నివేశాల' పేరుతో యీ 'సర్వోదయ' కావ్యంలో తెనుగులెంక రసవత్తరంగా కవితాగానం చేసాడు.

సర్వుల శ్రేయస్సులో వ్యక్తిశ్రేయస్సు ఇమిడివుంది. అంటే అందరూ సుఖసంతోషాలతో వున్నప్పుడే ప్రతివ్యక్తి సుఖసంతోషా

లతో వుండగలము. ఇందుకు ప్రతివారు తమవంతు కృషిచేయాలి. అదే సేవాధర్మమన్న మాట. మానవ సేవయే మాధవసేవ అన్నది దీని సారాంశం. గాంధీజీ ఇలానే తన జీవితాంతమంతా దేశంకోసం-ప్రజలకోసం - దీనులకోసం - హరిజనులకోసం త్యాగం చేసాడు గదా ! వృత్తి గౌరవం సమర్థించడం అంటే ఒక వృత్తి గొప్పది మరొక వృత్తి నీచమైనది అన్న విభేదం లేకపోవడం. వ్యక్తి జీవిత వికాసానికి పనికివచ్చే వృత్తులన్నిటను గాంధీజీ సమర్థించాడు సమ గౌరవం యిచ్చాడు. కనుకనే శాస్త్రసమ్మతమైన 'వర్ణాశ్రమ' ధర్మాల్ని ఆయన సమర్థించాడు. ఇకపోతే ఎవరికివారు స్వయంశక్తి మీద జీవించాలన్న సూత్రానికి బద్ధుడై గాంధీజీ తానూ - తన కుటుంబసభ్యులు - తమ గృహంలో పనులన్నీ తామే - పని మనుష్యులమీద ఆధారపడకుండా - అవసరంలేకుండా స్వయంగా చేసుకొనేవారు. గాంధీజీ స్థాపించిన సబర్మతీ ఆశ్రమం - సేవాగ్రాం ఆశ్రమం తదితర ఆశ్రమాలలో కూడా ఆశ్రమవాసులు - ఎవరి పనులు వారు స్వయంగా చేసుకొనేటట్లు - ఆశ్రమపనులు అందరూ కలిసి సమిష్టిగా చేసుకొనేటట్లు ఆశ్రమ నియమాలు రూపొందించి-అమలుపరిచేటట్లు చూసాడు గాంధీజీ. గాంధీజీ కూడా స్వయంగా తన పనులు - బట్టలుతుకుకొనుట - చాకలి పని - మంగలిపని చేసుకొనేవాడు గదా !

ఈ 'సర్వోదయం'పై- భావే ప్రవచనాలపైన భావే భూసేకరణోద్యమంపైన తెనుగులెంక కావ్యబద్ధం చేసిన కొన్ని ముఖ్య విషయాల్ని పరిశీలించుదాం.

కుత్తుకలుగోసి నెత్తు[illegible]నాడు
తృష్ణలను ద్రుంచి యుష్మ[illegible] మందించు నతడు
విప్లవముకాదు వానిది విశ్వశాంతి
కాదరువుగానె సంఘ సర్వోదయంబు. —సర్వోదయగానం

నెత్తురుకూడదు - దురాశ - రక్తపాతరహిత విప్లవంద్వారా కాకుండ లోకంనకు 'అమృత' మందించే విశ్వశాంతిదూత - సర్వోదయ మార్గదర్శిగా వినోబాభావేని వర్ణిస్తున్నాడు గాంధేయకవి.

స్వార్థంతో తమ పొట్టనింపుకొనే ప్రాకులాడు పశుపక్ష్యాదులవలెకాక 'కడుదుర్లభ'మైన మానవ జన్మమెత్తిన వారు 'లోక సేవానురక్తులై' 'సార్థకముగు నరత్వ మలవరుచుకొని 'విశ్వహితార్థులై మనుడు" మంచిబాట గనుడు చనుడు - మోక్షపు ముక్తి-అదియె సర్వోదయంబు నానెనగు" అని భావే భావనగా కవి ఉద్బోధిస్తున్నాడు కవితారీతిలో.

తమ కన్నబిడ్డల సుఖము జననీజనకులు కోరుకొన్నట్లుగా— భగవంతుడు తన సృష్టిలోని సకలప్రాణికోటి సుఖించాలని ఆశిస్తాడు. అయితే స్వార్థ తృష్ణకొందరిలో పెచ్చుపెరిగి ఒకరినొకరు "దోచు"కొనడంవల్ల కొందరు సుఖిస్తున్నారు మరికొందరు దుఃఖిస్తున్నారు కనుక "తృష్ణ" విడిచి మనుజుడితరుల ప్రేమించుచెలుగ వలయు తృప్తి మరగవలయు" నంటాడు కవి. ఎందుకనగా "ప్రేమ గలచోట నాకటిపీడలేదు - ప్రేమగలచోట ప్రాణికేభీతి లేదు" అని అంటూ "ప్రేమ కొలదిసుఖము పెరుగును దేహికి బండికొలది రొట్టె పెరుగునట్లు" అనియు "ప్రేమార్చకులగుటయనన్ రామార్చకులగుట" అని ప్రేమతత్త్వాన్ని విశదీకరిస్తున్నాడు కవి వినోబాభావే భావాన్ని.

అందరి శ్రేయస్సునందే ఒకవ్యక్తి శ్రేయస్సు ఇమిడివున్నదన్నది 'సర్వోదయ' సిద్ధాంతాలలో అతి ముఖ్యమైనది. అంటే ఒకడు సుఖపడడం యింకొకడు కష్టపడడం మంచిదికాదు. అంటే ఒకరి సంపదను - ఒకరిశ్రమను మరొకరు 'దోచుకొనకూడదు ఒకరు సంపన్నుడు - మరొకరు నిరుపేద కాకూడదు. అంటే వర్గ

భేదముండకూడదు. దీనివల్ల సమాజంలో వర్గ ద్వేషం పెరుగుతుంది. శ్రామికుడు సంపన్నుడిపై తిరుగుబాటు చేస్తాడు. కనుక "అందరి శ్రేయస్సు" ధ్యేయానికి విఘాతం కలుగుతుంది ! కనుక కష్టించి-శ్రమతోడ్చి సంపదలు కూడబెట్టే శ్రామికుణ్ణి "సంపన్నులు" దోచుకొనకూడదని భావే భావన ! అందుకే అంటాడు కవి.

పరులగోడు సుంత పట్టించుకొననిచో
శాంతిలేదు మనకు సుంతయైన

—సర్వోదయగానం

నిజమే గదా ! ఒకడు సుఖంగావుండి వేరొకడు కష్టపడుతుంటే పీడితుడు ధనికుణ్ణి సుఖంగా వుండనివ్వడుగదా ! అందుకే "ఆత్మవత్సర్వభూతాని" యన్న వేదవాక్కు "సహనావభునక్తు" అని సూక్తి మరిచిపోవద్దంటాడు కవి.

ఉన్నవారు తెల్వియున్న వారగుచు స
ర్వోదయమ్ము దెసకు నొగ్గరేని
లేనివారు తాల్మిలేనివారగుచు దీం
డ్రింపగలరు కట్లు త్రెంపగలరు

—సర్వోదయగానం

కనుక శ్రామికులు (లేనివారు) తిరుగుబాటు చేయకముందే ఉన్నవారు (సంపన్నులు) తెల్విగా సర్వోదయ దృష్టితో మెలగాలని బోధిస్తున్నాడు కవి.

అలాగే "కులమతాల" లోని ఉచ్చనీచ భావం - సాటి మనిషిని 'అంటరాని' వానిగా చూసి 'దూరం' చేయడం మంచిది కాదంటాడు కవి.

కులమత భేదమ్ములపై
వలపుంచిన, నంటరాని వాడని యొకనిన్
వెలిపెట్టిన మనమే మన
విలయము సృష్టింతు మొరుల వెంపరయేలా !

—సర్వోదయగానం

దేశంలో కులకక్షలు - మతద్వేషం పెచ్చరిల్లి - సృష్టిస్తున్న 'అల్లకల్లోలా ' వనం నిత్యం వింటున్నాం చూస్తున్నాం గూడా ! ఈ ఉచ్ఛనీచ భావం - యీ అస్పృశ్యతా విభేదంవలన - మనుజులలో విద్వేషం పెరిగి - ఘర్షణలు పెరిగి — యెవరికీ 'సుఖసంతోషాలు' లేకుండాపోతాయి !

"దాపరాదు నరుడు తన యక్కఱకొలది / కెక్కుడైన కల్మి నెఱుకమాలి" అని అంటూ "దాచునేని హింసయై చెల్లు" అని నగ్నసత్యాన్ని చెప్పాడు. "దురాశ దుఃఖమునకు చేటన్న"ది అందుకే గదా ! అలానే "పొందవచ్చు బేరి పొట్టకు వలసినంత లాభమలసి యలసి" అని సలహాయిచ్చాడు. అలానే "చిత్తశుద్ధి కరుణసేవా సమాసక్తివలయు వైద్యవృత్తి వలచువారిలో" అని అంటూ "రోగియందు వెజ్జు నీశ్వరుని జూడ" వలయుననిగూడా బోధిస్తున్నాడు. ఏ వృత్తిలో వున్నవాడైనా - తనకు - తన కుటుంబ పోషణకు సరిపడ్డంతవరకు మాత్రమే సంపాదించుకోవడంలో తప్పు లేదుగదా ! "దొంగతనము వంటి దోసమహో" సిరిన్ కూడబెట్టి దాచుకొనుట సైతమ"ని ధనాన్ని దాచిపెట్టటానికి సరికొత్తభాష్యం చెప్పాడు తెనుగులెంక ! అంటే అక్రమమార్గాలలో మతిమీఱి ఆర్జించడం - శ్రమజీవుల నోళ్ళుకొట్టి లాభాలు గడించడం నిరసిస్తున్నాడు కవి. "నాది నీదియన్న భేదమున్నన్నాళ్ళు దొంగ దొకని నొకడు దోచుకొనుట' అంటాడు కవి. 'నేను' నాసంపాదన - నా

సంపద అన్న ఆలోచనవస్తే - అక్రమపద్ధతుల ద్వారానే గదా సంపాదించేది ! అంటే పరుల్ని మోసంచేసి - కష్టజీవుల్ని దోచుకోవడమన్నమాట ఫలితంగా "వర్ణ" సంఘర్షణలు - వర్గపోరాటాలు తలెత్తుతాయి ! పెచ్చరిల్లుతాయి ! దానివలన ఎవరికీ 'సుఖ'ముండదు.

మనము పేదవాని మఱచుటచేతనే
పెక్కు సంకటముల జిక్కినార
మతడె నేడు మనకు నారాధ్యదేవత
మతని గొల్చుటే సుఖావహమ్ము

—సమదర్శి

రేబవళ్ళు రెక్కలుముక్కలు చేసి పండించి సంపదల కాధారభూతుడైన కష్టజీవిని - బీదబ్రతుకు బ్రతుకుతున్న శ్రమజీవిని - మఱచిపోకూడదని - నిర్లక్ష్యం చేయకూడదని తెలుగులెంక హితవు చేస్తున్నాడు. కష్టించి మనకు అన్నంపెట్టే కష్టజీవిని నిర్లక్ష్యం చేయడంవలన చాలా 'ప్రమాదముం'టాడు కవి.

ఎముకలగూడులై బ్రతుకునీడ్చుట కొల్లక త్రెళ్ళలేక శో
కముల దపించుచున్ సెగలుక్రక్కు దరిద్రులు ద్రోసిపుచ్చు కా
లముచనె - విప్లవాగ్ని దెసలన్ గబళింపకముందె యందలా
నమరిన వారు మేల్కొని యహంకృతి నుజ్జనసేతలగ్గుగున్

— సర్వోదయగానం

చెమటోడ్చి కండలుపిండిచేసి పండించే పేదకూలివాడికి త్రాగటానికి కడుపునిండా గంజికూడా లేకుండా 'దోచుకొనితినే' ధనిక భూస్వామ్యవర్గాలు మంచిగా - మర్యాదగా తమ "తప్పు" "దోషం" గ్రహించి - దోపిడీ మానకపోతే - కడుపుమండే కష్టజీవులేకమై

‘విప్లవం’ లేవదీస్తే - చాలా ‘ప్రమాదం’అని సూచిగా హెచ్చరిస్తున్నాడు మన కవి !

కనుక “చెమటనోడ్చి పనులు చేయదగు” అని కరాఖండిగా చెప్పినాడు. “శ్రామికులే - సిరి” శ్రమశక్తే రాజ్యమునకు సంపద అంటే ప్రతివాడు శ్రమించాలని సెలవిస్తున్నాడు. “కలమెత్తిన హలమెత్తిన మలమెత్తిన వానినెక్కుడై జూడవలెన్— వలతియు నలతియు లేకెటుబలు వృత్తులనాశ్రయపు బ్రతుకుల్ సాగున్” అంటూ వృత్తి గౌరవాన్ని గూర్చి చెప్పాడు. ఒకవృత్తి గొప్పది యింకొకటి నీచమన్న భావముండకూడ దంటాడు. బాపూజీ ఆశయమైన ‘సర్వోదయ’ మూలసూత్రానికి బద్ధుడైన గాంధీకవి— ఎవరివృత్తివారు సక్రమంగా చేసుకొంటే . వారివారి బ్రతుకులు సుఖకరంగా వుంటాయి - సమాజానికి - దేశానికి క్షేమకరంగా వుంటుంది. రస్కిన్ రచనలోగల గొప్పదనాన్ని బాపూజీ వివరించిన తీరు మనమిక్కడ గుర్తుకు తెచ్చుకొంటే సరిపోతుంది.

ఒకప్రక్క పేదలపట్ల జాలిచూపుతున్న కవి - సంపన్నుల దోపిడీవిధానాన్ని నిరసిస్తూనే మరోప్రక్క ఒక “పచ్చినిజాన్ని” ఒక “నగ్నసత్యాన్ని” గూడా మనకు గుర్తుచేస్తున్నాడు. “ధనికులందును ధర్మతత్పరత కలదు” అన్న లోకసత్యాన్ని మనకు గుర్తు చేస్తున్నాడు. నిజమే ! ధనిక భూస్వామివర్గాలలో చాలామందికి “దోపిడీ” తత్త్వముండవచ్చు. కాని వారిలోగూడా కొంతమంది ‘దాత’లున్నారు. ‘వదాన్యులు’న్నారు ! ఎన్నో ధార్మికసంస్థలు ‘లోకహిత’ సేవాకార్యక్రమాలు చేపడుతున్నారంటే “ఉన్నవారు” ఉదారంగా విరాళాలివ్వడం వల్లనే గదా ! కనుక మన కవిగారు ఏమని అంటున్నాడంటే .. “ధనముగలవాని దీర్పు పద్ధతిని మాని చంపజూచుట నీతిలేని చందు” మంటున్నాడు. ఎందుకంటే “బ...

(గుడ్లకొఱకు) బాతువును జీల్చినతడేమి బావుకొను" నంటాడు. అంటే ధనికుల్ని చంపటం మార్గం కాదంటాడు. మంచిగా అడిగి పుచ్చుకోమంటాడు. మాట వినకపోతే అధికారికంగా ధనికుల సిరి సంపదల్ని స్వాధీనం చేసుకొని లేనివారికి పంచమని కవి భావన! పన్నుల విధానమట్టిదే గదా! ఉన్నవారిమీద - వర్తకులమీద పన్నులువేసి - వచ్చే రాబడిని పేదవర్గాల ప్రగతికి ప్రభుత్వం ఖర్చు చేస్తున్నది గదా! గాంధీజీ "అహింసా" ధర్మమిచట యిమిడి యున్నది. "రక్తపాతం" మంచిదికాదని గాంధీకవి ధ్వనింప చేస్తున్నాడు—

అందుకే "సర్వోదయ మార్గమ్మున నుర్వికి దేవలయు శాంతి" అంటాడు. "ఏ విప్లవ (మార్పు) మునకైనను జీవమహింసా వ్రతంబె చిరతరమంటాడు.

బెదరించి ధనాఢ్యుని సం
పద గైకొనుటేల ? యతని మంచికి మనదౌ
బ్రదుకుపకరించినప్పుడు
వదలున్ మనకొఱకు నతని వసువునతండే

—మహాత్మకథ

కనుక మంచిగా - సామరస్య పూర్వకంగా - ధనవంతులకు నచ్చ జెప్పి వారి ఆస్తిపాస్తులు సేకరించి - లేనివారికి పంచిపెట్టాలని అంటారు కవి - భావే!

అందుకే వినోబాభావే బాపూజీ అడుగుజాడల్లో శాంతి యుతంగా భూసేకరణ 'యజ్ఞం' చేపట్టి కష్టమనక కాలినడకన గ్రామ గ్రామం - వాడవాడలు - గూడాలు - వూరూరు - వేలాదిమైళ్ళు తిరిగాడు 'సర్వోదయం' గురించి ప్రజలకు వివరించాడు. నల్గొండ జిల్లాలో 'పోచంపల్లి' గ్రామంలో వదాన్యుడైన ఓ రెడ్డిగారు

'భూదాన యజ్ఞా'నికి 'భూదానం'చేసి "బోణీ" చేసాడు. భూస్వాములే కాదు - చిన్న - సన్నకారు రైతులుసైతం - "భావే చక్కట్లు" విని తమకున్న ఆస్తిలో కొందరు కొంతయిస్తే - మరికొందరు తమకున్న "యావదాస్తి" మొత్తం దానం చేసారు. చివరకు నాటి రాష్ట్రపతి రాజేంద్రప్రసాదుగూడా వినోబాభావే సర్వోదయ విధానానికి మంత్రముగ్ధుడై తనకు ఆస్తిలేకున్నా - తన కొడుకుల ఆస్తిని భావేకు 'భూదానయజ్ఞం'లో సమిధలుగా దానంచేసాడు. గాంధేయ సిద్ధాంతాన్ని వ్యతిరేకించిన కమ్యూనిష్టులు గూడా 'భూదానం' చేసిన సంఘటనలున్నాయి. చిన్న-సన్నకారు రైతులు పేదలుసైతం- భావే వ్యక్తిత్వానికి - ఆయన ప్రబోధనలకు - ఆయన స్వార్థరహిత ప్రజాహిత "ఉద్యమానికి" ముగ్ధులై - స్వచ్ఛందంగా తమకున్న భూమిలో 'అంతో కొంతో' దానం చేసారు. సేకరించిన భూమిని భూమిలేని నిరుపేదలకు పంచిపెట్టాడు వినోబాభావే ! ఇది నిజంగా 'శాంతియుత విప్లవాత్మక' భూసేకరణ - భూదాన 'కార్యక్రమమే గదా' [ఈతరంవారికి - యీ సర్వోదయ మార్గం- వింతగా తోచవచ్చు. ఏ ధనికుడైనా 'మంచి'గా చెపితే వింటాడా ! తానంతట తాను తన 'ఆస్తిపాస్తులు దానంచేస్తాడా అన్న సందేహం వస్తుంది ! ఆనాడు గాంధీజీ - వినోబాభావేల విశిష్ట వ్యక్తిత్వాల ప్రభావంతో సంపన్నులు సామాన్యులు భూదానం చేసిన విషయం చారిత్రిక సత్యం. మనకవి ఆ సత్యాన్నే కవితాబద్ధం చేసాడు. భావితరాల వారినీ 'సర్వోదయ' సిద్ధాంతం ప్రభావితం చేయొచ్చునేమో !]



## కాపు [రైతు] కవిగా

కల్లకపటు లేని పల్లెలో నాగలి
దున్నువారు నన్ను కన్నవారు
మడికినొక్క పూటబడికొక్క పూటగా
దాటినాడ చిన్నతనము నేను —"నేను"

వ్యవసాయక దేశమైన మన దేశంలో దేశసంపదకు రైతే వెన్నెముక. ఆరుగాలం కష్టించి పొలం పండించి - పాడిపంటలు సమకూర్చి ప్రజలకు 'కూడు' పెట్టేవాడు కర్షకుడు - కాపేగదా! కలంపట్టి కవి సాహితీక్షేత్రంలో కావ్యాలు పండించి ప్రజలకు ఆనందంతోపాటు సందేశాన్నియిస్తే హలంపట్టి రైతు ఆరుగాలం కష్టించి - పొలం పండించి - పాడిపంటలు సమకూర్చి ప్రజలకన్నం పెట్టి సుఖపెడతాడు. అసలు "బ్రతికిస్తాడు." అందుకే 'రైతు రాజ్యం' రావాలని "రైతేరాజు" అన్న నినాదాలు పుట్టాయి. భారత మాజీ ప్రధాని లాల్‌బహదూర్ శాస్త్రిగారు అందుకే "జై జవాన్ జైకిసాన్" అన్న నినాదమిచ్చాడు. నిజమే! కిసాన్ ప్రజల కన్నంపెడితే - జవాన్ దేశాన్ని రక్షిస్తాడు గదా రైతునందుకే 'అన్నదాత' అన్నారు.

పసిడిపంటలు పండించి ప్రజలకు 'అన్నం' పెట్టే రైతును కవి పండితులు ఎన్నోవిధాల తమ శక్త్యానుసారం కీర్తించారు. వర్షాలు సకాలంలో సమృద్ధిగా పడితే - కర్షకుడు కండలు కరిగించి పొలం పండిస్తే కరువుకాటకాలుండవు గదా! అందుకే "కృషితోనాస్తి దుర్భిక్షం"అన్నారు. తెలుగు ప్రాచీనసాహిత్యంలో కర్షకుల గురించిన ప్రశంసలు చాలా తక్కువగా - అందునా నామమాత్రంగానే వున్నాయి! కృష్ణదేవరాయలు తన 'ఆముక్తమాల్యద'లో కర్షక

జీవనవర్ణన కాస్తచేసాడు. శ్రీనాథుడు తన చాటువులలో సేద్యగాని ప్రస్తావన తెచ్చాడు. రామాయణ - భారతాల్లో - 'కొద్దిగా' రైతు జీవన ప్రస్తావనలున్నాయి. ఊరూ పేరూ అంతగాలేని మంచన అనే కవి తన 'కేయూరబాహు చరిత్ర'లో రైతు జీవితాన్ని కాస్త వర్ణించాడనే చెప్పాలి.

ఇక ఆధునిక సాహిత్యంలో రైతు జీవితంగూర్చి కవులెందరో తమ 'అభిమానాన్ని' బట్టి కవితలల్లారు. మొదటగా దువ్వూరి రామిరెడ్డిగారి 'కృషీవలుడు' కావ్యం గురించి చెప్పుకోవాలి. తర్వాత ఏటుకూరి వేంకటనరసయ్యగారి 'క్షేత్రలక్ష్మి'ని చెప్పుకోవాలి. ఈ కావ్యాలలో ప్రత్యేకించి యేకథావస్తువు లేదుకాని - రైతు జీవితాన్ని అన్నికోణాలనుంచి వర్ణించారు ఈ యిద్దరు కవులు. అమ్మిశెట్టి లక్ష్మయ్యగారి 'రైతుకల్యాణం' చెప్పుకోదగ్గ కావ్యం. అది 'కథాకావ్యం' - దానికంతగా ప్రచారంరాలేదు. వానమామలై జగన్నాథాచార్యులుగారి 'రైతురామాయణం' కావ్యం కూడా కథా వస్తువున్నదే. గంగుల సాయిరెడ్డి 'కాపుబిడ్డ' లఘుకావ్యం- పల్నాటి సోదరకవులలో ఒకడైన కన్నెగంటి వీరభద్రాచారి 'పేదకాపు' లఘుకావ్యం - నంబూరి మార్వాసమహర్షి 'నిరుపేద' లఘుకావ్యం- యెన్నదగ్గవి. బోయి భీమన్న "మానవుని మహాంక మజిలీ" గేయ నాటిక కూడా అభ్యుదయ దృక్పథంతో - విన్నూత్నపంథాలో- కళాత్మకంగా - రైతు జీవితానికి సంబంధించిన కావ్యం !

పింగళి కాటూరి "పౌలస్త్యహృదయం"- "తోలకరి కొండవీటి వేంకటకవి 'కర్షకా' కావ్యాలు రైతు జీవితాలకు అద్దం పడతాయి సంక్షిప్తంగానైనా. ఇక అభ్యుదయ కవుల్లో అగ్రశ్రేణికవి అయిన శ్రీ శ్రీ "పొలాలనన్నీ హలాలదున్నీ / ఇలా తలంలో హేమం పిండగ / ... విరామమెరుగక పరిశ్రమించే / కర్షకవీరుల కాయం నిండా / కాలువకట్టే ఘర్మజలానికి ధర్మజలానికి / ఖరీదుకట్టే

షరాబులేదోయి" అంటూ సేద్యగాని స్వేదానికి ఖరీదు కట్టలేమని లెస్సగా చెప్పాడు తన చిన్న కవితాఖండికలో. అందుకే కమ్యూనిష్టులు దున్నేవాడిదే రాజ్యం! రైతేరాజు అన్న నినాదాలు లేవదీసారు. నవయుగ కవిచక్రవర్తి జాషువా "ఓ దుక్కిదున్నే బక్క రైతా! దున్నరా నీదొడ్డక్షేత్రాలు" అని లెస్సగా బలికాడు. "దున్నేవాడే భూమికి కర్త దున్నేవాడే జీవనకర్త" అని బోయి భీమన్న లెస్స పలికాడు.

ఇక శ్రీ తుమ్మలవారు రైతు జీవితానికి సంబంధించి రాసిన కవిత్వం గురించి తెలుసుకొందాం. ఆయన రైతు కుటుంబంలో పుట్టాడు. మోతుబరి రైతుకాదు కాని సన్నగారు రైతు! ఆమాట కొస్తే నారయ్యగారు కావూరులో 20 ఎకరాల మాగాణిపొలం ఉన్నరైతే! అయితే కూతురి వివాహామునకు కొంత కానుకకట్నాల క్రింద పోను - మిగిలినది కొడుకులిద్దరికి పంచిపెట్టగా - తుమ్మల వారికి వచ్చిన పొలం - బిడ్డల చదువులకు - తన రచనలు అచ్చువేయించుకొంటానికి "హరించు"కొని పోయింది! కనుకనే చిన్నతనంలో వ్యవసాయం పనుల్లో తండ్రికి సాయపడుతూనే చదువుకున్నానని కవితాశైలిలో "మడికి నొక్కపూట పూటబడికొక్క పూటగా దాట్టినాడ జిన్నతనము నేను" అని చెప్పాడు. చిన్నతనం లోనేకాదు - పెద్దయిన తర్వాత గూడా - కావూరు వినయాశ్రమంలో ఒకప్రక్క తెలుగుపండితులుగా పనిచేస్తూనే యింకోప్రక్క పొలంపనులు చూచుకొన్నాడు. జీవితంలో గాంధీకవిగా- గాంధేయ వాదాన్ని బహుముఖీనంగా కావ్యబద్ధం చేసినా - రైతు జీవితాన్ని గురించి - రైతు కష్టసుఖాలగురించి తుమ్మలవారు ఎన్నో కవితలు వెలయించారు. రైతుల జీవిత ఘట్టాలతోపాటు యితర విషయాల పైని వ్రాసిన కవితల్ని "పఱిగపంట" 'పైరుపంట' "పెద్దకాపు"

'సంక్రాంతి ముచ్చట్లు' శబల, నాకథలు - ఎక్కట్లు - సందేశ సప్తశతి మొదలగు కావ్యాలలో "కర్షకుడు - శివకర్షకుడు-పాలేరు-రైతు మొర యిత్యాది కవితల్లో రైతుల కష్టసుఖాలతోపాటు-రైతుగా తన స్వీయానుభవాల్ని కవితాబద్ధం చేసాడు. అయితే తెనుగులెంక గూడా రైతుజీవితం పైన - కావ్యస్థాయి రచన చేయలేదని మనం గుర్తించాలి.

"ముప్ప దేండ్లు సేద్యమున మున్గి తేలిన బ్రతుకునాది" అని చెప్పుకున్నాడు. "పొలమ్ము దున్నువాని బండిదోలువాని గోత కోయువాని గుప్పనూర్చెడివాని జూచినప్పుడు" తుమ్మలవారి హృదయం పుష్పించిపోతుందట ! స్వంత వ్యవసాయం పనులొస్తే "బడికి సెలవుపెట్టే" వాడు ! రైతుగా "పేనుకొంటిత్రాడు; పిడికట్ట కొట్టగా బూనుకొంటి" నని చెపుతూ— "నేనువైచు దెబ్బ తాకి బల్ల తబ్బిబ్బులాయె" నావడ్లరాశిమించె నొడ్లకువను" అంటాడు ! "కళ్ళము నలిగినదాయని చెల్లాచెదరైన గడ్డిజేర్చితివామిన్" అని చెప్పుకుంటాడు "వెంటిగట్టితి సవరనల్ వెల్లివిరియ, బంతిదోలితి నెద్దుల బాదకుండ" కుప్పనూర్పిళ్ళ సీజన్‌లో "కుప్పనీడనుగూర్చున్న కూలివాండ్ర బంతిలో "జేరి" పెట్టవయ్య కూడు పట్టెదనంజలి నుద్ది లేని బజ్జనుద్దచేసి" అని "దోయిటబోడి బువ్వంతిని మజ్జిగ బువ్వ ద్రాగి," యెంతో తృప్తిపడేవాడట కవిగారు. 'చిటిపోటి చినుకులు పడి' తొలకరి జల్లులు కురిస్తే - "హాలిక కన్యలు వర్షాకాల ప్రభు రాక కలరి కమ్మని గీతం బాలాపించా" రని వర్ణిస్తాడు "పలుపు పగ్గాలు సంతనపలుచు పనికిజిక్కి-చిడిముడిపడసాగ" జీతకాడు(పాలేరు) "తోకలెత్తి కోడెదూడలు బీటిలో చెంగనాలు" కొడతాయట ! ఏరువాక సాగేసరికి— "సూరివ్రడంగికి" వ్రాపిరాడకపోయె బగలు రేనాగటిపణత దీర్ప !" కమ్మరికి "కఱ్ఱుచెక్కుడు పాఱగాల్చుచో

నెగసిన పొగలోన" వుక్కిరిబిక్కిరై పోతాడు. గొడగరివాడు (చర్మకారుడు) 'వాతెనల్' సవరించడంలో మునిగిపోతాడు! "మేడినదిమిగిత్త త్రాడుచేకొని" కాపు "కొంగ్రడ" వేస్తాడు. "పొడినారు మడికి నీరిడి కుడియెడమల వొడిసి పిడులగూడులు పొడిచి" హాలికుడు నడుముబిగి 'మోకాళ్ళ నిల్చి' నూడ్పులు పని చేపడతాడు! "తిన్న మెతుకు గొంతుదిగెనో లేదో గట్టు "కాపు" గనుము సనవ చేయ" టానికి వెళ్తాడు!

ఇక "వరినాట్లు" (ఊడ్పులు) సమయంలో - అమ్మలక్కలు— ఆడా - మగా - మాట్లాడుకొనే వివిధ విషయాలు - సరసాలు— "కళ్ళకు కట్టినట్లు" వర్ణించాడు తుమ్మల. మచ్చుకొకటి :—

"ఓసి ! నీతస్పదీయ ! నిన్ చేసికొన్న
మగడెటుల్ వేగుచుండెనో - మాటలిన్ని
యెపుడు నేర్చితివే - వెన్కనెవరొకేక
వెయగానటు చూచుచు విసరినాడ
గాన గుఱిదప్పినది నారికట్ట - దీని
కింత రగడచేయుదువటె !

(పైరపంట)

నాట్లు పూర్తిఅయిన తర్వాత నెలారెండు నెలలకు "మొక్కనిల్చి పచ్చమూనకు దిరిగెనో / లేదో తుంగయూద లేచె మడిని / కడగ రైతు కాళ్ళతడియాఱి యాఱక / మున్నె కలుపుదీయ వెన్నువంచి- అంటే నాట్లు తర్వాత కలుపులు! అంతలో "కఱ్ఱచిట్టి దుబ్బుగట్టి కణుపు వేచి / చిగురుదగిలి క్రొత్తచెలువు గుల్కి"ందట! తర్వాత "సుంకు" వేయడం - 'గింజ 'నిండా పాలు' పోయడం - మాను కాయలేకుండా - వరికంకులు నవ్రువంపడం - పండినకంకులుకై వ్రాలడం - రైతులు చేలపాయలు తీయడం - కోతలుకోయడం

పాలిగాడి పాటలతో నూర్పిళ్ళు చేయడం - రైతులు నవధాన్యాల్ని బండ్ల మీద యింటికితోలి-- గాదెలు నింపడం - యిలా "వరి వ్యవసాయం" దశలవారీగా "బొమ్మ" కట్టినట్లు (తేట) గీతమాలికా కవితారీతిలో కాపుకవి తుమ్మల వర్ణించడం— పల్లెలో పుట్టి రైతు జీవితం రుచిచూచిన సాహితీప్రియుల నోళ్ళు కన్నుసీ" పొంగలితో తీపిచేసినట్లే మరి! తెలుగు సాహితీలోకంలో రైతుకవులుగా ప్రసిద్ధులైన దువ్వూరి రామిరెడ్డిగారు - ఏటుకూరి వేంకటనరసయ్యగారు "మెట్ట" ప్రాంతంవారు. కనుకనే వారి కవితల్లో "ఏతాంవేయడం- పాదులు కట్టడంవంటి మెట్టవ్యావసాయక పొలంపనుల వర్ణన కనిపిస్తుంది. తుమ్మలవారు మాగాణి ప్రాంతంవారు. ఆయన పుట్టిన కావూరు - స్థిరపడ్డ అప్పికట్ల - బడిపంతులుగా పనిచేసిన బాపట్ల- పొన్నూరు ప్రాంతాలు 'వరిమాగాణి' పంటపండే ప్రాంతాలు. కనుకనే తుమ్మలవారి కవితలో 'వరి' వ్యవసాయక పొలంపనుల వర్ణన కన్నులకు గట్టినట్లుంటుంది!

ఇకపోతే - కర్షకుల వ్యవసాయపనుల్లోని యీతిబాధల్ని ఎలా వర్ణించాడో చూడండి

మండునెండలలోన మలమల మాడి, దు
    ర్భర శీతబాధ కొంగరలువోయి
వానలో వరదలోనాని జీవములాపి
    కరకుముండులలోన గాళ్ళుమోపి
తేళ్ళపాములలోన దెసమాలి తిరుగాడి
    మోపజాలని వ్రేగు మోసిడస్సి
ఒడలెఱుంగని నిద్రయొక నాడెరుంగక
    క్రుక్షినిండని పేదకూడు కుడిచి

ఆఱుగాలంబు గండంబులన్ని గడిచి
సేద్యమొనరించి తుదకు దాసేకరించు
పంట సకలంబు నరికినప్పన మొనర్పి
కంట నీర్వెట్టెనక్కటా కాపు బిడ్డ.

ఎండనక - వాననక - ముళ్ళల్లో రాళ్ళల్లో కాళ్ళువాచి చిట్లి నెత్తురు కారినా - కంటినిండా నిద్ర — కడుపునిండా తిండిలేక - "ఆరుగాలంబు" చెమటోడ్చి పండించిన ధాన్యానికి 'సరియగు' వెలరాక (కష్టానికి ఫలితందక్కక) కంటతడిబెట్టు రైతు 'యీతిబాధల' జీవితాన్ని "కట్టెదుట" "అక్షరరూపం"లో చూపెట్టాడు రైతుకవి శ్రీ తుమ్మల !

సుక్షేత్రములు దయాశూన్యులై పీడించు
ఋణదాతలకు సమర్పించవలసె
ఇల్లాలిమెడలోని నల్లపూసయు వెచ్చా
పెట్టి పన్నుల పొట్టబెట్టవలసె
దిన వెచ్చమునకునై తెచ్చు బాకీలకై
కొంప తాకట్టులో దింపవలసె
కడుపుకక్కుఱతికై గతిలేక పశుకోటి
నెల్ల మెల్లన విక్రయించవలసె
ధరలు పడిపోయె ! సేద్యంబు తక్కువాయె
శిస్తుమెండాయె నింకేమిసేయుటోయి
నిర్జనారణ్యమే నీకు నెలవటోయి
కర్షకా యిదియే నాటి కర్మమోయి !

మోతుబరి రైతులకి యీతిబాధలుండక పోవచ్చుకాని సన్నకారు రైతు జీవితం 'దినదినగండమే ! వ్యవసాయానికి చేసిన అప్పులు తీర్చలేక ఋణదాతలకు తమ పొలాలనే సమర్పించే కేసులెన్నో !

శిస్తు చెల్లించటానికి యిల్లాలి మెడలోని పుస్తెనమ్మిన సంఘటన లెన్నో ! పంట సరిగ్గాపండక - యిల్లు గడవటానికి - యింటిని తాకట్టుపెట్టిన సంఘటనలెన్నో ! కడుపుకోసం పశువుల్ని తెగనమ్మే దెందరో ! పండిన పంటకు 'ధరలు పడిపోయి' పంటమీద పెట్టిన ఖర్చులు తేలక "గిలగిల" కొట్టుకులాడే సన్నకారు రైతు బ్రతుకు "యెడారిబ్రతుకే" ఇదియే నాటికర్మమో అంటాడు మన కాపుకవి.

కప్పులేచిపోయిన కొంప బాగుచేసుకోలేని కాపులెందరో ! పెండ్లీడుకొచ్చిన కూతురు పెండ్లి చేయులేని రైతులెందరో! పసికందు బుడ్డిపాలు కొనలేక వేదనచెందే చిన్న రైతులెందరో , పిల్లల్ని పైచదువులకు పంపటానికి పొలముండీ పండీపండక ఆర్థికస్తోమతలేని పెద్దరైతులెందరో ! రైతునిపీడించి వారి సొమ్ముతినే — అధికార్లు— వ్యాపారస్తులు - నాయకులు - "చూచుచున్నారు నినుగడ్డిపోచవలె" అని బాధపడతాడు. "నీకు నెట్టికట్టకడగండ్లు వచ్చెరా కాపుబిడ్డ ! కడుపుచుమ్మలు వాటునీ (కష్ట) కథలువిన్న" అని స్వీయాను భవంతో మన రైతుకవి రైతుల దీనస్థితికి జాలిపడుతున్నాడు. బాధ పడుతున్నాడు. చివరకు దేవుడేదిక్కంటూ "తండ్రీ ! ప్రాణతతికి-అన్నంబు సృష్టించునట్టి మా (రైతు) జాతి కఠినోపవాసముల్ గావింపవలసె" నీవుగాకెవరు మాకుదిక్కు అని రైతుల మనోవ్యథను రైతుకవిగా తాను వెల్లడిస్తున్నారు.

"శివర్షకుడు" అనే పద్యం తెలుగులెంక భావశబలతకు ఉన్నతమైన వూహాబలానికి తార్కాణం.

సీ॥ చదలేటి నీటిసంపద రిత్తపోనీక
సిగముడినానగట్ట గనమర్చి
యలజాహ్నవీ ముఖ్యములు చిన్నపెద్ద కాల్వ
లఖిల భారతభూమి నల్లుకొల్పి

ముక్కారు పంటల ముద్దుటెక్కెంబన
గేల ముమ్మొనలములోక్కల నూది
మెడముచ్చపాటలో నొడల బుల్కలురేగ
బసవన్న నటెవాఱు పనికి బనిచి

తే. గీ॥ యిల్లు వెండియు బంగారువిల్లుగాగ
బండికై వ్రాలిన జగమ్ము పంటపొలము
కావలికి ఘోర సర్పకంకణము గట్టు
శివుని మాపెద్దకాపు నర్చింపరండు !

ఇందులో భక్తిభావంతో శివుని ప్రశంసావుంది. అభిమానంతో కాపు (రైతు) ప్రశంసావుంది. శివునకు - కర్షకునకు సమాన ధర్మాల్ని సూచనప్రాయంగా కవిగారు ఆపాదించాడు ! శివుడు ఆకాశగంగను తన 'సిగముడి'తో అడ్డుకట్టవేసాడు ! మానవుడు/ నదులపై 'ఆనకట్టలు' కట్టితే రైతు చిన్నపెద్ద కాల్వలు తీసి ముక్కారుపంటలు పండిస్తున్నాడు బసవన్న నందిగా శివునకు అంగ రక్షకుడైనది ! బసవన్న (ఎద్దు) రైతునకు తన వ్యవసాయంలో అండగా వుంటున్నది ! శివునకీ జగమ్మే పంటపొలమైనది! రైతునకు పొలమే సర్వస్వము అయినది. అంటే కాపుకు వ్యవసాయమే 'లోకం' శివుడు ఆదిదేవుడు - శుభంకరుడు. రైతుగూడా మానవ లోకానికి 'వెన్నెముక'గా 'అన్నం' పెట్టి శుభంకరుడగుచున్నాడు ! భావం నిగూఢంగావున్నా గంభీరంగా - మహోన్నతంగా వుంది కదూ ! శివునికి - సేద్యగానికి మధ్యనున్న 'సామ్యాన్ని' కాపు (రైతు) కవి చక్కగా చమత్కారంగా చూపెట్టాడు.

పాడిపంటలు సమృద్ధిగా పండించే కాపు కంచంలో గంజినీళ్ళు ప్రత్తిపండించే రైతు దిసమొలకు గోచిపాత ! పండించి గాదెలునింపే కాపుకు ఎండినకడుపు ! కమ్మని కూరగాయలు పండించే రైతు

కంచంలో 'కటికకారం' చేసిన అప్పుల పైన అధిక వడ్డీలతో సాహు కార్లు కాపుల నెత్తురు పీలుస్తుంటే - శిస్తులకు - ఎరువులకు లంచాలు తినే అధికార్లకు దోసిలొగ్గి శిస్తుఅధికమై బ్రతుకుభారమై - పంట పండక - పశువుల్ని తెగనమ్మి - సన్నకారు రైతు ఎన్నో బాధలు పడుతున్నాడని "రైతు"గా తుమ్మలకవి కన్నీరు పెడుతున్నాడు! మనల్ని కంటతడి పెట్టిస్తున్నాడు! రైతు జీవితం పట్ల జాలికలుగ జేస్తున్నాడు.

వందెకరాలున్నా వానపడకపోతే "ఏమిసంబడ" మంటాడు! పైరు నిలువెత్తు పెరిగినా - "గాలిపాటున" కంకికి మానుకాయపడితే యింకేముంది పంటనష్టమంటాడు! పంట బాగా పండిందని 'సంబర పడి' పోతే లాభమేమిటి ధాన్యానికి 'గిట్టుబాటుధర' రాకుంటే రైతు బ్రతుకు చప్పబండలంటాడు! పంటపండి - గిట్టుబాటు ధరవచ్చి నాల్గు 'పైసలు' చేతికొస్తే మాత్రం ఏమిలాభం - "అమ్మాయి" పెండ్లికి అంతా కరిగిపోతుందిగదా అంటాడు! రైతుల యిడుముల పాట్లు ఎవరికి తెలుసు రైతుకు తప్ప! అని నిట్టూరుస్తాడు కవి.

"ఓదెనెమ్ముదీయక" ముందెవాన కురిసిందంటే — రైతు గుండెల్లో రైళ్ళు పర్వెత్తు" తాయంటాడు! "చేను బాగానే పండింది" అనుకొనే రైతుకు "కోతకోయక ముందే" అకాలవర్షం కుత్తుకబంటి కురిస్తే రైతు గుండెలవిసి పోవలసిందే! పండినపంట— ఎలుకలకో - తెగుళ్ళకో బలివెట్టిన రైతు 'నూబిలోపడ్డ యేనుగు' చందమంటాడు.

"ఏనుస్వతంత్రుడననగల మానిసి, తలయెత్తు కొని తిరగగల మగసెరి" గల వాడుఒక్క—రైతే నంటాడు, రైతుకవి తుమ్మల రైతు పక్షపాతిగా— ఆత్మాభిమానియైన రైతు కవిగా!

ఎండకు వానకు జంకక
పండించిన ధాన్యమెల్ల బాతరలందున్
నిండించి తినుచు బెట్టుచు
నుండెడి కర్షకుడె ధన్యుడూహింపగన్

(సందేశ సప్తశతి)

ఆరుకాలం కష్టించి శ్రమటోడ్చి పంటలు పండిస్తాడు. రైతు తాను తింటాడు - ఇతరులకు 'అన్నం' పెడతాడు. "వీని శ్రమ వీనికరుగ నిదానముగా నోరుల జీవితమ్ములు నడుచున్" అంటూ ఆ కారణంగా కర్షకుని జీవితం ధన్యమైనదని రైతుకవిగా తుమ్మలవారు అభి భాషించారు.

"కోటివిద్యలు కొంబ్రడపాటియగునె" అంటూ క్షేత్రజీవిని "కర్మయోగి"గా ప్రశంసిస్తాడు రైతుకవి తుమ్మలవారు "ఇటునంజ" నటువుంజెనెల్ల పంటలు పండి"తే కమ్మతీరు "దిగులెరుంగడ"ని అనుభవపూర్వకంగా పచ్చినిజాన్ని చెప్పారు రైతుకవి. పంటలు పండితే - రైతు మీసాలు మెలేస్తాడు! పండకపోతే - మంచం పడతాడు! రైతుకి ముఖ్యంగా చిన్నరైతుకు పాలేరు దుక్కిటెద్దులే ఆత్మీయులు. సహాయకారులు! ఇంట్లో ఇల్లాలు! కొద్దిపాటి సేద్య గాడి విషయంలో "ఆలుమగలు సేద్యమందుకొన్నప్పుడే వేస్నెళ్ళకు జన్నెళ్ళకు తోడైనట్లు - అంగిటికిని జేనునైదు వ్రేళ్ళు" అని పరమ సత్యాన్ని చెప్పారు. ప్రొద్దస్తమానం - ఎండలో వానలో చలిలో చెమటోడ్చి కష్టించి యింటికివస్తే - ఇల్లాలు "యింతనెనసుశోడ" తీయగ పలకరించి - ప్రేమతో పెట్టే ఆమెచేతి ముద్దే (సూడే) సేద్యగాడికి సేదతీర్చేది - ఆనందమిచ్చేది! హాయిగూర్చేది! ఎంత చక్కగా చెప్పారు రైతుకవి! శ్రీ తుమ్మలవారు స్వయంగ వ్యవసాయక్షేత్రం నున్ని పంటలు పండించారు. ఇటు సాహితీ

వ్యవసాయంచేసి కావ్యాలు పండించారు. సేద్యగాడిగా "బట్టన వేళ్ళతో నదిమిపట్టిన మిర్యపుగాయ నంజుచున్ / దెట్టలు తెట్టలై మిసిమి తేలిన మజ్జిగబువ్వ దోసిటంబట్టి బుభుక్షు తీవ్రతలు పాయగ జుర్రి"న కండబలంతో "కడియమ్ము మీదికిం బట్టిన గట్టినొడ్డిపన పంజినచో బదిమోపులుం"టాయని ! అలానే "ఒక్క గోంగూరన్ గుండెడు కూడు మెక్కి"న కండబలంతో— "గట్టితనమ్ము చిందబిడి కట్టకు సాగిన దెబ్బదెబ్బకున్." కుసుమల్ బుట్టెడురాళ్ళి రాసులు పోసాడట ! "అట్టుపులిసిగిత్త యంకెవైచిన తటి/ నడుముగట్టి వెట్టి మెడకు దాల్చి / యూబిలోని బండి నూపిలేపిన మొనగాడు" శ్రీ తుమ్మల :

కాని స్కూలు మాస్టారుగా "ఊరుంగాయలు పచ్చడుల్ పులుసులేవో కూరలైదాఱు సాంబారున్ మీగడలప్పడాలు వడియాల్" తో "నే డిసీ ! చేరెండన్నము లోనికిన్ దిగటంలేదట ! ఈ "పిట్టమేతల" తో "సిప్పుడు కడవనీరు తోడటానికి వెఅస్తాడట! వ్యవసాయంచేసిన రోజులలోలాగా- స్కూలుమాస్టారుగా పనిచేసిన రోజుల్లో" నారెట్టబలమ్ము నేడు సయిరింపదు పీసెడుకూరలెత్తగన్" అని అంటాడు ! పరోక్షంగా యీ ఆధునిక "వంటకాల్ని" హేళన చేస్తున్నాడు ! కాయకష్టం చేసినప్పుడే కడుపుకాలి ఆకలేస్తుంది. అప్పుడు కడుపునిండా తింటే కండబలం కలుగుతుంది. అలాకాక- తినికూచ్చుంటే - తిన్నదరగదు. ఆకలివేయదు ! ఎక్కువ తినలేరు కూడా ! అదే చెపుతున్నాడు కవి.

ఈ విధంగా కాపుల కష్టాలు 'ఉన్నవిఉన్నట్లు' కళ్ళకు గట్టి నట్లు వర్ణించాడు శ్రీ తుమ్మల ! కాపుకవి చెప్పినవి సన్నకారు రైతుల విషయంలో నగ్నసత్యాలు ! పచ్చినిజాలు ! అయితే యీనాడు 'శిస్తు' బాధలేకపోవచ్చు ! మూడునాల్గు దశాబ్దాల

క్రితం కవితాబద్ధం చేసిన కర్షకజీవి కష్టాలు యీనాటికీ అక్షర సత్యాలు! అక్షయబాధలు! ఈమధ్య మన రాష్ట్రంలో జరిగిన ప్రత్తిరైతుల ఆత్మహత్యలు వెనుకనున్న పచ్చినిజాల బాధలు తుమ్మలవారు చెప్పినట్టి నగ్నసత్యాలు.

పొలముండి ఏమి లాభం! సకాలంలోనే వానలుపడాలి. వానలులేకపోతే పంటపొలాలు బీడులేగదా! రైతులకేకాదు- అందరకూ 'తిండికి' కరువుకాటకాలు! అధికవర్షాలు కురిసినా వరదలు! పండిన పసిడిపంటలు నీటిపాలు! పోనీ - అతివృష్టి- అనావృష్టి లేక సకాలంలో - తగుమాత్రం వర్షాలుకురిసి బాగా పంటలుపండినా - చీడాపీడలు - తెగుళ్ళు - ఎలుకలబాధ! ఏబాధ లేక పంట యింటికి చేరిందనుకొంటే - "గిట్టుబాటు" ధరలేక రైతులు 'కటకటం'బడతారు! పొలం పండించడానికి రైతులు చేసిన అప్పులు తీర్చలేక - అప్పులిచ్చినవాళ్ళ బాధపడలేక - ఆత్మగౌరవమున్న రైతులు ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. ఈ విషయాలు తుమ్మలవారు వాస్తవదృష్టితో - హేతుదృష్టితో కర్షకుల కష్టాలు కవితాబద్ధం చేసాడు.

ఇన్ని కష్టాలుపడే రైతు జీవితం ఉత్తమమైనదని రైతుది ధన్య జీవితమని కర్షకుడు కర్మయోగిఅని ఉదాత్తభావం వ్యక్తం చేస్తాడు రైతుకవి. "కర్షకానందమేకద జగత్తుష్టి / రైతేకదా దేశమునకు వెన్నెముక / కాపేకదా లోకకళ్యాణదాత / సేద్యగాడేకదా జీవనమ్ములకు" అంటూ కర్షకజీవికి పట్టం కడతాడు! అయితే ఒకపచ్చి నిజం చెపుతాడు కవి "ఎంత బలగమున్ననేమి లాభము!" మీకు "చెలిమిలేమి" కనుక "ఏకముకండు" మీ "కొంతతలెల్ల దీరు"నని హెచ్చరిక చేస్తాడు. రైతులోకం 'అసంఘటిత'మైనది. అందుకే

రైతులు సంఘటితం కావాలనీ ఆనాడే వారి సమస్యలు పరిష్కారం కావటానికి వీలౌతుందని కవి ఆకాంక్ష.

రైతుగా బుట్టి హలంపట్టి పొలందున్ని పంట పండించిన తుమ్మలవారు 'కలంబట్టి కవితా పసిడిపంట' పండించిన ధన్యజీవి! "హలము మానిరోగినై కలంగితి" జేలనైతి అంటూ "గలమునంది కీర్తిగంటి" అని తృప్తిపడతాడు కాపుకవి తుమ్మల! అంటే శారీరక శ్రమలేక రోగిగైనా - కలంబట్టి కవితలల్లి కీర్తిగడించితినని కవి భావన! మొత్తంమీద కలం - హలంపట్టిన 'సవ్యసాచి' పోతనవలె కాపుకవి తుమ్మల గూడా ధన్యుడు.

సీ॥ మీసరంబున గోఁచిమీసాలు వడివేసి
భూపతుల్ నెఱజంకె చూపుజూడ
కవికి బంగారుమేడల రాణివాసంబు
లెండకన్నెఱుగకనే సుఖింప
దొరకేని గరువంబు తొలకాడ నుద్యోగు
లుబ్బూతలూగుచు విఱ్ఱవీగ
కోట్లు కోట్లు గడించి కోశంబులకు నించి
బేహారి తన బొజ్జపెంచి కులుక
తే. గీ॥ అన్నమోరామచంద్రా యటంచు నేడ్చు
కటికిబీదలు దోసెడుగంజిద్రావ
నీవకద కారణంబహో! నీకు నెట్టి
కట్టుకడగండ్లు వచ్చెరా! కాపుబిడ్డ

—పఱిగపంట

# తుమ్మలవారి సంక్రాంతి

కుంటికిన్ గ్రుడ్డికిని వేడుకొన్నవాని
కెల్ల వానికి భాగంబు లేర్పరించి
లేము లెరుగుని సంక్రాంతి లేమకపుడ
నుంగుదోడయ్యె గుప్పలునూర్చు రైతు (పఱిగపంట)

తెలుగువారికి సంక్రాంతి 'పెద్దపండుగ' భూగోళశాస్త్రరీత్యా సంక్రాంతి 'ఉత్తరాయణ' పుణ్యకాలం! సూర్యుడు దక్షిణాయణం ముగించుకొని, ఆనాడు మకరరేఖనుండి 'ఉత్తరాభి ముఖంగా' పయనమయ్యే శుభవేళ అది. అంటే నాటినుండి చలితగ్గడం మొదలుపెడుతుంది. ఎండ హెచ్చడం ప్రారంభమౌతుంది. అయితే సంప్రదాయరీత్యా తెలుగువారికిది పొంగళ్ళ పండుగ. ఈ పండుగను దేశమంతటా వివిధపేర్లతో - వివిధ పద్ధతుల్లో జరుపుకొంటారు. తెలుగునాట ముఖ్యంగా పల్లెసీమల్లో యిది చాలా ముఖ్యమైన పెద్ద పండుగ. పంటలు పండి నవధాన్యాలు యిండ్లకువచ్చే కాలమిది కనుక రైతులు దీనిని 'పంటల పండుగ' అని కూడా అంటారు. సంక్రాంతి పండుగ ప్రముఖంగా 'మూడురోజుల పండుగ అయినా నిజానికిది' ముప్పదిరోజుల పండుగ అని చెప్పవచ్చు. పుష్యమాస మంతా సంక్రాంతి సందడే! సామాన్యంగా డిసెంబరు నెల 15 లేక 16వ తారీఖున సంక్రాంతి నెల ప్రారంభమౌతుంది. గ్రామీణులు "సంకురాత్రి నెల పట్టారనడం" కద్దు. అప్పటినుండే సంక్రాంతి సందడి మొదలౌతుంది. జనవరి 14న 'ఉత్తరాయణ ప్రారంభశుభ వేళ' సంక్రాంత్రి పండగ వేడుకలు పరాకాష్టకు చేరుకుంటాయి. ఈ నెలరోజులు గృహిణులు ముఖ్యంగా పల్లెప్రాంతంలో తెల్లవారు ఝామునే లేచి - తమ తమ గృహాలముందు కళ్ళాపిజల్లి అందంగా

ముగ్గులు తీర్చిదిద్దుతారు. ముగ్గుల్లో ఆవుపేడ సుద్దలలో పూలు కుంకుమపెట్టి 'గొబ్బెలు'గా పెడతారు కన్నెపిల్లలు. 'గొబ్బియల్లో గొబ్బియల్లో' అంటూ కన్నెపిల్లలు గొబ్బెలుపెట్టిన ముగ్గులుచుట్టూ తిరుగుతూ చప్పట్లుచరుస్తూ పాటలు పాడతారు. గృహిణులు పోటీ పడి తమ తమ గృహాంగణాల ముంగిళ్ళ ముగ్గులువేయడం పల్లెల్లో అదోసరదా! సూర్యోదయ సమయానికి హరిదాసు "హరిలో రంగా హరి" అంటూ నెత్తిన అక్షయపాత్రతో చిరుతలు వాయిస్తూ యిండ్లముందు ప్రత్యక్షమౌతాడు. ఈ నెలరోజులు పల్లెల్లో యిళ్ళ ముంగిళ్ళముందు ముగ్గుల అలంకరణ - హరిదాసు ప్రత్యక్షం ప్రతి నిత్యం ఉదయంపూట దర్శనమిచ్చే దృశ్యాలు. హరిదాసులేకాదు- "ఢుంఢూం" మంటూ జంగమదేవరలు- గంగిరెద్దుల వాళ్ళు. పిచ్చుగుంటలవాళ్ళు - చెంచులు - బండ్రోళ్ళు - బుడబుక్కలవాళ్ళు- పగటివేషగాళ్ళు - భట్రాజులు - యిలా యెందరెందరో వివిధ 'దేశదిమ్మరి' బిక్షగాళ్ళు పల్లెల్లో యిండ్లముందు పాటలు పాడుకుంటూ దర్శనమిస్తారు! భిక్షకోసం!

గ్రామీణప్రాంతాల్లో - ముఖ్యంగా వరి వ్యవసాయపంట పండే కోస్తాఆంధ్రాలో అది కుప్పనూర్పుళ్ళ సీజను. రైతులు - వ్యవసాయ కూలీలు తెల్లవారుఝామున 'తొలికోడి' కూయగానే నిద్రలేచి బండ్లుకట్టుకొని పొలాలకెళ్ళతారు. పొలాలలో ఎక్కడ చూచినా జోరుగా కుప్పనూర్పిళ్ళు - పాలిగాడి పాటలతో కోలాహలంగా - సందడిగా వుంటుంది. నూర్చిన ధాన్యం గోతాలకెత్తి-బండ్లపై యిండ్లకు చేర్చుకొంటూ గాదెలు గరిసెలు 'పురుల'లో నింపుకొంటారు రైతులు.

ఇక ప్రకృతిఅంతా పచ్చగా - పసిడికాంతులతో రంగురంగుల పూలతో శోభాయమానంగా వుంటుంది. బంతి - చేమంతిపూలతో

ఎర్రగాపండిన - రామములగ (టమోటా) తోటలతో - పెసర-మినుము జనుముచేలతో - చెరుకుతోటలతో మెట్టప్రాంతాలలో నైతే - ఎర్రగా పండిన మిరపతోటలతో - పూతపిందెలతో విరగ కాచిన కందిచేలతో - తెల్లగావిచ్చిన ప్రత్తిచేలతో - పండినకంకుల పచ్చజొన్నచేలతో - ముదురుపొగాగు చేలతో పుష్యమాసంలో పరువం నిండిన ప్రకృతికాంత - రమణీయంగా కన్నులపండువుగా సహజసిద్ధ సుందరంగా దర్శనమిస్తుంది. అందుకే సంక్రాంతిని లక్ష్మీదేవితో పోల్చడం కద్దు.

ఇక సంక్రాంతి పండుగ ప్రధానంగా మూడురోజులు ముఖ్యమైనవి. మొదటిరోజు భోగిపండుగ. తెల్లవారుఝామునే యిండ్ల ముందు - వీధుల కూడలిల్లో పోటీపడి భోగిమంటలు వేస్తారు పల్లెసీమల్లో బోసినోటి పసిపాపలకు రేగిపళ్ళు- పూలు - చిల్లరనాణాలు అక్షతలు కలిపి బంధుమిత్రుల సమక్షంలో 'నెత్తి'న భోగిపళ్ళు పోస్తారు. రెండవరోజు అంటే అసలు పండగరోజు - అదే ఉత్తరాయణ పుణ్యఘడియలు వచ్చేరోజు. మకరరాసినుండి సూర్యుడు ఉత్తరాభిముఖంగా ప్రయాణం అయ్యేరోజు అది. ఈరోజు బలిచక్రవర్తిగూడా భూలోకసంచారం చేస్తాడని భారతీయుల నమ్మకం. ఈ పండుగ సామాన్యంగా జనవరి 14న రావడం విశేషం. కొన్ని అధికమాసాల వలన, ఫిబ్రవరి 'లీపు' సంవత్సరంగా వచ్చేదాన్నిబట్టి-ఎప్పుడో అరుదుగా జనవరి 13న గాని, లేదా 15న గాని సంక్రాంతి రావడం జరుగుతుంటుంది. ఉత్తరాయణ పుణ్యకాలంలో పుణ్య 'నదుల్లో' స్నానాలుచేసి దైవదర్శనం చేసుకొంటారు.

పండుగరోజు ప్రతియింట అభ్యంగన స్నానాలుచేసి క్రొత్త బట్టలు కట్టుకుంటారు. పొంగలిచేసి - 'గతించిన' తమ పెద్దలకు కొత్తబట్టలు పెడతారు. ఇలవేల్పులకు నైవేద్యం పెడతారు. ప్రతి

యింట్లో పండుగనాడు ఎన్నో రకరకాలపిండివంటలు-పొంగలి,పాయసం, అరిసెలు, గారెలు, బూరెలు గుమ్మడిపులుసు-వంకాయవేపుడు ముద్ద కందిపప్పు-నేయి తప్పనిసరి! అరిసెలు సంక్రాంతిస్పెషల్ సంక్రాంతికి కొత్తఅల్లుళ్ళను ఆహ్వానించడం తెలుగువారికి ఆనవాయితీ! వచ్చిన అల్లుళ్ళు పీకలదాకా మెక్కిందికాక - అత్తవారు తమ కోరికలు తీర్చలేదని "అలకపాన్పు" ఎక్కడం అదో వినోదం! కొందరు గృహిణులు బొమ్మల కొలువులు పెడతారు. సంక్రాంతినాడు రంగు రంగులతో యిండ్లముందు పోటీపడి రకరకాల పెద్ద పెద్ద ముగ్గులు పెట్టడం గ్రామీణ స్త్రీలకొక సరదా. పండుగపూట రైతులు- కూలీలు ఇంటిపట్టునేవుండి విందారగించి సాయంత్రం రచ్చబండ దగ్గర చేరి కబుర్లు చెప్పుకోవడం ఓసరదా! మరికొందరు కోడి పందాలు - ఎడ్లపందాలు - గొర్రెపోతుల పందాలు వేయడం పల్లెల్లో ఒక వినోదం! ముఖ్యంగా కోడిపందాలకొక ప్రత్యేకత వుంది! అయితే ప్రభుత్వం యీ కోడిపందాలు నిషేధించినా చాటుగామాటుగా మారుమూల గ్రామాల్లో వేస్తూనే వుంటారు. తెలంగాణాలో 'గాలిపటాల' (పతంగులు) పందాలువేస్తారు. రైతు లంతా ఎద్దుల (దున్నల) బండ్లను పూంచబయట తోటలోనికి తోలు కొనిపోయి విడిదిచేసి గ్రామదేవతలకు నైవేద్యం పెడతారు.

ఇక మూడవరోజు కనుమపండుగ. ముఖ్యంగా యిది పశువుల పండుగ. రైతుకు పొలంపనుల్లో తోడుగావుండేవి ఎద్దులు దున్నలు పాలిచ్చేవి గేదెలు - ఆవులు. రైతులు తమ పశువుల్ని కుంకుమ పసుపులతో అలంకరిస్తారు. కొమ్ములకు రంగులు పూస్తారు. మెళ్ళో కొత్తగజ్జెల మువ్వలపట్టెడలు కడతారు. నాల్గవరోజు కొన్నిచోట్ల 'ముక్కనుమ' పండగచేస్తారు. మాంసాహారులు కోళ్ళను, గొర్రె లను కోసుకుతింటారు. కనుమనాడు కంచంలో ఎముక (బొమిక)

"ఖణాఖణా" అంటే కాశీలోని విశ్వేశ్వరుడు వింటాడని, విన్న ఆ దేవుడు తమకు సకలశుభాలు కలుగజేస్తాడని పల్లెప్రాంతంలో మాంసాహారుల 'పట్టి గుడ్డినమ్మకం !

ఇంత "కథాకమామిషూ" యింతటి ప్రాశస్త్యం మరెంతో ప్రాముఖ్యం వున్న యీ సంక్రాంతి పెద్ద పండగను గురించి తెలుగు కవులు - రైతుకవి అయిన శ్రీ తుమ్మలవారు ఎంత రసవత్తరంగా వర్ణించారో మనమిప్పుడు తెలుసుకుందాం !

ఆధునిక కవులు సంక్రాంతి వర్ణనలో తమ 'నవ్యత'ను కనపరిచారు. "కళ్యాణ కంఠి ఈ కన్నె సంక్రాంతి / భోగాలబాల ఈ భోగి సంక్రాంతి" / వచ్చింది వచ్చింది పచ్చ సంక్రాంతి-/ వచ్చింది వచ్చింది లచ్చి సంక్రాంతి / అని 'నవయుగ వైతాళికుడు-ప్రముఖ భావకవి రాయప్రోలువారు సంక్రాంతికి స్వాగతం పలికాడు ! "పచ్చపచ్చని పైరు పరికిణీముడతల / సగము కన్పడెడు సెనగపూవులను / కెంగేల జాళువాగిండిలో బుసబుస / మని పొంగుమైరేయ మాధురులును" / సంక్రాంతిశోభను అతిశయింప జేస్తాయంటాడు 'భావకవితా చక్రవర్తి దేవులపల్లి' వారు. "పసుపు చీరనుదాల్చి బంతిపూవులమాల / లందంబుగా గ్రుచ్చు సుంద రాంగిగా సంక్రాంతిని అభివర్ణించాడు దేవులపల్లి రామానుజరావు! "మకర సంక్రాంతినాడు హేమంతవేళ" గొబ్బిళ్ళ కొసనిల్చు తుదురు గుమ్మడిపూవు వేయిపూవుల శోభ విలుచుకొనియె"నంటూ పైడిపాటి సుబ్బరామశాస్త్రిగారు సంక్రాంతిని వర్ణించాడు. "కర కంకణ ధ్వనుల్ కవ్వంపు జప్పుళ్ళు / బెరయగానిల్లాండ్రు బెరుగు దురువ / బులుగుల కలకలమ్ములతోడ కలయంపి / సవ్వడుల్ తీయనై సందడింప పుష్యమాసంలో సూర్యోదయం అవుతుందని పింగళి కాటూరివారు వర్ణించారు ! మరియు "వెండిబళ్ళల మొబ

త్రాడు దండకడెము / ముక్కునను బైడికాడయు మోమునందు/ బంగనామమ్ములును వెంట గంగిరెద్దు / చేతమునికోల తనపేరు సెప్పుచుండ / నూరినడివీధి నాడుచునుండె" ననుచు గంగురెద్దులను ఆడించే గంగిరెద్దువాండ్ల వర్ణన 'బొమ్మ'కట్టేలా వర్ణించారు పింగళి కాటూరి జంటకవులు ! "బంతితోటలు చేమంతులు గుమ్మడుల్ పసుపుబట్టల్ దాల్చి లేమొగ్గనవ్వులతో స్వాగతమిచ్చుచున్న" వట సంక్రాంతి సర్వారాజ్ఞీమణికి అని మహాకవి జాషువా చక్కగా చెప్పాడు - "బంతిపువ్వులు మిరపపండ్లు బంగరుతల్లి వసుధావధూ మణికి పసుపుకుంకుమలయ్యె" నంటూ కరుణశ్రీ చమత్కరించాడు.

ఇలా తెలుగుకవులు 'సంక్రాంతి'ని వర్ణించిన తీరు ఒకయెత్తు కాగా - తెనుగులెంక తుమ్మలవారు 'రైతుకవిగా' సంక్రాంతి శోభను - సంక్రాంతి ముచ్చట్లు కవితాబద్ధం చేసినతీరుమరొకయెత్తు. "సంక్రాంతి" "సంక్రాంతి తలపులు" "సంక్రాంతి వేదన (విజయ) "జనుసంక్రాంతి" "క్రొత్త సంక్రాంతి" "సంక్రాంతి ముచ్చటలు" యిలా వివిధ కవితాఖండికలలో 'సంక్రాంతి' శోభకు 'సంపూర్ణత' సంతరించిపెట్టారు తుమ్మలవారు. ఈ 'సంక్రాంతి' మీాది కవితలు- పటిగఘంట, పైరపంట, శబల, సర్వోదయగానం, ఉదయగానం, కదంబకైత - కావ్యాలలో పొందుపరిచాడు కవిగారు. 'సంక్రాంతి' మీాద యిన్ని కవితలు - బహువిధాల వర్ణించినవారు తెలుగు సాహిత్యంలో తుమ్మలవారు తప్ప మరొకకవి యెవరూలేరంటే అతిశయోక్తి కానేకాదు సంక్రాంతిపైని యీా వివిధ కవితాఖండి కల్ని ఒకచోట చేర్చిన అది "సంక్రాంతి" లఘుకావ్యమౌతుంది ! కనుకనే - తుమ్మలవారి కర్షకసాహిత్యం గూర్చి (రైతుకవిగా) వేరొకచోట చెప్పుకొన్నా - వారి సంక్రాంతి గూర్చి ప్రత్యేకంగా చెప్పుకొని ఆనందించవలసిన అవసరం యేర్పడింది. వివిధ కోణాల

నుండి సంక్రాంతి శోభనుగూర్చి తెనుగులెంక వర్ణించిన పద్యాలు మచ్చుకు కొన్ని చూస్తాం !

కొసరినూలిన పచ్చిపసపు బూతమొగాన
గుమ్మడిపూదుమారమ్మునద్ది
కండరేగడ నారబండి కన్పండువై
పొలుచు మిర్యపుబండు బొట్టువెట్టి
వలిపమ్మునకు నొక్కవాసి హెచ్చైనట్టి
నునుమంచుతెర చీరనూలుకొల్పి
బంతిపూవులకు చేమంతినెయ్యము గూర్చి
కబరీభరమ్ము చక్కనకుదిర్చి

పంటకళ్ళాలు మునుబరాబరులు సేయ
గూడుగట్టిన తెలిమబ్బుగొడుగు నీడ
గదలివచ్చెను భాగ్యాలకడలివోలె
మకరసంక్రాంతి లక్ష్మి హేమంత వీథి

—పలిగపంట

గుమ్మడిపూవుపసుపు మొగానఅద్ది, నుదుటఎర్రగాపండిన మిరపపండు రంగు సింధూరతిలకమద్ది, తెలిమంచు చీరకట్టి - బంతీచేమంతి 'శిఖలో తురిమి - పంటకళ్ళాలు బారులుతీర్చి స్వాగతం పలుకు చుండ - సంక్రాంతి లక్ష్మి - హేమంతవీధి గుండా 'భాగ్యనిధి'గా కదలివచ్చిందట. ఓహో ఏమావర్ణన ఏమా చమత్కారం ! నవ ధాన్యరాసులు నట్టింట నాట్యమాడేవేళ మకరసంక్రాంతి వస్తుంది కనుక ! అది 'ధనలక్ష్మి' యే ! తెలుగువారికి 'భాగ్యలక్ష్మి'యే ! పసుపుపచ్చని గుమ్మడిపూలు - బంతిచేమంతిపూలు పూచే సమయ మది. ఎర్రగా మిరపకాయలు పండేవేళ అది. తెరలు తెరలుగా

మంచుకురిసే హేమంత ఋతువది. వరి పొలాలలో ఎక్కడచూచినా పంటకళ్ళములు కనుల పండువుగా కన్పించేకాలమది. పొలాలలో పొలిగాడి పాటలు - శ్రావ్యంగా వినిపించేకాలమది. వర్షాకాలం పోయి - తెలతెల్లని మబ్బులు దాగుడుమూతలాడుకొనే సమయమది. ఈ నేపథ్యంలో సంక్రాంతిలక్ష్మి- ముత్తైదువులా 'గుమ్మడిపూ' పసుపు మొగాన అద్దుకొని - మిరపపండు రంగు సింధూరతిలకం నొసట దిద్దుకొని - తెల్లని మంచుచీర కట్టుకొని - బంతిచేమంతి శిఖలో తురుముకొని పంటకళ్ళాలు అంటే పంటలుపూర్చే కాపు జనాలు స్వాగతం పలుకుచుండగా - తెలిమబ్బు గొడుగునీడన- "లక్ష్మి" దేవిలా "మకరసంక్రాంతి లక్ష్మి కదలివచ్చిందనడం ఎంత సహజవర్ణన ! ఎంత నెఱజాణతనం ! ఈ పద్యంలో - కొసరి, కండ రేగడ - బరాబరులు - వంటి అచ్చమైనజాను తెనుగుపదాలు సహజ సుందరంగా పద్యంలో అతుక్కుపోయాయి. ప్రతిభావ్యుత్పత్తులు గలిగిన గ్రామీణ 'కాపుకవి' కనుక తెనుగులెంక ఎంతో చక్కని- ప్రకృతి సహజమైన - వర్ణన చేసాడు ! రైతుగాపుట్టి - గ్రామజీవనానికి అలవాటుపడిపోయిన 'రైతుకవి' కనుక తుమ్మలవారు అంత కమ్మని వర్ణన చేసారు ! ఆయనకే అది సాధ్యం ! సంక్రాంతిని ఒక సహజసుందర స్త్రీగా విశాల ప్రకృతితెరపై (కేన్వాస్)పై 'బొమ్మ' కట్టేలా కళ్ళకు కట్టినట్లు ఒకచక్కని - మనోహరమైన - సుందరమైన "దృశ్యాన్ని" తెనుగులెంక తన ఛందోబద్ధ పద్యంలో పాఠకునికి చూపెట్టాడు.

లేగటిపాలలో గ్రాగిమాగిన తీయ
తీయ కప్పుర భోగిపాయసంబు
చవులూరు కటివేపచిగురాకుతో గమ
గమలాడు పైరవంకాయకూర

తరుణ కుస్తుంబరీ దళమైత్రిమై నాల్క
త్రుప్పుడుల్చెడి నక్కదోసబజ్జి
కొత్తబెల్లపు తోడికోడలై మఱగిన
మదురుగుమ్మడిపండు ముదురుపులుసు

జిడ్డుదేఱిన వెన్నెలగడ్డ పెరుగు
గరగరికజాటు ముంగారు చెఱకురసము
సంతరించితి విందుభోజనము సేయ
రండురండని పిలిచె సంక్రమణ లక్ష్మి !

—పఱిగపంటు

అబ్బ ! ఎంతగా నోరూరుతుందో యీ పద్యం చదువుతుంటే ! వినేవారు గూడా కళ్ళుమూసి నోరు తెరిచి అలా తన్మయత్వంలో వింటూ వుండవలసిందే పల్లెలో పుట్టి పెరిగి సంక్రాంతివేళ సంక్రాంతి వంటకాలు రుచిచూచిన వారికి - యీ పద్యం చదివితే - పాత జ్ఞాపకాలు గుర్తుకొచ్చి "లొట్టలువేయ" వలసిందే ! వినేవారికి నోరూరవలసిందే ! గేదెలు - ఆవులు 'ఈనే' సమయమది కనుక లేగటిపాలు దొరుకుతాయి ! మరి అట్టి లేగటిపాలతో చేసిన పాయసం ఎంతతీయగా వుంటుందో చెప్పితే తీరదు ! తిని రుచి తెలుసుకోవలసిందే ! లేత 'దవ్వ' వంటి పైరవంకాయలు పండే సమయమది ! లేతకరివేపాకుతో 'తినుగబోత' నెంచి "లేతవంకాయ వేపుడు" కూర రుచిచూడవలసిందే మరి ! "గుత్తివంకాయ కూరోయ్ బావా" అన్నపాట గుర్తుకురాదా మరి ! దోసకాయలు విరివిగాదొరికే సీజనది ! లేత కొత్తిమేరఆకు కలిపిచేసిన నక్కదోస కాయ పచ్చడి తింటే - నిజంగా 'నాల్కత్రుప్పు' వదలిపోవలసిందే ! కొత్తబెల్లం తయారుచేసే కాలమది. కొత్తబెల్లం కాస్త తీపిగా వుంటుంది గదా ! కొత్తబెల్లం నైచిముదిరిన గుమ్మడికాయతో

పులుసువండితే - ఓహో, ఓమా గుమ్మడిపులుసు రుచి ! లేగటి 'ముర్రుబాలు' దొరికేసమయమది. పైగా చలికాలమది ! ఆ లేగటి పాలు కాచి మరగబెట్టితే— మరి జిడ్డుతేరిన వెన్నెలవంటి తెల్లని వెన్నల గడ్డపెరుగు తయారౌతుంది ! "డైరీఫారం" పాలు - నీళ్ళు కలిసిన పల్చనిపాలతో తయారైన పెరుగుతినే యీనాటి ఆధునిక నాగరిక నగర ప్రజావళికి - ముఖ్యంగా బస్తీవాసులకు 'జిడ్డుతేరిన ఆ గడ్డపెరుగు రుచి ఏమి తెలుస్తుంది ! పల్లెలోని రైతుకుటుంబ సభ్యులకు (పాలు వ్యాపారంచేసే వారికికాదు సుమండీ !) ఆ రుచి తెలుస్తుంది ! ఇలా కమ్మని తీయని సంక్రాంతి విందు సంతరించి పెట్టిందట సంక్రాంతిలక్ష్మి ! ఆ విందును కమనీయంగా రమణీయంగా అక్షరబద్ధంచేసి సాహితీప్రియులకు 'కవితావిందు' చేసి— నోరూరింపజేసాడు తుమ్మలవారు ! ఎంతకమ్మని వర్ణన ఎంత తీయని పద్యం ! ఇందులో లేగటిపాలు - మాగిన - గమగమలాడు - పైర - త్రుప్పు - పులుపు జిడ్డుదేరిన - గడ్డపెరుగు - యీ గ్రామీణ - రైతు జీవనానికి సంబంధించిన "తెలుగు నుడికారాలు" పద్యంలో భావబంధురంగా ఇమిడిపోయాయి. రైతుగా పల్లెలో పుట్టి పెరిగి బ్రతికి — అట్టి సంక్రాంతి విందులెన్నో ఆరగించినవాడు కనుకనే - తన స్వీయానుభూతుల్ని - తానుతిన్న కమ్మని వంటకాల్ని కవిగా అక్షరబద్ధం చేసాడు కమ్మకమ్మగా - ఘుమ్ము ఘుమ్ముగా ! తెనుగులెంక.

ఈ కోడిపందెంబు లేమి చెప్పెడినయా
ఆంధ్ర జాతీయ శౌర్యాభివిప్ప
ఈ రంగవల్లిక లేమి తెల్పెడినయా
తెలుగునారీ కళాధీన బుద్ధి

ఈ గంగిరెద్దు వాడేమి పల్కెడినయా
మఱుగువడ్డ తెనుంగు మాటతేట
ఈ గొబ్బిసంబరం బ్రేమిచాటెడినయా
తనివిగొల్పెడి నాంధ్రి ధర్మబిక్ష
ఈ రుచిరపాయ స్నానంబులేమి చూపు
తెలుగు లేజంటతొలుకారు వలపు జపులు
వింతలొలికించు కలికి సంక్రాంతినిట్లు
తెనుగుదనమింట నింట మూర్తీభవించె —పతిగపంట

తెనుగుసీమలో సంక్రాంతి యనగానే - ముంగిట ముగ్గులు- ముగ్గుల్లో గొబ్బియలు - గంగిరెద్దులయాటలు - కోడిపందాలు సంక్రాంతి తీయని పొంగలిపాయసాలు గుర్తుకొస్తాయి. ఈ విషయాలు సూచన ప్రాయంగా చెబుతూ - వీటి ప్రాశస్త్యాన్ని వాటి "సింబాలిజం" ప్రశంసిస్తున్నాడు తెలుగుటెంక !— తెలుగుజాతి 'శౌర్యా'నికి కోడిపందెములు ప్రతీకలంటాడు ! అవును పల్నాటి పౌరుషం_ కోడిపోరుతో నాగులేటిలో కలిసిపోయింది గదా ! కోడిపుంజుల్ని పెంచి - వాటి పందాలద్వారా - తమ తమ శౌర్యప్రతాపాల్ని తేల్చుకుంటారు తెలుగువారు ! ఈనాడు ప్రభుత్వం వాటిని నిషేధించిందనుకోండి ! 'జూదం' క్రింద ! వాటివల్ల 'శౌర్యప్రతాపాలు' కాదు - డబ్బుతగలేయడంతోపాటు ! కక్షలు కార్పణ్యాలు పెచ్చు పెరిగిపోయి 'హింసాకాండ'కు దారితీస్తున్నాయి యీనాడు. కనుక నిషేధించారు. అయినా చాటుగామాటుగా పల్లెప్రాంతాలలో కోడి పందాలువేస్తూనే ఉన్నారు ! వాటి మంచిచెడ్డలలా వుంచితే - కోడి పందాలు నిజంగా సరదాగా - హుషారుగా - 'పౌరుషానికి' ప్రతీకలుగా వున్నమాట నిజం ! రంగురంగుల రంగవల్లికలు - తెలుగు ఆడపడుచుల 'కళానైపుణ్యానికి' ప్రతీకలంటాడు కవి. నిజమే ! తెలుగుపడుచులు 'పోటీ' పడి తమ తమ ముంగిళ్ళముందు 'ముగ్గు'

లెడతారు, ముగ్గులపోటీలు గూడా అక్కడక్కడ జరుగుతూవుండ డం చూస్తాం! గంగిరెద్దుల వాళ్ళు మాట్లాడేభాష 'అచ్చమైన' జాను తెనుగంటాడు కవి! గొబ్బిళ్ళు తెలుగు సంప్రదాయానికి-అనూచానంగా వస్తున్న తెలుగు ధర్మనిరతికి చిహ్నాలంటాడు తుమ్మలవారు. కమ్మని పాయసము 'తెలుగులేజంట తొలుకారు వలపుపంట' అంటాడు కవి. సంక్రాంతికి కొత్తబియ్యంతో క్రొత్త బెల్లంతో - లేగటిపాలతో పొంగలివండడం - పాయసంచేయడం పరిపాటి! సంక్రాంతికి 'కొత్త'గా పెళ్ళిఅయిన 'కూతుళ్ళను-అల్లుళ్ళ'ను యింటికి రావించడం తెలుగువారికి సంప్రదాయం! కనుక కమ్మని సంక్రాంతి పాయసం— 'కొత్తదంపతుల తీయని వలపు'కు ప్రతీక అని బహుచక్కగా చెప్పాడు తుమ్మలవారు!

"పుట్టినింటికి వచ్చినట్టి ముద్దులకూతురు గులాబి చెక్కిళ్ళ నొకతల్లి" చెనకిపుణికితే - "వంగిముగ్గులు దిద్దు నూతనవధువుపై ఒక్క 'గడుసుపడుచు మగడు' నీర్చల్లితే - "తలుపుచాటున" దాగి 'ప్రియునిసోయగం' చూస్తూండట ఓ ముగ్ధమోహన వధువు నెల తప్పి 'నీళ్ళోసు'కున్న కోడలిచేత ఓ అత్త భోగిపొంగలి పూజచేయిం చిందట' ఇలా "మధుర మధురానురాగ సామ్రాజ్యపీఠి"పై 'మకర ధ్వజంబునెత్తి' సంక్రాంతిలక్ష్మి కొలువుతీరిందట! ఎంత మధుర భావన! ఎంత రమణీయ వర్ణన. పండుగసమయాల్లో అత్తాకోడళ్ళ అనురాగం, బావామరదళ్ళ సరదాలు - తల్లీబిడ్డల ఆత్మీయాను బంధం - నూతన దంపతుల చిలిపిచూపులు - శృంగారపు సరాగాలు తెనుగులెంక 'శృతి' మించకుండా చక్కగా వర్ణించాడు.

పొగరుపొంగున రవ్వంత బుద్ధిలేక
పొలయలుక చన్న తలిపిజంటల నెదిర్చి
కొంటెచలిగాడు కొదమకౌగింట సెగల
కటకటా! మ్రగ్గిపోయె సంక్రమణవేళ —పణిగపంట

సంక్రాంతి భాగా చలికాలంలో వస్తుందిగదా ! సంక్రాంతికి చలి చంకలెత్తనీయదని పల్లెసామెత ! శివరాత్రికి శివశివ అంటూ పారిపోతుందట ! సంక్రాంతినాటి చలి ఎముకలుకొరికే విధంగా-నెత్తురు గడ్డకట్టుకపోయే రీతిగా - నరాలు - కండరాలు 'బిగుసు' కొనిపోయేంత తీవ్రతంగా ఉంటుంది ! ఈ కొంటెచలిగాడి దెబ్బకు వయస్సుమళ్ళిన రోగిష్టి అయినవాడు బిర్రబిగుసుకొని పోతాడట ! ఉన్నరోగాలన్నీ చలికాలంలో బయటపడతాయని అంటారుగదా అన్నెంపున్నెం యెరగని 'చంటిపాప'ల మీద తన ప్రతాపం, దర్పం చూపిస్తుందట చలి ! అంటే చలిదెబ్బకు తట్టుకోలేక పసిపాపలు గిలగిలలాడిపోతారు. ముసలితాతల్ని దగ్గులతో యీ చలి ఫుక్కిరిబిక్కిరిచేస్తూ వూపిరాడనీయకుండా బాధిస్తుందట చివరకు యీ చలి "సన్యాసులైన" బ్రహ్మచారుల్ని గూడా గజగజ వణికిస్తుం దట ! అంటే సర్వసంగపరిత్యాగులైన బ్రహ్మచారులకు చలికి తట్టు కొనే దుప్పట్లు వగైరా ఏమీవుండవుగదా; కాషాయ అంగీలుతప్ప! అదీ సంగతి ! ఇక యీకొంటెచలిగాడు 'తెలివిజంటు' లైన యువ దంపతుల్ని మాత్రం ఏమీచేయలేదట ! కారణం - యువదంపతులు చలికాలంలో దుప్పటి ముసుగుదన్ని వెచ్చని బిగికౌగిళ్ళలో పండు కొంటారు కనుక - ఆ దంపతుల 'కొదమ కౌగింటి (వెచ్చని) సెగ లకు తట్టుకోలేక కొంటెచలిగాడు "మ్రగ్గిపోయి" తోకముడుచుకొని పారిపోతాడట ! సంక్రాంతి చలిచూపే ప్రతాపం భావుకుడైన కవిగారు చక్కగా చమత్కరించారు. అంటే రోగిష్టులు, చంటి పిల్లలు, ముసలీముతకవాళ్ళు - సన్యాసులు 'చలి' దెబ్బకు తట్టుకో లేక 'గిలగిల' లాడిపోతారని - "మాంచి" వయస్సులో వెచ్చని కౌగిటపరుండే/పడుచుదంపతుల్ని మాత్రం ఎంతచలియైనాఏమీచేయ లేదనికవిగారి చమత్కారం! అంటే చలికాలంలో, మిగిలిన సీజన్లలో కంటే - యువదంపతులు దుప్పటిముసుగుదన్ని - వెచ్చని బిగి

కౌగిట్లో హాయిగా పండుకొంటారని చతురోక్తిగా కవి ధ్వనింప చేసాడు. చలికాలంలో యువదంపతుల 'వెచ్చని కౌగిలి' సుఖం ఎవరికివారే అనుభవపూర్వకంగా తెలుసుకొని ఆనందించవలసిందే !

పున్నెములముద్ద నా గీర్తిగన్న భీష్మ
డంప సెజ్జకుగాయంబు లప్పగించి
నీయొడిం గన్నుమూతకై నెలలుసైచె
మకరసంక్రాంతి నీవెంత మాన్యవమ్మ ! —పఱిగపంతు

మహీరాజ్యభోగా లొద్దులుకున్నవాడు - కామాతురుడైన ముసలి తండ్రికోరిక మన్నించి ఆజన్మ బ్రహ్మచారిగా జీవించినవాడు-అధర్మ పరులైనచో హరిహరాది గురుదేవులనైనా యెదిరించే ధైర్యమున్న వాడు, శస్త్రాస్త్ర విద్యాధురీణుడైనా యుద్ధనీతి గౌరవము పెంపొందించినవాడు - భీష్మాచార్యులవారు - అట్టి పుణ్యచరితుడైన- భీష్ముడు - కురుక్షేత్రయుద్ధంలో క్షతగాత్రుడై దక్షిణాయణంలో ప్రాణాలు విడిచిపెట్టడం 'పుణ్యప్రదం' కాదుకనుక - ఉత్తరాయణ పుణ్యగడియల కోసం - చలినైనా భరించి - నెత్తురుకారే గాయాలలో అంపసెజ్జపై మకరసంక్రాంతి 'ఉత్తరాయణ పుణ్యగడియల కోసం నెలలకొలది వేచియున్నాడని తెనుగులెంక ఉదాత్తంగా భావం వెలిబుచ్చాడీపద్యంలో ఉత్తరాయణం పుణ్యప్రదమని - యీ కాలంలోమరణిస్తే పుణ్యగతులు లభిస్తాయని మన హిందూశాస్త్రాలు చెపుతున్నాయి గదా ! ఉత్తరాయణంలో ప్రాణాలు విడిచిపెట్టటానికి భీష్ముడంతటి పాపరహితుడు - పుణ్యమూర్తిగూడా మకర సంక్రాంతి వచ్చేవరకు వేచియున్నాడు ! అంటే మకరసంక్రాంతి మాహాత్మ్యం అంతటి గొప్పదని చెప్పటానికి కవిగారు భీష్ముని ఉదంతం చెప్పాడీ పద్యంలో !

త్రేబొట్టుతో బిసాళించు నాముసకు, న
కొక్కురు దూడలు వెండికొండలయ్యె
నిమసానకొకసారి నిండునక్షయపాత్ర
గాసిచే సాతానిగజ్జె విప్పె
కల్లుపెల్లాని రంగముపెట్టె కాకలీ
నాదమ్ము పంట యేనాది జంట
ప్రాజీరవిడి మాలపడతి క్రొత్తలు దాల్చి
సూచించె శిశిరర్తు సుదతిరాక

కొత్తకుసుమకూడు కుత్తుకబంటిగా
బిచ్చగాని కుక్క పెచ్చరిల్లె
చేవతనివి వేడ్కచెలువంబు కావరం
బగ్గవించె నుత్తరాయనమున

—పఱిగపంట

కడుపార "నాము" మేసి నలతచెందిన కోడెదూడలు తేరుకొంటూ యనీ సాతానిజియ్యరు అక్షయపాత్ర నిముషనిముషానికి నిండి పోతుందనీ, పొలము కాపలాకాయు యేనాదిజంట - కడుపార కల్లు తప్పత్రాగి ఆడుతూపాడుతూ వుంటారనీ చినుగునీరకట్టే పనిమనిషి మాలెత క్రొత్తచీర కట్టుకొంటుందనీ - కొత్తన్నం కడుపునిండా మెక్కిన బిచ్చగాని కుక్కగూడా పెద్దగా "మొరుగు" తుందనీ- యీ విధంగా 'ఉత్తరాయణ' పుణ్యకాలంలో సకలప్రాణికోటికి "చేవ, తనివి, వేడ్క, చెలువంబు, కావరంబు" (అంటే - శక్తి, సంతృప్తి, ఆనందం, అందం) అతిశయిస్తాయని కవిగారు అభిభాషించాడు— అంటే సంక్రాంతి సీజన్లో సకలప్రాణులు సుఖసంతోషాలతో "హుషారు"గా జీవిస్తాయని కవిగారి భావం! ఈ పద్యంలో కోడెదూడ, సాతానిజియ్యరు, యానాదిజంట, మాలపడతి, కుక్క

లక్షువరుసగా చేవ, తనివి, వేడ్క, చెలువం, కావరం, "అతిశయిస్తాయని"
క్రమాలంకారశోభ సంతరించిపెట్టాడు తెనుగులెంక ! యీ సీస
పద్యంలో !

> కంటికిన్ గ్రుడ్డికిని వేడుకొన్నవాని
> కెల్ల వానికి భాగంబులేర్పరించి
> లేములెరుగని సంక్రాంతి లేమకపు, డ
> నుంగుదోడయ్యె గుప్పలునూర్చు రైతు —పఱిగపంట

పంట బాగా పండిందంటే - రైతు, నిండుకళ్ళమిచ్చేస్తాడు పాలేరుకి. కుప్పనూర్పిళ్ళ కాలంలో పొలాలవెంట మిఠాయిలమ్ముకొనే చేర గాళ్ళకు - ఉదారంగా వెలకుమించి, చేటలుచేటల ధాన్యమిస్తాడట రైతు "పొలం పనిపాటుల్లో చేతిగాజులు పగిలినోయి బోడిచేతులతో పనిచేసే పాలేరు పెండ్లాం" బోడిచేతులు చూపిస్తూ "దొరా, గాజులు పగిలిపోయాయి" అని చెప్పేసరికి రైతు దయతో గంపెడు కొత్త ధాన్యం దానం చేస్తాడట ! ఈ విధంగా సంక్రాంతికాలంలో కుంటివాళ్ళకు - గ్రుడ్డివాళ్ళకు - రైతునాశ్రయించే బీదాబిక్కికి, దీనఅనాథలకు "ఉదారబుద్ధి"తో "జాలిగుండెతో "ఎముకలులేని చేతి"లో దానంచేస్తాడు రైతు. అంటే నవధాన్యాలతో రైతుల గృహాలు కలకలలాడే కాలంలోవస్తుంది సంక్రాంతి కనుక పని వాళ్ళకు-బీదాబిక్కికి రైతులు ఉదారంగా దానధర్మాలు చేస్తారనికవిగారి భావన ! సంబరాల సంక్రాంతికి రైతు తాను సంతోషంగా వుంటాడు - నలుగురుని సంతోషపెడతాడు - తాను తింటాడు- తనకు పనిపాటుల్లో సాయపడే పాలేరుకు, పనివాళ్ళకు కడుపునిండా పెడతాడు. లేనివారికి లేదనకుండా - బీదాబిక్కిని అనాథలనాదు కొంటాడు రైతు" "అంటూ నవధాన్యరాసులతో నిండిన రైతుల గృహాలు "నవకాంతి"తో "సంక్రాంతి" శోభను ద్విగుణీకృతంచేసి

రైతన్నలు శాంతిసౌఖ్యాలతో కళకళలాడతూ వుంటారని తెనుగు లెంక యీపద్యం చివరిరెండు పాదాలలో ఛందోబద్ధంగా చక్కగా చెప్పాడు.

పండుగరోజువరకు రైతులు - వ్యవసాయ కూలీలు పంటల కోతలు - కుప్పకూర్పిళ్ళ పనులతో కనీసం నెలారెండునెలలు నిద్రాహారాలు లేక కష్టపడతారు. పండగపుణ్యాన వాళ్ళకు ఆనాడు కాస్తంత తీరిక దొరుకుతుంది. పండుగనాడు ఇంటిపట్టునేవుండి- యిల్లాండ్రు చేసిపెట్టే తీయనిపాయసం- గారెలు బూరెలు అరిసెలు కడుపారతిని సాయంకాలంపూట వూరినాల్గువీధుల కూడలి (చౌరస్తా) లో (మర్రి లేక చింత) చెట్టుక్రింది 'రచ్చబండవద్దనో- లేక వూళ్ళోని దేవాలయం మంటపం దగ్గరనో లేక మోతుబరి రైతులైతే - తమ గృహముంగిటనున్న అరుగులమీదనో కూర్చొని కబుర్లు చెప్పుకోవడం పరిపాటి తమ తమ పొలాల్లో ఏమేమి రకం పంటవేసిందీ - యెంతెంత పంటపండిందీ - తమ యిండ్లల్లో పండుగనాడు యేమేమి వంటకాలు చేసుకొన్నదీ - తమ గృహాలకు యెవరెవరు 'బంధుమిత్రులొచ్చిందీ - పంట బాగా పండింది కనుక పెండ్లీడుకొచ్చిన కుమార్తె వివాహ ప్రస్తావనగురించీ తమ గృహాలకు చేయదలచిన మరమ్మత్తులు గురించీ యిలా యెవరింటి కష్టసుఖాలు వారు - "లోకాభిరామాయణం" గా కబుర్లు చెప్పుకోవడం - ముచ్చటించుకోవడం సంక్రాంతి పండుగనాడు పల్లె ప్రాంతాలలో పరిపాటి. రైతుగా - పైగా తన జీవితం పల్లెపట్టుల్లో గడిపినవాడు కావడంవల్ల - ఆయావిషయాలు తుమ్మలవారు- కవిగా సరళమైన భాషలో సహజమైన రీతిలో దేశీయ 'తేటగీతిమాలికా' ఛందస్సులో ఎంతోమనోహరంగా ఎంతోభావబంధురంగా వర్ణించాడు— 'సంక్రాంతి ముచ్చట్లు' కవితల్లో - మచ్చుకు - ఒకటి

రెండు చక్కని సన్నివేశాలలోని సంక్రాంతిముచ్చట్లు సంభాషణలు, యిదిగో, చదవండి - వినండి ఆనందించండి.

ఏమి సుబ్బయా ! మీ 'వాక'లెపుడు లేచి
యెపుడు చేసిరి - యీపనులపుడె కమ్మ
కమ్మగాసాగె మీయింట గారెముక్క
లుడుకువాసన — యీరాత్రి నడుము వాల్చి
నట్లె తోచుటలేదు ... మీయాడువారు....
రావయా రామభద్రయా ! రాకరాక
వచ్చితివి మంచివేళకే ! బాగు బాగు
బల్లమీద కూర్చుండుము ! పనులు తేలి
వచ్చెనా ! పాడి కలదుగా ! బావగారు
తిందురొకపట్టు గారెలు తెచ్చిపెట్టు
మోసి జానకీ ! గిన్నెకుబోసి నేయి
కూడకొనితెమ్ము - భద్రయా - క్రొత్తచోటు
గాదు - కానిమ్ము - వెనుకాడగాబ నేమి ! —పైరపంట

....అమ్మాయి! జానకీ-
యెచటనుంటివో యింత పాయసమును
తీసికొనిరావె - బావకు - దీనిగూడ
భద్రయా - పుచ్చుకొను - మావుపాలతోడ
వండిరీపాయసమును - మాకు రెండు రెండు కోడె
దూడలీయేడు పుట్టెను - జూడుమవిగో

చుట్టం రామభద్రయ్య పండగపూటనే యింటికి వచ్చాడు పొరు గూరినుండి. పండుగకు వండిన పాయసం గారెలు - నేయిబోసి మరీ పెట్టమని కుమార్తెకి చెప్తున్నాడు ఓ రైతు (కవిగారే అను

కుందాం) ఆ రోజుల్లో రైతుల యిండ్లల్లో కుర్చీలు వుండేవి కాదు. చెక్కబల్లలుండేవి. ఇటు కూర్చోటానికి - అటు వ్యవసాయపనులకి ! ఎంత సహజంగావుందీ సంభాషణ.

బెదరకుము తప్పులేమి చెప్పితివికాని
మాటలా యాడు పిల్లకు మన కుటుంబ
ముల వివాహము భద్రయా ! పొలము - నగలు
కానుకలు కట్నములు హద్దులేని ఖర్చు
లెన్నియో చూడవలె గదా....
మంచివార్త చెప్పితివి — నీమాట చాలు
భద్రయా ! దైవమనుకూలపడిన జనుము
మినుము గట్టెక్కినంతనే మనము నిశ్చ
యించుకొందము లగ్నము !........

—పైరపంట

ఈ విధంగా పల్లెల్లో రైతులమధ్య పండుగరోజున సంభాషణలు సాగుతాయి ! కవిగారు ఓ రైతు కనుక - స్వీయానుభూతుల్ని కలబోసి - చెప్పారు - సంభాషణలు ఛందోబద్ధమైనా - 'మామూలుగా మాట్లాడుకొన్నట్లు అతిసహజంగా - సరళంగా సాగాయి ! రైతుకవి చేయితిరిగినవాడుగదా ! తుమ్మలవారు వరిపంటపండే కోస్తాప్రాంతంవాడు కనుక ఆయన సంక్రాంతి కవితల్లో వరిపొలాలు - నూర్పిళ్ళుతత్సంబంధిత విషయాలే ప్రముఖంగా చోటుచేసుకొన్నాయి. తుమ్మలవారు కవి అయినా - ఉపాధ్యాయవృత్తి నెరపినా - ముందొక రైతు కనుక - సంక్రాంతిగూర్చి కవితలు రాసినప్పుడు ఆయనకు సహజంగాకొన్ని స్వీయానుభూతులుగుర్తుకొచ్చి 'సంక్రాంతితలపులు,' గా అక్షరబద్ధమయ్యాయి - మచ్చుకు ఒకటిరెండు.

వెచ్చని గడ్డిపై నడుగువేయుచు మంచుమొయిళ్ళ బంటుగా
వచ్చిన సీతురక్కసికి వంగక గిత్తలబంతి దోలుచున్
బుచ్చిన కొయ్యలో జివురుపుట్టునటుల్ వలిపాటపాడుచున్
రెచ్చిన జవ్వనంబును స్మరియించెద నీమకరోత్సవమ్ములన్

(శబల - సంక్రాంతి తలపులు)

'మాంచి' వయస్సులో వుండగా - సంక్రాంతికి ముందు - పంట నూర్పిళ్ళు జరుగుతుంటే తుమ్మలవారు - కళ్ళంలో నూర్చిన గడ్డిని 'చలినిగూడా లెక్కచేయక - 'గిత్తలబంతి' తోలుచూ - 'వలిపాట పాడిన గత మధురస్మృతుల్ గుర్తుకొస్తున్నాయని మకరసంక్రాంతి అని అంటున్నాము.

బట్టనవ్రేళ్ళతో నదిమిపట్టిన మిర్యపుగాయ నంజుచున్
దెట్టలు తెట్టలై మిసిమితేలిన మజ్జిగబువ్వ దోసిటం
బట్టి బుభుక్షతీవ్రతలు పాయగ జుట్టిన నాటి తృప్తి నా
పొట్టకు ముట్టదీముదిమిప్రొద్దుల సాపడు పిట్టమేతలన్

(శబల - సంక్రాంతి తలపులు)

పుష్యమాసం డిశంబరు, జనవరి నెలల్లో వస్తుంది. ఆ సమయంలో గేదెలు - ఆవులు' ఈని లేగటిపాలిస్తాయి! ఆ 'ముర్రుబాలు' అందునా చలికాలంలో బాగా కాచి - మరునాడు మజ్జిగచేస్తే ఆ చిక్కని మజ్జిగమీద వెన్న తెట్టలు తెట్టలుగా మిసిమి తేలుతుంది! ఆ 'మజ్జిగ' బోసుకొని - ఆ సీజన్‌లో అధికంగా దొరికే కారంగల గుంటూరు పచ్చిమిర్చి నంజుకొంటూ 'మజ్జిగబువ్వ' పంటపొలంలో 'గిన్నెలోకాక 'దోసిట్లో బోసుకొని - శ్రమించి చేనుపని చేయడం వల్ల - కణకణమండే 'కడుపు' ఆకలితీరటానికి 'గబగబా' జుట్టిన ఆనాటి తృప్తిముందు దరిమిలా ఉపాధ్యాయవృత్తిలో స్థిరపడి-వయోవృద్ధుడై - 'పిట్టమెతుకులు' మేయడం 'సహించడం' లేదని

రైతుకవి కాస్తంత ఆవేదనపడుతున్నాడు ! తెట్టలు తేలిన చిక్కని మజ్జిగబువ్వలో 'పచ్చిమిరపవేయ' నంజుకొని జుర్రడం అనుభవైక వేద్యమే !

తుమ్మలవారు స్వయాన వ్యవసాయం చేస్తూనే ఉపాధ్యాయ వృత్తి చేపట్టాడు కొంతకాలం. పంటకోతలు, కుప్పనూర్పిళ్ళకాలంలో తెల్లవారుజామునే లేస్తారు రైతులు పొలంపనులకు పోవటానికి. తుమ్మలవారున్నూ అలాగే తెల్లవారుజామునే లేచేవాడు "రెపరెప సెజ్జవీడి నిదురించు నెలంతను మేలుకొల్పి వంటపనులు దెల్పి జాలి నిగుడన్ ననుజూచు వెలందినెట్టెటో కృపకుదవిష్టజేసి నడిరేయి కడన్ బసితోడ నేగి రేగిపడుగునూర్చినాడ" అంటూ తన స్వీయానుభావాల్ని నెమరువేసుకొంటున్నాడు. ఇలా గృహిణులను కష్టపెట్టేది ఒక్క తుమ్మలవారేకాదు. కుప్పనూర్పిళ్ళ కాలంలో రైతులంతా పొలంపనులతో తాము సరిగా నిద్రపోరు గృహిణులనుగూడా సరిగా నిద్రపోనీరు. అలానే "గట్టితనమ్ము చిందబడి కట్టకుసాగిన దెబ్బదెబ్బకున్" బుట్టెడుకుసుమల్ రాల్చి రాశిపోసాడట ! "అర్రుపులిసి గిత్తయుం కైవైచినతఱి నడుము గట్టిపట్టి మెడకు దాల్చి యూబిలోని బండిచూపి లేపిన మొనగాడ"నని తన రైతుజీవితపు పాతజ్ఞాపకాల్ని గుర్తుచేసుకొంటున్నాడు రైతుకవి.

"కుంటికిన్ గ్రుడ్డికిని లేదన"కుండా - పల్లెకాపు ధర్మంచేయగల సమయంలో సంక్రాంతి వస్తుందని లెస్సగా బల్కాడు. శ్రీ తుమ్మల బిచ్చగాడులేని గ్రుచ్చులేని కటారి / లేనిదొరతనమ్ము లేనికుట్ర / లేని యీరసమ్ము లేనిదేశావధి / లేని పండువిది" అని సంక్రాంతిని అభివర్ణించాడు శ్రీ తుమ్మల. మేడలోవుండే, భూస్వామి, గుడిసెలోవుండే పేదవాడు 'తృప్తి'పడే పండుగిది అంటాడు. ఎంగిలాకునాకే యూనాదివాళ్ళకే కాదు - కుక్కలకు

పందులకుగూడా 'కడుపునిండా' తిండిదొరికే పండుగిది అని అభి భాషిస్తాడు కవి ! నిజమే ! రెక్కాడితేకాని డొక్కాడని కష్టజీవి యింట్లోగూడా 'నాల్గుగింజలు' దొరికే పండుగసమయమిది ! కష్టజీవి గూడా బికుగాడికి భిక్షపెట్టే శక్తిగల్గిన మంచి సంక్రాంతి సమయ మిది.

అందుకే ఆశావాది- మానవహితైషి అయిన తుమ్మలవారు- 'ఏటేటొక్కసారి' కాదు 'ప్రూటకొక్కసారి సంక్రాంతి రావాలని', సర్వులు నిత్యకల్యాణం పచ్చతోరణంగా సకలజనాళి సుఖశాంతు లతో జీవించాలని ఆకాంక్షిస్తున్నాడు.

సంక్రాంతికి 'చలి' పోవటానికి' భోగిమంటలు వేయడం- 'కోడిపందెములు' వేయడం సంప్రదాయం ! సరదా ! కాని విశ్వ మానవ కళ్యాణహితైషి, మానవతావాది అయిన తుమ్మలవారు ఏమంటున్నారో చూడండి !

భోగిమంటలందు గోగుబుల్లలగాదు
కామరోషములను గాల్పవలయు
క్రొత్త పబ్బమందు కోడిపుంజులకాదు
దురభిమానములను ద్రుంపవలయు

(సర్వోదయగానం - క్రొత్త సంక్రాంతి)

అని అభిభాషిస్తాడు కవి - మనిషిలోని కామాది 'అరిషడ్వర్గాలు కూడామాడిమసై పోవాలని - 'ఈర్ష్యాది దురభిమానాలు' నశించి పోవాలని - అప్పుడే సర్వజనులు సుఖశాంతులతో జీవిస్తారని ధ్వనింపజేస్తున్నాడీ చిన్నిపద్యంలో - ఆనాడే - అప్పుడే నిజమైన సంక్రాంతి అవుతుందని - అట్టి సంక్రాంతి రోజూరావాలని మాన వాళికి 'నవకాంతి' కావాలంటాడు. "సంక్రాంతి తలపులు" పద

మోత్తమమైన కవితాఖండమని విశ్వనాథవారు "సంక్రాంతి" అనే కృతి భావనలో భాషలో సర్వోత్తమమై తెలుగునాటి భోగభాగ్యాలను - సరససల్లాపాలను కన్నులకు గట్టినట్లు నోరూరునట్లు నిలుస్తుందని - కాటూరి వేంకటేశ్వరరావుగారు అభిభాషించారు—

ఈ విధంగా మొత్తంమీద మకరసంక్రాంతి 'మధురానుభూతుల్ని' సాహితీప్రియుల కందించిన రైతుకవి శ్రీ తుమ్మల అభినందనీయుడు.



గట్టితనమ్ముచింద బిడికట్టకు సాగిన దెబ్బదెబ్బకున్
బుట్టెడురాలి రాశివడెబో, కుసుమల్; కడియమ్ము మీదికిం
బట్టిన గడ్డినొడ్డి పనపంజినచో బదిమోపులుండు నా
రెట్టబలమ్ము నేడు సయిరింపదు వీసెడు కూరలెత్తగన్

× × ×

కూటికిలేని సోమరులకున్ సరిపోవునుగాని సేద్యపుం
బాటున మున్గితేలు బలభద్రులకున్ బడికొల్వు గిట్టదీ
మాటలు త్రచ్చిసెప్పితిసుమా, యివి బుక్కులమీది బుక్కులీ
బాటకురండు మోహమెడబాసి సుఖింపుడు కర్షకప్రజల్

× × ×

# నవ్యసంప్రదాయ భావవిప్లవ కవిగా

అంతుపొంతులేని యాస్తుల నార్జింప
గడగువారి పప్పులుడకవింక
జడత వీడినారు కడగొట్టుతమ్ములు
కదలినారు నొసటి కన్నువిప్పి — **సందేశసప్తశతి**

తుమ్మలవారు శుద్ధగాంధేయవాది అనీ - సిసలైన గాంధేయకవియని రూఢి అయిన సత్యం! తెనుగులెంక ప్రధానంగా ప్రబలంగా గాంధీకవి అయినా - కాలానుగుణంగా మారుతున్న సామాజిక పరిస్థితులకు స్పందిస్తూ - సామాజిక స్పృహతో - సమకాలీన కుల మత వర్గ విభేదాన్ని నిరసిస్తూ - ఆర్థిక అసమానతల్ని ఖండిస్తూ పుంఖానుపుంఖంగా కవితలు వెలయించాడు. ఎక్కట్లు - చిక్కట్లు సందేశసప్తశతి తదితర ఖండకావ్యాలు అందుకు ప్రబలనిదర్శనాలు. గాంధేయ కవిత్వం వెలయించినా - సమకాలీన సామాజిక సమస్య లకు స్పందిస్తూ ప్రగతిశీల కవిత్వం రాసినా "ఎవ్వారెందరెంత దవ్వైన" గాని "భాషావిపర్యయమ్ము సైపలేన"ని "పద్యంబు సర్వ కవితల కాద్యంబై గానబద్ధమై శ్రుతిహితమై హృద్యంబై నియ తంబన పద్యంబై లెస్సతోడుపడు ధారణకున్" అన్న నిశ్చితాభి ప్రాయంతో - ఆయన రాసిన కావ్యాలన్నీ ఛందోబద్ధ పద్యాత్మ కంగానే తీర్చిదిద్దాడు.

ఈ నేపథ్యంలో తెనుగులెంక సంప్రదాయకవియా, నవ్య సంప్రదాయకవియా, లేక అభ్యుదయ కవియా లేదా విప్లవకవియా అన్న మీమాంస వస్తుంది. అందుకు ముందుగా మనం, సంప్రదాయ మంటే ఏమిటో— నవ్యసంప్రదాయమంటే ఏమిటో - అభ్యుదయ

వాదమంటే ఏమిటో విప్లవకవిత్వమంటే ఏమిటో స్థూలంగానైనా తెలుసుకోవాల్సిన అవసరం వుంది,

సంప్రదాయమంటే స్థూలంగా చెప్పాలంటే - ఒక దేశంలో లేదా ఒక సమాజంలో 'అనూచానంగా' వస్తున్న ఆచారం, అంటే సమాజంలోని వారందరూ మతపరంగానో - కులంపరంగానో పాటించే సామాజికాచారం ! ఆచార్య సి. నారాయణరెడ్డిగారు తన 'ఆధునికాంధ్ర సాహిత్యం'లో "సంప్రదాయమనగా పరంపరాగత మైన పరిజ్ఞానము లేక ఒకానొక సుప్రతిష్ఠమైన ఆచారము అని అర్థ" మని అంటాడు. మరియు "వర్తమానమునకు సంక్రమించు గతమే సంప్రదాయమనియు పాత (గత) తరాలవారి నుండి తర్వాతి తరాలవారికి 'సంక్రమించు వారసత్వమను అర్థములోగూడా స్వీక రింపవచ్చునని గూడా ఆయన వివరించాడు. "సంప్రదాయమంటే అంతా ప్రాచీనమూ చాదస్తమైనదీ అని అర్థంకాదనీ గతం వర్త మానానికి అందించే కాలానుగుణమైన మార్పుల్ని సంతరించుకొన్న వారసత్వమని డా॥ నాయని కృష్ణకుమారిగారు అంటారు. "సంప్రదాయం తాతముత్తాతల ధనం ! జాతికి జీవననాళిక - జాన పద గీతిక... సంప్రదాయం నిలిచే ఉంటుంది హామేషా" అని శ్రీ శ్రీ అభిభాషించారు "సంస్కృతి పుష్టమైన ఏ జాతియు సంప్ర దాయములకు దూరముగా నుండలేదు... సంప్రదాయములేని జాతి వెన్నెముకలేని శరీరము వంటిది. ఏ జాతి తన సంప్రదాయములను సంస్కారనికషముపై ఒఱసికొనుచుండునో ఆ జాతి పదికాలముల పాటు బ్రతికి బట్టగట్టును." అని సి. నారాయణరెడ్డిగారు వివ రించారు. ఇంకా "సంప్రదాయముపై జరుగుమార్పే ప్రయోగ మ"ంటూ "సంప్రదాయమాత్మగా గల నూత్నప్రయోగములు సదా వాంఛనీయములే" అంటూ సంప్రదాయం జీవనదివంటిదని-

ఆ నది కొండలు కోనలు మిట్టలు పల్లాలు దాటుకొంటూ - నూతన ప్రయోగములవంటి ఉపనదులతో సాగిపోతూ నిత్యనూతన జీవ నదిగా వుంటుందని నారాయణ రెడ్డి గారు లెస్సగా చెప్పారు. అలానే "ప్రతిసాహిత్యమున సత్సంప్రదాయము మూలనిధివలె యుపయోగ పడుచూ క్రమాభివృద్ధికి దోహదకారియగుచున్నది' అనీ "సంప్ర దాయ ప్రయోగముల సమ్యక్సమ్మేళనమే మానవుని మహోన్నత దశకు గొనిపోవుననియు నారాయణరెడ్డిగారు విశదపరిచారు (ఆధునికాంధ్ర కవిత్వము - సంప్రదాయములు - ప్రయోగములు)

మరి నవ్యసంప్రదాయమంటే ఏమిటి ? సంప్రదాయం నుండి కాలానుగుణ మార్పులవలన పరిస్థితుల ప్రభావంవలన జరిగిన ప్రయోగముల ఫలితంగా - వచ్చినదే నవ్యసంప్రదాయం ! సాహిత్యపరంగా చెప్పాలంటే ప్రాచీన సాహిత్యపరంగా చెప్పుకుంటే భారతీయ సంస్కృతి - భారతీయ తాత్త్వికదర్శనం మూలాధారంగా పురాణాలను ఐతిహాసిక కథలను భక్తి శృంగారరసాలతో ఛందో బద్ధ పద్యకావ్యాలుగా మలచడం ప్రాచీన సాహిత్య సంప్రదాయం. అయితే సామాజికంగా - రాజకీయంగా - వైజ్ఞానికంగా కాలాను గుణంగా వచ్చిన మార్పులను సంతరించుకొంటూ - పద్యాన్నే ఆశ్రయించి - సమకాలీన సామాజిక - జాతీయ సమస్యల్ని కావ్య వస్తువులుగా స్వీకరించి - భారతీయ సంస్కృతి - భారతీయ ఆర్ష తత్త్వధర్మం ఆలంబనంగానే - మహాకావ్యాలు గొప్ప రచనలు వెలయించడం సాహిత్యపరమైన 'నవ్యసంప్రదాయ' మౌతుంది !

సాహిత్యంలో "నవ్యసంప్రదాయ" వాదానికి గట్టిపునాది వేసి దానికి సిద్ధాంతపరంగా ప్రాచుర్యం తెచ్చినవారు ప్రముఖ సాహితీవేత్త - సాహిత్య చరిత్రకారుడు ఆచార్య జి. వి. యస్.

సుబ్రహ్మణ్యంగారు. "ఆధునిక తాత్త్వికధారలతోను సమకాలీన జాతీయోద్యమ ప్రవృత్తులతోనూ కలిసి సంప్రదాయం అభినవ రూపంలో సాహిత్యక్షేత్రంలో వర్తించడం "నవ్యసంప్రదాయోద్యమమవుతుందని" అంటూ "1935 తరువాత జాతీయోద్యమ స్ఫూర్తితో హైందవ సంస్కృతి పునరుజ్జీవన చైతన్యంతో మహాకావ్యనిర్మాణం లేదా క్లాసిక్ ప్రమాణాలు గల కావ్యప్రక్రియలను, ప్రయోగాలను సాగించినవారు నవ్యసంప్రదాయోద్యమ కవుల"ని సిద్ధాంతీకరించాడు. నవ్యసంప్రదాయోద్యమ వ్యాప్తికి తోడ్పడిన 1) దేశభక్తి 2) స్వాతంత్ర్యసక్తి 3) రసానురక్తి 4) సామాజిక సాహిత్యస్పృహ 5) ప్రక్రియా వికాసస్ఫూర్తి - యీ పంచ శక్తులు సాహిత్య జీవితాన్ని వికసింపజేసాయనీ, జాతీయోద్యమ స్పృహతో సాహిత్యోద్యమంగా రూపొందించటమే సామాజిక సాహిత్య స్పృహగా నవ్యసంప్రదాయవాదులు సంభావిస్తారని సుబ్రహ్మణ్యంగారు విశ్లేషించారు. జాతీయోద్యమానికి ఊపిరిగా నిలిచిన గాంధేయవాదం గురించి వివరిస్తూ— "గాంధేయదర్శనం భౌతిక స్థితినుండి ఆధ్యాత్మిక స్థితివరకు మానవ వికాసస్థితిని జాతి జీవనపరంగా విశ్వమానవ భావపరంగా నిరూపించగలిగిన అపూర్వ దర్శనం. అది నవ్యసంప్రదాయోద్యమానికి సామాజిక సాహిత్య దర్శన ప్రాతిపదిక సంబంధించి... గాంధేయమార్గంలో నవ్యసంప్రదాయవాదులు గ్రహించిన స్వాతంత్ర్య సూత్రం ఇదే" అని సుబ్రహ్మణ్యంగారు వివరించారు.

పైని వివరణాత్మకంగా చెప్పబడిన నవ్యసంప్రదాయ కవితా లక్షణాలనుబట్టి గాంధికవి శ్రీ తుమ్మల ఒక ప్రముఖ నవ్యసంప్రదాయకవి అవుతాడు. తెనుగులెంక స్వయంగా ప్రత్యక్షంగా జాతీయోద్యమంలో పాల్గొన్నాడు. గాంధీని ఆదర్శంగా తీసుకొని-

గాంధేయమార్గంలో నడిచాడు. గాంధేయ కవిత్వం రాసాడు. నవ్య చారిత్రక ఇతిహాసకావ్యాలనదగ్గ ఆత్మకథ - మహాత్మకథలను సాంప్రదాయక ఛందోబద్ధ పద్యమహాకావ్యాలుగా తీర్చిదిద్దాడు. కులమత వర్గవిభేదాల్ని నిరసించినా 'మూఢాచారాల్ని ఖండించినా భారతీయ సంస్కృతిని - భారతీయ ఆర్షవైదికధర్మ మార్గాన్ని శిరోధార్యంగా సంభావించి కవితలన్నాడు. స్వాతంత్ర్యాసక్తి గల్గిన దేశభక్తితోపాటు మానవ వికాసాన్ని - ఆధ్యాత్మిక దర్శనాన్ని— జాతీయస్ఫూర్తిని తన కావ్యాలలో ప్రబలంగా - ప్రముఖంగా పొందుపరచాడు కనుక తుమ్మలవారు ముమ్మాటికీ అచ్చమైన నవ్య సంప్రదాయకవియే.

అయితే యిక్కడ మనమొక విషయాన్ని గురించి చెప్పుకోవాలి. నవ్యసంప్రదాయోద్యమం 1935 నుండి 1975 వరకు సాగిందని - నవ్యసంప్రదాయ కవులలో ప్రథముడు - ప్రముఖుడిగా విశ్వనాథవారిని పేర్కొంటూ దర్భాకవారి రాణాప్రతాపసింహ చరిత్ర, గడియారంవారి 'శివభారతం' విశ్వనాథవారి ఝాన్సీలక్ష్మీబాయి మధునాపంతులవారి ఆంధ్రపురాణం ముదిగొండ వీరభద్రమూర్తిగారి 'వందేమాతరం' 'నవ్యసంప్రదాయ చారిత్రక కావ్యాలుగాను - విశ్వనాథవారి 'ఏ క వీ ర' నోరి నరసింహశాస్త్రిగారి 'రుద్రమదేవి' అడవిబాపిరాజుగారి 'గోనగన్నారెడ్డి' వంటి నవలలను నవ్యసంప్రదాయ చారిత్రక నవలలుగాను - ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యంగారు పేర్కొన్నారు ! అయితే మహాత్ముని ఆత్మకథను తెలుగులో 'ఆత్మకథ' కావ్యంగాను- బాపూజీ నాయకత్వాన సాగిన స్వాతంత్ర్య సమరోజ్వల చరిత్రను 'మహాత్మకథ' కావ్యంగా తీర్చిదిద్దిన గాంధీకవి శ్రీ తుమ్మలవారిని నవ్యసంప్రదాయకవిగా గాని వారి ఆత్మకథ, మహాత్మకథ కావ్యాలని నవ్యసంప్రదాయ

కావ్యాలుగాగాని ఆచార్య సుబ్రహ్మణ్యంగారు పేర్కొనకపోవడం దురదృష్టకరమైన విషయం. (సాహిత్య చరిత్రలో - చర్చనీయాంశాలు) "భారతస్వాతంత్ర్య సంగ్రామ చరిత్ర నిర్మాణం ఒకస్థాయికి వచ్చిన తర్వాత వెలువడిన మహాకావ్యం — "వందేమాతరం" (ముదిగొండ వీరభద్రమూర్తిగారిది) అని సుబ్రహ్మణ్యంగారు అంటూ "రాజశేఖర శతావధానిగారి రాణాప్రతాపసింహ చరిత్ర మొదలుకొని ముదిగొండ వీరభద్రమూర్తి 'వందేమాతరం దాకా తెలుగు సాహిత్యంలో మేరుపర్వత శిఖరాల్లా కనిపించే యీ మహాకావ్యాలు చారిత్రక కావ్యాలు" అంటూ "రాణాప్రతాపునిలో మహాత్మాగాంధీ మనకు దోబుచులాడుతూ ప్రత్యక్షమౌతాడు" అని అభిభాషించిన ఆచార్య సుబ్రహ్మణ్యంగారు స్వయాన గాంధీగారు రాసుకొన్న ఆత్మకథను తెలుగులో కావ్యంగా తీర్చిదిద్దిన తర్వాత బాపూజీ నాయకత్వానసాగిన స్వాతంత్ర్య సంగ్రామచరిత్రను 'మహాత్మకథ' మహాకావ్యంగా తీర్చిదిద్దిన శ్రీ తుమ్మలవారిని వారి కావ్యాలనీ తన 'సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలు' లో పేర్కొనకపోవడం, కారణాలేవైనప్పటికీ అది చాలా బాధాకరమైన విషయం ఆత్మకథను కట్టమంచి రామలింగారెడ్డి గారు - రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు విశ్వనాథవంటి వారు బహుధా మెచ్చుకున్నారు. రాణాప్రతాపసింహ చరిత్ర శివభారతం - ఆంధ్రపురాణం - సౌందరనందం - ఆత్మకథ - అభినవాంధ్ర పంచమహాకావ్యాలన్నారు సాహితీ విమర్శకులు. సుబ్రహ్మణ్యంగారు మొదటి మూడు కావ్యాల్ని పేర్కొని ఆత్మకథను పేర్కొనకపోవడం విచారకరం— సుబ్రహ్మణ్యంగారన్నట్లు రాణాప్రతాపునిలో దర్శకవాడు గాంధీని దర్శింపజేసాడు సరి మే! తుమ్మలవారు సాక్షాత్తుగాంధీజీఆత్మకథ, మహాత్మకథలనే కావ్యాలుగామలిచాడుగదా! పైనచర్చించినట్లు, ఆచార్య సుబ్రహ్మణ్యంగారు పేర్కొనకపోయినా శ్రీ తుమ్మ

లవారు 'నవ్యసంప్రదాయకవి'గాను వారిఆత్మకథ-మహాత్మకథలు పైని పేర్కొన్న కావ్యాలవలె 'నవ్యసంప్రదాయ చారిత్రక కావ్యాలేనన్న నగ్నసత్యం మనకు స్పష్టంగా కనబడుతూనే వుంది !

ఇక తుమ్మలవారు 'అభ్యుదయ' కవియా కాదా అనే విష యాన్ని ఆలోచిస్తాం ! గాంధేయవాది అయిన 'గాంధీ' కవి శ్రీ తుమ్మలను అభ్యుదయకవి అంటే చాలామంది అభ్యుదయ వాదులు అనంగీకారం తెలుపుతారు. అలానే చాలామంది నిజంగా తెనాలి వెంకట అభ్యుదయ కవియా అని ఆశ్చర్యపోతారు ! తుమ్మలవారి సాహిత్యం అంతా చదివినతర్వాత అత్పుడాయన అభ్యుదయ కవియా కాదా అని ఆలోచించడం సబబు ! తుమ్మల వారి సాహిత్యం చదివినవారికి ఆయన అభ్యుదయకవి అని స్పష్టంగా తెలుస్తుంది.

గాంధీజీని అభ్యుదయ వ్యతిరేకి అనడం సబబుకాదు రక్తపాత విప్లవం వ్యతిరేకించాడు. అయితే కమ్యూనిష్టు సిద్ధాంతకర్త కారల్ మార్క్స్ అంటే ఆయనకు గొప్ప అభిమానం రస్కిన్ రాసిన "అన్‌టూ దిస్ లాస్ట్" (unto This Last) గ్రంథాన్ని మాతృభాష లోనికి అనువదించి 'సర్వోదయ' మని పేరుపెట్టాడు. దక్షిణాఫ్రి కాలో వున్నప్పుడు తాను నెలకొల్పిన ఆశ్రమానికి 'టాలుస్టాయి' ఆశ్రమమని పేరుపెట్టాడు ఏ దేశచరిత్రలోనైనా అంతకుముందు లేని — శాంతియుత సత్యాగ్రహవ్రత విధానాంద్వారా శాంతియుత సహాయనిరాకరణ ద్వారా - రవి అస్తమించని బ్రిటీషు సామ్రాజ్య పాలకుల్ని 'రాట్నం నూలుపోగు'తో బంధించి, దేశానికి స్వాతం త్ర్యం తెచ్చుటకై ముఖ్యసారధిగా నిలిచిగెలిచాడు గాంధీజీ. మరి ఇది విప్లవాత్మకమైన రాజకీయ విజయమేగదా ! ఇది అభ్యుదయం కాదా ! అలాగే గాంధీ చెప్పి, పాటించిన 'సర్వోదయ సిద్ధాంతం

ఒక విధంగా విప్లవాత్మకమైనదే కదా ! అభ్యుదయ దోహదకారక మైనది కదా ! సనాతన హైందవధర్మాల్ని సమర్థించినంతమాత్రాన వర్ణాశ్రమ ధర్మాల్ని సమర్థించినంతమాత్రాన గాంధీజీ అభ్యుదయ వాదికాకపోడు. అలానే గాంధీకవి, గాంధేయమార్గాన్ని సమర్థించి- ఆ మార్గంలో నడిచినంతమాత్రాన అభ్యుదయకవి కాకపోడు. వాస్తవానికి గాంధీకవి శ్రీ తుమ్మలవారు గాంధీజీకంటే ఎన్నో విప్లవాత్మక - అభ్యుదయకర భావాలు వెలిబుచ్చాడు. అభ్యుదయ కవి శ్రీశ్రీ వెలిబుచ్చిన భావాలకంటేగూడా గాంధీకవివిప్లవభావాలు వెలిబుచ్చాడు. ఇంతకీఅభ్యుదయవాదం, అభ్యుదయ కవితాలక్షణాలు ముందు స్థూలంగా తెలుసుకొంటేనేగాని శ్రీ తుమ్మల అభ్యుదయ కవి అవుతాడా కాడా అన్నది తేల్చుకోవచ్చు ! ఇంతకు "అభ్యు దయం" అంటే మామూలు అర్థం— ప్రగతి; పురోగతి, అభివృద్ధి. కాని సాహిత్యంలో "అభ్యుదయవాదం" అంటే రూఢిఅయిన అర్థం కేవలం ప్రగతిమాత్రమే కాదు; ఆప్రగతికి దోహదంచేసే లక్షణాలు వేరే వున్నాయి. వాటిని మనమిప్పుడు స్థూలంగా తెలిసికొందాం !

డా॥ సి. నారాయణరెడ్డిగారు (ఆధునికాంధ్ర సాహిత్యం) అభ్యుదయ కవిత్వమంటే "అది పూర్తిగా భౌతికవాదపు పునాదులపై నిర్మితమైన మార్క్సిజముచేత ప్రభావితమైనదే. దీనిలో ఆముష్మిక చింతనకు ప్రసక్తిలేదు. కర్మసిద్ధాంతమునిది నమ్మదు. విధినిది పూజించదు. అదృశ్యశక్తులు మానవుని జాతకరేఖలను చిత్రించు నను విశ్వాసమునిది నిరసించును మానవుడు తన అస్తిత్వమునకు తానే కారకుడు "అంటూ "శ్రామికవర్గముయొక్క భౌతిక శ్రేయ స్సును గోరునది అభ్యుదయ కవిత్వమని" విశ్లేషించాడు. ఇంకా యిలా వివరించాడు నారాయణరెడ్డిగారు "అభ్యుదయ కవిత్వతము నకు వర్గసంఘర్షణము ప్రథమగణ్యమైన లక్షణము. దీనిలోనే గత

నిరాసనము. ప్రస్తుతపుబూర్జువావ్యవస్థ తిరస్కారముఇమిడియున్నది”
గత విశ్వాసములను, మత సంప్రదాయములను గూడా అభ్యుదయ
వాదులు త్రోసివేసినారు — అంటూ “సమాజములో గూడుకట్టు
కొన్న ఆకలి దరిద్రత అసమానత మున్నగునవి తొలగిపోయి అది
వర్గరహిత స్వర్గముగా వెలుగొందవలెనని అభ్యుదయకవుల హార్దిక
లక్ష్యము.” అని వివరించాడు. అభ్యుదయ కవిత్వమునకు సరళత
స్పష్టతగూడా ప్రధాన గుణములని నారాయణరెడ్డిగారు వివరిస్తూ
ప్రపంచంలో యుద్ధాన్ని ఖండించి విశ్వశాంతిని గూడా అభ్యుదయ
కవులు ఆహ్వానిస్తారన్నాడు.

పోతే ప్రముఖసాహిత్యచరిత్రకారుడైన ఆచార్య జి. వి.
సుబ్రహ్మణ్యంగారి అభిప్రాయం ప్రకారం అభ్యుదయవాదం - సాహి
త్యంలో గతానుకరణ రూపంగావచ్చే 'సంప్రదాయాన్ని గర్హి
స్తుంది. పద్యాన్ని తిరస్కరిస్తుంది. సామాజిక స్పృహయే కవితకు
జీవమని జీవితమని నిర్దేశిస్తుంది. భౌతికవాదపరమైన మార్క్సిజంపట్ల
నిబద్ధత నిత్యసత్యమని నియమిస్తుంది. లెనినిష్టు మార్క్సిస్టు మూల
సిద్ధాంతమైన గతితార్కిక భౌతికవాదమునకు హృదయస్థానమైన
1) వర్గసంఘర్షణ 2) శ్రామిక వర్గాధిక్యము 3) ఆర్థిక సమా
నత్వం - యీ త్రివేణీ సంగమమే అభ్యుదయ వాదమనిపించు
కొంటుంది. అలానే కులమతవర్గ వర్ణరహితమైన సమసమాజవ్యవస్థ
ఏర్పడటానికి సాహిత్యంసాధనంగా ఉపయోగపడాలి. పీడితవర్గం
కార్మికకర్షకవర్గాల శ్రేయస్సుకోసమే కవిత్వం రాయాలి. ధనిక
భూస్వామిక పెట్టుబడిపెత్తందారీ (బూర్జువా) వ్యవస్థను కూలద్రోసి-
ఆర్థిక అసమానతల్ని తొలగించి సోషలిష్టు సామ్యవాద సమాజ
స్థాపనకై రచనలు సాగించాలి. పద్యకవిత్వాన్ని, శిష్టసంప్రదాయ
భాషను త్రోసి రాజని వచనకవిత్వాన్ని వాహికగా చేసుకొని వ్యవ
హారభాషలో రచనలు చేయాలి,

అభ్యుదయ సాహిత్య వస్తువునకు మార్క్సిజం దాని ఆత్మ అనీ మార్క్సిజం లేనినిజం మీద నమ్మకంలేనివారు అభ్యుదయ రచయిత కాలేడని శ్రీ శ్రీ నొక్కి చెప్పాడు. అభ్యుదయ కవిత్వ పర్యవసానం రసానందం కాదు చైతన్యమని డా॥ వేల్చూరి నారాయణరావుగారు అంటారు.

ఏతావాతా తేలిందేమిటంటే— అభ్యుదయ రచయితలు, కవులు, తమ రచనల్లో ధనిక భూస్వామిక పెట్టుబడి పెత్తందారుల 'దోపిడీ' విధానంపై దాడిచేస్తూ - శ్రామికవర్గాల కొమ్ముకాస్తూ - "శ్రామికలోకపు సౌభాగ్యానికి కార్మికలోకపు కల్యాణానికి 'అవసర మైతే వర్గపోరాటం రక్తపాత విప్లవం నిర్దేశిస్తారు. కులమతాల్ని వారు ఖండిస్తారు. ఆర్థిక అసమానతలు తొలగించడమే వారి ప్రధాన ధ్యేయం. ఇక భాషావిషయానికొస్తే - "వచన పద్యాలనే దుడ్డుకర్రల్తో పద్యాలనడుములు విరుగదన్ని" (పఠాభి) "శ్మశానాల వంటి నిఘంటువులుదాటి, వ్యాకరణాలసంకెళ్ళు త్రెంచుకొని ఛందస్సుల సర్పపరిష్వంగం వదిలించుకొని- (శ్రీ శ్రీ) "వ్యాకరణ సూత్రపు రెడీమేడ్ దుస్తులు లేక దిసమొలతో" (దాశరథి) సరళ మైన వ్యావహారికభాషలో - వచనంలో రచనలుచేస్తారీ అభ్యుదయ కవులు. శృంగారం - భక్తి - అలంకారం - రసధ్వని యిల్లాంటివి వీరికి 'ఎలెర్జీ' - గిట్టవు! మార్క్సిస్టు ఏంగిల్స్ ప్రవచించిన 'గతి తార్కిక భౌతికవాదం' యీ అభ్యుదయవాదానికి జీవం! జవం. సామాజిక స్పృహ దానికి వెన్నెముక. శ్రామిక లోకాభ్యుదయం కోసం జరిగే వర్గపోరాటంలో - సామాజిక తిరుగుబాటులో శ్రామిక వీరుడొకడు మరణిస్తే "వేలకొలది ప్రభవింతురు. ఒకనెత్తుటి బొట్టు లోనే ప్రళయాగ్నులు ప్రజ్వరిల్లు" (సోమసుందర్) అనేది వారి నినాదం! ఒక విధంగా చెప్పాలంటే అభ్యుదయ సాహిత్యం

కమ్యూనిస్టు రాజకీయ రంగువేసుకొని, తెలుగుసాహిత్య జగత్తులో ఒక కొత్త అవతారమెత్తింది.

ఈ నేపథ్యంలో శ్రీ తుమ్మలవారిని 'అభ్యుదయ కవి' అనటానికి వీలులేదు కారణం యీ 'లక్షణాలన్నీ' ఆయనలో లేవు కనుక తుమ్మలవారిని — అభ్యుదయవాదులు - తమవర్గంలో ఏనాడూ పరిగణించలేదు ! కాని తుమ్మలవారి సాహిత్యం చదివిన వారికి ఆయన అసలుసిసలైన 'అభ్యుదయకవి' అని స్పష్టంగా కనిపిస్తాడు. విచిత్రమేమిటంటే— యీ అభ్యుదయవాద లక్షణాలు చాలాలేని — కేవలం సంస్కరణవాదియైన గురజాడవారిని వీరు నెత్తినపెట్టుకొని పూజిస్తారు. ఛాందస మూఢాచారాల్ని — పుక్కిటి పురాణాల్ని రాచిరంపానపెట్టిన కవిరాజు త్రిపురనేనిగాని, కులమత వర్గవిభేదాల్ని నిశితంగా - సున్నితంగా ఖండించిన జాషువానుగాని వీరు తమవర్గంలో చేర్చుకోలేదు. అది అలావుంచి అసలువిషయాని కొస్తాం. తుమ్మలవారు 'భాషావిపర్యయమ్ముసైప' లేదు. పద్యాన్ని విడిచిపెట్టలేదు. అయితే అవసానదశలో శ్రీ తుమ్మల గాంధీజీపై వచన కవితరాసిన దాఖలాలున్నాయి గాంధీకవి అయిన శ్రీ తుమ్మల గాంధీజీలా 'రక్తసహిత విప్లవానికి బద్ధవైరి. ఆయనిది శాంత్యహింసా మార్గం ! శుద్ధగాంధేయ మార్గం. సర్వోదయ సిద్ధాంతి అయినా శ్రీ తుమ్మల ధనికవర్గాల్ని తీవ్రంగా నిరసించాడు. పేదలపక్షాన నిలబడి అభ్యుదయకవిత్వం బోలెడంతరాసాడు. కులమతవర్గ విభేదాల్ని ఖండించాడు. మూఢవిశ్వాసాల్ని- మూఢాచారాల్ని వ్యతిరేకించాడు. శృంగారం - భక్తిరసాలు ఆయనకు గిట్టలేదు. కళకళకొరకే అని ఆయన గంతులు వేయలేదు. ఏ సూరినో సుబ్బినో సల్పి పచ్చిశృంగారం చెప్పలేదు. ఆయన కవిత్వమంతా ధర్మవీరరసం తొణికిసలాడుతుంది. సత్యనిష్ఠ-శాంత్య

హింసావిధానం - జాతీయవాదం - విశ్వమానవ శ్రేయస్సు తుమ్మల సాహిత్య సౌధానికి నాల్గుస్తంభాలు !

అయితే మనమిక్కడొక ముఖ్య విషయాన్ని విస్మరించరాదు. కవి అనేవాడు ముఖ్యంగా ఆధునికకవి తన సమకాలీన సమాజానికి ప్రతినిధి అన్నసత్యాన్ని అందరూ అంగీకరిస్తారు. "A Poet is a representative of his age" అన్నది ఆంగ్లసూక్తి ! అంటే కవి, యుగప్రతినిధి ! శకకర్త ! అంటే తన కాలంలోని దేశకాలపరిస్థితుల్ని - సామాజిక ఆచారవ్యవహారాల్ని — సమాజంలో జరుగుతున్న అన్యాయాల్ని కవి తన రచనల్లో ప్రత్యక్షంగానో - పరోక్షంగానో "సూచనప్రాయం" గానైనా "చొప్పించక" మానడు ! కవి అనేవాడు "క్రాంతదర్శి" చెడును నిరసించి మంచిని సమర్థిస్తూ- విశ్వశ్రేయస్సుకోసం మార్పును నవ్యతను దర్శిస్తాడు ప్రజలకు మార్గం చూపిస్తాడు కవి. అందుకే "విశ్వశ్రేయః కావ్యం" అన్నారు. 'అభ్యుదయ పరంపరాభివృద్ధి' కోరి కవిపండితులు రచనలు చేస్తారుగదా ! "సర్వేజనాః సుఖినోభవంతు" వారి ఆకాంక్ష ! "బహుజనహితాయ - బహుజన సుఖాయ" అన్నది వారి ధ్యేయం రక్తపాతసహిత విప్లవం కోరకపోయినా — వచన కవితారీతిలో రచనలు చేయకపోయినా "అభ్యుదయ కవులంమేమే" అని చెప్పుకొనే ఆధునిక ప్రజాకవులు అంగీకరించకపోయినా - "కులమత వర్గ రహిత సమాజం" కోసం—— "విశ్వమానవ కల్యాణం" కోసం కలంపట్టి కావ్యాలురాసిన తెనుగులెంక - జాషువావంటి నవ్యసంప్రదాయ కవులు నిజంగా "అభ్యుదయ" కవులే ! ఈ సత్యాన్ని తెలుగు సాహితీలోకం - తెలుగు సాహితీవిమర్శక ప్రపంచం యివ్వుడిప్పుడే గుర్తించడం ముదావహం. అందునా ధనికవర్గపు దోపిడీని ఖండించి, పేదల కొమ్ముకాసిన తుమ్మలవారు 'ముమ్మాటికీ' గాంధీ

కవిగాను 'అభ్యుదయకవి' గాను తెలుగు సాహితీజగత్తులో వెలుగొందుతాడు.

ధనికభూస్వామ్య పెట్టుబడిదారీ దోపిడీవిధానాన్ని ఖండించడం- కష్టజీవి కొమ్ముకాయడం అభ్యుదయకవుల ముఖ్యలక్షణం కదా— తుమ్మలవారు ధనికవర్గాన్ని యెలా విమర్శించారో చూడండి. "యుగయుగాల నుండియును ధనవంతులు నీతిలేక పాపభీతిలేక పీల్చుచున్నవారు పేదలరక్తంబు తీయతీయ కొండ తేనెవోలె" అని కుండ బద్దలుకొట్టినట్లు ధనికవర్గం 'దోపిడీ' విధానాన్ని దుయ్యబట్టాడు తెనుగులెంక. "అంతుపొంతులేని యాస్తుల నార్జింపగడగువారి పప్పులుడకవికను" "బొర్రబలిసి నేడు విర్రవీగుచునున్న సాహుకార్ల యాటసాగదిక్లై" కష్టజీవుల 'శ్రమ'ను దోచి బలిసిపోతున్న ధనిక వ్యాపారస్తుల్ని తస్మాత్ ! జాగ్రత్త" అని హెచ్చరిక చేస్తున్నాడు- "మీ ఆటలుసాగవు" "మీపప్పులిక వుడకవంటున్నాడు." జడతవీడినారు కడగొట్టుతమ్ములు కదలినారు నొసటి కన్నువిప్పి" అంటూ "రుద్రమూర్తియై దరిద్రుండు చిచ్చుఅకన్నువిప్పి గజ్జెగట్టునెపుడొ! " అని కార్మికకర్షక వర్గాలు 'సంఘటిత'మై ధనికభూస్వామ్య వర్గంపై 'తిరగబడతా'రని ధ్వనిపూర్వకంగా కవిగా - హెచ్చరిస్తున్నాడు తుమ్మలవారు. "ఎముకలగూడులై బ్రదుకునీడ్చుట కొల్లక త్రెళ్ళలేక శోకముల దపించుచున్ సెగలుగ్రక్కు దరిద్రుల ద్రోసిపుచ్చుకాలము చనె"— "విప్లవాగ్ని" దెసలన్ గబళింపకముందె యందలాల మరిన వారు మేల్కొని యహంకృతి నుజ్జనసేత లగ్గుగున్" అంటున్నాడు. ధనికుల దోపిడీకిగురియై యెముకలగూళ్ళుగా మిగిలిన కష్టజీవులు "మా ఖర్మమింతేనని" యేడుస్తూకూర్చునే రోజులు పోయాయి ! "వర్గపోరాటం" "విప్లవాగ్ని" ప్రజ్వరిల్లకముందె-

ధనికులు "కళ్ళు తెరవాలని" "మేల్కొనని" తమ దోపిడీవిధానాన్ని మానుకోవాలని మంచిగా హితబోధ చేస్తున్నాడు శాంతిప్రియుడైన గాంధీకవి. "ఈ పేదలు మన వేల్పులు" "వీరికుద్దియుండర యెవరున్" అని నొక్కిచెబుతాడు గాంధీకవి ! సన్నకారు రైతును "దోపిడీ" చేసేవారిని గురించి చెపుతున్నాడు తెనుగులెంక.

సీ॥ పెద్ద వడ్డీలొడ్డి పీల్చి నీరక్తంబు
చట్టురాగుండియ సాహుకారు
బన్నంబెఱింగి నీపంట నల్పక్రయం
బిచ్చిబండ్లకునెత్తె బచ్చుకటిక
లంచంబు నాసించి కించిత్తు నీతిలే
కధికారి నీకూటి కడ్డుదగిలె
దారుణంబగు పన్ను దయమాలి విధియించి
కటకటా ! నృపతి నీకడుపుమాడ్చె

తే.గీ॥ ఇన్నిరీతుల నీసొమ్ముతిన్నవారె
చూచుచున్నారు నిను గడ్డిపోచవలె (పఱిగపంట)

చేలో ఎరువులకు, యింటి అవసరాలకు సాహుకార్ల దగ్గర 'అధిక వడ్డీలకు' అప్పు తెచ్చుకొంటాడు రైతు. ఈ అధికవడ్డీలకు 'చక్రవడ్డీ' కట్టి రైతును జెలగలా పీల్చుకొనితింటాడు వడ్డీ వ్యాపారస్థుడు. అప్పిచ్చినవాడికోరకో లేదా నెత్తిమీదికొచ్చిన అవసరంబట్టో - కళ్ళం లోనిపంటని చాలా తక్కువధరకే అమ్ముకొంటాడు రైతు. ఈవిధంగా దళారీలు రైతును పీక్కుతింటారు. అధికారులేమో లంచాలతో రైతును పీక్కుతింటారు శిస్తులిపుడు లేకపోవచ్చు గాని 'నీటితీరువా' వగైరా పన్నులు ప్రభుత్వం (నృపతి) విధించి రైతు నడుంవిరగ్గొడు తోంది. ఇలా అన్ని విధాల 'దోపిడీ'కి గురిఅవుతున్నాడు సన్నకారు రైతు. రైతుగా 'స్వీయబాధల్ని' చక్కగా చెప్పాడు తెనుగులెంక.

సీ॥ పగలురేయి నలంగిపడయు పైసాలతో
నెండియేకరు పొట్టనిండదయ్యె
పడతుక పరువు గాపాడజాలిన వల్వ
కొనదగ్గశక్తి చేకూరదయ్యె
తాటాకు పావులాధరపల్క నెండవా
నలతాకు చలిసోకు తొలగదయ్యె
పసిపాపనికి సన్నిపాత విపత్తిరా
కటువయ్యె మాత్రకు గవ్వయేని

తే. గీ॥ ముప్పులకు జంకి తెచ్చిన యప్పుదీర్ప
నసలుకంటె వడ్డీ నాల్గంతలయ్యె
బాపురే ! పేదవానికి బదవలజగి
నలుగురన్ దలయెత్తుటేనాటికగునా —కదంబకైత

పేద శ్రామికుని కష్టాలనీ పద్యంలో చెప్పాడు మనకవి. ప్రొద్దస్తమానం రెక్కలు పిండిచేసి కష్టించినా కడుపునిండడం లేదు. ఇల్లాలు ఒంటిమీదికి సరైనచీర కొనలేకపోతున్నాడు. పూరిగుడిసె కప్పు వేసుకోలేక - (చెత్త - తాటాకుధర పెరిగి) ఎండలో వానలో చలిలో బ్రతుకుతున్నాడు. కన్నబిడ్డలకు జబ్బుచేస్తే మందులుకొను క్కొనే శక్తిలేక యేడుస్తున్నాడు. అవసరానికి తెచ్చిన అప్పులకు వడ్డీలు పెరిగిపోతున్నాయి. శ్రామికుని జీవితమిట్లు చట్టుబండలౌతున్నాయి.

అభ్యుదయ సాహితీజగత్తులో 'నూతన యుగకర్త'గా కీర్తింపబడుతున్న శ్రీ శ్రీ "ధనవంతుల పన్నాగాలు ఇంకనాఇకపైచెల్లవు" అంటాడు. "నరజాతి సమస్తం పరపీడన పరాయణత్వం... దరిద్రులను కాల్చుకుతినడం"అనిసాంఘికఅస్థవ్యస్తవాస్తవాన్నివివరించాడు. మరి అట్టి శ్రీ శ్రీ కవిత్వంలోని 'మాటలు' భావాలులోని "తీవ్రత

కంటే గాంధీకవి "భావాల"లో ఆయన కవితల్లో "తీవ్రత" ప్రగాఢంగా వుందని వేరేచెప్పనక్కరలేదు ! అంటే ధనికుల్ని నిరసించడంలోను శ్రమజీవుల్ని సమర్థించడంలోను శ్రీ శ్రీ కన్న గాంధీకవి వాస్తవంగా "ముందు"నే నిలబడ్డాడని స్పష్టమౌతుంది! "బలవంతుల దౌర్జన్యాలు" "ధనవంతుల పన్నాగాలు" యింకానా "యికపై చెల్లవని శ్రీ శ్రీ అంటే— "బొర్రబలిసి నేము విర్రవీగుచునున్న సాహుకార్ల యాట సాగదిక్లె" అనీ— "అంతుపొంతులేని యాస్తుల నార్జింపగడగువారి పప్పులుడకవికను" అని గాంధీకవి అంటాడు ! "ఒక వ్యక్తిని మరొకవ్యక్తి - పీడించే సాంఘిక ధర్మం" ఇంకనా యికపై సాగదంటాడు శ్రీ శ్రీ. "నరజాతి సమస్తం - దరిద్రులను కాల్చుకుతినడం" అంటాడు శ్రీ శ్రీ— మరి గాంధీకవి "ధనవంతులు నీతిలేక పాపభీతిలేక పీల్చుచున్నవారు పేదల రక్తంబు" అని అంటాడు. ధనవంతులు కష్టజీవుల శ్రమను, రక్తాన్ని జలగల్లాపీలుస్తున్నారంటాడు. మరి ఎవరిభావాలు తీవ్రమైనవో స్పష్టంగా తెలుస్తునేవుంది !

పైగా "పొలాలనన్నీ - హలాలదున్నీ - ఇలాతలంలో హేమంపండగ - జగానికంతా సౌఖ్యం నిండగ—" విరామమెరుగక పరిశ్రమించే కర్షకవీరుల కాయంనిండా కాలువకట్టే ఘర్మజలానికి ఖరీదుకట్టే షరాబులేడోయ్" అని వినూత్న భావాత్మకంగా శ్రీ శ్రీ అంటే "ఈ పేదలుమనవేల్పులు"వీరికుద్దియుండరయెవరన్" అంటూ "రైతేకదా దేశరమకు వెన్నెముక... కాపేకదా లోకకళ్యాణ దాత" అని ప్రశంసిస్తూ కర్షకుణ్ణి "శివుని"తో పోలుస్తాడు తెనుగు లెంక

తుమ్మలవారు ఎంతటి భావవిప్లవవాది యో చూడండి— "రాణివంటి చానతాల్ మోయుచున్నది / కరుణలేని మంటగాడ్చు

లందు / తట్టరాపుకతన దెబ్బోడియయ్యేనీ / చెట్టదేశమునకు బిట్ట పిడుగు" అంటాడు గృహమే స్వర్గసీమగా - మగడూబిడ్డలే సర్వస్వంగా 'ఇంటిని' దిద్దుకోవలసిన 'యిల్లాలు' పేదరికంవలన మలమల మాడే యెండల్లో కటికిరాళ్ళు మోస్తున్నది కడుపుకోసం ! రాళ్ళు మోసిమోసి ఆమె తల బోడితల అయ్యింది ! ఇది యీ దేశానికి పిడుగువంటి చెట్ట ! అంటాడు కవిగారు. కట్టుకోవడానికి చీరలేక-చినుగుతో - కాల్వగట్టుచాటుగా దిసమొలతో ఓ స్త్రీ "ముడిగి"ందట ! నెలలునిండినా పొట్టకోసం రొప్పుతూరోస్తూ - వరికోతలకు పోయే స్త్రీల దీనావస్థ యెప్పుడు తొలిగిపోతుందోనని బాధపడతాడు ! పాపం ! ఓ తల్లి - నిండుచూలాలు - పొట్టకోసం-తూలుతూ సోలుతూ - కూలికిపోయి - పొలమందే గొబ్బిమండల మధ్య ప్రసవించిందట ! ఎప్పుడు బాగుపడుతుందీ సమాజమని ప్రశ్నిస్తాడు కవిగారు.

"చెమటలో జీకిచీకి కష్టించు బడుగు / కమికెడన్నంబు లేక యేకారుకేమి / యెండకన్నెఱుగని దొర లింద్రభోగ / మగ్నులై కోరమీసాలు మలపుకేమి" అని ప్రశ్నిస్తున్నాడు - భావవిప్లవమూర్తి - శాంతియుత గాంధి భక్తుడు శ్రీ తుమ్మల— ఆఱుగాలం-ఎండనక - వానక - రెక్కలు కండలుపిండిచేసి చెమటోడ్చి— పొలాల్లో ఫ్యాక్టరీలలో 'దేశసంపదను పెంపుచేయటానికి తన శాయశక్తులా కష్టించి పనిచేసే శ్రామికునికి 'కడుపునిండా గంజిలేకపోవడం ప్రశ్నిస్తున్నాడు కవిగారు. కష్టజీవుల శ్రమనుదోచుకొని - నీడపట్టున 'శీతలగృహాలలో వుంటూ — కార్లలో తిరుగుతూ ఇంద్రభోగాలు అనుభవిస్తూ - తమ సుఖసంపదలకు కారణభూతులైన కష్టజీవుల మీద "కోరమీసాలు" దువ్వుతూ - కస్సుబుస్సుమంటూ మండిపడడం మనకవి నిరసిస్తున్నాడు ! ఇంత విప్లవభావాలు-మెత్తగా సుతిమెత్తగా - చురకత్తిలా చెప్పాడు శాంతగుణగాంధి—

గాంధీభక్తుడు - మన తెనుగులెంక ! "పేదవాని కడుపుమంట/ పెరిగినచో, జగమాగదు / ఏడుసముద్రాలు పొంగియేకార్ణవమై తీరున"ని మంచిగా హెచ్చరిస్తున్నాడు గాంధీకవి ! "సిరిగలవారి కోశములు చిన్నవి పెద్దవియయ్యె సంపదల్ పెరిగిన వారికబ్బినవి పెత్తనముల్ నిఱుపేదకెంతయున్ బరువుగ మారెజీవితము ప్రాణములున్న శవమ్ముకై వడిన్ తిరుగుసతండు" అని పచ్చినిజాన్ని నిక్కచ్చిగా చెప్పాడు తెనుగులెంక ! ఇదంతా "నిజదేశనికృష్ట" నిర్వాకం వల్ల నేనంటూ - శాధపడుతున్నాడు మనకవి.

"శ్రమపడుటే జాతికిసిరి శ్రమపడుటే రాజ్యమునకు సంపద అని తుమ్మలవారంటాడు ! "తాజమహల్ నిర్మాణానికి రాళ్ళెత్తిన కూలీలెవ్వరు ? "ప్రభువెక్కిన పల్లకికాదోయ్ అదిమోసిన బోయీలెవ్వరు" అని శ్రీ శ్రీ నిలదీస్తే— "యెవనియెముకలీ మేడలకిటుకలయ్యె - నెవని రక్తంబుచే గోడలిట్లు బిగిసె" నతనికా యిట్టి పరమహేయంపుబ్రదుకు" అని ప్రశ్నిస్తాడు ! కష్టజీవి రక్తమాంసాలు గృహనిర్మాణానికి 'యిసుక సిమెంటు' లయ్యాయట ! ఓహో ఎంత విప్లవభావం !

ఇక్కడ చెప్పొచ్చిందేమిటంటే - శ్రీ శ్రీని తక్కువగా అంచనావేయడం కాదు ! శ్రీ శ్రీని అభ్యుదయకవి చక్రవర్తిగా— "నూతనయుగకర్తగా" శ్లాఘించే తెలుగుసాహితీ ప్రపంచం- తుమ్మల వారిని "సంప్రదాయఛాందస గాంధీకవిగా" లెక్కించడం- ఆయన్ని అసలు 'అభ్యుదయకవుల' జాబితాలోనే చేర్చకపోవడం గురించే బాధ! జాబితాలో చేర్చనంతమాత్రాన తుమ్మలవారు 'అభ్యుదయకవి' కాకపోడు ! అందుకాయన రాసిన కవితలే మనమిక్కడ చెప్పుకున్న విప్లవభావాలున్న ఆయన కవితలే ప్రబల నిదర్శనం ! పద్యఛందోపద్ధతినే ఆశ్రయించి - యింతగా' విప్లవభావాలతో' కవితలు

రాసిన ఆధునికాంధ్ర కవులలో తుమ్మలవారే అగ్రాసనాధిపత్యం వహిస్తారని నాకనిపిస్తుంది. శ్రీ శ్రీ గురజాడలు పద్యంకంటే గేయం-వచనకవిత్వం వెలయించారు. రాయప్రోలు, దేవులపల్లి వంటి వారు పద్యంరాసినా వారిది భావకవిత్వం. కవిరాజు పుక్కిటిపురాణాల మీాద విరుచుకొనిపడ్డాడు. జాషువా 'కులమతాల్ని' సున్నితంగా విమర్శించాడు. తెనుగులెంక ధనికపేదల కులదోపిడీ బాధల తార తమ్యాల్ని పద్యకవితల్లో 'విప్లవాత్మ'క భావాలుగా వెలిబుచ్చాడు.

అయితే రక్తపాతసహిత విప్లవాన్ని గాంధీకవి అంగీకరించ లేదు. "ధనముగలవాని దిద్దుపద్ధతినిమాని చంపజూచుట మతిలేని చందమనెద" అని నిర్ద్వంద్వంగా చెప్పాడు తుమ్మల. ఎందుచేత నంటే "ధనికులందును మానవత్వమ్ము కలదు - ధనికులందును ధర్మతత్పరత కలదు" అన్న నగ్నసత్యాన్ని గుర్తించినవాడు గాంధీ కవి. "ఏ విప్లవమునకైనను జీవమహింసావ్రతంబె చిరతరమగు" నన్న విశ్వాసం "సర్వోదయ మార్గమ్మున నుర్విన్ దేవలయు శాంతి" అన్న నమ్మకం గాంధీకవి కుందికనుక.

"ఒకయింట సిరులుమూల్గుట యొకయింటన్ బ్రేవులఅచుట" మంచిది కాదంటాడు! "సిరిన్గూడబెట్టి దాచుకొనుట" దొంగ తనమువంటి దోస" మంటాడు "చెమటనోడ్చి నరుడు జీవింపదగు గాని తేరసాముమెక్కి బ్రతేపరాదు" అంటాడు. పరాన్నభుక్కుల్ని-సోమరిపోతుల్ని నిరసిస్తున్నాడన్నమాట. ఇవన్నీ గాంధీజీ ఆశ యాలే! గాంధిజీ ప్రవచించిన 'సర్వోదయ' సిద్ధాంతపుటాశయాలే!

"గుడికాదు నేడునరునకు బడికావలె" నని నొక్కి చెపు తున్నాడు. అజ్ఞానపుటంధకారం పటాపంచలం కావటానికి 'అక్షర జ్యోతి' ప్రతిపల్లెవాసుని హృదయంలో వెలుగొందాలని శ్రీతుమ్మల అభిభాషణం.

"దాపరాదు నరుడు తన యక్కఱకొలంది కెక్కుడైన కల్మి నెఱుకమాలి" అని అంటాడు "సంపన్నులు తమ బంగరుగంపలకున్ తాము ధర్మకర్తలయని భావింపవలయు" నంటాడు ఇంతకంటే సోషలిష్టు - కమ్యూనిష్టు భావం యింకొకటేమిటి ? అభ్యుదయ వాదులుగూడా కోరేది సంపదఒకరిగుత్తపెత్తనం క్రిందకాక ప్రభుత్వ పరం కావాలనే గదా! "నాదినీదియన్న భేదమున్నన్నాళ్ళు తొలగ దొకనినొకడు దోచుకొనుట" అంటాడు. అంటే "స్వంత ఆస్తిపట్ల స్వార్థదృష్టి వున్నంతవరకు "దోపిడీ విధానం" పోదని ధ్వని !

"దేశమంటే మట్టికాదోయ్ - దేశమంటే మనుజులోయ్" అని గురజాడవారంటే— "దేవుడన మాతృదేశము దేవతలన ప్రజలు" అని గాంధీకవి ఉవాచ ! అంటే మాతృదేశాన్ని గౌరవించాలని పూజించాలని భావం !

"కలమెత్తిన హలమెత్తిన మగ్గమెత్తిన వారినొక్కమై జూడవలెన్" అంటూ 'వృత్తి గౌరవాన్ని' "Dignity of labour" గుర్తు చేస్తున్నాడు కవి. సర్వోదయం చెప్పేదిగూడా యిదేకదా ! మరి అభ్యుదయవాదులు "శ్రామికులంతా" ఏవృత్తిచేపట్టినా - ఒకేవర్గ మని గదా నొక్కి చెప్పేది ! తుమ్మలవారు అదే నొక్కి చెపు తున్నాడు అలానే "హెచ్చుతగ్గులకో జాతికెగ్గుసేయు నేటి వర్ణ వ్యవస్థ మన్నింపజాల'నని ఖచ్చితంగా చెపుతున్నాడు. "మనువు మాట తన సమాజమునకు మన మాటయన్న మన సమాజమునకు" అంటూ దేశకాలపరిస్థితుల్ని బట్టి "మార్పు" తప్పనిసరి అని- అట్టి మార్పుకు ఆహ్వానం పలుకుతున్నాడు గాంధికవి. ఈ విషయంలో గాంధీకంటే గాంధీకవి ఒక అడుగుముందు కేసాడు. గాంధీ 'వర్ణాశ్రమ ధర్మాల్ని సమర్థించాడు. "సామ్యవాదమో ప్రజాస్వామ్యమో నియంతృత్వమో మరేప్రభుత్వమేని "అందరికీ "కూడుగుడ్డ గూడు"

సమపూర్చనలెనంటాడు. "మతములెన్నియైన మానవ గణమెల్ల నొక్కజాతియనుట నిక్కమమ్మ" అంటూ విశ్వమానవతా ధర్మాన్ని నొక్కి చెప్పుతున్నాడు. అభ్యుదయవాదులనేది దేకదా !

"హైందవులు - ముస్లిములు సిక్కులన్నదమ్ములన్నట్లు జీవింప" వలయుననీ - మతసహనాన్ని - పరమత గౌరవాన్ని ఆయన నొక్కి చెప్పాడు; మొదటలేక తర్వాతవచ్చిన కులాన్ని కాదని గుణమే ప్రధానమని— "యుగయుగాలనుండి యున్న" అంటరాని తనము గెంటిననాడు హిం / దూసమాజమునకు వాసివచ్చు" నని లెస్స పలికాడు. "కులమతభేదముల్ మఱచి మానవతా పథ"ము ననుసరింపవలయునని నొక్కి చెప్పాడు. అలానే 'అంతు పొంతులేని యాస్తులనార్జింప గడగువారిపప్పులుడకవికను" అంటాడు. 'పేదవాడు మనకు ఆరాధ్యదైవత' మనియు "అతని గొల్చుటే సుఖావహమ్మ"ని అభిభాషించాడు. "నాదినీదియన్న భేదముండ" కూడదని— "సంఘమున హెచ్చుతగ్గులు సమయు" వలయుననీ- ఆనాడే మనకు 'నవసమాజం' 'సమసమాజం' వస్తుందని కవిగారు ఆకాంక్ష వెలిబుచ్చారు. "కలవారందరు కన్నువిప్పి" "కలుముల్ పంచెడి ధర్మకర్త" లైనచో - "నిలయంబెద్దియురాద'ని 'జగతీ కల్యాణం' సిద్ధిస్తుందని కవిగారు ఆశాభావం వ్యక్తం చేసారు. "మనువుచెప్పె నను మ" మొండిపట్టు విడిచిపెట్టి - మార్పును గమనించి నేర్పుగా కాలానుకూలంగా మనిషి మనుగడ సాగించాలని- అప్పుడే ప్రగతిపథంలో- మనిషి సుఖజీవనం చేయగలడని ఆశాభావం వ్యక్తం చేసాడు.

విచిత్రమేమిటంటే - గాంధేయవాది అయిన తెనుగులెంక- వైయక్తికంగా - సహజసిద్ధంగా 'శాంతగుణం కలవాడు. సాధుస్వభావమున్నవాడు అయితే భావాలు ఎంత తీవ్రంగా ఎంత విప్లవాత్మ

కంగా వున్నాయో చూసాం కదా ! ఆయన కలం ఎంతవాడిదో ఎంత వేడితో చూసాం. గమ్మత్తు ఏమిటంటే - అభ్యుదయకవుల కున్న విప్లవకవులకున్న ఆవేశం తుమ్మలలో కనిపించకపోయినా భావాలు ఎంతో తీవ్రంగా వున్నాయి— శ్రీ శ్రీ లాగా శ్రీ తుమ్మల 'హరోం హరోం హర ! హర హర హర హర! హరోం హరా' అని పొలికేకలేయలేదు. మరో ప్రపంచం మరో ప్రపంచం పిలిచింది పదండి ముందుకు పదండి త్రోసుక అని గర్జించ లేదు. వస్తున్నాయి వస్తున్నాయి జగన్నాథ రథచక్రాలని పెద్దపెద్దగా అరవలేదు. హింసనచణ, ధ్వంసరచన సంరంభం, సంక్షోభం సంఘ ర్షణ అని ఆవేశపడలేదు. ఎముకలు క్రుళ్ళిన వయస్సు మళ్ళిన సోమరులారా చావండి అని యీసడించలేదు. అగ్నికిరీటపు ధగ ధగలు ఎర్రబావుటా నిగనిగలు కనపడలేదా అని ఎవర్నీ అడగ లేదు.

తుమ్మలవారు తీరిగ్గా కూర్చున్నారు. సావధానంగా ఆలోచించారు ధనవంతుల దోపిడీ - పేదల దయనీయస్థితి కళ్ళారా చూసారు. కలత చెందారు. కలతపట్టారు. అంతుపొంతులేని యాస్తుల నార్జింప గడగువారి పప్పులుడకనికను' అని హెచ్చరించారు. ఎముకల గూడులై బ్రతుకునీడ్చుట కొల్లక త్రెళ్ళలేక శోకముల దపించుచున సెగలు క్రక్కు దరిద్రుడు రుద్రమూర్తియై చిచ్చుఱ కన్నువిప్పకముందె - విప్లవాగ్ని దెసలన్ గబళింపకముందె- అందలాలెక్కినవారు మేల్కొని యున్నవారు తెల్వి తెచ్చుకొని- కష్టజీవుల్ని దోచుకొనుట మానాలని - పేదల్ని ఆదుకోవాలని మంచిగా హితవు చెప్తున్నారు ! లేకుంటే- "కావలసిన కార్యం గంధర్వులే తీర్చగలరని లేనున్న లేనివారు తాల్మిలేక ఎంతసున్న గ్రహింపగలరు- కట్లుత్రెంపగలరని, అప్పుడు పరితపించి లాభముండదని మెల్లగా-

మెత్తగా - సున్నితంగా - సునిశితంగా - ధనికవర్గాలవారికి చెప్ప వలసిన నాల్గుమాటలు మంచిగా చెప్పాడు శాంతిప్రియుడైన క్రాంతదర్శిగా గాంధీకవి శ్రీ తుమ్మల. తుమ్మలవారు 'విప్లవభావాలున్న నవయుగకవి అని జాస్తి చల్లయ్యగారు తాళ్ళూరి సత్యనారాయణగారు- తుమ్మల శ్రీనివాసమూర్తిగారు కోళ్ళపూడి మల్లిఖార్జునకవి ప్రభుతులు సోదాహరణంగా వివరించి నొక్కి చెప్పారు. సాహితీ విమర్శకుడు "సూర్యదేవర రవికుమార్ గారితో (ఉదయం దినపత్రిక 21-1-94) తుమ్మలవారే స్వయంగా" "నిజానికి నేను రాసిందంతా విప్లవ కవిత్వమే. కాకపోతే మన విప్లవం ఏమిటంటే అహింసా విప్లవం." అని స్వయంగా చెప్పుకున్నారు—

ప్రజాబాహుళ్యం నిత్యంవాడే "వ్యావహారిక భాష" లేక వాడుక భాషలోనే అందునా వచన కవితారీతులలో "కవిత్వం చెప్పాన్నది అభ్యుదయ కవితాలక్షణం! అయితే 'నియతిలేని నాడు నిలదుకైత' అన్న నియమం తెలుగులెంకది" "భాషావివర్యయమ్ము సైపలేడాయన" నారచన పద్యము. దీనికి వ్యావహారిక భాష సాయపడదు. గణముకోసమో - యతిప్రాసలకోసమో సలక్షణ భాష నాశ్రయింపక తప్పదు" అని తుమ్మలవారి దృఢవిశ్వాసం! వ్యావహారిక భాషలో ఛందోబద్ధ పద్యం రాయడం కుదరదన్న తుమ్మలవారి అభిప్రాయం సరియైనది కాదనుకొండి! వ్యావహారిక భాషలో శ్రీ శ్రీ వంటి కవులు ఛందోబద్ధ పద్యాలు రాసారు! సరే. తుమ్మలవారి విశ్వాసంవారిది. "ఎవరెందరెంత దవ్వైన నేను భాషావిపర్యయమ్ము సైపలేను" యెందుకంటే "బాసచెడినేని కవితా వాసన చెడుతుందని నిక్కచ్చిగా గూడా చెప్పాడాయన! అయితే తెలుగేతర భాషాపదాలు ఆయన కవిత్వంలోను 'అవసరం' కొద్దీ కొల్లలుగా చోటుచేసుకొన్నాయి. తుమ్మలవారి సాహిత్యంతో పరిచయమున్న వారికీవిషయం సుభోదకం!

మన గాంధికవి "కళకళలాడకే కవిత్వమని గంతులువేయ" లేదు! "కోతకోతగా వలపులు నింపి కబ్బములు వ్రాయ" లేదు "ఏ నూరినో సుబ్బినో సిల్పి పచ్చిసింగారంబు" పల్కలేదు ! అంటే భావకవిత్వాన్ని భావకవుల్ని పరోక్షంగా ఎద్దేవా చేస్తున్నాడు కవి- దేవులపల్లివారు 'ఊర్వశి' పేరుమీద, నండూరువారు 'ఎంకి' పేరు మీద రాయప్రోలువారు 'లలిత' పేరుమీద బాపిరాజు 'శశికళ' పేరుమీద, విశ్వనాథవారు 'కిన్నెర' పేరుమీద వెలయించిన ఆత్మాశ్రయ ప్రణయకవిత్వాన్ని పరోక్షంగా తుమ్మలవారు వ్రేలెత్తి చూపెట్టారు "హేతువాదమ్మునకింత నిల్వగలేక" 'బూతులబుంగలై జాతి వైరములకు మతద్వేషముల కుపాధ్యాయులై' రోతరాజేయు నట్టి "పురాణమ్ములన్" బూని వ్రాయలేదు ! శృంగారభక్తి రస ప్రధాన వస్తుకథాకావ్యాలైన "పురాణ" కావ్యకర్తల్ని నిరసిస్తు న్నాడు కవి ! వాస్తవానికి తుమ్మలవారు భక్తిప్రధాన, శృంగార రసభరితకావ్యాలు రాయలేదు. పురాణగాథల్ని తీసుకొని కావ్యాలు రాయలేదు. ఆయన రాసినవన్నీ జాతీయ స్ఫూర్తినిచ్చే కావ్యాలు. సత్యనిష్ఠ శాంత్యహింసా పూరిత రచనలు - వ్యక్తి నడవడిని తీర్చిదిద్దే కవితలు. గీతాధర్మం (భగవద్గీత) వంటివి ఒకటో రెండో రాసాడంతే !

తుమ్మలవారు ఎంత గాంధేయవాది అయినా కాలానుగుణ పరిస్థితులకు స్పందించి సామాజిక స్పృహతో కవితలు వెలయించాడు

నేలవిడిచి సాము నెఱపిన యట్లుండు
సంఘగతికి దవ్వుసాగి వ్రాత
యుక్తిచణత కాదు, యుగలక్షణము గుర్తిం
పవలయు గావ్య లేఖనమున—

'సంఘగతి'ని కాదని కవిచేసే రచన - నేలవిడిచి నెఱపిన సాము వంటిదని - కావ్యంలో యుగలక్షణాలుండాలని శ్రీ తుమ్మలవారు అభిభాషించారు. అభిభాషించడమేకాదు . సమకాలీన సమాజంలో వచ్చిన మార్పుల్ని గమనించి - తదనుగుణంగా - యుగధర్మాల్ని పాటించి ఆయన కవిత్వం నెలయించాడు.

యావత్ ప్రపంచం దృష్టినుంచి చూస్తే - రాచరికానికి స్వస్తి ఒకప్రక్క ప్రజాస్వామ్యం - మరోప్రక్క కమ్యూనిష్టు సోషలిజం- వైజ్ఞానిక యాంత్రిక పురోగతి - అమెరికా రష్యాలమధ్య స్పర్థలు- అణుబాంబులు- మారణాయుధాల ఉత్పత్తి - మన దేశం దృక్కోణం నుండి చూస్తే - బ్రిటీషువాలనకు వ్యతిరేకంగా గాంధీజీ నాయకత్వాన జాతీయోద్యమం - రాష్ట్రంలో భాషాప్రయుక్త రాష్ట్రోద్యమం - మన సాంఘిక దృష్టినుంచి చూస్తే - కులమతవర్గ వ్యతిరేకత అస్పృశ్యతా ఖండన - మూఢాచార నిరసన - సమసమాజభావన- ధనికభూస్వామ్య దోపిడీపై తిరుగుబాటు - గ్రామిక పక్షపాతం సాహిత్యరీత్యా చూస్తే - ఇతిహాసిక - పౌరాణిక సాహిత్య సంప్రదాయ వ్యతిరేకత - ఆత్మాశ్రయ భావకవితా విలసనం - అభ్యుదయ సంస్కరణాభిలాష - వ్యావహారిక భాషాభిమానం - యిత్యాదులు యీ యిరవయ్యో శతాబ్ధి యుగలక్షణాలు ! 1901 లో జన్మించి 1990 వరకు జీవించిన శ్రీ తుమ్మల యీ యిరవయ్యో శతాబ్దికవిగా - యుగకవిగా మనం చెప్పుకోవచ్చు ! మారిన సమాజిక స్థితిగతుల ననుసరించి - యుగలక్షణాల్ని గమనించి శ్రీ తుమ్మల కవిత్వం చెప్పాడు.

హిందూ సనాతన సంప్రదాయానికి వర్ణాశ్రమ ధర్మానికి- సత్యాహింస నియతికి 'ప్రతీక'గా నిలిచిన 'మహాత్మాగాంధీ' విశిష్ట వ్యక్తిత్వాన్ని ఆదర్శంగా తీసుకొని - 'గాంధేయవాదాన్ని' 'త్రిక

రణశుద్ధి'గా నమ్మి - ఆచరించి - గాంధిపై పలుకావ్యాలు నెల యించిన 'గాంధీకవి' తుమ్మలవారు - గాంధీజీకంటె రెండుఅడుగులు ముందుకేసి "కులమత వర్గరహిత" నవ సమసమాజ స్థాపనా కాంక్షతో కవితలల్లిన 'భావవిప్లవ' గాంధీకవిగా మనకు సాక్షాత్కరిస్తాడు ! వర్ణాశ్రమధర్మాలు జీవనోపాధికొరకు పుట్టిన కులవృత్తులు మన ధర్మాలు నిర్దేశించినవి కనుక వాటిని గాంధీ సమర్థించాడు. అయితే కులాంతర వివాహాలు తప్పులేదన్నాడు కాని కులనిర్మూలన సమూలంగా కావాలనలేదు గాంధి "మతకులభేదముల్ మరచి మానవతా పథమాశ్రయించమని" గాంధీజీ హితవు. అయితే గాంధీకవి తుమ్మల– కులమతభేదమ్ములపై వలపుంచిన– "మనమే మన విలయ మున్సృంపించుకొనిన వారమౌతామంటాడు తుమ్మల వారు కులమతాలు పోవాలని అంటాడు. గాంధీజీవలె - గాంధీకవి- వ్యక్తిశ్రమకు - భుక్తిశ్రమ (Bread Labour) కు వృత్తిగౌరవానికి ప్రాధాన్యమిస్తాడు. వర్ణాశ్రమధర్మాల్ని విధించిన మనువును గాంధి కవి కాదన్నాడు. "మనువు చెప్పెననుచు, మాతాత మేనత్త పాడె ననుచు, మొండిపట్టు తగదు. మనువుమాట తన సమాజమునకు, మనమాటయన్న మన సమాజమునకు" అని తెనుగులెంక నిష్కర్షగా చెప్పాడు. ఈ విషయంలో గాంధికంటె గాంధికవి 'ఒక అడుగు' ముందుకేసాడు. బహుశా గాంధీజీకంటె గాంధీకవి షుమారు నాల్గుదశాబ్దాలు ఎక్కువ జీవించడం ఒక కారణంకాగా యీ నాల్గుదశాబ్దాలలో ప్రపంచంలో - దేశంలో - సమాజంలో అన్ని రంగాలలో ముఖ్యంగా మానవుని దృక్పథంలో అలానే తెనుగు సాహితీరంగంలో వచ్చిన "మార్పుల" ప్రభావం తుమ్మల వారిపైకూడా పడడం మరొక కారణంకావచ్చు ! ఏదిఏమైనా తెలుగు 'అభ్యుదయ సాహితీజగత్తులో 'నూతన యుగకర్తగా కీర్తింపబడుతున్న శ్రీ శ్రీ కవికంటే గూడా తుమ్మలవారు 'భావ

విప్లవకవి'గా ఆవిష్కరించుకొన్నాడు ! "అభ్యుదయ కవులమని" తమకుతాము చెప్పుకొనే "నయాఛాందసవాదుల" కంటే - పైన పేర్కొన్న కారణాలవల్ల — తుమ్మలవారు ముమ్మాటికీ - యెన్నటికీ - తిరుగులేని 'అసలైన అభ్యుదయకవి' "సామాజిక స్పృహ గల్గిన" ప్రజాకవి అని నిశ్చయంగా మనం నిర్ణయించుకోవచ్చు !

ఈ శతాబ్దంలో నిన్నమొన్నటివరకు పోటీపడి మారణాయుధాలు తయారుచేసుకొని యుద్ధవాతావరణాన్ని సృష్టించిన "అమెరికా రషియా స్పర్థలణిగినపుడు లోకమున శాంతియొదవు వస్తోకమగుచు" అని తెనుగులెంక అభిభాషించాడు. అలానే "హస్తినకరాచి మిత్రములైన వేళ హరిజనులు బ్రాహ్మణులు బంధులైననాడు" లోకశాంతి - దేశాభ్యుదయం సంతరించునంటాడు. ఇండియా పాకిస్తాన్‌లు స్నేహహస్తమెపుడందించు కొంటాయో కాలమే నిర్ణయించాలి. హరిజనులు - బ్రాహ్మణుల మధ్య అక్కడక్కడ 'కులాంతర' వివాహాలు జరిగి యిప్పుడిప్పుడే కొత్త బాంధవ్యమేర్పడడం మనంచూస్తున్నాం ! అది శుభపరిణామమే.

"లోకమునెల్ల నొక్క త్రుటిలో మసిచేసెడి మారణాయుధానీకము పుట్టి నేలకును నింగికి వేగయినట్టివేళ నీదూకులు బాకులీ కదలదోహం మేటికి వల్ల కాటికా" (సమదర్శి) అని అణ్వాస్త్రాలు సృష్టించే యుద్ధోన్మాదాన్ని ఖండిస్తున్నాడు గాంధికవి. మానవ మారణకాండకు కారణభూతమగు అణ్వాస్త్రాల తయారీని ఖండిస్తూ- అమెరికా రష్యాల - ఇండియా పాకిస్తాన్‌ల స్నేహాన్ని ఆకాంక్షిస్తూన్న తెనుగులెంక అభ్యుదయవాది కాక మరేమిటి ?

ముఖ్యంగా ఈ శతాబ్దంలో పేద - మధ్యతరగతి కన్నెపిల్లలు బ్రతుకుల్ని కబళిస్తున్న కట్నపిశాచిని గాంధీకవి నిరసిస్తాడు. "శుల్కపీడలడచి ఋుధలాన్చి దేశము నుద్ధరించుగాక యువచయము"

కట్నాలఆశ వయస్సుమళ్ళిన తల్లిదండ్రులది. తల్లిదండ్రుల మాట వినక 'యువకులే' కట్నాల్ని వ్యతిరేకించి యువతీలోక 'ఉద్ధారాల్చా' లంటాడు.

ఈనాడు సమాజంలో అన్ని అనర్థాలకు మూలహేతువులైన "స్వార్థచింత"ని అధికారవాంఛ యహంకారపటుతో భోగాభిరతి లౌల్యభూయిష్టబుద్ధి" నశించినప్పుడే సమాజంలో అందరి శ్రేయస్సు సాధ్యమౌతుందని తుమ్మలవారు ఆకాంక్ష వెలిబుచ్చుతాడు. "భోగిమంటలందు గోగుబుల్లలగాదు కామరోషములను గాల్ప వలయు" క్రొత్త పబ్బమందు గోడిపుంజులగాదు దురభిమానములను 'ద్రుంపవలయునని' అదే సరిక్రొత్త - నిత్యనూతన సంక్రాంతి అవుతుందంటాడు. "భక్తిపెరిగికాదు పాపిష్టిపథముల / బసిడికూర్చువారి భయముపెరిగి / పెరిగెమింటి దిరునుల వెంకన్న బొక్కసంబులనుట నిక్కువమ్ము'— భక్తితోకాక అక్రమార్జనతో ఏడుకొండలవాడికి నిలువుదోపిడీ 'యిచ్చి హుండీలునింపి' భక్తులమని చెప్పుకొను దొంగభక్తులను ఎత్తిపొడిచాడు మహకవి.

"పదుగురబాగునందె తన బాగు కుదుర్కొనీ" యున్నదన్న సత్యాన్ని ప్రతివాడు గుర్తించిననాడు - "పదుగురలో నార్వురకున్ ముదమిడు రాజ్యముకాదు మొత్తము ప్రజకింపొదవించు ప్రభుత" వచ్చిననాడు దేశం - సమాజం - ప్రజలు' సుఖశాంతులతో వర్థిల్లుతారని గాంధీకవి ఆశాభావం వ్యక్తం చేసాడు.

ఈ వ్యాసం (అధ్యాయం) లో విపులంగా చర్చించిన విషయాల్నిబట్టి కృష్ణశాస్త్రిగారన్నట్లు శ్రీ తుమ్మల ప్రజాకవి. గొర్రెపాటి వేంకటసుబ్బయ్యగారన్నట్లు తెనుగులెంకది 'యుగవాణి' తూమాటి దోణప్పగారన్నట్లు ఆయన 'నవయుగకవితా వైతాళికులలో అగ్రేసరులు'.

ఈ యిరవయ్యో శతాబ్దం ప్రారంభ సంవత్సరం - 1901 లో జన్మించి — 1990 వరకు జీవించి- శుద్ధ గాంధేయవాదిగా- గాంధేయ కవిత్వాన్ని పుంఖానుపుంఖంగా వెలయించడంతోపాటు - యీ శతాబ్ది యుగలక్షణాల్ని ఆకళించుకొని కాలానుగుణ సమకాలీన దేశకాల పరిస్థితుల "మార్పులకు" యెప్పటికప్పుడు స్పందిస్తూ- సామాజిక స్పృహతో - సమాజంలోని అన్ని అనర్థాలకు హేతువులైన కులమత వర్గ విభేదాల్ని - వైషమ్యాల్ని ఖండిస్తూ - సామాజిక కల్యాణంకామించి - విశ్వజనలా శ్రేయస్సు కాంక్షించి - ఎత్తిన కలందించకుండా ఏడు దశాబ్దాలుపైబడి - 'అభ్యుదయ కవిత్వం' యిబ్బడిముబ్బడిగా రాసారు శ్రీ తుమ్మల - కాటూరివారన్నట్లు కాలంతోపాటు కాలంకంటె ముందుచూపు కలిగి - సంఘగతి- యుగానుకూల ప్రగతిశీల భావాలతో - యీ అ ధ్యా యం (వ్యాసం)లో చెప్పినట్లు - జాతిపిత గాంధీజీకంటే అభ్యుదయకవి శ్రీ శ్రీ కంటే విప్లవభావాలతో 'భాషావిపర్యయమ్ము సైపక' ఛందోబద్ధ పద్యప్రక్రియలో గాంధేయకవిత్వం — అభ్యుదయ కవిత్వం వెలయించిన శ్రీ తుమ్మల నవ్యసంప్రదాయ భావవిప్లవ గాంధేయ యుగకవి అని నానిశ్చితాభిప్రాయం ! ఈ యిరవయ్యో శతాబ్ది నవ్యసంప్రదాయ గాంధేయకవి — అభ్యుదయకవి శశికవి.

---

"నీకు చెట్టునీడ నాకు బంగరుమేడ
నీకు గోచిపాత నాకు వలువ
నీకు కటికపస్తు నాకు విందను" దొర
యెన్నినాళ్ళు ప్రజల నేలగలడు —ఎక్కట్లు

# అభినవ తిక్కన బిరుదు సార్థకత

విశ్వవిద్యల్లోక వినుతి పాత్రుండు
రామలింగారెడ్డి రమణీయ ముద్ర
నందిన బిరుదున "అభినవ తిక్క
నా"ఖ్యమ్మునకు నాత్మనలరితి నేను — నాకథలు

రైతుగాపుట్టి — చిన్ననాడే కవిగా — ఆవిష్కరించుకొని- ఉపాధ్యాయవృత్తిని జీవనోపాదిగా చేసుకొన్నా - తెలుగు సాహిత్య జగత్తులో అగ్రశ్రేణి కవులలో ఒకడిగా లబ్ధప్రతిష్ఠుడైన శ్రీ తుమ్మల వారికి "బాలకవి" "అవధానపండిత" "సరసకవిశేఖర" "ఆను కవీంద్ర - విద్వత్కవిసమ్రాట్టు జాతీయ కవిబ్రహ్మ రాష్ట్రీయకవ్య గ్రణి"- "కళాప్రపూర్ణ" - యిత్యాది బిరుదములెన్నో లభించాయి. అయితే యీ బిరుదులన్నీ ఒకయెత్తు "అభినవ తిక్కన" అన్న బిరుదు లభించడం ఒకయెత్తు ఆయనకిది విశిష్ట గౌరవపురస్కారం. తెనుగులెంక కీర్తికిరీటంలో మేలికలికితురాయి. అయితే 1970 లో తనకీ "అభినవ తిక్కన" బిరుదు "భారమైన"దని దాన్ని వదలిపెడు తున్నాననీ ప్రకటించాడనుకోండి. అది వేరే విషయం ! అప్పటికే ఆయన 'ఆత్మకథ' రాష్ట్రగానం కావ్యాలపుణ్యాన అభినవతిక్కనగా కీర్తిగడించి - ప్రాచుర్యం పొంది; తెలుగుసాహితీ జగత్తులో 'లబ్ధ ప్రతిష్ఠుడై గొప్పకవిగా స్థిరపడ్డాడు !

శ్రీ తుమ్మలవారికీ "అభినవ తిక్కన" బిరుదు 1939 లో నెల్లూరులోని నెల్లూరి వర్ధమానసమాజ పక్షాన - ప్రముఖ సాహితీ ప్రియుడు - కవి పండితుడు పోషకుడు అయిన తిక్కవరపు రామిరెడ్డిగారి పర్యవేక్షణలో విశ్వవిఖ్యాత సాహితీవేత్త - సాహితీ విమర్శకుడు-

ఆనాటి ఆంధ్రవిశ్వవిద్యాలయం ఉపాధ్యక్షుడు అయిన శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారి అధ్యక్షతన జరిగిన విద్వత్ సాహితీ సభలో శ్రీ తుమ్మలవారికీ 'అభినవ తిక్కన' బిరుదుప్రధానం చేయడం జరిగింది. "ఇతడల తిక్కనయట్టుల కృతిసెప్పును తెనుగుదనము ప్రకాశించు కసమానితము స్వాతంత్ర్యకై వడిన తీవ్రరమ్యముగ వెడల" నంటూ శ్రీ కట్టమంచివారు తుమ్మలవారిని, తుమ్మలవారి ఆత్మకథను, ఆయన కవిత్వాన్ని మెచ్చుకొంటూ "అభినవ తిక్కన" బిరుదుప్రధానం గావించాడు.

వాస్తవానికి 1936 నాటికి తెనుగులెంక బాపూజీ "ఆత్మకథ" లో ప్రథమభాగం మాత్రమే వెలువరించాడు. దాదాపు అదే సమయంలో "రాష్ట్రగానము" వెలుగులోకి వచ్చింది! ఇతరత్రా కొన్ని చిల్లరమల్లర రచనలుగూడా వచ్చాయి. అవి అంతగొప్పవి కావు. ప్రాచుర్యం పొందలేదు గూడా.

కందుకూరి వీరేశలింగం పంతులుగారికి 'గద్య తిక్కన' అన్న బిరుదమున్నది. ఏటుకూరి వేంకటనరసయ్యగారికి దరిమిలా 'కవి బ్రహ్మ' అన్న బిరుదు దక్కింది. అయితే ప్రఖ్యాత సాహితీవేత్త-విమర్శకుడు ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యంగారు "శివభారతము" కావ్యకర్త గడియారం వేంకటశేషకవిని "అపర" తిక్కనగా నుతించాడు.

తిక్కనసోమయాజి పుట్టిపెరిగి పెద్దయి మనుమసిద్ధికొలువులో మహాభారతాన్ని తెనిగించిన నెల్లూరుగడ్డపై విద్వత్ సాహితీ కవిపండితులు – సాహితీవిమర్శకులు సాహితీపోషకులు- శ్రీయుతులు తిక్కవరపు రామిరెడ్డి మసుపూడి కోదండరామిరెడ్డి కట్టమంచి రామలింగా రెడ్డి ప్రముఖుల సమక్షంలో శ్రీ తుమ్మలవారికి 'అభినవ తిక్కన' బిరుదం దక్కటం ఆయన అదృష్టం! దానితో తుమ్మల

వారికి - ఆయన సాహిత్యానికి తెలుగునాట విశేషప్రాచుర్యం వచ్చింది. ఆయన అఖండ కీర్తిప్రతిష్టలు సంతరించుకొన్నాడు.

మరి శ్రీ తుమ్మలవారికి లభించిన 'అభినవ తిక్కన' బిరుదము యొక్క "సార్థకత" గురించి "అన్వర్థత" ఔచిత్యం గురించి మన మిప్పుడు చర్చించుకొందాం !

సాహిత్యంలోనే కాక నిజజీవితాల్లో గూడా తిక్కనకు తెనుగు లెంకకు ఎన్నో పోలికలున్నాయి. తిక్కన పూర్వీకులు గుంటూరు సీమవారు! తిక్కన పితామహుడు మంత్రి భాస్కరుడు "గుంటూరువిభుడు" సారకవితాభిరాముడు. మరి తిక్కన తండ్రి కొమ్మన నెల్లూరు చోళ రాజుల కొలువులో 'దండనాథుడు.' సాంగవేదవేది ! ఇక తిక్కన సోమయాజి కలమును, కత్తిని పట్టగలదిట్ట ! దశకుమారచరిత్ర కావ్యకర్తయగు కేతనకవి తిక్కనను "తిక్కచమూప" "తిక్కదండాధీశా" "దుర్గమశాత్రవ పార్శ్వవేది" ఇత్యాది విశేషణాలతో శ్లాఘించాడు తిక్కన మనుమసిద్ధి కొలువులో ఆస్థానపండితుడిగా - మంత్రిగా - కవిగా ప్రసిద్ధికెక్కినాడు.

ఇక అభినవతిక్కన పూర్వీకులు ముఖ్యంగా "టీకన్న" విజయనగర సామ్రాజ్యాధిపతి రాయలవారి సేనానాయకుడిగా ఉదయగిరి రాజ్యంలో గండికోట గడిసీమనేలిన పెమ్మసాని ప్రభువుల కొలువులో - "దండనాయకుడిగా" "ప్రెగ్గడగా" పేరుపొందినవాడు. విజయనగర సామ్రాజ్య పతనానంతరం - కాలమహిమచే - కొంత కాలానికి ఉదయగిరి (రాయలసీమ) ప్రాంతంనుండి కృష్ణా గుంటూరు సీమలకొచ్చి తుమ్మల పూర్వవంశీకులు నౌకావ్యాపారం చేసుకొంటూ చివరకు— వ్యవసాయదారులుగా స్థిరపడి స్వతంత్రజీవనం చేయసాగారు. ఈ టీకన్న - అసలుపేరు తుమ్మల వీరన్న.

"రణపటిష్ఠత బరగన్" "కావ్యమునకు డీకగతి భాజుశంకలకితడు

తీర్పరిగ రచించెసభను" ఆ కారణమున వీరన్న టీకన్నగా దొడ్డ పేరు గడించాడట! అభినవతిక్కన తండ్రి "నారయ" చదివిన మేటి కాకపోయినా, "గణనీయశీలుడు" కార్మిక హితుడు - కాపుల ప్రాపు - పేదల "పెన్నిధి" హరిభక్తి పరాయణుడు.

తిక్కనసోమయాజి పూర్వీకులు గుంటూరు సీమవారు. నెల్లూరు సీమకెళ్ళి నెల్లూరులో స్థిరపడి నెల్లూరు చోళరాజుల కొలువులో మంత్రులుగా దండనాథులుగా గణుతికెక్కారు. తిక్కన "కొట్టరువు" వంశీయుడు. "గౌతమ గోత్రీకుడు" కొట్టరువు వంశంలో కవి తిక్కన ఆరవ తరంవాడు. మరి అభినవ తిక్కన పూర్వీకులు రాయలసీమలోని రాయలరాజ్యంలో "గండి కోట" ప్రభువుల దగ్గర దండనాథులుగా - ప్రెగ్గడలుగా కొలువుండి - విజయనగర సామ్రాజ్య పతనానంతరం పరిస్థితులు తల్లక్రిందులై - ఆంధ్ర తీరప్రాంత కృష్ణా గుంటూరుసీమలో వ్యవసాయదారులుగా స్థిరపడ్డారు. తుమ్మలవారిది "నవనూళ్ళ" గోత్రం. అభినవతిక్కనది తుమ్మల వంశంలో పదవతరం.

తిక్కన మనుమసిద్ధి కొలువులో ఆస్థానపండితుడు కవి, మంత్రిగూడాను. మరి అభినవ తిక్కన "మకుటంలేని మహారాజు" "భారత జాతిపిత" మహాత్మాగాంధిజీకి శాశ్వతమైన ఆస్థానకవి. (కట్టమంచివారన్నట్లు). తిక్కనసోమయాజి కలంతోపాటు ఖడ్గంపట్ట గల జగజెట్టి, సవ్యసాచి! రాజనీతి ధురంధరుడు. ఇక అభినవతిక్కన కలంతోపాటు హలంపట్టిన రైతుబిడ్డ.

నెల్లూరు చోళరాజుల కొలువులో దాయాదులు అల్లుం తిక్కరాజు అతని సోదరుడు విజయాదిత్యుడు - యిద్దరూ కలిసి కుట్రపన్ని నెల్లూరులో రాజైన మొదటి తిక్కరాజును రాపూరు లోని రాజప్రతినిధి అయిన, అతని కుమారుడు మనుమసిద్ధిని "రాజ్య

భ్రష్టుల్ని గావిస్తే - మనుమసిద్ధి తండ్రికి విధేయుడైన తిక్కనమంత్రి (కవితిక్కన) ఓరుగల్లు కాకతీయ గణపతిదేవుని ఆశ్రయించి తన తెలివి తేటలతో మెప్పించి - కాకతీయ ప్రభువులహాయాంతో అల్లుం తిక్కరాజుని, విజయాధిత్యుని పరాజితులగావించి నెల్లూరు రాజ్య సింహాసనంపై మనుమసిద్ధిని (అప్పటికే జబ్బుపడి మనుమసిద్ధి తండ్రి చనిపోవుటవలన) పట్టాభిషిక్తుని గావించుటలో కవి మంత్రి తిక్కన వహించినపాత్ర అపూర్వమైనది. అసాధారణమైనది.

ఉమ్మడి మద్రాసురాష్ట్రంలోతమిళులపెత్తనాన్ని-అరవల'జులుం' ను సహించలేక ప్రత్యేకాంధ్ర రాష్ట్రంకోసం ఆంధ్రులుఉద్యమించిన తరుణంలో - తన రాష్ట్రగాన కవితాప్రబోధంతో తెలుగుజాతిని యావత్తు మేల్కొల్పి - ఉత్తేజపరచి - కార్యోన్ముఖుల్ని గావించి అంతిమంగా ప్రత్యేక రాష్ట్రసిద్ధికై పరోక్షంగా తోడుపడిన తెనుగు లెంక తుమ్మలవారి కృషి - పాత్ర చాలాగొప్పది. అలానే దేశ స్వాతంత్ర్యంకోసం జాతీయోద్యమ నాయకత్వం వహించిన బాపూజీ పిలుపుమేరకు ప్రత్యక్షంగా ఉద్యమంలో క్రియాశీల కార్యకర్తగా పనిచేయుటతోపాటు కవిగా తాను కలంపట్టి జాతీయో ద్యమ స్ఫూర్తినిచ్చే కవితలు వెలయించి, దేశప్రజలలో దేశాభి మానం ప్రేరేపించుటకు - యితర తెనుగుకవులతోటు శ్రీ తుమ్మల వారి కృషి మెచ్చదగ్గది.

దేశపరిపాలనా వ్యవహారాలలో రాజునకు ఎప్పటికప్పుడు మంత్రిగా - రాజనీతిజ్ఞుడుగా తగు సలహాలనిస్తూ రాజ్యం ప్రజా రంజకంగా - శాంతియుతంగా వర్ధిల్లేటట్లు చేయుటలో తిక్కన వహించినపాత్ర గొప్పది. అలానే తెలుగు పండితుడుగా సత్యనిష్ట గల ఉపాధ్యాయుడిగా బాలబాలికలకు చదువుసంధ్యలతోపాటు క్రమశిక్షణ - మంచి నడవడినేర్పి వారిని ఉత్తమ భావిపౌరులుగా

తీర్చిదిద్దుటలో శ్రీ తుమ్మలవారు ఒజ్జలకు మేల్బంతి అయ్యాడు. "శ్రమపడు శే జాతికి సిరి" అన్న ఆదర్శంతో చెమటోడ్చి సేద్యం చేసి పొలం పండించిన ఆదర్శరైతుగా - అదేవిధంగా రుజువర్తనం గల్గి నిరాడంబరంగా జీవించి యితరులకు శ్రీ తుమ్మలవారు ఆదర్శ పాత్రుడైనాడు.

ఇక సాహిత్య విషయానికొస్తే - తిక్కన 'నిర్వచనోత్తర రామాయణము మహాభారతమును విరాటపర్వమాది మిగిలిన పదు నైదు పర్వములు తెనిగించి అటు రామాయణ కథను - యిటు భారతగాథను తెలుగులోరాసి- తెలుగుజాతికి- తెలుగుభాషకు తిక్కన చేసిన సాహితీసేవ అనితరసాధ్యమైనది. అమోఘమైనది. అదే విధంగా తుమ్మలవారు 'బాపూజీ' ఆత్మకథను 'జాతీయోద్యమ చరిత్ర'గా పేర్కొనదగిన "మహాత్మకథను" వెలయించి గాంధేయ వాదానికి - స్వాతంత్ర్య సమరచరిత్రకు తెలుగుభాషలో శాశ్వత స్థానంకల్పించి తెలుగునకు గొప్పమేలుచేసాడు. జానపదుల నాలుకల పైని ప్రతినిత్యం తాండవించే తెలుగు నుడికారాల్ని - జాతీయాల్ని సామెతల్ని - తన సాహిత్యంలో పొందుపరచి తిక్కన తెలుగు భాషకు జీవంపోసాడు జవం సంతరించాడు. సంస్కృతపద భూయిష్ట ప్రౌఢ పదగుంపనంతో కవిత్వం వెలయించేవాడే "కవి"గా చెలా మణి అవుతున్న ఆరోజుల్లో (యిప్పటికి షుమారు ఏడెనిమిదివందల సంవత్సరాలకు పూర్వం) మరుగునపడుతున్న జానపదులు మాట్లాడే అచ్చమైన తెలుగుపదాల్ని లోకోక్తుల్ని—జాతీయాల్ని- అలతి అలతి తేటతెలుగు నుడికారాల్ని తన సాహిత్యంలో హృదయంగమంగా ఛందోబద్ధంగా గ్రంథస్తంచేసి భద్రపరచిన తిక్కనసోమయాజి నిజంగా అభినందనీయుడు శిష్టసంప్రదాయ తెలుగుభాషను ఏడు శతాబ్దాలకు పూర్వమే - సుసంపన్నంచేసి తెలుగుభాషకు తెలుగు

జాతికి తిక్కనచేసిన మహోపకారం అపూర్వమైనది. మరువరానిది. అలానే ఒక ప్రక సంస్కృత భాషాభిమానంతో - మరోప్రక్క అంతకుమించిన పాశ్చాత్య నాగరికతాప్రభావంతో మితిమీరిన ఆంగ్ల భాషాభిమానంతో కాల్పనిక - భావకవిత్వాన్ని - ఆత్మాశ్రయ ప్రణయకవిత్వాన్ని - యింకోప్రక్క మార్క్సిస్టు గతితార్కిక భౌతికవాద ప్రలోభంలో మునిగి తేలుతూ వచనకవిత్వాన్ని ఆలంబనంగా చేసుకొని, పుంఖానుపుంఖంగా కవితలు - కృత్తులురాస్తున్న సమకాలీన ఆధునికకవుల ఆత్మాశ్రయ సాహితీధోరణులను త్రోసిరాజని - వచన కవితామార్గాన్ని కాదని - "భాషావిపర్యయమ్ము సైపక" ఛందోబద్ధ పద్య ప్రక్రియనే ఆశ్రయించి - మరుగునపడిపోతున్న అచ్చమైన తెలుగుపదాల్ని - తేటతేనియలూరు తెలుగు నుడికారాల్ని సామెతల్ని జాతీయాల్ని శ్రమకోర్చి యేరియేరికూర్చి పొందుపరచి "నవ్యసంప్రదాయ" మార్గంలో కావ్యాల్ని నెలయించి తెలుగుభాషకు - జవసత్త్వాలు సంతరించిన ఘనత తెనుగులెంకదే అంటే అందులో అతిశయోక్తి లవలేశం లేదు.

తిక్కనామాత్యుడు "నిర్వచనోత్తర రామాయణ" కావ్య ప్రారంభంలో "హరిహర పద్మగర్భులను" స్తుతించి ఆ కావ్యం అనువదించాడు. ఇక మహాభారత మహాకావ్యం ప్రారంభిస్తూ— "శ్రీయన గౌరినాబరగు చెల్వగు జిత్తము పల్లవింప భద్రాయిత మూర్తియై హరిహరంబగు రూపముదాల్చి విష్ణురూపాయ, నమశ్శివాయని... పరతత్త్వము గొల్చెద నిష్టసిద్ధికిన్" అంటూ హరిహర భేదరహిత శివకేశవాత్మక రూపంగా సంభావించి పరబ్రహ్మ తత్త్వాన్ని" సంస్మరించి భారతాంధ్రీకరణం గావించాడు. ముందుగా శ్రీ హరిహరనాథాయ నమః అని శ్రీకారంచుట్టి తర్వాత పైచెప్పిన విధంగా ఛందోబద్ధ పద్యంలో పరతత్త్వాన్ని స్మరించాడు.

ఇకపోతే - తెనుగులెంక ఆత్మకథ 'కృత్యాది'లో "ఎవ్వరి కొలువ్వ భద్రములకెల్ల నిదానము... యెవ్వడు సర్వలోకముల నేలు... ఆధ్యుడై యెవ్వడెసంగు... "సత్యమన" నెవ్వడువాని భజింతు నిచ్చలున్" అంటూ సమస్తలోకాధారభూతుడైన నిత్య "సత్య"స్వరూపుని సంస్మరించాడు. 1936లో ప్రప్రథమంగా ఆత్మకథ "తొలుపాలు" (మొదటిభాగం) వెలువరించినపుడు ముందుగా "శ్రీ" కారంచుట్టి తర్వాత పైన చెప్పినట్లు "సత్యస్వరూపుని" స్తుతించాడు. అయితే 2951లో ఆత్మకథ పూర్తికావ్యాన్ని వెలువరించినపుడు ఆ 'శ్రీ' కారం తొలిగించాడు ఇక మహాత్మకథ కృత్యాదిలో "సకలస్థావర జంగమాత్మక జగచ్చక్రంబునన్ నిండి... నిర్వికల్పకమై నిల్చునఖండతత్త్వమును సంభావింతు శుద్ధుండనై" అని అండపిండ బ్రహ్మాండం నిండానిండి నిబిడీకృతమైయున్న శుద్ధచైతన్యా ఖండ తత్త్వ మూర్తిమత్త్వాన్ని స్తుతించాడు. ఇలానే ఎక్కట్లు చుక్కట్లు ఖండకావ్యాలలో గూడా (మిగిలిన కావ్యాలలో లేదు) నిరాకార పరబ్రహ్మతత్త్వాన్నే స్తుతించాడు తుమ్మల.

తిక్కనామాత్యుడు కావ్యారంభంలో తన వంశావళిని తన తాతతండ్రులను ప్రశంసించాడు. ఇలా ప్రాచీన ఇతిహాసిక- ప్రబంధ కవులు తమతమ వంశావళులగూర్చి చెప్పుకోవడం అ'నుస్యూతంగా' వస్తున్న సత్సంప్రదాయమే. అట్లానే అభినవతిక్కన గూడా తన ఆత్మకథ మహాత్మకథ కావ్యాలకృత్యాదుల్లో తన వంశావళినిగూర్చి తన వంశమూల పురుషునిగూర్చి తన తల్లిదండ్రుల గుణగణాల గురించి చెప్పుకోవడం విశేషం - ప్రాచీన - ప్రబంధకవులందరూ (ఒకరో యిద్దరో మినహాయిస్తే) అందరూ బ్రాహ్మణవర్గం వారే ! వారంతా తమ వంశావళిని గూర్చి చెప్పుకొన్నారు. అయితే ఆంధ్ర సాహితీజగత్తులో అందునా ఆధునిక సాహితీలోకంలో ఒక బ్రాహ్మ

జేతర 'శూద్ర (కమ్మ) కవి తన వంశావళిగూర్చి చెప్పుకోవడమే విశేషం. విశేషమేకాదు. సాహసంగూడా. అదే తుమ్మలవారి ప్రత్యేకత. అది హర్షించదగ్గ విషయం ఆహ్వానించదగ్గ కాలానుగుణ శుభపరిణామం !

నిర్వచనోత్తర రామాయణ కావ్యప్రారంభంలో తిక్కన అతి సున్నితంగా కుకవినింద చేసాడు.

పలుకుల పొందులేక రసభంగము సేయుచు బ్రాతబడ్డ మా
టల దమనేర్పుచూపి, యొకటన్ హృదయం బలరింపలేకయే
పొలమునుగాని యట్టి క్రమముం దమ మెచ్చుగ లోకమెల్లన
వ్వుల బొరయంజరించు కుకవుల్ ధరదుర్విటులట్లు చూడగన్

"పాడిందేపాటగా" ప్రౌఢ సంస్కృతపద గుంభనంతో "రసాను భూతికి" (అర్థానికి) అంతగా ప్రాముఖ్యమీయక "శబ్దాడంబరం"తో పొంతనలేని పదబంధాలతో కేవలం 'భాష'కే ప్రాధాన్యత నిచ్చే 'కుకవుల్ని పరోక్షంగా మెత్తగా దెప్పిపొడిచాడు తిక్కన. తిక్కనకు ముందు సంస్కృత శబ్దములకెట్టి ప్రత్యయములు కూర్పక సంస్కృతమున కేవలం 'సుబాద్యంతములుగ నుండు సిద్ధరూపములనే ప్రయోగించెడి ఆనాటి తెలుగుకవుల "మణిప్రవాళ" శైలి తిక్కనకు నచ్చలేదు ! అందుకే తిక్కన సంస్కృత ప్రౌఢ పదాడంబరం జోలికి పోక - కమనీయ తెనుగు నుడికారాలతో - 'రసానందభూతి' కలి గించేరీతిగా భారతం అనువదించాడు.

ఇక తెనుగులెంక విషయానికొస్తే - ఆత్మకథ 'కృత్యాది' లో 'ఏసూరినో పేరినో సుబ్బినో నిల్పి / పచ్చిసింగారంబు పల్కుకంటు/ హేతువాదమ్మున కింతనిల్వగలేక / బూతులబుంగలై జాతివైర/ ములకు మతద్వేషముల కుపాధ్యాయులై ... నీతిరతులకెంతయు రోతరాజేయునట్టి పురాణమ్ములన్ బూని వ్రాయుకంటు / ... గాసు

లకు దాసుడగుచు (ముక్కడిని బొగిడి / కల్ల కైతుల నల్లుటకంటె/ గుణగరిష్ఠుల దేశభక్తుల చరిత్ర చెప్పుట జగద్ధితంబైన చేతగాదె" అని స్పష్టంగా చెప్పాడు తెనుగులెంక యిక్కడ పరోక్షంగా - సమ కాలీన 'ఆత్మాశ్రయ ప్రణయదాస భావకవులకు, పుక్కిటి పురాణ గాథల్ని కావ్యాలుగా మలిచే ఛాందసకవులకు - డబ్బుకు కక్కుర్తి పడి - ఆత్మాభిమానం చంపుకొని - కృతిపతులు చెప్పినట్లు కావ్యాలురాసే 'భావదాస' 'అర్థదాస' కవులకు చిన్న 'చురక' లంటించాడు తెనుగులెంక అదేమాటమీద నిలబడి ఆత్మాశ్రయ ప్రణయకవిత్వం (భావకవిత్వం) జోలికిపోక - పుక్కిటిపురాణాల 'ఊసు' ఎత్తక - సమకాలీనంగా సాగిన జాతీయోద్యమ నాయకుడు గాంధీజీ - గాంధీ అనుయాయి అయిన వినోభా బావేవంటి జాతీయ-చారిత్రక నాయకులపైన - రాష్ట్ర సమస్యలపైన - రైతుజీవితం పైన సమకాలీన సామాజిక రుగ్మతలను ఖండిస్తూ - సామాజిక వికాసంకోసం - మానవకల్యాణం కోసం తెనుగులెంక పుంఖాను పుంఖంగా కవితలల్లాడు. కావ్యాలు వెలయించాడు.

తిక్కనకు ముందు నన్నయకాలం నుండి తెలుగులో చక్కని 'మార్గకవిత్వం వెలువడడం మొదలైనా, అందులో యతిప్రాసల పట్టింపులు పెద్దగా లేకపోవడం తిక్కనగారికి కష్టం కలిగించి యుంటుంది. అందుకే తిక్కన "తెలుగు కవిత్వము చెప్పం / దలచిన కవియర్థమునకు దగియుండెడు మా / టలు గొని వళులుం బ్రాసం/ బులు నిలుపకయొగిని బులిమిపుచ్చుట చదురే" అని యతిప్రాసల నియమం పాటించని కవుల్ని యెత్తిపొడిచాడు తిక్కన. అలానే తనకుముందు తెలుగుకవులు యుపయోగించినట్లు, తాను సంస్కృత పదాల్ని అనవసరంగా యుపయోగించనన్నాడు. "జాత్యముగాని నొప్పయిన సంస్కృతమెయ్యెడ జొన్పననీ" "ప్రాసము ప్రకారము

వేఱగు నక్షరంబులన్ శ్రుత్యను రూపమంచునిడ"నసీ "యింపారెడు పలుకులం బడయ నప్పులుకుల్ సరిగ్రుచ్చునట్లుగా జేయపనేరగా వలయుజేసెదనే కృతియన్నవారికిన్" అంటూ తిక్కన విస్పష్టంగా వివరించాడు. ఆరుద్రగారన్నట్లు ఒప్పయినసంస్కృతాన్ని అవసరాన్ని బట్టి యుపయోగిస్తానన్నట్లే- తప్పయన తెలుగును గూడా వాడనని తిక్కనమాటగా కేతనన్నాడు.

ఇక తెనుగులెంక విషయానికొస్తే "ఎల్ల తెల్గునుడికి సంస్కృత మని చూపబెనగు వారిజూచి వగతు" నంటూ "సంస్కృతం బల వడినచోఁజాలు, దెనుగువచ్చినట్ల యటంచు వాక్రుచ్చువారి"ని తెనుగులెంక నిరసించాడు. "ఇది తెల్గనినూటికి తొంబది సంస్కృత పదములునిచి పల్కిన కావ్యంబది బాసకుజేటం "టాడు నిర్మోహ మోటంగా తెనుగులెంక. "ఎవ్వరెందరెంత దవ్వైన నేను భాషా విపర్యయమ్ము సైపలే" నసీ "ఎంత దవ్వైన తెనుగుబల్కని యగ్గ లించి మనకైతలో రవళింప" జేయాలని ఆయన ఆశయం ! ఎందు కంటే "గీర్వాణమెంత నీల్గిన జిల్బిలి తెలుంగు నుడిసొంపునకు దిగ దుపుడు గాదొకో" అని తుమ్మలవారు తనకున్న అసామాన్య మాతృభాషాభిమానాన్ని వ్యక్తం చేసాడు. అయితే "చక్కని కైత చేర్వడిన సంస్కృత వాఙ్మయమున్ బఠించి ధీరుక్కల బొందవచ్చు" నని అంటూనే సంస్కృతపదాలకు డుముపు ప్రత్యయములు చేర్చి నంతనే "సురభాషకెన్ని జన్మాలకునైన తెన్గు పసవచ్చునొకో" అంటూ "మల్లియతాని గులాబికబ్బునా" అని చమత్కరించాడు గులాబీల్లా అందంగా కనిపించినా వాసనలేనిది సంస్కృతమనీ, చూడటానికి చిన్నదిగావున్నా- మల్లెపూవులా తెల్లగా- సువాసనలు వెదచల్లేది తెన్గుబాసయని తుమ్మలవారిఅభిప్రాయం. అలా నేసంస్కృత పదభూయిష్ఠ తెలుగుకావ్యాలు 'ఇనపసుద్దల'నీ కమ్మనితేట తెలుగు

నుడికారాల సొంపులు కులుకు తెలుగుకావ్యాలు 'తీయని' లడ్డు ముద్ద" లంటాడు శ్రీ తుమ్మల. "తెనుగును విస్మరించి యిది తెన్గని పల్కుచు బుంగపోతవోపిన రీతి సంస్కృతమ్ము పడజిమ్ము "తెలుగు కవుల్ని వెర్రి ముదిరిముదిరి నెలగల తెల్గును మరచిన" పెక్కుమంది తెలుగుకవుల్ని తెనుగులెంక ఎత్తిపొడిచాడు. "తెనుగు తేనెవాగు తెనుగమృతాసార సారధార నాకు సంఘటిల్లు" నంటూ "నాచెప్పె డికబ్బమునన్ బై చేయిగ నుండు దెనుగు బల్కుది"అని నిర్ద్వంద్వంగా చెప్పాడు - "తెలుగుదేశము తెలుగుభాష తెలుగుచరిత్ర తెలుగు ప్రజ తెలుగుసంస్కృతి" తెనుగులెంకకు "ప్రాణకల్ప విషయములు" కనుక తెనుగులెంక సంస్కృతపద భూయిష్ట కవిత్వం వెలయించక సరళమైన తెలుగుభాషలోనే సాహిత్యం సృష్టించాడు.

అయితే "ఒప్పయిన సంస్కృతం జొన్పను" అని శపథంచేసిన తిక్కనగారు నిర్వచనోత్తర రామాయణంలో "శ్రీ రాస్తాం... అంటూ సంస్కృత శ్లోకంతో మంగళాచరణం గావించారు. అలానే నిర్వచనోత్తర రామాయణంలోనే "నిరుపమ రణ కేళీ నిర్దళద్వైరి ధాత్రీ / వరతను గళితా సృగ్వారి పూరావగాహా / దరభరపరిఖేలల ద్యాతుధానాంగనా ని / ర్భరమద మధుర స్తోత్రప్రసన్నాత్మ చేతన్" అంటూ పద్యమంతా స స్కృత దీర్ఘ సమాస సంభరితంగా వెలయించాడు. ఇందులో "చేతన్" అనే ప్రత్యయమైన తెలుగు మాట మాత్రమొక్కటే ! విరాట, ఉద్యోగపర్వాలు మొత్తానికి తెలుగులోసాగినా, యుద్ధపంచక పర్వాలు చాలాచోట్ల దీర్ఘసమాస సంస్కృతపద భూయిష్టంగావున్నాయి. అయితే ఆదికవి నన్నయ వాడినంతగా సంస్కృతపదాల్ని- సమాసాల్ని తిక్కన వాడలేదన్నది సాహిత్యపరులందరికీ తెలిసిందే. పైగా నన్నయాదులకంటే తెలుగు భాషకు తన సాహిత్యంలో తిక్కన పట్టం కట్టాడన్నది పరమసత్యం.

ఇకపోతే - తెలుగులెంక విషయానికొస్తే - ఆయన సాహిత్యంలో సంస్కృత సమాసాలు అందునా దీర్ఘసంస్కృత సమాసాలు ఎక్కడోగాని కనిపించవు. మొత్తంమీద తెనుగులెంక సరళమైన తెలుగుభాషలోనే కవిత్వం చెప్పాడు. మొదటగా వెలువరించిన ఆత్మకథ - ధర్మజ్యోతి - ఆత్మార్పణం, రాష్ట్రగానం - పఱిగపంట - శబలవంటి కావ్యాలలో భాషకాస్త 'బిగువు'గా వున్నా - తర్వాత వెలువరించిన మహాత్మకథ - ఎక్కట్లు - తెలుగునీతి - గీతాదర్శం - సర్వోదయగానం సందేశసప్తశతి యిత్యాది రచనల్లో భాష "చాలా సరళం"గా సాగిపోయి - తెలుగు సాహిత్యంతో కాస్త పరిచయం ఉన్నవారికి సహితం సులభగ్రాహ్యంగా వుండడం ఆయాగ్రంథాలు చదివినవారికి స్పష్టంగా తెలుస్తుంది !

నిర్వచనోత్తర రామాయణ, మహాభారత కావ్యాలతోపాటు తిక్కనసోమయాజి "విజయసేనము" "కృష్ణశతకము," "కవివాగబంధనము" అను యితరకృతులు గూడా రచించినట్లు సాహితీ చరిత్రకారుల మధ్య భిన్నాభిప్రాయాలున్నవి. ఈ విషయాన్ని ఆరుద్రగారు తమ సమగ్రాంధ్ర సాహిత్యంలో పేర్కొన్నాడు. అలానే "తిక్కనామాత్యుడు సంస్కృత గ్రంథములను రచించి యుండుననుటకు సందేహము లేదు" అని ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు, భావిస్తున్నారు. కాని కనీసం ఆ గ్రంథాల పేరులైనా తెలియరాలేదు. తిక్కన రచనలు - ముఖ్యమైనవి - పెద్దవి - మనకు లభించుచున్నవి నిర్వచనోత్తర రామాయణం, మహాభారత కావ్యాలు రెండు మాత్రమే. ఈ రెండునూ సంస్కృత కావ్యాల కనువాదాలే. అనువాదాలైనా స్వతంత్ర కావ్యాలుగా తీర్చిదిద్దినట్లు మనం గమనించవచ్చు - సాహిత్య చరిత్రకారులు గూడా దీనిని రుజువు చేస్తున్నారు. వ్యాసకృత సంస్కృతభారతంను తిక్కన

'శుద్ధానువాదము' చేయులేదని - దానిని 'పునర్నిర్మాణం' గావించె ననీ - "స్వతంత్ర" రచనగా ఆంధ్రీకరించెననీ ఆచార్య పింగళివారు అభిభాషించాడు. అలానే నిర్వచనోత్తర రామాయణం గురించి పింగళివారు చెపుతూ—— "యీ ఉత్తరకాండానువాదము భారతాను వాదముకంటెను మిగుల స్వతంత్రము" అని వివరించాడు.

పోతే - అభినవతిక్కన రాసిన 'ఆత్మకథ' బాపూజీ రాసుకున్న ఆత్మకథకు తెలుగులో అనువాదకావ్యం. అయితే మహాత్మకథ మాత్రం సర్వస్వతంత్ర కావ్యం. ఈ రెండునుకాక తుమ్మల వారు 'రాష్ట్రగానం, ఉదయగానం, సర్వోదయగానం. ఆత్మార్పణం, - ధర్మజ్యోతివంటి లఘుకావ్యాలు - పఱిగపంట, పైరపంట, శబల, సమదర్శి, సందేశసప్తశతి మొదలగు ఖండకావ్యాలు, మొత్తం యిరువదియైదు రచనలు చేసాడు. భగవద్గీతను 'గీతాదర్శం' పేరున భర్తృహరినీతిచంద్రికను 'తెలుగునీతి' పేరున అనువాద కావ్యాలుగామలచాడు శ్రీతుమ్మల. తనస్వీయజీవితఘట్టాలు కొన్ని 'నాకథలు' ఖండకావ్యంగా వెలయించాడు. "అమలోదాత్త మనీష నేనుభయ కావ్యప్రౌఢి పాటించు శిల్పమునన్ బారగుడన్" అని ఆత్మస్తుతి గావించుకొని, "లలితపద హృద్యపద్యంబుల" నిర్వచనోత్తర రామాయణం వెలయించాడు తిక్కనామాత్యుడు. ఇక మహాభారతానువాదం గావిస్తూ "ఆంధ్రావళి మోదముం బొరయునట్లుగ"... "మహాకవిత్వ దీక్షావిధినొంది" "పరమేశ్వరునిం కృతినాథు జేసి" "పూజ్యమూర్తియగు భారత సంహితను ధర్మాద్వైత స్థితి - ధర్మార్థ కామ మోక్షస్థితికిన్" అమ్మహాకావ్యంబు నర్థంబు సంగతంబు గావింప పద్యముల గద్యములన్ (రచియించెద) జెప్పగంటి నాపుట్టు కృతార్థతంబొరసె బుధ్యచరిత్రుడనైతి" అని విశదపరిచి భారతాంధ్రీకరణం గావించాడు తిక్కన. సంస్కృత మహాభారతాన్ని ప్రపథమంగా మొదటి రెండున్నర పర్వాలు ఆంధ్రీక

రించిన ఆదికవి శబ్దశాసనుడు— "మహితాత్ముడు నన్నయభట్టు దక్షుత"ను గొనియాడాడు కవిబ్రహ్మ.

ఇక అభినవతిక్కన ఆత్మకథ ప్రారంభించి "కృత్యాది" లో "ఇష్టదేవతా నమస్కృతియు గురుస్తుతియు పురాతనాద్యతన కవి పుంగవ బహూకృతియు కుకవి నిరాకృతియుం జలిపి విశ్వశ్రేయో నిదానమగు— విశ్వమానవ కల్యాణవిధి విధాతయైన గుణకంధి గాంధిమహాత్ము చరితనొక్క కావ్యంబుగా రచింప బూనితినని చెప్పుకొన్నాడు. భారతమాతను, ఆంధ్రజననిని భారతిని, స్తుతించి- కాళిదాసుని, శబ్దశాసనుని పాల్కురికి సోముని తిక్కయజ్వను చిన్నయసూరి ప్రభృతికవి పండితులను గూడా స్మరించాడు. "చేసిన పుణ్యమై తనకు జిక్కిన కైత ఫలింపశక్తిమై" ఆత్మకథ వ్రాసినట్లు చెప్పుకొన్నాడు. "సత్యసంశోధనా సక్తిసందడింప బాపూజీ నిర్వ హించిన బ్రతుకు చందము" ను మహాత్మకథగా మలిచినట్లు తుమ్మల వారు చెప్పాడు. "పలికెడిది గాంధికథయట, పలికించెడు వారు తెనుగు ప్రజలట" "పలికెదనిక నొండు మరచి బాపు చరిత్రన్" అంటూ "లోకోత్తర మనజాలిన / యీ కథమద్వాణి నాంధ్రి కిచ్చుటకై దీక్షాకంకణమున్ గట్టి" "యీసృష్టి నిర్విఘ్నమై తేజస్వంతమై సాగునట్లా మహాత్ముని పవిత్రాత్మ నాకెల్ల యెడల వెలుగునిచ్చుగాక" అనే ఆత్మవిశ్వాసంతో "బూనినపని కడు దొడ్డది" ఐనా 'గుండె రాయిచేసుకొని' రచన సాగించానన్నాడు. "పరభాషా పరసంస్కృతి పరపరిపాలన విధానిబద్ధమ్మగు గాఢాంధకరమైన గాంధి జీవితమరిదికదా తెన్గుబాస నభివర్ణించి"నట్లు తుమ్మలవారు వివరించారు. "దారితప్పినట్టి తమ్ములార పరాకు తెలిసికొండు తగిన దెసకు రండు తేనె సోనవోని తెనుగు సేవించుతీరు గనుడు తనివి గూరి మనుడు" అంటూ బాపూజీ నాయకత్వానసాగిన స్వాతంత్ర్య

సమర చరిత్రను తెలుగులో హృద్యపద్య గద్యాత్మక స్వతంత్ర కావ్యంగా తీర్చిదిద్దాడు గాంధికవి - అభినవ తిక్కన శ్రీ తుమ్మల.

వ్యాసకృత సంస్కృత "జయ" సంహిత అను మహాభారత గాథలో దాయాదులైన కురుపాండవుల మధ్య "రాజ్యాధికారం" విషయంలో కలహం చెలరేగి కురుక్షేత్ర సంగ్రామం జరిగిన సంఘటన 'ఇతిహాసం' కావచ్చుకాని. ఇందులో చేయబడిన వర్ణనలు ధర్మహితోపదేశాలు - గీతోపదేశాలు - నీతిబోధలు - కూర్చబడిన ఆఖ్యానాలు - ఉపాఖ్యానాలు పిట్టకథలు అన్నీ 'యదార్థాలని' నమ్మటానికి వీలులేదు. పైగా ఈ మహాగాథలో కనబడే పాత్రలన్నియు "ఇతిహాసిక" సజీవ యదార్థ పాత్రలని నమ్మటానికి వీలు లేదు. విశ్వవిఖ్యాతి చెందిన ఇమ్మహా కావ్యం పలుదేశభాషలందే కాదు - విదేశీభాషలందును ముఖ్యంగా దూర ప్రాచ్య దేశభాషలందును 'అనువదింప' బడినది. ఆయాకవుల తమ భాషా పాండితీ ప్రకర్షలను బట్టి-అభిరుచుల్ని బట్టి. దేశకాల సంస్కృతులనుబట్టి మూల గాథకుమార్పులుచేర్పులు చేస్తూవచ్చారు. మనదేశంలోనే ఉత్తరాది అనువాద రచనలకున్నూ - దక్షిణాది వాటికిన్నీ 'భేదం' కనపిస్తున్న వాస్తవం సాహితీవేత్తలందరికీ తెలిసిందే. ఏవి యదార్థాలో - ఏవి ప్రక్షిప్తాల్లో - ఎవరు వ్రాసింది వాస్తవగాథో చెప్పడం కష్టమైపోయింది. పైగా 'లక్ష' శ్లోకాలపైచిలుకు "భారతాన్ని వ్యాసుడు రాయలేదంటారు.

భారతాంధ్రీకరణం విషయంలో తిక్కన కూడా ఎన్నో మార్పులు చేసాడు. మహాప్రతిభావంతుడు - పండితుడు - తెలుగు భాషమీద ఆనాడు అధికారం గట్టిపట్టుగల తిక్కన ప్రధాన మూలగాథకు భంగంరాకుండా సమయ సందర్భాల్నిబట్టి - ఔచిత్యం పాటించి - కొన్ని భాగములను తగ్గించి - మరికొన్ని పెంచి-

పేలవమనుకొన్న ఘట్టములను మనోహరంగా మలచి - పాత్రౌచిత్యం పరిగణలోనికి తీసుకొని - ఆయాపాత్రల మనోవృత్తి భావ వైఖరుల సహజపద్ధతిని ప్రదర్శించి - కొన్నిచోట్ల మూలమునకన్న మిన్నగ రసపోషణం గావించి - తాత్త్విక ధోరణులున్న - విదురోపదేశాన్ని - సనత్సుజాతోపదేశాన్ని - గీతోపదేశాన్ని బాగా కుదించి - విరాట - ఉద్యోగ - యుద్ధపంచక మందలి ఘట్టాల్ని అతి రమణీయంగా తీర్చిదిద్ది - గుణదోషముల నెంచి - యథాచిత్యా నౌచిత్యముల పాటించి - పాత్రౌచిత్య సంభాషణా చాతుర్యమును రమణీయ నాటకీయఫక్కీని చిత్రించి ప్రకృతి వర్ణనలు అతి సహజ సుందరంగా గావించి కథాసంవిధానం పోషించి - లోకోత్తర కావ్య శిల్పకళా ఖండంగా కమనీయ కవితా కల్పనా నైపుణ్యంతో- "ఆంధ్రావలి మోదంబొరయునట్లుగ" హృద్యగద్య పద్యకావ్యంగా "ఉత్తమ ప్రబంధమండలి"గా వ్యాసకృత మహాభారతంను "ఆమహా కావ్యంబు నర్థంబు సంగతంబు"గా కేవలమొక 'అనువాద' రచనగా కాక, "స్వతంత్ర" కావ్యంగా తీర్చిదిద్దాడు తిక్కన. షుమారు లక్ష శ్లోకాల్లోవున్న సంస్కృత భారతాన్ని - నన్నయ అనువదించిన షుమారు యిరవై (20) వేలు లోపు శ్లోకాలుపోను, మిగిలిన యనభై (80) వేలు పైచిలుకు శ్లోకాలలోవున్న కథను షుమారు పదహారు వేలు పద్యగద్యాలుగా తిక్కన కుదించాడు. ఏడువందల శ్లోకాల భగవద్గీతను కేవలం అరవైడెబ్బై పద్యాలలో యిమిడ్చాడు ముఖ్యమూలకథకు భంగంరాకుండా యిలా 'స్వతంత్రల' కావ్యంగా వెలయించాడు తిక్కన.

ఇక తెనుగులెంక - బాపూజీ 'ఆత్మకథ'ను యథాతథంగా కావ్యబద్ధం చేశాడు. అలాచేయక తప్పలేదు ఆత్మకథలో గాంధీజీ రాసుకున్న "ప్రస్తావన" గూడా పద్యస్థం గావించాడు

ఆత్మకథ బాపూజీ స్వీయగాథ - సత్యనిష్ఠాగరిష్ఠుడైన గాంధీజీ తన 'ఆత్మకథ'కు "సత్యసంశోధనాత్మక ప్రయోగ సంబద్ధ' స్వీయగాథగా పేర్కొన్నాడు. (My Experiments with Truth) ఆత్మకథను "ఆచితూచి" గాంధీజీ రాసుకొన్న స్వీయ జీవితచరిత్ర తాను పుట్టిన దగ్గరనుండి దక్షిణాఫ్రికానుండి తిరిగివచ్చిన నాటివరకు 1915 వరకుగల గాంధీజీ యదార్థ జీవితగాథలో ఏ చిన్న విషయం తీసివేయటానికి వీలులేదు. అలానే ఏ క్రొత్త విషయం చేర్చటానికి (కల్పన చేయటానికి) వీలులేదు. అట్టి గాంధీజీ సత్య శోధన ప్రయోగ స్వీయగాథను కావ్యబద్ధంచేయడం నిజంగా "కత్తి మీద సామువంటిదే" అభినవతిక్కన ఆత్మకథలోని అన్ని ఘట్టాల్ని అన్ని అధ్యాయాల్ని తెలుగులో కావ్యబద్ధం చేసాడు. ఆత్మకథను ఆంధ్రీకరించడంలో తుమ్మలవారికి ఉన్న స్వేచ్ఛ చాలా స్వల్పమైనది పరిమితమైనది. మహాభారతగాథను తెలుగులోనికి అనువాదం గావించుటయందు మార్పులు - చేర్పులు చేయుటలో తిక్కన్నకున్న స్వేచ్ఛ గాంధి ఆత్మకథను తెలుగులో కావ్యబద్ధం చేయుటకు శ్రీ తుమ్మలవారికి లేదన్నది నిర్వివాదాంశం! సమయ సందార్భాల్ని బట్టి కథాగమనాన్ని బట్టి తనకున్న భాషాపాండి త్యాన్నిబట్టి - తనకు నచ్చిన- యిష్టమైన 'ఛందస్సు'లో హృద్యంగ మైన గద్యపద్యాత్మకంగా తెలుగుభాషలో మలచడం వరకే శ్రీతుమ్మలవారికున్న పరమిత "స్వేచ్ఛ" ఆత్మకథనుకావ్యంగా మల చడంలో తెనుగులెంక కృతకృత్యుడయ్యాడనే చెప్పాలి. ఉద్దండ సాహితీవిమర్శకులు కట్టమంచి రామలింగారెడ్డిగారు తుమ్మలవారి ఆత్మకథానువాదాన్ని మెచ్చుకోవడమే అందుకు ప్రబలనిదర్శనం! గాంధీ ఆత్మకథను తెలుగులో కావ్యంగా అనువాదం చేసినపుడు "కత్తిమీదిసామువంటిదనీ" "తలకుమించిన భారాన్ని నెత్తినబెట్టు కొని -" మహాత్మునివంటి వాడాచితూచి వ్రాసికొన్న యాత్మకథను

పద్యరూపమున దీర్చుట దుశ్శకమనిపించింది" అని తుమ్మలవారే స్వీయానుభవాన్నిలా వ్యక్తం చేసారు. "అనువాదంబు కదా పొమ్మని పెదవిన్ విరవబోకుడయ్యది యసదా పసిగాదందును బద్యంబున బల్కుట దెప్పరంబు బుధుడి యెఱుగున్" అని అనువాదం పద్యాత్మకంగా చేయడం మాటలు కాదంటాడు తుమ్మల. బాపూజీ ఆత్మకథను తెలుగులో వచనంలో అనువదించిన వారెందరో వున్నారు కాని గద్యపద్యాత్మకంగా రసవత్తరంగా కావ్యబద్ధం చేసినవారు తుమ్మల వారొక్కరే! ఈ ఆత్మకథ - ఉత్తమకవితా కళాఖండంగా - ఆధునిక పంచమహా కావ్యాలలో ఒకటిగా కీర్తి తెచ్చుకొంది. తుమ్మలవారికి కీర్తి తెచ్చిపెట్టింది.

ఇక మహాత్మకథ - గాంధీజీ నాయకత్వాన విజయవంతంగాసాగిన జాతీయోద్యమ చరిత్ర. ఇది స్వతంత్ర కావ్యం. ఇదీ గద్యపద్యాత్మకం. ఇది వాస్తవంగా జరిగిన చారిత్రక సంఘటనోద్యమ గాథ- మహాభారతం, భారతదేశంలో కొంత ప్రాంతానికి రాజులైన దాయాదులైన కురుపాండవులకు సంబంధించిన ఇతిహాసిక చరిత్ర! కురుక్షేత్ర సంగ్రామంలో భారతదేశంలోని వివిధప్రాంతాల రాజన్యులు 'కురుపాండవ' పక్షాలచేర యుద్ధంలో పాల్గొనివుండివచ్చు అది వేరే విషయం.

మరి జాతీయోద్యమం యావత్ భారతదేశ చరిత్ర. ఆసేతు హిమాచల పర్యంతం ఆబాలగోపాలం - ఆడామగా తేడాలేకుండా పాల్గొన్న యదార్థ జాతీయోద్యమ చరిత్ర స్వరాజ్యోద్యమచరిత్ర. దీనిని తుమ్మలవారు కావ్యంగా తీర్చిదిద్దడం సాహసోపేతమైనదిః వాస్తవంగా జరిగిన సంఘటనల్ని - సన్నివేశాల్ని కావ్యబద్ధం చేయడం కత్తిమీదసాము వంటిదే. ఇంత పెద్ద యదార్థ జాతీయ మహోద్యమ చరిత్రను కావ్యబద్ధం చేయడం తలకుమించిన పనే. 1951లో

ఆత్మకథను పూర్తిచేసి వెలువరించిన తోడనే అంటే 1951 లోనే మహాత్మకథను ప్రారంభించాడు. కాని అది 1968లో గాని పూర్తికాలేదు, ఇందుకు యితర కారణాలతోపాటు తుమ్మలవారి అనారోగ్యం గూడా ఒక కారణం ! పూర్తిచేసి "కరుణానిధికి పరమేశ్వరున కంజలించి" "యూపిరిపీల్చు" కొంటినని ఆయనే స్వయంగా చెప్పుకొన్నాడు. అంతటి బృహత్కార్య మెనుభారమది !

మహాభారతంలో మార్పులు చేసినట్లు మహాత్మకథలో గూడా 'కల్పనల'కుతావులేదు కారణం అది యదార్థ చారిత్రక ఉద్యమం. ఆసేతుహిమాచల పర్యంతం 1915 నుండి 1948 వరకు అంటే మూడుదశాబ్దాలపాటు బాపూజీ నాయకత్వాన నిర్విఘ్నంగా సాగిన జాతీయోద్యమ ఘట్టాల్ని కావ్యంగా మలచడం నిజంగా అసాధ్యం కాకపోవచ్చు కాని ఎంతో కష్టసాధ్యమైన పని. పైగా గ్రామ గ్రామాన-మారుమూల గ్రామాలలోసాగిన జాతీయోద్యమ ఘట్టాలన్నిటిని కావ్యంలో చేర్చటం తలకుమించినపనే ! అందుకే ముఖ్యమైన ఘట్టాల్ని తీసుకొని— మూలజాతీయోద్యమ చరిత్రకు భంగంరాకుండా తుమ్మలవారు కావ్యంగా మలచడం నిజంగా సాహసోపేతమే కాదు. ఎంతేని అభినందనీయం ! అంటే ఆయాప్రాంతాలలో జరిగిన జాతీయోద్యమ స్వల్పసంఘటనలు కొన్ని కావ్యంలో చోటుచేసుకోలేదు. అయినా జరగని సంఘటనల్ని కల్పనచేసి చరిత్రను వక్రమార్గంలో పెట్టలేదు తుమ్మలవారు. ప్రజలను తప్పుత్రోవపట్టించలేదు. పైగా చరిత్రకు వక్రభాష్యం చేయలేదు తుమ్మలవారు. ఇందుకు గాంధీకవి నిజంగా ఎంతేని అభినందనీయుడు

నిర్వచనోత్తర రామాయణాన్ని తిక్కన రాజైన మనుమసిద్ధికి అంకితమిచ్చాడు. భారతం రాసేనాటికి తిక్కన యజ్ఞయాగాదులొనర్చి 'సోమయాజి' అయ్యాడు. రెండవది 'హరిహరనాథుడే'

ఆయనకు స్వప్నంలో దర్శనమిచ్చి భారతాన్ని తెనిగించమని— ఆ కావ్యాన్ని తన కంకితం యివ్వమని చెప్పినట్లు తిక్కనగారు చెప్పు కొన్నాడు. కనుక మహాభారతాన్ని పరమేశ్వరాంకితం గావించాడు తిక్కన.

ఇక తెనుగులెంక— "ఈశ్వరుడు కీర్తిమయుడౌట" తన కావ్యాల్ని "భగవదంకితము సేయ" ననీ పైగా "జగద్ధిత శీలుం డౌదవ నయాంచితమ్ముగా నిడుదు నాసృజించిన కవితన్" అన్న నియమం పెట్టుకున్నవాడు కనుక తుమ్మలవారు ఆత్మకథను - ఒక సామాన్య గాంధేయవాది- స్వాతంత్ర్య సమరయోధుడు దండిఉప్పు యాత్రతో గాంధికి అండగానున్న శ్రీ యెర్నేని సుబ్రహ్మణ్యంగారికి అంకితం యిచ్చాడు. అలానే మహాత్మకథను - సిసలైన గాంధీ అనుయాయి నిష్కళంక దేశభక్తుడు - దివంగత మాజీ భారత ప్రధాని శ్రీ లాల్‌బహదూర్‌శాస్త్రిగారికి, ఆయన మరణానంతరం "అంకితం" గావించాడు. (ఆయన పదవిలోవుండగానే హఠాన్మరణంనకు గురి అయ్యాడు.) విశేషమేమిటంటే తిక్కనామాత్యుడు తన కావ్యం అంకితం యిచ్చింది నెల్లూరు రాజైన తన ప్రభువుకు మంత్రిగా కవిగా రాజు ప్రాపుకోసం అంకితం యిచ్చాడని వేరే చెప్పనక్కరలేదు. మరి తెనుగులెంక అంకితమిచ్చింది భారతదేశపు ప్రధానికి, అందునా హఠాన్మరణమొందిన తర్వాత. కేవలం 'లాల్ బహదూర్‌శాస్త్రిగారి' వ్యక్తిత్వం చూచి అంకితం యిచ్చాడు.

ఆంధ్రమహాభారతాన్ని పరిశీలిస్తే - తిక్కన దేశీయఛందస్సునకే అధికప్రాధాన్యం యిచ్చినట్లు స్పష్టంగా తెలుస్తుంది. సంస్కృత ఛందోరీతులైన - ఉత్పలమాల, చంపకమాల, మత్తేభవిక్రీడితం, శార్దూలం వంటివృత్తాలకంటే-'దేశి' ఛందోప్రక్రియలైన-ఆటవెలది, తేటగీతి, సీసం, కందం ద్విపద యిత్యాది 'ఉపజాతి' ఛందస్సుల్లోనే

కవితలు మిక్కిలిగా వెలయించాడు. ముఖ్యంగా సంఖ్యాపరంగా (15) పదిహేనువేలకు పైబడ్డ పద్యాలలో వున్న భారతంలో షుమారు (5) ఐదువేలకుమించి కందపద్యాలున్నాయి. అందుకే తిక్కన కందానికి పెట్టిందిపేరన్నారు. అలానే తుమ్మలవారి సాహిత్యం మొత్తంలో - ఆటవెలది, తేటగీతి, సీసం, కందం, ద్విపద మండజి ఛందోప్రక్రియలు మిక్కుటంగా వున్నాయి. వృత్తాలైన చంపక, ఉత్పలమాలలు, శార్దూల మత్తేభవిక్రీడితాలు చాలా తక్కువగా కనిపిస్తాయి అందుకే తిక్కన తెలుగుభాషను పెంచి పోషించాడని సాహితీ చరిత్రకారులన్నది యదార్థం. తిక్కన మార్గంలో తెనుగులెంక నడిచి 'అభినవ తిక్కనై నాడు.

ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు తిక్కన భారతరచనాశైలి గూర్చిచెపుతూ "దేశ్య పదఘటితము - నాతిసమాస భూయిష్టము-లోకవ్యవహార సిద్ధమై"న[1] దని వివరించారు. "ఆయనవలె లోక సాధారణభాషలో జీవవంతములైన వాక్యములు వ్రాసినకవి యింకొకడు లేడు"[2] అని గూడా పింగళివారు అభిభాషించారు. అంటే తిక్కన పద్యంరాసినా - గద్యంరాసినా - అందులో దేశీయ జానపద నుడికారాలు - సామాన్యజనుల నాల్కలమీద నిత్యం తొణికిసలాడే తేటతెలుగు మాటలు అధికంగా వుంటాయని అర్థం. అలానే తిక్కనశైలి "ప్రధానముగ బుద్ధిగమ్యమని చెప్పవచ్చునని" అందులో "అర్థవ్యక్తి (Propriety) మరియు సమితత్వము(Precision)సంక్షేమము (Brevity) మరియు సమత (Balance) మొదలగు "బుద్ధిగమ్యమైన లక్షణములు"[3] గల్గియుండునని పింగళివారు వివరిస్తూ "కేవలము కర్ణపేయమైన "పదగుంఫనను తిక్కన ఎచ్చటను ఎక్కువ ఆచరించలేదనీ - అర్థముకంటే ముందు విన్నంతనే చెవికి యింపును - మన

1, 2, 3, ఆచార్య పింగళి— "ఆంధ్ర సాహిత్య చరిత్ర"

స్సునకు పోయినిగొల్పెడి సంస్కృతాంధ్రమిశ్రమ పదగుంఫనములతో కూడిన పద్యములు తిక్కన రచనలో చాలా అరుదుగానుండుననియు పింగళివారు సెలవిచ్చియున్నారు.

ఆచార్య పింగళివారు చెప్పిన 'బుద్ధిగమ్య' గుణాన్ని ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యంగారు మరొక విధంగా వివరిస్తూ - "అర్థ ప్రాధాన్యాన్ని మన్నించినవాడు తిక్కన." అని అంటూ "హృద్య మైన నాదమాధుర్యాన్ని అందించకపోయినా - తిక్కన పద్యం భవ్యమైన భావామృతాన్ని వర్షిస్తుంది" అని వివరిస్తూ "తిక్కన యజ్వశైలి" "అర్థగుణశాలి" అనీ అర్థగుణ ప్రసాదానికి కర్ణధారి తిక్కనసోమయాజి" అనియు "ధ్వనిత్రయంలో రసధ్వని" లాంటివాడు తిక్కన యనియు వివరించాడు.

తిక్కనశైలి "బుద్ధిగమ్యమైనా" "అర్థగుణ ప్రధాన"మైన దైనా "తిక్కన కవిత్వంనకు శబ్దార్థ నిష్కర్షతయే జీవగఱ్ఱ" అంటూ "ఆయన తెలుగుసేతకు అర్థన్యూనతా - శబ్దన్యూనతాది లోపము లేవియు రాలేదు" అని ఆచార్య పింగళివారు వివరించారు అలానే తెనుగులెంక కవిత్వం'నకు "శబ్దార్థ" నిబద్ధతయే పట్టుగొమ్మ.

"భారతకావ్యమును తిక్కనవలె నిర్వహించిన తెలుగుకవి మఱియొకడు లేడు" అని ఆచార్య పింగళివారి అభిభాషణం. అలానే "తిక్కనగారు చేసిన సాహిత్య సృష్టి ఇంకొక్కరివల్ల అయ్యేది కాదు" అంటాడు ఆరుద్ర "భారత రచనవల్ల తెనుగున ఏకవికి అందని బ్రహ్మపదమును చేపట్టి, తిక్కన కవిబ్రహ్మ అయ్యెను" అనియు "అచ్చతెనుగునకు గౌరవము తెచ్చినవాడు తిక్కన" అనీ ఆచార్య పింగళివారు అభిభాషించారు— అనియు

అలానే జాతిపిత గాంధీజీ 'ఆత్మకథను - మహాత్మకథను' తెనుగులెంక తీర్చిదిద్దినట్లు మరే తెలుగుకవియు చేయలేదు. తిక్కన కంటే అభినవతిక్కన పద్యంగాని గద్యంగాని "సరళాతిసరళం"గా రాసాడంటే అతిశయోక్తి కాదు—

"పుట్టుక చేతను - నడవడి చేతను - విజ్ఞానము చేతను (రాజనీతి యుద్ధతంత్రం - బ్రహ్మవిద్యోపదేశము) యీమూడు మహాధర్మము లను ఆత్మధర్మములుగ నిర్వహించి అనుభవగోచరములు చేసుకొనిన కవి తెలుగునాట తిక్కన యొక్కడే" అనియు "ధర్మముగూడా తిక్కనయందువలె మరి యేకవి యెడను సార్థకము కాలేద"నియు ఆచార్య పింగళివారు అభిప్రాయపడ్డారు. అదేవిధంగా - "పుట్టుక చేతను - నడవడిచేతను - జాతీయాభిమానం-" చేతను - సత్యనిష్ట శాంతగుణం - ధర్మబుద్ధి (న్యాయబుద్ధి) ఋజువర్తనం లోకకల్యాణ కాంక్ష గల్గి- "సత్యాహింస శాంతి" మూర్తియై గాంధేయ సర్వోద య మార్గాన్ని తెనుగులెంకకువలె మరే తెలుగుకవి తీర్చిదిద్దలేదు. తిక్కన 'ధర్మాద్వైతస్థితి' ని ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యంగారు 'ధర్మవీరం'గా అభిప్రాయపడ్డారు. భారతయుద్ధ ధర్మాన్ని తిక్కన చక్కగా నిర్వహించినట్లు - తెనుగులెంక బాపూజీ స్వాతంత్ర్యో ద్యమ ధర్మాన్ని తీర్చిదిద్దాడు. తిక్కన 'ధర్మవీరం'వలె తెనుగు లెంక ధర్మవీరం - తన ఆత్మకథ - మహాత్మకథలలో చక్కగా ఋజువుపరచాడు.

"వ్యాస వాల్మీకిలిద్దరి సృష్టినీ తన స్వంతం చేసుకొన్న తిక్కనగారు ప్రజలకోసం - ఆంధ్రావళి మోదము౯ బొరయునట్లుగా మహాకవిత్వ దీక్షావిధి నొంది గద్యపద్యాలుగా వ్రాసారు" అంటాడు ఆరుద్రగారు. అలానే తెనుగులెంక గూడా తిక్కన తెనుగుదనాన్ని గాంధేయ సత్యాహింసల్ని-సర్వోదయ సిద్ధాంతాన్ని

స్వాంతం చేసుకొని 'లోకసేవాదృష్టి'తో గద్యపద్యాలుగా కావ్యాలు వెలయించారు. "ఆనందముద్ర" వేసిన సంగతి మొట్టమొదటగా రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు గుర్తించారనీ తిక్కనగారు "హరిహరనాథుణ్ణి ఆనందరూపుడిగా ఊహించుకొన్నాడనీ" సోదాహరణంగా ఆరుద్రగారు వివరించారు. భారతంలో గ్రంథాదిని కృతికర్త (తిక్కన) భావానందభరితాంతఃకరణుడనీ, గ్రంథాంతంలో కృతిపతి (హరిహరనాథుడు) సంభృతానందభావుడనీ, ఏ ఆశయానికైతే మనం మన జీవితాన్ని అంకితంచేశామో ఆ ఆశయం యొక్క ఆనందమే మన ఆనందమని ఆరుద్రగారు విశదపరిచారు.

"ఆంధ్రావళి మోదం బొరయునట్లుగ" చెప్పి భారతాన్ని తిక్కన ఆంధ్రీకరించిన మాట నిజమే! అంతమాత్రాన భారతాంధ్రీకరణ చేయడంలో తిక్కన ఆశయం కేవలం "ఆనందమూ!" "ఆ మహాకావ్యంబు సర్థంబు సంగతంబు" గావించుటకు భారతాంధ్రీకరణమునకు తిక్కన పూనుకొన్నాడుగదా మరి నన్నయ్యగారన్నట్లు మహాభారతం 'ధర్మ' శాస్త్రం, వేదాంతశాస్త్రం, నీతిశాస్త్రం లక్షణగ్రంథం! అట్టి భారతమహాకావ్యాన్ని కేవలం 'ఆనందం' కోసమే రాశాడంటే నమ్మటానికి వీలులేదు! తిక్కనగారే కాదు ఏ కవిఅయినా తన కావ్యాన్ని 'ఆనంద' కోసమే కాదు. సందేశాత్మకంగాను తీర్చిదిద్దుతాడు. ఆనందంతోపాటు లోకానికి 'ధర్మాద్వైత' సందేశాన్ని యివ్వటానికే తిక్కన భారతాన్ని తెనుగు చేశాడు. ఆచార్య పింగళివారు "నానాధర్మములయొక్క అద్వైతమూర్తియే భారతమనియు, దానిని దర్శించి, సద్ధర్మానుగుణముగా భారతమును తెనుగున నిర్మించిన మహాకవి" అని వివరిస్తూ "తిక్కనగారు లోకమునకిచ్చిన సందేశము అద్వైతమార్గానుసారియైన పూర్ణయోగ సాధన" అని తేల్చి చెప్పారు.

ఇక తెనుగులెంక, "ఒక్క మహాకావ్యంబు రచియింప వేడ్క పడి" "కల్లకై తలనల్లుట కంటె", "విశ్వమానవ కల్యాణవిధి విధాత" అయిన "గుణ గరిష్ఠుడు, దేశభక్తుడు" అయిన "గాంధిమహాత్ముని చరిత్ర" చెప్పుట జగద్ధితంబైన చేతగాదె" అనియు, భారతక్షోణికి 'నూతన చైతన్యము సంధించిన "నరజాతికి నాత్మోన్నతి సరణిం బ్రక టించిన" సత్యసంశోధనా సక్తి సందడించిన లోకోత్తర మనజాలిన- బాపూజీ నిర్వహించిన బ్రతుకుచందము తెలుగుప్రజలకు "నూఊట" గలిగించుటకు - అంటే ఆనందాన్ని ఉత్సాహాన్ని కలిగించుటకు- 'చేసినపుణ్యమై తనకు జిక్కనకైత ఫలింప' ఆత్మకథ - మహాత్మ కథల్ని - మహాకావ్యాలుగా తీర్చిదిద్దుటయే కాదు - "నైతిక పునరుజ్జీవన / జాతీయ వికాస విశ్వజనతా శ్రేయః ప్రీతము మచ్చె తమ"ంటూ "సామాజిక కల్యాణము" కామించి తన "మేనెంతవలం గిన" తన మనుగడ లోకసేవనము" కోసం "నవ్యభవ్య కవితా సృష్టితో" మరెన్నో కావ్యాలు వెలయించాడు తెనుగులెంక ! కవిత్రయంలో తిక్కనసోమయాజిఅనియు "రసధ్వనిలాంటివాడూ" "అర్థగుణప్రస్థానానికి కర్ణధారి""తిక్కనఅర్థాన్ని ఆవిష్కరించే అనల్ప గుణసిద్ధిని బ్రహ్మసూత్రంలాగా తెలుగు కవితకు ప్రబోధించాడ"నీ- "అర్థగుణ ప్రధానమైన రచనలోని శబ్దం పానకంలో చక్కెరలా ఉంటుంది." అని అంటూ— "తిక్కన కవితా తేజస్వి భావతపస్వి" అనియు 'తిక్కన రసవృత్తి నిర్వహణాన్ని నాటకీయఫణితిలో సాగిం చాడ'నీ" తిక్కన మాధుర్యంతో చిత్తద్రుతిని కలిగిస్తాడని ఆచార్య సుబ్రహ్మణ్యంగారు అభిభాషించారు[1]

మొత్తంమీద తేలిందేమంటే— తిక్కన కవితాశైలి శబ్ద ప్రధానం కాదని - ప్రౌఢ సంస్కృతపద గుంభన సంభరితం కాదని

పదాడంబరతకు - ఆయన ప్రాధాన్యం యివ్వలేదని అచ్చమైన- అర్థవంతమైన లలితలలిత అలతిఅలతి తెలుగుపదాలతో - జాను తెనుగు నుడికారపు సొంపులతో - సామెతలు - జాతీయాలతో "బుద్ధిగమ్య" గుణప్రధాన 'భావార్థ' గుణవివేష కథాగమన ప్రయోగ 'కావ్యేతిహాసం'గా వ్యాసకృత సంస్కృతభారత "మహా కావ్యంబు నర్థంబు సంగతంబుగా తెలుగులో తీర్చిదిద్దినాడని మనకు స్పష్టమౌతుంది! అయితే తిక్కన అసలు సంస్కృత సమాస పదప్రయోగం చేయలేదనికాదు. యుద్ధఘట్టాలలో - తదితర సన్నివేశాలలో 'సందర్భాన్ని' బట్టి ఔచిత్యాన్ని పాటించి తిక్కనగూడా సంస్కృత పదప్రయోగాలు మిక్కిలిగానే చేసాడు. అయితే అంతటి మహాకావ్యంలో- 'తెలుగుపాలు' కంటే సంస్కృత పాలు చాలా తక్కువని మాత్రమే మనం గుర్తించుకొంటే చాలు!

అదేవిధంగా తెనుగులెంక కూడా ప్రౌఢ సంస్కృతపద గుంఫ నంజోలికి పోలేదు. దీర్ఘసంస్కృత సమాసాల్ని దాదాపుగా వాడ నేలేదు. తెనుగులెంక కవిత్వమంతయు - తేటతేలియలూరు తెలుగు పదాలతో- కమ్మని తెలుగు నుడికారాలు-జాతీయాలు సామెతలతో కూడియున్నది. తెనుగులెంక "ఆత్మకథకు" 'తిలకరచన' నలదుచూ- కట్టమంచి రామలింగారెడ్డిగారు— "తమ శైలి యించుమించు ఆంధ్ర మహాభారత ప్రతిబింబము." అని అంటూ "అర్థమునుబట్టి పదములు పదములలో లీనమైన రీతిని యతిప్రాసములు ననాయాసముగ న ప్రయత్నముగ స్వచ్ఛందముగ వచ్చి చేరుచుండును. ఈ సిద్ధియందు ప్రసిద్ధుడు తిక్కన. ఈ వర్గమున దిక్కనతో సజాతీయుడైన వాడు మన చౌదరి— భావమనర్గళముగ ప్రవహించు చందాన వ్రాయు మహనీయుడు." అని అభిభాషించారు.

ఇక - తిక్కన - అభినవతిక్కనల కావ్యరచనా వైశిష్ట్యాన్ని-శైలీవిన్యాసవర్ణనల రీతుల్ని తెలుసుకొందాం. వర్ణనలకు తిక్కన పెట్టిందిపేరు. తిక్కన వర్ణనలు మనోహరంగా వుంటాయి. మచ్చుకు సూర్యోదయ వర్ణన చూడండి - ఇది ప్రకృతి వర్ణన—

సీ॥ నీరజాకరములు నిష్ఠమై జేసిన
భవ్యతపంబుల ఫలమనంగ
దివసముఖాభినందిత చక్రయుగ్మకం
బుల యనురాగంపు ప్రోవనంగ
హరిహరబ్రహ్మ మహానుభావంబు లొ
క్కటిగాగ గరిగిన గుటికయనగ
నతుల వేదత్రయ లతికాచయము పెను
పొంద బుట్టెడు మూలకందమనగ

తే. గీ॥ నిఖిల జగముల కన్దైఅయగుచు, జనస
మాజకరపుట హృదయ సరోజములకు
ముకుళనంబును జృంభణంబును నొనర్పి
భాను బింబంబు పూర్వాద్రిపై వెలింగె

**(మహాభారతం - విరాట)**

తామరపూలు దర్శనభాగ్యం కోసంచేసిన తపఃఫలంగా (సూర్యుడు పద్మప్రియుడు) చక్రవాకయుగళి ప్రేమానురాగపు ప్రోవుగా—త్రిమూర్త్యాత్మకమైన అమృతగుళికగా - వేదత్రయ లతికాచయం పెంపొందించు 'కందమూలము'గా (దుంపగా) అఖిల విశ్వానికి కన్దైఅగా - జనసమాజ హృదయసరోజాలు వికసింపజేస్తూ భాను బింబం - ఉదయాద్రిపై వెలసిందట ! ఇందలి భావం మనోహరం-మహోదాత్తం ! భాషకన్న భావంమహోన్నతంగా వుంది.

ఇక శ్రీ తుమ్మలవారి సంక్రాంతిలక్ష్మి వర్ణన చూడండి.

సీ॥ కొసరినూఱిన పచ్చి పసపు బూత మొగాన
గుమ్మడి పూదుమారమ్ము నద్ది
కండరేగడ నారబండి కన్పట్టు వై
పొలుసు మిర్వపుబండు బొట్టువెట్టి
వలిపమ్ము నకు నొక్కవాసి హెచ్చైనట్టి
నునుమంచు దెరచీర నూలుకొల్పి
బంతిపూవులకు జేమంతి నెయ్యము గూర్చి
కబరీభరమ్ము చక్కకుదిర్చి

తే. గీ॥ పంటకళ్ళాలు మును బరాబరులు సేయ
గూడుగట్టిన తెలిమబ్బు గొడుగునీడ
గదలివచ్చెను భాగ్యాల కడలివోలె
మకరసంక్రాంతి లక్ష్మి హేమంతవీథి

—పఱిగపంట

సంక్రాంతి హేమంత (హిమ) ఋతువులో వస్తుంది. ఆ ఋతువులో కోస్తా ఆంధ్రప్రాంతంలో గుమ్మడిపూలు - పండిన మిరపకాయలు - మంచు తెరలు - బంతి చేమంతిపూలు - విరివిగా దొరుకుతాయి. మన కవిగారు సంక్రాంతిని లక్ష్మిగా పోలుస్తూ - గుమ్మడిపూ పసుపు మొగాన అలదుకొని - ఎర్రగా పండిన మిరపకాయ సింధూర తిలక రచన నుదుటదిద్ది - నునుమంచు తెల్లటి చీరకట్టుకొని - బంతి చేమంతిపూలు సిగలో తురుముకొని - తెలిమబ్బు గొడుగునీడలో పంటకళ్ళాలు 'స్వాగతం' పలుకుచుండగా తెలుగునాట - హేమంతవీధి గుండా - సంక్రాంతిలక్ష్మి - పెద్దముత్తైదువులా - మెల్ల మెల్లగా - నల్లనల్లన భాగ్యలక్ష్మిగా నడిచివచ్చిందట ! ఓహో ! ఏమా మంజులమనోజ్ఞ

మనోహర వర్ణన ! గంభీర కమనీయభావం ! అర్థం కమనీయం. ఈ సంక్రాంతి వర్ణనలో సుందర ప్రకృతివర్ణన మిళితమై - అంతర్లీనంగా ఆనందదాయంగా - వుంది ! తిక్కన సూర్యోదయ వర్ణనకుమించిన విధంగా యీ 'సంక్రాంతి వర్ణన ఛందోబద్ధం చేసాడు శ్రీ తుమ్మల వారంటే, సాహసమైనా - యిందులో అతిశయోక్తిలేదని చెప్ప వచ్చు. ఇందు శబ్దార్థాలు చట్టాపట్టాలు పట్టుకొని సుందరంగా ఛందోబద్ధంగా లయవిన్యాసంగా - నాట్యం చేసాయి. "వేమన్నను తిక్కన్నను గూడా మరపిస్తూ ఉంటాయి వారి (తెనుగులెంక) తెలుగుపోకడలు" అని కాటూరి వేంకటేశ్వరరావుగారి 'అభిభాష ణం' మనమిక్కడ గుర్తుచేసుకోవడం సందర్భోచితం. ఇటువంటి కవితావర్ణన చేసాడు కనుకనే తెనుగులెంకకు 'అభినవ తిక్కన' బిరుదం - విద్వత్కవి పండితసాహిత్య విమర్శకాగ్రేసర - కట్టమంచి వారు ప్రధానం చేసారు !

తిక్కనగారి కావ్యశిల్పంలో 'నాటకీయ' పాళ్ళు ఎక్కువన్న విషయం సాహితీవేత్తలకు - సాహితీప్రియులకు వేరుగా గుర్తు చేయవలసిన పనిలేదు. దృశ్యకావ్యానికి పాత్రల సంభాషణలు ప్రాణం ! కాని శ్రవ్యకావ్య రచనలో సన్నివేశకల్పన పాత్రల రూపగుణ (చిత్త) చేష్టాదులు - సంభాషణాచాతుర్యం నాటకీయ తకు పట్టుగొమ్మలని ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం గారంటారు.[1] అయితే నాటకీయతకు పాత్ర సృష్టి ప్రాణం పట్టుఅని ఆచార్య పింగళి వారంటూనే - పాత్రల రూప - చిత్రిత- చేష్టాదులు సంభా షణా వర్ణనలతో కథాగమనం చేయించటమే నాటకీయత యనియు ఆచార్య పింగళివారు విశదీకరించారు. ఈ విధంగా కావ్యశిల్ప రచనాచాతుర్యం కలవాడు తిక్కన - "కావుననే భారతమును

---

1. సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలు— జి. వి. సుబ్రహ్మణ్యం

చదువుతున్నప్పుడు కథను చదువుచున్నట్లు కాక నాటకమును చూచు చున్న భావన గల్గుతుందని" ఆచార్య పింగళివారు అన్నారు.[2] అంటే - కావ్యం చదువుతున్నప్పుడు - నాటకాన్ని చూస్తున్న 'దృశ్యం పద్యం చదివినప్పుడు సన్నివేశం 'బొమ్మ' గట్టినట్లు కళ్ళెదుట సాక్షాత్కారించాలి !

తిక్కన రచనలో యీ నాటకీయత చూస్తాం. ఇది సన్నివేశ వర్ణన.

ద్రోవది బంధురంబయిన క్రొమ్ముడి గ్రమ్మన విచ్చి వెండ్రుకల్
దావల చేతబూని యసితచ్ఛవిబొల్చు మహాభుజంగమో
నావిలసిల్లి వ్రేలగ మనంబున బొంగు విషాదరోషముల్
గావకలేక భాష్పములు గ్రమ్మగ దిగ్గనలేచి యార్తియై (ఉ. ప)

శ్రీకృష్ణుని కౌరవుల దగ్గరకు 'రాయబారం' పంపుటకై పాండవులు ఆయనతో మంత్రాలోచన చేయుసమయంలో ద్రౌపది రంగప్రవేశం చేసింది. ఆమె 'గుణచేష్టాదుల' చేత ఆమె ఎట్లావుందో తిక్కనగారు 'బొమ్మ' కట్టినట్లు వర్ణించారు. అంటే పద్యం చదవగానే సమయసందర్భ కథాఘట్టం దృశ్యమానంగా కనిపిస్తుంది.

భీముడు దుశ్శాసనుణ్ణి చంపిన (సన్నివేశ) ఘట్టవర్ణన తిక్కన చేసినతీరు.

నరసింహుండనురేంద్రువచ్చు కరణిన్ రౌద్రం బుదగ్రంబుగా
నుర మత్యుగ్రత జీరిక్రమ్మ రుధిరమ్ముల్లాసియై దోయిటన్
వెరవారంగొని త్రావుమెచ్చు జవికిన్ మేనున్ మొగంబున్ భయం
కరరేఖ బొరయంగ జల్లికొను నక్కౌరవ్యు జూచుండొరిన్

(కర్ణపర్వం)

---

2. ఆచార్య పింగళిలక్ష్మీకాంతంగారు ఆంధ్ర సాహిత్య చరిత్ర

దృశ్యం కళ్ళకు గట్టినట్లు వర్ణించాడు. భావం భాష చిక్కగా చక్కగా మమేకం అయ్యాయి. ఇక తెనుగులెంక జలియన్ వాలాబాగ్ దురంతాల నాయకుడు బ్రిటీషు అధికారి డయ్యరుసల్పిన దుష్టకృత్యవర్ణన— (మహాత్మకథ)

నిప్పుల్ గ్రక్కుచు దూకి డయ్యరు చమూనేతృత్వ మేపార నే
తప్పుం గానని బాలవృద్ధ శిశుకాంతారంగమౌ రచ్చపై
గుప్పించెన్ కృపమాలి మృత్యుసఖముల్ ఘోరాగ్ని గోళచ్ఛటల్
తెప్పల్ తెప్పలుగా శవంబు లసృగబ్ధిందేలి పర్వెత్తగన్

సరళమైన భాషలో సన్నివేశం 'బొమ్మ' కట్టినట్లు వర్ణించాడు శ్రీ తుమ్మల.

తెలుగు నుడికారాలు - సామెతలు - జాతీయాలు అధికంగా తన కవిత్వంలో చొప్పించిన తిక్కన సంస్కృతపద భూయిష్ట సమాసాలను అరుదుగానైనా తన కవిత్వంలో వాడాడు. చూడండి. అది ద్రౌపది తన భర్తలు అరివీర భయంకరులనీ - తన మేనిమీద చేయివేస్తే - వాళ్ళ చేతుల్లో కీచకునికి మరణం తప్పదని ద్రౌపది హెచ్చరించిన ఘట్టంలోని పద్య వర్ణన !

దుర్వారోద్య మబాహువిక్రమ రసాస్తోక ప్రతాప స్ఫుర
ద్గర్వాంధ ప్రతివీర నిర్మథన విద్యాపారగుల్ మత్పతుల్
గీర్వాణాకృతు లేవురిప్పునిను దోర్లీలన్ వెసంగిట్టి గం
ధర్వుల్ మానము ప్రాణముం గొనుట తథ్యంబెమ్మెయింగీచకా

(విరాటపర్వం)

ప్రౌఢపద గుంఫనంతో భావబంధురంగా వుందీ వర్ణన— ఇక తెనుగు లెంక గూడా సంస్కృతపద భూయిష్ట దీర్ఘసమాసాల్ని త్రోసిరాజని అచ్చమైన లలిత తెలుగుపదాలతో జాతీయ సూక్తులతో

వెలయించినా తెనుగులెంక గూడా సంస్కృతపద గుంఫన సంభరిత సమాసాల్ని తన రచనల్లో వాడిన సందర్భాలు అక్కడక్కడ లేక పోలేదు మచ్చుకొక ఉదాహరణ— శ్రీకృష్ణ కర్ణసంవాదం (శైబల-కర్ణుడు) లో పాండవపక్షంలో చేరమని కర్ణుణ్ణి శ్రీకృష్ణుడు సలహా యివ్వగా అందుకు-కర్ణుడు దుర్యోధనుడికి మిత్రద్రోహం చేయనని-యీనాడు కౌంతేయుడనని చెప్పి యిన్నాళ్ళూ అర్జునుడిని- బద్ధశత్రువుగా నెంచి నేడు పాండవపక్షంలో చేరి తేనల్గురు నవ్వరా అంటూ శ్రీకృష్ణునితో అన్న ఘట్టమది. సంస్కృతపద దీర్ఘసమాస రసవత్ ఘట్టమది చూడండి.

> దుర్వారోద్యమ శౌర్య వీర్యవిలసద్దోర్గర్వమేపార గం
> ధర్వాదుల్ దివిబాడ సంగర కళాతత్త్వంబు దీపింపగా
> సర్వోర్వీశులు మెచ్చ బార్థుని మహోత్సాహంబునందాకి యు
> ద్ధోర్విన్ గ్రీడయొనర్పకున్న నగరాక్కా లోకులే కర్ణునిన్
>
> (పఱిగపంట)

ఇందులో శబ్దార్థాలు "ప్రౌఢం"గా "గాఢంగా పెనవేసుకొని ఛందస్సులో అందంగా యిమిడాయి! పరికించిచూస్తే - తిక్కన గారి పద్యంలోని కొన్నిపదాలు అతిసహజంగా - అభినవతిక్కన పద్యంలో చేరాయి! ఎంతైనా ఇద్దరూ కవితారచనా పద్ధతిలో "అన్నదమ్ములు" గదా !

సాహితీవేత్తలు - సాహితీప్రియులకును - తిక్కనగారిక్కని ప్రీతిపాత్రమైన యీకింది పద్యం ఆయన విరాట ఉద్యోగ పర్వము లందు 'ఒక్కపదం' గూడా మార్చగుండా పొందుపరిచాడు.

వచ్చినవాడు ఫల్గును డవశ్యము గెల్తుమనంగరాదు రా
లచ్చికినై పెనంగిన బలంబులు రెండును గెల్వనేర్చునే
హెచ్చగు గుందగుం డౌడరు టెల్ల విధంబుల కోర్చునట్లుగా
కిచ్చదలంచి యొక్కమెయి నిత్తరి బొందగు చేతయుందగున్

సరళమైన తెలుగుమాటలలో నడిచింది పద్యం - రాజ్యలక్ష్మికి-'రాలచ్చి' అచ్చ తెలుగు నుడికారం కదా ! ఫల్గునుడిరాక విజయ సూచికం కదా !

ఇక తెనుగులెంక సరళమైన తెలుగుపదాలతో వ్రాసిన పద్యాలు వేలకువేలు ! స్వాతంత్ర్య సమరఘట్టంలోని పద్యం మచ్చు కొకటి. (మహాత్మకథ)

రాగలదోయి ! ధర్మసమరంబిది భారతజాతి ముక్తికై
సాగినదోయి దాస్యమున జచ్చియు చావని వారలందఱున్
ద్యాగము శాంతిసత్యమును దప్పని యస్త్రములై జగజ్జయ
శ్రీ గురియింప సంగరము సేయుడు త్రోయుడు మాతృదుఃఖమున్

సాగిన ధర్మసమరంతో విజయం రాగలదని కవిగారి నమ్మిక.

"తిక్కనగారికి తమకు ఇష్టమైన పద్యాలను మళ్ళీమళ్ళీ వాడు కొనడం సరదా. కథాసందర్భాల్ని అందుకు వీలుగా తిప్పుకొంటా ర"ని ఆరుద్రగారంటూ "దుర్వారోద్యమ బాహువిక్రమ" అనే పద్యాన్ని విరాటపర్వంలో "ఒక్క అక్షరం మార్పు లేకుండా "రెండు సార్లు సందర్భోచితంగా చెప్పాడనీ, అలానే "వచ్చినవాడు ఫల్గును డవశ్యము గెల్తుమనంగరాదు..." అనే పద్యాన్నిగూడా మార్పు చేయకుండా తిక్కనామాత్యుడు విరాట, ఉద్యోగపర్వాలలో చెప్పాడని ఆరుద్రగారు వివరించాడు.

అభినవతిక్కన గూడా యిలానే తనకు నచ్చిన - యిష్టమైన పద్యాల్ని ఒక కావ్యంలోనివి మరో కావ్యంలో పొందుపరచడం,

ఆయన సాహిత్యాన్ని బాగా అధ్యయనం చేసినవారికి మాత్రమే తెలుస్తుంది ఉదాహరణకు మహాత్మకథలో గాంధీని గురించి రాసిన 'ఉత్తమవాగ్మినా నొప్పారె...' అనే పద్యాన్ని "శబల" కావ్యంలో గూడా చేర్చాడు. అలానే మహాత్మకథలోని "హైందవులు మస్లిములు సిక్కులన్నదమ్ములట్లు" అనేపద్యాన్ని ఎక్కట్లులోనూ, అందులోని "మతముపేర సాటి మానవు తల ద్రుంచి..." అనే పద్యాన్ని సందేశసప్తశతిలో మరలా చేర్చాడు. అదేవిధంగా మహాత్మకథలోని "నన్ను బ్రదికింప నెంతురే నాన్నలార..." అనే పద్యం, "అతడస్పృశ్యుడు స్పృశ్యుండితడను..." పద్యం— "సందేశసప్తశతిలో దర్శనమిస్తాయి. సర్వోదయగానంలో "ఆతడు" అనే శీర్షికతో వినోభా బావే మీద రాసిన పద్యాలు మరలా 'శబల'లో అదే "ఆతడు" శీర్షికతో అన్ని పద్యాలు చేర్చాడు. మహాత్మకథలోని క్షామపీడిత వంగభూమిని మహాత్ముడు దర్శింప వచ్చిన ఘట్టంలో "అది దురాపిశాచీ సమర్చన"... అనే గీతమాలిక కవితను పఱిగపంటలో "వంగభస్మము" శీర్షికతో చేర్చాడు. అలానే 'అమరజ్యోతి' లోని పద్యాలు మహాత్మకథలోను, రైతులమీది పెదకాపు కవితలు పఱిగపంటలోను పొందుపరచాడు— 'రాష్ట్రగానం, ఉదయగానం కావ్యాలలోని కొన్ని పద్యాలు మరలా 'పఱిగపంట'లో చేర్చాడు. ఇలా తనకిష్టమైన పద్యాలు, బహుశా అవి గాంధీజీపైనివి గాని, వినోజీపైనివి గాని, వారిమీద తెనుగు లెంకకున్న 'అభిమానం' తోనో - అలానే సామాజిక శ్రేయస్సు కోరి, కులమతాలపైని, అస్పృశ్యతపైని తాను రాసిన పద్యాలు లెక్కకు మిక్కిలి, ఒక కావ్యంలోనివి మరో కావ్యంలో అభినవతిక్కన పొందుపరచడం మనం గమనించవచ్చు.

సన్నివేశ(సంఘటన)వర్ణనలో నాటకీయతకు మచ్చొక ఉదాహరణ

'ఆత్మకథ'లో అభినవతిక్కన బాల్యానికి బాధామయ భావాన్ని తెలుగులో 'బొమ్మ' కట్టేట్టు వర్ణించాడు.

సీ॥ ఆపాపకందర మందేమి సెప్పదు
గన్నుల జీకటుల్ గ్రమ్ముకొనియె
మందునకే నొక్క మాటవెల్వడదయ్యె
జెమరు చే నొడలెల్ల జెమ్మగిల్లె
గంపమ్ము హెచ్చె సగ్గలమయ్యె గగ్గోలు
సెజ్జపై బోగపుంజెలువ కెలన
నధివసించితిగాని యంకిళ్ళు బిగువయ్యె
నాకొమ్మ తడవోర్వలేక తిట్టి
తే. గీ॥ నెట్టి వాకిలి సూపె నప్పట్టునందు
వచ్చె నాపుణ్యమున కయో మచ్చయనుచు
సిగ్గుపడి తల్లి ! వసుమతీ ! శీఘ్రముగను
దారినొసంగుము నాకంచు దల్లడిలితి !

(ఆత్మకథ)

చిన్ననాట గాంధీజీ చెడుస్నేహాల మూలమున - ఒక వేశ్యాగృహానికి పోవడం జరిగింది ! ఆ వేశ్యాగృహంలో వేశ్యప్రక్కన మంచం మీద కూర్చొన్నప్పుడు ఆయన స్వీయానుభూతుల్ని తెనుగులెంక తెలుగులో ఛందోబద్ధంగా - ఆ సన్నివేశం మనకు కన్నులకు కట్టినట్లు 'బొమ్మ' కట్టేలా వర్ణన చేసాడు మన కవిగారు !

తిక్కన ద్రౌపదిచేత భీమునికి ధర్మరాజు వ్యక్తిత్వాన్ని వర్ణించిన విధం.

ఎవ్వనివాకిట నిభమదపంకంబు
రాజభూషణరజో రాజినడగు
ఎవ్వాని చారిత్రమెల్ల లోకములకు
నొజ్జయై వినయంబు నొఱపుగఱపు

ఎవ్వాని కడగంట నివ్వటిల్లెడు చూడ్కి
మానిత సంపద లీనుచుండు
ఎవ్వాని గుణలతలేడు వారాసుల
కడపటి కొండపై గలయఁబ్రాకు

అతడు భూరిప్రతాప మహాప్రదీప
దూర విఘటిత గర్వాంధకారవైరి
వీరకోటీర మణి ఘృణివేష్టి తాంఘ్రి
తలుడు కేవలమర్త్యుడై ధర్మసుతుడు (భార— విరా. ప)

ఆచార్య పింగళివారు చెప్పినట్లు - పాత్ర రూపగుణ వర్ణనతో ధర్మ రాజు విశిష్ట వ్యక్తిత్వం "బొమ్మ" కట్టినట్లు నాటకీయ దృశ్యమిది.

ఇక అభినవతిక్కన చేసిన మహాత్మాగాంధి వ్యక్తిత్వ వర్ణనకు ఒక ఉదాహరణ.

నీపలుక్కగాక యీ నిఖిల భారతమహీ
చక్రంబుద్రిప్పు శాసనము గలదె
నీయుక్కిగాక పండిన పాపములనెల్ల
రాపాడు పుణ్యతీర్థమ్ము గలదె
నీకిన్కగాక మానిసి గుండెలో చూటి
చెడుగుపాదు పెకల్చు శిక్షగలదె
నీకూర్మిగాక నిర్ణిద్రయోగ సమాధి
బడలి సంపాదించు పదవిగలదె
కలదె నీజీవన పథమ్ముగాక లోక
శర్మ సంపత్తి నొదవించు ధర్మశాస్త్ర
మద్వితీయంబు నీతపస్యా విధాన
మెవ్వని మనీష నిల్చు నిన్నెఱిగి పల్క —అమరజ్యోతి

గాంధీమహాత్ముని విశిష్ట వ్యక్తిత్వం కళ్ళకుకట్టినట్లు (పాత్ర రూప గుణవర్ణన) దృశ్యమాన వర్ణనిది !

శ్రవ్య కావ్య విషయంలో అక్కడక్కడ పాత్రలు సంభాషించుకొనుట నాటకీయవర్ణన అవుతుంది. దృశ్యకావ్యంలో (నాటకం) సమయసందర్భ పాత్రోచిత సంభాషణలే కథాసంవిధానంనకు జీవగర్రలై ప్రేక్షకుల్ని అలరిస్తాయి. మరి శ్రవ్యకావ్యంలో అక్కడక్కడ కవిరాసే సందర్భోచిత పాత్రల సంభాషణములే పాఠకుల హృదయాల్ని ఆకట్టుకొంటాయి. తిక్కనగారి సంభాషణా భరిత నాటకీయ సన్నివేశం.

అక్కట ! నాదువేడ్కకుచితానుచితంబులు సూడకే విభుం
డొక్కతలంపు వాడయి సముత్సకతన్ నన్ను దవ్వుపుచ్చగా
నిక్కమ యియ్యకోల రయనెయ్యముతియ్యముగాదె యంచు నిం
పెక్కగరాముడెంద ముడుకెక్క రథంబు లతాంగి యెక్కినన్

(నిర్వ - రామా)

సీతమ్మవారిమీద వచ్చిన 'అపవాదు' భరించలేక శ్రీరాములవారు సీతనుఅడవికిపంపు సందర్భంలో తనను అకారణంగా అడవికి పంపడం భర్తకు ధర్మమాయని సీత ఆవేదనచెంది ఆమె అన్నమాట లివి.

ఇక మహాభారతంలో కృష్ణరాయభార ఘట్టంలో ధర్మజుడు సుయోధనుని దుష్టబుద్ధికి బాధపడి శ్రీకృష్ణునితో అన్నమాటలు.

పాండవకౌరవుల్ గలసి పాలును నీరును బోలె నెమ్మిమై
నుండగ దుష్టచేష్టల సుయోధనుడింతలుసేసె నాతడో
క్కండ కులక్షయంబునకు గారణమండ్రదె తప్పదైననీ
వొండననేల యీ బిరుదునోపిన యంతయు దీర్పనేర్పునన్

ఇక తెనుగులెంక కావ్యంలో నాటకీయ సంభాషణం.

ఎవడాకాల్చెడివాడు కాల్చవలె నాయీ బొమ్మపై నీశవం
బవలోకింపగ పోవనేనిపుడు: సన్నాహంగ నెవ్వానికు
న్నవి గుండెల్: నిటలాక్షుడడ్డుపడినన్ నాథాకకుంజాలడీ
యవనిన్ భీరులులేరు, లేరు పరగర్వాంగ స్పృహిష్ఠుల్ శరల్

—మహాత్మకథ

సైమన్‌కమీషన్‌కు వ్యతిరేకంగా మద్రాసులో ఆందోళన రేగింది. బ్రిటీషు సైనికులు కాల్పుల్లో ఒకరుచనిపోగా వీరావేశంలోటంగుటూరి ప్రకాశంపంతులుగారా సందర్భంలో అన్నమాటలివి. అప్పుడే ఆయన్ని 'ఆంధ్రకేసరి' అన్నారు.

ఇంకో చక్కని ఉదాహరణ.

గుంపులుగుంపులై తెలుగుకొమ్మలు గాంధికి నంజలించి మీ
పంపులు మా శిరమ్మునకు బ్రస్నని క్రొవ్విరి దండలంచు వాల్
జంపుల కంకణమ్ముల బులాకుల బన్నసరాల కానుకల్
నింపిరి దేశభక్తి రమణీయలు తండ్రికిదగ్గ బిడ్డలై

—మహాత్మకథ

1921 లో మహాత్మాగాంధి బెజవాడలో జరిగిన అఖిలభారత జాతీయ కాంగ్రెస్ మహాసభలకు హాజరై, ఆ తర్వాత ఆంధ్రదేశం పర్యటించాడు గాంధీగారు ఎక్కడికి వెళ్ళినా, లేదా ఎవరైనా తన దగ్గరకు వచ్చినా - "స్వరాజ్యనిధికి" "హరిజనసేవాసంఘ"కి ఉదారంగా విరాళాలిమ్మని అడిగేవాడు. ఆంధ్రదేశ పర్యటనలో గూడా 'స్వరాజ్యనిధికి' విరాళాలిమ్మన్నాడు. ఆంధ్రదేశంలో గాంధీజీకి విరాళాలిచ్చిన వారిలో 'తెలుగు ఆడపడుచులు' ముందున్నారు ! తమ శరీరంపైవున్న వివిధాభరణాలను (మంగళసూత్రాలను మినహా

ఆంధ్రామహిళలు గాంధీజీకి ఆయన యెక్కడికివెళ్ళి అడిగినా కానుక లర్పించారు, ఆయన నోరుతెఱచి అడిగిందే తడవుగా ! ఆ సన్ని వేశాలకీ పై పద్యం ప్రతిబింబం ! సన్నివేశాన్ని 'బొమ్మ' కట్టి నట్లుగా చక్కని చిక్కని తెలుగులో ఛందోబద్ధంగా చెప్పాడు తెనుగులెంక !

తిక్కనగారు స్త్రీపాత్రల్ని చాలా ఉదాత్తంగా - శృంగార ఘట్టాలలో సహితం - ఔచిత్యం - సభ్యత పాటించి - వర్ణించాడు అందులో ద్రౌపది తన జీవితంలో ఎన్నో కష్టాలు పడ్డది భర్తల ముందే కౌరవులు తన 'వస్త్రాపహరణం' గావిస్తుంటే ఆ అవమానం భరించింది. భర్తలతో కారడవుల జీవితం గడిపింది తనకు జరిగిన అవమానానికి భర్తలు కౌరవుల్ని యుద్ధరంగంలో కండకండలుగా ఖండిస్తారని ఆశించింది. కాని 'సంధి' సమయంలో ఐదు ఊళ్ళు ఇచ్చినాచాలని ధర్మరాజు మెత్తబడి కాళ్ళబేరానికొచ్చాడు. ద్రౌపదికి కడుపుమండింది ! వాసుదేవుడితో ఇలా అనిపిస్తాడు తిక్కన (ఉద్యోగపర్వం) ద్రౌపదిచేత

అరయమి జేసి కోడ లన కప్పుడు దాసిగజేసె నమ్మహా
పురుషని పాలికింబతులు వోవగ వీరలతోన యేను జె
చ్చెర జని కోటరంబు దగ జేయుదునో యటుగాక పాడియై
వరవుడమోపి చేయుదుకొ వారికి మాధవ ! నిశ్చయింపుమా !

ఇక తెనుగులెంక స్త్రీ పాత్రల పోషణవిషయానికొస్తే-నిజానికి మహాభారతంలో ఉన్నంతమంది స్త్రీ పాత్రలు ఆత్మకథలోగాని మహాత్మకథలోగాని లేవు. ఆత్మకథలో ఉన్నది ఒక్క 'కస్తూరి బాయి' మాత్రమే. దక్షిణాఫ్రికాలో ఉన్నప్పుడు గాంధీజీ ఓ హరిజనక్రైస్తవుణ్ణి తనయింటిలో పెట్టుకొని-భోజనం పెట్టడమేకాదు అతని గుడ్డలుతకడం-అతగాడు తిన్నపాత్రలు అతని మూత్రకలశంబు

శుభ్రం చేయడం 'మనమే' చేయాలని కస్తూరితో గాంధీజీ అన్న ఘట్టంలో ఆమె మండిపడ్డది. అందుకాయనామె నింటినుండి గెంటు తానంటాడు. కాని భర్తయే దైవమామెకు గృహమే సర్వస్వం. కనుక తమాయించుకొని యిట్లంది! ఆత్మకథలోనిదీ సన్నివేశం.

మీకు నింతసిగ్గులేకుండగాక నా
సిగ్గు చిదుకలేదు చిన్నమంత
లజ్జనూది మదితలంపుడు నన్నిట్లు
వెలికిద్రోయ నెందు నిలుతునేను

నాయాడు జాతి ధర్మము
త్రోయక మీరెంత పఱుపదొడగిన నింద్యం
బేయది సల్పిన నోర్మిం
బాయక భవదాగమెల్ల భరియింపవలెన్ —ఆత్మకథ

స్త్రీకి భూదేవికున్నంత సంయమనం ఓర్పువుంటేనే గృహం స్వర్గమౌతుంది గాంధిగారి మొండిపట్టుదల సంగతి ఆమెకు తెలుసు. ఆమెయే సర్దుకొన్నది.

ఆత్మకథలో కస్తూరిబాయి పాత్రను గాంధీజీ చెప్పినట్లే కొంచెమటోయిటో తెనుగుభాషలో ఛందోబద్ధం చేయక తప్పలేదు కవిగారికి. మహాత్మకథ స్వతంత్రంగా కవిగారు రాసింది. అందులో కవిగారు కస్తూరిబాయి గూర్చి— "అఱువదేడుల నుండి యగ్ని సమ్మితుడైన పతిని మెప్పించిన భవ్యశీలగా" "హైందవ సతీసమాజ మహత్త్వమునకు / మొదటి మూదలగా నిల్చుబ్రతుకు నేర్చి/ సుకృతముల నేలుకొన్న కస్తూరిబాయి" అని అభిభాషించాడు కవి!

పాతివ్రత్యము దుష్కృత
భీతియు హరిభక్తి యతిథి బృందావన మీ
నాతి సదా మఱవక హిం
దూతన్వికి సంతరించె దొలగని కీర్తిన్ —మహాత్మకథ

అని ప్రశంసించాడు కస్తూరిబాయిని. "సాధుతామూర్తి కస్తూరి చాన" అని అంటాడు అభినవతిక్కన.

మానసిక దుర్బలతలేని మగువయగుట
దేవి కస్తూరి పరువపుంజేవ చెడని
వయసునసె బ్రహ్మచర్య జీవనము పూని
వల్లభుని కోర్కితీవకు నల్లు వెట్టె —మహాత్మకథ

"హెచ్చుగా జదువని యింతి కస్తూరి / కల్లకొఱలులేని గరిత కస్తూరి" అని పరిపరివిధాల ప్రశంసిస్తాడు కస్తూరిబాయి సుగుణాల్ని కవిగారు. మహాత్మకథలో సరోజినీనాయుడు వంటి యితర స్త్రీ పాత్రల్నిగూడా తెనుగులెంక 'ఉదాత్తంగా' తీర్చిదిద్దాడు.

స్త్రీపాత్రకాకపోయినా - "ఆత్మార్పణం" కావ్యంలో పెంటికపోతి బోయవాని వలలోజిక్కి తనకు దక్కనందుకు పోతుకపోతం "నీతోడులేని నాదేహయాత్ర జగతి నొక్క నిమేషంబు సాగగలదె" అని దుఃఖిస్తుంది! సతీవియోగం (పెంటి) తో చితి కాహుతి అయిన పోతుకపోతాన్ని తలంచుకొని పెంటి వ్యక్తపరిచిన భావం చూడండి.

విదుపమ విశుద్ధహర్ష వార్నిధి తరంగ
డోలికాపంక్తులందు నూయేల లూపి
నన్ను మదిదేల్చినట్టి నీ నవ్యలీల
మఱతునే నాథ! యెన్ని జన్మములకైన - అని రోదిస్తుంది.
(ఆత్మార్పణం)

"నాకమ్మున నీవు చింతనము సేయుచు నీకొఱకు నిరీక్షించుచుందును నాథా !" అని అంటుంది— ఇలా ఆదర్శ దాంపత్య ప్రణయాన్ని కవిగారు ఆవిష్కరిస్తారు ఆత్మార్పణంలో

మొత్తంమీద కవిగారికి స్త్రీపట్ల యెనలేని గౌరవముంది "సకల దుఃఖరోగ సంపీడితునకెంతి యౌషధ" మంటాడు "మగవార లెంత చెడినను / మగువలు రక్షించుచుంద్రు మన ధర్మంబున్" అంటాడు తెనుగులెంక. ఇంతకు - గాంధీజీ ఆశయాలలో (ఆశ్రమ నియమాలు) స్త్రీ జనాభ్యుదయం గూడా ముఖ్యమైనదే

అందమైనకందానికి తిక్కన పెట్టింది పేరన్నది తెలుగుసాహితీజగ మెరిగినసత్యం. "కందమునకు సోమయాజి ఘనుడందర"న్నది సాహితీ ప్రియులు-సాహితీవేత్తలు అందరూ చెప్పేమాట-మచ్చుకు ఒకటి రెండు కందపద్యాలు చూడండి తిక్కనివి.

అత్తరి గడుబెల్లుగ గ్రొ
నెత్తురు వడియుటయు నతడు నిర్భర మూర్ఛా
యత్తుడగుచు గృతవర్మడు
దాత్తత నెడసొచ్చె బాహుదర్పము నెఱయన్ —కర్ణపర్వం

దుర్యోధన - ధర్మరాజుల మధ్య జరిగిన సమరఘట్టమది.

పడియును గదవిడువని య
క్కడిది మగని గ్రుచ్చియెత్తి గౌరవమున నం
దిడి తొలగం గొనిపోయెను,
వడముడి దెప్పిఱియెనంత వసుధాధీశా ! —శల్యపర్వం

శల్య కృపాచార్యుల మధ్య గదాయుద్ధ ఘట్టవర్ణనమిది.

ఇక అభినవతిక్కన కందపద్యాలు చూడండి,

బొంకాడి యెఱుగనెన్నడు
జంకుదు సిగ్గెక్కుడగుట సంఘము గదియన్
బొంకపు బొత్తమ్ములుగా
కింకెవ్వరు లేరు నాకు నించిన మిత్రుల్ —ఆత్మకథ

గాంధీజీ బాల్య ఘట్ట వర్ణనమిది

పటపట ముమ్మఱు ప్రేల్చన్
జటులగతిన్ రెండుగుండ్లు సంయమికుక్షిన్
విటతటమొనర్చి చనె నా
క్కటి గుండియలోను సొచ్చి కదలక నిల్చెన్ —మహాత్మకథ

ఇది గాంధీజీని గాడ్సే పిస్తోలు గుండ్లతో కాల్చిన ఘట్టవర్ణన.
తిక్కనామాత్యుని మహాస్రగ్ధర పద్యాలెన్నో రాసాడు చూడండి.

వితతజ్యానాద మాశావితతి నినిచి దోర్వీర్య మేపార బాణ
ప్రతతిం దన్ముంప వీకం బలక జడియుచున్ బల్విడింజేర్చి చంచ
ద్గతి గ్రీడం దంతి హేలాకళనరత మృగేంద్ర స్ఫురన్మూర్తిదోపన్
శ్రుతకీర్తింగిట్టి కంఠత్రుటన విలస నారూఢి నవ్విప్రు డొప్పెన్
—సౌప్తికపర్వం

అశ్వత్థామ సహదేవ సుతుని పరిమార్చిన ఘట్టవర్ణనమది

పోతే తుమ్మలవారి మహాస్రగ్ధర ఛందస్సు వాడలేదు కాని 'మధ్యాక్కర' ఛందస్సులో పద్యాలు చాలా రాసాడు. మచ్చుకొకటి.

పలుకులుబట్టి దేశంబునందెన్ని పాయలేర్పడిన
మొలకెత్తరాదు భారత ధరైకత్వమున కెట్టి కొరత
వలయును బ్రజల విజ్ఞానము పెరగవలెనన్న నాడు
పలు రాష్ట్రిము లు మనమిాని బాసలబట్టి యేర్పడుట

ఇది ఛందోబద్ధ పద్యంవలె లేదు. వచనంలా సాఫీగా సాగిపోయింది పద్యం !

అర్థానికి-సహజత్వానికి-భావ "ప్రకటన"కు 'అధిక ప్రాధాన్యత యిచ్చిన తిక్కనామాత్యుడు ప్రబంధకవులవలె "అలంకార" శోభితంగా కవిత్వం చెప్పలేదు. అయినా అక్కడక్కడ ఉపమాన, రూపకాలంకారాలు చేయకపోలేదు.

పల్లవ ప్రసూన ఫలభరితంబగు
ప్రాను గూలద్రోచు మత్తగజము
పోల్కి వివిధ రత్నభూషణ భూషితుం
డైన సూతుగూల్చె ననిలసుతుడు —విరాటపర్వం

ఉపమాది అలంకారములందును తిక్కన జాతీయాలు బహుచక్కగా చొప్పించి సహజసుందరంగా భావానికి శోభగూర్చాడు మరో ఉదాహరణం చూడండి.

కడు బెట్టిదంబగు గాలిచేగూలిన మహనీయ సాలభూరుహము పోల్కి
ప్రబలకిరాత మార్గణముల ద్రెళ్ళిన రాజిత వన్యవారణము మాడ్కి
గల్పాంత వాయుసఖ స్ఫురణంబున నివిరిపోయిన మహార్ణవము కరణి
గాల పర్యయమున దూలి మేదినిమీదబడిన పూర్ణేందు బింబంబుపగిది

ఇది కర్ణపర్వంలో దుర్యోధనుని పోల్చిన విధం - కృతవర్మాశ్వత్థామలు దుర్యోధనుని కడకేగినపుడు - దుర్యోధనుని దీనస్థితి పోల్చిన విధమిది. తిక్కన చేసిన రూపకాలంకార వర్ణనమునకొక చక్కని ఉదాహరణ చూడండి.

ధర్మజుండు ధర్మతరు, వర్జునుడు ఘన
స్కంధ, మనిల సుతుడుశాఖ, కవలు
పుష్పఫలము, లేను భూసురులును వేద
ములు, దదీయమైన మూలచయము

ఉద్యోగపర్వమున సంజయుని రాయబార సందర్భమున శ్రీకృష్ణుడు పాండవుల గురించి అలంకార శోభితంగా పల్కిన పలుకులివి.

తిక్కనచేసిన ఉత్ప్రేక్షాలంకార వర్ణనకొక ఉదాహరణ—

ద్రోవది బంధురంబయిన క్రొమ్ముడిగ్రమ్మన విచ్చి వెండ్రుకల్
దావల చేతబూని యసితచ్ఛవి బొల్చు మహాభుజంగమో
నా విలసిల్లి....

ఉద్యోగపర్వమున శ్రీకృష్ణభగవానుడు రాయబారమునకేగు సందర్భంలో ద్రౌపది తనకు జరిగిన అవమానంతో పగబట్టిన "మహాభుజంగమో" యన్నట్లు "త్రోకత్రొక్కిన పాము"లా శ్రీకృష్ణుని ముందు తన అక్కసును కోపాన్ని మనోవేదనను వెళ్ళగక్కిన సన్నివేశమిది.

తిక్కనవలె అభినవతిక్కన గూడా అర్థానికి సహజత్వానికి-భావ వ్యక్తీకరణకు 'ప్రాధాన్యత' నిచ్చినవాడు. కనుక ప్రబంధ కవులు చేసిన 'అలంకారశోభిత' వర్ణనలు తెనుగులెంక చేయలేదు. అయినా అటనట ఉపమాది అలంకారాలు సహజసిద్ధంగా వచ్చి చేరి భావవ్యక్తీకరణకు అందంగా దోహదపడ్డాయి. తుమ్మలవారి ఉపమానాలంకారానికి ఉదాహరణలు.

(1) పీల్చుచున్నవారు పేదల రక్తంబు
తీయతీయ కొండ తేనెవోలె (ధర్మజ్యోతి)

(2) ఆడబో దీర్థమే యెదురైన యట్టు
లడుగవచ్చిన కథ సెప్పితయ్య నీవ. (ధర్మజ్యోతి)

తుమ్మలవారి ఉత్ప్రేక్షాలంకారంనకు ఒక ఉదాహరణం.

కాలెడిపొట్టతో విరతిగానని చింతలతో విశీర్ణమై
సోలెడిమేనితో బడుగుజూపులతో నిజరక్తమాంసకం
కాళము లర్థమత్తులకు గానిచటన్ బలివెట్టి రెవ్వరా
మాలలు మాదిగల్ గగనమంటప మెక్కిరె యిట్లు చుక్కలై
(పఱిగపంట)

అట్టడుగు సమాజంలో కాలేపొట్టతో ధనవంతులకు రక్తమాంసాలు బలివెట్టి విగత జీవులగు అస్పృశ్యుల్ని ఆకాశమందు వెలిగేతారకలుగా 'ఉత్ప్రేక్ష' పూర్వకంగా అభివర్ణించాడు కవి.

తుమ్మలవారి 'రూపకాలంకార వర్ణన చూడండి.

మేనురథమాత్మ రథికుండు ధీ నియంత
యింద్రియములు తురంగము, లెడదపగ్గ
మెవ్వడిద్దాని వీలువాలెరిగిపట్టు
నతడు దవ్వగు సంసరణార్తి హతిక —సందేశసప్తశతి

శరీరం రథంగా, ఆత్మరథికుడిగా యింద్రియాలు గుర్రాలుగా బుద్ధినిర్దేశకుడిగా హృదయం పగ్గంగా 'రూపకాలంకారం'తో వర్ణన చేసాడు శ్రీ తుమ్మల.

'తిక్కన్న'గారు ఉత్తర రామాయణాన్ని నిర్వచనంగారాసినాడు మహాభారతం - గద్యపద్యాత్మక కావ్యంగారాసాడు. ఒక్కొక్కచోట గద్యం చాలా పెద్దగా వుండడంగూడా కద్దు తిక్కనగారి వచనానికి ఉదాహరణ.

కురుపాండవుల పదునెనిమిదవ నాటి యుద్ధ ప్రారంభఘట్టం-
వచనం :- ఇవ్విధంబున బోరు ఘోరంబై చెల్లుచుండ నుల్లసిత విక్రమ విజృంభితులగు భీమపార్థులు నలిరేగి నారాచప్రముఖ నానావిశిఖంబుల మసమొన గప్పిక్రొత్తించ నది బెగడొంది మగిడిన నమ్మేటి మగలుబ్బి పౌండ్ర దేవదత్తంబుల నొత్తుటయు దృష్టద్యుమ్నుండును శిఖండియు గౌంతేయాగ్రజు మున్నిడికొని తఱుమ దోడన కవలును గడంగిరట్లాటోపదీపితులైన పాండవేయుల యురవడికి నోటఱి నీబలంబు హాహాకారంబులతో బలుదెసల బఱవందొడంగినం గనుంగొని శల్యుండు సారథికిట్లనియె. (శల్యపర్వం)

ఇక తెనుగులెంక కవిత్వ విషయంలో గూడా ఆయన వెల యించిన ఆత్మకథ - మహాత్మకథలు గద్యపద్యాత్మకములు. అటనట తెనుగులెంకయు దీర్ఘవచనాలు రాసిన సన్నివేశాలున్నవి. తెనుగు లెంక గద్యంగూడా తిక్కన గద్యంవలె వుంటుందని కాటూరివారు పేర్కొన్నారు. తిక్కన వచనానికి మచ్చునకొకటి— అమృతసర్‌లో డయ్యరు గావించిన దురంతాల పర్యంతం, అమృత సరమున కాంగ్రెస్ సభలు జరిగిన ఘట్టం గాంధీజీ వివరించినది !

వచనం :- పూజనీయుండగు మదనమోహను కుఱంగట నాటి రాజకీయ పరస్థితులం దడపితి. నగ్నజుంబలె నగ్గఱువ నాకెల్ల వర్గంబులవారి తలపోత లెఱుకువచేసె మహాసభంబోడము సంస్క రణ చర్చం బొలువడయం జెల్లునని యేనప్పుడూహించితి. బొంచా లమున బ్రవర్తిల్లిన హింసం బరికించు దళమునందే నొకండనగుటం జేసియు ఖిలాఫత్తుం జక్కబఱుచునారటం బేచినవాడనై యుంటను దొరతనము వారితో నాడు నాకక్కఱయుండె. వెండియు మాంటేగు మనభూమికి జెల్మికాడనియు నతఁడు మనవారిం గికురింప డనియు నా నమ్మిక. యాలీసోదరుల త్తఱి బంధవిముక్తులగుటయు నొక మేలిమార్పని యేనెంచితి—

—ఆత్మకథ

"ఈయన లోకోక్తులు ఎత్తిచూపించుటకు బహుళములు. తెలుగు నుడికారమునందు చక్కనిపట్టు గల కవి." అని కవి సామ్రాట్ విశ్వనాథవారు తుమ్మలవారిని గురించి వారి కవిత్వం గురించి చెపుతూ— "తెలుగు మాటలునింపి రచన చేయుటయే తెనుగు కవితయొక్క రమ్యతయని వీరి నిష్కర్ష. వీరివలె తెనుగు బాసయందే యింత అధికారము గలవారు నేటి కవులలో లేరు" అంటూ— "తిక్కనగారు తెలుగుభాషకు జేసిన మహోపకారము

నీవు కీర్తించి యామార్గమున నడచినవాడవు. నీయొక్క తెలుగు బాసయందలి యభిమానము వేఱు. అది విలక్షణమైనది. అది నీ సర్వకావ్యములందున్నది. అదియే నిన్ను అభినవతిక్కనను జేసినది" అని ప్రస్తుతించారు. "తెలుగు నుడికారము సొంపు చొదరగారెఱిగినంతగా ఇతరులెఱురేమో!" అని కాటూరి వేంకటేశ్వరరావుగారు తెనుగులెంక నుడికారపు సొంపు గూర్చి ప్రస్తుతించారు. ఆచార్య నాగళ్ళగురుప్రసాదరావుగారు తెనుగు లెంక "ధారాళమయిన శయ్య" "మాధుర్యముతో కూడిన సౌలభ్యము - "తెనుగుదనము" గూర్చి ప్రశంసించారు. దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు వారి (తుమ్మల) కవిత్వమున "తిక్కన రసాభ్యుచితబంధము"న్నదని అభిభాషించారు. కొండూరు వీరరాఘవాచార్యులుగారు "ఈయన భాష అచ్చమగు జాను తెనుగు. ఈయన కవిత యలతియలతి జాను తెనుగు పలుకులతో గులుకుచుండును. మన కవి తెలుగుపొంకము బింకము జిగిబిగువులు సడలనీయక తేటగా కైతనుదిద్ది తెలుగుదేవికి గూర్చువాడై మెఱసెను" అని అభిభాషించారు. ప్రముఖ సాహితీవిమర్శకుడు గొర్రెపాటి వేంకటసుబ్బయ్య— "తిక్కనవలె ఆయన తెలుగు మీరాడు. అలతి అలతి తెలుగు మాటలను గూర్చి తెనుగునకు మాన్యత ఇచ్చాడు." అని చక్కగా చెప్పెను. "కమ్మని తావు జిమ్ము నుడికారపు తీరు వెలార్చు కైత నీసొమ్ము; తెలుంగుబాస గడుసుందనముం దులకించు కూర్పు నీసొమ్ము; మఱుంగు మాటలకు సొంపుల నింపెడి మంచినేర్పు నీసొమ్ము" అని మధునాపంతులవారు లెస్సగా చెప్పారు. "(శ్రీ) తుమ్మలవారి కవితలో పదునైన భావన పసగల తెనుగునుడి పట్టంకట్టుకున్నాయని" డా॥ సి. నారాయణరెడ్డి గారు ప్రశంసించారు. ఆత్మకథకు తిలకరచన నలది - తెనుగు లెంకకు 'అభినవతిక్కన బిరుదు ప్రదానం చేయడంలో ప్రముఖపాత్ర

వహించిన కట్టసుంచివారు "తిక్కనతో సజాతీయుడైన వాడు మన చోదర" అని అభిభాషించాడు !

తెలుగు నుడికారాలు - తెలుగు సామెతలు - జాతీయాలు తన కవిత్వమెల్లెడల తిక్కన నింపాడని చెప్పుకొన్నాం. మచ్చుకు కొన్ని 1) నీరు గవిసియున్న నిప్పుబోలె (విరాట) 2) అందని మ్రాకులకు గండ్లు కోయదలచుట (విరాట) 3) కానుకూడదనిన (విరాట) 4) కయ్యమునకు గాలు ద్రవ్వుకున్న (విరాట) 5) నివురుగవిసిన మెరయని నిప్పువోలె (విరాట) 6) కయ్యంబునకు గాలు ద్రువ్వుచుండె 7) అరచేత ప్రాణంబులిడి (ఉద్యోగ) 8) కంటికిన్ రెప్పయునోలె (ఉద్యోగ) 9) నూతికప్ప విధమున (ఉద్యోగ) 10) చెవులు కట్టి యాడించు (నిర్వచన) 11) శ్రీ రాము కాలొడ్డినవారి విధము (ఉద్యోగ) 12) నేల నాలుగు చెఱగుల 13) కుడుట గూడు వెట్టి కుడుచువారు 14) కన్నులు చల్లగ (నిర్వచన) ఇత్యాదులు.

ఇక తెనుగులెంక నుడికారాలు సామెతలు - జాతీయాలు చూడండి మచ్చునకు కొన్ని— 1) పుర్రెకొక్క బుద్ధిపుట్టు జిహ్వకునొక రుచిజనించు (ఆత్మ) 2) ఆవులించునంత బ్రేవులు లెక్కించు (ఆత్మ) 3) పొరపాటు మన్నింపుడని బతిమాలు (ఆత్మ) 4) పనికినత్తువు నీవు బాగుగా మాకు (ఆత్మ) 5) గోడమీది పిల్లివాటమ్ముగా (ఆత్మ) 6) నల్లేరుపై బండినడక (ఆత్మ) 7) కన్నుల గట్టినట్లు (ఆత్మ) 8) అసలు కంటెను వడ్డి ముద్దయిన యట్లు (మహాత్మ) 9) తానాయనినంతనె తందానాయనినట్లు (మహాత్మ) 10) పాముచావని యట్లు బడితె విఱుగనియట్లు (మహాత్మ) 11) సుఖమునుబుట్టి పుబ్బవాణగిన దన్నట్లు (మహాత్మ) 12) ఎల్లకాలము కష్టము తెలియదు నశేవు (మహాత్మ) 13) గోరుచుట్టు

మీద కోకటిపోటు (నా కథలు) 14) ఓనమాలురావు (నాకథలు) 15) కొంపదీయు (నా కథలు) 16) బుద్ధి గడ్డితిను (నా కథలు)

తిక్కనవాడిన అరుదైన అచ్చ తెలుగు మాటలు కొన్ని 1) చిడిముడిపడు 2) కూటువమూక 3) చిదురుపాలు 4) వెంబాటు 5) నెఅనాడుట 6) వడంగుపడు 7) వెనుంబడు 8) అగ్గలించు 9) తలపోరగించు 20) వెడపాటబాడు 11) నవయు 12) వెచ్చనూర్చు 13) వెగడు 14) చేడ్పడు-మొదలగునవి.

ఇక తెనుగులెంక వాడిన అరుదైన (ప్రచారంలో లేని) తెలుగుమాటలు— 1) అరిది (అశక్యము) 2) అసదు (అల్పము) 3] ఒఱపు [శోభ] 4] కమ్మతీడు [రైతు] 5] కఱ [మచ్చ] 6] చదురు [నేర్పు] 7] నెవ్వ [ఆపద - దిగులు] 8] పదడు [బూది] 9] మూదల [నిదర్శనము] 10] రేపాడి [ప్రాతః కాలము] 11] రొడ్డు [రోగము] 12] ప్రన్నన [మనోజ్ఞమైన] 13] గుడ్డము [చేను] 15] సోము [సుఖము] 16] నంజ [మాగాణి] 17] పుంజె [మెట్ట] 18] కలుచ [పాపం] మొదలైనవి—

తిక్కనామాత్యుని కావ్యాలు పరిశీలిస్తే- ఆయన అచ్చమైన తెలుగునుడులు - తెలుగు జాతీయాలు "జాస్తి"గా వాడిన మాట నిజమే అయినా, శివకవులైన - నన్నెచోడుడు - నాచన సోమనాథాదుల కావ్యాలలోని 'జాను తెనుగుతనం' తిక్కన కవితల్లో అక్కడక్కడ అంతగా కనిపించదని చెప్పడం సాహసమే అయినా ఉన్న సత్యాన్ని చెప్పక తప్పదు. ఆ సత్యాన్ని అందరూ అంగీకరించక తప్పదు! అచ్చమైన తెలుగుతో పాటు సంస్కృత భాషాప్రభావం

గూడా తిక్కనలో స్పష్టంగా కనిపిస్తుందని యింతకుముందు చెప్పు కున్నాం !

అలానే తెనుగులెంక కావ్యాలలో సంస్కృతపద గుంఫనాలు సంస్కృత దీర్ఘసమాసాలు చాల తక్కువని అచ్చ తెలుగు పదా లెక్కువనీ గూడా చెప్పుకున్నాం ఆత్మకథ - ఆత్మార్పణం- మహాత్మ కథ ధర్మజ్యోతి అమరజ్యోతి ఘటికపంట - రాష్ట్రగానం - ఉదయ గానం కావ్యాలలో భాషకాస్త 'బింకం పొంకం'గా వున్నా మిగిలిన కావ్యాలలో - ముఖ్యంగా ఎక్కట్లు సందేశసప్తశతి - తెలుగునీతి గీతాదర్శం - చక్కట్లు కావ్యాలలో భాష చాలా సరళంగా- సామాన్యుడికి సహితం అర్థమయ్యే విధంగా వుండని చెప్పవచ్చు. అంటే తిక్కన భావకంటే - తెలుగులెంక 'భాష' చాలా సరళ నన్న మాట. బహుశా తిక్కననాటి నుండి తెనుగులెంక నాటికి అంటే షుమారు ఆరేడు శతాబ్దాలకాలంలో తెలుగుభాషా పరి ణామక్రమాభివృద్ధి, భాషలోవచ్చిన 'మార్పు' అందుకు ప్రధాన కారణం కావచ్చు !

మరుగునపడి పోతున్న ఆనాటి 'అరుదైన' అచ్చ తెలుగు పదాలు యేరియేరి తన కవితల్లో పేర్చికూర్చి పొందుపరచడం వల్ల నేమో - ఏ కొద్దిమంది భాషాకోవిదులకు తప్ప, సామాన్య సాహితీ ప్రియుల హృదయాల్ని తిక్కన పద్యాలు కొన్ని - కేవలం కొన్ని మాత్రం ఆకట్టుకోలేవంటే సాహసమే అయినా అది నగ్నసత్యం; బహుశా అందువల్ల నేమో 'తిక్కన కవితలు కొన్నిట సరళమైన 'జాను తెనుగుదనం పాలుకాస్త తక్కువని చెప్పక తప్పదు. శ్రీ శ్రీ వంటి అభ్యుదయకవులు తిక్కన్న సాహిత్యాన్ని మెచ్చుకున్నా- విశ్వనాథనంటి ఉద్దండ కవిపండితుడు తిక్కన్న కవిత్వాన్ని అంతగా మెచ్చుకోలేదు !

ఇక తెనుగులెంకకు తిక్కనామాత్యుడంటే 'అమితమైన భక్తి ప్రపత్తులు. "జిగిసెడి మూల్గు తెల్గునకు జీవమునింపి సిలింపవాణి కిన్ సొగసులు దిద్ది" "బృహదంధ్ర భారతప్రగతి ఘటించి పుణ్య ములు పంచిన వేలుపు తిక్కయజ్వ నా మొగదలనిల్చి కావ్యపథముల్ సుగమమ్ములుగా నొనర్చుతన్" అన్న భక్తిభావం తెనుగులెంకది. "ఒక్క తిక్కన చాలడె యీ సకలాంధ్రమునకును జీవసంపద నొస గన్" అన్న విశ్వాసమున్నవాడు అభినవతిక్కన. తిక్కనంటే అంత 'వీరాభిమానం' భక్తిప్రపత్తులు కలవాడు కనుకనే - అందునా 'మాతృభాషాభిమానం' వుగ్గుబాలతో పుణికిపుచ్చుకున్నాడు కను కనే - తెనుగులెంక తిక్కన నడిచిన మార్గంలో నడిచి - మరుగున పడిపోతున్న అచ్చ తెలుగుపదాలు, పైగా యీనాడంతగా ప్రచా రంలోగాని వాడుకలోగాని లేని తిక్కన కాలంనాటి అంటే వందల సంవత్సరాలనాటి తిక్కనవాడి నటువంటి 'అరుదైన అచ్చమైన తెలుగుపదాలు తెనుగులెంక తన కవితల్లో అక్కడక్కడ చొప్పిం చాడు ! అందువల్లనేమో - ఏ కొద్దిమంది భాషాపండితుల్ని మినహాయిస్తే - సాహితీప్రియులైన జనసామాన్యుల్ని తెనుగులెంక "కొన్ని" పద్యాలు - కవితలు అంతగా ఆకట్టుకోలేక పోతున్నా యని చెప్పడం సాహసమే అయినా ఉన్న పచ్చి నిజాన్ని చెప్పక తప్పదు మరి ! ఈ కారణాలవల్లనేమో- అటు తిక్కన పద్యాలు కొన్ని యిటు అభినవతిక్కన పద్యాలు, కొన్ని, అక్కడక్కడ, నడక సాఫీగా సాగినట్లు అనిపించక, జనసామాన్య సాహితీప్రియుల్ని రంజింపజేయలేక పోతున్నాయి ! సాహితీవేత్తలు - భాషాపండి తులీ 'పచ్చినిజాన్ని' విశాలదృష్టితో - సహృదయతతో 'సావ ధానంగా' అవగాహన చేసుకొంటారని సవినయపూర్వకమైన మనవి! చల్లని హాయినిచ్చే వెన్నెల్ని ఆనందించక, చందమామలోని నల్లని మచ్చని గూర్చే ఆలోచించి నష్టౌతుందని - అరుదైన అచ్చ తెలుగు

పదాలు వాడి 'నడక' సాఫీసాగని ఆ "కొద్ది"గానున్న తిక్కన మరియు అభినవతిక్కనల పద్యాల్ని వుదాహరించడం లేదు! తెనుగులెంక వాడిన యిట్టి 'అరుదైన అచ్చ తెలుగుపదాలకు, ఆయాకావ్యాలచివర ఆయన 'అర్థాలు' రాసుకోవలసి వచ్చింది గదా! విచిత్రమేమంటే - తెలుగుభాషకు సమగ్రమైన నిఘంటువు లేక పోవడం తెలుగు సాహితీప్రియుల దురదృష్టం! లభ్యమౌతున్న ఆ కొద్ది నిఘంటువులలో గూడా తిక్కన, అభినవతిక్కనలు వాడిన కొన్ని పదాలకు అర్థాలు దొరకకపోవడం దురదృష్టకరం! ఇట్లని తిక్కన అభినవతిక్కనల కవిత్వాల్ని 'చిన్నచూపు' చూడడంకాదు! కేవలం కొన్ని పద్యాలు జనసామాన్యుల్ని అలరించడంలేదని వున్న మాటచెప్పడం మాత్రమే.

మంత్రిగావుంటూ రాజ్యభారం మోయడంలో రాజునకు తోడునీడగా వుంటూ - మహాభారతం తెనిగించడం మాటలు కాదు! మరుగున పడిపోతున్న అరుదైన 'అచ్చమైన' తెలుగు పదాల్ని అసలు కనుమరుగైపోకుండ - ఆనాడు తిక్కనగాని, యీనాడు అభినవతిక్కన గాని యేరియేరి వాటిని తమ కవితల్లో చొప్పించి భద్రపరిచి తెలుగుభాషకు ఎనలేనిసేవ చేసారన్న 'నగ్న సత్యాన్ని'గాని వారు భాషకుచేసిన మహోపకారాన్నిగాని - తెలుగు భాషాపండితులు గాని, సామాన్య తెలుగు సాహితీప్రియులుగాని మరువరాదు. ఈ రచయిత అంతకంటె యీ 'సత్యాన్ని' మరువ లేదు!

ఈ సందర్భంగా - ఆచార్య పింగళివారు "అర్థమునకు ముందు విన్నంతనే చెవికి ఇంపును, మనస్సునకు హాయి గొల్పెడి పద్యములు తిక్కన రచనలో చాలా అరుదుగా నుండును. క్వాచిత్కములైనవి కొన్ని ఉండవచ్చును. అవియైనను కేవలము అక్షర రమ్యత నాశించి వ్రాసిన పద్యములుగావు" అని స్పష్టంగా చెప్పిన మాటలు

గుర్తుకు తెచ్చుకోవడం అవసరం. అంటే పదాడంబరంతో తిక్కన్న రాసిన "అన్ని" పద్యాలు గంగాప్రవాహంలా - గలగల సాఫీగా సాగవని ఆచార్య పింగళివారన్నట్లు "తిక్కన" శైలి ప్రధానముగ "బుద్ధిగమ్యమనీ" దానినే ఆచార్యసుబ్రహ్మణ్యంగారన్నట్లు "అర్థగుణ ప్రధాన" మనీ తేలుతుంది! అయితే "తిక్కనగారి సన్నివేశ వర్ణనలును, మూర్తి వర్ణనలును, భావవర్ణనలును పరస్పర పోషక ములై రసోదయము కల్గించుచుండును" అనియు "శబ్దార్థాచితి, సంభాషణ కౌశలము, సజీవపాత్ర సృష్టి, నిశిత ప్రకృతి పరిశీలనము, తీక్ష్ణమనోనిదానము, అల్పాదోష్యతక మాతాయని" ఆచార్య పింగళి వారంటారు. అంటే పేలవమనుకొన్న, అనవసరమనుకొన్న ఘట్టాల్ని కుదించి, అవసరమనుకొన్న చోట్ల పెంచి మూలగాథకు భంగంరాకుండా - పాత్రల సంభాషణాచాతుర్యం ప్రదర్శించి ఔచిత్యానౌచిత్యములు పాటించి గుణదోషములనెంచి కథా సంవి ధానం పోషించి తిక్కనామాత్యుడు కావ్యశిల్పంతో కళాత్మకంగా మహాభారతంను ఆంధ్రీకరించాడని తేటతెల్లమౌతుంది. బహుశా పైని పేర్కొన్న అన్ని కారణాలవల్ల నేమో "తిక్కన పద్యరచనా పరాయణుడుకాదు కావ్యశిల్ప పరాయణుడు" అని ఆచార్య పింగళివారు తన "ఆంధ్ర సాహిత్య చరిత్రలో" స్పష్టంగా చెప్పాడు. అంటే కథను నడిపినంత రసవత్తరంగా తిక్కన పద్యం నడపలేదని భావన! దానికి ముఖ్యకారణం మనమింతకుముందు చెప్పుకొన్నట్లు అంతకుముందు కవులకు భిన్నంగా "పద్యాన్ని" 'అచ్చ తెనుగు' పదాలతో నింపాలన్న తీవ్రమైన కోరిక తపన తిక్కనామాత్యునికి వుండడమే అనిపిస్తుంది; "కొన్ని" పద్యాల విషయంలో!

అయితే అభినవతిక్కన విషయంలో గూడా యిది కొంతవరకు అన్వయించినా, మొత్తంమీద తెనుగులెంక పద్యం సరళంగా - భావ

బంధురంగా అర్థసౌందర్యంగా వుండి "శైలీ సౌకుమార్యంతో" ఒప్పారుతూ వుంటుందని మనమిదివరకు చెప్పుకున్నాం. బాపూజీ స్వీయచరిత్ర ఆత్మకథ మహాత్మకథ- మహాకావ్యాలలో ఆత్మార్పణం, ధర్మజ్యోతి లఘుకావ్యాలలో కావ్యశిల్పమున్నదని చెప్పవచ్చు. మొత్తంమీద తెనుగులెంక సాహిత్యంలో "కావ్యనిర్మాణశిల్పంకన్న పద్యరచనాశిల్పం" అధికమని నాకనిపిస్తుంది !

రాజాదరణతో - రాచకొలువులో మంత్రిగా - ఆస్థాన విద్వాంసుడుగా తిక్కన మహోన్నతస్థితిలో మహావైభవంగా జీవితం గడిపారని అనుకోవచ్చు కేవలం ప్రజాదరణతోనే - సన్నకారు రైతుబిడ్డగా - సామాన్య తెలుగు పండితుడిగా - నిరాడంబరంగా అతి సామాన్యజీవితం గడిపాడు తెనుగులెంక. ఆచార్య పింగళివారి అంచనా ప్రకారం తిక్కన 1205 - 10 మధ్య జన్మించి 1288 వరకు జీవించాడు. అంటే పదమూడవ (13 వ) శతాబ్ది (యుగ) కవి తిక్కన. అలానే 1901 లో జన్మించి 1990 వరకు జీవించిన తెనుగులెంక యిరవయ్యో (20 వ) శతాబ్ది (యుగ) కవిగా మనం చెప్పుకోవచ్చు. తిక్కన "సహస్రమాసజీవి" అయినట్లే తెనుగులెంక గూడా సహస్రాధికమాస జీవి. శ్రీ తుమ్మల 'సహస్రపూర్ణ చంద్రదర్శనోత్సవం చేసుకున్నాడు కూడా.

మహాభారతం - నిర్వచనోత్తర రామాయణం రెండు కావ్యాలలోని పద్యాలు (వచనాలుమినహాయించి) షుమారుపదిహేను వేలుంటాయని ఒక అంచనా. అలానే తెలుగులెంక రాసిన యిరువదియైదు కావ్యాలలోని పద్యాలు గూడా షుమారు పదిహేను వేలుంటాయని ఒక లెక్క.

తిక్కన వైదికధర్మానుసారం 'యజ్ఞయాగాదు' లొనరించి సోమయాజి అయ్యాడు. మరి తెనుగులెంక యే యజ్ఞాలూ - యే

యాగాలు చేయలేదు. వైదిక ధర్మశాస్త్రపరంగా 'యజ్ఞం'నకు ఉన్న అర్థం'లో కాక, "యజ్ఞమ"ంటే "శాస్త్రార్థం" లో (భగవద్గీత ననుసరించి కూడా) తీసుకుంటే - నిస్స్వార్థంగా సత్యనిష్ఠతో - త్యాగబుద్ధితో - పరహితంకోరి - లోకకల్యాణార్థం దీక్షతో చేసే ఎట్టి కార్యమైనా ఎట్టి యత్నమైనా "యజ్ఞం" క్రిందికే వస్తుంది. "జన్నమనిన బసులజంపుట కాదహిం /సాపరీతమైన సరణినోరుల/ కుపకరింపనలగు యోగము, కష్టించి తిండిదినెడి హక్కు తెచ్చుకొనుట" (ఎక్కట్లు) అని తుమ్మలవారే 'యజ్ఞ'మంటే ఏమిటో వివరించాడు. ఈ దృష్టితో చూస్తే - సత్యనిష్ఠాగరిష్ఠుడైన గాంధీజీని 'త్రికరణశుద్ధి'గా నమ్మి ఆయన అడుగుజాడల్లో - సత్య నిష్ఠతో - నిరాడంబరంగా నిస్స్వార్థబుద్ధితో (ధనార్జనాపేక్ష దృష్టి లేకుండా) పరహితం కోరి వైయక్తిక నైతిక జీవితం - విశ్వశాంతి - లోకకల్యాణం కోసం కవిత్వం వెలయించిన తుమ్మలవారు కూడా 'సోమయాజి' అని చెప్పుటలో సందేహించవలసిన అవసరం లేదు.

శివకేశవ భేధరహితమతైక దృష్టి తిక్కనది. వైష్ణవాన్ని - శైవాన్ని సమాదరించినవాడు. పరమతసహనం పరమత గౌరవం గల్గినవాడు తిక్కన. అలానే అభినవతిక్కనది 'మతాతీత' మానవతా దృష్టి గాంధీజీవలె "సత్యస్వరూప"మైన "ఈశ్వర దివ్యశక్తి"ని నమ్మినవాడు తెనుగులెంక పేదల్ని వేల్పులుగా సంభావించాడు శ్రీ తుమ్మల. కనుక తిక్కన అభినవతిక్కన యిద్దరూ - ఆస్తికులే లోకకల్యాణార్థం కలంపట్టిన వాళ్ళు. తిక్కన 'మంత్రిగా' ప్రజా రంజక పాలనలో రాజునకు సాయపడితే - తెనుగులెంక - రైతుగా పొలం పండించి పిల్లలకు పాఠంచెప్పి - పరులకు 'అన్నం'తోపాటు జ్ఞానభిక్ష పెట్టినవాడు.

ఆర్షవైదిక మార్గాన్ని అవలంబించి భారతీయ సంస్కృతికి తన సాహిత్యం ద్వారా తెలుగుభాషకు జీవంపోసినవాడు తిక్కన.

అలానే భారతీయ సంస్కృతికి ఆర్ష ధర్మానికి ఆలంబనమైన గాంధేయ సిద్ధాంతానికి తన సాహిత్యంద్వారా తెలుగుభాషలో జీవంపోసి జవం చేకూర్చినవాడు అభినవతిక్కన. హిందువులకు ఆరాధ్య దేవుడైన శ్రీకృష్ణభగవానుడి పాత్రకు సంస్కృత సాహిత్యంలో వ్యాసుడును, తెలుగు సాహిత్యంలో తిక్కనామాత్యుడును తీర్చిదిద్ది పరిపూర్ణత సంతరించినట్లుగానే యావత్ భారతీయులకు "మహాత్ము"డిగా "జాతిపిత"గా పూజనీయుడైన గాంధిజీ పాత్రను తెలుగు సాహిత్యంలో తీర్చిదిద్ది పరిపూర్ణత - శాశ్వతస్థానం కల్పించాడు తెలుగు లెంక. కవిగా తిక్కన తన సాహిత్యం ద్వారా తెలుగుభాషాభి వృద్ధికి ఎంతో కృషిచేశాడు. అలానే తెనుగులెంక తన సాహిత్యం ద్వారా మరుగునపడిపోతున్న అచ్చమైన తెలుగు నుడికారాలను తెలుగు పదాలను యేరియేరి తన కవితల్లో భద్రంగా పొందుపరచ టానికి యెంతగానో శ్రమపడ్డాడు.

తిక్కన తన రెండు మహాకావ్యాలు - నిర్వచనోత్తర రామా యణ - మహాభారత కావ్యాలలో మొత్తంమీద పద్యగద్యాలు మొత్తం దాదాపు 18 [పద్దెనిమిది] వేలు రాసాడని ఓ లెక్క. అలానే అభినవతిక్కన రాసిన అన్ని కావ్యాలలోని మొత్తం పద్యాలు గద్యాలు కలిపి షుమారు 20 [యిరవై) వేలు రాసినట్లు అంచనా. అయితే తాను కవిత్వం రాయడం మొదలుపెట్టిన తొలిరోజుల్లో రాసిన కవితలు - రచనలు లభించడంలేదు కనుక- యీనాడు లభ్యమయ్యేవి మొత్తం పదిహేను వేలుంటాయని ఒక అంచనా.

ఆచార్య పింగళివారు తిక్కనను 'సంసారయోగి'గా బ్రహ్మ జ్ఞానిగా కొనియాడాడు. గాంధీజీ భార్యబిడ్డలున్నా బ్రహ్మచర్య వ్రతమవలంబించినట్లు స్వయంగా చెప్పుకున్నాడు. అందుకే

జాషువా గాంధీజీని 'భార్యబిడ్డలున్న ప్రత్యక్ష దైవంబు' అని ప్రశంసించాడు. బాపూజీని 'త్రికరణశుద్ధి'గా అనుసరించిన అభినవ తిక్కన గూడా 'సంసారయోగి' అని చెప్పవచ్చు. అద్వైతధర్మం, వేదవేదాంగాలు జీర్ణించుకొని 'బ్రహ్మజ్ఞాని' అయినాడు తిక్కన. వేదాలు - ఉపనిషత్తులు - పూర్తిగా అధ్యయనం చేయకపోయినా "ఆత్మవత్ సర్వభూతాని" అన్న ఉపనిషత్ సూక్తినెఱిగి, "అఖిల భూతకోటియందాత్మ నీక్షించి, యఖిలజగము నాత్మయందుజూడ" "గలిగిన సత్యనిష్ఠాగరిష్ఠుడైన తెనుగులెంక 'బ్రహ్మజ్ఞాని' కాకపోవచ్చునుగాని, "సత్యజ్ఞాని" శాంతి సత్యాహింసా మార్గాటుడని చెప్పచ్చు. తిక్కన 'ఉభయకవిమిత్రుడు'! కవిబ్రహ్మ! మరి అభినవతిక్కన 'కళాప్రపూర్ణుడు! సర్వకవిమిత్రుడు సర్వోదయ గాంధీ కవిబ్రహ్మ తిక్కన సకలమత హితైషి అయినట్లుగానే తెనుగు లెంక పరమతసహనం గౌరవం గల్గినవాడు. తిక్కన రాజ్యంలో శాంతిసుఖాలుకోరి ప్రజారంజకుడైనట్లుగానే అభినవతిక్కన కులమత వర్గరహిత సమసమాజం—— విశ్వమానవ కల్యాణం ఆకాంక్షించి కవిత్వం రాసినవాడు——

చివరగా - హరిహరనాథుని దర్శనం చేసుకొన్న ధన్యజీవి తిక్కన హరిహరనాథుడు తిక్కనకు స్వప్నంలో కన్పించి "వైదిక మార్గనిష్ఠగలిగి భేదములేని భక్తిభావముతో పంచమవేదమగు భారతము తెనుగుబాస నిర్మించుట పురుషార్థతరుపక్వ ఫలమనియు, నట్టి కృతిపతిత్వమర్థించి వచ్చితి దిక్కశర్మ" అని పరమేశ్వరుడు పలుకుటచేత తిక్కన భారతాంధ్రీకరణ మొనర్చి ఆమ్మహాకావ్యాన్ని ఆ హరిహరనాథునకే అంకితమొనర్చినాడు.

ఇక తెనుగులెంకఒకానొక సందర్భంలో సరస్వతీదేవినిదర్శనంచేసుకొన్నాడు. భాగవత రచనలో పోతన "అలవైకుంఠపురమ్ములో

నగరిలో..." అన్న పద్యం పూర్తిచేయలేకపోతే - శ్రీరామ చంద్రుడే మారువేషంలో వచ్చి ఆ పద్యాన్ని పూరించాడు. అలానే పిల్లలమర్రిపినవీరభద్రుడి విషయంలో కూడా సరస్వతీదేవి స్వయంగా వచ్చి కావ్యాన్ని పూరించింది. తెల్లవారకముందే! అలానే తుమ్మలవారు ఒక సందర్భంలో రాయతలపెట్టిన పద్యం ఎంతకీ పూర్తిచేయలేకపోయాడు. అప్పుడు ఆయన సరస్వతిని "భారతీ! నన్నేల బాధించెదిట్లు / నా దోసమున్నచో నన్ను మన్నించి / పాలింపవే బిడ్డపగిదినోయమ్మ" అని మరీమరీ వేడుకొని అలసిసొలసి ఆదమరచి నిద్రపోయాడు. ఆయన కలలో సరస్వతి రేఖామాత్రంగా కనిపించింది—" నిదురలో ఘల్ ఘలా నినదంబు రేగె / దేదీప్యమానమా తేజమ్ము విరిసె / భాసిల్లె నాల్గవ పాదమాజిగిని / బెదరి కన్విచ్చితి బిడప దేవ్కోటి / దర్శించి తర్కించి తత్త్వమ్ముగంటి జాగిల్లితిని సరస్వతి పీఠమునకు" అని అంటూ తాను స్వప్నంలో వాగ్దేవి దివ్యదర్శనం చేసుకోవడం తన పద్యం పూర్తికావడం గురించి తెనుగులెంక ("నా కథలు") చెప్పుకొన్నాడు.

ఆరుద్రగారి ఉద్దేశం ప్రకారం 'ఆనందం' కోసం రాసాడు తిక్కన మహాభారతం. పింగళివారి దృష్టిలో 'సర్వధర్మమార్గాద్వైత' స్థితిభావంతో మహాభారతాన్ని తెనిగించాడు తిక్కన సోమయాజి. "సత్యసంశోధనాసక్తి సందడింప బాపూజీ నిర్వహించిన బ్రదుకు చందము"ను "గుణగరిష్ఠుల దేశభక్తుల చరిత్ర చెప్పుట జగద్ధితంబైన చేతగాదె" అన్న విశ్వాసంతో ఆత్మకథ-మహాత్మకథలు రాసాడు తెనుగులెంక "నైతిక పునరుజ్జీవన జాతీయ వికాస విశ్వజనతా శ్రేయస్సు" ధ్యేయంగా పెట్టుకొని కవిత్వం రాసాడు శ్రీ తుమ్మల.

వ్యాసకృత సంస్కృత భారతాన్ని ఆంధ్రీకరించినా- దాయాదులైన కురుపాండవుల మధ్య "రాజ్యాధికారం" కోసం ద్వాపర యుగంలో శ్రీకృష్ణసారథ్యంలో సాగిన మహాభారత 'కురుక్షేత్ర' సంగ్రామాన్ని - 'ధర్మవీర స ప్రధానంగా - సకలజనుల హితంకోరి సర్వమత సమాదరణ దృష్టితో తిక్కనసోమయాజి ఆంధ్రమహాభారతాన్ని దాదాపు స్వతంత్రకావ్యంగా తీర్చిదిద్దాడు. ఇక మనకవి యీయుగంలో యీయిరవయ్యో శతాబ్ది పూర్వార్థంలో - బ్రిటీషు పాలకుల పరాయిపెత్తనానికి వ్యతిరేకంగా - అటు రవి అస్తమించని ఆంగ్లేయ ప్రభువులు యిటు యావత్ భారతప్రజల మధ్య మహాత్మాగాంధి నాయకత్మాన సాగిన జాతీయోద్యమ స్వాతంత్ర్య శాంతి సంగ్రామ చరిత్రను "ధర్మవీరరస ప్రధానంగా" - గాంధేయ సర్వోదయ - సత్యాహింస శాంతియుత సకలజన సుఖజీవనం కోసం వ్యక్తి 'సత్ప్రవర్తన' కోసం - భారతజాతి సంస్కృతి స్వాతంత్ర్య పరిరక్షణకోసం - ఆంధ్రుల వైభవప్రాభవాల పునరుజ్జీవనం కోసం - అభినవతిక్కన ఆత్మకథ, మహాత్మకథ - రాష్ట్రగానం ఉదయగానం ఎక్కట్లు - సందేశసప్తశతి వంటి కావ్యాలు - తదితర కావ్యాలు వెలయించాడు.

ఇలా యిన్నివిధాల యింతగాచేసిన 'చర్చ' వలన తేలిందేమిటంటే 'తెనుగులెంక' శ్రీ తుమ్మల "అభినవతిక్కన" బిరుదమునకు అన్నివిధాల తగినవాడని - అందులో 'అర్హత' ఔచిత్యం ఉన్నదని వచ్చిన - యిచ్చిన అభినవతిక్కన బిరుదు శ్రీ తుమ్మల సార్థక పరచినాడని కట్టమంచివారే కాదు విద్వత్కవి పండితులైన విశ్వనాథ - కాటూరువంటి వారు సమర్థించారు.

ఇంతకీ - తుమ్మలవారు 1960 లో నరసరావుపేటలో ఆయన శిష్యుడు శ్రీ తోటకూరి వేంకటేశ్వరరావు ఏర్పాటు

చేసిన శ్రీ కాటూరి వేంకటేశ్వరరావుగారి అధ్యక్షత జరిగిన ఒక విద్వత్ సాహితీ సభలో తెనుగులెంక - "అభినవతిక్కన" యను పట్టమునకు / జాలనిది నాకు సైరింపరాని / వేగాయె మీా ముందు విడిచెదన్ దీసి" అని "తెనుగులెంక"గా సాహితీ కృషిచేయడం తన 'అభిమతమని' తెనుగులెంక అనిపించుకోవడమే తనకిష్టమని సభాముఖంగా ప్రకటించాడు. అప్పటి నుండి అంటే 1960 నుండి 1990 వరకు - ఆయన తన 30 ఏండ్ల సాహితీ జీవితంలో 'అభినవతిక్కన' బిరుదం మరలా వాడలేదు. "తెనుగులెంక" అనే పదం, బిరుదు కాని బిరుదు తనకుతాను పెట్టుకొన్నపదమే ఆయన తన కావ్యాలలో ఉపయోగించాడు. ఎంతకాదన్నా ఉద్దండ కవిపండితులు ఇచ్చిన 'అభినవతిక్కన' బిరుదం నకు శ్రీ తుమ్మల 'అర్హుడు' ఆ బిరుదాన్ని సార్థకపరిచాడన్నది నిర్వివాదం !



తెలుగన్నను దిక్కన్నది
తెలు, గల వేమన్న కవిది తెలుగప్పటియున్
తెలుగా వెంకన్నది, యిది
వలచి తపంబాచరించు వాడనయేనున్

తిక్కన్నకు జిన్నయ్యకు
మ్రొక్కెద, నాపాలి తెనుగుముద్రకు వీరే
దిక్కై్కరి, యెంత పలుకుం
జక్కన మెఱయించె సూరిశాస్త్రమునందున్

## తుమ్మలవారి కవితా కమనీయత

మాటమాటయు వాగ్దేవి కోటగాగ
గోటలోదావు లెగజిమ్ము తోటగాగ
తోట నురలెడి లెగజిమ్ము తేటగాగ
దీర్చినదికైత మెఱుగుదిద్దినది కైత ! —"నేను"

"అభినవ తిక్కన"గా లబ్ధప్రతిష్ఠుడైన తెనుగులెంక కవిత్వం అలతి అలది తెలుగుపదాలతో - తేటతేనెలూరే తెలుగునుడికారాల సొంపుతో - సామెతలు - జాతీయాలతో - లోకోక్తులతో ఒప్పారుతూవుంటుంది ! సరళమైన భాషలో - శయ్యాసౌకుమార్యం-భావమాధుర్యం చెట్టాపట్టాలు పట్టుకొని నాట్యమాడుతున్నట్లు శ్రీ తుమ్మల కవిత్వం పఠితుల్ని అలరిస్తుంది. ఆనందంలో ముంచెత్తుంది ! అందుకే ఆయన "తెనుగు తేనెవాగు తెనుగమృతాసార సారధార నాకు సంఘటిల్లు"నని చెప్పుకొన్నాడు ! "పద్యంబు సర్వకవితల / కాద్యంబై గానబద్ధమై శ్రుతినిలయమై / హృద్యంబై నియతం బన / వద్యంబై లెస్సతోడువడు ధారణకున్"[2] అని చెప్పాడు. గేయం - పాట - వచన కవిత - పద్యం - యిన్ని రకాలుగా సాగిన / సాగుతున్న 'ఆధునిక కవితారీతుల్లో - తెనుగు లెంక "పద్యాన్ని" ఎన్నుకున్నాడు. ప్రాచీన సాహిత్యంలో కవితా వస్తువులైన - భక్తి - శృంగారాన్ని త్రోసిరాజని - ఆధునిక సాహిత్యంలో - చారిత్రిక జాతీయ సామాజిక - సమస్యల మీద 'పద్య' ఛందస్సులో కావ్యాలు రాస్తున్న కవుల్ని "నవ్యసంప్రదాయ" కవులని ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యంగారు పేర్కొ-

---

2. ఆత్మకథ

న్నారు. తెనుగుతెంక గూడా 'నవ్యసంప్రదాయ కవు'లలో ఒకరని మనం మరొకచోట చర్చించుకొన్నాం. ఆయన రాసిన కావ్యాలు కవితలు జాతీయ - చారిత్రక - సామాజిక సమస్యలమీదనే కనుక.

తుమ్మలవారు తమ కావ్యాలలో తిక్కనామాత్యునికి వలె ఛందోప్రక్రియలైన ఆటవెలది, తేటగీతి, సీసం, కందం' ద్విపద, మంజరి, మధ్యాక్కరలే అధికభాగం ఉపయోగించారు. ఉత్పల చంపకమాలలు, మత్తేభశార్దూలవిక్రీడిత ఛందస్సులలో గూడా చాలా పద్యాలు రాసారు కాని దేశీఛందోప్రక్రియలతో పోలిస్తే వృత్త ఛందస్సు తక్కువ వాడారు.

ఆత్మకథ, ఆత్మార్పణం, ధర్మజ్యోతి, రాష్ట్రగానం, పఱిగ పంట, సమదర్శి శబల అమరజ్యోతి కావ్యాలలో "శబ్దార్థాలు" సమతూకంతో "శయ్యాసౌకుమార్య"బింకంతో భావబంధురంగా ఒప్పారుతూవుంటాయి. ముఖ్యంగా ఆత్మకథ ఆత్మార్పణం-రాష్ట్ర గానం కావ్యాలు'ప్రబంధ' శైలిలో సాగాయి. పద్యాల నడక, పదాల పొందిక, 'బిగువు'గా హృద్యంగమంగా వుంటాయి. రాష్ట్రగానం లోని సీసపద్యాలు, సంక్రాంతి సీసపద్యాలు (పఱిగపంట) కర్షకుడి మీది సీసపద్యాలు, చాలా గొప్పవి. చదువుతూవుంటే - ఊయే లలో ఊగుతూ తూగుతూ 'ఆనంద' డోలల్లో తేలినట్లుంటుంది. రాష్ట్రగానం, ఉదయగానం, సమదర్శి, శబల, పఱిగపంట, పైరపంట కావ్యాలలోని వృత్తపద్యాలు చిత్తాన్ని హత్తుకుపోతాయి ! చదువు తూవుంటే మైమరచి మత్తెక్కి మరో ఆనందలోకాల్లో విహరించు చున్నట్లు తోస్తుంది - ఆ వృత్తాల శైలీవిన్యాసం, వాటిల్లోని మధురభావ సంపన్నత, భాషాపటిమ అటువంటివి. ఇక గీతాదర్శం, ఎక్కట్లు,సందేశసప్తశతి కావ్యాలలోని ఆటవెలది, తేటగీతులు, తేట తేనియలూరు తీయతీయని తెలుగుమాటలతో, అలతి అలతి లలిత

లలిత తెలుగుపదాలతో శైలీసౌకుమార్యంతో - మధుర భావ బంధురంగా పాఠకుల హృదయాల్ని ఆకట్టుకొంటాయి. ఆనంద పారవశ్యంలో ముంచెత్తుతాయి.

తుమ్మలవారు మొట్టమొదట రాసిన పౌరాణిక లఘు కావ్యాలు, శతకాదులు కలుపుకొని, మొత్తం ఆయన రాసిన కావ్యాలు మూడుపదులు దాటుతాయి. అలానే మొత్తంమీద ఆయన రాసిన పద్యాలు షుమారు యిరవైవేలు (20) వుంటాయని ఒక అంచనా. లభ్యంకాని తొలినాటి పౌరాణిక శతకాది కావ్యాలలోని పద్యాలు తీసివేస్తే లభ్యమౌతున్న కావ్యాలలోని పద్యాలు మొత్తం పదిహేనువేలుంటాయి! అందులో ఆత్మకథ మహాత్మకథల్లోని పద్యాలే షుమారు పదియు రెండువేలుంటాయని లెక్క!

మొత్తంమీద తుమ్మలవారు, మొదట రాసిన పౌరాణిక రచనలు కలుపుకొని, ఆయనరాసిన మూడుపదులుపైగా కావ్యాల్ని యీ క్రింది విధంగా విభజింపవచ్చు. 1) గాంధేయ - జాతీయ సంబంధిత రచనలు— (i) ఆత్మకథ (ii) మహాత్మకథ (iii) గాంధీ గానం (iv) అమరజ్యోతి (v) సర్వోదయగానం.

2) రాష్ట్రోద్యమ సంబంధిత రచనలు (i) రాష్ట్రగానం (ii) ఉదయగానం 3) ఐతిహాసిక సంబంధిత రచనలు (i) ఆత్మార్పణం. 4) ఆధ్యాత్మిక సంబంధిత రచనలు (i) గీతాదర్శం (ii) హనుమాన్‌చాలీసా (iii) రామశతకం (iv) రామలింగేశ్వర శతకం. 5) నీతిప్రబోధకాలు (i) తెనుగునీతి (భర్తృహరి నీతిచంద్రిక) (ii) ఎకట్లు (iii) చకట్లు (iv) సందేశ సప్తశతి (పీటిల్లో వ్యక్తి నడవడికకు సంబంధించిన - సామాజిక సమస్యలమీాద చేసిన ప్రబోధలున్నాయి) 6) ఖండకావ్యాలు—

(i) పఱిగపంట (ii) శబల (iii) సైరపంట (iv) సమదర్శి (v) కదంబకైత (iv) దివ్యజ్యోతి— (యీ ఖండకావ్యాలలో సంక్రాంతి, కర్షకుడు, నాయక, మిత్రస్మృతులు - జాతీయనాయక మిత్ర ప్రశంసలు ప్రాచీన - ఆధునిక కవిపండితుల ప్రశంసలు చారిత్రక ప్రసిద్ధికన్న స్థలాల పురుషులకు సంబంధించిన కవితలు) 7) తుమ్మలవారి స్వీయ జీవిత సంబంధిత రచనలు (i) నాకథలు (ii) ను (iii) ధర్మజ్యోతి (తండ్రి నారయ సత్యనిరతి తెలుపు గాథ)

పోతే - ఆత్మార్పణం - ధర్మజ్యోతి - ఆత్మకథ - మహాత్మకథ - గాంధీగానం - కథాకావ్యాలుకాగా - ఖండకావ్యాలలో కూడా కథా (సన్నివేశ లేదా సంఘటనా) కవితా ఖండికలున్నాయి. ముఖ్యంగా 'నా కథలు' లోని దాదాపు అన్ని కవితాఖండికలు - అలానే సర్వోదయగానంలోని "పవిత్ర సన్నివేశాలు" కథాకవితా ఖండికలే! ఇక "పఱిగపంట"లోని ఆదర్శవీరుడు - గురుదక్షిణ - ఉద్రేకము — వీరధర్మము పాదధూళి— సేవాధర్మము, కృతమెఱుక, "శబల" లోని కర్ణుడు — నాకథ.-సీత, "సైరపంట"లోని ఆ మంచిరోజులు చిక్రోడపంచదశి, "కదంబకైత లోని ఆశ్రమ కన్యల పెండ్లి, గృహస్థధర్మం నిరాశ (దివ్యజ్యోతి, యివన్నీ కథా కవితాఖండికలే!

తుమ్మలవారి సాహిత్యం పరిశీలించినచో - అందు "భక్తి-శృంగార" రసాలు దాదాపు లేవనే చెప్పవచ్చు ఇరవయ్యో దశకంలో రాసిన రాఘవశతకం - రామలింగేశ్వర శతకం. ఆది శంకరాచార్య విరచిత 'లక్ష్మీనృసింహస్తోత్రం, భజగోవిందం అనువాదకవితలు - దరిమిలా తెనిగించిన గీతాదర్శము (భగవద్గీత) హనుమాన్ చాలీసా మొదలగునవి అధ్యాత్మికతకు సంబంధించినవి.

శృంగారరస ప్రధానకవితలు అసలు రాయనేలేదు. అలానే "అలంకారాలు" కూడా లేవనే చెప్పొచ్చు. అరుదుగా 'ఉపమా' నాలంకారాన్ని అటనట అర్థంతర న్యాసాలంకారాన్ని - రూప కాలంకారాన్ని వాడాడు.

ఆయన సాహిత్యం మొత్తం - జాతీయ సామాజిక సమస్యల మీద, వ్యక్తి నైతిక నడవడిమీద వ్రాసినవి. గాంధేయ సిద్ధాం తానికి - గాంధీజీ వ్యక్తిత్వానికి - సర్వోదయ సిద్ధాంతానికి తుమ్మలవారు అధిక ప్రాధాన్యత నిచ్చాడు. అలానే సామాజిక రుగ్మతలు - కులమత వర్గ విభేదాలు - వైషమ్యాలు ఆయన సున్ని తంగా - కరాఖండిగా ఖండించాడు. శ్రీ తుమ్మల వారిచ్చిన సందే శాలు హెచ్చరికలు, చేసిన ప్రబోధాలు, యిచ్చిన సలహాలు - గమ నిస్తే మనకాయన ఉత్తమాదర్శ "గురువు" (ఉత్తమోపధ్యాయుడు- బజ్జలమేల్బంతి)గా సాక్షాత్కరిస్తాడు.

అలానే తెనుగులెంక స్పృజించని సమకాలీన సమస్యలు లేవంటే ఏమాత్రం అతిశయోక్తి కాదు. తెనుగులెంక రాసినన్ని "సందేశాత్మక" ప్రబోధాత్మక కవితలు మరే ఆధునిక నవ్యసంప్ర దాయకవి రాయలేదు ! అలానే చరిత్ర ప్రసిద్ధిగాంచిన పురుషులు రాజకీయ నాయకులు, అగ్రశ్రేణికవులు, సామాన్యులలో "అసా మాన్య" నాయకులు - మిత్రులు గురించి రాసినన్ని "ప్రశంసా" కవితలు స్మృతికవితలు మరొక ఆధునికకవి రాయలేదంటే అందులో ఆవగింజంత అతిశయోక్తిలేదు. అయితే యీకోవలోనికి మహాకవి జాషువా, కరుణశ్రీ జ్ఞానానందకవి వస్తారు.

ఇక తుమ్మలవారి భావం - భాష - పద్యాం నడకగురించి- అంటే శయ్యాసౌకుమార్యం భావమాధుర్యం - పదలాలిత్యం- ందర శైలీవిన్యాసం గురించి - తుమ్మలవారి సమకాలీన అగ్రశ్రేణి

కవిపండిత సాహితీ విమర్శకులు బహుతెరంగుల బహుధా ప్రశంసించారు. ఆయా విషయచర్చల్లో తత్సంబదిత కావ్యప్రస్తావనల్లో ఆయా కవిపండిత విమర్శకుల అభిప్రాయాలు సందర్భానుసారంగా పేర్కొనడం జరిగింది. అయినా యీ అధ్యాయంలో తుమ్మల వారి కవితా కమనీయత గూర్చి ముచ్చటించుకొంటున్నాం కనుక ఇలా 'కమనీయతకు మూలకందాలైన తుమ్మలవారి భాష - భావం పద్యం నడక 'వైభవవైశిష్ట్యాల గూర్చి పెద్దలన్న మాటలు స్థూలంగా గుర్తుచేసుకొందాం.

"ఆత్మకథకు" తిలకరచన చేసిన శ్రీ కట్టమంచిగారు— భావమనర్గళముగ ప్రవహించు చందాన వ్రాయు మహనీయుడు... అర్థమునుబట్టి పదములు పదములలో లీనమైన రీతిని యతిప్రాసములు సునాయాసముగ నప్రయత్నముగ స్వచ్ఛందముగ వచ్చి చేరుచుండును" అని అభిభాషించాడు. "మహాత్మకథకు" అవతారిక రాసిన దువ్వూరి వేంకటరమణశాస్త్రిగారు... ఇది వీరరసోల్బణము-కరుణరసాల వాలము. ఈ చరిత్రమునందలి పెక్కు ఘట్టములు చదువరికి తన్మయతనొదవించు" నని లెస్సగా పలికాడు. "రాష్ట్రగానము" నకు పీఠికరాస్తూ శ్రీ విశ్వనాథవారు— "ఈయన లోకోక్తులు ఎత్తిచూపించుటకు బహుళములు. తెలుగు నుడికారమునందు చక్కని పట్టుగల కవి" అని ప్రశంసించాడు. "శబల"కు పీఠికరాసిన విశ్వనాథవారే— "చౌదగిగారు నిర్దుష్టమైన సుష్టు భాష వ్రాసెడి కొలదిమందిలో నొకడు.... వీరి కవితాశక్తి శబ్దమును విడిచి చిందులు త్రొక్కదు" అనియును ప్రశంసించాడు. "సర్వోదయగానము"నకు - రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు 'పీఠిక' రాస్తూ "శ్రీ సీతారామమూర్తిగారి కవిత స్వతంత్రమైన మాధుర్య సౌరభ్యములు వెదజల్లగలది. సౌలభ్యగాంభీర్యములు దాని

మూలద్రవ్యములు" అని మహాగొప్పగా చెప్పాడు. "పఱిగపంట" కు "పురస్కృతి" నిస్తూ శ్రీ కాటూరివారు "భావనలో భావావిష్కరణంలో వాక్యవిన్యాసంలో ఆంధ్రసాంప్రదాయం మూర్తీభవించి ఉంటుంది. పదబంధమేమి సాపుసంతనలేమి పూర్వమహాకవులను తలపిస్తూ పులుముడూ అన్వయక్లిష్టతా వెలితీ లేక సర్వాంగసుందరమైన చౌదరిగారి కవిత్వం చదువుతూవుంటే ప్రాణాలు లేచి వస్తవి" అంటూ— "తెలుగు నుడికారము సొంపు చౌదరిగారెఱిగినంతగా ఇతరులెఱుగరేమో. వేమన్నను తిక్కన్నను గూడా మఱపిస్తూ ఉంటవి వారి తెలుగుపోకడల"ని బహుధా ప్రశంసించాడు.

"ధర్మజ్యోతి"కి పీఠికరాస్తూ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు- "శ్రీ తుమ్మలవారు సంప్రదాయ కవితా సంరక్షణాభినివిష్టులు. కాని భావావేశమున వారు కడువడిగా వాడిగా వర్తింతురు. ఇందు కవితాధార దరులొరసికొని నిండారి పార్వాఱుచున్నద"ని అభిభాషించాడు. శ్రీ గొత్తిపాటి వేంకటసుబ్బయ్యగారు తుమ్మలవారి కవితారీతులపై "ఆయన ప్రాచీన కవులపోకడలన్నింటిని పుణికిపుచ్చుకొన్న విద్వత్కవి. తెలుగు పసందులు పలుకుటలో గడుసరి. తిక్కనవలె ఆయన తెలుగు మీరాడు - అలతి అలతి తెలుగు మాటలను గూర్చి తెలుగునకు మాన్యత ఇచ్చాడు" అని లెస్స పలికాడు.

"శ్రీ తుమ్మల సీతారామమూర్తిగారి రమణీయ కవితాధారశుద్ధికిని నిర్మలములైన భాషాభావములకును విశిష్టమైనద"ని శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు ప్రశంసించాడు. "శ్రీ సీతారామమూర్తిగారిలో రసభావపరిపుష్టమైన రచనా వైదగ్ధ్యము వలసినంతయున్నది. భాష నిరుష్టము. పలుకుబడి బింకమైన"దని శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు గొప్పగా

చెప్పాడు. శ్రీ తుమ్మల సీతారామమూర్తిగారి కమ్మని కవిత యందు పదునైన భావన, పసగల తెలుగునుడి పట్టంకట్టుకున్నాయి" అని డా॥ సి. నారాయణరెడ్డిగారు ప్రశంసించాడు.

"ఈయన భాష అచ్చమగు జాను తెనుగు ఈయన కవిత యలతి యలతి జాను తెనుగు పలుకులతో గులుకుచుండును. నూటికి నూఱుపాళ్ళు తెలుగువాడైన మనకవి తెలుగుపొంకము బింకము జిగిబిగువులు సడలనీయక తేటగా కైతను దిద్ది తెలుగుదేవికి కూర్చువాడై మెఱసెను. ఈయన కవిత అనర్గళమగు ధారతో గాంగ నిర్ఘరమువలె సాగుచుండును." అని శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులుగారు లెస్స ప్రస్తుతించాడు." నన్నయ ధారాశుద్ధి తిక్కన తెనుగుదనము, పోతన్న పదలాలిత్యము. శ్రీనాథుని శబ్దోదార గాంభీర్య సంపద, సూర్యనార్యుని భావనాభ్యుదయ ప్రజ్ఞ వీరి కవితలో మూర్తీభవించియున్నవి" అని కొప్పరపు మల్లికార్జున శతావధాని లెస్సగా అభిభాషించారు. "వారి కవిత్వమున తిక్కన రసాభ్యుచిత బంధము, శ్రీనాథుని శైలీసౌభాగ్యము, పెద్దన ప్రసాద గుణమును ఇరవుకొన్నవ"ని దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు అభినుతించాడు తుమ్మలవారి సాహిత్యాన్ని ఔపోసనం పట్టిన నాగళ్ళ గురుప్రసాదరావుగారు "ధారాళమయిన శయ్య, మాధుర్యముతో కూడిన సౌలభ్యము, తెనుగుదనము" యీమూడు ముఖ్యలక్షణము లున్నవని ప్రశంసించాడు. "ముగ్గురు సత్కవుల్ కరగిపోసిన భారత కావ్యసృష్టిలో నిగ్గును ఘంటికాగ్రమున" నిల్పినాడు చౌదరి తిక్కయజ్వ" యని మహాకవి జాషువా అభిభాషించాడు "నన్నయభట్టు శబ్దనమ్మాలు తిక్కన యజ్వాయర్థసంపన్నత శంభుదాసుని ప్రబంధవిభూతి సమైక్యభావముంగన్నవి నీయెడన్" అని కరుణశ్రీగారు గొప్పగా చెప్పాడు. తుమ్మలవారి సుకవితోక్తి

పరంపర "తెల్గుతోటలో దీయని పూవుదేనియల తేటలు కాల్వలు గట్టి పాటించదని" చిన్నం రామయ్యచౌదరిగారు గణుతించారు. "తెలుగుభాషలోని సహజమైన కారకములను గుర్తించి తెలుగునుడి కారపు సొంపును ఆకళించుకొని, తెలుగు కవిత్వమును తీర్చిదిద్దిన దేశికవులలో శ్రీ తుమ్మలవారిది ప్రముఖస్థానము" అని తుమ్మల వారికి సన్నిహితుడైన తాళ్ళూరి సత్యనారాయణగారు అన్నారు

ఇక తుమ్మలవారి కవితాకమనీయతగూర్చి ముచ్చటించుకొందాం

ఇరవయ్యో దశకంలో తుమ్మలవారు రాసిన 'కృష్ణావతారము' ఖండకవితలోని యీక్రింది సీసపద్యాన్ని చూడండి. ఇది ఆనాడు 'భారతి' మాసపత్రికలో వచ్చింది.

సీ॥ కోమలామల ఘనశ్యామలాంగము తోడ
ముద్దుగుల్కెడు నవ్వుమోము తోడ
శిఖిపింఛసంచయాంచితమస్తకము తోడ
జెలువమౌ బంగారువలువ తోడ
గరుణారసం బొల్కు కన్నుదమ్ముల తోడ
నవరత్నమయ భూషణముల తోడ
ఘల్లుఘల్లని మ్రోగు పిల్లగజ్జెలతోడ
మఱి చిన్నిపంగ నామములతోడ
తే. గీ॥ రమ్యశారద చంద్రికా రాత్రులందు
విమల యమునానదీసైకతముల నిల్చి
మురళిబాడిన నీదివ్యమూర్తి జూపి
ననుగృతార్థునిజేయుమో నందతనయ (దివ్యజ్యోతి)

పోతన పద్యాన్ని తలపింపజేస్తుందీ పద్యం. లలితలాలిత్య లఘు సంస్కృతపద సమాసాలతోను, తేనెసోనలూరు చిన్నిచిన్ని తేట తెలుగు పదాలతోను - పద్యం 'బింకం'గా 'బిగువుగా' వన్నెచిన్నెలు

చిందే కన్నెపిల్ల 'వయ్యారి నడక'లా ఎంత యింపుగా - ఎంత సొంపుగా సాగిపోయిందో యీ పద్యం పద్యంలోని శైలీసౌకుమార్యం - భావమాధుర్యం సమతుల్యంగా సమైక్యంగా సంతరించుకొన్నాయి. సీసపాదాలన్నీ "తోడ" అనే అంత్యప్రాసంతో అందగించడం మరో విశేషం! "బాలమురళీకృష్ణుని" రూపు కట్టెదుట "బొమ్మ" కట్టేలా ఛందోబద్ధంగా తీర్చి దిద్దారు శ్రీ తుమ్మలవారు.

సీ॥ కలదోయి తెలుగు జోదుల తుటారి కటారి
చెలరేగి పగఱజీల్చిన దినంబు
కలదోయి తెలుగురాజులు గంగ గట్టుపై
దీంఢ్రించి పడగలెత్తిన దినంబు
కలదోయి రేవురేవుల తెలుంగు సరంగు
పెనగి లంగర్లు దింపిన దినంబు
కలదోయి తెలుగుపల్కుల వెలంది - వెలంది
వెలుగు లెల్లెడల బర్విన దినంబు
తే. గీ॥ కలదు కలదోయి తెల్గు ప్రెగ్గడలు మన్ను
మిన్ను తాళంబువైచి పేర్గొన్న దినము
నేటి నీపాటునెంచి కన్నీటి నిడకు
నిలుచునే కాలమొకలీల తెలుగుబిడ్డ!

(రాష్ట్రగానం)

గతించిన తెలుగుల ప్రాభవ - వైభవాన్ని - తెలుగువారి పౌరుషప్రతాపాల్ని - విశ్వవిఖ్యాతిగాంచిన తెనుగుసాహితీ వైశిష్ట్యాన్నీ స్ఫురణకు వచ్చేవిధంగా యీసీసపద్యంలో రేఖామాత్రంగా ధ్వనింపచేస్తూ - రోజులెప్పుడూ ఒకవిధంగా వుండవని - తెలుగువారిని ఓదారుస్తూ - మంచిరోజులు రాకపోవనీ ఆశాభావం వ్యక్తం

చేస్తూ - ఆంధ్రులకు ఆ ఆశాభావం కలుగుచేస్తున్నాడు. 'ఆశావాది' అయిన అచ్చమైన ఆంధ్రకవి; తెనుగులెంక ! సరళమైన తెలుగులో - సహజధారా శుద్ధిగల శైలిలో ఎంత 'కమ్మ'గా వెలయించాడు ఈ పద్యం తుమ్మల కవి. అర్థాంతర న్యాసాలంకారంతో గతాన్ని సూచిస్తూ - భవిష్యత్తుపై ఎంత ఆశావహాం వెలిబుచ్చాడో చూడండి.

నా రాష్ట్రంబు గడించి తీరెదను నానావిఘ్నముల్ వచ్చినన్
రారాపిళ్ళకు తల్లడిల్లనను తీవ్రజ్వాలతో గార్యమున్
బ్రారంభించిన తెల్గుబిడ్డ నెదిరింపన్ బ్రహ్మరుద్రాదులే
చేరంజాలరు తక్కుముక్కుడులకై చింతింపగా నేటికిన్

(రాష్ట్రగానం)

ఎన్ని యిక్కట్లువచ్చినా - స్వంత 'ఆంధ్ర రాష్ట్రం సాధించి తీరుతానని - రాష్ట్రోద్యమం విజయవంతమాతుందని - తెన్గువారు ప్రారంభించిన ఉద్యమాన్ని ఆపటానికి ఆ బ్రహ్మరుద్రాదులకు కూడా సాధ్యంకాదని - ధీమా - ఆత్మవిశ్వాసం - వ్యక్తం చేస్తున్నాడు తెనుగులెంక ! తెలుగువారివి "సోడాబుడ్డి ఉద్రేకా" లన్న మహాకవి జాషువా అభిప్రాయంతో తెనుగులెంక విభేదిస్తున్నాడు - తెలుగువాడి - వాడి - వేడినాడి - శక్తి తెలిసిన తెలుగులెంక ! భావంలో ఎంత ఆత్మవిశ్వాసం కనపరచాడో - భాషలో కూడా అంత పొంకం - బింకం - బిగువులగువు వెలయించాడు తెనుగులెంక గమనించండి !—

విశ్వనాథవారు మెచ్చుకొన్న సీసపద్యం చూడండి.

సీ॥ ఒకనాడు శాక్యమౌనికి జయధ్వనులిచ్చి
కరుణా సుధావృష్టి కురిసినాడు
ఒకనాడు శంకరాచార్యున కండయై నిల్చి
జ్ఞానచంద్రిక వెదజల్లినాడు

ఒకనాడు రామానుజోపదేశము మెచ్చి
భక్తిప్రపత్తులు పంచినాడు
ఒకనాడు మోహనోక్తికి నంజలి ఘటించి
కులగర్వములు వంగ గొట్టినాడు
తే. గీ॥ నేడు గాంధి మహర్షి వాణికి శిరంబు
వంచి సల్పెడి గాథ సేవావ్రతంబు
ఉత్తమోత్తమ ధర్మమెందున్న దాని
కొలువు మరగెడువాడు మా తెలుగువాడు

—రాష్ట్రగానం

"గీత పద్యమునందు చెప్పదలచుకొన్న యొక రమ్యవిషయమును పై నాల్గు పాదములతో సమర్థించుట దీని వైలక్షణ్యమ"ని విశ్వనాథవారు వివరించాడు !

సీ॥ ఉత్తమ వాగ్మినా నొప్పారె నురక, గ
ర్జించియా కాదు వర్జించి నుడులు
అతిలోక బలసమంచితుడయ్యె గండలు
పెంచియా కాదలయించి యొడలు
చిర జయశ్రీ ధురంధరుడయ్యె రిపుల ఖం
డించియా కాదు పండించి కృపలు
అమృతత్వమందె యాగము లాచరించియా
కాదు నిష్కామయోగము వరించి....
తే. గీ॥ అతడు సామాన్యుడెట్లు! వీరత కపూర్వ
జీవములువోసి వాసితెచ్చిన మహాత్ముడతడు

(మహాత్మకథ)

ఇది మహాత్మగాంధీ విశిష్ట వ్యక్తిత్వం గురించి చెప్పిన పద్యం!

మౌనవ్రతం వహించి గాంధీ. సరససంభాషణా చతురుడైనాడు. శరీరం శుష్కింపచేసి (నిరసన వ్రతాలవల్ల) గాంధీ అతిలోక బలో పేతుడైనాడు ! కృపాదృక్కులచేతనే గాంధీ అజేయుడైనాడు. యజ్ఞయాగాదులు చేయుటద్వారా కాక కేవలం 'నిష్కామకర్మ యోగం' వల్లనే గాంధి అమృతత్వమందాడు ! ఎంత గొప్ప భావన ! భావగాంభీర్యమంటే యిదేకదా ! ఇంత గొప్ప భావం - యెంత చక్కని - సరళమైన భాషలో చెప్పాడో చూసా రుగా ! అదీ తెనుగులెంక గొప్పతనం ! అదీ గాంధికవి కలం మహాత్యం ! ఇందులో 'ఉక్తివైచిత్ర' వుంది ! ఎత్తిన కవితలా వుంది ! భావం భాష - రెండూ 'తాదాత్మ్యం' చెంది - అర్థ సౌందర్యాన్ని అందించాయి ! మహాత్మకథ - 'కృత్యాది'లో తుమ్మలవారి గురువు శ్రీ దువ్వూరి వేంకటరమణశాస్త్రిగారు మెచ్చుకున్న పద్యాలలో ఇదియొకటి ! ఈ పద్యం గురించి 'గాంధి కవి, అధ్యాయంలో గూడా కొంత తెలుసుకున్నాం.

యాభయ్యవ దశకంలో రాసిన యీ "ఉత్తమవాగ్మినా నొప్పారె" పద్యంలోని "శబ్దార్థాల" "బింకం పొంకం" చూసారు గదా ! మరి డెబ్బయ్యవ దశకంలో దాదాపు అదే భావంతో 'మహాత్ముని' మీాద రాసిన మరొక పద్యంలోని పదాల "బిగువు" కాస్త తగ్గినా భావంలోని "ఉదాత్తత" తగ్గలేదు - ఆ సీసపద్యం గూడా చూడండి.

సీ॥ పరిశుష్కదేహుడై బడలిన వాడయ్యు
  నందటికంటె దా ముందునడిచె
ఊతగా నొక కఱ్ఱనూనిన వాడయ్యు
  నఖిలజగత్తున కండయయ్యె

అపరిగ్రహ వ్రతంబానిన వాడయ్యు
నిత్యపూర్ణ స్థితి నెగడనేర్చె
అస్త్రశస్త్రమ్ముల కవ్వలి వాడయ్యు
గర్వించు వైరివర్గమును గెలిచె

ఆ॥ వె॥ నెతడతండు పుట్టె నీపుణ్యభూమి ను
ద్వేలమైన యార్షతేజ మలర
మర్త్యుడయ్యు నతడమర్త్యుడు, భవియయ్యు
నభవుడతడహెూ! మహాత్ముడతడు

(చక్కాట్లు)

బక్కచిక్కిన వాడైనా, అందరికంటే ముందు నడచాడు! తాను నిలబడటానికి చేతికర్ర అవసరమైనా - జగత్తునకు (శాంత్యహింసా మార్గంలో) ఆయన అండఅవసరం అయ్యింది. తనకవసరమైనంత వరకు మాత్రమే ఆహారం, వస్త్రం, వస్తువులు సంతరించుకున్నా - ఆయన ఏకొఅతాలేని 'పరిపూర్ణు' డయ్యాడు! చేతిలో అస్త్ర శస్త్రాలు లేకపోతేనేమి, (సత్యాహింసా వ్రతంతో) బలవంతుడైన వైరిని (రవి అస్తమించని బ్రిటీషు పాలకులకు) ఓడింగలిగాడు ఆయన మర్త్యుడైనా - అమర్త్యు (అమరత్వం) డయ్యాడు. లోక సంబంధ 'సంసారి' అయినా లోకేశ్వరుడయ్యాడు! ఇంతకీ ఎవ రాయన! ఇంకెవరు! తెనుగులెంక "ఆరాధ్యదైవం" అయిన గాంధీమహాత్ముడు!

సీ॥ మాతృదేశంబన్య మనుజేశ్వరుని చేత
చిక్కి స్వాతంత్ర్యంబు దక్కి తనదు
జాతీయతను బాసి చేతోగతంబైన
తలపు వెలువరింప దగిన హక్కు

నెడసి లోలోపలనే క్రుళ్ళి కుములుచు
నీచదాస్యమున మునింగి పిఱికి
తనము వరించి నితాంత కష్టపరంప
రల నీగి దారిద్ర్య మలమ దిక్కు

తే. గీ॥ లేక శోకించువేళ తల్లి మొఱనాల
కించి మైపులకింప జలించి కొంచె
మేని నామెకు దోడ్పడలేని బిడ్డ
బ్రతుకదేటికి ధాత్రికి బరువుచేటు

(పఱిగపంట - వీరధర్మము)

తల్లి ఐతాంబ కుమారుడు బాలచంద్రునికి "మాతృదేశభక్తిని"ని గురించి చేసినబోధ. అదలా వుంచండి. సీసపద్యంలో సామాన్యంగా ఏపాదానికాపాదం "విఱిచి" అలా భావం, భాషనెంచుకొని, చెప్పడం పరిపాటి అయ్యింది. శ్రీనాథుని కాలంనుండి మరీ యీ రీతిగా సీసమల్లడం సర్వసాధారణమై పోయింది. సీసమిలా చెబితేనే అందంగా వుంటుందనడంలో నిజంగా సందేహం లేదు. అందుకే సీసానికి శ్రీనాథుడన్నారు! అయితే శ్రీనాథునికి ముందున్న నన్నయ తిక్కనాది ప్రాచీనకవులు గాని, తర్వాతి కవులు కొద్దిమంది గాని సీసాన్ని పాదాల "విరుపు" లేకుండా చెప్పడం అధికంగానే వుంది! విషయమిక్కడ యేమంటే - మన తెనుగులెంక సీసపద్యంలోని ఏ పాదానికాపాదం 'విరుపు' లేకుండా- ఒక పాదంలోని భావం, భాష, మరొక పాదంలోనికి గంగాప్రవాహంలా - అలవోకగా - "ఒక పాదంలోనుండి మరొక పాదంలోనికి అతి సహజంగా జాలువారటం యిందలి విశేషం! ఛందోబద్ధంగా 'భావం' యిలా 'పాదానుబంధం'గా అక్షరబద్ధం కావడం - భాష అందుకు సహజంగా అలవోకగా దోహదపడడం ఒక ప్రత్యేకత! తెనుగులెంకకు

భాషపైన - ఉన్న అధికారమట్టిది. పద్యశిల్పంలో "చేయితిరిగిన వాడు" కదా తెనుగులెంక. నిజానికిది ఛందోబద్ధ పద్యమనిపించదు. సరళంగా - సాఫీగా - చక్కగా సాగిన పెద్దవాక్యంలా కనిపిస్తుంది. ఛందస్సు, కవితారీతులు తెలిసినవారికి మాత్రమే యిది సీసపద్యమని తెలుస్తుంది !

సీ॥ కొసరి నూఱిన పచ్చి పసపుబూత మొగాన
గుమ్మడిపూ దుమారమ్మునద్ది
కండరేగడ నారబండి కన్పండువై
పొలుచు మిర్వపుబండు బొట్టువెట్టి
వలిపమ్మునకు నొక్క వాసిహెచ్చైచనట్టి
నునుమంచు దెరచీర నూలుకొల్పి
బంతిపూవులకు జేమంతి నెయ్యము గూర్చి
కబరీభరమ్ము చక్కన కుదిర్చి

తే॥ గీ॥ పంటకళ్ళాలు మును బరాబరులు సేయ
గూడుగట్టిన తెలిమబ్బు గొడుగునీడ
గదలివచ్చెను భాగ్యాల కడలివోలె
మకర సంక్రాంతి లక్ష్మి హేమంతవీథి

(పఱిగపంట - సంక్రాంతి)

లేతగుమ్మడిపూ పసుపుపొడి మొగాన పూసుకొని, పండిన ఎర్రటి మిర్యపురంగు సింధూరతిలకం నుదుట అలది, నునులేత తెల్లని మంచుచీరగట్టి - బంతీచేమంతీ సిగనిండా తురిమి - పంటకళ్ళాలు కాపులు వరసగా నిలబడి స్వాగతం పలుకుచుండగా "మకర సంక్రాంతి లక్ష్మి "హేమంత" వీథిగుండా ముత్తైదువులాగా మెల్ల మెల్లగా నల్లనల్లన తెలుగుసీమకు కదలివచ్చిందట ! ఎంతచక్కని

సహజసిద్ధ వర్ణన! భావం - భాష "అర్ధనారీశ్వరం"గా 'మమేకమై' సంక్రాంతిలక్ష్మి కట్టెదుట నిలిచింది - అంతే. ఈ మకర సంక్రాంతి యందు "తెలుగుతల్లి అద్భుత దర్శనం అభిస్తున్నదని కాటూరి వేంకటేశ్వరరావుగారు అభిభాషించారు. "తుమ్మలవారి సంక్రాంతి" అధ్యాయంలో గూడా యీ పద్యం "సొగసు" చూడండి.

లేగటిపాలతో చేసిన తీయని భోగిపాయసం, లేత కటివే పాకుతో తాలింపువేసిన 'ఘుమఘుమ' లాడు పైరవంకాయకూర, పచ్చిమిర్చి కొత్తిమీరతో చేసిన 'నాల్క-త్రుప్పుదుల్పే' దోసకాయ పచ్చడి, కొత్తబెల్లంతో మరగవండిన ముదురుగుమ్మడి పులుసు, జిడ్డు దేఱినగడ్డపెరుగుతో సంక్రాంతిపండుగనాడు తెలుగువారిండ్ల లోవండి వడ్డించిన "సంక్రాంతి విందు" పసందును కమనీయంగా రమణీయంగా అక్షరబద్ధం చేసి వడ్డించాడు తుమ్మలవారు. ఆ కవితా విందు రుచి 'సంక్రాంతి' అధ్యాయంలో పాఠకులు రుచి చూసారు.

ఇక, తెలుగు లోగిళ్ళలో వంటావార్పుల్లో వేసే కమ్మని తాలింపు వాసన గురించి తెనుగులెంక చెపుతున్నాడు.

సీ॥ హైయంగవీన దివ్యామోద బంధువై
  జీరక వాసనా శ్రీ బెనంగి
మెంతి కమ్మదనంబు నెంతేని జేపట్టి
  ఇంగువ నెత్తావి పొంగులొలసి
కటివేప వలపుతో గలసి కుస్తుంబరీ
  లలితపల్లవ పరిమళము నెనసి
మాషఖండ ఘుమంఘుమను గూడి సర్షప
  గంధమ్ముతోడి సాంగత్యమంది

తే. గీ॥ వంటయిలు వీడి వాడలవెంట జాగి
పొరనాసాభితర్పణకారి యగుచు
జవులు పుట్టించు తాలింపు సౌరభమ్ము
హెచ్చి మజ్జాఠర జ్వాల రెచ్చగొట్టె

—ధర్మజ్యోతి

తాజా ఆవువెన్న (నెయ్యి) జీలకర్రల బాంధవ్యశ్రీ మెంతి-యింగువల పొందు - కొత్తిమీర - కరివేపవలపు ఆవాలు మినప ఖండాల (బద్దలు) సాంగత్యం కలకలపి కూరల్లో పోసిన (వేసిన) "తిరుగబోత" సువాసన (తాలింపుసౌరభం) వంటయిల్లుదాటి- వీధి వాడలంతటా పురజనుల "నాసికాపుటాల్ని" ముంచెత్తుతూ "ఆకలి మంట" రెట్టింపు చేస్తున్నాయట. తెలుగు లోగిళ్ళలో వేసే "తాలింపు" కమ్మని వాసనని, మధురతర లలితసంస్కృత పదాలు- అలతి అలతి తేటతెలుగు పదాలు 'కలబోసి' "సాహితీ" "తిరుగ మూత" వేసి ఆ కమ్మని కవితా తాలింపు సువాసనల్ని తెనుగులెంక పాఠకులకు గూడా నోరూరింపజేస్తున్నాడు. ఆకలి పుట్టిస్తున్నాడు. ఒకోకయిల్లాలు తిరగబోత పోస్తుంటే ఆ వీధివీధంతా 'ఘుమ్మను' కమ్మని తాలింపువాసన కొడుతుంది. ఆ వీధిలో వచ్చిపోయే వాళ్ళకు - ఆపేటలోని యిరుగుపొరుగులకు ఆ "సువాసన" నోరూరింపజేస్తుంది తెనుగులెంక దానినే కవితలో చెప్పాడు.

ఇక అలా 'తాలింపు'లు వేసి చేసిన, వండి వడ్డించిన తెలుగు వారి కమ్మని వంటకాల్ని విందుభోజనాన్ని- తుమ్మలవారు వర్ణించిన విధం చూడండి మరి.

సీ॥ వలచు కప్పురభోగి వరివంటకమ్ముతో
గార వేల్లాది శాకములతోడ
బసుపునిగ్గుల కందిపప్పుతో బులుసుతో
బచ్చళ్ళతో పొడబంబుతోడ

వడియాలతోడ నప్పడముతో వరుగుతో
లడ్డువమ్ముల చక్కిలములతోడ
బోళిలతో గారెబూరెలతో నంటి
ఫలములతో దేనె తోలలతోడ

తే. గీ॥ మీగడలతోడ పెరుగుతో మేలితరపు
టావకాయతో గంధతోయమ్ముతోడ
విందొసగె నమ్మహాసాధ్వి వేడ్కతనకు—
—ధర్మజ్యోతి

పేదలు - సామాన్య కుటుంబాల విషయమటుంచి - సంపన్నులైన వారిండ్లలో శాకాహారవిందు భోజనాలలో పైచెప్పిన కమ్మని వంట కాలన్నీ విస్తళ్ళలో లేదా పళ్ళేలలో వడ్డించవలసిందే మరి! విస్తరిలో వరిఅన్నంతోపాటు రకరకాల కాయకూరలు, ముద్దకంది పప్పు, పులుసు, పచ్చళ్ళు - వడియాలు - అప్పడాలు, వరుగులు, లడ్డు - వామ్ము చక్కిలం పోళీలు - గారెలు - బూరెలు - అరటి పళ్ళు ద్రాక్షారసం - పనసతొనలు మీగడతోగూడిన పెరుగు, ఆవకాయ, కమ్మని మంచి (త్రాగే) నీరు!— నోరూరడంకాదు! లొట్టలేయడం కాదు! పద్యం చదువుతూవుంటే కడుపునిండినట్లే వుంది కదూ! మరే విషయంలేనట్లు - వంటకాలు, విందులమీద పడ్డాడేమిటి యీ రచయిత, "తిండిబోతు" కాబోలు అనుకొంటూ రేమో! సహృదయ 'పాఠకులు! అయినా' తిండి" బోతులు కాని వారెవరులెండి! కోటివిద్యలు కూటికొఱకే గదా! నానా గడ్డిగఱిచేది జానెడి పొట్టకోసమేగదా! అందుకే 'అన్నం పరబ్రహ్మ స్వరూప" మన్నారు! అదిసరే! కడుపునిండా తిండికాదు! మనోరంజకం — హృదయానందమిచ్చే 'కవితావిందు' కావాలినాకు చిన్న "విందు"విషయాన్నిగూడా తెనుగులెంకయెంతో కమనీయంగా

రమణీయంగా కవితారీతిలో చెప్పగలడని చెప్పటానికే - నోరూరించే తెలుగు వంటకాల గురించి తెలుగువారి విందుభోజనాల గురించి ఛందోబద్ధంగా అందంగా చెబుతూ పాఠకులకు కమనీయ సాహితీ విందు చేసాడని చెప్పటానికే - యింతగా చెప్పవలసి వచ్చింది ! ఇంతకీ సందర్భమేమిటంటే- కవిగారి తండ్రి నారయ్యగారు చందోలు వైశ్యుని దాచిన 'బంగారుకడ్డీలు' రెండు సంవత్సరాల తర్వాత "ముద్ద ఎద్ది" గా తిరిగి వైశ్యునికు ప్రతిఫలం ఏమీ ఆశించక యిచ్చి వేసి తన "నిజాయితీ" నిలపెట్టుకున్నాడు. తండ్రి 'సత్యనిరతి' ఋజువు చేసుకోవటానికి కవిగారు స్వయంగా ఆ వైశ్యునింటికి కెళ్ళాడు. తమ యింటిదీపం నిలబెట్టిన నారయ్యగారి కుమారు డొచ్చాడని ఆ వైశ్యుడు కవిగారికి 'విందు' చేసాడు. ఆ 'విందు' వర్ణన కవిగారు చేసాడు.

'లగువు బిగువు' గల లలితలావణ్య - ప్రౌఢగంభీర దీర్ఘ సంస్కృతపద గుంఫనంతో ఘుమ్మనుపించే కమ్మని పద్యమొకటి చూచండి. ఆదికవి 'నన్నయనో' శ్రీనాథుడినో మరో ప్రాచీన కవినో తలపింపజేస్తుంది పద్యం.

సీ॥ లలితలావణ్య పల్లవ వితానలతాంత
సముపేత మంజు కుంజములయందు
గ్రావప్రసవన్నదీ కమలశీకర సిక్త
శీతలాద్రి ప్లవశ్రేణులందు
బాలరసాల ద్రుజాల కోమలలతా
స్తోమాంచితారామసీమలందు
సుందర వికచారవింద మందిర దీర్ఘి
కా, మనోహర తీరభూములందు

తే. గీ॥ నిరుప మవిశుద్ధహర్ష వార్నిధితరంగ
డోలికా పంక్తులందు నూయేలలూపి
నన్ను మదిదేల్చినట్టి నీ నవ్యలీల
మఱతువే నాథ ! యెన్ని జన్మములకైన

**(ఆత్మార్పణము)**

తనభర్త పోతుకపోతం చితిలో ఆత్మాహుతి చేసుకొన్నందులకు పెంటి దుఃఖంతో అన్నమాటలివి. లేతపొదరిళ్ళలో శీతలకొండ కోనలందు - కమనీయ ఫలాలున్న తోటలందు — సుందర మనోజ్ఞ సీమలందు ఆనందడోలికల్లో తేలియాడిన 'మధుర సన్నివేశాల్ని' ఎలా మరచిపోతానని బాధపడుతోంది పెంటి ! ఇందులో రెండు మూడు తెలుగుపదాలు మాత్రమే ! రైతు కుటుంబంలో పుట్టి పెరిగి సేద్యంగూడా చేసిన శ్రీ తుమ్మల సన్నకారురైతుల కష్ట నష్టాలు బాగా యెఱిగినవాడు కనుక రైతుకవిగా రైతుల యాతి బాధలు కన్నులకు కట్టినట్లు వర్ణించాడు.

సీ॥ బిందెలతోడ బాల్పిండెదుగాని, నీ
కంచెంబులోనికి గంజినీళ్ళె
కొండంత నుసుప్రత్తి పండింతుగాని, నీ
కాయంబు మూయంగ గప్పడంబె
పలుపుట్ల వడ్ల గాదెలనింతుగాని, నీ
క్షుద్బాధ గడగింప జోళ్ళజావె
కమ్మని శాకముల్ కాయింతుగాని, నీ
కూరకై కటకి సంబారుహొడుమె

తే. గీ॥ ఏమని వచింతు నీ బాములెల్లదడవి
కడుపు చుమ్మలు వాఱు నీకథలువిన్న

నిన్ను మరచిరె దొరలయో ! నేటికెట్టి
చెట్ట నిను ముట్టడించెరా ! సేద్యగాడ !

—పఱిగపంతు

తేట తెనుగు పదాలతో - సన్నకారు సేద్యగాళ్ళ యాతిబాధలు "అభివ్యక్తి" ఎంతో రమణీయంగా చేసాడు తెనుగులెంక !

స్వాతంత్ర్యం వచ్చింది. నోరున్నవాళ్ళు - డబ్బున్న వాళ్ళు కొందరికే స్వేచ్ఛాసమతలు - భోగభాగ్యాలు గుత్తసొత్తు లయ్యాయికాని పేదవాని - కష్టజీవి 'బ్రతుకులు' గొర్రెతోక బెత్తెడులాగానే వున్నాయని తెనుగులెంక బాధ. ఈ పద్యం చూండడి !

సిరిగలవారి కోశములు చిన్నవి పెద్దవియయ్యె సంపదల్
పెరిగినవారి కబ్బినవి పెత్తనముల్ నిఱుపేద కెంతయున్
బరువుగమాఱె జీవితము ప్రాణములున్న శవమ్ముకై వడిన్
దిరుగు నతండు నేడు నిజదేశ నికృష్ట దశాపతాకమై

—కదంబకైత

పదవులు - అధికారం - సంపదలు - సుఖసంతోషాలు అన్నీ ఉన్న వారికే ! కలవారి 'కోశాలు' రోజురోజుకు పెరిగిపోతున్నాయి. నిఱుపేదలైన కష్టజీవుల "బ్రతుకులు" రోజురోజుకు 'బరువెత్తి' దిన దినగండంగా తయారై 'జీవచ్ఛవాలు'గా 'చావుబ్రతుకులమధ్య కొట్టుమిట్టాడుతున్నారు శ్రామికులు. ఈ దుస్థితి 'నిజదేశ నికృష్ట దశ'గా - సరళమైన భాషలో — గంభీరభావంతో - వాస్తవపరిస్థితిని ఛందోబద్ధం చేసాడు శ్రీ తుమ్మల.

కవిసామ్రాట్ విశ్వనాథవారు మెచ్చుకొన్న 'సంస్కృతపద భూయిష్ట పద్యాన్ని చూడండి. ఆచార్య రంగాగారిపైని రాసింది పద్యం.

కర్ణాటీ నవహీర హారము త్రిలింగ క్ష్మాసతీమల్లికా
పూర్ణోద్యానము ఘూర్జరీముఖ కళాపుంజంబు విశ్వక్షమా
స్వర్ణద్యుంబర చుంచివాః పటలమై సభ్యప్రపంచమ్మునన్
వర్ణింపబడు నీయశంబు మృధుభావా! భారతీ వల్లభా

—శబల

"ఇది యచ్చముగా సంస్కృతపద భూయిష్ఠమైన పద్యము. ఇది శ్రీనాథుని మార్గమును చుంబించుచున్న రచన" అని విశ్వనాథ వారు లెస్సగా ప్రశంసించారు.

విశ్వనాథవారు మెచ్చుకొన్న మరో పద్యం—

ఏ తాదృగ్విభవాభిరామమగు నా యాదేశ మాశాతటీ
మాతంగ ప్రమదా విశాలకటసీమా నిర్గళ ద్వేణికా
ప్రీతేందిందిర గీతకీర్తినిధియై పెంపొంది నేడక్కడా!
రీతిన్ ప్రాక్తన వర్ణనీయ సుషమా రేఖారమన్ గోల్పడెన్

—రాష్ట్రగానం

కవిసామ్రాట్ విశ్వనాథవారు తెగమెచ్చుకొన్న మరోపద్యం

మోనులెత్తిన వేలుపుం బాసమీది
తగులమున జేసి తెల్గును దెగడువారు
వ్రాయుదురు గాక తెలుగు కావ్యమ్ము, లినుప
సుద్దలేకాని యవి లడ్డు ముద్దలగునె

—శబల

సంస్కృతపద భూయిష్ఠమైన తెలుగు పద్యాల్ని "ఇనుపసుద్దల" నీ తెలుగునుడుల ప్రోవులైన తెలుగు కవితల్ని "లడ్డుముద్దల"నీ తెనుగులెంక చమత్కారంగా చెప్పటాన్ని విశ్వనాథవారు తెగ మెచ్చుకొంటూ "ఓహో! తెలుగుకవీ! తిక్కనగారు తెనుగు

భాషకు చేసిన మహోపకారమును నీవు కీర్తించి యామార్గమున నడచినవాడవు నిజముగా నీవు అభినవ తిక్కనవు" అని ప్రస్తుతించాడు శ్రీ విశ్వనాథ.

ఈ క్రింది పద్యం చూడండి. ప్రౌఢ సంస్కృతపద గుంఫనాలతో ఎంత 'బిగువు'గా 'బింకం'గా వుందో !

> మదగజ ఘీంకృతుల్ తురగమండలి హేషలు భేరి భాంకృతుల్
> రథగణనేమి ధంధణల రాళకరాళ కృపాణజంఝుళల్
> గుదిగొను సింహనాదముల కుంఠితభంగి జెలంగ సాధ్వసా
> స్పదమగు యుద్ధరంగమున బాలుడవీవెటు నిల్తువెప్పుమా
>
> —పఱిగపంట

మదగజ రాజ ఘీంకారాలతో - అశ్వరాజముల హేషలతో భేరిభాంకృతులతో — కృపాణ జంఝుళులతో - రథాల 'ధంధణ' నినాదాలతో దద్దరిల్లిపోయే భీకరయుద్ధభూమి వర్ణన యీ పద్యం. యుద్ధరంగంలో మదగజాశ్వ పదఘట్టనలు — ఘీంకార హేషనినాదాలు - కృపాణ 'ఖడంఖణ' నిస్వనాలు - యీపద్య శబ్ద విన్యాసాల్లో ప్రతిధ్వనిస్తున్నాయి కదూ ! ఈ పద్యం చదువుతుంటే 'రణరంగ' దృశ్యం - "రణగొణ ధ్వనులు" కన్నులకు కట్టిన— చెవులు మార్మ్రోగుచున్న "అనుభూతి" కలుగుతున్నది కదూ ! అదీ కవియొక్క కవితాశిల్పం ! అదీ తెనుగులెంక పద్యశిల్పం !

ఈ క్రింది పద్యం చూడండి. ఎలా "తెనుగుదన" ముట్టిపడుతుందో గమనించండి.

> నెయ్యములేక, తియ్యము గణింపక, నిక్కము నొప్పుకోక, దా
> కయ్యము పెంచి, జాతిని గకావికలంబడవైచి, దేశమున్
> వ్రయ్యలుసేయ నా తెలుగువారలు కోఁలుదీటువేళ, నే
> డయ్యక క్రుయ్యబాఁలకకటా ! యనకెట్లు సహింతు వేడుకల్
>
> —ఉదయగానం

అలతి అలతి తేటతెలుగు పదాలతో తెనుగులెంక ఎంతో మనోహరంగా చెప్పాడీ పద్యం .

మీసములేని మూతి కవిమిశ్ర మనోహర కావ్య వాఙ్మయా
భ్యాసములేని పల్కు నవపల్లవ కోమల కన్యకాపద
న్యాసములేని గీము లలనా మధురాధర సంపుటీ సుధా
గ్రాసములేని మన్గడ జగమ్మున రిత్తకురిత్త సోదరా

—రాష్ట్రగానం

తేటతెలుగు పదాలు - అలతి లలిత సంస్కృపద సమాస గుంఫనాలు సమతుల్యంగా - అలవోకగా - అతిసహజంగా - చెట్టాపట్టాలు పట్టుకొని - శబ్దార్థాలు 'మమేక'మై ఛందోబద్ధం గావడం - యీ పద్యంలోని ప్రత్యేకత. అదీ తెనుగులెంకకు ఉభయభాషలందున్న పట్టు ! అదీ తెనుగులెంక కమనీయ కవితాశిల్పం !

అన్నువులేదు, కుట్రలకు నక్కలేదు కటారు లీటెలున్
బన్నుటలేదు శాత్రవుల ప్రాణము దీయుట లేదు, నెత్తురున్
జున్నువిధాన బట్టి తెగజుఱ్ఱుటలేదు. జగచ్చరిత్రలో
గన్నదిగాని విన్నదియుగాని రణంబిది విక్రమింపుడీ

(మహాత్మకథ)

బాపూజీ తాను ప్రారంభింప తలపెట్టిన శాంతియుత సాహాయ్య నిరాకరణోద్యమం గురించి దేశప్రజలకు వివరించిన విషయం తెనుగులెంక తేటతెలుగు పదాలతో భావబంధురంగా ఛందోబద్ధంగా చక్కగా చెప్పాడు.

ఈ క్రింది పద్యం చూడండి.

నీ మందస్మిత సుందరాస్య తలమున్ నీ నిగ్గులన్ జగ్గులన్
నీమైమవ్వము నీ కనుంగవపసన్, నీనెన్నడల్ - సొంపులన్
నీమర్యాదల నీ మృదూక్తులను నీ నెయ్యంబు నీ తియ్యమున్
భామా ! నేనెటు విస్మరింతు జెపుమా ! ప్రాణంబుతో నుండగన్

—ఆత్మార్పణం

బోయవాడి వలలో పెంటికపోతి చిక్కుకొన్నప్పుడు - పోతుకపోతం తన సతీమణిని తలంచుకొని పరిపరివిధముల వాపోయిన ఘట్టమిది. ఆదర్శ పవిత్ర ప్రణయదంపతుల అన్యోన్య ప్రేమానురాగాలకీ పద్యం అద్దంపడుతోంది. తెనుగులెంక యీ 'దాంపత్య బంధాన్ని' ఎంత బిగువుగా - చక్కగా ఛందోబద్ధ పద్యంలో బిగించాడో గమనించారుగదా.

ఈ క్రింది పద్యం చూడండి.

ఎత్తిరి కోట్లకుం బడగలెల్ల వణిక్కులు రాజదత్తముల్
విత్తములంది పేర్వడిరి విప్రులు వైదిక ధర్మకర్మఠుల్
విత్తిన విత్తనంబు పదివేల మడుంగులుపండ గాపువా
రొత్తిరి శంఖముల్ సిరులనుబ్బిరి కార్మికులప్పుడమ్మహిన్

(ధర్మజ్యోతి)

అలనాటి వెలనాటి వైభవాన్ని - బిగువైన చిన్నచిన్న తెలుగు మాటలతో ఎంతో మనోహరంగా వర్ణించాడు శ్రీ తుమ్మల.

గాంధీజీ హత్యగావింపబడినప్పుడు తెనుగులెంక 'అమరజ్యోతి' కవితాజ్యోతిని వెలిగించాడు. వెలయించాడు. ఆ సందర్భంలో రాసిన యెన్నో 'గొప్ప' పద్యాలలో యీ క్రింది పద్యం చూడండి.

బడలెద వేకువోలె మన భాగ్యము పంటకు, రాట్నపాకుగా
సుడివడె దారరక్షణకు, సూత్రమవై సకల ప్రజావళిం
బడుగున వేకలోగలిపి పట్టెద, వెట్టి విపత్తి మూగినన్
జడియక నిచ్చలున్ బిగియ సాగెదురా ! కదురై మహాప్రభూ
—అమరజ్యోతి

ఓహో ఎంతటి మహోన్నత భావన ! గాంధీజీ "కదురు"గా దేశ భాగ్యోదయానికి "ఏకు"గా బడలిపోయి, పతితజనావళి ఉద్ధరణకు "రాట్నపాకు"గా సుడివడిపోయి - "సూత్రము" (దారం) గా సకల జనావళిని "పడుగుపేక"లో కలిపిపెట్టి - యెట్టి కష్టనష్టాలొచ్చినా - యెదురొడ్డి నిస్స్వార్థంగా - స్వచ్ఛందంగా తన జీవితాన్ని "ప్రజాశ్రేయస్సు" నకు - లోకకల్యాణానికి - దేశసేవకు అంకితం చేసాడు! గాంధీజీకి రాట్నంమీద — కదురుమీద 'దారం' తీయడం నిత్యకృత్యం! అవి ఆయనకు ప్రాణప్రదాలు ! ఖద్దరు వాడడం ఆయనకు ప్రీతిపాత్రం ! అట్టి గాంధీజీ యే 'కదురు'గా రాట్నపాకుగా సుడి తిరుగుతూ 'ఏకు'గా బడలి, సూత్రంగా రూపుదిద్దుకొని — సకల జనాభ్యుదయాంబరంగా, (వస్త్రం - వలువ) గా తన జీవితాన్ని త్యాగంచేసాడనితన్నుతాతరింపజేసుకొన్నాడనీ కవిభావన! సరళమైన భాషలో - సమున్నతభావం పొందుపరచి హృద్యంగమంగా పద్యం చెప్పాడు తెనుగులెంక ! ఈ పద్యంలో 'ఉపమా' నాలంకారం, సహజసిద్ధంగా 'మమేకమై' అలరింది !

శుద్ధ గాంధేయవాది - నిష్కళంక దేశభక్తుడు - నిస్స్వార్థ స్వాతంత్ర్య సమరయోధుడు — మాజీ భారతప్రధాని అయిన లాల్‌బహదూర్ శాస్త్రిగారికి మహాత్మకథ కావ్యాన్ని శాస్త్రిగారి మరణానంతరం అంకితం (సత్కృతి) యిచ్చాడు. అంకిత పద్యాలలో మచ్చుకొకటి.

ఈ పొలి నీకుగాకెవని కిచ్చెద దేశవికాస లబ్ధికై
రాపిడిలోర్చి యోర్చి రుచిరంబగు జీవన సౌరభంబు నల్
వైపుల జిమ్మిచిమ్మి పొడవాసిన గంధపుజెక్కకున్ బృహ
త్తాపముసైచి స్రగ్గి జనతన్ దనియించిన ధూపవర్తికిన్

—మహాత్మకథ

దేశాభ్యుదయానికి (స్వాతంత్ర్యానికి ముందు - స్వరాజ్యం వచ్చిన తరా త) కష్టనష్టాల 'రాపిళ్ళ' కోర్చి - అమూల్యమైన తన జీవిత సౌరభాల్ని నలుదిక్కుల గుబాళింపచేసి - నలుగురికీ సుఖశాంతుల్ని సంత చి పెట్టుటయందే చివరకు మృతుడై - తన కాయాన్ని గంధపు చెక్కలకు "ధూపవర్తి" గా ఆహుతియై ధన్యజీవియైన లాల్ బహదూర్ శాస్త్రిగారికి తన కృతినంకితమిస్తున్నానన్నాడు "నిర్స్వార్థ గాంధేయవాది - దేశభక్తుడైన కవి శ్రీ తుమ్మలవారు. దైవభక్తుడు దేవుడికి భక్తితో 'ధూపదీపం' వేసినట్లు - నిస్స్వార్థ దేశభక్తుడైన శాస్త్రిగారు తన కాయాన్ని గంధపుచెక్కల కాహుతి చేసినట్లు - తన యావజ్జీవితాన్ని దేశసేవలో - ప్రజాసేవలో "ధూపవర్తి"గా 'అర్పణ'మై కరిగిపోయి తరించాడని కవి భావన.

ఇక తెనుగులెంక కవిత్వంలోని శయ్యాసౌకుమార్యం గురించి - అర్థ (భావ) మాధుర్యం గురించి - అలతి అలతి తెనుగు నుడికారాల సొంపు గురించి - తెలుసుకుందాం !

రాష్ట్రసిద్ధికొఱకు రక్తమ్ముగార్చిన
కవినినేను గాంధికవిని నేను
బడలి బడలి తల్లిబాస కూడెముసేయు
కవినినేను దేశికవిని నేను

(నేను)

ఈచిన్ని ఆటవెలది పద్యంలో చిన్నచిన్న తెలుగుమాటలతో ఎంత భావమిమిడ్చి ఎంతో గొప్పగా చెప్పాడు కవిగారు 'రాష్ట్రసిద్ధి' కొఱకు అంటే స్వరాష్ట్రంకోసం - రాష్ట్రగానం చేసాడు. 'రాష్ట్రం' అంటే 'దేశం' అన్న అర్థంగూడా వుంది కనుక 'రాష్ట్రపతి' అంటు న్నాం అంటే 'దేశాధ్యక్షుడు' అనే అర్థంలో 'ఆ అర్థంలో' దేశ స్వాతంత్ర్యంకోసం గూడా ఆయన కవిత్వం రాసాడు. జాతీయో ద్యంలో తాను స్వయంగా పాల్గొన్నాడు! 'రక్తంబు' గార్చి నాడంటే - రక్తంకారేట్లు 'లాటిదెబ్బలు తిన్నాడని' కాదు. ఎంతో కృషిచేసి ఎంతోపరిశోధనచేసి_ఎంతోఅధ్యయనంచేసి రాత్రింబవళ్ళు నిద్రాహారాలు లేకుండా 'ఛందోబద్ధంగా కావ్యాలెన్నో రాయడం మాటలు కాదుగదా! దేశికవి అంటే - దేశీయభాషలో (ఆయనే చెప్పాడు తల్లి బాసకూడెము సేయుట గురించి) - దేశి ఛందస్సులైన - అటవెలది - తేటగీతి - కందం - సీసం - ద్విపద - మంజిర - మధ్యక్కర' రీతులలో పద్యాలు రాసాడు. తెనుగులెంక సాహిత్యం మొత్తంలో 'దేశికవితా' రీతులే అధికభాగం కనిపిస్తాయి. ఈ చిన్నిపద్యంలో యింత అర్థముంది!

కల్లకపటులేని పల్లెలో నాగలి
దున్నువారు నన్నుగన్నవారు
మడికినొక్కపూట బడికొక్కపూటగా
దాటినాడ జిన్నతనము నేను

(నేను)

తాను 'రైతు' కుటుంబంలో పుట్టినాడని - తనను కన్నవారు 'సత్య నిష్ఠాగరిష్ఠులనీ - చిన్నతనంలో ఒకప్రక్క సేద్యం పనులు చూసు కొంటూనే - వేరొకప్రక్క చదువు సాగించినట్లు చెప్పాడు! చిన్ని ఆటవెలది చందస్సులో చిన్నచిన్న తెలుగుపదాలతో - ఎంతో

తన జీవితచరిత్రను ఎంతో చక్కగా చెప్పాడు! అన్నీ తెలుగు పదాలే!

బాపుగా గర్మయోగంబు రూపుదాల్చె
భక్తివిశరాని చుట్టమై పరగె దాని
కెఱుక చెలియయ్యె నయ్యోగి నరసిమనుట
ధరణిగల సర్వపుణ్యతీర్థముల గనుట

—ఎక్కట్లు

కర్మయోగమే బాపుగా రూపొందిందట; భక్తి ఆయనకు చుట్టమైందట! ఆ భక్తికి 'ఎఱుక' చెలికత్తె అయ్యిందట! గాంధీ యోగిని దర్శించి ఆయన చెప్పినట్లు జీవిస్తే - ధరిణీలో గల సమస్త పుణ్య తీర్థములలో స్నానమాడినంతగా పుణ్యం - పురుషార్థం - ధన్యత చేకూరుతుందట. బాపూజీయొక్క సర్వోదయ ఆధ్యాత్మిక మార్గాల్ని యీ చిన్న తేటగీతిలో బహుచక్కగా వింగడించాడు తెనుగులెంక! ఇది భావవైచిత్రి! ఇది నవోక్తి!

బువ్వలేనివాడు భుజబలముండదు
**తిండిలేనినాడు తెలివిసున్న**
మెతికులేనినాడు బ్రతుకే హుళిక్కిరా
కూడువలయు బ్రాణిగొడవలడగ —ఎక్కట్లు

"తిండికలిగితె కండగలదోయ్" అన్నాడు గురజాడ. "బువ్వలేక పోతే భుజబలముండదంటాడు తెనుగులెంక! "**A sound mind in a sound body**" అన్నది ఆంగ్లేయ సామెత. దేహదారుఢ్యం బాగుంటే బుద్ధిబలం పెరుగుతుంది గదా! తుమ్మలవారు యిదే భావాన్ని "తిండిలేనినాడు తెలివిసున్న" అని అచ్చమైన జాను తెలుగులో చెప్పాడు. పైగా మెతుకులేకపోతే బ్రతుకే శూన్య మంటాడు నిజమే! అన్నమేగదా ప్రాణికి 'జీవాధారం'! అందుకే

అన్నం పరబ్రహ్మం అన్నారు. కనుక కూడువలయు బ్రాణిగోడవ లడగ ఆకలిమంటలు ఆరటానికి - క్షుద్బాధ పోవడానికి 'అన్నమే' మందు. లేకపోతే యెన్నో సమస్యలెదురౌతాయి. ఎంతో ప్రమాదం కూడా! అందుకే "కడుపునిండిన మీాదె కలలన్ని కళలేను" అని భీమన్నగారన్నారు! "ఆకలేసి కేకలేసాను" అని శ్రీ శ్రీ అన్నాడు. "కాలేకడుపులు మండేగుండెలు ఏకమైతే, యెదురుతిరిగితే లోకాలన్నీ వూగిపోవా - శోకాలన్నీ ఆగిపోవా" అని ఓ అభ్యుదయకవి బలేబాగా చెప్పాడు. కడుపునిండితే కైలాస మన్నారు. జానెడు పొట్టకోసమేగదా ప్రతిప్రాణీ పడేతిప్పలన్నీ (కోటివిద్యలు కూటికొరకే అన్నారు) ఈ చిన్ని ఆటవెలదిలో చక్కని తెలుగునుడులలో ఎంత పరమసత్యం సెలవిచ్చాడు తల పండిన తెనుగులెంక.

ఛందోబద్ధ పద్యప్రక్రియల్లో "అందానికికంద" మంటారు. ఇక కందానికి 'తిక్కనసోమయాజి ఘనుడంటారు. తిక్కన రాసినన్ని కందాలు అభినవతిక్కన రాయకపోయినా - కందాన్ని అందంగా హృద్యంగమంగా వెలయించగల కవితాశిల్పి తెనుగులెంక- మచ్చుకు కొన్ని—

నెఱకఱకు జాల వానన్
ముఱిగిన గ్రుడ్డులను నన్ను ముంచిరి మిగులన్
జఱచిరి గ్రుద్దిరి తన్నిరి
బెఱచిరి తలచీర కూలిచిరి నేలపయిన్ (ఆత్మకథ)

దక్షిణాఫ్రికాలోని డర్బన్ ఓడరేవులో నౌకనుండిదిగిన గాంధీజీని గిట్టని తెల్లవారు నానావిధ హింసలుపెట్టిన ఘట్టమిది కందంతో తెనుగులెంక కన్నులగట్టినట్లు వర్ణించాడు.

ఎండకు వానకు జంకక
పండించిన ధాన్యమెల్ల బాతఅలందున్
నిండించి తినుచు బెట్టుచు
నుండెడి కర్షకుడె ధన్యుడూహింపంగన్ —ఆత్మార్పణము

ఎండలో, వానలో, చలిలో చెమటోడ్చి పొలంపండించే రైతు లోకానికి అన్నదాత అంటూ యీ కందంలో పరమసత్యాన్ని చెప్పాడు తేట తెలుగు 'పదబంధం' యెంతబిగువుగా వుందో తెలుస్తుంది.

సంపన్నులు తమ బంగరు
గంపలకున్ దాము ధర్మకర్తలయని భా
వింపవలయు బేదలరసి
పెంపవలయు ద్రుంపవలయు బిసిడితనమ్మున్
—సర్వోదయగానము

సంపద ఒకరిగుత్త పెత్తందారీ అజమాయిషీ క్రిందవుండకూడదని- అది అందరిసొత్తుగా ఒక ప్రభుత్వ ధర్మకర్తల సంఘం అజమాయిషీ క్రిందవుండాలని అంటాడీ కందంలో.

అది సత్యం బది జ్ఞానం
బది పుట్టువు చావులేనిదది యానందం
బది శాంతము శివమద్వయ
మదెబ్రహ్మంబది యుపాస్య మమృతార్థులకున్ —ఎక్కట్లు

ఆది మధ్యాంతరహిత 'సచ్చిదానందమయ' పరబ్రహ్మస్వరూపాన్ని యీచిన్ని 'కందం'లో అందరికీ సులభంగా అర్థమయ్యేలా 'అందంగా' ఛందోబద్ధంగా చెప్పాడు శ్రీ తుమ్మల.

కలమెత్తిన హలమెత్తిన
మలమెత్తిన వారినొక్కమై జూడవలెన్
వలతియు నలతియు లేదిట
బలువృత్తులు సాగినపుడె బ్రదుకులు సాగున్(సందేశసప్తశతి)

వివిధ వృత్తులలో 'ఉచ్చనీచాలు' లేవని - వృత్తిగౌరవం - వృత్తి సమభావం యీ కందంలో 'చక్కని చిక్కని' భాషలో అందంగా యిందులో చెప్పాడు.

ఆటవెలది ఛందస్సులో పద్యం రాయడంలో యోగివేమన పెట్టిందిపేరు. నిజజీవితంలో 'ఆటవెలది' (వేశ్య) వలలోపడి 'ఆట వెలది' (నర్తకి) నాట్యానికి పరవశించిపోయి ఆటవెలదికి దాసుడై పోయి - చివరకు యోగియైన కొండవీటి రాచబిడ్డ వేమారెడ్డి - వేమనకవియై-'ఆటవెలది' చమత్కారంతో 'ఆటవెలది'ని ఛందస్సులో - ఆటలాడించి - నాట్యమాడించి సమకాలీన సామాజిక మూఢా చారాల్ని మతాచారాల్ని దుమ్ముబట్టి - ఆధ్యాత్మిక బోధగావించి సిద్ధిపొందాడు ! 'ఆటవెలది' ఆటయెట్టిదో చూడని - 'ఆటవెలది (వేశ్య) ముఖమేకాదు పరస్త్రీ ముఖాన్నిపహితం చూచియెరుగని ఏకపత్నీవ్రతుడు— నాతి 'బ్రహ్మచారి (గాంధిజీవలె) అయిన గాంధీభక్తుడు శ్రీ తుమ్మల 'ఆటవెలది ఛందస్సులో అలతి అలతి తేటతెలుగుపదాలతో - యోగివేమన కవిని తలతన్నేవిధంగా- పద్యాలు పుంఖానుపుంఖంగా వెలయించి — లయబద్ధంగా నాట్య మాడించి వేమనవలెనే - సమకాలీన సామాజిక దుష్కృతల్ని ఖండించి సామాజిక కల్యాణంకొరకు హితసందేశమిచ్చినాడు తెనుగులెంక. "ఆటవెలది రచనమున నీవు అందెవేసినచేయి. వేమనార్యునకు నీరు వారసుల"న్న శ్రీ తూమ్మాటి సత్యనారాయణగారి మాటలు "అక్షర సత్యాలు" మచ్చుకు కొన్ని ఆటవెలది పద్యాలు చూస్తాం

పలుకుబడులు సామెతలు నానుడులు తేనె
పంటివోని తెలుగు పంటయెల్ల
నాదగదగిన శయ్య నొయ్యారములు గుల్క
నాటవెలది కవుల నీటుకొలది —సందేశసప్తశతి

పలుకుబడులు - సామెతలతో తేటతేలియు పంటనిచ్చే తెలుగు కవిత్వం- నాటవెలది వయ్యారములొలుకు శయ్యాసౌకుమార్యంతో ఒప్పారుతుందన్న సత్యాన్ని 'ఆటవెలది' ఛందస్సులోనే చెప్పి తెనుగులెంక తన కవితాశిల్ప నైణజాణతనాన్ని నిరూపించుకున్నారు! "అలతి అలతి నుడుల నలరు తెలుంగున / కాటవెలది మిగులనంద గించు" నంటూ చిన్నచిన్న పదాలతో - బుడిబుడి నడకలతో- లయబద్ధంగా ఆటవెలది నాట్యమాడుతుందని - 'ఆటవెలది' ఛందస్సులోనే చెప్పటం తెలుగులెంక చాతుర్యం !

సత్తుచిత్తటంచు జదువునేర్వని ప్రజ
నదరగొట్టు మాట లవలబెట్టి
పల్లెపల్కుతోడ బరతత్త్వమును జాటి
విశ్వకవిగ నిల్చె వేమయోగి (సందేశసప్తశతి)

సచ్చిదానంద పరబ్రహ్మమని చెప్పు వేదాంతాన్ని ప్రజలభాషలో జాను తెనుగులో - అక్షరజ్ఞానంలేని ప్రజలకు 'బ్రహ్మజ్ఞానం' నేర్పాడట వేమన !

పిట్ట పిట్టపోరు పిల్లితీర్చినదయా
యెట్టుదానిజూడ వెట్టిపుట్టె
కూరలేనితిండి కుక్కతిండి యటన్న
తెలుగునోటి కాటవెలది బోటి ! (సందేశసప్తశతి)

తెలుగు లోకోక్తులు ఆటవెలది ఛందస్సులో తెనుగులెంక ఎలా బిగించాడో గమనించారు గదా !

అప్పులేనిగంజి దొప్పెడైనను చాలు
నోరుమంచిదైన నూరుమంచి
దత్తలేని కోడ లుత్తమురాలన్న
తెలుగునోటి కాటవెలది బోటి (సందేశసప్తశతి)

పలుకుబడులు - సామెతలు 'ఆటవెలది'లో ఎలా ఒదుగుతాయో పై పద్యం ఉదాహరణ.

మల్లెపూవుకాదు మానస కమలంబు
నీయవలయు భక్తుడీశ్వరునకు
అగరువత్తికాదు భగవానుకడ నహం
కార ఘోరఫణిని గాల్పవలయు (సందేశసప్తశతి)

మల్లెపూవుకు బదులు మనిషి తన 'మనస్సు'ని ఈశ్వరుని పాదాల చెంద అర్పించాలని (సర్వస్య శరణం) దేవునిదగ్గర అగరబత్తికి బదులు 'అహంకారాన్ని' కాల్చివేయాలని "గొప్పతత్త్వాన్ని" ఆటవెలదిలో ఎంత తేలిగ్గా చెప్పాడో చూడండి.

కొయ్యపావుకోళ్ళు క్రొల్లాయి ములకట్టు
సొరగుల్కు ముదుకచ్చైర వాస
మలతి చేతికఱ్ఱ ముల్రతాటి గడియార
మొనర గాంధి కుట్టులను గరంచె (మహాత్మకథ)

చిన్నచిన్న తేటతెలుగు మాటలతోడి 'ఆటవెలది' పద్యంలో గాంధీజీ 'నిరాడంబర' వేషాన్ని చెయ్యితిరిగినగాంధికవి శ్రీతుమ్మల చక్కగా 'రూపు' కట్టించాడు.

ఇంకో చక్కని ఆటవెలది చూడండి.

అంటుసొంటులేని యందాలు కొఱవోని
మాటనేర్చి మాటకోటువడని
బ్రదుకునోర్చి కృతులు పల్కిన యానాటి
నేటి కవులకెల్ల నేటికోళ్ళు (మహాత్మకథ – కృత్యాది)

చిన్నచిన్న తేటతెలుగు మాటల్లో ఆటవెలది పద్యం ఎంత చక్కగా చెప్పాడో చూసారుగదా !

నియతి లేనినాడు నిలువదు రాజ్యంబు
నియతి లేనినాడు నిలదుకైత
నియతి లేనినాడు నెగడదు లోకంబు
నియతి వలయు నశుభ నికృతిపొంత —నాకథలు

ఒక "నియమం" ఒక "క్రమపద్ధతి" ఉన్నప్పుడే కవిత్వం కానీయండి, రాజ్యం కానీయండి, చివరకు "లోకజీవనం" కానీయండి "సాఫీ"గా సుఖప్రదంగా సాగుతుందని కవి భావన.

దుక్కి దున్నిదున్ని మొక్కలు నాటి, నీ
ర్వోసి వోసి నవసి పోయిరన్న
లిపుడు తోటకాచి యింటికి వచ్చిన
మావిపండ్లు తినుట మనకుదక్కె —ఉదయగానం

రైతు చేనుదున్ని మొక్కలునాటి - నీరెట్టి - పెంచి - పంట పండించునట్లు - నాయకులు నానాకష్టాలుపడి ప్రత్యేకరాష్ట్రం సాధించారు. ఆ ఫలం అనుభవించే అదృష్టం మనకు దక్కిందని తేట తెలుగులో ఆటవెలదిలో భావబంధురంగా చెప్పాడు.

బొట్టుబలిసి నేడు విట్టువీగుచునున్న
సాహుకార్లయాట సాగదిట్లె
రుద్రమూర్తియై దరిద్రుండు చిచ్చుల
కన్నువిప్పి గజ్జెగట్టు నెపుడొ— —ధర్మజ్యోతి

ఈ చిన్ని ఆటవెలది పద్యంలో ఎంతటి సామాజిక అన్యాయం-ఆర్థికదోపిడీ తాలూకు విప్లవభావం ఇమిడివుందో గమనించండి. పేదవాడైన శ్రామికుడు ధనికభూస్వామిక వ్యవస్థపై "శివుడి"లా మూడోకన్ను విప్పి ప్రళయనాట్యంచేస్తాడట! ఒకచిన్న 'అణుబాంబు'లో ఎంతటివిధ్వంసకశక్తి 'దాగి'వుంటుందో అలానే యీచిన్ని ఆటవెలది పద్యంలో ఆటంబాంబుకున్నంత విస్ఫోటనాశక్తి-విప్లవశక్తి యిమిడి

వున్నది ! "పద్యరచన మింతకంటె బాగుగా నుండుటకు తెలుగు నేనెఱుగ"నని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి యీపద్యాన్ని ప్రశంసించాడు.

ఆటవెలది, కందం, ఎంత అందంగా, తేట తెలుగుతో ఛందోబద్ధంగా ఆటలాడించగలడో - తేటగీతిని కూడా అలా తీర్చిదిద్దగలడు తెనుగులెంక. మచ్చుకు రెండుమూడు పద్యాలు చూడండి.

ప్రేమ గలచోట నీరసపెరుగబోదు
ప్రేమ గలచోట కత్తి కన్పింపబోదు
ప్రేమ గలచోట నాకటి పీడలేదు
ప్రేమ గలచోట ప్రాణికే భీతిలేదు

(సర్వోదయగానం-భావే చక్కట్లు)

చిన్న చిన్న తేట తెలుగు మాటల్లో భావం - భాష - చెట్టాపట్టాలు పట్టుకొని - యెలా అలవోకగా గలగలా గోదావరిలా సాఫీగా సాగిపోయాయో చూసారుగదా.

ఇంకో ఉదాహరణ చూడండి.

భావమైనను బలుకైన బలుకులోని
చేవమైనను జెలువైన దావిమైన
కవికి నీకృపచేతన గలుగుగాన
నిడెద వాగేశ్వరీ! నీకు నేటి కోళ్ళు —ఏక్కట్లు

అలతి అలతి లలిత లలిత తెలుగు పదాలతో భావం - భాష మమేకమై యెలా పద్యం నడకసాగిందో గమనించారుగదా !

భగవద్గీతలోని ఒకపట్టాన బుర్రకెక్కని వేదాంతాన్ని చిన్న తేటగీతిలో తేట తెల్లంగా చాలా తేలిక తెలుగుపదాలతో సులభంగా గ్రాహ్యమయ్యే విధంగా ఎంత చక్కగా చెప్పాడో చూడండి.

పొంగడెవ్వడు వైరంబు పూనడెవడు
కుందడెవ్వడు ఫలములు కోరడెవడు
మంచిచెడ్డల నెవ్వండు మరగడతడు
నాదు భక్తుడు వాడెహో! నాకు ప్రియుడు —గీతాదర్శము

చిక్కని తేటగీతికి మరో చక్కని ఉదాహరణ.

వడివడిన్నాదు చెంపలు వాపగొట్టి
పచ్చిబూతులు గూసి నన్ బండినుండి
క్రిందకుం ద్రొబ్బ జువ్వలంకించుకొంటి
ముడుసులు తొలంగినం బట్టు విడవకుంటి (ఆత్మకథ)

ఈ పద్యమందలి పదాలన్నీ తేట తెలుగు పదాలు గాంధీగారు దక్షిణాఫ్రికాలో వుండగా జట్కాబండివాడు ఆయన్ని చివరకూర్చోబెట్టి శ్వేతజాతీయులకు ముందున్న మంచిసీటులిచ్చాడు. ఇదేమి అన్యాయమని అడిగినందుకు గాంధీజీకి జట్కావాడు చేసిన "సత్కార" మది !

ప్రాతదన్నది సర్వంబు రోతగాదు
క్రొత్తదన్నది సర్వంబు గుణముగాదు
ప్రాతక్రొత్తలలో మేలిరీతులెఱిగి
చేయవలయును సాహితీసృష్టి సుకవి —"నేను"

భావం- భాష ఎంతో చక్కగా - సహజంగా- తేటగీత ఛందస్సులో అందంగా అమరాయి. "పాతకొత్తల మేలుకలయిక-" అన్ని విధాల మంచిదంటాడు కవిగారు.

దేశి ఛందోరీతులలో తిక్కనామాత్యునివలె చక్కగా చిక్కగా పద్యమల్లు జాలిన తెనుగులెంక "వృత్త"రీతిలో ఛందోబద్ధంగా హృద్యంగమంగా పద్యం చెప్పగలడని చూసాం. గీతమాలిక,

మంజరి మాలిక, ద్విపదమాలికల్లో "దీర్ఘమాలిక" లల్లగల్గిన తెనుగు లెంక "వృత్తమాలికలు" గూడా చిత్తమలరించే విధంగా చెప్ప గలడు. మచ్చుకొక 'ఉత్పలమాలిక' పట్టాభి సీతారామయ్య అఖిలభారత కాంగ్రెస్ అధ్యక్షుడైన ఘట్టమిది చూడండి !

....భారత మాతృపూజకై
తల్లడపాటులేని బలిదాన మొసంగిన తెల్గుబిడ్డకే
నల్లనలేని జోదునకు నాల్గుదెసల్ జయపెట్ట ముత్తెపుం
జల్లులుచింద దూర్యముల సందడిరేగ దురంగ కింకణుల్
ఘల్లునమ్రోగ సత్కవులు కబ్బములం గొనియాడ గాయకుల్
పల్లవిపాడ గ్రొంబసిడి పళ్ళెములెత్తి నివాళిపట్టి సం
ఫుల్ల సరోజనేత్ర విలతిపూత చరిత్రలు బొట్టుదిద్ద రా
ట్తల్లజునట్లు పుణ్యములు దాల్చిన రూపమునట్లు వచ్చి య
ల్లల్లన హైమరుక్కబళి తామ్రమ కాంగ్రెసు పీఠమెక్కు భా
గ్యోల్లసనం బికంగలుగదో ! తగదో !

(పటిగపంట)

ఇలా సాగిపోతుందీ "దీర్ఘ ఉత్పలమాలిక".

1942 లో తుమ్మలవారికి అప్పికట్లలో ఘనసన్మానం జరిగింది. అందుకాయన 'ఉత్పలమాలిక'లో కృతజ్ఞత తెల్పుకున్నాడు.

ఓ సుగుణాఢ్యులార ! మహిమోన్నతులార ! సదస్యులార ! వి
ద్యాసముదీర్ణలార ! కవితావనితా పరిరంభణ ప్రభూ
తాసమకీర్తులార ! రసికాగ్రణులార ! నమస్సహస్రముల్
చేసెదమీకు నన్నొక విశిష్టునిగా గొనియాడి క్రొవ్విరుల్
దోసిటనెత్తి సత్కృతివిధుల్ పచరించుటజేసి నిర్భరో
ల్లాసముకల్గె, మై పులకలన్ మునిగెన్, సకలేంద్రియమ్ముల
భ్యాసములేని సంతసమ్మునందె ! నహో! సరిక్రొత్త పుట్టువున్

మోసితిగాని విశ్వజనమోహన సత్కవితా మనీషితా
భాసురులైన యిట్టి కవిపండితశేఖరులున్న కొల్వులో
గాసటబీసటల్ చదివి కావ్యకలాచతురత్వ మర్మముల్
వీసమెఱుంగలేని యవివేకికి నాకిటువంటి మెప్పులే
లా సెలవిండు! ......... (శబల)

ఇలా సాగిపోతుందీ ఉత్పలమాల వృత్తమాలిక శ్రీకృష్ణ దేవరాయలవారి ఆస్థానంలో 'కవ్యష్టదిగ్గజాలకు' పెద్దతలకాయ అయిన పెద్దనగారు రాయలవారిమీద ఉత్పల / చంపకమాలికను 'భువనవిజయం'లో ఆశువుగా చెప్పాడు. ఇలా "వృత్త" మాలికలు చెప్పిన కవులు - ప్రాచీనులలోగాని - అర్వాచీనులలోగాని వ్రేళ్ళ మీద లెక్కపెట్టవచ్చు. ఇట్టి 'దీర్ఘకవితామాలికలను అటు 'వృత్తఛందస్సులోను యిటు దేశిఛందస్సులోను 'పుంఖానుపుంఖంగా తెనుగులెంక వెలయించాడు !

దేశీయ 'ఛందస్సు'లైన ఆటవెలది తేటగీత పద్యాలు తెనుగు లెంక సహస్రాధికంగా వెలయించాడు. మాగాణిచేలలో వరినాట్లు (ఊడ్పులు) పూర్తిఅయిన తర్వాత-వరిపంట రోజురోజుకు 'క్రమాభివృద్ధి'గురించి రైతుకవి తేటగీతమాలికలో వివరించినవిధం చూడండి.

మునుములను దీర్చినాటిన మొక్కలెల్ల
దేఱుకొని పచ్చమూనకు దిరుగవలయు
నెండు ముఱుగులు లేక చే నెదుగవలయు
వేయి కట్టలుగా దుబ్బు విరియవలయు
జిత్తలో జిఱుపొట్టకు జేరవలయు
దోడుతోడుగ బోటాకు దొడుగవలయు
సుంకు మోయుచు నందాలు చూపవలయు
మడమతాలూచ తెఱమచ్చ మానుకాయ

పొలకువలు లేనికాపుతో గులుకవలయు
జంపుగల కంకితో నట్టు వంపవలయు
వలిముదిరి ముగ్గబాటి కై వ్రాలవలయు
మూలమూలకు నొకకుప్ప తేలవలయు
సందడిగ బొలికేకలు సాగవలయు
మేరువో యన మేల్రాసి మెఱయవలయు
దేవతలపేర బొం. గళ్ళు తీరవలయు
బిచ్చగాండ్రకు సంతోష మెచ్చవలయు
బహుమతులతోడ పాలేరు బలియవలయు
నేపుగల "వెల్లగుట్టము" నెక్కి పొంగి
కాపు ధాన్యపుబండ్లతో గదలవలయు
మండువా గదెగంపల నిండవలయు —

(పైరపంట - వరినాట్లు)

చూడండి. వరిపంట 'దినదినాభివృద్ధి' చెందుతూ-దశలుదశలుగా పెరిగి పండి కోతకు రావడం— ఆ తర్వాత వరికోతలు - కుప్పనూర్పిళ్ళు క్రొత్తధాన్యం రైతుల యిండ్లకు చేరడం - తెనుగులెంక 'రైతు'గా 'కవిగా' ఎంతో మనోజ్ఞంగా వర్ణించాడు. ఈ గీతమాలికలో మునుము, నాటిన మొక్క, పచ్చమూన, ఎండుముఱుగులు, చేగునె దుగుట, కట్టలు, దుబ్బు, చిఱుపొట్ట, పోటాకు, సుంకు, మాను కాయకాపు, కంకి, అట్టు, వలి, ముగ్గబాటి, పాయ, పుట్టి, రాజ నాల్, పందుట, కుప్ప, పొలికేక, రాసి, పొంగళ్ళు, పాలేరు, ధాన్యపుబండ్లు, వెల్లగుట్టము, మండువా, గాదెగంపలు— ఇవన్నీ 'వరివ్యవసాయం' నకు సంబంధించిన 'పదాలు' మొక్కనాటిన (నాట్లు - లేక ఊడ్పులు) దశదగ్గర నుండి పంట యింటికిచేరే దశ వరకు తెనుగులెంక ఒక 'విశాల' దృశ్యాన్ని "మన కట్టెదుట యీ

గీతమాలికలో చూపెట్టాడు. ఏమాత్రం వరివ్యవసాయం చేసిన వారికిగాని, తెలిసినవారికిగాని, యీ గీతమాల చదివినా, విన్నా- ఒక 'దృశ్యం' వాళ్ళకళ్ళయెదుట సాక్షాత్కరిస్తుంది - అలరిస్తుంది. తేటగీత ఛందస్సుకు యతిప్రాసలున్నా అంత్యప్రాసలేదు తెనుగు లెంక— "అంత్యానుప్రాసం" నిలిపి, గీతమాలికకు ఎంతో రమణీయకతను సంతరించి తద్వారా 'రససిద్ధిని'ని సాధించిపెట్టాడు. భాషమీాద గట్టిపట్టుగలవాడు కనుక తెనుగులెంక అంత రసస్ఫోరకంగా - హృదయరంజకంగా గీతమాలిక నల్లగల్గాడు.

మరో తేటగీతమాలికను చూడండి—

మహాత్ముడు క్షామపీడిత వంగభూమిని దర్శింపనున్నాడు. భయంకర క్రూరక్షామ రాక్షసి వంగసీమలో చేస్తున్న ఘోరకరాళ నృత్యహేలని - దురంత దుర్భరాగ్రహావేశ వికటాట్టహాసాన్ని తెనుగులెంక వర్ణించినతీరు చూడండి.

గీ॥ అది దురాశాపిశాచీ సమర్చన ప్ర
భూత సవన బృహద్భాను హేతివదన
హూత దయాధర్మలకు - నరాకృతినివిష్ట
దుష్ట రక్షస్సులకు - జగద్ధూమకేతు
వులకు, గేతువులకు, వణిక్కులకు, నిలయ
మది నిరంకుశక్షామ దురంత దుర్భ
రాగ్రహావేశ వికటాట్టహాస జవన
గమన విన్యాసముల కసంఖ్యాత సాధు
మానవీ మానవచ్ఛటా ప్రాణమాన
రాశి బలివోయినట్టి నిర్భాగ్య దేశ
మది మహాభూతవేతాళ మదవతీప

రంపరా రూక్షఖడ్గ నిర్యత్ప్రభాస
ముజ్జ్వలద్దంష్ట్రమై మృత్యువుగ్ర దీర్ఘ
జిహ్వలార్చుచు వాహ్యాళి చేసినట్టి
రంగమది, మదిగరగించు వంగభూమి — (మహాత్మకథ)

వికటాట్టహాస నిరంకుశ క్రూరపదఘట్టనలతో క్షామరాక్షసి చేసిన కరాళనృత్య హేలని - క్రూరవిహారాన్ని - సంస్కృతపద మృదంగ శబ్దభేరీ ఝాంకృత తాడనలతో - శ్రుతి చేసి-లయకలిపి-అమాయక సాధు మానవకోటి ప్రాణాల్ని బలితీసుకున్న మృత్యువు ఉగ్రదీర్ఘ జిహ్వాలార్చుచు వంగభూమిలో వీరవిహారం చేసిందట! ప్రౌఢపద గుంఫన విన్యాసం - క్షామదేవత - మృత్యురాక్షసి 'పదఘట్టన'ల్ని స్ఫురింపచేసే రీతిగా ఆ సన్నివేశంలోని పద్యపాదాల్ని నడిపించాడు కవి. కవితాశిల్పంలో ఆరితేరి భాషపై గొప్పపట్టు ఉన్న కవికనుక తెనుగులెంక సన్నివేశాన్ని 'నాటకీయ' శక్తిలో చక్కగా అక్షరబద్ధం చేసాడు. తుమ్మలవారి ప్రత్యక్ష సంస్కృత గురువులు శ్రీ దువ్వూరి వేంకటరమణశాస్త్రిగారు మెచ్చుకొన్నదీ 'గీతమాలిక' మహాత్మకథకు ఆయన వ్రాసిన పీఠిక (అవతారిక) లోనిది గమనించగలం.

తెనుగులెంక దేశీయఛందోరీతులైన "అక్క-చెల్లెళ్ళు" అనదగ్గ "ద్విపద మంజరీ" ఛందస్సులలో "మాలికల్లో" పద్యాలెన్నో రాసాడు.

ఈ క్రింది మంజరీమాలికను చూడండి.

చిఱుబంతి పసుపాడి సీమంతవీథి
గుఱిచేసి పెద్దకుంకుము బొట్టునలది
ముత్యాల తాటంకముల నొప్పదాల్చి
ప్రభలు చిమ్మెడు నడ్డబాస ధరించి

పాటపాటగ వెల్లబాఱిన కురుల
విరులతో జతగూర్చి వేనవిదీర్చి
మురువూరు సరిగకమ్ముల బిసాళించు
చెంద్రిక పూవన్నె చీరనుగట్టి
కరువునం బోసిన గఱువతనంబో
కరుడుగట్టిన యట్టి కారుణ్యరసమొ
మేలిదాల్చిన జగామేలి శీలంబొ
తొలుమిన్కు నాటి త్రైదువయో యనంగ
నెదుటనిల్చిన సెట్టి యిల్లాలు ... ధర్మజ్యోతి

కాళ్ళకు పసుపుపారాణినలది, నొసట పెద్ద 'కుంకుమబొట్టు పెట్టుకొని కుంకుమ నలదిన పాపిట ముత్యాలుపొదిగిన బంగారు పాపిటబిళ్ళ ధరించి - చెవులకు తళుకొత్తు బులాకీలు పెట్టుకొని, దీర్ఘనీలి శిరోజాలతో సువాసనలు వెదజల్లు పూవులుతురిమి జడవేసుకొని - పట్టుజరీ చీరకట్టుకొని, గఱువం, పరువం. కరుణం, మేలిశీలం ముప్పిరికొన్న నెమ్మోమితో - మెల్ల మెల్లగా నడికారుముత్తైదువ అయిన ఆసెట్టి యిల్లాలుయింటిలోనుండి "బయటి" కొచ్చింది! ఈయిల్లాలు యెవరో కాదు. నారయ్య పుణ్యాన 'పచ్చపచ్చగా' బ్రతుకుతున్న వైశ్యుని భార్య! తండ్రి నారయ్య 'నీతినిజాయితీ' గురించి కవిగారు ఆ వైశ్యునితో ముచ్చటిస్తూ పంచలో కూర్చుంటే - ఆనాటి తమ 'భాగ్యోన్నతికి' కారణభూతుడైన నారయ్యగారి కుమారుడు వచ్చాడని తెలిసి ఆ సెట్టిగారి యిల్లాలు కవిగార్ని పలకరించటానికి, తమ గృహంలో తప్పక భోంచేసి పోవలసిందని కోరటానికి యింట్లోనుండి 'పంచ'లోనికి వచ్చింది! · అదీ సన్నివేశం! అసలు విషయమేమిటంటే— యిది 'సెట్టిగారి' యిల్లాలి అలంకరణ కావచ్చుకాని. ఈ తెనుగులెంక చేసిన "యిల్లాలి" "వేషవర్ణన" కాస్తవున్న వారింటి తెలుగు

టిల్లాళ్ళ "వేషానికి" అలంకరణకు ప్రతీకయని గుర్తుచేయటానికే యీ పద్యం వుదాహరణగా యింత చెప్పవలసి వచ్చింది. ముఖ్యంగా శుభ కార్యాల సందర్భాలలోనో 'గుడికి పోయినప్పుడో - పేరంటానికి బయలుదేరినప్పుడో - ప్రతి తెలుగు గృహిణి అలంకరణకు "అద్దం" పడుతుందీ తెనుగులెంక చేసిన 'సెట్టియిల్లాలి' అలంకరణ వర్ణన !

తెనుగులెంక 'ద్విపద ఛందస్సు' ఆత్మకథ - మహాత్మకథలలో యెక్కువగా యుపయోగించాడు. 'మంజరికి 'కవలసోదరియైన' ద్విపద ఛందస్సులో "మాలిక"లోగూడా తెలుగులెంక కవితలు వెల యించాడు చూడండి !

మాయింటి మీయింటి మైత్రిని జాటు
మాయమ్మ మీయమ్మ మైత్రిని జాటు
మాయోజ మీయోజ మైత్రిని జాటు
మాయాత్మ మీయాత్మ మైత్రిని జాటు
మావారు మీరు మామక్కువల్ మీరు
మావాసి నిల్పిన మగలు మీరనుచు
మఱచిపోకుడు మమ్ము మామేలుగీళ్ళ
పరువు బన్నాలు మీపాలివ యంచు.... (ఉదయగానం)

దక్షిణాంధ్రులతో తూర్పు ఉత్తరాంధ్రులు చెప్పినమాటల్ని తెలుగు లెంక ద్విపదలో వెలయించాడు. తెలుగు ద్విపదకు యతిప్రాసల నియమమున్నా అంత్యప్రాస నియమంలేదు. అయినా అంత్యాను ప్రాసం నిల్పి కవితకు అందం తెచ్చాడు తెనుగులెంక.

తెనుగులెంక తిక్కనలా తన సాహిత్యంలో 'అలంకార' శోభను ఎందుకనో పెద్దగా అలదలేదు. అట్లని అసలు అలంకారాలు చేయలేదనికాదు. అటనట 'ఉపమానాలంకారాదు'లు గూర్చాడు. మచ్చుకోచోట తెలుసుకుందాం !

మధ్యాక్కర ఛందస్సులో కవితలు 'తెనుగులెంక ఆత్మకథ తదితర కావ్యాలలో 'శతాధికంగా' వెలయించాడు. తిక్కన కందం-మహాస్రగ్ధరలకు పెట్టిందిపేరు. అభినవతిక్కన అయిన శ్రీ తుమ్మల కందాన్ని అందంగా వెలయించినా, మహాస్రగ్ధర ఛందస్సులో పద్యాలు రాయలేదు. అయితే తెనుగులెంక మధ్యాక్కర ఛంద స్సులో ఎన్నో పద్యాలు రమణీయంగా వెలయించాడు. నవాక్కర లనీ "అభినవాక్కర"లనీ ఛందస్సులో సరిక్రొత్త ఛందోరీతుల్ని ప్రవేశపెట్టాడు తెనుగులెంక. మచ్చుకు రెండుమూడు మధ్యాక్క రలు చూస్తాం.

నన్నయ్యగారు 'మధ్యాక్కర'కు పెట్టిందిపేరు. శ్రీ కాటూరి వేంకటేశ్వరరావుగారు మెచ్చుకొన్న 'మహాక్కర' చూడండి.

నెఱయ బాడికినెడయై తనర్చువానికి నబ్బు నభ్యుదయము సౌరిది
దఱగునట్టిదకాని పెంపొందునె తగవరి సంపత్తి చందమ్మునన్
బెరిగెనె పులి చూల్పాలు నకెన్నేని బిడ్డలంగన్న దదన్వయంబు
సురభి తా నొక్క పాపనపడసిన సుబ్బదె తజ్జాతి పూజ్యమౌచున్

—ధర్మజ్యోతి

"నన్నపార్యునికి బిమ్మట మళ్ళా అంత చక్కగా మహాక్క రను (అక్కర) రచియించిన వారులేరు" అని కాటూరువారు అభిభాషించాడు.

ఆధునిక సాహిత్యంలో విశ్వనాథవారు 'మధ్యాక్కర' లకు పెట్టిందిపేరు. తెనుగులెంక గూడా 'మధ్యాక్కర' ఛందస్సులో విరివిగా పద్యాలు వెలయించినా - పేరుమాత్రం దురదృష్టవశాత్తు తెనుగులెంకకు దక్కలేదు.

తెనుగులెంక "మధ్యాక్కర" ఛందస్సులో ఆత్మకథలోను, యితర కృతులలో పద్యాలు రాసాడు.

మధ్యా॥ ఈ వంగభూమి నచ్చాంమమగు శాంతి యేర్పడు దనుక
నావచ్చు కార్యంబు ముగియ దీమాట నమ్ముడు భయము
నావలికిం ద్రోసి రామనామము నాత్మజపింపు
దేవంతనైన దూలించు మంత్రమిదే యగు జుండు.

హిందూముస్లింల మధ్య చెలరేగిన 'నౌకాళీ' యాత్ర సందర్భమున బాపూజీ అన్నమాటలివి !

తెనుగులెంక "నవాక్కరల"ని తాను క్రొత్త ఛందస్సు ఏర్పరుచుకున్నాడు. ఇందులో ఐదు (5) ఇంద్రగణాలు ఒక (1) సూర్యగణం - ఐదవ మొదటి యక్షరం యతినియమంతో పాటు ప్రాసనియమమున్నది.

నవా॥ ఈ సంపదలు నావికావు నావేయని నీకొన్ననాడు
నా సల్పినట్టి సేవకు విల్వయియుండునా నలుసంతయేని
ఈసీమగల భారతీయ సదస్సున కిచ్చెదవీని
నాసలన్ ద్రోసెదనని యెంచెనపుడు మోహనుడనసూయ !

దక్షిణాఫ్రికా నుండి గాంధీజీ కుటుంబ సమేతంగా స్వదేశానికి ప్రయాణ సన్నద్ధమైనపుడు - అక్కడి భారతీయులు - ఆంగ్లేయ మిత్రులిచ్చిన కానుకల్ని తిరిగి వారికి యిచ్చివేస్తానని గాంధీజీ చెప్పిన మాటల సన్నివేశమది !

తెనుగులెంక "అభినవాక్కరల"ని మరోక నూతన ఛందస్సును సృష్టించాడు ! ప్రతి పాదం నకు ఆరు (6) ఇంద్రగణములు ఒకటి (1) సూర్యగణం— 5వ గణం మొదటి అక్షరం యతిస్థానం- ప్రాసనియమం ఉంది,

**అభినా॥** చీరాల కాపైన గౌసుభేగీసు ప్రసిద్ధ సంగ్రామమ్ము నందు
శ్రీరామదాసున కండగానిలిచి యార్జించె నెల్లర మెచ్చుకోలు
కారాగృహమ్ము నందెన్నిన్ని తడవలో కాలమ్ముగడిపి నిరంత
రారాధకుండుగా నిలిచె దేశమ్ముకదిర! కాయం బూడ్చుదనుక

చీరాల - పేరాల - రామదండు 'దుగ్గిరాల బలరామకృష్ణయ్యకు శిష్యుడై - స్వాతంత్ర్య సమరోద్యమంలో పాల్గొన్న - కవిగారి మిత్రుడు 'జనాబ్ గౌసు బేగ్''నకు తన 'దివ్యజ్యోతి' (ఆయన మరణానంతరం అచ్చైన) ఖండకావ్యాన్ని అంకితమిచ్చిన 'నజరానా'లో యీ అభినవాక్కర ఛందస్సు తీర్చిదిద్దాడు.

తెనుగులెంక తన ఆత్మకథ మహాత్మకథ గాంధిగానం లలో 'దేశికవితారీతి' యైన 'మంజరి' ఛందస్సును విరివిగా వాడారు. గాంధీగానం లోని 'మంజరి' మచ్చుకొకటి.

....ఆంధ్రకేసరి యపుడు గర్జించి
కూర్పాసమును జీల్చి గుండె చూపించి
యెవ్వడా కాల్చువాడెవ్వడా దిట్ట
కాల్వవచ్చును గుండెకలదేని గుండు
శవము నీక్షింపక చననేను జనను
నన్నాప నెవనికున్నది నేడు దమ్ము
నను నిల్పలేడు పినాకియున్ నేడు— (గాంధిగానము)

ఇదే సన్నివేశాల్ని ''మహాత్మకథ''లో మత్తేభవిక్రీడిత వృత్త ఛందస్సులో బిగించినతీరు చూడండి.

ఎవడా కాల్చెడివాడు కాల్పవలె నాయీ ఱొమ్ముపై నీశవం
బవలోకింపక పోవనేనిపుడు; నన్నాపంగ నెవ్వానికు
న్నవి గుండెల్; నిటలాక్షుడడ్డుపడినన్ నాథాకకుంజాలడీ
యవనిన్ భీరులులేరు లేరు పరగర్వాగ స్పృహిష్ఠుల్ శఠల్

—మహాత్మకథ

విషయం ఒకటే అయినా - వివిధ ఛందస్సులలో దాదాపుల దేపదజాల మిముడునట్లు చెప్పటలో శ్రీ తుమ్మల కవితాశిల్పం గొప్పది! ఇలాంటిదే మరొకటి.

మదిర త్రాగక పొలసుమెక్కక
మగువనంటక భోగభూమిని
బ్రదికి బారిష్టరుగ బట్టము
పడసెననచూయా— (గాంధిగానం)

ఇది ముత్యాలసరాల మాత్రా ఛందస్సు. ఇదే విషయాన్ని 'ఆత్మ కథ'లో తేటగీతి ఛందస్సులో చెప్పిన విధం చూడండి.

తే. గీ॥ మాంసమునుమెక్క మద్యంబు మరగనొల్ల
నంగనను దాక నని యతండపుడు మూడు
బాసలాడించె నవ్వల నా సవిత్రి
సమ్మతింజూపె మత్ప్రయాణమ్ముపట్ల (ఆత్మకథ)

గాంధిగానం సంక్షిప్త స్వతంత్ర కావ్యం. ఆత్మకథ బాపూజీస్వయంగా చెప్పిన విషయాన్ని తెనుగులెంక తెలుగులో ఛందోబద్ధంచేయడం జరి గింది. ఐనా అదే అంశాల్ని వివిధ ఛందస్సులలో చెప్పగల నేర్పరి శ్రీ తుమ్మల మచ్చున కింకొకటి.

కం॥ నీచాన్నంబుల నిల్చిన
యాచెన్నటి మేను మోయ నాసక్తి పడన్
నీ చేతులలో జచ్చిన
నాచరితార్థత జగజ్జన స్తవ్యమగున్ (ఆత్మకథ)

దక్షిణాఫ్రికాలో నుండగా కస్తూరిబాయికి బాగా సుస్తీ చేసింది. మాంసాహారం పెట్టితేనే ఆమె త్వరలో కోలుకొంటుదని వైద్యుడు కరాఖండిగా తేల్చి చెప్పాడు. గాంధీజీ భార్యను సంప్రదించాడు.

ఆమె ససేమిరా ఒప్పుకోలేదు. ఆ విషయం కందం ఛందస్సులో వెలయించాడు కవిగారు.

అదే అంశాన్ని 'గాంధిగానం'లో 'నవాక్షర' ఛందస్సులో కవిగారు చెప్పిన తీరు చూడండి.

నీచాన్నముల కియ్యకొనక నా పాటించు నియమంబువిడక
నీచేతులందేను మరణింతునేని యీ నిఖిలజగంబు
నాచరిత్రను మెచ్చు నశ్వారంబగు మేను నాకేల కీర్తి
యాచంద్రతారకం బలరు గోరెద నిదే యనె ననసూయ !

ఒకే విషయాన్ని వివిధ ఛందస్సులలో చెప్పటలో చేయితిరిగిన చేవ గల్గిన కవితాశిల్పి — శ్రీ తుమ్మల అని చెప్పటానికే పై ఉదాహరణాలివ్వడం జరిగింది.

"భాషావిపర్యయమ్ము సైపని" తెనుగులెంక - పద్యం హృద్యంగా - ధారణకు అనవద్యంగా వుంటుందని చెప్పిన తెనుగు లెంక - కాలానుగుణంగా వచ్చిన మార్పులకు స్పందించి - కవితా వ్యాసంగంలోనూ తాను పద్యప్రక్రియను అంటిపెట్టుకొని కవితలు కావ్యాలురాసినా - తెలుగు కవిత్వంలో 'పుట్టుకొచ్చిన' వచన కవితారీతుల్ని - మాత్రాఛందస్సులో గేయరచనారీతుల్ని తుమ్మల వారుగూడా అవలంబించి - కవితలు వెలయించాడు.

వచన కవిత్వానికొక ఉదాహరణ. అది "గాంధిశతతమ జయంతి" సందర్భంగా గాంధీజీమీద రాసింది.

ఎవరు బాబూ ! నీవు
ఇంతడస్సియున్నావు
నడచినడచి అసురుసురై
తడిచెమటల వచ్చితివి
బస్సులేని రైలులేని

పయనము సాగించితివా !
నాటుచెప్పులు మోటుగుడ్డలు
నాగరికలేని వేషము !
ఎవరుబాబూ నీవు

................

అచ్ఛముగా నీవు మహాత్ముడవే
అనుమానములేదు లేదు
వచ్చితివా మరల నిచటికి

× × × ×

రమ్ము ! రమ్ము !
నమ్రతా శరణ్య పుణ్యభావనా !
రమ్ము ! రమ్యసంగయోగ
రాజదమల జీవనా !

* * *

రమ్ము ! రమ్ము ! స్వామి !
మాగృహమ్ము పావనమ్ము సేయ
రమ్ము ! రమ్ము ! మా కృపణత
రాచిరాచి తొలగద్రోయ !

* * *

ఉండుముండుము స్వామీ
యీ ఖద్దరు నూలుదండను
నీ మెడలో వేయనీ ! —— కదంబకైత

ఇలా సాగుతుంది దీర్ఘవచన కవిత !

లయబద్ధంగా సాగిన మరో వచన కవిత——

పేదవాని కడుపుమంట
పెరిగినచో జగమాగదు
ఏడు సముద్రాలు పొంగి
యే కార్ణవమై తీరును ! (కథంబకైత)

"రుద్రమూర్తియై దరిద్రుండు చిచ్చుఱ / కన్నువిప్పి గజ్జెగట్టు
నొ పుడో" అని ఆటవెలది రెండుపాదాలలో చెప్పిన భావమీవచన కవితలో చెప్పాడు తెనుగులెంక.

ఇంకో వచన కవిత—

పాటగాదు కైతగాదు
పదిబొమ్మలు గీతగాదు
మచ్చలేని మనుగడయే
మంది ముందు మెచ్చెడికళ— (చక్కట్లు - సత్కళ)

ముత్యాలసరాల ఛందస్సుకు ఆధునిక సాహిత్యంలో జీవం పోసినవాడు గురజాడ. ఆ ఛందస్సులో తెనుగులెంక 'నేతాజీ'పై రాసిన కవిత చూడండి !

భవ్యభారత మధురమూర్తీ
దివ్యభారత సవ్యసాచీ
నవ్యభారత చక్రవర్తీ
నతులు నీకివిగో— (పలిగపంట)

"గాంధిగానము" లోని మరొక ముత్యాలసరము:

చాకిపనియును మంగిపనియును
సలిపెనంతట గాంధి; వెచ్చావు
వ్రేకనన్ దొలగించు కోరిక
విరియ ననసూయా ! (గాంధిగానము)

సర్వోదయ సూత్రాన్ని పాటించి - గాంధీజీ స్వయంగా - తన గెడ్డం తాను గీచుకొన్నాడు - తనగుడ్డలు తా నుతుకు కొన్నాడు.

మాత్రాఛందస్సులో యీక్రిందిరాసినను వచనకవితను చూడండి.

అనరానివి యనుటమాని
వినరానివి వినుటమాని
తినరానివి తినుటమాని
కనుడీ! నరులీ! సత్కళ!— (చక్కట్లు)

ఒక్కొక్కపాదంలో 12 మాత్రలు! మొదటి మూడు పాదాలకు అంత్యప్రాస! ఈచిన్న కవితలో ఎంత 'నీతి' వుందో గమనించారు గదా! గాంధిగారుతనయెదుటి టేబుల్ మీదమూడుకోతులుబొమ్మలు. పెట్టుకొనేవాడు! "చెడువినవద్దు. చెడుఅనవద్దు. చెడుకనవద్దు అనే నీతిని బోధించేవిధంగా - కళ్ళు - నోరు - చెవులు మూసు కొనివుండే చైనావారి యీమూడుకోతుల బొమ్మలలోని 'నీతి' ని స్ఫురింపజేస్తుందీ తుమ్మలవారి పై వచన కవిత!

తెనుగుతల్లిపైని తెనుగులెంక రాసిన చక్కని 'జోహారు' గేయం చూడండి!

తెనుగుతల్లీ! నీకు జోహారు
దేశమాతా నీకు జేజేలు!
నినుజూచి నినుబాడి నినుగొల్చువేళ నా
కనులాణిముత్యాల గనులుగా నగునహో!.... తెనుగుతల్లీ

ఇలా సాఫీగా భావబంధురంగా సాగిపోతుందీ గేయం. "నిప్పు"వంటి తెనుగులెంక కవిత్వంలోగూడా చతురోక్తులు-చలోక్తులు - వ్యంగ్యోక్తులు ఉక్తివైచిత్రి నటనట మెరుపులా తళుక్కు మనిపించి పాఠకుల్ని రంజింపజేస్తాయి. మచ్చుకు రెండుమూడు ఉదాహరణలు చూస్తాం.

దిగిన చాన సొగసు తిలకించుచుండగా
బస్సు బుయ్యిమనుచు బరుగులెత్తె
దెల్లమొగముపైచె దెరువరి వాయిదా
నేడటంచు జడ్జి నిప్పటంచు — ఎక్కట్లు

పట్టణానికి వెళ్ళి కోర్టుకు హాజరుకావలసిన ఓ పెద్దమనిషి బస్సుకోసం వేచివున్నాడు. బస్సురానే వచ్చింది. బస్సునుండి దిగిన ఓ అందాలభామ కేసి 'కళ్ళప్పగించి' చూస్తూ నిలబడిపోయాడు. బస్సెక్కడం మరచిపోయాడు. బస్సు 'బుయ్యి'మని వెళ్ళిపోనేపోయింది. బస్సుపోయాక కళ్ళు తెరచాడు, ఒళ్ళు స్వాధీనంలోనికి వచ్చింది కోర్టుకు హాజరుకాకపోతే 'నిప్పులాంటి' న్యాయమూర్తి కేసుకొట్టేస్తాడేమోనని- 'లబోదిబో'మంటూ నెత్తీనోరూకొట్టుకొన్నాడుఆ పెద్దమనిషి ! ఆ పెద్దమనిషిలాంటి వాళ్ళు మనంచాలామందిని చూస్తూనేవుంటాం. ఏ 'స్త్రీ' అయినా ఎఱ్ఱగాబుఱ్ఱగా కనపడితేనో లేదా 'టిప్పటాప్పు' లండన్ దొరసానిలా 'స్టైలిష్'గాకనిపిస్తేనో పాపం,అందరి కళ్ళు ఆమెపైనే వుంటాయి ! "ఎఱ్ఱదాని మొగము ఏప్రొద్దు చూచినా బ్రమ్మకైన పుట్టు రెమ్మతెగుల"ని తెలుగునానుడి ఒకటుంది. "మొఱ్ఱదానిజూడ వెఱ్ఱిపుట్టె" అని తెనుగులెంక గూడా చమత్కరించాడు. ఈచిన్న ఆటవెలది పద్యంలో ఎంతచక్కని "చిరుహాస్యం" చమత్కారం తెనుగులెంక చెప్పాడో ఆనందించండి.

కట్టిన మఱునాడే మన
కట్టడములు కొన్నికూలె గాలువ లోనన్
దట్టెడు మన్నెంత్తిపని
దిట్టలకున్ బిల్లుముట్టె దిగబడకుండన్ —ఎక్కట్లు

బ్రిడ్జిగానీయండి బిల్డింగుకానీయండి, డాం కానీయండి - కట్టిన నాల్గురోజులకే కూలిపోయినా, కట్టించిన కాంట్రాక్టరునకు మాత్రం బిలు

మొత్తం ముట్టితీరుతుంది! కట్టడాలకు 'తల్లైసుమట్టి పట్టించని దొంగ కంట్రాక్టర్లమోసాల్ని బట్టబయలు చేసాడు తెనుగులెంక. ఇది వ్యంగోక్తి! కంట్రాక్టర్లకు మెత్తనిచిన్నిచురక !

తెల్లవాడు పోయె దేశంబునకు నిక
నవత వచ్చునని జనమ్ముపొంగ
నదియ వచ్చెగాని యరసున్నతోవచ్చి
కన్నకలలు నిండుసున్నచేసె —ఎక్కట్లు

తెల్లవాడు దేశంనుండి వెళ్ళిపోయాడు. స్వాతంత్ర్యం వచ్చింది అందరూ "సుఖశాంతి" (మంచి) ఆశించారు. అయితే వచ్చిన ఆ స్వాతంత్ర్యంలో "సుఖశాంతి" కాదు "దుఃఖం" బాధ వచ్చింది "నవత" ప్రజలు ఆశిస్తే అది "అరసున్న"తో అంటే "నవత"గా అంటే దుఃఖంతో వచ్చిందట ! ఇది చతురోక్తి ! వ్యంగోక్తి ఇందులో వ్యంగ్యం చమత్కారం 'ఇమిడి' వున్నాయి.

తలమీది వెంట్రుకలు తిరు
మలనాధునికిచ్చినంత మాత్రాన పొంగా
తలలోని పొగరు పొచ్చెము
బలిగా నిడవోయి! బాగు పడగా వెడగా!— ఎక్కట్లు

"తలలు బోడులైన తలపులు బోడులా" యని యోగివేమనకవి వూరకనే అన్నాడా నాలుగైదువందల యేండ్ల క్రిందట! తలమీధి 'వెంట్రుకలు' కాదు. తలలోని "పొగరు - పొచ్చెము" దుర్బుద్ధి-దుర్వ్యామోహం దేవునిముందు "తీసి" పెట్టాలి! బలిపెట్టాలి! అర్పించాలి. అప్పుడే బాగుపడతావు. పరమపదానికి అర్హుడవౌతావు! వ్యంగ్యంగా పచ్చినిజాన్ని పలికాడు "మచ్చుమసకలేని" తెనుగులెంక! ఇదేభావాన్ని మరొకచోట "గుడ్డరంగు మార్చుకొన్నంత నేమాయె / మనసు రంగు మార్చుకొనుటవలయు" నంటాడు. ఇది వ్యంగోక్తి.

బస్సు గీపెట్టినను నడిబాట నుండి
కదలడేవాడు వదలెనా బ్రదుకుదీపి
యీ ప్రజారాజ్యమందు నన్నెవడు త్రోయు
నని మొరాయించెనా త్రాగెనా! సెబాసు —ఎక్కట్లు

బస్సువచ్చి "బుయ్ బుయ్" మని "హారన్" కొట్టికొట్టి 'చచ్చి' గీపెట్టినా - నడిరోడ్డుపై నుంచున్నవాడు తొలగడు! వాడికి బ్రతకాలని లేదా! లేక త్రాగాడా! లేక! "స్వతంత్ర" భారతదేశంలో అలానుంచునేహక్కు స్వేచ్ఛనాకు లేదా! యని వాడిపొగరాలేక తెలివి తక్కువతనమా! అని "ఆధునిక మానవుని" బెడబుద్ధిని వ్యంగంగా ఎత్తిపొడుస్తున్నాడు కవి! ఇది వ్యంగోక్తి!

భక్తిపెరిగికాదు పాపిష్ఠ పథముల
బసిడి కూర్చువారి భయముపెరిగి
పెరిగె మింటి దనుక దిరుమల వెంకన్న
బొక్కసంబులనుట నిక్కువంబు —కదంబకైత

అక్రమమైన గడ్డితిని దొడ్డిదారిన కూడపెట్టి - "పాపం" చేసామన్న "ఆత్మప్రబోధం"తో పాపభీతితో, ఆ అక్రమార్జనలోని కొంత "పాపపుసొమ్ము" తిరుమలేశుని" "హుండీ"లో వేసి గుండు గొరిగించుకొనే "దొంగభక్తుల్ని" దెప్పిపొడుస్తున్నాడు తెనుగులెంక! "సత్యమే దైవస్వరూపమని" నమ్మిన గాంధీభక్తుడైన తెనుగులెంక దృష్టిలో "ఏడుకొండలవాడి హుండీలోపడే డబ్బంతా "పాపపుసొమ్ము"నే గదా! విజ్ఞులైన పాఠకులిందులోని వ్యంగ్యాన్ని గుర్తిస్తూనే - యిరదలి "ఔచిత్యానౌచిత్యాల్ని" గ్రహించగలరు! ఇది వ్యంగోక్తి!

తిక్కనామాత్యునికివలె శ్రీ తుమ్మలవారు తెలుగు నుడికారాలు, జాతీయాలు, సామెతలు తన పద్యాలలో సమయ సంద

ర్భాల్ని బట్టి 'సహజం'గా చక్కగా పొందుపరిచాడని చెప్పుకున్నాం. వీటిని ఎంతసహజంగా ఛందస్సులో పొందుపరిచాడో మచ్చుకు కొన్ని చూస్తాం.

1) సొమ్ముపోయియు శనిచుట్టుకొన్న విధాన
నెదుటొమ్ముకుంపటై యదియలంచు....

(సీసపాదం - ధర్మజ్యోతి)

2) తెలుగుదోటను మూడుపూవులకు నాఱు
కాయలందింపజాలిన గడుసుమాలి

(తే. గీ. పాదం - శబల)

3) ఇల్లలికి నంతనే పండువెట్లు జరుగు
నిచ్చపడి నంతనే భక్తియెట్లు కుదురు

(తే. గీ. పాదం - పైరపంట)

4) దిక్కుమాలినట్టి దేషాభిమానంబు
కదలదయ్యె నన్ను వదలదయ్యె

(ఆ. గీ. పాదం - కదంబకైత)

5) దున్నబోవ దూడలలోన దూఱువారు
మేయబోవంగ నెడ్లలో మెలగదగునె

(తే. గీ. పాదం - రాష్ట్రగానం)

6) బావిలోని కప్పలావంత సంస్కృతి
నెఱుగరైననేమి తఱుగులేని

(తే. గీ. పాదం - (సర్వోదయగానము)

7) ఏవిత్తునవని నాటిన
నావృక్షమె పుట్టుగాని....

(తే. గీ. పాదం - ఉదయగానం)

8) గోళ్ళుగిల్లుకొనుచు గూర్చుండి జడుడు, త
న్నలచు వెతలవిధికి నంతగట్టు
(తే. గీ. పాదం - సందేశన ప్రశతి)

9) సొమ్ముదిని ఔమ్ముగ్రుద్దిన,
తిమ్మన రా నేరు దాటి తెప్పను గాల్పన్
(కందపద్య. పాదం - మహాత్మకథ)

10) ఇడుములిట్టివెన్ని కడుకొన్న నెట్టైటో
గుండెఊయి చేసికొంటిగాని
(ఆ. వె. పాదం - మహాత్మకథ)

11) ఊరకరాదు మహాత్ముల
కారణముగ ననుచు నంద్రుగావున నుడువం / గోరెద ...
(కం. పాదం - దివ్యజ్యోతి)

12) నేల విడిచి సాముచెఅపిన యట్లుండు
సంఘగతికి దవ్వు సాగి వ్రాత
(ఆ. వె. పాదం - నేను)

13) పిలిచిపీటవైచి ప్రేమ్మైజగమిచ్చు
కాన్కనందు టెగ్గు గాదు కవికి
(ఆ, వె. పాదం - నాకథలు)

14) నిప్పు వంటి బ్రతుకు నేర్చిన వాడౌట
గత్తివంటి కలమునెత్తనోపె
(ఆ. వె. పాదం - చక్కట్లు)

15) చేతగానివాని కోతల కొకయంతు
కానరాదు కస్తిలేనినాడు
(ఆ. వె. పాదం - ఎక్కట్లు)

16) అడ్డమాడక నీ తెచ్చునంతవారి
కింతవారికి మై మక్కెలెల్ల విఱుగ
వండివడ్డింపలేదె యీ మొండిజంతు / వేమి —

(తే. గీ. పద్యపాదం - ఆత్మకథ)

17) నీరు పల్లమెఱుగు నిజము దేవుడెఱుగు
మెతుకు లేనివాడు బ్రతుకలేడు
మెఱిసి నట్టిదెల్ల మేలిమి కాదన్న
తెలుగునోటి కాటవెలది బోటి

(ఆ. వె. పద్యం సందేశస ప్తశతి)

18) నేలవిడిచి సాముసేఁయపనిలోకజ్ఞ
పుంగవుండు కద తెలుంగురాజు

(ఆ. వె. పాదం - సమదర్శి)

19) అందని మ్రానిపండ్ల కొఱకఱ్ఱులుచాపకు డింద్రజాలముల్
వందలువేలుసూపి పెడవాదము సల్పిన గోవిదుల్ —

(ఉ. మా. పాదం - రాష్ట్రగానం)

ఇటువంటివి ఆయన కావ్యాలలో వందలాది సామెతలు-లోకోక్తులు - తెలుగు జాతీయాలున్నాయి.

"పలుకుబడులు సామెతలు నానుడులు తేనె / పంటిపోని తెలుగుపంట యెల్ల / నోదుగదగిన శయ్య నొయ్యారములు గుల్కు / నాటవెలది కవుల నీటుకొలది" అన్న తెనుగులెంక, తెలుగునాట జనసామాన్యం నోట నిత్యం తాండవించే సామెతలు, పలుకుబడులు, నానుడులు, ఆటవెలది 'ఛంచస్సు'లో అందంగా పొందుపరచి చూపించాడు. అట్టి ఆటవెలది పద్యపాదాలు కొన్ని మచ్చుకు— తెలుగు సామెతలు చూడండి.

1) అమ్మయైన బెట్టదడుగనిదే కూడు 2) ఎద్దుపుండు కాకి కేమిముద్దు 3) కడుపుతిండినపుడు గారెలు చేదన్న 4) అంచుడాబె కాని పంచెడాబు హుళిక్కి / అఱచునట్టి కుక్క కఱవబోదు 5) నోరు మంచిదైన నూరు మంచి/ దత్త లేని కోడలుత్తమురాలన్న 6) కోటివిద్యలైన కొండ్రకాపు 7) రెండిటికిని జెడిన రేవడయ్యె 8) గొంతుకోయువాని గోత్తరమ్ము 9) సిగ్గులేని దాని సింగారమేలన్న 10) బత్తెచావగానె పాడితెలిసె / పెదవిదాటగానె పెన్నదాటెనటన్న 11) పోరులేనికూడు బొక్కెడైనను చాలు (భక్తి గలుగు కూడు పట్టెడైనను చాలు - వేమన) 12) గంజిలేదుగాని గారె: కావలెనన్న 13) పిట్ట పిట్టపోరు పిల్లి తీర్చినదయా / యెఱ్ఱిదానిజూడ వెఱ్ఱిపుట్టె / కూరలేనితిండి కుక్కతిండి యటన్న మొదలగునవి.

ఇటువంటి సామెతలు - లోకోక్తులు తెనుగులెంక కవితల్లో కోకొల్లలు !

తెనుగులెంకకు 'ప్రీతి' పాత్రమైన, ఆయన తరుచూ వాడే అచ్చమైన జాను తెలుగునుడుల్ని, పదాల్ని కొన్నింటిని గుర్తుచేసుకొందాం— 1) కమ్మతీడు (రైతు) 2) కమ్మ (జాబు); (సేద్యం) (తీయని) ప్రాయసము (ఉత్తరం) 3) తనకు (నాకు) తన్ను (నన్ను) తాను (నేను) 4) కల్లకపుడు, కల్లకసటు (కల్లకపటము) 5) నేలప్రొద్దు (దేశకాల) 6) చాగము (త్యాగము) 7) చదురు (నేర్పు) 8) ప్రన్నన (మనోజ్ఞం) 9) తల్లిబాస (మాతృభాష) 10) వేలుపుబాస (సంస్కృతభాష) 11) మాసి, మానిసి (మనుష్యుడు) 12) తొలుపాలు (ప్రథమభాగం) 13) బందిగము (జైలు) 14) ఆకుతిండి, ఆకుబువ్వ (శాకాహారము) 15) మచ్చమసక (పొరపొచ్చెము - దోషము) 16) పొంటె (కొఱకు)

17) లొచ్చు (తక్కువ) 18) ఊచముట్టుగా (నిశ్శేషముగా) (పూర్తిగా) 19) చుమ్మలు వాఱగ (హృదయం కరుగునట్లుగ, కనుగొనల నీళ్ళు కదలునట్లుగ) 20) మహస్సు(తేజము, ఉత్సవము) 21) వెచ్చపడు (వ్యయపఱచు, వృథాపఱచు) 22) ఉడుగర (కానుక) 23) మూదల (నిదర్శనము) 24) ప్రేగు (బరువు) 25) చనవు (అధికారము) 26) సాహు (సాహుకారు) మొదలగునవి.

తెనుగులెంక 'భాషావిపర్యయమ్ము సైప' నని భీష్మించుకొని కూర్చున్నా, మారుతున్న దేశకాలపరిస్థితుల్నిబట్టి, జనసామాన్యం నిత్యం మాట్లాడుకొనే 'భాష'నుబట్టి, వాడుకలో ప్రచారంలోవున్న కొన్ని 'అన్యదేశ్య' పదాల్ని ఆయన స్వీకరించక తప్పలేదు; ఆంగ్లేయ పాలకులకు వ్యతిరేకంగా- ముస్లింల మద్దతుతో బాపూజీ నాయకత్వాన సాగిన జాతీయోద్యమ చరిత్ర (మహాత్మ కథ) రాయుటలో - గాంధీజీ లండను, దక్షిణాఫ్రికా దేశములందు నివసించుటచేతను 'అన్యదేశ్యపదాలు' ముఖ్యంగా ఇంగ్లీషు, హిందీ, ఉర్దూపదాలు తన సాహిత్యంలో ఉపయోగించక తప్పలేదు- మచ్చుకు కొన్ని— 1) ఖదరు ఖద్దరు, ఖాదీ 2) ఖిలాఫత్తు, 3) కచేరీ 4) జాబు, 5) పాకీ 6) రాట్నము 7) శిస్తు 8) సర్కారు 9) చందా 10) చాగురే 11) జగా 12) బయానా 13) సిపాయి 14) కాలేజి 15) ఇంగ్లీషు 16) హైస్కూలు 17) సంబళము 18) సాపాటు 19) సాహుకారు - యిత్యాదులు—

తెనుగులెంక ఛందోబద్ధంగా పొందుపరచిన కొన్ని అన్యదేశ్య పదబంధాలు— 1] లేబరపుంబ్రతుకు 2] కలాశాలలో బి. యస్. సి చదువుచుంటి 3] మూడేండ్ల కుఱ్ఱడే బీ. సీ. డీ లను దిద్దు దెల్గుసీమ మొదలగునవి.

తెనుగులెంక సాహిత్యంలో మనకు విరివిగా కనపడే- తెలుగు జాతీయాలు, తెలుగునుడులు (తెలుగు పలుకుపడులు) మచ్చుకు కొన్ని—

1] కన్నుపసియె 2] పొట్టకూటి చదువు 3] నీరునవలు 4] పప్పులుడుకుట 5] కన్నుబుస్సుకును 6] నెలతప్పిన 7] మాటలు వడ్డించు 8] ఆటలుసాగవు 9] గడ్డితిను 10] కాలాడక చేయాడక 11] తలకెక్కవయ్యె 12] బ్రతికిచెడ్డ 13] మాటపడు 14] మండిపడి చిందులుద్రొక్కు 15] తడిగుడ్డతో గొంతుగోయు 16] మొదలుచెడ్డ బేరమట్లు 17] తాబట్టిన కుందేటికి మూడే కాళ్ళు 18] మొండిపట్టుబట్టి 19] వేన్నీళ్ళకు చన్నీళ్ళగ 20] గోళ్ళగిల్లుకొనుచు కూర్చుండు 21] గుడ్లుతేలవైచి 22] ఆడబోదీర్థమే యెదురైనయట్లు 23] పోరుచట్టి పొందుపుష్టి 24] మందు మ్రాకులులేక మల్లాడు 25] చీమునెత్తురుగల 26] చిల్లిగవ్వయేని చేతిలోలేని 27] ఇబ్బడిముబ్బడిగా 28] దిక్కుమొక్కులేని 29] కడుపుగాని చెలువుగాదు 30] పండ్లుపులియబారు, 31] చదువుసంధ్యలు 32] కొంపకు నిప్పుపెట్టు 33] గుడ్డిలో మెల్ల - మొదలగునవి. ఇట్టి తెలుగు జాతీయాలు తెలుగుపలుకుబడులు - నానుడులు తెనుగులెంక కావ్యాలలో సహస్రాధికం!

తెనుగులెంక తన కవితల్లో పొందుపరిచిన (వాడుకలోలేని) అరుదైన అచ్చతెలుగు పదాలు మచ్చుకు కొన్ని—

1] క్రించు (అల్పుడు, నీచుడు) 2] కఱది (నీతి - బుద్ధి) 3] లంబి (కుటుంబం) 4] నంజ (మాగాణి) 5] పుంజె (మెట్ట) 6] పాణసి (మాల) 7] ఉఱని (లెక్కచేయని) 8] గుడ్డము (చేను) 9] పాడితావు; పాడిపట్టు (కోష్ఠ) 10] సంచకరువు (బయానా) 11] వటారి (ప్రౌఢము) 12] నోవి (వేదన) 13]

పదడు (బూది) 14] చెడగరము (దుష్టుడు) 15) చట (చోకాౘ) 16] కొట్టిగ (ఊరు) 17] కఱ (మచ్చ) 18] ఓట (భయము) 19] ఉప్పు (ఉడికించు) 20] అతిముఱితనము (కలత) 21] అధమర్ణుడు (ఋణపడినవాడు) 22] పొలి (కృతి;లాభము) 23] తగవరి, ధర్మదాత, (న్యాయాధికారి) 24] పాడిపల్కరి (వకీలు) 25] వాణిజ్యకోశము, అడితి బొక్కసము (బ్యాంకు) 26) జగా పాడిపట్టు (హైకోర్టు) 27] కమ్మతీడు (రైతు) దూసి (పరుగెత్తు) వాపొందు (భాషామైత్రి) మెఱవడి (గౌరవము) యిత్యాదులు "రైలు, కోర్టు, సిలుౘ, రైతు మున్నగునుడుల్ / తెలుగునోట నలగి నలగియుంట / నాదరింతువీని నన్యదేశ్యములైన / బెఱల జూచి బాస పెంపువలచి" అని తెనుగులెంక చెప్పినా, ఆయన యీనాడు నిత్యజీవితంలో జనబాహుళ్యం 'వాడుక'లో 'ప్రచారం'లో వున్న యిలాంటి 'అన్యదేశ్యపదాల'ను అంతగా వాడనే లేదు. "కోర్టు"నకు "పాడిపటు" రైతునకు 'కమ్మతీడు' పదాలు ఉపయోగించడమే తెనుగులెంకకు ఇష్టం. అది ఆయన యిష్టం.

తెనుగులెంక, తిక్కనామాత్యునిలా, మఱుగున పడిపోయిన, పోతున్న యీనాడంతగా ప్రచారంలో - వాడుకలోలేని, ప్రాచీన కాలంలో ప్రాచీన సాహిత్యంలో) వాడుకలోవుండిన (తాతలనాటి) తేటతెలుగుపదాల్ని ఏ కొద్దిమంది కవిపండితులకు తప్ప, సాహితీ ప్రియులైన జనసామాన్యానికి అర్థం తెలియని - యేఱియేఱి తన కవితల్లో పొందుపరచడం యిష్టం ! సరదాగూడా. "మఱుగు వడిన తెన్గుమాటలగాలించి కుస్తరించి కైతగూర్తునేను" అని ఆయనే స్వయంగా చెప్పుకొన్నాడు. ఈ కారణంగా అటు తిక్కన పద్యాలు గాని, యిటు తెనుగులెంక పద్యాలుగాని, "కొన్ని" నడక సాఫీగా గక, ఏకొద్దిమంది భాషావేత్తలు కవిపండితులు మినహా

సామాన్య పాఠకులను, "అలరించడం" లేదని మరొక చోట (అభినవ తిక్కన అధ్యాయం) చెప్పుకున్నాం. "వెదకి వెదకి తెల్గు నదికిసంతిన యది తెలుగుకాదు దానవెలుగురాదు" అని తెనుగులెంక యెంత సమర్థించుకొన్నా - వాడుకలోలేని అరుదైన అచ్చ తెలుగుపదాలు చొప్పించడంవలన, పద్యం నడక 'కుంటు'వడి, పాఠకుల్ని ఆకట్టుకో లేకపోతాయని చెప్పక తప్పదు. ఈ సందర్భంలో ప్రముఖ సాహితీ వేత్త 'తెలుగు విశ్వవిద్యాలయం' మాజీ ఉపాధ్యక్షులు ఆచార్య తూమాటి దోణప్పగారన్న మాటలు గుర్తుకు తెచ్చుకోవడం సము చితంగా వుంటుంది— "వ్యవహారయోగ్యత నశించిన పలుకుబడు లను వెదకి వెదకి తెచ్చి వాని పుట్టుపూర్వోత్తరములను వివరించుట యుక్తమేకాని ఆధునిక రచనములలో వాని 'నదుకుట' వలన స్ఫుటాభివ్యక్తికి భంగము వాటిల్లక తీఅదని"ని వున్న మాట లెస్స పలి కారు (నాకథలు - పీఠిక.) అందుకే తెనుగులెంక కవిత్వం చదివే సామాన్య పాఠకులు యిట్టి 'అరుదైన అచ్చతెలుగు పదాలు తగిలి నప్పుడు అర్థంకాక - ఏమిటీ 'ఛాదస్త' మనుకోవడం గూడా జరుగు తుంది. అది 'ఛాదస్తమో' సరదామో ఏమైనాగాని 'తెలుగు భాష'ను సజీవంగా వుంచటానికే - తెనుగులెంక యిట్టి పదాలు పొందుపరచుచున్నట్లు, అలానే యీనాడు వాడుకలోలేని "అర సున్న"ను గూడా ఆయన విడిచిపెట్టకుండా వాడుతున్నట్లు తెనుగు లెంక ద్వారా యీ రచయిత వివరణకోరి, తెలుసుకున్న 'నిజం' యిందుమూలంగా పాఠకుల దృష్టికి తేవడమైనది.

తీయని పానకం తాగుతూ, ఆ పానకంలోని 'కమ్మదనం' కమనీయతను మర్చిపోయి, పానకంలోపడ్డ 'పుడక'ను గూర్చియే చర్చించడంలోను చల్లని వెన్నెలనిచ్చే 'చందమామ' సంతరించు 'హాయి'న మరిచిపోయి, చందమామలోని "నల్లనిమచ్చ" గురించే

చర్చించడంలోను అందంగావున్న గులాబీనిచూచి ఆనందించక, దాని వెనకాలవున్న చిన్నిముల్లు గూర్చియే 'చర్చించు' కోవడంలోను అర్థం లేని మాటనిజమే అయినా, పానకంలో పడ్డపుల్లను, చందమామ లోని మచ్చను, గులాబీ వెనుకనున్న 'ముల్లు'ను కాదనలేము, ఉన్న విషయాన్ని అదిస్వల్పమైనదైనా "గుర్తు" చేయడం నిష్పక్షపాత సద్విమర్శ అవుతుంది కనుక, తెనుగులెంక సాహిత్యంలో వాడుకలో లేని పొందుపరిచిన 'అద్వైత అచ్చతెలుగు' పదాల సంగతి గుర్తు చేయడం జరిగింది. అంతేగాని 'తప్పు' లెన్నడం కానేకాదు.

ఆత్మకథ మహాత్మకథ - ఆత్మార్పణము - కావ్యాలు తెనుగు లెంక పద్యగద్యాత్మకంగా తీర్చిదిద్దారు. పద్యమెంత బిగువుగా కూర్పగలడో గద్యమునంతటి బింకంగా రాయగలడు శ్రీ తుమ్మల. గద్యపద్యాత్మక కావ్యరచనలో తిక్కనకు వారసుడు. తిక్కనకు తమ్ముడు తెనుగులెంక శ్రీ తుమ్మల. "పద్య కావ్యములలోని ఎడనెడవారు (తెనుగులెంక) రచయించే వచనములు సాక్షాత్తు తిక్కన నోట్లోనుంచి ఊడిపడినట్లుండును" అని శ్రీ కాటూరి వేంకటేశ్వరరావుగారు చెప్పిన పలికాకు మచ్చుకు ఒకటిరెండు ఉదాహరణలు.

"ఆత్మార్పణము" కావ్యంలో - మేతలకై అడివికిపోయిన పెంటికపోతి బోయవానివలలో జిక్కి యెంతకీ గూటికి తిరిగిరాక పోవుటచే అటు పోతుకపోతం యిటు పెంటికపోతి పడిన 'వేదనా' ఘట్టమిది.

**వచనం :-** అని పులుగుదిండి యెలుగురాల్పడ వేడి, వేడి, కన్నీరు మున్నీరుగా వగలసెగలం బొగులుచు బరుషపాషాణ పర్యంకమున నొత్తగిల్లియుండె నత్తఱి దడవులంబట్టి యమ్మట్టితొట్టి గాలంబు పుచ్చుపావురం బొండువఱువాత

నెరకొలకరగిన తన యిల్లాలెంతకుం గూడు సేరమి నరసి
వెఱతఱచున బరిపరివిధంబుల, బోరింబోరి దురపిల్లుచు
బల్లంబులకు డిగువెల్లువ నీటిజాళుల నుప్పతిల్లు "జలజల"
మను చప్పుళ్ళతో మేళగించి మ్రోళులు చిగుర్ప
దుర్భర వియోగ గీతంబుల బాడుచునిట్లు విలపించె...

ఇందులో 'ర, ఱ, ల, ళు అక్షరాల' వృత్త్యనుప్రాసం.

ఇక మహాత్మకథలో 1920 లో కలకత్తాలో జరిగిన అఖిల భారత కాంగ్రెస్ సమావేశంలో గాంధీజీ తన 'సహాయనిరాకరణోద్యమం' గురించి వివరించిన సన్నివేశమది.

**వచనం :-** కావుటంజేసి ప్రజల యాదరముం జూఱగొని వారి ప్రతిభువులుగా రాణించు పెద్దలీ యుద్యమంబున కంకురార్పణ గావింపదగు - వలతి వలతి చాగములొనర్చి పెద్దపెద్ద యిడుమలంబడక యల్పప్రశ మమ్ములతోడన దేశీయులీకార్యంబు నిర్వహించి సఫలతంబడయవలయుగాననేల్పడి వారి కండదండగా నున్న మాన్యపదవులం బాయుట, వారొసంగిన బిరుదులం ద్రోయుట, వారి పేర్మికై సాగు విందులకేగకుండుట, వారి సాయమ్ముగల చదువులు వీడి జాతీయ విద్యాలయములు నెలకొల్పుట వారి పాడిపట్టులు బహిష్కరించి గ్రామ పంచాయతుల నేర్పఱుచుట, వారికై సైనికధర్మంబు నూది 'మెసపొటోమియా'కుం జనకుండుట వైదేశిక వస్తువులు వదలుట, రాటము నుద్ధరించుట, రానున్న క్రొత్తయెన్నికలం బాల్గొనకుండుట ప్రజలకీనాడు కర్తవ్యములని యీ మహాసభ వారు సూచించుచున్నారు" అనునది తన్నిర్ణయమున సారము. భారతీయదాస్య విక్షేపమున కదియ ప్రశం

సింపదగిన ప్రథమప్రయోగము నాదగుదానంజేసి ప్రజా
హృదయముల శుభపరిణామం బేర్పడియె - కాన...

తెనుగులెంక, తిక్కనసోమయాజికివలె, తన కవితలకు, అలంకారాలు' అంతగా సంతరించలేదని చెప్పుకొన్నాం! అడపాదడపా సహజసిద్ధంగా ఆయా 'అలంకారాలు' అలవోకగా వచ్చిచేరి ఆయన కవితలకు శోభకూర్చాయి. ఉపమానాలంకారం, రూపకాలంకారం, అర్థాంతరన్యాసాలంకారం అటనట సహజసుందరంగా దర్శనమిస్తాయి. మచ్చుకు రెండుమూడు ఉదాహరణలు చూస్తాం.

కదలివచ్చెను భాగ్యాల కడలివోలె
మకర సంక్రాంతిలక్ష్మి హేమంతవీథి! (పఱిగపంట)

నెఱిగలవారి బట్టుకొని నేరముసెప్పక పండ్లు ఱివ్వనన్
గొఱుకుచు గుప్పనూర్పిడికి గొడ్లనుబోలె బిగించిమేళముల్
మొరయజజాల్ల కీడ్చినలు మూలలత్రిప్పిరి........ (మహాత్మకథ)

రూపకాలంకారంనకు ఒక ఉదాహరణ—

నేలసెజ్జ, కేలునెఱదిండు నింగిమే
ల్కట్టు దాలి విసనకఱ్ఱ, చంద
మామ దివ్వెగాగ మౌనిముక్తి వధూటి
గలసి తనిసి రాజు కరణి గుల్కు

—సందేశసప్తశతి

అర్థాంతరన్యాసాలంకారానికి ఒక చక్కని ఉదాహరణ—

నేననీకంటెమును మరణింతునంచు
నాకొఱకు గుందితివిగదా నాథ! నీవు
తుదకు నాకంటెమును నీవత్రుంగితకట
మొగడియకెద్ది మూడునో యెవ్వడెఱుగు —ఆత్మార్పణము

తెనుగు లెంక పల్లెటూరిలో రైతుగాపుట్టి - కొంతకాలం సేద్యంగూడా చేసాడు. వ్యవసాయం పనులకు రైతు జీవితానికి సంబంధించిన "జాను తెనుగుపదాలు" తెనుగు లెంక ఎంతో హృద్యంగా పద్యాల్లో చెప్పాడు చూడండి. మచ్చుకు కొన్ని పాదాలు.

పెట్టవయ్య కూడు పట్టెదనంజలి
నుద్దిలేని బజ్జిముద్దచేసి —నాకథలు

పొలంలో పనిచేసే రైతులు కూలీలు - "పొలంబువ్వ" తినే సన్నివేశ మది.

కాపుబిడ్డ గొడ్లకాపుపట్టెను జల్లి
మూటతోడ మొగము తేటతోడ (నాకథలు)

సేద్యగాళ్ళు రైతుకూలీల బిడ్డలు 'చల్ది' మూటలుకట్టుకొని - గొడ్లను కాయటానికి పొలంపోయే దృశ్యమది (గోపాలం)

పలుపుపగ్గాలు సంతనపఱుచు పనికి
జిక్కుచిడిముడి పడసాగె జీతగాడు —పైరపంట

వ్యవసాయం పనులు మొదలెట్టేరోజుల్లో పాలేళ్ళు బండెడ్లకు అవసరమయ్యే పలుపులు పగ్గాలు - తాళ్ళు సంతనచేసుకోవడం చెపుతున్నాడు.

తిన్నమెతుకు గొంతుదిగినొ లేదో గట్టు
గనుముసవరచేయ జనియెకాపు —పైరపంట

తిన్న మెతుకు గొంతులోవుండగానే - రైతు మరలాచేలో 'గనుము' పనికి దిగుతాడు.

చిట్టుచున్న కుసుమచేనిలో గ్రమ్మిన
కలుపుదీయ దొడగె కర్షకుండు —పైరపంట

చేలో కుసుమ వరిపొట్టవిచ్చే సమయానికి కలుపులు తీస్తారు రైతులు

బంతిదోలు మాల గొంతెత్తి పొలిగాని
బిలుచునప్పుడిరులు పొలుచునప్పు / డేను (నాకథలు)

కుప్పనూర్పిళ్ళలో పాలిళ్ళు పొలగానిపాటలు పాడుట.

వెంటిగట్టితి సవరనల్ వెల్లివిరియ
బంతిదోవితి నెద్దులబాదకుండ (నాకథలు)

కవిగారు స్వయంగా చేసిన 'సేద్యం' పనులు

అఱ్ఱుపులిసి గిత్త యంకెవైచిన తటి
వడుముగట్టి పట్టెమెడకు దార్చి (శబల)

గిత్త 'మెడ' నొప్పిచేసి- అలవి కానప్పుడు రైతు (తాను) వడుముగట్టి పట్టెమెడకుదాల్చి యూబిలోని బండినిలేపటం.

అలానే తెనుగు లెంక 'వ్యవసాయం' తాలూకు జాను తెలుగు పదాలు, తన కవితల్లో వాడినవి కొన్ని యింతకుముందు చెప్పు కొన్నాం. ఇక్కడ మరికొన్ని తెలుసుకొందాం.

1) దమ్ముచేయు 2) కాడిక్రిందికి వచ్చుట 3) అంకెకు వచ్చు 4) అఱ్ఱుపులియు 5) ఆఱుగాలము 6) పొలముదున్ను 7) బండితోలు 8) కుప్పనూర్చు 9) కోతకోయు 10) గనుము 11) నాగటిచాలు 12) మాసూలు 13) పిడికట్ట 14) పొలి కట్టె 15) కూటికావడి 16) గింజరాలు 17) నారుమడి 18) నారుపిడి 19) ముసురుచినుకులు 20) తొలకరి చినుకులు 21) పంటకళ్ళం 22) వలిపాట, పొలికేక 23) వెంటికట్టు 24) కొంగ్రడ వేయు 25) పలుపుపగ్గాలు 26) మేడి 27) కోఱేరు 28) కఱ్ఱు మొనలగునవి,

తెనుగుతెంకకు పేరు ప్రఖ్యాతలు తెచ్చిపెట్టిన కావ్యం 'ఆత్మకథ' గదా ! బాపూజీ తన మాతృభాష గుజరాతీ (గుజరీ) భాషలో రాసుకున్న స్వీయచరిత్ర. దానిని ఆంగ్లంలోనికి అనువాదం చేసింది "మహాదేవుదేశాయి". గాంధీజీ ఆత్మకథ వివిధ దేశభాషల్లోనికి తర్జుమా అయ్యింది. తెలుగులో వచనంలో శ్రీ వేలూరు శివరామశాస్త్రిగారు అనువాదం చేసారు. తెనుగు లెంక పద్యగద్యాత్మకంగా తీర్చిదిద్దిన 'ఆత్మకథ'కు శాస్త్రిగారి తెలుగువచన అనువాదరచనమే ముఖ్యాధారం. ఈ రచయితకు గుజరీభాష తెలియదు. కనుక, ఆంగ్ల, ఆంధ్ర అనువాదాలతీరు, తెనుగులెంక ఛందోబద్ధం చేసినతీరు ఎలావున్నాయో మచ్చుకు ఒకటిరెండు సంఘటనల్ని ఉదాహరణలుగా చూస్తాం.

గాంధీజీకి బాల్యంలోనే వివాహమయ్యింది. 'కొత్తబిచ్చగాడిలా' కొత్త పెళ్ళికొడుక్కి' భార్యమీద 'ప్రేమానురాగాలు' మాటల్లో చెప్పలేనివి ! చెప్పరానివి కూడా ! గాంధీజీ 'భార్య' మీద ప్రేమానురాగాల్ని స్వయంగా చెప్పుకొన్న సన్నివేశాన్ని చూస్తాం.

మహాదేవుదేశాయి 'ఆంగ్లానువాదం' చూస్తాం.

"I must say I was passionately fond of her. Even at school I used to think ef her and the thought of mightfall and our sbsequent meeting was ever haunting me. Sepera-tion was unbearable. I used to keep her awake till late in the night with my idle talk."

శాస్త్రిగారి తెలుగు వచనానువాదం చూస్తాం.

"నేనుమిగుల భార్యాసక్తుడను. పాఠశాలయందును అదే తలపోత. ఎప్పుడు చీకటిపడునా, ఎప్పుడుపోయి వ్రాలుదునా అనియే

బెంగ. ఎడబాటు దుస్సహమయ్యేడిది. కల్లబొల్లి మాటలతో చాలసేపటివరకు నిదురపోనిచ్చువాడకాను." ఆంగ్లానువాదంకన్న శాస్త్రిగారి ఆంధ్రానువాదం బాగుంది !

ఇక తెనుగులెంక దీనిని ఛందోబద్ధ పద్యంగా తీర్చిదిద్దిన తీరు చూస్తాం.

సీ॥ భార్యాను రాగంబపారమై నెలకొంట
బడినైన నాకదే గొడవరేగి
దినకరుండ పరాంబుధిని గ్రుంగుటెప్పుడో
కాసంత చీకటిక్రమ్ముటెపుడొ
యడరి లేజవరాలి కడగ్రాలు టెప్పుడో
మించుబోడిని గుస్తరించుటెపుడొ
చెలువచిన్నారి చూపులగాంచు టెప్పుడో
జిలిబిలి సరసముల్ చిమ్ముటెపుడొ

తే. గీ॥ యని నలంగితి, దుర్భర మావియోగ
మవసరం బున్నలేకున్న నవివినివియు
గల్లబొల్లులు పల్కి వాల్గంటికేను
తెప్పవడనీయ నద్దమరేయి వరకు

తుమ్మలవారి తెనుగుసేత కాస్తపెద్దదైనా హృద్యంగమైన ఛందోబద్ధ పద్యం ఎంత చిక్కగా - చక్కగా - కమనీయంగా వుందో వేరే చెప్పనక్కరలేదు !

మరో ఉదాహరణ - గాంధీజీ లండన్‌లో బారిష్టరు పట్టా పుచ్చుకొని స్వదేశంవచ్చి - బొంబాయిలో 'ప్రాక్టీసు' మొదలెట్టారు. కోర్టులో జడ్జిగారి యెదుట నిలబడి, యెందరెందరో కాకలుతీరిన వకీళ్ళముందు తన కేసు వాదించడం, అసలే పుట్టుకతో సిగ్గూబిడియం - భయమున్న గాంధీజీకి చాలా 'యిబ్బంది' కర

మైనది. వాస్తవానికి తన కేసు వాదించలేకపోతూవు ! ఆ సందర్భంలో గాంధీజీయే స్వయింగా చెప్పుకొన్న తన స్థితి తన ప్రథమ అనుభూతి సంఘటన - చూడండి.

"I appeared for the defendant and had thus to cross-examine the plaimtiff's writnesses. I stood up, but my heart sank into my boots. My head was teeling and I felt as though the whole court was doing likewise. I could think of no question to ask. The Judge must have laughed and the Vakils no doubt enjoyed the spectacle Bur I was past see–ing anything. I sat down and told the agent that I could not eonduct the case" and that he had better engage Patel and have the fee back from me"....

దేశాయిగారి యీ "ఆఙ్గ్లానువాదానికి" శాస్త్రిగారి తెనుగు సేత తెలుగులో చూడండి.

"నేను ప్రతివాదిపక్షము. కావున వాదిపక్షపుసాక్షులను క్రాసుచేయ వలసివచ్చెను. లేచినిలుచుందునుగదా, నాగుండెలుటువ్వొటువ్వుమనెను. నాతల తిరిగెను. కోర్టంతయు తిరుగుచున్నట్లులుండెను. అడుగుటకు ప్రశ్నరాదు. జడ్జి నవ్వియుండును. ఈ తమాషాచూచి వకీళ్ళు వినోదించియుందురు. కాని నేనిదియంతయు చూడగలుగు స్థితిలో లేను. నేను కూర్చుంటిని, ఏజెంటును పిలిచి 'నేనిక కేసును నడపజాలను ఇక పటేలుగారిని పెట్టుకొనుటలగ్గు. నాకిచ్చిన ఫీజు ఇచ్చివైతును' అని అంటిని— దేశాయి ఆంగ్లానువాదం కన్న శాస్త్రిగారి ఆంధ్రానువాదం చక్కగా వుంది,

శాస్త్రిగారి తెలుగు వచనానువాదాన్ని తెనుగులెంక ఛందోబద్ధం చేసినతీరు చూస్తాం.

ఆ. వె॥ వాదిగెల్వ వలచివచ్చిన యెలకాంద్ర
బట్టిచూడ దగిన పట్టువచ్చె
నిలిచి నోరువిప్ప నిముషాన గుండియల్
పరువులెత్తె జెమట వఱదపొడిచె

కం॥ కుమ్మరిసారె విధాన శి
రమ్ము గడు నుబ్బటిల్లె రచ్చయు విసుమా
నమ్ముగ బర్రిబమించె, బ
దమ్ములిసీ రాల్ పడెం బదమ్ముల యట్టుల్

ఆ॥ ఎంత పెనుగులాడి యేమేమి చేసిన
నొదవదయ్యె నోటనొక్క మాట
తగవు పల్కువారు తగవరియున్ నాడు
నన్నుజూచి యెంతనవ్వినారొ!

ఉ॥ కుప్పన గూరగాబడి దిగుల్పడి దీల్పడి పూనుటేల నా
కొప్పనచేత కంచు నభియోగిని జీరిధనం బభిగ్రహం
బప్పన చేసి నావలన నాగ్రహమందకు మంచువేడి....

ఈ ఘట్టంలో "కేసు నడపటానికి" పఠేలును పెట్టుకొను మని" గాంధీజీ చెప్పిన విషయం తెనుగులెంక 'విడిచి' పెట్టాడు. సన్నివేశాన్ని మూడునాల్గు పద్యాల్లో చెప్పవలసి వచ్చింది తెనుగు లెంకకు అయినా సన్నివేశాన్ని ఛందోబద్ధమైన పద్యాలలో రస వత్తరంగా - మనోహరంగా వర్ణించాడన్నది వేరే చెప్పనక్కర లేదు !

మరో చిన్న సన్నివేశం చూస్తాం. గాంధీజీ దక్షిణాఫ్రికాలో నుండగా ప్రెటోరియానుండి అబ్దుల్లా కు 'కేసు' గురించి మాట్లాడ డానికి డర్బను పట్టణానికి వెళ్ళినపుడు గాంధీ గౌరవార్థం "విందు" ఏర్పాటుచేసిన సన్నివేశమది.

He gave a fare well party in my honour at sydenham it was proposed to spend the whole day there.

దేశాయిగారి ఆంగ్లానువాదానికి శాస్త్రిగారి ఆంధ్రానువాదం-

"నన్ను గౌరవింప సిడెన్‌హాములో ఒక విందు నేర్పరచెను. నాడంతయు విందుతో కాలక్షేపము చేయతలపబడెను"

ఈ విందు సన్నివేశాన్ని తెనుగులెంక ఆటపాటలతో సరదా కబుర్లతో హర్షాతిరేకంగా 'విందు' జరిగినట్లు చెప్పి మనకు 'కవితా విందొ'నరించాడు.

గీ॥ ఆటపాటలతో మధురాతిమధుర
భోజనమ్ములతో సుహృత్పుంజమంజు
గోష్ఠితో బహుమానవాక్కోటితో, న
ఖండహర్ష విధాయిగా గడచెవిందు

మధురభావబంధురంగా - కమనీయపద సంభరితంగా "విందు" సన్నివేశాన్ని తెనుగులెంక రమణీయంగా వర్ణించాడు.

తుమ్మలవారు యిరవయ్యో దశకంలో శ్రీ ఆదిశంకరాచార్య విరచిత సంస్కృతంలోని "శ్రీ లక్ష్మీనృసింహ స్తోత్రమ్"ను "ఆంధ్ర లక్ష్మీనృసింహ స్తోత్రము" అను పేర అనువదించాడు. ఆనాడా కవిత 'భారతి' మాసపత్రికలో ప్రచురింపబడింది కూడా. దరిమిలా యిటీవలి తుమ్మలవారి 'దివ్యజ్యోతి' ఖండకావ్యంలో యీ పద్యాలు చేర్చబడ్డాయి. అందులోని ఒకటిరెండు అనువాద పద్యాలు 'మచ్చు'నకు చూస్తాం.

శ్లో॥ బద్ధ్వాగలే యమభటా బహుతర్జయన్త
కర్షన్తి యత్ర భవపాశ శతైర్యదామామ్
ఏకాకినం పరవశం చకితం దయాళో
లక్ష్మీనృసింహ మమ దేహి కరావలమ్బమ్

ఆదిశంకరభగవత్పాదులవారు రచించినయీ శ్లోకానికి శ్రీ తుమ్మల వారికి ఆంధ్రానువాద పద్యం చూడండి.

ఉ॥ ఓనలినాక్ష ! మిన్నదరు హుంకృతులన్ యమ కింకరుల్ గళ
స్థానమునందు బంధు నవితానము జుట్టి బిగించిలాగుచో
దీనుడు నొంటి వాడగుట దిక్కెవరీతని కీవుదక్క, ల
క్ష్మీనరసింహ ! నాకొసగుమీ భవదీయ కరావలంబమున్

తెనుగులెంక తెనుగుసేత సమగ్రంగా స్వతంత్ర రచనలా - చక్కగా వుంది.

మరొక ఉదాహరణ చూస్తాం.

శ్లో॥ సంసార కూపమతి ఘోర మగాథ మూలం
సంప్రాప్య దుఃఖశత సర్పసమాకులస్య
దీనస్యదేవ పరమాపదమాగతస్య
లక్ష్మీనృసింహ మమదేహి కరావలమ్బమ్

ఇక శ్రీ తుమ్మలవారి 'ఆంధ్రానువాదం' చూడండి !

ఉ॥ త్రాణ కళాప్రవీణ ! భవదారుణ కూపములోన జిక్కిబా
ధా నిచయోరగంబులకు దావలమై దరిగానలేక నీ
ధ్యాన మొనర్చుచుంటి, దమదాసుడనంటి నఘంబుగెంటి ల
క్ష్మీనరసింహ నాకొసగుమీ భవదీయ కరావలంబమున్

అనువాద పద్యమెంత చక్కగా సహజంగావుందో గమనించారుగదా విశేషమేమిటంటే ప్రముఖకవి అధ్యాపకుడైన శ్రీ తాళ్ళూరి సత్యనారాయణగారన్నట్లు సంస్కృత శ్లోకాలకు యతిప్రాసలుండవు గదా ! మరి యతిప్రాసల కట్టుబాట్లతో 'ఛందోమాత్రా గణాలతో నియమిత పరిమిత "చట్రం"లో (ఫ్రేమ్) మూలభావం చెడకుండ బిగించడం కష్టసాధ్యమే మరి ! అందునా "లక్ష్మీనరసింహ !

అని సంబోధిస్తూ - ఉత్పలమాల ఛందస్సులో "స" కారం "ప్రాస" స్థానంలో వచ్చేటట్లు శ్రీ శంకర విరచిత శ్రీ లక్ష్మీ నృసింహస్తోత్రంలోని శ్లోకాల్ని తెలుగులో మూలభావం చెడకుండ చిక్కని తెలుగుభాషలో "పద్యాలు"గా మలచడం "కత్తిమీద సాము" వంటిపనే ! మూలంలోని 25 శ్లోకాల్ని - 25 పద్యాలుగా మలచి తన స్వంత పద్యమొకటి కలిపి మొత్తం 26 పద్యాలు యీ కవితా ఖండికలో రాసాడు తెనుగులెంక. తెలుగుభాషమీద మంచి పట్టుగల్గి - పద్యశిల్పం బాగా తెలిసిన "చేయితిరిగిన" కవి శ్రీ తుమ్మలవారు అని స్పష్టమౌతుంది !

తెనుగులెంక, శంకరాచార్య విరచిత సంస్కృతంలో 'భజగోవిందం' గూడా తెలుగులో ఛందోబద్ధం చేసాడు. మచ్చుకు ఒకటి రెండు చూస్తాం.

శ్లో॥ కాతే కాన్తా కస్తే పుత్రః
సంసారో యమతీవ విచిత్రః
కస్యత్వం కః కుత ఆయాతః
తత్త్వం చిన్తయ తదిదం భ్రాతః

ఈ శ్లోకాన్ని తెనుగులెంక తెలుగులో ఎలా ఛందోబద్ధం చేసాడో చూడండి !

ఎక్కడి దీ లతాంగి సుతుడెవ్వడు వీరికి నీకు నెవ్విధిన్
జిక్కెను బాంధవం బతివి చిత్రమ యీ తగులాట మిందు నీ
వెక్కడినుండి యూడిపడి తెవ్వనివాడవు దీని తత్త్వమున్
జక్కనెఱుంగవయ్య సదసత్పరిశోధక బుద్ధి యేర్పడన్

చక్కని చిక్కని భాషలో హృద్యంగమంగా పద్యరూపంలో చెప్పాడు.

మరో ఉదాహరణం.

శ్లో॥ సత్సఙ్గత్వే నిస్సఙ్గత్వం
నిస్సఙ్గత్వే నిర్మోహత్వమ్
నిర్మోహత్వే నిశ్చల తత్త్వం
నిశ్చల తత్త్వే జీవన్ముక్తిః

ఈ శ్లోకాన్ని తెనుగులెంక ఛందోరీతి తెనుగుసేత చూడండి!

సంగత్యాగము కల్గు సజ్జనులతో సాంగత్యమున్ జేయ ని
స్సంగత్వంబునజేసి మోహము వినాశంబందు నిర్మోహతన్
భంగంబున్ గనబోని తత్త్వమది సంప్రాప్తించు నద్దానిచే
వంగైకో లొనరింతురుత్తములు జీవన్ముకి సౌహిత్యమున్

శ్లోకంలోని "నిస్సంగత్వం" "సంగమ సాంగత్యము, మోహము, నిర్మోహతం, జీవన్ముక్తి వంటి ముఖ్య సంస్కృతపదాల్ని మూల శ్లోకభావం చెడకుండా తెలుగులో ఛందోబద్ధ పద్యంగా మలచడం విశేషం.

ఆదిశంకరాచార్య విరచిత 'భజగోవిందం'లో పదిరెండు మంజరి ఛందస్సులోని శ్లోకాలు. ఇవికాక శంకరాచార్యుని ముఖ్య ప్రథమ శిష్యులు - ఆదిశంకర పద్మపాదులు పదినల్గురు(పద్నాల్గురు మంది) పద్నాలుగు శ్లోకాలు రాసారు. అంటే మొత్తం - 26 శ్లోకాలు. తెనుగులెంక అనువాద పద్యాలు 27. పన్నెండు మంజరి ఛందోశ్లోకాలని శంకరాచార్య చెప్పుకొన్న విషయమున్న శ్లోకంతో కలుపుకొని'భజగోవిందం' శ్లోకాలు మొత్తం 13అవుతాయి గదా ! అప్పుడు లెక్కసరిపోతుంది !

"భర్తృహరి సుభాషితాల్ని" తెనుగులెంక "తెనుగునీతి" అన్న పేరుతో అనువదించాడు. అందులో ఒక్క నీతిశతకాన్ని మాత్రమే తీసుకున్నాడు. ఇంతకుపూర్వం ఎందరో భర్తృహరి సుభాషితాల్ని అనువరించినా, ఏనుగు లక్ష్మణకవి అనువాదం బాగా

ప్రాచుర్యం పొందింది. లక్ష్మణకవి అనువాద పద్యాలే అందర్నీ ఎక్కువగా ఆకట్టుకొంటాయి. ఇప్పుడు భర్తృహరి సంస్కృత 'నీతి' శ్లోకాల్ని - ఏనుగు లక్ష్మణకవి - తెనుగులెంక చేసిన అను వాద పద్యాల్ని మచ్చుకు ఒకటిరెండు చూస్తాం.

శ్లో॥ శిరశ్శార్వం స్వర్గాత్పశుపతి శిర స్తః క్షితిధరం
మహీధ్రాదు త్తుఙ్గదవనిమవనేశ్చాపి జలధిం
అధోగఙ్గ సేయం పద ముపగతా స్తోక మథవా
వివేకభ్రష్టానాం భవతి వినిపాతః శతముఖః

—భర్తృహరి శ్లోకం

ఏనుగు లక్ష్మణకవి అనువాదం చూడండి.

శా॥ ఆకాశంబున నుండి శంభుని శిరంబందుండి శీతాద్రి సు
శ్లోకంబైన హిమాద్రినుండి భువి, భూలోకంబునందుండి, య
స్తోకాం భోధి బయోధినుండి పవనాంధోలోకముంజేరె గం
గా కూలంకష పెక్కుభంగులు వివేకభ్రష్ట సంపాతముల్

ఇక తెనుగులెంక తెలుగుసేత చూడండి.

గంగ దివిని వీడి కటుకంటు తలవీడి
అద్రిపతిని వీడి యవనివీడి
జలధివీడి తుదకు జనె పాపగడ్డకు
తెలివిసెడిన వారి యలతలిట్లె

భర్తృహరి శ్లోకానికి - తగ్గట్లు పదబంధంతో భావబంధురంగా గంగా ప్రవాహంలా లక్ష్మణకవి పద్యం జాలువారింది. ఇక తెనుగులెంక ఏనుగు లక్ష్మణకవి 'శార్దూల విక్రీడిత పద్యంలో చెప్పిన భావాన్ని చెడకుండా చిన్నచిన్న పదాలతో చిన్ని ఆటవెలదిలో "సింపుల్"గా చక్కగా యిమడ్చడం తెనుగులెంక చాకచక్యాన్ని - జాణతనాన్ని పాఠకులు మెచ్చకుండా వుండలేరు.

మచ్చుకు మరో ఉదాహరణ—

శ్లో॥ మజ్జత్వమ్బసి, యాతు మేరు శిఖరం, శత్రూన్ జయత్వాహవే,
వాణిజ్యం కృషిసేవనాది సకలావిద్యాః కలాః శిక్షతామ్
ఆకాశం విపులం ప్రయాతు ఖగవత్కోృత్వా ప్రయత్నం పరం
నాభావ్యం భవతీహ భాగ్యవశతో భావ్యస్య నాశః కుతః
—భర్తృహరిశ్లోకం

ఏనుగు లక్ష్మణకవి అనువాద పద్యం చూడండి.

సలిలము జొచ్చినం కనక శైలము జేరిన వైరివీరులన్
గెలిచిన, రాజసేవ దిలకించిన వేదము లభ్యసించినన్
గళల తెఱం గెఱింగిన, ఖ గత్వము దాల్చిన, కర్మనిఘ్నతా
కలన నభావ్యమైన పనికాదు వినాశములేదు భావికిన్

ఇక తెనుగులెంక తెలుఁగుసేత పద్యం చదవండి.

నీరధి మున్గగాక గిరినెత్తము త్రొక్కనుగాక మింటిపై
బేరెము దీయుగాక మగపెంపున శత్రులనోర్చుగాక చే
హార మొనర్చుగాక కళలన్నియు నేర్చునుగాక కర్మమా
ధారము గాగ వచ్చునది తప్పదు రానిదిరాదు ప్రాణికిన్

"కాక" అనుఅవ్యయం క్రియకుచేర్చి తెనుగులెంక పద్యాన్ని అందంగా తీర్చిదిద్దాడు ! పద్యంలో సరతత తెనుగుదనం వుట్టి పడుతూ వుందికదూ !

"భగవద్గీత"ను తెనుగులెంక "గీతాదర్శము"ను పేర ఆంధ్రీకరించాడు. మచ్చుకు ఒకటిరెండు ఉదాహరణలు చూద్దాం.

శ్లో॥ అవినాశితు తద్విద్ధి యేన సర్వమిదంతతమ్
వినాశమవ్యయ స్యాస్య న కశ్చిత్కర్తు మర్హతి

గీతలోని సంస్కృతశ్లోకానికి తెనుగులెంక చేసిన ఆంధ్రీకరణ చూడండి.

అ॥ వె॥ అఖిల జగమునందు నలమిన యాత్మకు
లేదు లేదు చావులేదు పార్థ!
చావులేని దీని జంపువాడెవడును
లేడు లేడు బెగ్గలింపవోయి! —గీతాదర్శం

అలతి అలతి తేలిక తెలుగుపదాలలో ఆటవెలది ఛందస్సులో యీ వేదాంతసారాన్ని ఎంత చక్కగా ఎంత తేటతెల్లంగా తెనుగులెంక బిగించాడో మనకు స్పష్టంగా తెలుస్తుంది.

ఇంకో ఉదాహరణ

వాసాంసి జీర్ణాని యథావిహాయ
నవాని గృహ్ణాతి న రోపరాణి
తథా శరీరాణి విహాయ జీర్ణా
న్యన్యాని సంయాతి నవాని దేహి (సాంఖ్య)

ఇక తెనుగులెంక తెలుగుసేత చూడండి.

తే. గీ॥ ప్రిదివి చినిగిన వస్త్రముల్ వదలివైచి
క్రొత్తవలువల నరుడు చేకొను విధాన
నాత్మయును జీర్ణమైన దేహముల వీడి
యవతరించు నవీన కాయముల పార్థ

సరళమైనభాషలో వేదాంతసారాన్ని ఎంత చక్కగా చెప్పాడో మనకు తెలుస్తుంది. భగవద్గీతలోని "వేదాంతం" (పరమార్థం) తలలుపండిన వారికే ఒకపట్టున బుర్రకెక్కదు. మరి తెనుగులెంక అనువాదపద్యాలు చదువుతుంటే - కాస్త అక్షరజ్ఞానమున్న ప్రతి వారికిగూడా గీతలోని వేదాంత గూఢార్థాన్ని 'అరటిపండు వొలిచి'

నోట్లో పెట్టినట్లు తేలిగ్గా అర్థమయ్యేరీతిగా తెనుగులెంక దేశీయ ఛందస్సులైన చిన్నచిన్న ఆటవెలదులు తేటగీతులు, కందాలలో తేటతెలుగులో - చిన్నచిన్న తేలిక తెలుగుమాటలలో చెప్పాడు. అదీ తెనుగులెంక ప్రత్యేకత !

తుమ్మలవారు 'హనుమాన్ చాలీసా'ను పద్యాత్మకంగాను-గేయరూపంలోను తెలిగించాడు. 'సీతారామ నామక' తెనుగు లెంక యీ హనుమాన్ చాలీసా అనువదించడంలో ఔచిత్యమెంతో వుంది ! మచ్చుకు ఒకటిరెండు ఉదాహరణలు.

జయ హనుమాన ! జ్ఞాన గుణసాగర
జయకపీశ ! తిహులోక వుజాగర !

"ద్విపద" (మంజరి) లో తులసీదాసు 'హిందీ'లో రాసిన యీ కవితకు తెనుగులెంక తెలుగు అనువాదం చూడండి. తులసీ దాసువలె తెనుగులెంక 'అంత్యప్రాస' నిలిపాడు !

జయ హనుమంతా ! జ్ఞానగుణాకర !
జయ కపీంద్ర ! లోకత్రయ భాస్కర !

దీనినే తెనుగులో కంద 'పద్యాత్మకంగా' రాసిన తీరు చూడండి.

జయ జయ హనుమద్దేవా !
జయ జయ జ్ఞానాది సుగుణ సంపజ్జలధీ
జయ జయ త్రి జగద్దీపక !
జయ జయ కపిలోకనాథ ! జయ జయ సుకృతీ !

తెనుగులెంక తెనుగుసేత మూలానికి తగ్గట్టు హృద్యంగమంగా వుంది! మరో ఉదాహరణ చూస్తాం.

భూతపిశాచ నికట నహి ఆవై
మహావీర జపనామ సునావై

తులసీదాసు 'హిందీ' కవితకు తెనుగులెంక 'గేయ' ఛందస్సులో చేసిన అనువాదం.

మహావీర! నీనామము వినినను
బెదరి దయ్యములు పెడపెడగా జను.

తులసీదాసువలె తెనుగులెంక 'అంత్యానుప్రాసం' నిలిపాడు! ఇదే తెనుగులెంక 'కంద' ఛందస్సులో చేసిన అనువాదం.

భూతప్రేత పిశాచ
వ్రాతము నీపేరు చెవికి వచ్చినయంతన్
భీతంబై పరుగెత్తును
జోతలు వీరాగ్రగణ్య! జోతలు నీకున్

'గేయ' ఛందస్సులోకన్నా 'కందం'లో అందంగా అనువదించారు శ్రీ తుమ్మల.

ఈ విధంగా కందాన్ని చిందులు త్రొక్కించడంలోను కమనీయ తేట తెనుగులో 'అర్థగుణ' ప్రధానంగా పద్యం చెప్పడంలోను తిక్కన్నలా - సీసాన్ని తూగుటూయేలలా శ్రీనాథుడూపినట్లు వూపగలగడంలోను - వేమన్నలా ఆటవెలదిని ఆడించినట్లు ఆటలాడించడంలోను-పెద్దన - ఎర్రన - సూరనలవలె ప్రౌఢ దీర్ఘసంస్కృత పదగుంఫనంతో - ఉక్తివైచిత్ర్యంతో వృత్తాల్ని నృత్యం చేయించడంలోను - పాల్కురికి సోమనాథుడిలా మంజరిని ద్విపదను 'మంజుల శింజిత' మధురమధురంగా వయ్యారిసయ్యాటల నాట్యమాడించడంలోను - తెనుగులెంక గట్టిదిట్ట! తెనుగులెంక తన స్వంత బాణీని తాను ఏర్పరుచుకొని - తనకు - తన కవిత్వానికి ఒక

ప్రత్యేక ముద్రవేసుకొన్నాడు. చిన్నచిన్న తేటతెలుగు పదాలలో "తెలుగుదనం" పుట్టిపడేలా కమ్మగా పద్యం చెప్పగలడు. తెలుగుపదాలు సంస్కృతపదాలు రెంటినీ సమఉజ్జీలుగా 'బండికి కట్టినఎడ్ల'లా జతకట్టి-సమన్వయపరిచి-ఆశబ్దార్థ సాహితీపద్యశకటంను సాఫీగా - సరదాగా - నడిపిస్తూ - రైతులా బండితోలుతూ రైతుకవి పద్యాన్ని హృద్యంగాను చెప్పగలడు ! ఇరవైవేల పద్యాలు వెలయించడం మాటలుకాదు ! ఆధునిక సాహితీలోకంలో పది వేలకు మించిన ఛందోబద్ధపద్య రాసినవారు వ్రేళ్ళమీద లెక్కించవచ్చు అందులో ముందుగా విశ్వనాథవారిని, రామాయణ భారత భాగవతాల్ని కావ్యాలుగా మలచిన శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి గార్ని, ఆంధ్ర పురాణకర్త మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి గారిని, బహుగ్రంథకర్త పుట్టపర్తి నారాయణాచార్యులువారిని, చెప్పుకోవలసి వస్తుంది !

లభ్యమౌతున్న రెండుపదులు పైబడ్డ కావ్యాలలోని వేల సంఖ్యలో షుమారు రెండుపదులుపద్యాలున్న తెనుగులెంక సాహిత్యంలోని సుకుమార శయ్యల్ని- మధుర భావామృత- రసగుళికల్ని యెన్నని ఏత్తిచూపడం, ఎంతని రుచిచూపడం ! అయినా ప్రయత్నించి, సీసపద్యాల తూగుటుయ్యాల హాయిని, ఆటవెలది తేటగీతలలో ఊటలూరే తేటతెలుగు తియ్యందనాన్ని, వృత్తాలలోని హావభావ నృత్యాల్ని - కందాలలోని అందచందాల్ని, ద్విపద-మంజరీల యీడుజోడు - గల "జంటపాదాల" సయ్యాటల్ని-పావురాయి వయ్యారపు నడకల్ని - నాకునచ్చిన, అందరూ మెచ్చదగ్గ, కొన్ని పదుల ముద్దులొలుకు హృద్యంగమైన పద్యాల్ని ఆ పద్యాలందున్న తేటతేనియ తెలుగుదనపు కమనీయతను, భావో

న్నీల రమణీయతను, వుదాహరణంగా 'రుచి' చూపించగల్గాను ! తుమ్మలవారి సాహితీమహాంబుధిలో మునిగి తేలి, వెతకి వెతకి 'అమృతభాండ' మండలి కొన్ని 'అమృత బిందువుల్ని, రసగుళికల్ని మాత్రమే సేకరించి సహృదయులైన పాఠకులకు 'అందించ'గలిగాను. అందించిన మధుర రస గుళికల కమనీయత, అమృతబిందువుల మాధుర్యం రసజ్ఞులైన పాఠకులు ఆస్వాదించి, ఆనందిస్తే, నా ప్రయత్నం సఫలీకృతమైనట్లే !



# తుమ్మలవారి పారమార్థికత

కం॥ అది సత్యంబది జ్ఞానం
బది పుట్టువు చావులేనిదది యానందం
బది శాంతము శివమద్వయ
మది బ్రహ్మం బది యుపాస్యమమృతార్థులకున్ —ఎర్రాప్రెగ్గడ

ఈ పురాతన పుణ్యభారతావనిలో పార్థమార్థిక దృక్పథం సనాతనంగా ప్రతి భారతీయునిలో 'నరనరాన' జీర్ణించుకొనిపోయి వైయక్తిక సామాజిక జీవితంలో 'జీవస్రవంతి'లా నిరాటంకంగా-నిత్య నూతనంగా - ప్రవహిస్తూ - ప్రభావితంచేస్తూ - ప్రకాశింపజేస్తూ 'అనుస్యూతంగా' ప్రకృతి సహజంగా తరతరాలుగా వస్తూనే వుంది! పండితుని దగ్గరనుండి పామరుడి వరకు ఎవర్ని కదిలించినా "ఇంత" వేదాంతం చెపుతాడు. గొడ్లుకాచుకొనే కుఱ్ఱవాడుగూడా ఏదో భక్తిపాట పాడతాడు. పాలపొంగు యువతీయువకులు - నవ దంపతులైతే గోపీకృష్ణ రాసక్రీడలతో మధురభక్తిలో మధురాను భూతులతో మైమరచిపోతారు. కాటికికాళ్ళుచాచిన ముసలి కాళ్ళ ముదుసలులైతే - "కృష్ణా రామ" "గోవింద" "నారాయణ" "శివశంకర" "సాయి" యిలా - ఏదో ఒకదైవ నామస్మరణ చేసు కుంటూ రోజులు లెక్కించుకొంటుంటారు.

ఈ దేశంలో ప్రతిదీ బ్రహ్మపదార్థమే. స్థావరజంగమాది చరాచర జీవకోటిలో సచ్చిదానందమయమైన బ్రహ్మపదార్థం 'జీవా త్మ'గా వెలుగొందుచున్నదని భారతీయుల విశ్వాసం. ఈ అండపిండ బ్రహ్మాండ విశ్వమంతటా పరబ్రహ్మం నిండి నిబిడీకృతమైయున్న దని హిందూవుల విశ్వాసం. వేదాలు, వేదాంగాలు బ్రహ్మ

సూత్రాలు - ఉపనిషత్తులు - భగవద్గీత - యివన్నీ "పరబ్రహ్మం" గూర్చి చెప్పేవే.

బహుశా యీ దేశంలో ఉన్నన్ని మతాలు - మతాచార్యులు - అవతారాలు - దేవుళ్ళు - దేవతలు - మరే దేశంలోను లేరేమో! బౌద్ధ జైనమతాలు. అద్వైత ద్వైత, విశిష్టాద్వైత మత శాఖలు, సిక్కు మతం సాంఖ్యాయనం, వైశేషిక శాస్త్రీయాలు - యిలా ఎన్నో మతశాఖలు - తాత్త్విక ధోరణులు. ముఖ్యంగా శైవం - వైష్ణవం - ప్రధానమైన శాఖలు. పరబ్రహ్మం - సాకారమనీ - నిరాకారమనీ, ప్రధానంగా రెండు విధాలు. ఆదినారాయణుడు - ఆదిశంకరుడు - విష్ణువు - కృష్ణుడు - రాముడు - ఆదిపరాశక్తి - మొదలగువారు సాకార అవతారపురుషులైతే - బుద్ధుడు - జైనుడు ఆదిశంకరాచార్యులు - రామానుజాచార్యులు - మధ్వాచార్యులు - హిందూమత ప్రవక్తలు. మతాచార్యులు! దైవం - ప్రేమ, కరుణ, సత్యదైవస్వరూపుడని ఆస్తికుల నమ్మకం. తత్త్వవేదాంతుల నిర్వచనం !— 'పరంజ్యోతి'గా వెలుగుతున్నాడని - ప్రతి జీవిలో చైతన్యరూపంగా వెలుగొందే జీవాత్మయే 'పరమాత్మ' యొక్క అంశమని, భారతీయుల ప్రగాఢ విశ్వాసం. చార్వాకలోకాయతను 'దేవుడు' లేడన్నారు ! బుద్ధుడు జైనుడు ప్రభృతులు ఆత్మనంగీకరించలేదు ! 'అలౌకిక' శక్తి పరబ్రహ్మం గురించిగూడా వారు స్పష్టమైన "అభిప్రాయం" వెలుబుచ్చలేదు ! అయితే భారతీయుల్లో అధికశాతం 'దేవుడున్నా'డని నమ్ముతారు ! తాత్త్వికులు "మేధావులు, వేదాంతులు" నిరాకారాన్ని నమ్మినా - అందరూ సాకార దైవాన్ని ఆరాధిస్తారు !

ఇక సాహిత్య విషయానికొస్తే - భారతీయ ఇతిహాసాలైనా రామాయణ - భారత మహాకావ్యాలలో రాజనీతి - ధర్మపాలనతో

పాటు వేదాంతం బోలెడుంది. భాగవతం అంతా వైష్ణవభక్తి సంబంధిత కావ్యం. శివపురాణం - కుమారసంభవం మొదలగు నవి శైవభక్తి సంబంధిత కావ్యాలు. ప్రాచీనాంధ్ర కవులలో నన్నెచోడుని కుమారసంభవం, పాల్కురికి సోమనాథుని బసవపురాణం, మారన మార్కండేయ పురాణం శ్రీనాథుని కాశీఖండము, భీమేశ్వర పురాణము, హరవిలాసము, శివరాత్రి మాహాత్మ్యము, పోతన భాగవతము, శ్రీకృష్ణదేవరాయల 'ఆముక్తమాల్యద, తెనాలి రామకృష్ణుని పాండురంగమాహాత్మ్యము, ధూర్జటి కాళహస్తి మాహాత్మ్యము, - మొదలగు కావ్యాలు శైవ వైష్ణవభక్తి ప్రతిబింబాలు. ఈ భక్తిగూడా దాస్యభక్తి - సఖ్యభక్తి-మధురభక్తి అని రకాలున్నాయి. మరోవైపు జయదేవుని అష్టపదులు - త్యాగరాయాది భక్తి కీర్తనలు - అన్నమాచార్య-క్షేత్రయ్య ప్రభృతి పదసాహిత్యం-యివన్నీ దైవభక్తికి సంబంధినవే.

మరి ఆధునికాంధ్ర సాహిత్యంలో భక్తితత్త్వం 'నవ్యరీతు' ల్లో నడయాడింది. కాల్పనిక ఆత్మాశ్రయ భావకవులు తాము ప్రియురాండ్రుగా - పరమేశ్వరుడు 'ప్రియుడు'గా సంభావించి కవితాగానం చేసారు. ప్రకృతిలోని ప్రతి అంశంలో దైవాన్ని దర్శించి కొందరు కవితలు వెలయించారు. కొందరు గాంధీజీని 'అవతార పురుషునిగా సంభావించి ప్రస్తుతించారు.

ఆధునికాంధ్ర సాహిత్యంలో 'భక్తితత్త్వం' తమ కవితల్లో పొందుపరిచినవారు ముఖ్యంగా - వేంకటపార్వతీశ్వర జంటకవులు. దేవులపల్లి కృష్ణశాస్త్రి, బసవరాజు అప్పారావు, అడివి బాపిరాజు, విశ్వనాథ జాషువా, కరుణశ్రీ మొదలగు నవీన 'నవ్యసంప్రదాయ కవులుగూడా దైవసంస్తుతి తమ అభిరుచులబట్టి చేసారు. "కన్నులు చల్లగా గనుగొనగంటి / హృదయేశ ! నా భాగ్యమే

భాగ్యమయ్య / సర్వలోకేశ ! యీ సాల భంజికను / నీ కేళిగృహ మందు నిలువగానిమ్ము / కల్యాణధామ ! యీ కనకపీఠికను / నీ పాదముల పొంత నిలువగానిమ్ము అంటూ వేంకటపార్వతీశ్వర జంటకవులు "ఏకాంతసేవ" చేసారు ! "దైవతమ నీవు నీదు ప్రత్యక్షమునకు / గడియలెంచుచునుండు భక్తుడను నేను" (సౌభద్రుని ప్రణయ యాత్ర) అంటూ నాయని సుబ్బారావుగారు ప్రేయసిని దైవంగా సంభావించాడు. ఇది మధురభక్తికి తార్కాణ. అలానే తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రిగారు "వకుళమాలిక"తో "నీపాద పద్మాల నిటలమ్ము సోకంగ వ్రాలిపోవ ననుజ్ఞ వాంఛించుచున్నా" నని మధురభక్తి భావంతో వేడుకొన్నాడు. "కలుషదుర్దాంత పంకసంకలితకుహర / ముల జనించు మదీయాశ్రు మలిన ధార / స్వామి ! భవదీయ పాదదేశమున బాటి / పరమపావన జాహ్నవీ ప్రతిభగాంచు" అంటూ కృష్ణశాస్త్రి తాను ప్రేయసిగా దేవుని ప్రియునిగా భావించి వేడుకొంటున్నాడు. అలానే "మ్రోయింప కోయ్ మురళి మ్రోయింపకోయ్ తీయతేనియ బరువు మోయలేదీ బ్రతుకు" అని కృష్ణుని వేడుకొన్న రాధికాపాత్రలో కృష్ణశాస్త్రి మధురభక్తిని చాటుతూ "అడుగడుగున గుడివుంది, గుడిలో దీప ముంది" అంటూ జీవాత్మజ్యోతిగా వెలుగొందే పరమాత్మ అంతటా ప్రతిజీవి హృదయంలో వ్యాపించివుందని లెస్స పలికాడు.

"శివుడూ తాండవము సేసేనమ్మా ! శ్రీగౌరీముందర అంటూ పుట్టపర్తివారు భక్తిపారవశ్యమున శివతాండవంచేస్తూ ఆడి పాడుకొన్నాడు. "నీవే రాజువు, నేను సత్కవిని తండ్రీ నిన్ను వర్ణించెదన్ / నీవే దైవము నేను భక్తుడను తండ్రీ నిన్ను ధ్యానించెదన్" అంటూ విశ్వనాథవారు విశ్వేశ్వరుణ్ణి తన 'విశ్వేశ్వర శతకం'లో సంస్మరించుకొన్నాడు "కనపడవేమిరా జగతి కల్పనచేసిన గారడీడ" అనీ "ఎవరడిగినారు నిన్ను అనకతనక సృష్టిసేయుమని"

అంటూ సృష్టికర్తను నిలదీసిన మహాకవి జాషువా "కలదోయి ప్రతి పుష్పగంధ గర్భములందు/ నీ దయామకరంద నిర్ఝరములు" అంటూ "నిలువ నీడలేక నిల్చినకలవాడ / కడుపునిండ నన్ను గన్నవాడ" "హృదయమును జీల్చి పూజలర్పించుకొందు, నందుకొని పొమ్ము వ్యవధిలేదనక రమ్ము" అని భక్తిభావబంధురంగా పరమేశ్వరుని ఆహ్వానిస్తున్నాడు. అట్లానే కరుణశ్రీగారు "కూర్చుండ మాయింట కురిచీలు లేవు, నా ప్రణయాంకమే సిద్ధపరచనుంటి" అంటూ "లోటు రానీయనున్నంతలోన నీకు / రమ్ము దయసేయు మాత్మపీఠమ్ము పైకి / అమృత ఝరిచింపు నీ పదాంకముల యందు / కోటిస్వర్గాలు మొలిపించుకొనుచు తండ్రి" అని దేవుడికి నివేదించుకొన్నాడు.

మరికొందరు అభ్యుదయ కవులు దైవాన్ని 'నిందాస్తుతి' చేసారు. "గుడిలోని దైవమా! ఆలింపవోయి! గుడిలోని దయ్యమా పైకిరావోయి" అంటూ పురిపండా అప్పలస్వామిగారు 'అధిక్షేపిస్తాడు. పోతే "ఉన్నావా! నీవసలున్నావా! ఉంటే కళ్ళు మూసుకున్నావా! యీలోకం కుళ్ళు చూడకున్నావా" అంటూ ఓ ప్రముఖ సినీకవి దేవుణ్ణి సవాదిస్తాడు.

మరొక ప్రక్క యీ యిరవయ్యో శతాబ్దంలో తన విశిష్ట వ్యక్తిత్వంచేతను - దేశ స్వాతంత్ర్యంకోసం - తన అపూర్వ శాంత్యహింసాయుత సత్యాగ్రహ - సహాయ నిరాకరణ జాతీయోద్యమంచేతను- దేశప్రజలచేతను 'అవతారపురుషునిగా' కీర్తింపబడిన గాంధీజీని కీర్తిస్తూ - సంస్తుతిస్తూ - ఆరాధిస్తూ ఎందరో తెలుగు కవులు కవితలు రాసారు - కావ్యాలన్నారు. మునగపాటి విశ్వనాథ శాస్త్రి 'గాంధీ దేవుడ'న్న కావ్యమే రాసాడు. మధురకవి నాళము కృష్ణారావుగారు 'గాంధీమహాత్ముని దశావతారలీల'లను లఘుకృతి రాసాడు— 'మహాకవి జాషువా గాంధీజీని' భార్యబిడ్డలున్న

ప్రత్యక్ష దైవంబ'ని ప్రస్తుతించాడు. ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి "మన సారథి మన సచివుడు. మన విభుడు - గురుడు" అని కీర్తించాడు "పుడమి నడుగిడు పురుషోత్తముడని" నాయని సుబ్బారావు గారన్నారు. కొండపల్లి జగన్నాథరావుగారు "ఓ గాంధిదేవ-ఎంతవాడ వెంతవాడవో అని సంబోధిస్తూ "జగద్రక్షకుడు గాంధి మహాత్ముడు జనులందరు మీరెరుగండీ" అంటూ "జగతిని ధర్మము స్థాపనజేయగ జన్మించిన హరి యితడండి" అని సంస్తుతించాడు.

ఇక తుమ్మలవారి పారమార్థిక దృక్పథం గురించి ఆధ్యాత్మిక చింతన గురించి తెలుసుకుందాం. "గోవిందచరణ సేవా / హేవా కనిరస్తదానవేశ్వర సుతుడై / జీవన్ముక్తుండై సుజ/నావళి కత డొజ్జబంతియై హవణిల్లెన్" అని తన తండ్రి నారయగారి గురించి తుమ్మలవారు చెప్పుకున్నాడు. "నిత్యసత్యాలాపనియతి" గలవాడు "పరమభాగవత లక్షణమ్ముల నాచికొన్న" వాడు నారయ. అట్టి నారయకు పుట్టిన మనకవిగారు ఆస్తికుడు కాకుండ నాస్తికుడెలా అవుతాడు! విత్తొకటి చెట్టొకటి అవుతాయా! కావుగదా! పైగా సత్యనిష్ఠాగరిష్ఠుడు - సత్యమునే దైవముగా ఆరాధించిన గాంధీజీని 'త్రికరణశుద్ధి'గా అనుసరించిన గాంధికవి ఆస్తికుడు కాకుండా ఎట్లా వుంటాడు! ఆస్తికభావం తుమ్మలవారు ఉగ్గు బాలతోనే కన్నవారినుండి పుణికిపుచ్చుకొన్నాడు. ఇక ఆయన లోని 'ఆస్తికత' ఋజువుపరిచే ఘటనలు-కవితలు కొన్ని పరిశీలిస్తాం.

చిన్నతనంలో - పాఠశాలపాక తగులబెట్టిన అల్లరి విద్యార్థుల్ని గురించి ఉపాధ్యాయుడడిగితే - అబద్ధమాడని బాల తుమ్మలవారు నిజం చెప్పాడు. మాస్టారు ఆ దుండగీడ్రని దండించాడు. అది లోన కక్షపెట్టుకొని, తుమ్మలవారితో స్నేహంనటించి మామిడితోటకు తీసుకొనిపోయి- చావుదెబ్బలు కొట్టారు. అంతలో

కోడెదూడకోసమటుగా పరుగెత్తుకొచ్చిన ఓ రెడ్డి పుణ్యాన తుమ్మల వారు 'చావుతప్పి కన్నులొట్టబోయి' బ్రతికి బయటబడ్డాడు. ఈ సంఘటన గురించి "నాకథల్లో" "గండము తప్పుట"లో చెపుతూ - "ఎవ్వరెట్లు తలంచిన నేమి / విశ్వసించెద నీరెడ్డి వేల్పటంచు / నేరమెఱుగని నాదు కైవారమునకు / గరగి ప్రభుడా పదపహర్తగాగ మాత్తె" నంటూ "ఆపదహర్త"గా వచ్చిన రెడ్డిని 'వేల్పు'గా ప్రభువుగా భావించాడు తుమ్మలవారు.

అలానే మరొక సంఘటన. ఒక సందర్భంలో ఆయనకు కొంత డబ్బు అత్యవసరం అయ్యింది. కాని అంత ధనం తన దగ్గరలేను. ఎట్లారా భగవంతుడా అని క్రిందామీదా పడుతున్న సమయంలో ఒక మిత్రుడు తాను అమ్మిన పొలంతాలూకు డబ్బు తెచ్చి తాను పొరుగూరు పోతున్నాననీ అంతడబ్బుతన వెంటతీసుకొని పోవుట మంచిదికాదంటూ - ఆ డబ్బును తుమ్మలవారికిచ్చి తాను వచ్చేవరకు దానిని 'భద్రపరచమని చెప్పి వెళ్ళాడు. చేతికి డబ్బు వచ్చింది అవసరానికి దాన్ని వాడుకొని మిత్రుడొచ్చేసరికి డబ్బు మొత్తం సంతనచేసి పెట్టాడు. ఈ సంఘటనని అదంతా "హరికరుణ" వల్లనే జరిగిందని - తన 'నాకథలు' లో ఓ కవితాఖండిక వ్రాస్తూ "హరికరుణననుట నన్నుం / బరిహాసమొనర్చువారు పలువురు కలరం / చెఱిగియు నమ్మొయి బల్కెతి / నరులెవ్వరు మార్చలేరు నానమ్మకమున్" అని తన దైవభక్తి భావాన్ని వివరించాడు.

తుమ్మలవారి "యిలవేల్పు" శ్రీ సీతారామచంద్రస్వామి చిన్నతనంలో ఆయన తన తల్లితోపాటు భద్రాచలం వెళ్ళి శ్రీ సీతారామచంద్రస్వామిని దర్శనం చేసుకొన్నట్టు "నాకథల్లో" చెప్పుకొన్నాడు. పెరిగిపెద్దయి కవిగా యెదిగిన తొలిరోజుల్లో— "గజేంద్రమోక్షము, ప్రహ్లాదుని హరిభక్తి - శ్రీరామలింగేశ్వర

శతకం - రామ (రాఘవ) శతకం మొదలగు వైష్ణవ భక్తితత్త్వ ప్రధాన లఘుకావ్యాలు రాసాడు. తర్వాత భగవద్గీతను గీతా దర్శమనుపేర తులసీదాసు విరచిత హనుమాన్ చాలీసా అనువాదాలు చేసాడు. ఆదిశంకరాచార్య విరచిత 'లక్ష్మీనృసింహస్తోత్రం, భజ గోవిందం తెనిగించాడు.

గాంధీజీది వైష్ణవ సాంప్రదాయం. కనుక చిన్నతనంలో తన అమ్మగారితో వైష్ణవాలయానికి గాంధీజీ పోయేవాడేమోకాని పెరిగి పెద్దయి "ఆయన గుడులకేగలేదు గుహలకు పోలేదు-" ప్రజల నడుమ బ్రతికి ప్రజాసేవ చేసాడు. నిత్యప్రార్థనా సమయాల్లో 'రఘుపతి రాఘవ రాజారామ్ పతితపావన సీతారామ్" "ఈశ్వర అల్లా తేరేనామ్ - సబ్ కో సన్మతి దే భగవాన్" అని ప్రార్థనగీత మాలాపింపచేసేవాడు. "సత్యమే" ఆయనకు దైవమైనది.

గాంధీజీని మనసావాచా కర్మణా - 'అనుకరించి - అనుస రించిన గాంధికవి తుమ్మలవారు పెరిగిపెద్దయి - ఉపాధ్యాయ వృత్తిలో స్థిరపడి - కవిగా లబ్ధప్రతిష్ఠుడైన తర్వాత ఆయన గూడా గుడులకు పోలేదు ! బడియే ఆయనకు గుడి ! "నేడు గుడికాదు బడి" కావాలని ఆయన అన్నాడు— గృహమే ఆయన కవితాలయ మైనది ! కవితాగానమే ఆయనకు "నిత్యారాధన" దైవీయ ధ్యాన మైనది ! తుమ్మలవారు తన కవితల్లో - "సాకార" దైవాన్ని స్తుతించలేదు. "నిరాకార పరబ్రహ్మతత్త్వమునే ఆయన ధ్యానిం చాడు. మతవైషమ్యాలు - మతవిభేదాలు ఆయన నిరసించినా సకలచరాచర జీవకోటిలో జీవాత్మగా వెలుగొందుచున్న 'శుద్ధ చైతన్య రూపాన్ని' ఆయన ఉపాసించాడు. తన కవితల్లో సంస్తు తించాడు. అర్థాంగి ఊళ్ళోని 'రామాలయానికి' నిత్యం వెళ్ళినా ఆయనెప్పుడూ ఏగుడికీ పోలేదు. భార్యాబిడ్డలు పండుగలకు పబ్బా

లకు ఇంట్లో దైవపూజ, వినాయకపూజ చేసినా, ఆయన ఆపూజాది కాలలో పాల్గొనేవాడుకాదని వారి పెద్దకుమారుడు శ్రీనివాస మూర్తిగారు చెప్పారు. తన 'కవిత' తపస్సులోనే వుండేవారట! తీర్థప్రసాదాలిస్తే పుచ్చుకొనేవాడట !

తుమ్మలవారి తాత్త్వికదృష్టి చూడండి !

అది సత్యం బదిజ్ఞానం
బది పుట్టువు చావులేని దది యానందం
బది శాంతము శివమద్వయ
మది బ్రహ్మం బది యుపాస్య మమృతార్థులకున్
—ఎక్కట్లు

ఎవరో వేదాంతంలో తలపండిన తత్త్వశాస్త్రవేత్తలకు తప్ప సామాన్య జనబాహుళ్యానికి ఒకపట్టాన అంతసులభంగా అర్థంకాని "బ్రహ్మతత్త్వం" గురించి యీ చిన్న కందపద్యంలో "అరటిపండు వొలిచి" నోట్లోనే పెట్టినట్లు సరళమైనభాషలో సుభోదకంగా చెప్పాడంటే తెనుగులెంక నిజమైన 'తత్త్వవేత్త'యే !

అఖిలభూత కోటి యందాత్మ నీక్షించి
యఖిల జగము నాత్మయందు జూచి
యద్వితీయమైన యానందమున జొక్కు
వడయు దనుక నలతివాడ నేను —నాకథలు

ఈ "ఎఱుక" యీ "పరబ్రహ్మతత్త్వసత్త్వం" మెరిగినవాడు "ఆత్మవత్సర్వభూతాని" అన్న పరమసత్యాన్ని గుర్తించి మసలుకొన్న వాడు తెనుగులెంక !

ఎవ్వనికొల్వు భద్రములకెల్ల నిదాన ముదారతా మయుం
డెవ్వడు సర్వలోకముల నేలు మహః పరిపూర్ణమూర్తియై
నెవ్వడు వాఙ్మనః క్రియల కేర్పడరాని మహాత్ముడాద్యుడై
యెవ్వడెసంగు, సత్యమన నెవ్వడు వాని భజింతు నిచ్చలున్–
(ఆత్మకథ - కృత్యాది)

ఈ పద్యం చూడగానే - చదవగానే- పోతనగారి 'ఎవ్వనిచే జనించు' పద్యము గుర్తుకొస్తుందికదూ! గాంధీజీకివలె "సత్యమన నెవ్వడు వాని భజింతు నిచ్చలున్" అంటూ లోకాల కాధారభూతమైన దివ్యపరబ్రహ్మతత్త్వాన్ని సంస్మరించాడు తెనుగులెంక! "నిరాకార" బ్రహ్మతత్త్వానే సత్యరూపంగా సంభావించాడు.

సకల స్థావర జంగమాత్మక జగచ్చక్రంబునన్ నిండి స
త్య కృపాయత్తులు నిర్మముల్ విదళితాహంకారులై పొల్చువా
రికిగా కన్యులకందరాని సుషమారింఛోళియై నిర్వికల్పకమై నిల్చు నఖండతత్త్వమును సంభావింతు శుద్ధుండనై
(మహాత్మకథ - కృత్యాది)

సత్యకృపాది సద్గుణాలుగల్గి - అహంకారదూరులైన నిర్మలభక్తి సత్తములకు మాత్రమే గోచరమై - అండపిండ బ్రహ్మాండమంతయు నిండి నిర్వికల్పంగావున్న అఖండతత్త్వాన్ని - ఆ శుద్ధచైతన్య దివ్య మూర్తిని సంభావించాడీ పద్యంలో తుమ్మలవారు. ఎంత గొప్ప భావన! ఇందులో కూడా 'నిరాకర' అఖండతత్త్వాన్నే స్మరించాడు.

ఎవని కరుణ నఖిల భువనంబులకు వెల్గు
పనుచు రవియు శశియు బగలు రేయి
యతని గొల్చు నతుడనై పురుషోత్తము
నాద్యునభవు శుభములావహిల్ల —ఎక్కట్లు

ఏ దైవంయొక్క కరుణతో యీ సూర్యచంద్రాది నవగ్రహాలు "క్రమం" తప్పకుండా తిరుగుతూ "అంధకార" బంధురమైన లోకానికి వెలుగునిస్తున్నాయో - అట్టి పురుషోత్తముని కొలుస్తున్నాడు తెనుగులెంక ! సృష్టి స్థితిలయకారుడైన దివ్యపురుషోత్తము డని 'సాకార' రూపుని పేర్కొన్నాడుకాని ఏ అవతారపురుషుల్ని పేరెట్టి స్మరించలేదు.

కళ్ళెమెంత బిగుంతును గాని గతుకు
దారికే క్రేళ్ళువాఱు డెందపు హుమాయి
దేవ ! నీవ లగామును దీసికొమ్ము
రమ్ము నాపీఠ; కేను సారథ్యమోప —చక్కట్లు

ఎంత సంయమనంతో వుందామనుకొని ప్రయత్నిస్తున్నా - మనసు గుఱ్ఱం 'గతుకుల' ప్రక్కదారికే పోతోందట ! అందుకే దేవుణ్ణి వచ్చి తన మనోరథంపై కూర్చొని - తన బ్రతుకుబాట చక్కదిద్దమంటున్నాడు ఇక్కడ కూడా మూలదైవాన్నే పేర్కొన్నాడు !

"హోరుగాలి నాపనేరనురా ప్రభూ ! మొక్కుచుంటి నన్ను జక్కబఱుపు" అంటూ 'చంచలచిత్తం' వలన యీలోక మోహవాసనా పెనుతుఫానులో కొట్టుకొనిపోయే తనను చక్కపఱచమని దేవుణ్ణి వేడుకొంటున్నాడు. "నా యర్హతకున్ మించిన శ్రేయము లిచ్చితివి "అన్న కృతజ్ఞతాభావంతో దేవుని మరువక—" నీమెడ నామది నిలుపన్ జేయుము పరమేశా" అంటూ పరమేశ్వరుడెప్పుడూ తనమదిలో వుండాలని వేడుకొంటున్నాడు.

"వినుమాత్మజ్ఞానమహో ! / మనుజునకున్ దెలుపగలదు మంచిని జెడుగున్" అంటూ "భౌతికబలమ్ము సుఖదాయియై తనర్ప / జాతికాధ్యాత్మికంబగు శక్తివలయు"నని హితవుపలుకుతాడు.

నామదికిన్ బలమొసగుము
నీమార్గమునందు నడుచు నేర్పొసగుము న
న్నేమఱకుము నీ లెంకను
స్వామీ ! యని నరుడు ప్రభు నుపాసింపవలెన్
—ఎక్కట్లు

ప్రతివాడు దేవుని "నీవేదిక్కని" శరణుజొచ్చి - ఉపాసించినప్పుడే తరుణోపపాయమైన జీవన్ముక్తి లభిస్తుందని కవి భావన

నా యర్హతకున్ మించిన
శ్రేయము లిచ్చితివి, తనివి చెందితి, నైనన్
నీయెడ నామది నిలువన్
జేయుము పరమేశ ! కొసరుచే రుచివచ్చున్ చక్కట్లు

తన 'అర్హత'కు మించినట్టి మేలు తనకు దైవం చేసినందులకు-తృప్తి గలిగిందని అంటూనే భగవంతుని తాను మరువకుండునట్లు తన మదిలో నిరంతరం గొల్వుండమని పరమేశ్వరుని వేడుకొంటున్నాడు. ఎంత కృతజ్ఞతాభావం ! ఎంతటి భక్తిభావన !

"సచరాచరమగు జగమున / కచలంబగు తేజమొకటి యాదవని" నమ్మిచరించమంటాడు. "పరంజ్యోతి" గురించి అన్నమాటలివి. "పరమేశ్వరునుస్కి, జరామరణంబుల మఱవరాదు మనుజుడు" అని గుర్తుచేస్తున్నాడు - దేవుడొకడున్నాడన్న పరమ సత్యాన్ని — జననమరణాలు ప్రతిజీవికీ తప్పవన్న లోకసత్యాన్ని మరచిపోవద్దంటున్నాడు.

కామరోషముఖ వికార దూరమ్ముగా
శౌచ వికసన ప్రశంసితముగ
యుష్మదీయ నివసనోచిత వేదిగా
దిద్దు మీశ్వరా ! మదీయ ! హృదిని ! —కదంబకైత

కామ క్రోధాది 'అరిషడ్వర్గముల' నుండి తనను దూరంగా నుంచి ఈశ్వరుడు కొలువుతీరుటకై 'పరిశుద్ధ' హృదయాన్ని తనకు ప్రసాదించమని పరమేశ్వరుని ప్రార్థిస్తున్నాడు శ్రీ తుమ్మల.

నామదిన్ నీ వెలుంగులు ననయువేళ
మధురతర భావనకు సుధీమానితోక్తి
కందచందమ్ములకు నెలవైన కవిత
వెడలువోయి! ప్రభూ! ప్రసన్నుడవుగమ్ము —**కదంబకైత**

దేవుని దయవుంటే - ఆ దైవతేజం తనలో చిగురించి తీవలుతొడిగితే - తనలో మధురభావాలు ఉదయించి - హృద్యంగమమైన 'కవిత్వం' పుట్టుకొస్తుందంటూ— "ప్రభూ ! ప్రసన్నుడవు గమ్మా" అంటూ వేడుకొంటున్నాడు. దేవుణ్ణి ఎంతటి వినయపూర్వక భక్తి ప్రపూరిత విన్నపం !

అఖిల భూతకోటి యందాత్మ నీక్షించి
యఖిల జగము నాత్మయందు జూచి
యద్వితీయమైన యానందమున జొక్కు
వడయు దనుక నలతి వాడనేను —**నాకథలు**

'ఆత్మవత్ సర్వభూతాని' అన్న ఉపనిషద్వాక్య సారాంశం తెనుగులెంక మనకు 'రుచి' చూపిస్తూ "బ్రహ్మానందం" లో 'జీవన్ముక్తుడయ్యే' వరకు తాను 'అలతివాడ' నని ఆ అర్థంకాని, అనంతమైన "సత్య — శివ - సుందర" త్రిగుణాత్మక పరబ్రహ్మస్వరూపం ముందు తానొక 'అల్పజీవిననీ' నీటిబొట్టువంటి వాడననీ "అణు" మాత్రుడననీ "సవినయంగా" శిరంవంచి - మనస్సులోని మాట 'నిష్కపటంగా వెలుబుచ్చాడు !

తుమ్మలవారి తాత్త్వికదృష్టి చూడండి !

భౌతికంపైన యీనాటి మేటి వైభవముల నేన
నూతనముగ సృష్టిచేసినాడ గణ్యుడ ననుకొనకు
నీ తెల్వియంత నీవెంత వినయము నేరిచి విశ్వ
నేతగా వేల్పొకడుండెనని గమనించి జీవింపు—

(సమదర్శి - ఆత్మజ్ఞానం)

"అధునాతన మానవుడా !... మొనగాడవు కావచ్చును.... విను మొక్కటి నీవెంతటి ఘనుడవయిన వెనుకచూపు కావలె నీకున్" అని అంటూ విజ్ఞానశాస్త్ర పరిజ్ఞానంతో "నవ్యస్రష్ట" నని విఱ్ఱవీగొద్దు - నీవెంత నీ తెలివియెంత ! ఈ అనంత విశ్వానికి - యీ విశ్వవిజ్ఞానానికి - మానవుని మేథకు మూలకారకుడైన "విశ్వనేత" "వేల్పు" గలడన్న పరమసత్యాన్ని మరిచిపోవద్దని హెచ్చరిక చేస్తున్నాడు.

పరిణామశీలమై పరగుచుండెడి ప్రకృతియందెల్ల
బరమేశ్వరుడొకడె నిండియుండె సర్వమ్ము, నాతనికె
నరుడ ! వానిది వానికే నమర్పించి నలుసంత విడక
పరితృప్తినందుము కర్మఫలముపై వదలు మాసక్తి

(సమదర్శి — ఆత్మజ్ఞానం)

"అండపిండ బ్రహ్మాండం నిండా అణువణువున ఆత్మరూపగతుడై పరమేశ్వరుడున్నాడన్న పరమసత్యాన్ని ఆత్మజ్ఞానంతో గుర్తించమంటున్నాడు. దైవానిదైన యీసమస్తం — చివరకు తానూ, తన 'ఆర్జన' అంతా ఆ దైవానికే సమర్పించి - కర్మఫలమాసింపక- నిష్కామకర్మతో జీవితం గడిపి పరితృప్తిచెంది - 'దుర్వ్యామోహం' లో పడక 'సంసారలంపటం'లో పడక - 'లోకజీవితావ్యామోహం'లో

పడక జీవించమంటున్నాడు. భగవద్గీతలో శ్రీకృష్ణపరమాత్మ "కర్మయోగ" మందలి నిష్కామయోగ ప్రబోధం గుర్తుకువస్తున్నది కదూ ! ఇంతటి "ఆత్మజ్ఞానం" ఉన్నవాడు కనుకనే తెనుగులెంక 'భగవద్గీత' ననువదించగలిగాడు. శంకరాచార్య విరచిత 'లక్ష్మీ నృసింహస్తోత్రం' భజగోవిందం తెనిగించగలిగాడు. బహుశా అందుచేతనే "ఈశ్వరునిశక్తి నాయందు నింతోయంతో కలదు సుమ్మ"ని (ఆత్మార్పణం)లో కపోతంచేత అనిపిస్తాడు కవిగారు.

లోకంబ నేను నేనే
లోకంబ నటంచు నాత్మలోనెంచిన సు
శ్లోకునకు నింద నందున్
జేకూరు నఖండ చిరసౌఖ్యంబుల్ —ఆత్మార్పణము

దైవసృష్టి అయిన లోకంలో తాను, తానే లోకం అని సంభావించే జీవుడికి 'అఖండ హర్షచిర సౌఖ్య'ము లొనగూడుతాయంటాడు. "పరమేశ్వర గురుతేజః పరిపూరితమై వెలుంగు ప్రకృతిని" అని అంటాడు. "జీవుడొడలిం దొలంగెడి / చో వెంటందోడువచ్చు చుట్టంబు మదిన్ / భావింప ధర్మువ కదా" అంటాడు. పోయేనాడు వెంబడిరాదు పూచిక పుల్లైనా అన్నతత్త్వమెరిగినవాడు తెనుగు లెంక !

మేను రథమాత్మ రథికుడు, ధీ నియంత
యింద్రియములు తురంగములెడద పగ్గ
మెవ్వడిద్దాని పీలువాలెఱిగి పట్టు
నతడు దవ్వగు సంసరణార్తి హతికి —సందేశసప్తశతి

ప్రాణిదేహం రథం; జీవాత్మ సారథి; బుద్ధి (మేధ) నిర్దేశక నియంత; పంచేంద్రియాలు పంచకల్యాణి గుర్రాలు, హృదయం పగ్గం; ఈ పరమసత్యాన్ని తెలుసుకొని "పీలువాలెఱిగి" మసలుకొంటే

సంసార 'భవ' మోహబంధాలు పటాపంచలౌతాయని లెస్సగా తత్త్వబోధ చేసాడు గాంధికవి.

"ఒడలు నా నీశ్వరుడు నిల్చుగుడి: తదీయ / బాహిరాంతర శౌచ సంపత్తిపట్ల / గనుగలిగి యుంట మానిసికర్జ" / మంటాడు. (ఎక్కాట్లు) దేహమే దేవాలయం! బైట, లోన (శరీరం, మనసు, హృదయం) నిర్మలంగా పరిశుభ్రంగా వుంచుకోవడం ప్రతి మనిషి కనీస ధర్మమని జ్ఞానబోధ చేస్తున్నాడు గాంధికవి.

"దేహమన నొక దుప్పటి" దీని / సురలు/ నరులు దైత్యులు కప్పుకొన్నారుగాని / మైలపఱిచిరి పెక్కురు మాయనీక / వాడు కొన్నారు బాపుజీవంటి ఋషులు" (సందేశసప్తశతి) అంటాడు. దేహమొక వస్త్రంవంటిదని, చినిగిన (జీర్ణ) వస్త్రాన్ని వదలి ఆత్మ మరొక దేహాన్ని (వస్త్రాన్ని) ధరిస్తుందని భగవద్గీతలో స్పష్టంగా వుంది. మానవమాత్రులు దేవతలు అందరూ యీ దేహమనే దుప్పటిని కప్పుకొని - మైలపఱచి మురికిచేశారు! అంటే దుర్వినియోగం చేసుగొన్నారు! జీవితం వ్యర్థపరచుకొన్నారు! కాని గాంధివంటి గొప్ప 'ఋషి'తుల్యులు దానిని సద్వినియోగం చేసుకొన్నారు. జీవితం ధన్యం చేసుకొన్నారు! తరించారు. ఎంత గొప్ప నీతి!

కర్మయోగము భక్తియోగమును మరగి
చిత్తశుద్ధి నేకాగ్రతన్ జీవిపడయు
నితని కవలీలగా లభియించు "నెఱుక"
"యెఱుక" కైవల్య సుఖసిద్ధి హేతువగును

—సందేశసప్తశతి

నిష్కామకర్మయోగం, నిశ్చలభక్తి, నిర్మలచిత్తం - యీమూడు అలవర్చుకొన్నవారికి "ఎఱుక" (ఆత్మజ్ఞానం) గలుగుతుంది. ఆ 'యెఱుకే' జీవన్ముక్తికి మార్గమౌతుంది ! భగవద్గీతలోని సారాంశం, ఆదిశంకరాచార్యుని 'జ్ఞాన' యోగసారం – తెనుగులెంక యీ చిన్నిపద్యంలో 'యిమిడ్చి' సులభంగా అర్థమయ్యే విధంగా వివరించాడు !

ఇంతటి 'ఆత్మజ్ఞానం' పరతత్త్వంగూర్చిన "ఎఱుక" ఉన్నవాడు కనుకనే తెనుగులెంక, మతానికి అంతగా ప్రాముఖ్యత యివ్వలేదు. మతాన్ని దైవం సృష్టించలేదు కనుక. మనిషి 'దేశకాల' పరిస్థితుల్నిబట్టి- తన 'అవసరాల' కొద్దీ తన స్వార్థంకొద్దీ సృష్టించుకొన్నాడు కనుక అందుకే "మొదటనెల్లమ తమ్ములు ముక్తికొఱకు/ బుట్టినవిగాని రాన్రాను భుక్తికయ్యె" / బల్లికని బిల్లికని భయంపడుటనేర్పి / జలగలుంబలె నిఖిలప్రజాగ్రసమును బీల్చె" అంటాడు. ముక్తికొఱకు మతాలు 'స్వార్థంతో' జలగలు రక్తాన్ని పీల్చినట్లు అమాయక ప్రజల్ని పీడించి పిప్పిచేసే 'పొట్టకూటి' మతాలైనవని నేటి మతాల వెఱ్ఱిపోకడల్ని నిలదీస్తున్నాడు. "మతముపేర్వోటి కపటధర్మములు పల్కి / మోసమెఱుగని సాదుల ముంచి ముంచి / బొజ్జ పెంచెడివారికి బుద్ధిసెప్ప/కాలమే తెంచెనని యెఱుంగవె జడాత్మ" అని "దొంగ" స్వాములకొక హెచ్చరిక నిక్కచ్చిగా చేసాడు.

"మతముపేర సాటి మానవు తలద్రుంచి / మతము పేర మాతృమహిని జీల్చి" శాంతినెవడువడయుడని అంటాడు. సమతా దవీయయగా మతము నిలువ" దంటాడు. "మతముతో నరుడు దారిదప్పినాడు నేడ'ని బాధపడతాడు. "పరమతమ్ముల వారి ప్రాణాలు గ్రుంజుట" "తమ మతమ్ములవారి తల నిలుపుట" నిరసిస్తూ

న్నాడు తెనుగులెంక ! అందుకే "ప్రేమలేని మతము పెరగద"ని నిష్కర్షగా చెప్పాడు. "ప్రాతవడె మతమ్ములు" రాజనీతి కుళ్ళై" కనుక వాదులాటలెందుకు, వీటితో పనిలేదంటాడు. "కరుణకంకితమ్ముగాని సూనృతమున / కగ్గపడని ప్రేమనాస్థలేని / మతము లేదు" అని ముక్కుసూటిగా చెప్పాడు.

ఒక దారమునం గల మౌ
క్తికములవలె మతములెనసి దేశమునకు నా
ద్దిక నేర్పవలయు విశ్వము
సకలము హరిమయమటంచు జాటగవలయున్

—ఎక్కట్లు

ఒక దారంలోని 'ముత్యాల'వలె, అన్ని మతముత్యాలు మానవతా సూత్రంలో పొదిగి దేశమాత కంఠాభరణంగా - విశ్వదేవతా గళహారంగా వెలుగొందాలని తెనుగులెంక ఆశయం !

అందుకే "హైందవులు, ముస్లిములు, సిక్కులన్నదమ్ములట్లు జీవింప" వలయునంటాడు. హిందువులు పారశీకులు నేసుమతము నాదరించెడివారు మహమ్మదీయులు "ఐకమత్య మన్యోన్య ధర్మానురాగ మలర జీవించవలయు"నని ఆశావహం వ్యక్తంచేసాడు "మతములెన్నియైన మానవగణమెల్ల / నొక్కజాతి"గా విరాజిల్లాలని తెనుగులెంక ఆకాంక్ష ! "మత కుల భేదముల్ మఱచి మానవతా పథమాశ్రయించి "భారతీయులు జీవించాలంటాడు.

జగతి నున్న కల్మి సకలమీశ్వరునిదే !
యెసగు సంఘమూర్తి నీశ్వరుండు
మనుజుడితని సొత్తుదినుట తప్పదు, ఋణం
బిది సమాజ సేవనే తొలంగు — ఏక్కట్లు

# తుమ్మలవారి కావ్యాంకిత ప్రత్యేకత

"కాసులకు నాసచేయక
వ్రాసిన కబ్బములనెల్ల వరణీయ కథా
భాసురులకు నర్పించితి"
నా సుకృతమ్ములు ఫలించినవిలే యనుచున్ —నాకథలు

ఆంధ్ర సాహితీజగత్తులో కవిపండితులు తమ రచనల్ని ఇటు (యిష్టదైవపరంగా) "పరమేశ్వరాంకిత"మో - నచ్చిన వదాన్యులైన వారికి) "నరాంకితం" గావించడమో ఆచారంగా అనాదిగా వస్తున్నది. ప్రాచీనకవులు చాలామంది "నరునకు గబ్బమిచ్చుట యనాదృత కృత్యమని" భావించారు. అయితే ప్రాచీనకాలంలో కవిపండితులు "రాజన్యుల" కొలువులో "ఆస్థానకవి పండితులు గానో — రాజకీయ సలహాదారులుగానో వుండేవారు కనుక — ఆ రాజుల మెప్పుకొఱకు- తాము రాసిన కావ్యాల్ని వారికంకితం యిచ్చి- మడులు - మాన్యాలు —ధనకనకాది కానుకలు — 'అగ్రహారాలు' సంపాదించుకొని - అట్టహాసంగా అధికారదర్పంతో "గర్వాతిశయం"తో సుఖశాంతులతో వర్థిల్లారు. ఇందుకు ఉదాహరణగా తిక్కన్నను శ్రీనాథుని పేర్కొనవచ్చు. రాజులకొలువులో లేక పోయినా-ఆయారాజుల 'అభిరుచుల్ని' బట్టి తమ కిష్టమైనా కాకున్నా కావ్యాలు వెలయించి — (భక్తిప్రధానమో - శృంగార ప్రధానమో) రాజుల నాశ్రయించి — ఆ రాజులు మంచివారైనా — కాక పోయినా - వారినీ - వారి వంశావళినీ "బహుధా" శ్లాఘించి- తమ కావ్యాలు వారికి అంకితంచేసి - రాజులిచ్చిన 'కానుక'లతో "చరస్థిరాస్తులతో" సుఖంగా కాలంగడిపేవారు ! రాజులకు అంకితం

యివ్వని సందర్భాలెన్నో ఉన్నాయి! పోతన 'తన యిష్టదైవం శ్రీరామచంద్రునికి అంకితమిచ్చాడు తన 'భాగవత కావ్యాన్ని' "అంకితం తనకీయమన్న" రాజు 'ఆగ్రహా'నికి గురిగూడా అయ్యాడు. తిక్కన తెలివిగా 'నిర్వచనోత్తర రామాయణాన్ని' తన రాజు మనుమసిద్ధికి అంకితమిచ్చి 'భారతాన్ని' తన యిష్టదైవమైన "హరి హరనాథు"నకు అంకితం గావించాడు. ఆధునికాంధ్ర సాహిత్యంలో అంకితాలిచ్చిన వారున్నారు ఇవ్వనివారున్నారు. అలానే అభ్యుదయ ప్రజావిప్లవకవుల్లో గూడాను అంకితాలిచ్చిన సందర్భాలున్నాయి. ఇవ్వనివీ వున్నాయి !

రాచరికాలు అంతరించిన పోయిన నేటికాలంలో కవిపండితులు తమ కావ్యాల్ని ఉదారస్వభావులు వదాన్యులైన సంపన్నులకు అంకితం యివ్వడం జరుగుతూవుంది! అసలు అంకితమే యివ్వని సందర్భాలు లెక్కకు మిక్కిలిగానూ వున్నాయి. కన్నవారికో - తన ఆప్తబంధుమిత్రులకో అంకితం యిచ్చిన - యిస్తున్న సందర్భాలుగూడా కోకొల్లలు. గతించిన ఆత్మీయులకు ఆత్మీయ "స్మృతి" చిహ్నంగాగూడా అంకితాలిచ్చిన సందర్భాలున్నాయి. పూర్వం ముద్రణ సౌఖర్యంలేదు కదా! కవిపండితులు తాళపత్రాలమీద రాసిన తమ కవితల్ని, రచనల్ని కృతిపతులకు "అలానే" అంకితం యిచ్చేవారు. ఆధునిక యాంత్రికయుగంలో ముద్రణ సౌఖర్యం విరివిగా లభ్యమౌతున్నది. అయితే కాగితం ధర, ముద్రణఖర్చు రోజురోజుకు విపరీతంగా పెరిగిపోతున్నాయి కవిపండితులు తమ రచనల్ని అచ్చువేయించుకోవడం యీనాడు చాలా వ్యయప్రయాసలతో కూడుకున్న పని !

సాధారణంగా కవులు - పండితులు ఆర్థికంగా అంతగా స్థితిమంతులుగా వుండరు! 'సరస్వతి'కి లక్ష్మికి (అత్తాకోడళ్ళకు)

చుకెక్కుదురుగదా ! తాము రచనలు అచ్చువేయటానికి బోలెడంత ఖర్చు అవుతుంది ! ఇంకో ప్రక్క సంసారభారం ! కనుక తమ రచనల్ని యీనాడు ఎవరో ఉదారస్వభావులు వదాన్యులైన సంపన్నులకి అంకితంచేసి-ఆ కృతిపతులిచ్చిన "సొమ్ముతో" తమ రచనలు అచ్చువేయించుకొని - మిగిలిన ధనంతో సంసారభారం నెట్టుకుపోవడం 'రివాజు'గా జరిగిపోతున్నదీనాడు. ఉదాహరణకు మహాకవి జాషువాను చెప్పుకోవచ్చు. ఇకపోతే కాస్త ఉన్నవారు కవిత్వం రాయగల్గినవారు - తమ కిష్టమైన ఆప్తులకు అంకితంచేయడం గూడా కద్దు ఉదాహరణకు డా॥ బెజవాడ గోపాలరెడ్డిగార్ని చెప్పుకోవచ్చు ! తమకావ్యాలు తామే అచ్చువేసుకొని ఎవరికీ అంకితం యివ్వని సందర్భాలు యీనాడూ వున్నాయి, ఉదాహరణకు కవిరాజు త్రిపురనేని రామస్వామిచౌదరిగార్ని చెప్పుకోవచ్చు. అభ్యుదయ కవి శ్రీ శ్రీ తన "మహాప్రస్థానాన్ని" తన మిత్రునికంకితమిచ్చాడు.

ఇక తెనుగులెంక విషయానికొస్తాం.

కృతిపతిత్వము కీర్తికి హేతువగుట
నీశ్వరుడు కీర్తిమయుడౌట నేను భగవ
దంకితము సేయ నొడబడ నస్మదీయ
కావ్యమాస్తిక ధర్మానుగామినయ్యు —"నేను"

"ఈశ్వరుని జాటగా మర్త్యుడెవడు ? వీనికైత కతడుబ్బునటయు కల్ల" అన్న దృఢవిశ్వాసమున్నవాడు. "నరునకు గబ్బమిచ్చుట యనాదృత కృత్యమటంచు సత్కవీ / శ్వరులు పురాతనుల్ నొడువు చందమదేమొ" మనకవిగార్కి 'రుచింపదింతయున్'. "సిరులకు నాసచెంది యొక చెన్నటికిచ్చుట మచ్చగాని స్వార్థ / రహితబుద్ధి నిద్ధగుణ రాశికొసంగుట" దోసం కాదంటాడు తెనుగులెంక. కనుక

తెనుగులెంక తన కావ్యాల్ని "నరాంకితం" గావించాడుగాని "పరమేశ్వరాంకితం" చేయలేదు.

"రాజ్యవైభవము తిరంబడలేదొక్క / కవితబ్రదికె యుగయుగాలుచన్న" కనుక. "నరునిపేరు నిల్పునదికైత" అంటూ "కావ్యబాంధవమ్ము కతన రారాజులే / కాదు నిల్చినారు పేదలైన" అని నొక్కి చెప్పాడు. అందువలన "కృతిపతిత్వము మంచిదే, పతియశస్సు బ్రతుకు నాలుగుకాలాలపాటు" అంటూ "ఫలాసక్తి లేని లోకసేవలో నలంగు "సుకృతి" ని వెదకి కావ్యపతిజేసి కృతకృత్యుడగుటవలయు సాధువైన కవికి" అని హితవు చెప్పాడు. "విత్తమిచ్చిన జిత్తము చిత్తమనెడి / కవులుకట్టిన మేడలు కలవె జగతి" కనుక "పరువులేని సొమ్ము పదిలక్షలగు గాక / కవికి గడ్డిపరక కంటె లొచ్చు" అంటూ "కవితకంటె రూక గణనీయము" కాదన్న గట్టి నమ్మకమున్నవాడు శ్రీ తుమ్మల. కనుకనే

ఏను బేదవాడనైన నన్నలయించు
బెడదలెన్నియున్న బెఱల నడిగి
బ్రదుకనియ్యనేయ; నిది కఠోరంబగు
నియతియౌనుగాక నిలుతు సైతు— (నాకథలు)

తాను ఆర్థికంగా 'స్థితి'మంతుడు కాకపోయినా పరులపంచజేరి 'దేబరించి' చేతులుచాచే తత్త్వంకాదు తెనుగులెంకది! ... "మనకవి సిరులున్న / వాడుకాడు; పేదవాడయయ్యు / వేడునట్టివాడు కాడు సంపన్నుల వీడునట్టివాడు కాడు పరువు" అని కుప్పుస్వామి అంతటి గొప్పమనీషి మన కవిగార్ని మెచ్చుకున్నాడు,

కవిగా, డబ్బును గడ్డిపోచకంటే తక్కువగా భావించాడు కనుకనే "హితులకు బరార్థఘటనా / వ్రతులకు గృతులిత్తుగాని వారి వరాలన్ మతిసేయ" నని కరాఖండిగా చెప్పాడు.

కృతమెఱుక చాలు నన్మ
న్నతి కింపదకబ్బమిచ్చి మణిగొంట; జగ
ద్ధిత శీలుండౌదవ నయా
చితమ్ముగా నిడుదు నాసృజించిన కవితన్ —నాకథలు

కృతిపతి మంచివాడై కృతజ్ఞత చెబితేచాలు - అతడిచ్చే ధనకన కాదులు తనకక్కరలేదంటాడు. అందుకే "కాసులకు నాసచేయక / వ్రాసిన కబ్బములనెల్ల వరణీయ కథా / భాసురులకు నర్పించితి" నని సగర్వంగా సంతృప్తితో చెప్పుకున్నాడు.

ఇంకో రహస్యమేమంటే "ఆలికైన జెప్ప నచ్చొగుదనుకనా / వలచినిట్టి యల్లువాని పేరు". కన్నకూతురు పెండ్లి చేసేముందు తల్లి దండ్రు యిద్దరూ 'అల్లుణ్ణి' చూస్తారు. అమ్మాయితోపాటు తల్లి దండ్రులకు గూడా అల్లుడు నచ్చాలి పాతకాలపు రోజుల్లో. మరి 'కవన' కుమారి విషయంలో 'కవి'గారొక్కరే గదా కష్టపడికనేది ! కనుక ఆలికి చెప్పవలసిన పనిలేదు ! కనుక ఆ "ధర్మం" పాటించాడు తెనుగులెంక ! మన కవిగారి దృక్పథం అది. పైగా యింకో నియ మం - రహస్యంగూడా వుంది— "అస్మదీయ రచన మచ్చగు నందాక / నది యదంకితంబొ యన్యులెఱుగ / రతని కాసుమీది మతినాకు లేకుంటం / గృతిపతియు నెఱుంగడీరహస్సు" అని చెప్పు కొన్నాడు తన నియమమేమిటో ! "మీకు మీకటంచు రూక లకేకారు / కవుల కరణి నాకుగాని సరణి" అంకితమిస్తాననీ అంకితం తీసుకోమని వారిచుట్టూ వీరిచుట్టూ తిరిగేతత్త్వం కాదు తెనుగు లెంకది. కృతిపతి 'సుగుణసంపన్ను'డైతే చాలు ! నిజానికి తుమ్మలవారి కావ్యాలను తమకంకితం యివ్వమన్న గొప్పవారెం దరో వున్నారు ! అడగకపోయినా, యిస్తే తీసుకుందామని ఆశిం చినవారు, అల్లులుచాచిన పెద్దవాళ్ళు - గొప్పవాళ్ళు - సంపన్ను

లెందరో వున్నారంటే అతిశయోక్తికాదు. అయితే ఆయన ధనం చూడలేదు! పదవి చూడలేదు కేవలం 'గుణం' చూసాడు! లేకపోతే ఆత్మకథవంటి గొప్ప కావ్యాన్ని ఒక సామాన్య సమర యోధుడైన ఎర్నేని సుబ్రహ్మణ్యాని కంకితమివ్వడమేమిటి! "నా కథలు" పెద్దకావ్యం దేశంకాని దేశం అమెరికా దేశీయుడైన "అమెరికా గాంధీ" మార్టిన్‌లూథర్‌కింగున కంకితమీయడ మేమిటి?

మంచి అల్లుణ్ణిచూచి కావ్యం స్వంత ఖర్చులతో ముద్రించి, యెవరికీ చెప్పకుండానే అల్లుణ్ణి ఎన్నుకొని (సెలక్టు చేసుకొని) కావ్యాన్ని కృతిపతికి పంపితే ఆ కృతిపతి ఆశ్చర్యపడిపోయి, ఉబ్బి తబ్బిబ్బైపోయి 'కృతజ్ఞతా పూర్వకంగా వుత్తరంరాస్తేనో - లేక స్వయంగావచ్చి కృతజ్ఞతలు తెలియజేస్తేనో తెనుగులెంకకు సంతృప్తి! సరదా! మహాసంతోషం! "పెద్దకాపు" లఘు కావ్యాన్ని (దాన్ని దరిమిలా పఱిగపంటలో చేర్చాడు) గాంధేయ వాది "ఎర్నేని సుబ్రహ్మణ్యం" గారికిచ్చి (యీాయనకు దరిమిలా ఆత్మకథ అంకితమిచ్చాడు) కావ్యం పంపాడు కృతిపతికి అతడుబ్బి పోయి ఉత్తరంరాసాడు కృతజ్ఞత తెలుపుతూ "నిక్కమరయ నాకు నీకున్న గాంధేయబాంధవంబ యింతపని నొనర్చె" నంటూఆఉత్తరం చూచుకొని తెనుగులెంక "అబ్రాశివిధాన బొంగె హర్షము నాలో" అని సగర్వంగా - సంతృప్తిగా చెప్పుకొన్నాడు. ఇంకో విచిత్ర మేమంటే విషయమెఱిగి, కృతిపతులు తమంతతాముగా "అచ్చు ఖర్చో" లేదా యేదో కొంతసొమ్ము యివ్వజూపితే తిరస్కరించడం కూడా తెనుగులెంకకొక సరదా! ఛాదస్తం!

కావ్యాలురాసి - తామే స్వంతఖర్చుతో అచ్చువేయించి- కృతిపతులనెన్నుకొని వారికి చెప్పకుండానే (మరణించినట్లయిన

వారికి స్మృతిచిహ్నంగా అంకితమిచ్చిన సందర్భాలు యీనాడు ఎన్నో వున్నాయి. అర్ధాంగికి, కృతిపతికి మరొకరికి చెప్పకుండా స్వంతఖర్చులతో పుస్తకమచ్చు వేయించి, కృతిపతుల నుండి ఏమీ ఆశించకుండా - కావ్యాలంకితాలిచ్చిన సందర్భాలు సాహితీజగత్తులో ఎన్నో వున్నాయి : అయితే అలా అచ్చు వేయించగల్గిన వారు తప్పక కొంత స్థితిమంతులై వుండి వుంటారు. అంతమేరకు అందులో చెప్పుకోవలసిన ప్రత్యేకతగాని విశేషమేమిగాని లేదు. అసలు విష యం చెప్పుకోవలసిందేమంటే 'స్థితిమంతుడు' కాకపోయినా సంసారం పెద్దదైనా — కావ్యాలు తన స్వంతకర్చుతో అచ్చు వేయించి కృతపతుల నెన్నుకొని వారికంకిత మిచ్చిన తర్వాతనైనా వారేదన్నా 'కానుక'గానో కృతజ్ఞతా పూర్వకంగానో, వారంతట వారే 'కొంతసొమ్ము' ముట్టచెప్పటానికి ముందుకొచ్చి మంచిగా విన్నవించుకొన్నా దాన్ని తిరస్కరించడంలోనే తెనుగులెంక నియమనిష్ట - ఋజువర్తనం సత్యసంధత ఆయన విశిష్ట వ్యక్తిత్వం - అందులోని ప్రత్యేకత ఇమిడివున్నాయి. అదే తెనుగులెంక గొప్ప దనం !

శ్రీ తుమ్మలవారి 'నా కథలు' పరిశీలించినపుడు 'కనువిప్పు' కవితా ఖండిక చదివితే నాకొకటనిపిస్తుంది. ! మొదట్లో ఆయన రాసిన చిన్న చిన్న చిల్లర మల్లర కవితలు - శతకాల అచ్చు విషయం ఆలావుంచితే - 1936 నాటికి 'ఆత్మకథ' మొదట భాగం పూర్తి అయ్యింది. అప్పట్లో దానికి అచ్చువేయటానికి కనీసం 'ఆరునూర్లు' ఖర్చువుతుందని అంచనావేయడం జరిగింది. కవిగారి ఆర్థిక పరిస్థితులను బట్టి అది కాస్త 'భారమైనపనే ! తన ప్రియ మిత్రుడొకని సలహాపై తెలిసిన సంపన్నుడైన "స్వకులస్థుడొ" కరి దగ్గరకు వెళ్ళి ఆత్మకథ అచ్చు కర్చు విషయం ప్రస్తాన తెచ్చారు

కవిగారున్నూ ఆయన శిష్యుడున్నూ. ఆ వెంకన్నగారు "కమ్మ కవియునిట్లు జాటుట యిటులాత్మగౌరవంబు నణచుకొనినట్లౌ" తుందని - "మంచికైత అయిన-చో జగమ్ము ఆదరించకపోదనీ" - నా వంగడమున (కమ్మ వంశం) మానిసి దేవురుగొట్టగుట తనకు సమ్మతంకాదని "చివరకు" 'నీతి - పరువు - గఱువతనం' గల తమ వంశంలో (కమ్మ వంశం) "చౌదరి యర్థదాతగాని యర్థి కాడు" అని కరాఖండిగా నిష్కర్షగా అంటూ మన కవిగారికి చిన్న 'చుఱక' నంటించాడు. కవిగారి ఆత్మ గౌరవానికి చిన్నిచుఱకతో "తలదీసి" నట్టెంది ! అసలే ఆసకు లొంగక తొమ్మిది వీసెల పైచిలుకు పరుల విత్తము పసిడిన్ ద్రోసి "పరవిత్తాన్ని" విషప్రాయంబుగా విశ్వసించిన "నిత్య సత్యా లాపనియతి" గల్గిన నారయ్య ముద్దుల బిడ్డడు గదా మన కవిగారు ! వెంకన్న అన్నమాట కవిగారి ఆత్మ గౌరవానికి చెంపపెట్టు కాకుండా యెలా వుంటుంది ! ఆయన 'అహం' దెబ్బతిన్నది. ఆ వెంకన్న పల్కులు "కవిగారి" యెడద నిశితకంటకములై కలంచి" నవి - 'నీతి' 'నియతి' కన్నవారి నుండి వుగ్గుపాలతో వుణికి పుచ్చుకొన్న "ధార్మికావేశమునకు నాధారమైన యింట బుట్టిన" కవి గారికి 'కనువిప్పు' కలిగింది ! జ్ఞానోదయమైనది, అంతే ! ఆ సంఘటనతో - తన జీవితంలో తానెన్ని కావ్యాలు వ్రాసినా యెవర్నీ ఒక 'కాసు' కోసం దేబెరించకుండా తానే అచ్చువేసి - 'గుణగరిష్ఠులైన, వారికి అంకితం యివ్వాలన్న నిర్ణయానికి వచ్చి అలా నియమం పెట్టుకొన్నాడు ఆ నియమం జీవితాంతం వరకు 'నిజాయితీ'గా పాటించాడు అదీ తెనుగులెంక విశిష్టత ! ప్రత్యేకత !

ఆ వెంకన్న తన ఆత్మాభిమానంపై కొట్టిన చెంపదెబ్బతో "మూడెకరాల మేలి మాగాణి అమ్మి "ఆత్మ కథను అచ్చు వేయించి" -

ఇంత గొప్పరచన యే ధనికున కిడ్డ
నడ్డమాక వాడమ దర్థమునకు
జిన్నకాని లేని సన్యాసి కిడెదేమి
యనుచు నల్వురు నవ్వినా —నాకథలు

"ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధుడు" - విశుద్ధ గాంధేయుడు - "మహాత్మువెంట దండికి నడచిన వీరవప్య"డు - పూరూపేరూలేని అతి సామాన్యుడైన 'ఎర్నేని సుబ్రహ్మణ్యం' గారికి "అర్చన"గా అంకితమిచ్చి తన నిజాయితీని నిలబెట్టుకొన్నాడు మన తెనుగులెంక ! ఇదే తుమ్మలవారి ప్రత్యేకత అంటే ! అదే ఆయన విశిష్టత అంటే!

తండ్రి ఆస్తిలో తన భాగం (వాటా) క్రింద వచ్చిన ఏడెనిమిది యెకరాల 'మంచి' మాగాణిలో 'మూడెకరాలు' అమ్మి ఆత్మకథను అచ్చువేయించి ఒక సామాన్య గాంధేయవాదికిలా అంకితమిచ్చాడు. తెనుగులెంక బిడ్డల చదువుల నిమిత్తం ఒక్కొగా నొక్క కుమార్తె పెండ్లి పేరంటాలకు కానుకలు కట్నాల క్రింద దాదాపు స్థిరాస్తులు మొత్తం 'కరిగి' పోయినా' తెలుగు పండితులు 'ఉద్యోగం'తో వచ్చే నెల జీతం తన పెద్ద కుటుంబం గుట్టుగా - మట్టుగా - గౌరవంగా నెట్టుకు పోవటానికి 'బొటాబొటిగా' సరి పోతున్నా - సరిపెట్టుకొంటూ సంసారం గడుపుతూ తాను పుంఖాను పుంఖంగా వెలయిస్తున్న కావ్యాలు తన స్వంత ఖర్చులతోనే అచ్చు వేయించుకొంటూ కృతిపతుల దగ్గర పైసా ఆశించకుండా, వారిస్తానన్న అంగీకరించక — తుమ్మలవారు నీతి నిజాయితీగా - నియమ నిష్టతో బ్రతుకు వెళ్ళ తీసాడు. అదే తుమ్మలవారి విశిష్టత ! అదీ ఆయన విశిష్ట వ్యక్తిత్వమంటే !

మూడెకరాలమ్మి ఆరునందలు వెచ్చించి యస్మదర్థ మాత్మకథ

వెల్వరింప"గా ఆ కావ్య ప్రతులు "వేడి వేడి గారెలట్లు క్రీతము" లయ్యాయి. "మూడు విశ్వ విద్యాలయము (ఆంధ్ర, మద్రాసు, అన్నామలై) లీ కవిత్వ మాదరించి పాఠ్యముగా నిర్ణయించు" కొన్నాయి. తత్ఫలితంగా వచ్చె బెట్టు బడియు వడ్డియు లబ్ధియు హెచ్చెయశము తనివి యొసగెనాకు" అని సంతృప్తితో ఆనంద పరవశుడయ్యాడు కవిగారు. ఇలా వ్రాసిన కావ్యముల అమ్మకాల ద్వారా వచ్చిన సొమ్ముతో క్రొత్తగా వ్రాసిన కావ్యాలు అచ్చు వేయించుకొంటూ "గుణగరిష్ఠులైన" కృతిపతులకు అంకితమిస్తూ పైసా ఆశింపక, యిచ్చినా పుచ్చుకొనక జీవితాంతం "నీతి"గా నిల బడ్డాడు తెనుగులెంక !

"రాష్ట్రగానము" కావ్యం - "ఆంధ్ర రాష్ట్ర సిద్ధి కర్రాంత సేవతో నీవితో దపించిన"న బెజవాడలో జరిగిన ఆంధ్ర మహాసభ - "త్రిలింగ రాజ్యలక్ష్మి కమనీయ వైభవ విశిష్ట మహో త్సవ కారణంబైన" చల్లపల్లి రాజా వారికి అంకితం యిచ్చాడు. కృతిపతి రాజావారు ! జమీందారు. "ఊరక"నే అంకితం తీసుకోవ డం రాజావారికి అగౌరవం కదా ! తన మనుష్యులచేత కవిగారి కాత్మీయులైన వారి చేత రాజావారు 'రాయబారాలు' నడిపించారు తుమ్మలవారికేదైనా కొంత సొమ్ము ముట్టచెప్పటానికి. కాని తెనుగు లెంక 'ససేమిరా' అంగీకరించలేదు. అప్పికట్లలో "రాష్ట్రగానాంకిత" సభను విచ్చేసిన రాజావారు కవిగారికి వేయినూటపదార్లు బహూక రింప తలపెట్టాడు. మిత్రులచేత కబురు పెట్టించాడు హితైషులైన 'మధ్యవర్తులు' వేయినూటపదార్లుతో "చేవగల పొలము నాల్గు కుంటలుచేకూరు"ను కాదనకుమని కవిగారికి హితోపదేశమిచ్చినా ఫలితం లేకపోయింది 'లేశమేని దారి దప్పనైతి'నని చెప్పాడు. అయితే దరిమిలా రాజావారి 'షష్టిపూర్తి' ఉత్సవానికి కవిగారు

వెళ్ళి రాజావారికి కవితాశీస్సులందించిన శుభవేళ అందరు కవులకన్న మిన్నగా తుమ్మలవారిని రాజావారు ఘనంగా సన్మానించారు. తుమ్మలవారి నియమమంతటి నీతిగలది. కఠోరమైనది.

"ఉదయగానము" — 'నీకు నాకు మది భేదములేని మైత్రి'గల "ఆప్తమిత్రమాళి" సుహృజ్జనమణి అయిన ఉప్పల నాగయ్యకు 'నూడిద'గా నిచ్చాడు. "సర్వోదయ గానము" - ఉన్న ఆస్తినంతా 'దిగంత విశ్రుత వికాసఖని వినయాశ్రయంబు'నకు దానమిచ్చిన వివిధ ధర్మతత్త్వవేది పౌరాణిక యోగరతుడు - వీతరాగుడు - గ్రామ (కావూరు) హితము వలచి గ్రంథాలయంబును నెలకొల్పిన 'అచ్చ బైరాగి'యైన తుమ్మల బసవయ్యకు 'కానుక'గా నిచ్చాడు.

"మహాత్మకథ'ను — నిష్కళంక దేశభక్తుడు - శుద్ధ గాంధేయవాది - భారత మాజీ ప్రధాని జై జవాన్ జైకిసాన్ 'రవస్రష్టకి' బాపు తపమ్ము పంటగా జేపడినట్టి రాచ సిరి జిందఱ వందఱ సేయ వంచకుల్ పాపులు భారతమ్మునలు ప్రక్కల మూగిన వేళ విక్రమాటోపము జూపి జాతి కుమటన్ గదియించిన శౌర్యమూర్తికి - "భారత ప్రధాన పదమున కెనలేని కీర్తి దెచ్చినట్టి లాల్‌బహదూరుశాస్త్రి గారికి 'సత్కృతి' నిచ్చాడు. మహాత్మకథ చాలా పెద్ద గొప్పకావ్యం ! దాని అచ్చునకెంతో ఖర్చు అయ్యింది. లాల్‌బహదూర్ శాస్త్రి గారికి మరణానంతరం అంకితం యిచ్చాడు. శాస్త్రిగారు 'శుద్ధ గాంధేయవాది' కనుక శాస్త్రిగారు జీవించి వుంటే — గాంధీ కవి గారికి 'జాతీయస్థాయి'లో యేదైనా పురస్కార భాగ్యమబ్బి వుండేదేమో !

"నా కథలు" — అమెరికాలోని నీగ్రోల పౌరహక్కుల కోసం — మానవ హక్కుల కోసం - గౌరవ జీవితం కోసం పోరు

పల్కుతూ హత్యగావింపబడిన 'మహాపురుషుడైన' అమెరికా గాంధి మార్టిన్ లూథర్‌కింగునకు 'ఉపద' గానిచ్చాడు. ఇది గూడా పెద్ద ఖండకావ్యమే. దీని అచ్చునకెంతో ఖర్చు అయ్యి వుంటుంది. కవిగారే భరించాడు. విదేశీయుడైన మానవతావాది శుద్ధ గాంధేయ వాది అని లూథర్‌కింగుకు అంకితమిచ్చాడు కవిగారు.

"ధర్మ జ్యోతి"ని - చిరకాలపు నెచ్చెలికాడు - మధుర వర్తనుడు — మృదుల భాషా కవితా శేవధి, మధు మథన పదసేవా నిరతుడు బంధు చింతామణి పావన చరితునికి — 'నొజ్జకు నెఱ సంగాతి' వెలగపూడి దానయ్య కంకితం యిచ్చాడు. "ఆత్మార్పణము"ను - "నిండీ నిండని జవ్వనంపు సిరితో నిర్భాగ్యతాపూర్ణమై పండీ పండని కోర్కి తీవగమితో బాధ స్తరంగాభమై యుండీయుండని మాయదారి (తన) బ్రతుకు నీ మండీ మండని మొండిజేసి" పిన్నతనమునందె నన్ను వీడిన రాణి "తానై యెదియుంగోరని" మానిని, వెడలుచుంటి సైపవేదోసమన్న "శమ దమక్షాంతి ధృతి జ్ఞానము" గల్గిన — సాధ్వీవతంస — నిర్భరాత్మ గౌరవ సంపూర్ణ నిర్మల ప్రేమ చిహ్నమైన మేనకోడలు - ప్రథమకళత్రం - రాఘువమ్మకు "సమర్పణం" గావించాడు.

"శబల"ను - 'ఆధునిక భీష్ముడు - 'సరసకవి' జితేంద్రియుడైన (అస్ఖలిత బ్రహ్మచారి) మేనల్లుడు జాస్తి వేంకట నరసయ్యకు "ఈవి"గా నొసంగాడు. 'సమదర్శి'ని-నిడుబ్రోలులో పి.బి.యన్ - కళాశాల వ్యవస్థాపకుడు - వివేక విఖండిత మోహవల్లరీ, పాముల పాటి బుచ్చినాయుడుగార్కి 'సూడిద'గా నిచ్చాడు. మేనల్లుడు కనుక స్వతంత్రంగా కొంతసొమ్ము ముద్రణకిస్తాన న్నా 'వలదురా పట్టు సాగి పోవలయునాది' అని పైసా తీసుకోలేదు ! 'పఱిగ పంట'ను - నిడుబ్రోలులోని హైస్కూలు భవన నిర్మాణానికి తన చర స్థిరాస్తుల

నన్నింటిని దానం చేసి - "కూలికి బండిందోలుచు / ఖాలికి మడి దున్నుకొంచు ప్రజల కొఱకు కరగి కరగి జాలైన - పెఱల గొడ్డ గాయు పేదయైన కొసరాజు లక్ష్మయ్యకు బ్రదికిన నిష్కామ కర్మ యోగికి "కానుక"గా నిచ్చాడు. "పైర పంట"ను - "వాడవాడల బాపూజీ వాణి వినిచి, నరకసఖమైన చెఱసాల నిఱికి యిఱికి"న ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధుడుగా దుండగీండ్ర పోట్లతో జచ్చి బ్రతికిన పుణ్యచరితుడు - "గద్య పద్య సృష్టిగావించు కవియైన" వెలువోలు సీతారామయ్య గారికి "ప్రేమాంకం"గా సమర్పించాడు.

"సర్వోదయ గానము"ను - తనకున్న సమస్తమును కావూరు లోని 'వినయాశ్రమము'నకు ధారవోసిన అచ్చ బైరాగి - విశిష్ట కర్మ యోగ నిష్ఠాగరిష్ఠుడు - ప్రముఖ గాంధేయవాది - నిష్కళంక దేశభక్తుడు "తుమ్మల బసవయ్య"కు 'కానుక'గా నిచ్చాడు. "గీతా దర్శము"ను - "సామ్యయోగ సాహిత్యధునీ - సర్వోదయ ప్రచార స్వినాన్సి - భావే ప్రియపథ గాంధేయ ధర్మ సత్య నిష్ఠాగరిష్ఠుడు ప్రముఖ గాంధేయవాది నిస్వార్థ దీనార్త జన సేవారతుడైన ప్రముఖ నేత్రవైద్యుడు డా॥ వెంపటి సూర్యనారాయణ గారికి "పురస్కృతి"గా నిచ్చాడు.

"తెనుగు నీతి"ని - అంచితాచారనిధి - 'నా నుడిలో నడలో గలదేని ఋజుత్వమ్మది దానికెల్లను శౌచ శ్రీనిధి మజ్జనయిత్రి' (కన్నతల్లి) చెంచమాంబకు "సమర్పణం" గావించాడు. 'గాంధి గానము'ను - నితాంత గౌరవ శ్రీ మహనీయ - వినయసేవధి కరుణావిధేయ - ధీమదపత్య సంపదను దీరత - విజతాత్మ సతీస్తోమల లామ - మానినీ లోకయశః శ్రీకర గుణాత్మస్వస్నైకపు గ్రామజన

చము - కాట్రగడ్డ రఘురామయ్య గారి ధర్మపత్ని అయిన అనసూయా దేవి గారికి కంకితమిచ్చాడు.

"ఎక్కట్లు" - సర్వదా నన్నలరించు భావముల నానుడికారము తీరు తెన్నులన్ నిన్నలరించు "నీ కవితా ప్రియత్వమును - నీ సరస త్వము నీవినీయును నీ కృత బుద్ధియును దనుపు నిచ్చలు నా మది" అటువంటి తన నిక్కపు ప్రియశిష్యుడైన కాకరపర్తి వేంకటేశ్వర్లుకు "బహూకృతి" గావించాడు.

"నేను" లఘు ఖండకావ్యం - "యుగ ధర్మమెఱిగి లోక ప్రగతికి నాధారమైన పద్యము గద్యము నిగదించిన "ప్రాత క్రొత్త చక్కనలకు బ్రాపు" కోవిదుడు - సరళ స్వభావుడు - అపర వాల్మీకి 'తుమ్మల వారికి' మిగులనచ్చిన కవీంద్రుడైన కాటూరి వేంకటే శ్వరరావు గారకి 'ఉమగర'గా నిచ్చాడు. "హనుమాన్ చాలీసా" (ఆంధ్రానువాదం)ను - గుంటూరులోని శ్రీరామ నామ క్షేత్ర వ్యవస్థాపకుడు - మచ్చమసరలేని మానిసి - నిష్కామయోగ నిష్టాగరిష్టుడైన ఆంజనేయులు గారికి "కానుక"గా నిచ్చాడు.

"సందేశ సప్తశతిని" - నిష్కామకర్మయోగి - ఆదర్శ సర్వోదయ సేవావ్రతలోలుడు, నిరాడంబర నిస్వార్థ అవిశ్రాంత ప్రజాసేవకుడు - "మలమెత్తు మనిసిగా మనసు పండిన" శుద్ధ గాంధేయవాది తెనుగులెంక నచ్చిన మచ్చలేని వట్టికూటి వెంకట సుబ్బయ్యకు "మన్నవ" గావించాడు, "చక్కట్లు" - విద్యారాశి - శౌచరాశి దేశిక వ్రాత గ్రామణి - శుచితర వ్యాహార వ్యాదా కృతి - సూనృత ధీరత దయా వినయ వితీర్ణిముఖ విశ్వజనస్తవ నీయుడు - "స్థిత ప్రజ్ఞుడు" చిన్మయానంద తత్త్వవిచారమతి - మాననీయాచార శ్రీ నిరతి అయిన తాతా వేంకట సుబ్బయ్య

గారికి (పొన్నూరు ప్రముఖ వైద్యుడు డా॥ ప్రసాదు గారి తండ్రి) అంకితం యిచ్చాడు.

"దివ్య జ్యోతి"ని - ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధుడు - చీరాల పేరాల 'రామదండు' రామదాసు దుగ్గిరాల బలరామ కృష్ణయ్య ప్రియశిష్యుడు - తెనుగులెంక ప్రియమిత్రుడైన జనాబ్ గౌసు బేగు గారికి (మరణానంతరం) 'నజరానా'గా నిచ్చాడు.

"కదంబకైత" ఖండకావ్యం యీ రచయితకు 'ఉడుగర'గా యిచ్చాడు. ఇక్కడ యీ రచయిత 'స్వానుభవం'తో ఒక వాస్తవం చెప్పడం సముచితంగా వుంటుందని భావిస్తున్నాడు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు అందించిన ఆర్థిక సహాయంతో పుస్తకం అచ్చయిపోయింది. తుమ్మలవారి శిష్యుడు- యీ రచయితకు ఆప్త మిత్రుడు శ్రీ కాకరపర్తి రచయితను ఫొటో అడిగాడు.సాధారణంగా ఫొటోఇతరులకుయిచ్చే అలవాటులేని రచయిత యివ్వటానికినిరాకరించాడు. కొంత వాదోపవాదాల తర్వాత 'మాస్టారు' (తుమ్మల వారిని అలా పిలిచే అలవాటు) తమ ఫొటో కావాలన్నాడు - ఆరాతీస్తే తన కావ్యం అంకితమిస్తున్నాడని తెలిసింది. ఈ రచయిత నమ్మలేకపోయాడు ! తుమ్మలవారి ఉన్నత సాహితీస్థాయి యెక్కడ తానెక్కడ ! నక్కకు నాగలోకానికి, అస్తిమశకాంతరం "తేడా" వున్నా కవిగారు తన కావ్యాన్ని యీ రచయిత కంకితం యివ్వడమే కవిగారి ఉదాత్తగుణం - సహృదయత వెల్లడి అవుతాయి. ఈ రచయితకు పరమానందంతో తెలియకుండానే 'ఆనంద'బాష్పాలు రాలాయి !

మిత్రునితో యీ రచయిత అప్పికట్ల వెళ్ళి కవి గార్ని కలిశారు. అనుకోకుండా ఆనందబాష్పాలు జాలు వాఱుతుండగా పుంభావ సరస్వతీమూర్తులైన శ్రీ తుమ్మల వారికి పాదాభివందనం

చేయడం జరిగిపోయింది. విషయం కాకరపర్తి చెప్పేవుంటాడు! త్వరలో ఫొటో పంపించు బాబూ! (నన్ను బాబూ అనే అలవాటు) నేనొక షరతుపెట్టాను ! కృతజ్ఞతా పూర్వకంగా నా పద్యాలుగూడా కావ్యంలో వేస్తానంటేనే ఫొటో యిస్తానన్నాను. కావ్యమచ్చై అంకితమిచ్చే వరకు కృతిపతికి తెలియకూడదన్న తనకున్న కఠోర నియమం భంగమన్నాడు. (ఉప్పల నాగయ్యగారి ఫొటో ఒక మిత్రుని సహాయంతో విషయం చెప్పకుండా సంపాదించగలిగాడు) పుస్తకమంతా అచ్చైపోయిందన్నాడు. ఏమైనా సరే నా ఫొటోకి నా పద్యాలకీ "లింకు" పెట్టి పట్టుబట్టాను ! చివరకు తుమ్మలవారు అంగీకరించారు. ఫొటో అనుకొన్నదే కనుక, యీ రచయిత పద్యాల అచ్చు ఖర్చు - పేపరు ఖర్చు కవిగారు లెక్క-వేసాడు. ఆ ఖర్చు రచయిత యిస్తానన్నా తానే చూసుకొంటానన్నాడు. పొరపాటుగానైనా చాటుగానైనా కృతిపతి దగ్గర పైసా తీసుకోననీ - తీసుకోవద్దనీ కాకరపర్తికి హెచ్చరిక చేసాడు యీ రచయిత యెదుటనే !

ఇక కావ్యాంకిత సభ చీరాలలో యేర్పాటు చేయించాడు కాకరపర్తి చేత. ఈ రచయిత అప్పుడు (1984) నెల్లూరు ప్రకాశం జిల్లాల కధికారిగా వున్నాడు కనుక అధికారికంగా రచయితకు మాట రాకుండా సభ యేర్పాటు, దాని ఖర్చులు, భోజనాది తదితర ఖర్చులు అన్నీ కాకరపర్తినే చూసుకోమన్నాడు. తానొక శాలువా వేసేటట్లు మాత్రమే యేర్పాట్లు చేయించాడు. తనకు యితరమైన ధనవస్త్ర (నూతన వస్త్రములు - పర్సు) బహుకృతికాయన అంగీకరించలేదు. పోనీ సభ నిర్వహణఖర్చులు 'చాటు'గా యీ రచయిత కాకరపర్తికిస్తానంటే కాకరపర్తి తుమ్మలవారి నిక్కపు శిష్యుడు

గదా) అందుకు ససేమిరా అంగీకరించలేదు. గురువు (మాస్టారి)గారి మాట వేదవాక్యన్నాడు.

"కడంబకైత" కు యీ రచయితను కృతిపతిని చేస్తూ - "పద్యమును గద్యమును హృద్య పద్యనడుపు నోడుపు నీ పాలిదనీ" "కులము మతము లేదు గుణమెన్న తట్టి నీకు నార్తుగన్న వెన్నయ గుదుపీవు" నీ "కవిగా నిను చూచితి, మానసపుగా గనుగొంటి గంటి నామిత్రునిగా" "సముదాత్త భావనాభ్యుదయ కవితా సామర్థ్య ప్రాప్త యశఃస్తోమా ! గుణధామ" అని అభిభాషిస్తూ "యిర్వురి బాంధవంబు నిలుపుటకునై "ఉమగగ" నొసంగి యీ "పిల్లకవి"ని యీ "అల్ప సాహితీమూర్తి" కి యెల్లలు లేని కీర్తి సంతరించునట్లు "అనల్ప" స్థాయి కల్పించాడు. అది యీ రచయిత పూర్వజన్మ సుకృతం ! అతని అదృష్టం.

అందుకు ప్రతిగా ఎందఱో బంధుమిత్రులు మరెందఱో మేటి బుధుల్ కవీంద్రులిం కెందఱో ఆప్తముఖ్యులు మరెందఱో మాన్య గుణాఢ్యులుండగా నందఱిలోన "అస్ఖలుడ" నొనను మెచ్చితె "మనము గుంటూరు మండల జనులమంటూ - జాతిపిత కిష్టుడగు 'హరిజనుడ'నగుటూ లాల్ బహద్దరు శాస్త్రి, అమెరికా గాంధి, వెంపటి, చల్లపల్లి రేవు ఎంటి మహోన్నతమూర్తుల సరసన తనకు స్థానం కల్పించినందులకు "ఐమ్మెకీ కానుకోరని దాత నీవు / యుడు గరగ నిచ్చినావు నేనడుగకుండ - ఏమి యిడెద నీ కంజలి యిడుట కంటె" అంటూ తన హృదయ పూర్వక "కృతజ్ఞత" తెలుపుకున్నాడు వినయ పూర్వకంగా !

ఇంతకూ, యీ రచయిత చేసిందేమిటంటే యితగాడు కాకర పర్తి ఉద్యోగరీత్యా పాలకొల్లులో నున్నప్పుడు, యిద్దరు కలిసి

అక్కడ తుమ్మలవారి జయంతి సభ ఘనంగా యేర్పాటు చేయించారు ! అంతేకాని, యీ రచయిత కవిగారికి యితరత్రా యే విధమైన "ధనకనకవస్తు వస్త్రాదులు"యేరూ సభముఖంగా గాని, చాటుగా గాని సమర్పించి యెఱుగడు !

తెనుగులెంక మహోన్నత విశిష్ట వ్యక్తిత్వం 'కాసులకు నాసచేయని' కఠోరనియతి పాటించే నిజాయితీ - ఋజువుపరిచేందుకే "స్వానుభవంతో" యీ రచయిత విషయంలో జరిగిన సాక్షీభూత మైన "యధార్థ సంఘటన" తెల్పడమే యీ రచయిత ముఖ్యోద్దేశం గాని తన 'గొప్పలు' చెప్పుకొంటానికి కాదని సహృదయ పాఠకులకు సవినయంగా మనవిచేస్తున్నాడు.

ఆ విషయమిక అలా ముగించి అసలు విషయానికొస్తే- యీ విధంగా తుమ్మలవారు తన కావ్యాలన్నింటిపీ - తనకు నచ్చిన - తాను మెచ్చిన 'సుగుణ సంపన్నులై'న వారికే, పైసా అడగకుండా, పైసా ఆశించకుండా - ఒకవేళ కృతిపతులిస్తానన్నా మంచిగా తిరస్కరించి - తన సంసారం పెద్దదయినా — తన ఆర్థిక పరిస్థితులంత "మెరుగ్గా" లేకున్నా - రెండు పదులు దాటిన తన కావ్యాలన్నింటినీ, అవి చిన్నవికాని పెద్దవిగాని ఎంత ఖర్చు అయినా భరాయించి అచ్చువేయించి - అంకితమిచ్చిన "నిజాయితీపరుడు ! నియమ నిష్ఠా గరిష్ఠుడు - మహోన్నత విశిష్ట వ్యక్తిత్వం - "ఋజువర్తన" మున్నవాడు.

తన కావ్యాలు తానే ముద్రణ చేయించుకొంటూ, పుస్తకా లమ్మగా వచ్చిన సొమ్ముతో మరలా క్రొత్తగా రాసిన కావ్యాల్ని అచ్చు వేయించుకొంటూ బిడ్డల్ని 'ఉన్నత' విద్యాబుద్ధిమంతుల్ని చేసుకొంటూ పెద్ద కుటుంబాన్ని గౌరవంగా గుట్టుగా నెట్టుకొని ముందుకు సాగిపోయాడు తుమ్మలవారు ఆశాజీవిగా - ఆశయసిద్ధి లక్ష్యంతో ! అదృష్టవశాత్తు బిడ్డలందరూ తాతతండ్రుల సుగుణాల

ప్రోవులై క్రమశిక్షణతో - యింటిగుట్టు వంశగౌరవం, తండ్రి పేరు నిలబెట్టుకుంటూ విద్యాబుద్ధులు నేర్చుకొని తమతమ సంసార జీవన యాత్రలో హాయిగా సాఫీగా సుఖంగా సాగిపోతున్నారు ! అదంతా వారి తాతగారి, తల్లిదండ్రుల "సత్యనిష్ఠ" నైతికబలం మూలకం గానే !

గాంధీజీని 'త్రికరణశుద్ధి'గా నమ్మి బ్రతికిన తెనుగులెంక గాంధీయాశయాలలో ముఖ్యమైనదైన 'అపరిగ్రహం' నియమని యతితో - నిజాయితీతో పాటించి - పైసాకు దాసుడు కాకుండా జీవనయాత్ర సాగించడం సామాన్య విషయంకాదు ! డబ్బే ధ్యేయంగా పెట్టుకొని - కృతిపతులు మంచివారుగానీ - చెడ్డవారు గానీ - తెగపొగడుతూ కావ్యాలంకితం యిచ్చి నిజంగా "అలా" సొమ్ము చేసుకొనివుంటే తుమ్మలవారు మేడలు మిద్దెలు - మడులు మాన్యాలు సంపాదించుకొని వుండేవాడు ! పోనీ 'సన్మానాలు' ద్వారా వచ్చిన సొమ్మును గట్టిగా ముడివేసినా తెనుగులెంక 'భాగ్య' వంతుడై వుండేవాడు. కుటుంబపోషణ, పిల్లల చదువులు, కావ్యాల ముద్రణతోపాటు ఆశ్రయించిన వారికి లేదనకుండా ఎన్నో 'గుప్త దానాలు' చేసాడు. "ఉడుగరగా జగమిచ్చిన / విడిముడి చేపడిన విట్టవీగక ముడిపై / ముడివేయక పదురా నను / వడువున వెచ్చించి" సాహిత్యంద్వారా లోక సేవనం గావించేడేకాని, కూడబెట్టి సుఖ సంతోషాలతో కులకలేదు ! అదృష్టమేమంటే - బిడ్డలందరూ క్రమశిక్షణగల "బుద్ధిమంతులు" కావడంవల్ల ఉన్నత విద్య లభ్యసించి జీవితంలో సుఖశాంతులతో 'స్థిరపడి' హాయిగా జీవిస్తు న్నారు. లేకపోతే కవిగారి 'ధనాశలేమి' నియమాలతో పిల్లలు "పండితపుత్రః శుంఠః"లై బజారుపాలై పోయేవారు. కవిగా జాతీయ స్థాయిలో తెనుగులెంకకు గుర్తింపురాక పోయినా, తెలుగునేల నాల్గు చెరగుల ఘనసన్మానాలు జరిగాయి. అఖండ కీర్తి ప్రతిష్టలు సంతరించాయి !

# జీవితం - సాహిత్యం - వ్యక్తిత్వం

మచ్చ మసకలేని మనుగడ నర్థించి
మలగినాడ వెతలన లగినాడ
ప్రజకు నింపు నింపు ప్రన్నని కబ్బముల్
వ్రాసినాడ కీర్తి మోసినాడ — "నేను"

## వంశం - జననాదికాలు

తుమ్మలవారి స్వగ్రామం గుంటూరుజిల్లా కాపూరు గ్రామం. ఊరు మారుమూలనున్న కుగ్రామమైనా దాని పేరు మాత్రం గొప్పదే ! జాతీయోద్యమ కాలంలో దానిపేరు దేశం నలుమూలల మారుమ్రోగింది. ఆనాడీ చిన్న పల్లె ఒక చిన్న జాతీయ కేంద్రం. గాంధీజీ ఆశయాలసాధనకై - సర్వోదయ సిద్ధాంత మార్గావలంబన దిశగా - జాతీయస్ఫూర్తితో శ్రీ తుమ్మల బసవయ్యగారి వితరణ వల్ల గొల్లపూడి సీతారామశాస్త్రిగారి "నిస్వార్థ" కృషి వలన యీ కుగ్రామంలో "వినయాశ్రమం" మొదట స్థాపింపబడింది. చరిత్ర పుటలకెక్కిన యీ వినయాశ్రమాన్ని "బాపూజీ" అంతటి 'జాతిపిత' సందర్శించాడు. మాజీ రాష్ట్రపతి కీ॥ శే॥ రాజేంద్ర ప్రసాద్ వంటి అగ్రశ్రేణి దేశ నాయకుడు కూడా యీ వినయాశ్రమం సందర్శించాడు. ఆనాడు యీ ఆశ్రమంలో "తిలక్ జాతీయ పాఠశాల" నడిచింది. "జగము నలరించు గాంధేయ సౌరభమ్ము / వలచి మా యూరు కాపూరు వాసికెక్కె అని కవిగారే స్వగ్రామం గురించి చెప్పుకున్నారు. అట్టి పేరెన్నికగన్న వినయాశ్రమం యిప్పటికీ నామమాత్రావశిష్ట జాతీయ స్ఫూర్తితో గాంధేయ

సర్వోదయాశయాల సాధనతో ఒక ధర్మకర్తల యాజమాన్యం క్రింద నడుస్తోంది.

తెనుగులెంక యీ కావూరులో "చెంచమాంబ-నారయ్య" పుణ్యదంపతులకు 25-12-01న ద్వితీయపుత్రుడుగా జన్మించాడు. చెంచమ నారయ్యలకు మన కవిగారు కాక యింకా నల్గురు సంతానం గలిగారు మొదటి సంతానం అంకనీడు. తర్వాత శేషమ్మ తర్వాత మన కవిగారు ఆ తర్వాత మంగమ్మ, వరమ్మలు. డిశంబరు 25 తారీఖు విశ్వవ్యాప్త 'క్రైస్తవమత' ప్రవక్త – పతిత(పాప) మానవో ద్ధారకుడైన ఏసుక్రీస్తు ప్రభువు జన్మించిన పవిత్ర దినం కావడం విశేషం. ఇట్టి శుభదినాన జన్మించటం వల్ల నేమో తుమ్మలవారు రైతు కుటుంబంలో పుట్టినా పెరిగి పెద్దయి విద్యాబుద్ధులు నేర్చుకొని తెలుగు సాహితీ జగత్తులో గాంధీ కవిగా ఒక విశిష్ట స్థానాన్ని సంత రించుకొని యెన్నో కావ్యాలు వెలయించి - అభినవ తిక్కనగా లబ్ద ప్రతిష్టుడైనాడు.

విజయనగర సామ్రాజ్యంలో గండికోట గడిసీమ నేలిన దండి మగడు పెమ్మసాని తిమ్మభూపాలుని కొలువులో ప్రెగ్గడగా - దండ నాథుడిగా - దళవాయిగా పేరెన్నికగన్న "టేకన్న"గా లబ్ధప్రతిష్టు డైన "వీరన్న" తుమ్మలవారి వంశానికి మూలపురుషుడు. అత్యంత ప్రముఖ వీరశేఖరుడు. విజయనగర సామ్రాజ్య పతనానంతరం టేకన్న వంశీకులు రాయలసీమ వదలిపెట్టి - తీరాంధ్ర భూములైన - కృష్ణా గుంటూరుసీమలకు తరలివచ్చి - మొదటి వ్యాపారంతో తర్వాత వ్యవసాయవృత్తిలో స్థిరపడ్డారు. టేకన్న వంశంలో తెనుగు లెంకది పదవ తరం !

## బాల్యం - విద్యాభ్యాసం

తండ్రి నారయ "గోవింద చరణ సేవా హేవాకనిరస్త దానవేశ్వర సుతుడు" "జీవన్ముక్తుడు" చదువకయున్న నేమి "నిత్య సత్యాలాపనియతి గల్గి" పరవిత్తమది విషప్రాయంబని విశ్వసించినాడు తిరస్కరించినాడు". "పరమోదారుడు" – పేదవాని కితడు పెన్నిధి "మేలిమాసి" "సకల సుగుణ రత్నరాశి" నారయ ! ఇక తల్లి చెంచమాంబ "గుణభద్ర" "పుణ్య శరణ్య" "దైవతమ్మ" "వినుత శీల గుణావాల" "పేదల్ బిడ్డలుగాబుుశ్రో క్షి నగ"గా ఆదర్శగృహిణి "సీతాసతివంటి వహ్నిశిఖ ! రైతు కుటుంబీకుడైన నారయ్య 'ఓనమాలు' నేర్చుకోకపోయినా, కొడుకుని చదివించాలన్న తలంపు గల్గింది. మన కవిగార్ని ఐదవయేటనే అంటే 1916లో కావూరిలోని ప్రాథమిక పాఠశాలలో చేర్పించడం జరిగింది, "విమలాచార పరాయణుడు" "అచ్ఛశీల రాశి" శ్రీ కావూరు శ్రీ రాములుగారు (రామామాత్యుడు) మన కవిగారికి "మొదటి యొజ్జ" ఆయన దగ్గర ఓనమాల నుండి ఆంధ్ర గీర్వాణ కోశములు కొంతవరకు చదువుకొన్నాడు. ఆయన వద్దనే "భారత భాగవతాలు - వివిధ శతకాలు పఠనం గావించాడు అమరకోశం-ఆంధ్రనామ సంగ్రహం గూడా శ్రీ రామ మంత్రి గురువుగారి వద్దనే కొంతవరకు నేర్చుకున్నాడు. వారివద్ద 1906 - నుండి 1911 వరకు చదువుసాగింది. ఇదే కాలంలో - తండ్రి కోర్కె పైని మన కవిగారు భాగవతమును చదువుతూవుంటే-"చదువురాని" తండ్రి నారయ దాని భావార్థాలు, కథావిశేషాలు రాత్రి పూట గ్రామస్థులకు వినిపిస్తూండేవాడు. శ్రీ రాములుగారి దగ్గర చదువు ముగిసాక తండ్రిగారి సలహాపై పెద

పూడికి నడిచాడు. "పౌరాణికు"డైన తన బావగారు (సహోదరి భర్త) "భూరియశోవిభాసి" అయిన శ్రీ జాస్తి సుబ్బయ్య దగ్గర మనుచరిత్ర వసుచరిత్ర - అమరము పూర్తిచేసాడు. వారి దగ్గర ఒక సంవత్సరం పాటు శిక్షణలో 'సాహితీ వాసన పీల్చి' ఆంధ్ర ప్రబంధ కవుల జాడలు తెలుసుకున్నాడు చిన్నారి తుమ్మల. అందుకే తన బావగారు శ్రీ జాస్తి సుబ్బయ్యను ఈ విధి నాంధ్రవాణి భజియింపగ నాకు నెవండు ముందరన్ ద్రోవలనెల్ల జూపి కడు దోడ్పడిన గురువర్యునిగా పేర్కొన్నాడు. అంటే ఆ పది సంవత్సరాల 'చిన్నారి పొన్నారి' వయస్సులోనే తుమ్మలవారికి సాహిత్యాభిమానం - కవితాభినివేశం కలిగిందన్న మాట.

పెదపూడి నుండి తిరిగి కావూరు వచ్చాడు బాల తుమ్మల. తండ్రికి వ్యవసాయపు పనులలో చేదోడు వాదోడుగా వున్నాడు కొంతకాలం "మడకపనులు సలుప వలసి" వచ్చెనని ఆయనే చెప్పుకున్నాడు. అయినా విద్యాసక్తి - సాహిత్యాభిమానం - కవితా పరిశ్రమ శ్రీ తుమ్మలలో తగ్గలేదు! కవితా వ్యాసంగం చేస్తూ కొన్ని రచనలు చేసాడు కూడా. అయితే తెలుగు భాషపై మంచి పట్టు దొరకాలంటే కావ్యరచనా రహస్యాల్ని తెలుసుకోవటానికి సంస్కృతం తప్పక వచ్చి వుండాలని గ్రహించాడు. కనుక సంస్కృతం బాగా నేర్చుకోవాలన్న గాఢ వాంఛ కల్గింది. "సంస్కృతమున గొంత చాతురి లేనిచో తెనుగుకైత మఱుగు తెలియదని ఆయనే చెప్పాడు.

కావూరులో సంస్కృతం చెప్పగల పండితులు లేరు. గ్రామాంతరం వెళ్ళి చదువుకొంటానికి ఆర్థికపరమైన బాధలతో పాటు తండ్రిగారు అంగీకరించలేదు. 1917లో ధైర్యంచేసి - తండ్రి అంటే యెంత భయభక్తులున్నా - చదువుమీదున్న తీవ్రవాంఛతో

తండ్రిగారికి చెప్పకుండానే అంగలూరు (కృష్ణాజిల్లా) వెళ్ళి సంస్కృత పండితులైన దుగ్గిరాల పురుషోత్తంగారి దగ్గర శిష్యుడుగా చేరాడు. తాత్కాలికంగా గురువుగారింట్లోనే భోజన సదుపాయం కుదిరింది. కాని ఎన్నాళ్ళని ! ఉచితంగా విద్య చెప్పించుకొంటూనే వారింట్లోనే భోంచేయడం తుమ్మల వారికి మనస్కరించలేదు. "వారాలు" సంపాదించుకోలేక పోయాడు. "వారి వీరినడిగి వారాల్ పడయలేక / విత్తమిచ్చి తినగ వీలు లేక / పెక్కుపూటలు గురునింట మెక్కలేక" కొన్ని రోజులకే "సిగ్గుపెంపున" కావూరు తిరిగొచ్చేసాడు ఆత్మగౌరవమున్న యువక తుమ్మల దురదృష్టవశాత్తు 1917లో తండ్రి స్వర్గస్థుడైనాడు; గృహభారం, వ్యవసాయ బాధ్యత యువ తుమ్మలవారి నెత్తినబడ్డాయి. అప్పటికాయనకు పదహారు సంవత్సరాల 'నూనూగు మీసాల' లేత యౌవన వయస్సుమాత్రమే! అయినా విద్యాతృష్ణ తగ్గలేదు. సాహిత్య పరిశ్రమ మానుకోలేదు. వాస్తవానికి, సేద్యం మీదకంటె సాహిత్యం మీదనే ఆయనకు మనస్సుపోతుంది. ముఖ్యంగా సంస్కృతం నేర్చుకోవాలన్న తీవ్రమైన కోరిక ఆయన్ని వేధిస్తూనే వుంది! సేద్యపుంబనులందుకొనుట ఆయనకు అనివార్యమైనా "విద్యానురక్తినన్ను వదలదాయె నావంతయు" అని స్వయంగా ఆయనే చెప్పుకున్నాడు.

కావూరికి నాలుగైదు మైళ్ళదూరంలోనున్న చందవోలు (చందోలు) లో గొప్ప సంస్కృత భాషా పండితుడు 'రామకథామృత కావ్యకర్త 'అయిన శ్రీ తాడేపల్లి వేంకటప్పయ్యశాస్త్రి గారి దగ్గర తుమ్మలవారు సంస్కృతం చదువుకొంటానికి చేరాడు. పగలంతయు కావూరులో పొలం పనులు చూచుకొని, రాత్రి పెందలకడనే భోంచేసి నాలుగైదు మైళ్ళు నడిచి చందోలు చేరుకొని రాత్రిపూట వేంకటప్పయ్యశాస్త్రి గారి వద్ద సంస్కృత పాఠం బాగా

ప్రొద్దుపోయే వరకు చెప్పించుకొని - రాత్రికి చందోలులోనే శాస్త్రి గారింట పరుండేవాడు. తెల్లవారుజామున నే లేచి కావూరు నడిచి వచ్చి పగలంతా యింటి పనులు, పొలం పనులు చూసుకొనేవాడు. మరలా రాత్రిపూట చందోలు వెళ్ళి శాస్త్రి గారింట చదువు. ఇలా ఒక సంవత్సరం పాటు తుమ్మలవారు కావూరు - చందోలు మధ్య ప్రతిరోజు ''కాలికి బలపం కట్టుకొని'' చెప్పులరిగిపోయిటట్లు 'ఇటూ అటూ-అటూ-యిటూ' తిరిగి (పటేల్ సర్వీసన్నమాట) - ఆ రోజుల్లో బస్సులులేవేమో ! కాళ్ళకు చెప్పులుండేవో లేదో, గురువు గారి దగ్గర సంస్కృతం నేర్చుకొన్నాడు. ''మడికి నొక్కపూట బడి నొక్కపూటగా / దాటినాడ చిన్నతనము నేను'' అని కవిగారే చెప్పుకున్నారు. దీనినిబట్టి యువ తుమ్మల వారిలో 'విద్యాతృష్ణ' యెంతటి ప్రగాఢంగా వుందో మనం గ్రహించుకోవచ్చును.

ఈ సంవత్సరకాలంలో తాడేపల్లి వారి వద్ద 'కాళిదాసత్రయం అధ్యయనం చేసాడు. ''నా దగ్గర ఒక్క శ్లోక రహస్యమైనా గట్టిగా తెలుసుకున్నవాడు తప్పక కవి దిగ్గజుడౌతాడని'' తాడేపల్లి వారి దీవెన. అలానే ఉత్తరోత్తరా తెనుగులెంక తెలుగు సాహితీలోకంలో అగ్రశ్రేణి కవులలో నొకడుగా లబ్ధప్రతిష్ఠుడైనాడు. అట్టి 'గైర్వాణ భాషా గురువు' ఆశీర్వాదబలం చేతనే ''నా సాహిత్యమెలర్చె'' నని తెనుగులెంక స్వయంగా చెప్పుకున్నాడు.

అయితే చందోలులో తాడేపల్లి వారి వద్ద పూర్తిగా చదువు సాగలేదు. కావూరులో 1918లో సీతారామాంధ్ర గ్రంథాలయం స్థాపించబడింది. దాని స్థాపన కృషిలో తుమ్మలవారొకరు. ఆయనే దానికి భాండారికులు (లైబ్రేరియన్) అది మన కవి సాహిత్యకృషికి కవితా రచనా వ్యాసంగానికి మిక్కిలి దోహదకారి అయ్యింది. ఆ

ఆ గ్రంథాలయంలోని గొప్ప ప్రాచీనకావ్యాల్ని ఆయనఆకాలంలోనే బాగా అధ్యయనం చేసాడు.

1924 లో కావూరులో తిలక్ జాతీయ నికేతనం (పాఠశాల) స్థాపింపబడింది. కాని స్థాపనకృషిలోగూడా తెనుగులెంక 'ఉమతా భక్తి' కృషివుంది. కవిగారు 1924 నుండి 1929 వరకు సదరు తిలక్ జాతీయ పాఠశాలలోనే భాషోపాధ్యాయుడుగా పనిచేసాడు. అంటే 1918 నుండి 1929 వరకు స్వగ్రామం (కావూరు) లోనే వుంటూ ఒకప్రక్క స్వంత వ్యవసాయం, మరోప్రక్క లైబ్రేరియన్‌గా, ఉపాధ్యాయుడిగా పనిచేసాడన్నమాట. "బడికినొక్క పూడ మడికొక్క-పూటగా" తుమ్మలవారు చిన్నతనంలోనే కాదు- పెరిగిపెద్దయి ఉపాధ్యాయవృత్తిలో వుండగాగూడా కొనసాగించాడన్నమాట మొత్తంమీద వ్యవసాయం ముప్పై సంవత్సరాలు చేసినట్లు ఆయన చెప్పుకున్నాడు. ఇదేకాలంలో ఆయన రాసిన రామలింగేశ్వర రామశతకాలను "సత్కవి" "మనీషివరు" డైన కులాన్వయ భువనగిరి కోదండపాణిగారిచేత పరిష్కరింప జేయించుకున్నాడు. పరిమి నరసింహశాస్త్రిగారివద్ద 'ఆదికావ్యం' అధ్యయనం చేసాడు.

స్కూల్లో తెలుగుపండితుడు కావాలంటే 'ఉభయభాషా ప్రవీణ' పరీక్ష ఉత్తీర్ణుడు కావలసివుంది. "గురువులేని విద్య గుడ్డిది" పొమ్మన్న నిజమెరిగి 1929లో కృష్ణాజిల్లాలో మచిలీపట్నం (బందరు) సమీపమందున్న చిట్టిగూడూరులో శ్రీ గుదిమెళ్ళ వరదాచార్యులు నడుపుతున్న ప్రాచ్యభాషా కళాశాలలోచేరి బ్రహ్మశ్రీ శ్రీ దువ్వూరి వేంకటరమణశాస్త్రిగారి వద్ద అలంకార వ్యాకరణశాస్త్రాలను అధ్యయనం చేసాడు. "శబ్దశాస్త్రాది లక్షణ సంప్రదాయములు "నేర్పి" అంచిత కవిప్రయోగ రహస్యవిదురు"

చేసిన "అపర చిన్నయసూరి" "అంచితాచార విభవుండు" పుంభావ పద్మజాత రమణి" శ్రీ దువ్వూరి వేంకటరమణశాస్త్రి వలన తానెంతో నేర్చుకున్నట్లు చెప్పుకున్నాడు. 1930 లో శ్రీ తుమ్మల "ఉభయభాషా ప్రవీణ" పరీక్షలో ఉత్తీర్ణుడయ్యాడు—

## తెలుగు పండితుడిగా ఉపాధ్యాయ వృత్తి

1930 లో 'ఉభయభాషా ప్రవీణుడైన తర్వాత దుగ్గిరాల హైస్కూల్లో షుమారు రెండుమూడేళ్ళు పనిచేసాడు. తర్వాత ఆనాటి జిల్లాబోర్డు అధ్యక్షుడైన జాగర్లమూడి కుప్పుస్వామిగారి ప్రమేయంతో బాపట్ల (భావపురి) లోని బోర్డు హైస్కూలులో తెలుగు పండితులుగాచేరి అక్కడ షుమారొక దశాబ్దకాలంపాటు (1930-41) పనిచేసాడు బాపట్లలో పనిచేసిన కాలంలోనే తుమ్మల వారు 'ఇనుపకుతిక' శంకరశాస్త్రిగారి వద్ద తెనుగులెంక "వేల్పు నుడి తీర్పు" నరసినట్లు చెప్పుకున్నాడు. బహుశా శిష్యుడు గురువారయె ఆయనన్నది యీ శంకరశాస్త్రి గురించేనేమో ! అంటే ఒకప్రక్క 'గురువు'గా పనిచేస్తూ మరొకప్రక్క 'విద్యార్థి'గా సంస్కృతం నేర్చుకున్నాడన్నమాట "బ్రదికినన్నాళ్ళు విద్యార్థి పగిదినుంట/ వలయునని విశ్వసించిన వాడా"యన !

తర్వాత నిడుబ్రోలు హైస్కూల్లో నాలుగైదు సంవత్సరాలు- ఆ తర్వాత అప్పికట్ల హైస్కూల్లో తెలుగుపండితుడిగా షుమారు పదేండ్లు పనిచేసి 1957 లో పదవీవిరమణ చేసాడు. మొత్తంమీద ఉపాధ్యాయవృత్తి ముప్పైయేండ్లు చేపట్టినట్లు ఆయన చెప్పు కున్నాడు— పుట్టిపెరిగింది కావూరులోనైనా, చివరగా పనిచేసిన, ఘనసన్మానమందిన "అప్పికట్ల" గ్రామంలోనే స్థిరపడ్డాడు. సాహితీ అభిమానులు ఒకచిన్న గృహావసతి యేర్పాటు చేస్తామన్నా - పరుల

సొమ్ముతో పుస్తకాలచ్చు వేయించనట్లే - పరులసొమ్ముతో నివాస గృహం యేర్పాటుచేయించుకోవడం యిష్టంలేక, ఆత్మాభిమాని యైన మనకవిగారు ఓచిన్న 'పెంకుటిల్లు' వసతి యేర్పాటుచేసుకొని ఆ యింటిలోనే విశ్రాంతజీవితాన్ని కవితావ్యాసంగంతో ప్రశాంతంగా తుదిశ్వాస విడిచేవరకు (20 - 3 - 90) శేషజీవితాన్ని గడిపారు శ్రీ తుమ్మలవారు.

ఉపాధ్యాయ వృత్తిలోని స్వీయానుభూతుల్ని కలబోసి అందులోని సాధకబాధకాలు తెనుగుతెంక చక్కగా చమత్కారంగా ఛందోబద్ధం చేసారు - చూతంకి ఆ బాధలు.

> అన్నము దిన్న చేతితడి యాఱియు నాఱక ముందె వేళ పై
> కొన్న ప్రమాదమంచు బరుగుల్ నురుగుల్ వెడలించి రొప్పుచు
> న్నన్నిన వేసటన్ నిలువబట్టుచు దిన్నది గొంతు దాటిపో
> కున్నను బాఠముల్ నుడుపుచుండవలెన్ విధికంజలించుచున్
>
> (శబల - సంక్రాంతి తలపులు)

అన్నం తిన్న చేతితడి ఆరకముందే, 'టైము' పోతుందని 'ఉరుకులు- పరుగులు' తీస్తూ - రొప్పుతూ రోస్తూ - అలసట తీర్చుకొంటానికి క్షణకాలం తీరికలేక తిన్న అన్నం గొంతులోనే వున్నా- బడిపంతులు పిల్లలకు పాఠాలు చెప్పాల్సొస్తుందని అంటాడు, దేవుణ్ణి తలచుకొంటూ, స్వీయానుభవంతో చెప్పిన మాటలివిగదా ! ఒక్కోసారి "అటునిటు నేగివచ్చి గడియారపు ఱంకెల కోహటించి యాకటి నెగులెంతయున్న నరికట్టి హుటాహుటి దుమ్ముగాళ్ళతో జోటజోట జాలుక్రొంజెమరు జుక్కలతో బడికేగి" (శబల)

పిల్లలకు పాఠాలుచెప్పే ఉపాధ్యాయుల "యీతిబాధల్ని స్వానుభావంతో చక్కగా చెప్పారు శ్రీ తుమలవారు.

"ఒక మరకై వడిన్ గదలుచున్న యొడల్ కురిచీకిదత్తమై సకల జవమ్ములు" గోల్పోవడం - ఆకలిలేకపోవడం - రోగంరొప్పులతో మందులు మ్రాకులు సేవింపవలసి రావడం గురించి గుర్తు చేస్తాడు కవి. "పదుగురకు కాదు" "యిర్వదిమందికి" కాదు "బుద్ధిహీనుల్వ"లైన యేబదిమందికి వినబడేటట్లు పెద్దగా పాఠం చెప్పడంలోని 'బాధ' వ్యక్తం చేస్తున్నాడు ! ఇంతకు "వలచి పఠించు వారు పదివందలైనా సంతోషంగా చెప్పొచ్చుగాని "వరశుల్కపుం జదువుగోరెడి" కాకులైన బొట్టెలకు పాఠాలు చెప్పడం ఎంతో బాధాకరమైనదని బాధపడతాడు ఉపాధ్యాయకవికట్నాలకోసమో- పొట్టకోసమో(వుద్యోగం) చదువుకొనే వాళ్ళెక్కువని కవిగారి బాధ.

మూగిన యూర్పుతోడ దల మున్కల వేదనతోడ బారముల్
వాగినచాలునా ! పొరలివచ్చు పరీక్షలు లక్షదోసముల్
రేగిన వ్యాసముల్ పొరిబొరిన్ సవరింపక తప్ప దొజ్జకున్
మాగినపాప మీ చెనటిమందల వ్రాతలదిద్ది తీర్చుటల్

**(శబల - సంక్రాంతి తలపులు)**

నిట్టూర్పులు - ఓర్పులు - గల్గి వేదనలతో పాఠాలు చెప్పడం ఒక యెత్తుఅయితే — పరీక్షలలో చెనటిమందబుద్ధులైన విద్యార్థులు వ్రాసిన "జవాబు పత్రాలందుండే" 'లక్షదోషాలు' "దిద్దడం" ఉపాధ్యాయునికొక పరీక్షయేకాదు. అది యేనాడో చేసుకున్న "పాప" మనిపిస్తుందని తెనుగులెంక తన అనుభవపూర్వక 'వేదన' వ్యక్తం చేస్తున్నాడు !

కూతురు వంజయౌట కనుగోక మగంటిమి లేనివాడు జా
మాత యటన్నటుల్ పనికిమాలిన శంఠలు తోకలేని యా
క్రోతులు నెగ్గకున్నది కోవిదులోటని తేల్చివానికిన్
వాతలు పెట్టజూతు రనివార్యులు జీతము నిచ్చు నేలికల్

**(శబల - సంక్రాంతి తలపులు)**

కన్నకూతురు 'వంజ' అన్న వాస్తవం మరిచిపోయి - అల్లుడికి 'మగతనం' లేదని అత్తమామలపవాదులేసినట్లుగా - తమ బిడ్డలు 'పనికిమాలిన శుంఠలై'నా "తోకలేని క్రోతులై"నా (చదువుకోని-చదువురాని అల్లరిమూకలైనా మొద్దబ్బాయిలైనా) పరీక్షల్లో నెగ్గకపోతే— "తప్పంతా పాఠాలు చెప్పే పంతులుగారిమీదనే నెడతారనీ, స్కూలు పై అధికారులు కూడా 'విద్యార్థులింతమంది తప్పటమేమిటి, మీరు పాఠాలు సరిగ్గా చెప్పలే"దంటూ ఉపాధ్యాయుణ్ణే నిలదీస్తారని ఆవేదన చెందుతాడు, తనధర్మం తాను సక్రమంగా నిర్వర్తించే బజ్జమేల్బంతిరైన తెనుగులెంక— (పాఠాలుచెప్పని పంతుళ్ళ సరసన తమవంటివారిని జమకట్టినందులకు) "విద్యార్థి శతకోటి మర్కటః" అన్న లోకోక్తి సత్యమే కానచ్చు కాని, యీనాడా డటువంటి మాటలు విద్యార్థుల్ని అనటానికి వీలులేదు! గురువుల్ని చూచి శిష్యులు భయపడే పాతరోజులుపోయాయి. గురువులే శిష్యులకు భయపడుతున్న పిదపకాలమిది! పిల్లలకు చదువు అక్కరలేదు! మాస్టార్లకూ చదువు చెప్పాలన్న శ్రద్ధలేదు! కాలమహిమ! — "నిజాయితీపరుడు" కనుక తుమ్మలవారు సాహసించి విద్యార్థుల్ని 'పనికిమాలిన శుంఠలనీ' తోకలేని కోతులనీ అనగల ధైర్యం - సాహసం సంతరించుకొన్నాడు.

అయితే తాను కష్టపడి 'ఉపాధ్యాయవృత్తి' ధర్మం త్రికరణశుద్ధిగా నిర్వహించినందుకు "తుద కబ్బరి నల్గురుమేటి శిష్యు"లని కాస్తంత తృప్తిపడతాడు చివరకు తుమ్మలవారు — నల్గురంటే సరిగ్గా నల్గురనికాదు. తనదగ్గర చదువునేర్చుకొని 'ప్రయోజకులైన' విద్యార్థులు కొంతమందైనా వున్నారని చెప్పడం కవిగారి ఉద్దేశం!

# కుటుంబ విశేషాలు

శ్రీ తుమ్మలకు 1927 లో అక్క శేషమ్మ కుమార్తె రాఘవమ్మతో పెండ్లి అయినది. అంటే చిన్నతనంలో శ్రీ తుమ్మలకు పెదపూడిలో చదువుచెప్పిన "గురువు" జాస్తి సుబ్బయ్య గారి కుమార్తె అన్నమాట - అంటే కవిగారికి రాఘవమ్మ మేన కోడలు. అయితే దురదృష్టవశాత్తు 1930 ఫిబ్రవరిలో "మత్పురా పాప మారబండి తనువునుజ్జనచేసె నన్ దనుపురాణి (రాఘవమ్మ) అని కవిగారు బాధగా చెప్పుకున్నాడు. అయితేతుమ్మలవారికి మొదటి సంబంధంవలన బిడ్డలెవరును కలుగలేదు— తర్వాత తోటపాలెం వాస్తవ్యురాలు "రామునేనివంశరత్నకలిక" అయినఅన్నపూర్ణమ్మతో రెండవ వివాహం జరిగింది ! "ఓర్పు నేర్పు నెమ్మి - యోరిమయు గరుణయు సూనృతాది సకలసుగుణారాశి" అయిన అర్ధాంగి ! అన్నపూర్ణమ్మగారి వలన శ్రీ తుమ్మలకు నల్గురు కుమారులు ఒక కుమార్తె - శ్రీనివాసమూర్తి - నారాయణ - శ్రీపతి - రాయాలు కల్యాణి! కల్గారు శ్రీనివాసమూర్తి- ప్రస్తుతం-నిడుబ్రోలు పి.బి.యన్ కళాశాల ప్రిన్సిపాలు. నారాయణ సైన్యంలోచేరి భారత - చైనా యుద్ధం (1962) లో పోరాడిన వీరసైనికుడు. సైన్యం నుండి పదవీ విరమణచేసి ప్రస్తుతం బెజవాడలో ఒక ప్రైవేటు కంపెనీలో సెక్యూరిటీ ఆఫీసరుగా ఉన్నాడు. శ్రీపతి - వరంగల్ కాకతీయ ప్రాంతీయ ఇంజనీరింగ్ కాలేజీలో ప్రొఫెసర్‌గా పనిచేస్తున్నాడు. చిన్నవాడు- రాయలు డాక్టరు. దుబాయిలో కొంతకాలం పనిచేసి ఇండియాకు తిరిగివచ్చి ప్రస్తుతం అప్పికట్ల గ్రామంలోనే వైద్యవృత్తిలో ఉన్నాడు. బిడ్డలెవరును కవిపండితులు కాకపోయిననూ — శ్రీనివాసమూర్తి సాహిత్యాభిమానిగా - సాహితీ కృషిచేసి- తండ్రిగారి సాహిత్యంను

మదించి - వర్గీకరించి' యుగకవిత అనే గ్రంథం - తుమ్మలవారి జీవితం - సాహిత్యంమీద ఒకపరిశీలన "యుగకవి" గ్రంథంరాసారు! "సంక్రాంతి, సత్యం - శివం - సుందరం - రైతుజీవితం" అనే లఘు కావ్యాలు మూడురాసారు. తెలుగుతల్లిని కవితాప్రసూనాలతో నర్చించు "భాగ్యం నాకేకాదు" అస్మదీయమగు పుత్రీపుత్రక శ్రేణికి 'అనుగ్రహించుము మ్మా! ఆంధ్రవీరప్రసూ !' అన్న కవిగారి గాఢవాంఛను సుతులలో పెద్దవాడైన శ్రీనివాసమూర్తి 'ఉడుతా భక్తిగా'గా తీరుస్తున్నాడని చెప్పవచ్చును.

## జాతీయవాదిగా - జాతీయ కాంగ్రెస్ కార్యకర్తగా

కావూరులో గాంధేయ ఆశయాలతో - జాతీయ స్ఫూర్తితో శ్రీ తుమ్మల బసవయ్యగారి కృషి - వితరణవలన వినయాశ్రమం నెలకొల్పబడిందని తెల్సుకున్నాం. గాంధీగారి పిలుపుమేరకు తుమ్మల బసవయ్య మొదలగు గ్రామపెద్దలు జాతీయోద్యమంలో చురుకుగా పాల్గొన్నారు. 1920 లో గాంధీజీ పిలుపుమేర - అసహాయోద్యమం" దేశం నలుమూలల ప్రారంభమైనపుడు తుమ్మల బసవయ్యగారి ప్రభావం-వినయాశ్రమవాసుల ప్రభావం కవిగారిమీద బాగాపడింది. జాతీయోద్యమంలో చేరారు. నాటి జాతీయ కాంగ్రెస్ పార్టీలో క్రియాశీల కార్యకర్తగా పనిచేస్తూ గ్రామ కాంగ్రెస్ సంఘం నకు కార్యదర్శిగూడా అయ్యారు (వేరొక చోట 'జాతీయకవి' అధ్యాయంలో తాలూకా కాంగ్రెస్ కార్యదర్శి అని పొరపాటుగ పడింది) ఫిర్కా కాంగ్రెస్ ప్రచారకులలో తుమ్మలవారే ఆనాడు ప్రధానపాత్ర వహించారు. 1920 నుండి 1929 వరకు కాంగ్రెస్ కార్యకర్త. జిల్లా కాంగ్రెస్ సంఘంలో ఆయన క్రియాశీల సభ్యుడు. 1922లో పన్నుల నిరాకరణోద్యమంలో చురుగ్గా పాల్గొన్నారు. పన్నులు చెల్లించవద్దని గ్రామంలో డప్పు

వాడు (గొడగరి) భయపడి డప్పు వాయించటానికి నిరాకరించాడు. వాడిచేతిలో 'నాల్గుపైసలు పెట్టి' మనకవిగారే స్వయంగా డప్పుచేత బట్టుకొని కావూరులోను చుట్టుప్రక్కల గ్రామాలలోను తిరిగి "గాంధీజీ పిలుపుమేరకు రైతులెవరూ భూమిశిస్తు చెల్లించవద్దని" చాటింపువేసాడు. "తప్పుదారికి వచ్చావని" రెవెన్యూ అధికారులు కవిగార్ని నిలదీసారు! "ఇది కాంగ్రెస్ పని నే విడువనోల్ల/పాపంబులకున్ గని యీ యేల్పడి" అని అధికారులతో అన్నాడు నిర్భయంగా దేశభక్తిగల మన కవిగారు గుంటూరు కలెక్టరు "రూథర్ఫర్డు" కవిగార్ని పిలిపించి క్షమాపణచెబితే శిక్షించకుండా వదిలేస్తానన్నాడు. అందుకు కవిగారు నిరాకరించారు! క్షమాపణకోరడం—"చేయుగా రాని చేత" యనిఅంటూ! ప్రభుత్వాన్ని ధిక్కరించినందులకు కవిగారికి "ఆర్థికపరమైన శిక్ష" (fine) ప్రభుత్వం విధించింది. శిక్షపడినా జాతీయోద్యమ కార్యక్రమాలలో క్రియాశీల కార్యకర్తగా చురుగ్గా పాల్గొన్నాడు శ్రీ తుమ్మల. గ్రామంలో కవిగారికి "తప్పెటబ్బాయి" అన్నపేరు (నిక్‌నేమ్) మాత్రం వచ్చింది! తుమ్మలవారు వీధిలోపోతుంటే "అదుగో! తప్పెటబ్బాయి" అని కుర్రాళ్ళు కేకలేసి గేలిచేసేవారు!

1923 డిశంబరులో కాకినాడలో అఖిలభారత కాంగ్రెస్ సమావేశాల్లో తుమ్మల బసవయ్యాదుల వెంటవెళ్ళి కవిగారు పాల్గొన్నాడు. మోతీలాల్ నెహ్రూ చిత్తరంజన్‌దాస్ మహమ్మదాలివంటి హేమాహేమీలైన దేశనాయకులూ సభలో పాల్గొన్నారు. దేశభక్త కొండా వేంకటప్పయ్యగారి అధ్యక్షతన జరిగిందాసభ: నాయకులంతా హిందీలో మాట్లాడారు! సరైన అనువాదకులు లేరు. నాయకుల 'ఉపన్యాసాల' సారాంశం కవిగారితోసహా తెలుగువారికి అంతగా బోధపడలేదు. హిందీరాకపోతే 'జాతీయ

స్థాయి'లో జరిగే కార్యక్రమాల్లో పాల్గొనడంవల్ల లాభంలేదని గ్రహించారు ఆనాడు జాతీయవాదులైన తెలుగువారు.

కాపూరు తిరిగొచ్చిన తర్వాత కవిగారు కొంత పరిశ్రమచేసి హిందీకొద్దిగా నేర్చుకున్నాడు. కాపూరులో తుమ్మల బసవయ్య గారి పుణ్యాన 'తిలక్' జాతీయనికేతనం (పాఠశాల) స్థాపించబడింది. ఇందులో మనకవిగారి కృషికూడా 'ఉడుతాభక్తి'గా కొంతవుంది! ఆ పాఠశాలలో 'హిందీ'ని బోధనాంశంగా కూడా చేర్చారు. మన కవిగారు ఈ పాఠశాలలో 'తెలుగు భాషోపాధ్యాయుని'గా కొంత కాలం పనిచేసాడని యింతకుముందు చెప్పుకున్నాం.

పాఠశాలలో పనిచేస్తూనే - సెలవుదినాల్లో పరిసరపల్లెలు తిరిగి ఖద్దరమ్మేవాడు కవిగారు. అమ్మకాలవల్ల వచ్చేసొమ్ములో 'రూకకునొక వీసముగా నాకబ్బెడి రుసుము'ను పాఠశాలకు తన విరాళంగా నిచ్చేవాడు. పైగా గ్రామగ్రామాన తిరిగి ఉదార స్వభావులు - జాతీయాభిమానులైన వారి దగ్గర 'స్వచ్ఛందం' గా చందాలు వసూలుచేసి వినయాశ్రమానికి పాఠశాలకు కవిగారు ఇచ్చేవాడు! గిట్టనివారు నానావిధాల నిందలువేసినా - వాటి నన్నింటినీ సహించుకొని జాతీయాభిమానంతో చందాలు వసూలు చేసాడు తుమ్మలవారు స్థానిక కాంగ్రెసు నాయకులు చుట్టుపక్కల గ్రామాల్లో స్వాతంత్ర్య సముపార్జనకోసం ప్రజల మద్దతుకోరుతూ ఏర్పాటుచేసిన సభల్లో కవిగారు స్వయంగా పాల్గొని జాతీయస్ఫూర్తి దేశస్వాతంత్ర్యానురక్తి ప్రజల్లో రేకెత్తించేరీతిలో గద్యపద్యాత్మకంగా ప్రజల్ని చైతన్యవంతుల్ని చేసేవాడు.

గాంధీజీ పిలుపుమేరకు దేశమంతటా శాసనసభా బహిష్కృతి - సహకార నిరాకరణోద్యమం ప్రారంభమైనవి శిష్టా

పార్వతీశం, పోలిశెట్టి ఆదినారాయణగుప్త - షేక్ జనాబ్ గౌస్ బేగ్ సాహెబువంటి "దేశాభిమానులైన నాయకులతోపాటు కవిగారు నిజామ్ పట్టణము, ఖాజీపాలెం, మునుకుదురు మొదలగు గ్రామాలలో జాతీయోద్యమ స్ఫూర్తిని ప్రజలలో కలిగిస్తూ కాంగ్రెస్ సభలు నిర్వహించారు. 1924 లో రేపల్లె తాలూకా కనగాల గ్రామంలో ఆంధ్రరత్న రామదండు సుగ్గిరాల బలరామకృష్ణయ్య గారి అధ్యక్షతన జరిగిన తాలూకా కాంగ్రెస్ సభల్లో కవిగారు పాల్గొన్నారు. ఈ సభల్లో మన కవిగారిని 'జాతీయ స్ఫూర్తినిచ్చే', గాంధీజీని ప్రశంసిస్తూ పద్యాలు చదవమని సభానిర్వాహకులు కోరారు. తుమ్మలవారు కూడా 'దేశభక్తి' జాతీయభావమున్న వాడు కనుక - క్రియాశీల జాతీయ కాంగ్రెస్ కార్యకర్తగా - కవిగా 'కవితావేశంతో' దేశాభిమాన వీరావేశంతో పద్యాలు చదివి సభకుల్ని ఉత్తేజపరిచేడు. ఆనాడు ఆయన రాసిన సభల్లో చదివిన పద్యాల్లో మచ్చుకొకటి.

> **తల్లీ ! భారత జననీ !**
> యుల్లమ్మున నీవు చింత నొందగ నేలా
> తెల్లదొరతనము నిలువదు
> చెల్లదికన్ దేశమందు జీకటి తొలగున్ (మహాత్మకథ)

అలానే "గాంధి నాయకు సహకార నిరాకార / ణోద్యమం బభివృద్ధి నొందుగాక" అనియూ "స్వపరిపాలన సిద్ధించి జనులకెల్ల / కూడుగుడ్డయు నిల్లుజేకూరుగాక / భరతమాత స్వపుత్రుల బలిమి కలిమి / యరసి సంతోషమెంతయు నందుగాక" అంటూ పద్యాలు 'ఆవేశం'తో గానం చేసేవాడు.

దరిమిలా కవిగారు బాపట్లలో పనిచేస్తున్నప్పుడు ఉమ్మడి మద్రాసు రాష్ట్రిమంత్రి శేఖరుడు "మునిస్వామి నాయుడు"

బొపట్ల విచ్చేయుచున్నాడు కనుక అందరూ మెచ్చుకొనే విధంగా మంత్రిని శ్లాఘిస్తూ పద్యాలు రాయమని ప్రధానోపాధ్యాయుడు కవిగార్ని కోరాడు. మంత్రిగార్ని పొగడడం అంటే బ్రిటీషు పాలకుల్ని పొగడడమే అవుతుంది కనుక, గాంధీజీ జాతీయోద్యమాన్ని సమర్థించే కవిగారు ఉద్యోగమిచ్చిన కుప్పుస్వామిగారు చెప్పుకాక, పదవినైనా వదులుకొంటానుగాని, మంత్రిని శ్లాఘిస్తూ పద్యాలు రాయనుగాక రాయనని మొండికేసాడు. ఉద్యోగమూడిపోతే - బ్రతకటానికి- "నాకులేదా నా నాగలి" అని తేల్చిచెప్పాడు కాని పద్యాలు రాయనేలేదు ఎవరెంతమంది యెన్నివిధాల చెప్పినా- తెనుగులెంక - జాతీయకవి గదా మరి !

దేశస్థాయిలో జాతీయోద్యమం ఊపందుకుంటూంటే అదే సమయంలో తెలుగునేల ప్రత్యేకాంధ్ర రాష్ట్రోద్యమం ముమ్మరమౌతున్న రోజులవి - సత్యనిష్ఠగల నారయ్య కొడుకైన మనకవిగారు గాంధీజీ సత్యనిష్ఠతోపాటు దేశాభిమానంతో 'జాతీయోద్యమం' పట్ల గాఢంగా ప్రభావితుడైనాడు. తెలుగుదేశం తెలుగు భాష, తెలుగు సంస్కృతి అంటే 'ప్రాణసమానం'గా అభిమానించే తుమ్మలవారు ప్రత్యేక రాష్ట్రంకోసం కవితలల్లాడు.

## కవితా పరిశ్రమ

తుమ్మలవారు పుట్టింది విద్యాగంధంలేని - విద్వత్కవి పండిత వంశంకాని రైతు కుటుంబంలో 'శూద్ర' (కమ్మ) వంశంలో అయితే ఆయన పూర్వజన్మ సుకృతంవలన "ఓనమాలు" నేర్వని కన్నతండ్రి ప్రోత్సాహం - పట్టుదలవల్లను - అదృష్టవశాత్తు లభించిన 'సద్గురువరేణ్యుల' విద్యాభోదనమువల్లను - ఆ గురువులిచ్చిన ప్రోత్సాహంచేతను - "పురాసుకృతం" ఫలించి తుమ్మలవారికి పట్టు

మని పదేండ్లైనా నిండీనిండకముందే సాహిత్యాభిమానం - కవితాభినివేశం తుమ్మలవారిలో మొలకెత్తాయి.

"ఓనమాలు రావుగాని నాతండ్రికి / సాహితీబలమ్ము చాల గలఁ"దని తుమ్మలవారు చెప్పుకున్నాడు. చదువురాని తండ్రి కుమారునిచేత రోజూ సాయంత్రం పూట తీరిక వేళల్లో - "భాగవతం" చదివింపజేస్తూ - చుట్టూచేరిన గ్రామస్థులకు 'భాగవతం'లోని 'భక్తి యొక్క గొప్పతనం' గురించి పోతనగారి పద్యాలలోని 'మందార మకరంద మాధుర్యాన్ని' అందరికీ 'రుచి' చూపిస్తూంటే - బాల తుమ్మలవారూ 'కవితా మాధుర్యాన్ని గ్రోలుతూ ఆ పిన్న వయస్సులోనే కవితాభినివేశం సంతరించుకొన్నాడు. చిన్ననాటనే తండ్రిగారిచ్చిన సాహిత్య ప్రోత్సాహబలమే తుమ్మలవారికి కొండంత కవితా కండబలానికి గట్టిపునాది బండరాయిగా అండగా దండిగా నిండుగా నిలిచింది. అందుకే తండ్రిగారే తనకు 'ఆది' గురువని చెప్పుకొన్నాడు.

చదువుచెప్పిన ప్రథమ గురువు శ్రీ కాపూరి శ్రీరాములు గురువుగారిదగ్గర 'శిష్యరికం' 'నాసేర్మికాదరువు' అయ్యిందని కవిగారు చెప్పుకొన్నాడు. బావగారు జాస్తి సుబ్బయ్యగారు "ఆంధ్రవాణి భజయింపగ నాకు ముందరన్ ద్రోవలనెల్ల జూపి" తోడ్పడినట్లు చెప్పుకున్నాడు. దువ్వూరి వేంకటరమణశాస్త్రిగారు తనను "అంచిత కవి ప్రయోగరహస్య విదురుజేసి నన్నలరించి" నాడని లెస్సగా చెప్పుకున్నాడు. ఒక శ్లోకమైన తనదగ్గర గట్టిగానేర్చిన శిష్యుడు తప్పక గొప్ప కవిపండితుడౌతాడని ఆశీర్వదించిన తాడేపల్లి వేంకటప్పయశాస్త్రిగారి ఆశీర్వాదబలంచేతనే "నాసాహిత్యమొలర్చె" నని కవిగారు చెప్పుకున్నాడు. ఆనాడు "మాతరగతి బొల్లెలందు

నేర్మిగలవాడనేను బండితుడనేను" అంటూ క్లాసులో తుమ్మలవారే ఫస్టు అని చెప్పుకున్నాడు.

అదే సమయంలో తిరుపతి వేంకటకవులు - కొప్పరపు సోదర కవులు - వూరూరూ తిరుగుతూ - పోటాపోటీగా - ఆశుకవిత్వం చెపుతూ అష్టావధాన - శతావధానాలు చేస్తూ తెలుగు సాహితీ ప్రియుల్ని ఉత్సాహితులూగిస్తున్న రోజులవి. వారి ప్రభావంతో ఎందరో ఆశుకవిత్వం చెప్పడం - అష్టావధానాలు చేయడం మొదలెట్టారు. అట్టివారిలో కారెంపూడి రాజమన్నారొకడు. కావూరుకి ప్రక్కనున్న చెఱుకుపల్లిలో రాజమన్నారు 'అవధానం' చేస్తున్నాడని తెలిసి తుమ్మలవారు గూడా చెఱుకుపల్లి వెళ్ళాడు. "వనజ లోచనుండు శునకమ్ముగా మారె" నన్నది రాజమన్నారున కిచ్చిన సమస్య. త్రిపురదైత్య కథను తీసుకొని రాజమన్నారు అవధానిగారు అందర్ని ఆశ్చర్యంలో ముంచి తేలుస్తూ - ఆనందం చేకూర్చుతూ సమస్యను చక్కగా పూరించాడు. మన యువక తుమ్మలకవికి గూడా ఆ సమస్యనెందుకు పూరించలేనని ఆలోచన వచ్చింది. పద్యం రచించాడా సమస్యమీద. ఆ పద్యం చూడండి!

మునుపున్ రాత్రిచరుల్ విమానములపై మోదమ్ముగానెక్కి మా
ఘనమున్ జూడుమటంచు నాఘనమ్ముపై గాసేపు పర్గెత్తి యా
వెనుకన్ నేలకుఁ్రవాలి యూళ్ళనణపన్ విల్లందుకొన్నట్టి యా
శునకమయ్యెను విష్ణుదేవుడహెూ! చోద్యంబుగా నత్తఱిన్

(నాకథలు - మొదటిపద్యం)

"ఇది నామొదలిటి పద్యమ్ము గీనమురియుదు నేడున్" అనీ "ఇట్లు వ్రాయవలదు నీపద్యమిది సాధు / విదియసాధువన్న నాకునిది ప్రియమ్ము" అని కవిగారు తన మొదటి పద్యాన్ని చూచి అందు 'కొాదవలు'న్నా మహామురిసిపోతాడు! నిజమేమరి! విత్తునాటి

కష్టపడి చెట్టుపెంచి - ఆ చెట్టు ప్రథమంగా కాయలు కాచినపుడు- ఆ "ప్రథమ ఫలాల్ని" రుచిచూచి ఎవరైనా తెగ మురిసిపోతారు గదా ! వాటిని దేవునికి ముందునైవేద్యం పెట్టి దాన్ని దైవప్రసాదంగా స్వీకరిస్తారుగదా !

1925 లో ఆశుకవి చక్రవర్తులైన కొప్పరపు సోదరకవులు కావూరులో "శ్రీసుభద్ర పెండ్లి" కథావస్తువును తీసుకొని సదస్యులు మెచ్చుకొనునట్లు ఆశుకవితాధానం గావించారు. జంట అవధానులు వాడిన 'మునులొద్ద' అనుమాటను సభికులలో నొకడు 'తప్పు' పట్టాడు. మన కవిగారు లేచి నన్నయవంటి ఆదికవియే "రాజులొద్ద" అన్నపదం వాడలేదా "కూర్చుండుమికన్ సణగక" మని చీవాట్లువేసాడు. మనకవి సమయస్ఫూర్తికి - సాహిత్య పరిజ్ఞానానికి కొప్పరపు సోదరకవులు తుమ్మలవారిని మెచ్చుకొని- "దక్కఁగలవు నీ కుదాత్తసమ్మానము/ లెక్కఁగలవు చరిత నీవట"నిరి. సంతోషభరితుడైన కవిగారు వినయంతో జంటకవుల్ని ప్రశంసిస్తూ అప్పటికప్పుడే ఆరుపద్యాలుచెప్పి వారినానందపరిచాడు.

1926 లో గుంటూరులోని 'కమ్మ విద్యార్థి' హాస్టల్లో ఉగాది పండుగకు 'మిత్రుల కోరికపై శ్రీ తుమ్మల మొదటి అష్టావధానం చేసాడు ! చిట్టిగూడూరులో చదువుకొన్నప్పుడు "తొలుదొల్త నాశుకవిత" చెప్పాడు. తాడిపర్తి గ్రామంలో మిత్రుడు దేవయ్య ఆదెయ్యల ప్రమేయమున "బౌద్ధవాఙ్మయ బ్రహ్మ" వడ్లమూడి గోపాలకృష్ణచౌదరిగారి అధ్యక్షతన "అష్టావధానం" గావించాడు మనకవి. ఆనాడు కవిగార్కి "సరసకవిశేఖర" బిరుదు ప్రదానం చేసారు. 1947 మార్చిలో పొన్నూరు భావనారాయణస్వామి కల్యాణమహోత్సవ సందర్భమున (తిరునాళ్ళ) - ఎవడో 'ఆశుకవిత్వాన్ని' తెగనాడాడని విని - తాను చేయవలసిన 'ఉపన్యాసం'

మాని 'సీతారాఘవ పరిణయ' గాథను (సీత - నాకథ) "గంట కిన్నాఱు" పద్యాలచొప్పున "మూడువందల పద్యాలు" చెప్పి కల్యాణగాథ సమాప్తం చేసాడు శ్రీ తుమ్మల ఆనాడు ఆయనకు 'ఆశుకవివతంసుడు' అని బిరుదమిచ్చారు.

అవధాన కార్య మిపు డె
ట్లవునో సెప్పంగజాల నాశుకవిత యే
అవరోధమ్మను గానక
నవనవమై వెడలు నందు నమ్రత మీఱన్ (నాకథలు)

'అవధానం' సంగతేమోగాని 'ఆశుకవిత్వం' యీనాటికీ చెప్పగలనని 1972లో నొక్కిచెప్పాడు తెనుగులెంక.

చదువురాని తండ్రి ప్రోత్సాహం - చదువునేర్పిన గురువుల ప్రోత్సాహంవల్లను - మనోప్రకృష్ట స్వయంకృషితో పట్టుదలతో ప్రాచీన కావ్యాధ్యయనం - ద్వారా భాషాభివృద్ధిపరచుకొంటూ - కవితా రచనారహస్యాల్ని గ్రహిస్తూ - పూర్వజన్మ సుకృతంపండి - అదృష్టం కలిసొచ్చి - కవిగా నిలదొక్కుని - కవిగా ఎదుగుతున్న సమయంలో దేశస్థాయిలో - బాపూజీ నాయకత్వాన జాతీయోద్యమం - రాష్ట్రస్థాయిలో 'ప్రత్యేక రాష్ట్రోద్యమం - దేశంలోని ఆబాలగోపాలాన్ని - ప్రభావితంచేసి ఉత్తేజపరుస్తున్న రోజులవి. కవిపండితులు కలంపట్టి గళమెత్తి దేశభక్తిప్రపూరితమైన గేయాల్ని కవితల్ని - పద్యాల్నిరాస్తూ దేశప్రజలకు స్ఫూర్తినిస్తూ - చైతన్యవంతుల్ని చేస్తున్న కాలమది.

కవిగా నిలదొక్కుకున్న తెనుగులెంక సహజంగానే, జాతీయోద్యమంపట్ల - ఆంధ్ర రాష్ట్రోద్యమంపట్ల ప్రభావితుడై తాను కవితలురాసి ప్రజల్ని చైతన్యవంతుల్ని చేయసాగాడు. సత్యనిష్ఠా

గరిష్ఠుడైన నారయ్యకొడుగ్గా తుమ్మలవారు సహజంగానే సత్యసంధుడైన గాంధీజీ వ్యక్తిత్వంపట్ల - జాతీయోద్యమానికి గాంధీజీ వహించిన నాయకత్వంపట్ల బాగా ప్రభావితుడైనాడు. కనుక సమకాలీనంగా "సూరినో, పేరినో, సుబ్బినో ఒల్పి పచ్చిసింగారంబు" చెప్పే భావకవిత్వాన్ని," బూతులబుంగలై హేతువాదానికి నిల్వగలేని పుక్కిటిపురాణాలపై చెప్పే సంప్రదాయ ఛాందసకవిత్వాన్ని నిరసించి - త్రోసిరాజని - జాతీయసమస్యల పైని, రాష్ట్రియ సమస్యలపైన కవితలల్లడం ప్రారంభించాడు. 1920 — 30 దశకంలో రామలింగేశ్వర శతకం రాఘవ (రామ) శతకంవంటి పౌరాణిక కవితలు మరోప్రక్క పంజాబు వెతలు, భారతమాత, గాంధీ తారావళి, ఆంధ్రధరత్న స్మృతి - ఉద్రేకము. వీరధర్మము (పల్నాటి బాలచంద్రుసికి సంబంధించిన) మొదలగు దేశభక్తి కవితలురాసాడు—

కవిగా తుమ్మలవారికి పేరుప్రతిష్టలు పెరిగేకొద్దీ ఆయన కవితావ్యాసంగం పైనే దృష్టి సారించాడు. "కవితనాకు మందు" గా "కవితనాకాపోక నొసంగు విందు" అయిందాయనకు.

"హలము మాని కలమునందితినిట, గీడు
మేలు నుడువలేని వేలనైతి
హలముమాని రోగినై కలంగితిగాన
గలమునంది కీర్తిగంటిగాన— "నేను"

ఉపాధ్యాయవృత్తిలో స్థిరపడి - ఉద్యోగరీత్యా కాపూరును విడిచిపెట్టి - యితర గ్రామాలలో నివాసముండడంవల్లను, కవితారచనావ్యాసంగంపైనే ఆయన దృష్టినంతా కేంద్రీకృతం చేయడంవల్లను- పిల్లల చదువులకోసం' దరిమిలా కావ్యముద్రణార్థం కొంత పొలం అమ్ముకోవలసి రావడంవల్లను - "హాలం" పట్టడం మానివేసి 'కలం' పట్టాడు. సేద్యం మానడంవల్ల - కాయకష్టం లేకపోవడంవల్ల

"ఆరోగ్యంచెడి బాధపడినా కలం పట్టుకోవడంవల్ల" కీర్తిప్రతిష్టలు పెరిగి ఆనందం చేకూరినందున సంతృప్తిచెందాడు! "వెచ్చపడదు నాదు విత్తమేనాడును / కలముపోటు దినక కానివేసి" - దశకు చేరుకున్నాడు మనకవిగారు.

సమకాలీన దేశకాలపరిస్థితుల ప్రభావంతో - రాష్ట్రోద్యమ స్ఫూర్తితో - జాతీయోద్యమ స్ఫూర్తితో దేశభక్తి - జాతీయ వాద కవితలు కావ్యాలు పుంఖానుపుంఖంగా వెలయించాడు. గాంధీజీ వ్యక్తిత్వానికి - నాయకత్వానికి ముగ్ధుడై - గాంధేయ 'సర్వోదయ సిద్ధాంతానికి ప్రభావితుడై - గాంధీ ఆత్మకథను- సర్వోదయ కవితల్ని వెలయించాడు. గ్రామప్రాంతంలో రైతు కుటుంబంలో పుట్టి స్వయంగా సేద్యంచేసిన మనకవిగారు "కర్షకుడు," "సంక్రాంతి" "వరినాటు" - "రైతు మొఱ" వంటి కవితలు రాసాడు రైతుకవిగా "పైరపంట" "పఱిగపంట" అని తన రెండు ఖండ కావ్యాలకు పేరుపెట్టడంలోనే మనకవిగారు 'రైతు' అని 'రైతుకవి అని తెలుస్తుంది. మరోప్రక్క నారయ సత్యసిరతి, గాంధీజీ విశిష్టవ్యక్తిత్వానికి ప్రభావితుడై - మనిషి నైయక్తిక ఋజువర్త నానికి - సత్ప్రవర్తనకు- నీతినిజాయితీలకు ప్రాధాన్యం యివ్వాలని- మానవజన్మమప్పుడే సార్థకమాతుందన్న ధ్యేయంతో "ఎక్కట్లు" 'చక్కట్లు' సందేశసప్తశతి వంటి నీతిప్రబోధక కవితలు కోకొల్లలుగా వెలయించాడు.

1930 - 40 సం॥ల మధ్య తుమ్మలవారు రచించిన కావ్య ములు ఆయనకు అఖండ కీర్తినార్జించిపెట్టాయి. భారతంలోని లుబ్ధ కపోతోపాఖ్యాన్ని తీసుకొని స్వల్పమార్పులు చేర్పులుచేసి "ఆత్మా ర్పణము" అన్న పేరుతో 1932లో ఒక లఘుకావ్యం రచించాడు. అది తొలుత భారతి మాసపత్రికలో ధారావాహికంగా గూడా

వచ్చింది. 1938 లో 'రాష్ట్రగానము' వెలువరించాడు. ప్రత్యేక ఆంధ్రరాష్ట్రంకోసం ఆంధ్రులు ప్రారంభించిన ఉద్యమానికి స్ఫూర్తి నిచ్చిందీకావ్యం. ఈ కావ్యంలోని కొన్ని పద్యాలు అంతకుముందు "భారతి"లో ప్రచురింపబడ్డాయి— ఈ కావ్యరచనతో తెలుగునేల నాల్గుచెఱగుల తుమ్మలవారి పేరుమోరుమ్రోగిపోయింది! 1936లో బాపూజీ ఆత్మకథ ప్రథమభాగం వెలువరించాడు. శాంతియుత భారతస్వాతంత్ర్య సమరోద్యమానికి నాయకత్వం వహించిన గాంధీజీ పేరు ఆనాడు యావత్ భారతదేశంలోనే ప్రజల నాల్కల మీద నిత్యం తాండవమాడింది. అట్టి బాపూజీ స్వీయచరిత్రను తెలుగులో 'ఆత్మకథ' గద్యపద్యాత్మకంగా కావ్యం వెలయించడం తెనుగులెంక కీర్తి రాష్ట్రంలోనే కాదు - దేశం నలుమూలల వ్యాపించింది. దానితో తెనుగులెంకకు 'అభినవ' తిక్కన బిరుదం లభించడం ఆయన కీర్తికిరీటంలో కలికితురాయి ! "గాంధికవి"గా జాతీయకవిగా లబ్ధప్రతిష్ఠుడైనాడు. ఆత్మకథ - ఆంధ్ర - మద్రాస్ అన్నామలై విశ్వవిద్యాలయాల్లోపాఠ్యగ్రంథమైనది! పొన్నూరులో గజారోహణ - కనకాభిషేకాది ఘనసన్మానాలు జరిగాయి. అప్పికట్ల తెనాలి - బ్రాహ్మణకోడూరు - గుడివాడ - చీరాల మున్నగు తదితరచోట్ల గూడా సన్మానాలు జరిగాయి—

దరిమిలా ధర్మజ్యోతి (1942) పఱిగపంట (1943) అమర జ్యోతి (1948) ఆత్మకథ (పూర్తి) (1951) ఉదయగానం (1955) శబల (1955) సర్వోదయగానము (1961) పైరపంట (1964) సమదర్శి (1967) మహాత్మకథ (1968) సందేశసప్తశతి (1981) గాంధిగానము (1987) మున్నగు షుమారు 25 రసవత్తరకావ్యాలు రచించి 'మహాత్ముని ఆస్థానకవిగా' చిరకీర్తి నార్జించాడు శ్రీ తుమ్మల.

# సత్యనిష్ఠా గరిష్టత

మనకవిగారి తండ్రి నారయ "నిత్యసత్యాలాప నియతి గల వాడు" అట్టి నారయ సత్యనిరతి గూర్చిన ఒకటి రెండు ముఖ్యమైన సంఘటనలు తెలుసుకోవడం సముచితంగా వుంటుంది. సందర్భోచితంగా కూడా వుంటుంది.

"వడ్డెరవాళ్ళకు దొరికిన బంగారు కడ్డీలు 'యిత్తడి' వని మోసంచేసి కొనుక్కొచ్చిన - పోలీసులొస్తున్నారన్న భయంతో నీతిమంతుడైన నారయ నాశ్రయించి కాళ్ళావేళ్ళాబడి వాటిని దాచిపెట్టమని వైశ్యుడొకరు యిచ్చాడు. నారయ వాటిని రెండేళ్ళపాటు భద్రంగా ప్రాణసమానంగా దాచిపెట్టాడు. వాటిని 'ముద్దరసుద్ది'గా యేదోకొంత ప్రతిఫలం ఆ వైశ్యుడు ముట్టచెప్పచూచినా యేయెట్టి ప్రతిఫలం మాసింపక ఆ బంగారు కడ్డీలు ఆవైశ్యునికి తిరిగిచ్చి వేసాడు ఒకటి రెండు రోజులు కాదు; నెలలు కాదు, రెండేళ్ళు దాచి పెట్టి - తిరిగి యిచ్చివేయడం సామాన్యమైన విషయం కాదు! "నీ వెవరు.! బంగారుకడ్డీలేమిటి! నీవెప్పుడిచ్చావు! "అనో ఏమై పోయాయో - యెక్కడ పోయాయో - ఎవరు దొంగిలించారో అనో ఒక్క చిన్న "అబద్ధమాడి" వుండివుంటే - నిజంగా నారయ్య ఎంత బాగుపడేవాడు! మరెంతటి. భాగ్యవంతుడై యుండేవాడు! నీతిమంతుడైన వాడికి నిలువెత్తు బంగారమైన గడ్డిపోచతో సమాన మన్న సత్యం-పరులసొమ్ము పదికోట్లరూపాయలైనా పెంటతో సమాన మన్న సత్యం - నారయ్య విషయంతో ఋజువైనది. అందుకే "ఆసకులొంగక తొమ్మిది / వీసెలపైచిలుకు పరుల విత్తము పసిడిన్ / ద్రోసిన మత్పితనారయ' అని కవిగారు తన తండ్రిగారి సత్యనిష్ఠ

అభినుతించాడు. ఈ సంఘటనని తెనుగులెంక 'ధర్మజ్యోతి' కావ్యంగా మలిచాడు.

నారయ నిజాయితీ ఋజువుచేసే మరో సంఘుటన. కావూరు లోనే ఓ సన్నకారురైతు రెడ్డి ఆర్థికమాంద్యంవల్ల పొలముండీ-కుటుంబపుటవసరాలకు అప్పులుచేసి - అవి తీర్చలేక - ఋణదాతల పోరుపడలేక ఒకనాడు నారయ్య నాశ్రయించి తన మూడెకరాల పొలం ఆనాడున్న వెలకు తీసుకొని దానికగు డబ్బిమ్మని అర్థించాడు. రైతుగా - రైతుల కష్టసుఖాలెరిగినవాడు - దయార్ద్రహృదయుడు కనుక నారయ అలాగే మూడెకరాలు స్వాధీనం చేసుకొని ఆ రెడ్డికి డబ్బిచ్చాడు. అదృష్టవశాత్తు ఒకటిరెండు సంవత్సరాలకు పరిస్థితులు మెరుగయ్యాయి పంటలు బాగా పండడమేకాదు, పంటకు మంచి 'గిట్టుబాటు' ధర పెరిగింది కనుక ఆరెడ్డి ఆర్థిక పరిస్థితి బాగా మెరుగైంది. నారయ రెడ్డిగారిని పిలిపించి - "వలదు వడ్డీనాకు వలదు నేడున్న / వెలయు, నీవిచ్చిన వెలకె నీకిత్తు" / నీవు నాకొసగిన నేల నీకిడెద / నల్లన తీర్చుకొమ్మప్పును దీని" అని— అనేసరికి ఆరెడ్డి క్షణంకాలం నివ్వెరపోయి - నారయ నీతినిజాయితీ ఎఱిగినవాడు కావున నారయకు బహుధా కృతజ్ఞత తెలుపుకున్నాడు. నారయ్య సహృదయతను, మానవతా దృక్పథాన్ని మరీమరీ మెచ్చుకున్నాడు. ఆర్థికమాంద్యంతో ధరలుపడిన రోజుల్లో మూడెకరాల పొలం కారుచౌకధరకు నారయ స్వాధీనం చేసుకున్నాడు. రెండేళ్ళ తర్వాత వడ్డీలేకుండానే ఆనాటి తక్కువధరకే (దరిమిలా పొలంధర గణనీయంగా పెరిగినా) రెడ్డి పొలం రెడ్డికి తిరిగివ్వడంలోనే నారయ్యగారి ఔదార్యం - నిజాయితీ స్పష్టంగా వెల్లడౌతుంది! అన్నమాట ప్రకారం రెడ్డిపొలం రెడ్డికి స్వాధీనం చేసాడు నారయ. చేసిన 'అప్పు' రెడ్డి మెల్లగా నారయ్యకు తీర్చివేసాడు! "మను

ష్యుడు కాడు వేల్పుగు" "కావ్యులప్రపు, కారణజన్ముడు - గణనీయ శీలుడు" అని అంటూ ఆ రెడ్డి తనయింటిదీపాన్ని నిలబెట్టినందులకు నారయను లెస్స ప్రశంసించాడు. "నారయ్య దివ్వె" పేర "నాకథల్లో" యీ సంఘటనను కవిగారు 'సువర్ణాక్షరబద్ధం' గావించాడు. నారయ్య సత్యసంధుడని - నిజాయితీపరుడని- కావూరులో నేకాదు- ఆ చుట్టుప్రక్కల గ్రామాలవారందరికీ బాగా తెలుసు. అట్టి నారయ్య కుమారుడు నీతిమంతుడు కాక యెలావుంటాడు! విత్తొక టైతే - చెట్టొకటౌతుందా మరి! "మత్పిత నారయవాసియ నను దిద్ది యింతవానిని జేసె" నని చెప్పుకున్నాడు. అలానే తన తల్లి నిదానంబ తన నుడిలో నడలో గల "ఋజుత్వము" నకు కారణమని చెప్పుకున్నాడు. తండ్రి నారయ తనకు "నీతి నేర్పె ధర్మనిరతి నేర్పె నుదారసరణి వుగ్గుపాలతో నేర్పె జదువుసంధ్య నేర్పె" కనుక "నీతినిజాయితీ తన తల్లిదండ్రుల నుండి పుణికిపుచ్చుకొన్నాడు కనుకనే – "సత్యనిష్ఠ నాకు సాజమ"ని సగర్వంగా - సవినయంగా చెప్పుకొన్నాడు తెనుగులెంక! "నాకు నగ్గపడిన నైతికబలమెల్ల నన్ను గన్నవారి నడతేపంట" అని గాంధీజీ తన ఆత్మకథలో (తుమ్మలవారి పద్యపాదంలో) చెప్పుకున్న మాటలు, గాంధీకవియైన తుమ్మలవారికినీ పూర్తిగా అన్వయిస్తాయి!

దీనికితోడు ఆయనకు విద్యనేర్పిన గురువులందరుమ - విద్వత్కవి పండితులేకాదు – సకలసద్గుణ సంపన్నులు కావడంవల్ల క్రమశిక్షణతోపాటు - విద్యతోపాటు గురువులనుండి "సకలసుగుణాలు" ప్రోదిచేసుకున్నాడు. జాతీయోద్యమ రథసారథి - జాతిపిత "సత్యనిష్ఠాగరిష్ఠు" డైన మహాత్మాగాంధి - "విశిష్టవ్యక్తిత్వం" ఆయన ఉత్తమాదర్శాలు – ఆశయాలు నీతినిజాయితీపరుడైన నారయ కుమారుడైన మనకవిగార్ని గాఢంగా ప్రభావితంచేసాయి

ఈ విధంగా — శ్రీ తుమ్మలవారి 'వ్యక్తిత్వం' తీర్చిదిద్దటానికి— కన్నతల్లిదండ్రులు - విద్యనేర్పిన గురువులు - మహాత్మగాంధీ— మూలకారకులు ! జాతీయకేంద్రంగా విలసిల్లిన కావూరు గ్రామ వాసినా గాంధేయ సిద్ధాంతాల్ని నిత్యం ఆచరించే 'కావూరి విన యాశ్రమం'లో సభ్యుడిగా - జాతీయవాదిగా - కాంగ్రెస్ కార్య కర్తగా - గాంధీ భక్తుడుగా - తుమ్మలవారిలో క్రమశిక్షణ - సత్య నిష్ఠ - పరోపకారబుద్ధి అహింసా సిద్ధాంతం సర్వోదయ జీవనవిధా నం స్వయంకృషి (పరిశ్రమ) దీక్ష నిరాడంబరత తెనుగులెంకలో అణువణువున జీర్ణించుకొనిపోయాయి ! అందుకే "మచ్చమసకలేని మనుగడ నర్థించి / మలగినాడ వెతలనలగినాడ" అని ఆయనే చెప్పుకున్నాడు. ఆయన సత్యనిష్ఠ - ఋజువర్తనం ఋజువుపరిచే కొన్ని కవిగారి స్వీయానుభవాల్ని తెలుసుకుందాం !

చిన్నతనంలో చదువుకొన్నరోజుల్లో కొందరు పోకిరి విద్యా ర్థులు పాఠశాలపాకను తగులబెట్టారు. అదిచూచిన చిన్నారి తుమ్మల మాస్టారడిగితే నిజం చెప్పాడు "కల్లకపటము నెఱుగని యుల్లము"న్నవాడగుట తప్పుచేసిన విద్యార్థుల్ని మాస్టారు దండిం చాడు. దండనకు గురైన పోకిరికుర్రాళ్ళు మనస్సులో మనకవిగారి మీద 'గుర్రు' పెట్టుకొని బాలతుమ్మలతో స్నేహం నటించి- మామిడితోపుకు తీసుకొనిపోయి, మామిడికాయలు, తాటిముంజెలు వారు తింటూ, ఆయనచేత తినిపిస్తూ సాయంత్రం 'మసకచీకటి' పడేవరకు కాలక్షేపంచేసి - చివరకు బాలతుమ్మలను చితగ్గొట్టారు. చావమోదారు ! చీవాట్లువేస్తూ కొడుతూ "మామీద మాస్టారికి చాడీలుచెప్పి మమ్మల్ని కొట్టిస్తావా ! ఇప్పుడు నిన్ను చానగొట్టినా దిక్కెవరంటూ" ! అయితే అంతలో అదృష్టవశాత్తు అటుగా పరు గెత్తుకొనివచ్చిన కోడెదూడవెంట దాని ఆసామి ఓ 'రెడ్డి'గారు

దేవుడిలా రావడంవలన తుమ్మలవారు 'ప్రాణాపాయం' నుండి తప్పించుకొన్నాడు. "నిజం" చెప్పడంచేత చావుదెబ్బలుతిన్నా— దైవకృపచేత, సత్యసంధుడగుటచేత నేకదా బ్రతికి బయటపడ్డాడు !

మరో సంఘటన గురించి తెలుసుకుందాం—

బాపట్లలో కవిగారున్న యింటికి యెదురింటనున్న వేద హనుమయ్య "పిల్లలకు జమవుసెప్పుచు" చిల్లరగా "లెక్కలు" వ్రాయుచు బ్రతికేవాడు. ముక్కు-పొడుం అలవాటున్న కవిగారు అదే అలవాటున్న హనుమయ్యతో స్నేహం. ఎవరో హనుమయ్య దగ్గర ఐదువేల రూపాయలుంచమని యిచ్చారు. పెట్టిలోపెట్టిన ఆ డబ్బునొకనాడు పొరపాటున చాపకిందపెట్టి హనుమయ్య బయటికి వెళ్ళాడు ముక్కు-పొడుంకోసం వచ్చి 'పొడుండబ్బా' కోసం వెదకిన కవిగారికి డబ్బుమూట కనిపించింది : దాన్నితీసి భద్రపరచాడు. సాయంత్రానికి యిల్లుచేరిన హనుమయ్య డబ్బు కనిపించకపోయే సరికి "కొంపమునిగిందని" లబోదిబోమన్నాడు. కవిగారు వచ్చి హనుమయ్యను శాంతపరచి డబ్బు తెచ్చియిచ్చి అతని పొరపాటును గుర్తుచేసాడు ! ఇంతకు విషయమేమంటే— ఆ డబ్బును హనుమయ్యకియ్యక తాను ఉంచుకొన్నట్లైతే అనేది ఎవరూలేరు ! అది ఎవరూచూడలేదు ! "పరవిత్తమది విషప్రాయంబయని విశ్వ సించినాడు తిరస్కరించిన" నారయ "ఆసకులాంగక తొమ్మిది వీసె లపైచిలుకు పరుల విత్తము పసిడిన్ద్రోసిన" నారయబిడ్డ కాదా కవిగారు. గాంధీభక్తుడు కదా కవిగారు. కవిగారు దీనిని "విధినిర్వాహణం"గా చెప్పుకున్నాడుగాని తన గొప్పతనంగా గొప్పలు చెప్పుకోలేదు. (నాకథలు)

బాపట్లలో తెలుగుపండితులుగా పనిచేస్తున్నరోజుల్లో - మన కవిగారు ఒకనాడు మార్కెట్టుకుపోయి కాయకూరలు కొన్నాడు.

ఆయన లెక్కప్రకారం ఇంకా ఒక "కాణి" మిగిలివుండవలె! తోటకూరఅమ్మే ముసలమ్మ దగ్గర "కాణి"కి తోటకూరకొన్నాడు. సంచిలో ఎంత వెతికినా "కాణీ" కనిపించలేదు. "రేపిస్తా"నని ఆ ముసలమ్మతో చెప్పి యింటికివచ్చి లెక్కచూసుకొంటే "కాణీ" సంచిలోనేవుంది! "పిన్ననాటినుండి పెఱలకు ఋణపడుటీరు సైప దస్మదీయ చిత్త"మని మనస్సులో అనుకొని "ఎల్లి కూరలకరిగియే నిచ్చుకంటె/నిపుడ చని యవ్వకీ నిల్వ యిడుటలెస్స" యని వెంటనే మరలా మార్కెట్టునకుబోయి 'తోటకూర బాకీ' తీర్చివచ్చాడు మనకవిగారు (నాకథలు) "ఏమిటీ యీాయన ఛాదస్తం మరీను" అని పిస్తుంది మనకు ఒక్క 'కాశీ' బాకీని చెల్లించటానికి మరలా మార్కెట్టుకు పరుగెత్తాలా! అనిపిస్తుంది! కాని 'ఋజువర్తను డైన తుమ్మలవారికేకాదు మరెవరికైనా 'కాణీ' అయినా ఒకటే 'కోటి' రూపాయలైనా ఒకటే!

ఇటువంటిదే మరో సంఘటన! కవిగారికి ఏరోజుకారోజు జమాఖర్చులు రాసుకునే అలవాటుంది! ఈ అలవాటు గాంధిగారి నుండే నేర్చుకొన్నాడు గాంధీకవి! తన సొమ్ముఅయినా - పరులకు బాకీఅయినా 'లెక్క' రాయడం కవిగారికి అలవాటు. "వ్రాయ వలయు లెక్క వచ్చిన పోయిన రూకకును సదా పరాకులేక" - ఇది "మంచి అలవాటు" అంటాడు. "పాపపుణ్యములను బ్రకటించు నది యథ / మర్ణతావిపత్తి మాన్పనేర్పు" నంటాడు "పద్దువ్రాయు వాడు పరమ లుబ్దండ"నే వాడికి "బేల" యని అతడంటే "జాలి" కలుగుతుందని అంటాడు. కవిగారికి 'చిటుతిండి' అలవాటుండేది! ఏరోజుకారోజు ఖర్చుపెట్టటానికి చేతిలో డబ్బు వుండేదికాదుగదా! ఉపాధ్యాయుడు, నెలజీతగాడు కదా! ఆ 'చిరుతిళ్ళ' అమ్మే "వీరభద్రయ్య దగ్గర 'కాతా' పెట్టాడు. నెలఅయిన తర్వాత

'పదనాలుగు' రూకలిచ్చారు కవిగారు. అది ఆయన లెక్క ప్రకారం ఆ నెలలో తానుతిన్న చిరుతిండి ఖర్చు మొత్తం— "నాకు హెచ్చు ఎందుకిచ్చారు. బాకీ 'పదునాల్గురూకల యిర్వదిపైస' లన్నాడు వీరభద్రయ్య! "నీవిచ్చిలెక్క కాదు నాలెక్క నాకు తార్కాణ" మన్నాడు కవిగారు! అదే 'నిజాయితీ' అంటే

## చెక్కుచెదరని ఆత్మాభిమానం

తుమ్మలవారిలో మరో మంచిగుణం ఆత్మాభిమానం! ఒకరికి 'తలవంచింది' లేదు. మరొకరి 'పంచ' జేరి యాచించిందిలేదు. తన ఆర్థికపరిస్థితి అంతగా బాగుండకపోయినా, తన కుటుంబంపెద్దదైనా, తన కావ్యాలు తన స్వంతఖర్చులతో అచ్చువేసుకొన్నాడేకాని కృతిస్వీకర్తలచుట్టూ తిరిగి యాచించలేదు. వారంతట వారిస్తా నన్నా తాను స్వీకరించలేదు. "పేదవాడయ్యు వేడునట్టివాడు కాడు" తుమ్మలయని కుప్పుస్వామి అంతటి గొప్పవాడన్నాడంటే- మరి దానినిబట్టి తుమ్మలవారి ఆత్మాభిమానమెట్టిదో మనం గ్రహించవచ్చు! తెనుగులెంక 'ఆత్మాభిమానాన్ని' ఋజువుపరిచే రెండుమూడు సంఘటనల్ని గుర్తుచేసుకుందాం.

తుమ్మలవారి ఆర్థికపరిస్థితులు బాగా తెలిసినవాడు కనుక కేంద్రప్రభుత్వానికి తాను పేదకవినంటూ ఆర్థికసహాయమర్థిస్తూ ఒక అర్జీ పెట్టుకోమన్నాడు ఆచార్య రంగాగారు తన కవిత్వాన్ని మెచ్చుకొని, ప్రభుత్వంకాని మరొక వదాన్యుడగు దాతగాని "పిలిచి యిడు కానుకనీకొందు" కాని "ఏను బేదవాడనైన నన్నల యించు బెడదలెన్నియున్న బెఱులనడిగి బ్రతుకునియ్య నేయ" నని తన కఠోరనియతి గురించి రంగాగారికి "ఏనుగు లక్ష్మణకవి" గ్రాసములేక స్రుక్కిన... కేసరి జీర్ణతృణంబు మేయునే" అన్న

పద్యం గుర్తుచేస్తూ జవాబు వ్రాసి తన "ఆత్మాభిమానాన్ని" నిల బెట్టుకొన్నాడు తెనుగులెంక !

కృష్ణాజిల్లా పామఱ్ఱు సమీపమందున్న విద్యావనంలో తుమ్మలవారికి సన్మానంచేసిన సభలో ఆయన పేదకవి కనుక ఏదైనా "ధర్మనిధి" ఏర్పాటుచేస్తే ఆనిధి ద్వారా ఆయన తన కావ్యాల్ని అచ్చొత్తించుకొనుటకు వీలవుతుందని, అందుకు ఉదారస్వభావులైన సభికులనుండి విరాళాలు కోరాడు సభానిర్వాహకుడైన యలమంచలి వేంకటేశ్వర్లు. అందుకు తుమ్మలవారు నిరాకరించారు— "నా సొమ్ముతోడన నాకృతుల్ మెఱయ / వలెనన్న" నియతిగల ఛాందసుడనని సభాముఖంగా చెప్పాడు. ఇంటికిజేరి యీ విషయం బిడ్డలతో ప్రస్తావించాడు. "మీకృతుల నెలువరింప నింతయేల/ యేమునిర్వహింతు మిప్పని, మాధర్మనిది" అని తండ్రిగారికి చెప్పి-తండ్రి ఆత్మగౌరవాన్ని తమ ఆత్మగౌరవంతో జతపచి ద్విగుణీకృతంగా పదిలపరిచారు ! ఆత్మగౌరవం విషయంలో తండ్రికితగ్గ కుమారులనిపించారు. తనకుతగిన బిడ్డల వైఖరికి తుమ్మలవారు ఆనందపడిపోయాడు !

ఇంకో చిన్న సంఘటన- ఒక సంపన్నుడైన సాహుకారొకడు తనకు లేకలేక కల్గిన కుమారుని 'జన్మదినోత్స' వానికి కవిపండితుల్ని రావించి, ఆటపాటల వినోదకార్యక్రమాలేర్పరచి ఘనంగా సన్మానించదలచానని తమరుతప్పక విచ్చేయవలసిందని ఉత్తరం రాయించాడు తన క్రిందిగుమాస్తాచేత. ఆ ఉత్తరం చూచిన తెనుగులెంక "భాగ్యమున్నంతనె సరిపోతుందా వినయమక్కరలేదా ! ఇంత దురభిమానమా- గుమాస్తాచేత ఉత్తరం రాయిస్తాడా అని "మానుష్యమ్ము" గల మనకవిగారు బాధపడ్డాడు.

పరువులేనిసొమ్ము పదిలక్షలగు గాక
కవికి గడ్డిపరకకంటె లొచ్చు
కవితకంటె రూక గణనీయమా! యది
యమరసృష్టి యిది పయస్తరంగ— (నాకథలు)

నింగినంటే మేడలు నిల్వలేవు. నిధులు నిల్వలేవు. రాజ్యవైభవాలు నిల్వలేవు నిలిచింది - నిలిచేది శాశ్వతంగా కవితయొక్కటే దానినీ సంపన్నుడు గుర్తించినట్లులేదని తన మనసు 'చివుక్కు' మనిపించ - ఆలోచించి ఆ సంపన్నుడు తనక్రింది గుమాస్తాచేత ఉత్తరం రాయించాడు కనుక, తుమ్మలవారు గూడా తన శిష్యుడొకరిచేత "సముచితంబగునట్టి సరణి" మీరు ఆహ్వానం పంపలేదు కనుక మా గురువుగారు అరుగుదేర నిచ్చగింపక వారి నివ్వార్త నరగమీకెఱిగింపమన్నారంటూ వుత్తరం రాయించాడు— ఇలా 'ఆత్మగౌరవం'తో జగమెప్పిన మార్గమున మనుగడన్ సాగించుచుంటి నుడి కొల్వరినై" అని చెప్పుకొన్నాడు ఆత్మాభిమానమున్న తెనుగు లెంక.

బాపట్లలో ఉపాధ్యాయవృత్తిలో నున్న రోజుల్లో ఓపెద్ద ఉద్యోగి కుమారుడు మనకవిగారి దగ్గరకువచ్చి తనకు తెలుగులో ప్రత్యేక శిక్షణ (ప్రైవేటు) యివ్వమని కోరాడు. మంచిదేనన్నాడు మనకవిగారు. పైగా ఉచితంగా చెబుతానన్నాడు అయితే తమ యింటికివచ్చి ప్రైవేటు చెప్పాలన్నాడు అధికారి కుమారుడు. ఆత్మాభిమానమున్న తెనుగులెంకకు కోపం వచ్చింది. అధికారి నచ్చి తనను అర్థించక పిల్లవాడిని పంపడమటుంచి, వాళ్ళ యింటికేగి ప్రైవేటు చెప్పటమా! అని. "జివుక్కురుమనియె నామనస్సు, గునిసె దుస్సహమైన కోపమ్ము" అని అనుకొని ప్రైవేటు చెప్పటానికి తిరస్కరించాడు. ఈరోజుల్లోనైతే - ప్రైవేటుచెప్పమని

అడిగిందే తడవుగా పరుగెత్తుకొని వెళ్ళి చెప్పేమాష్టార్లు ఎంతమంది లేరు ! కాలమహిమ ! ధనాశమహిమ !

ఒకసారి కవిగారు ప్రముఖ సాహితీవేత్త తనకు బంధువునగునాగళ్ళ గురుప్రసాదరావుగార్ని చూడటానికి బెజవాడలో రైలుదిగి-గుణదల వెళ్ళటానికి సిటీబస్సెక్కి- రూపాయిచ్చాడు బస్సు కండక్టరుకు టిక్కెట్టుకోసం. బస్సు కండక్టరు కవిగారిచ్చిన సత్తుబిళ్ళ చూచి' - ఏమయ్యా ! ఖద్దరు కట్టావు. పెద్దమనిషివనుకున్నాను. నాకళ్ళుగప్పి నన్ను మోసం చేయాలనుకున్నావా" అంటూ నాల్గు ఝాడించాడు. తెనుగులెంకకా మాటలు 'బాకులు'గా గుండెల్లో గుచ్చుకున్నాయి ! అంతకుమించి 'ఖద్దరుబట్ట పరువు' పోయినందుకు బాధపడ్డాడు. దీనికి కారణమా సత్తురూపాయి ! దాన్ని తనకు తనవ్వూరి అంగడివాడంటకట్టాడు ! చూసుకోకుండా తీసుకున్నాడు. తన ఆత్మగౌరవం, తన ఖద్దరు పరువుతీసిన ఆపాడు సత్తురూపాయి బిళ్ళ యింకెందుకని, దాన్ని బయటికి విసిరికొట్టాడు, పీడావిరగడైందనుకొంటూ !

పదవీవిరమణచేసి అప్పికట్లలో శేషజీవితం గడుపుతూ కవితావ్యాసంగం కొనసాగిస్తున్నరోజుల్లో ఆ గ్రామం విచ్చేసిన జిల్లా మంత్రివర్యుడొకరు కవిగార్ని వచ్చి తననొకసారి విడిదిచేసిన గృహంలోనో (సభావేదిక దగ్గరనో) కలుసుకోమని కబురు చేసాడు! పాపమా, మంత్రిగారు తుమ్మలవారు గొప్పకవి కనుక మర్యాదగా పలకరిస్తామనుకొని కబురుపెట్టి వుంటాడు. అయినా కవిగారు నిరాకరించాడు ! తాను కవినన్న గౌరవం మంత్రిగారికుంటే ఆయనే తన యింటికొచ్చిపొమ్మని కబురుపెట్టాడట పైగా ! అదీ తెనుగులెంక ఆత్మాభిమానం !

## నిగర్వం - వినమ్రత - నిజాయితీ

తప్పు వ్రాయని యొప్పుల కుప్పననుచు
రిత్తమాటలు నే వెళ్ళబుచ్చఁజాల
బెద్దలివి దోసమన్నచో దిద్దుకొందు
నిట నహంకృతి లేదు నాకించుకయును— "నేను"

తాను 'తప్పులు' చేయని సత్యసంధుడననీ - నిజాయితీపరుడననీ చెప్పలేదు. ఎవరైనా తన దోషాల్ని ఎత్తిచూపిస్తే కృతజ్ఞతా భావంతో సరిదిద్దుకొనే స్వభావమాయనిది. అలాంటి సంఘటన లొకటి రెండు.

"కర్ణుడు" కవితాఖండికలో (శబల కావ్యం) కర్ణునితో శ్రీకృష్ణుడన్నమాటలు పొందుపరచిన పద్యంలో "యుపద్రష్టత్వ" మన్న పదప్రయోగంలోని "దోషాన్ని" కవిగారికాత్మీయ మిత్రులు 'సాహిత్య విద్యాప్రవీణు'డైన యార్లగడ్డ వేంకటసుబ్బారావుగారు "ఇది అచ్చుతప్పేమో" అన్న సంశయాన్ని వెలిబుచ్చుతూ లేఖ రాసాడు కవిగార్కి - భాషమీద, పద్యశిల్పంమీద గట్టిపట్టువున్న వాడు తెనుగులెంక అయినా తెలిసోతెలియకో మానవులై పుట్టిం తర్వాత యెంత పెద్దవాళ్ళయినా తప్పులుచేయడం సహజం, తప్పదు కనుక తనదోషం గ్రహించిన కవిగారు వెంటనే "నాయజ్ఞత హేతువుగా/నీయపశబ్దంబువొడమె "యీనెరసు నొరులపైకినెట్టి పాపంకట్టుకోన"ంటూ తన తప్పునంగీకరిస్తూ యిది అచ్చుతప్పు కాదని జాబు రాసాడు యార్లగడ్డవారికి. తుమ్మలవారు 'గొప్పకవి' తెలుగు భాషపై గట్టిపట్టున్నవాడు. యార్లగడ్డవారు గొప్ప సంస్కృత పండితుడు! నిజానికది తన తప్పైనా, అది అచ్చుతప్పంటే "తాను

తప్పించుకోవచ్చును! తన తప్పును కప్పుపుచ్చుకోవచ్చును. కాని కవిగారలా చేయలేదు. "సత్యనిష్ట సుంతసడలింపనొల్లని వాడనగుట" తప్పు తెలుసుకొని సరిదిద్దుకొన్నానని అంటాడు కవిగారు. ఇక్కడ తెనుగులెంకలోని నిజాయితీ - నిగర్వాదం మనకు ద్యోతకమౌతాయి.

ఇంకో చిన్న సంఘటన. జె. కె. సి. కాలేజీ రిటైర్డు ప్రిన్సిపాలు ఆంగ్ల సాహితీవేత్త అయిన యలవర్తి కోశయ్యగారు మన కవిగారు వాడిన "యశోవంత" మన్న పదదోషాన్ని అచ్చుపొరపాటాయని సందేహిస్తే - "మఱపునంబడి కాదు కాదెఱుక లేక వ్రాసినాడ"నది యని తనతప్పునొప్పుకున్నాడు. తెలుగులెంక కంటే తెలుగుభాషమీద కాని, తెలుగు కవిత్వంమీదగాని 'గట్టిపట్టు' కలవాడు కాదు ఆంగ్ల భాషాకోవిదుడైన కోశయ్యగారు. అయినా "పొరపాటు మానవసహజం" అన్నారు కనుక చేసినతప్పునొప్పుకొని, దానిని సరిదిద్దుకోవడంలోనే యెవరికైనా విజ్ఞత, నిజాయితీ అనిపించుకొంటుంది. మనకవిగారి 'విజ్ఞత, వివేకం, అణకువ, నిరహంకారం కలవాడుకనుక తప్పును 'కప్పిపుచ్చుకొనక' ఒప్పుకొని సరిదిద్దుకొన్నాడు! అదీ తెనుగులెంక నిజాయితీ!

ఒకసారి 'తాను' యుక్తవయస్సులో ఉన్నప్పుడు కనగాలలో కాంగ్రెస్ సదస్సులో మనకవిగారు పద్యాలు చదవటానికి బయలుదేరాడు. భట్టిప్రోలులో రైలుదిగాడు కనగాల నడిచిపోవటానికి. అదే మీటింగుకు వెళ్ళుచున్న ఓ ధనికభూస్వామి గాంధీ ఖద్దరు టోపీవాలా భట్టిప్రోలులో రైలుదిగాడు పెద్ద పెట్టేబేడాతో. కూలివాడు కనిపించలేదు. "నిరాడంబరుడైన" కవిగారు కనిపించాడు. రెండణాలు కూలీయిస్తాను తన సామాను మోయమన్నాడు. సరేనన్నాడు మనకవిగారు కూలివలదు సామాను తెస్తానన్నాడు.

కనకాల చేరారు. కవిగారు సదస్సులో చదివినపద్యాలు విని అందరూ ఆయన్ని అభినందించారు ! ఆ పెద్ద మనిషికి 'కవిగారె' వరో అప్పుడు తెలిసివచ్చింది. కవిగారి దగ్గరకొచ్చి క్షమాపణలు చెప్పుకున్నాడు. 'కవిగారి' వినమ్రత - నిగర్వం మనకిక్కడ తెలుస్తుంది !

మరొక చిన్న సంఘటనగూర్చి తెలుసుకుందాం. (చూడు-నాకథలు గురుడు శిష్యుడామె)

తుమ్మలవారు బాపట్లలో పనిచేస్తున్నప్పుడు సంస్కృత భాషలో శాస్త్ర దిట్టఅయిన 'తెన్గునందునంబేదయగుట" చేత మనకవి దగ్గర తెలుగు నేర్చుకోవటానికి ఒకడుశిష్యుడుగా చేరాడు. తెనుగులెంక 'ఉభయభాషా ప్రవీణు'డైనా కవిగా లబ్ధప్రతిష్ఠుడైనా సంస్కృతభాషపై తానాశించినంత 'గట్టిపట్టు' లేదని ఆయనకు తెలుసు. తనదగ్గర చేరిన విద్యార్థి తనకంటె సంస్కృతంలో శాస్త్ర పట్టుగలవాడని తెనుగులెంక గ్రహించాడు. "ఆతడమర భాషనధి కుండు నాకంటె / వైదుషీబలమ్ము వడసెనందు" అని ఆయనే ఒప్పుకున్నాడు. కనుక ఆ తెలుగురాని శిష్యునిదగ్గర సంస్కృతం బాగారాని గురువుగారు సంస్కృతం నేర్చుకోవడం ప్రారంభించాడు శిష్యుడుగదా అని తెనుగులెంక వెనుకంజవేయలేదు గురువునన్న 'అహంకారం' ఆయనకడ్డు రాలేదు. "దురభిమాన మెన్నడెఱు గనుగాననే / నతనితోడ భాసకృతులుగంటి / జదివినాడ నుపనిష త్తులు రెంటి" నని సగర్వంగా చెప్పుకున్నాడు. అయితే "నా నడత మెచ్చరైరి కడముగురులు" దురదృష్టవశాత్తు సాటి అధ్యాపకులకు తెనుగులెంక చేస్తున్న పని నచ్చలేదు. "ప్రజ్ఞావికాసంబు నిచ్చగించు నతడహంకృతి దూరజీవితము" వలచునుగాని "అధికారము, వయస్సుకాదు" అని అంటూ "పీఠభేదమునరాదు పాండితీ

భేద”మని వారికొక చురకేసాడు బహుశా, బాపట్లలో పనిచేసి నపుడు సంస్కృతం నేర్చుకొన్నది ‘శంకరశాస్త్రి’ అనే శిష్యునివద్ద నేమో !

ఇటువంటిదే మరొకటి— ఓ ఊళ్ళో ఓ ఉన్నత పాఠశాల నూతనభవన ప్రారంభోత్సవానికి రాష్ట్రమంత్రొకరొస్తున్నారు తమరు కీర్తిప్రతిష్ఠలున్న గొప్పకవిగారు కనుక తమరుగూడా తప్పక వచ్చి కవితాశీస్సులందించాలని పాఠశాల తాలూకూ వాళ్ళు తెనుగులెంకను వేడుకున్నారు. అనారోగ్యకారణాలవల్ల తాను రాలేనని నిక్కచ్చిగా చెప్పాడు. నిరాశ చెందిన వాళ్ళు, తెనుగు లెంకనే మరొక మంచికవిగారిని సూచించమన్నారు. ఆయనొక పేరు చెప్పాడు. వాళ్ళు ఆశ్చర్యపోయారు. నీళ్ళునములుతూ “మీ గరిష్టతను సైపజాలని క్రించతంబు / నిక్కమెఱుగని లేకి మానిసి యతండు తక్కిడియతండు పరమకృతఘ్ను”డన్నారు వాళ్ళు. అందుకు తెనుగులెంక “ఎగ్గుచేసిన వానికిలగ్గుసేత / నిక్క మగునీతి యగుసుమీ” అంటూ గోసిని పాపమతనికే వుంటుందని, తనయెడల ‘దుష్ప్రచారం’ చేసే యతనిపట్ల తనకు ‘ద్వేషం’లేదని తేల్చి చెప్పాడు ! ఉపకారికి ఉపకారం చేయడంకన్న అపకారికి నెపమెన్నక ఉపకారం చేయడం గొప్పదనమని సుమతీశతక కారు డన్నాడు గదా ! తుమ్మలవారి ‘సహృదయత; విశాల హృదయత అటువంటిది ! “సైచితిని కృతఘ్ను, సైరించితిని దారి / దప్పినట్టి శిష్యు”నని ఆయన తన క్షమాగుణాన్ని, సహనశీలాన్ని గురించి చెప్పు కున్నాడు.

తెనుగులెంక ‘త్రికరణశుద్ధిగా’ గాంధేయవాది. ఆత్మకథ మహాత్మకథలు వెలయించి ‘గాంధీ’ కవిగా మహాత్ముని ఆస్థానకవిగా లబ్ధప్రతిష్ఠుడైనాడు గదా ! అట్టి గాంధికవి ఒకనాడు సర్వోదయ

కార్యకర్త అయిన వట్టికూటి వేంకటసుబ్బయ్యగారి ఆహ్వానంమీద దొప్పలపూడి పోయాము, గాంధికవి రాసిన ఆత్మకథ - అమర జ్యోతి వినోభాబావే చక్కట్లు వట్టికూటివారిని బాగా ప్రభావితం చేసాయి. సర్వోదయ సిద్ధాంతానుసారం ఆయన వీధుల్ని, మురికి గుంటల్ని - మరుగుదొడ్లను నిత్యం పరిశుభ్రంచేస్తూ 'కర్మయోగి' అయ్యాడు తుమ్మలవారిని చూచి వట్టికూటివారు "రాకరాక మంచి లగ్నంనాటికే వచ్చారని" ఆనందపరవశుడయ్యాడు. తీరాచూస్తే ఆ మరునాడు బాపూజీ నిర్యాణమందిన దినం (గాంధి వర్ధంతి) (30-1-72) ఆ విషయం గాంధికవికంతగా గుర్తులేదు. సుబ్బయ్య గారి మాటలువిని గాంధికవి "అనూనమగు సిగ్గుపాటునందుచు నత్రిశల్ కినుదోయి నురలి జడికొనె !" గాంధీకవియయ్యా గాంధీ వర్ధంతిని గుర్తుంచుకొనలేక పోయినందుకు సిగ్గుపడ్డాను.

తుమ్మలవారి "అమరజ్యోతి" లోని "క్రుళ్ళినయెముకకై..." అనే పద్యం వట్టికూటివారిని "ప్రభావితం" చేసి, ఆయన్ని "సర్వోదయ" కార్యకర్తగా మార్చివేసింది. మరునాడు గాంధివర్ధంతి కనుక వట్టికూటిదంపతులిద్దరు గాంధికవి'గాంధీజీ చిత్రపటానికి పూలుమాల వేసి స్మరించిన పిమ్మట వూళ్ళోని వీధివాడలకు గాంధీకవిని తీసుకొని పోయి, తానునిత్యంచేస్తున్న 'పని' చూపించాడు సర్వోదయకవి... "మిట్టలుత్రవ్వి పల్లాలుపూడ్చి / కేరెడి తుమ్మపీకెల ద్రుంచివైచి/ వంకలు మలచి.... తూములు తొడిగి / దెరవరులేగు రీతిని బాట దిద్ది / అతడు తీర్చిన డొంకల దిలకించినాడ" ఇలా చూచిన తుమ్మలవారు "మాటలు పాటలు మంత్రాలుగాక / చేతలుపూజగా జేసి యీశ్వరుని దర్శించు.... / తనయందు నఖిల భూతమ్ముల గనుచు / నఖిల భూతమ్ములయందు దన్‌గనుచు / స్వపర భేదమ్ము"

జడ్డులేనట్టి మనుజుడితడని" వ్రాతయేల చేతవలయుగాని" అని గాంధికవి "సిగ్గుపాటు" చెందాడు !

తుమ్మలవారు గాంధీకవిగా తన "వ్రాతల"తో మాత్రమే ప్రజల్ని ప్రభావితంచేసి పునీతుడైనాడు. సర్వోదయకార్యకర్తగా వట్టికూటి వేంకటసుబ్బయ్య "వట్టిమాటలు కట్టిపెట్టి / గట్టిమేలు తలపెట్టి" స్వచ్ఛందంగా నిత్యం ప్రజాసేవలో కర్మయోగిగా పునీతుడై తరించి పోతున్నాడు ! కవనయోగికంటే కర్మయోగి, గొప్పవాడే ! అందుకే "మాటలు మంత్రాలుకాదు / చేతలు క్రియలు" ముఖ్య మని గ్రహించి, అంగీకరించి, వట్టికూటినిచూచి "సిగ్గుపాటు" చెంది, సర్వోదయకార్యకర్తను బహుధా ప్రశంసించిన గాంధికవియొక్క 'సహృదయతను, అణకువను, హృదయ విశాలతను అందరూ గుర్తిం చాలి మెచ్చుకోవాలి. తుమ్మలవారి నిగర్వానికి - వినమ్రతకు మరో మంచి వుదాహరణ - 'అభినవతిక్కన' బిరుదును త్యజించటం. "అభినవతిక్కన్న" యను పట్టమునకు / జాలనే, నిది నాకు సైరింప రాని వేగాయె మీాముందు విడిచెదన్ దీని" అని 1960 లో నరసరావుపేటలో జరిగిన తన జయంతిసభలో శ్రీ కాటూరి వారి సమక్షంలో సభాముఖంగా ప్రకటించాడు. కారణం "తిక్కనకు సముండు తిక్కనగాకొండు" లేడుగాన మిాడు ప్రొద్దులందు" అని చెప్పాడు "పొగరు బోసితనము పోవ నేనై లెస్స యరసి "తెనుగు లెంక" "నైతి" నంటాడు. శ్రీ కొల్లా శ్రీకృష్ణారావు తన 'స్వతంత్ర వాణి'లో తుమ్మలవారి పద్యాలు ముద్రించి "కళాప్రపూర్ణ" బిరుదుతగిలిస్తే, అదిచూచి కృష్ణారావుగారికి వుత్తరం (2-7-85) న వ్రాస్తూ "నాపేరుతో కలాప్రపూర్ణ - డాక్టరు మున్నగునవియుంట నన్నలరింపవు. తెనుగులెంక "నాకు నేనిడుకొన్న నిరాడంబర చిహ్నము నాకు ప్రియమని రాసాడు అదీ తెనుగులెంక వినమ్రత.

## పరోపకార దయార్ద్రహృదయం

సంఘసంస్కరణాసక్తితో "అస్పృశ్యతా నివారణము"కై నిరుద్ధభారతం వెలయించినవాడు స్వాతంత్ర్యపిపాసతో ప్రత్యేకాంధ్ర రాష్ట్రసిద్ధికొరకు స్త్రీజనాభ్యుదయంకోసం కవితలల్లినవాడు "బ్రహ్మ సమాజధర్మ" బద్ధుడైన మంగిపూడి వేంకటశర్మ 'అవసానదశలో' పేదరికంతో పక్షపాతరోగపీడితుడై చాలా 'దీనస్థితిలో' హీనస్థితితో బ్రతుకు వెళ్ళబుచ్చాడు. బెజవాడలో ఆయనకు సన్మానంచేసి కొంత ధనసహాయం చేయాలనుకొన్నారు సన్మానకర్తలు అయ్యంకి రాయప్రోలు - కాటూరివంటి ప్రముఖులు శ్రీకారం... శక్తికొలది. తుమ్మల వారుగూడా ఆ సభకెళ్ళాడు. తానూ ఆర్థికసహాయమందించాడు.

మరో సంఘటన. విజయవాడలో వేదాంతకవిని సన్మానించినపుడు తెనుగులెంక వెళ్ళాడు. ఆయనా మాట్లాడాడు. సభలో మాట్లాడిన ఒక 'కవీశానుడు' గూడా పద్యాలేవో చదివాడు- అయితే అతను "చినిగిన దోవతితో మాసిన సాలువతో" నుండం చూచి మనకవిగారి మనస్సు కరిగింది. చాలా "దీనావస్థలో" వున్నాడనుకొని, యింటికివచ్చాక అడగాడికి కొంతడబ్బు పంపాడు. డబ్బుముట్టిన ఆ కవి మీరుపంపిన సొమ్ముతో "గడ్డమెత్తబడినకైవడి యయ్యె" అని వుత్తరం రాసాడు. ఉత్తరంచూచి తెనుగులెంక మరలా మరికొంత డబ్బుపంపాడు. అది అందుకొన్న ఆ కవి "గడ్డ చితికెగాని గాయము మానలేద"ని మరలా నొక వుత్తరం రాసాడు. "దాతనోవి నెఱుగు చాతురిలేని యర్థాతురుండు వెఱ్ఱి" వాడని తలంచి తెనుగులెంక యింకా డబ్బుపంపడం మానుకొన్నాడు నాఘాలలేదుగద కొఱంతలేని మూట తన థాహాతు తనకు తెలుసు!

తనకుమించిన ధర్మం మొదలుచెడ్డ బేరమన్నారుగదా! తుమ్మల వారిక్కడొక మర్మం బయటపెట్టాడు.

నలువదేండ్ల నుండి ననుబిల్చి జగమిడ్డ
యొడమికొన్ని వేలకుండుగాని
దీనికంటె దగ్గదేను నాకంటెను
బక్కవారకిడిన రొక్కమరయ— (నాకథలు)

తన నలభైయేండ్ల సాహితీ జీవితంలో ఉదాత్తభావనాయత్తులైన జను లొసంగిన సమ్మానధనము - "కొన్నివేలు"ంటాయి; అలానే తానుగా, సాటి 'బక్క' కవులకు 'చాటుమాటుగా' దానంగా యిచ్చిన రొక్కం తనకొచ్చినదానికంటె తగ్గదని ఉన్న 'రహస్యం' బయటపెట్టాడు.

ఇచట నాకు లాభమేమందురా నాది
గాని సొమ్ములేనివానికిచ్చి
యొరుల దృష్టికేను నొక "దాత"గా గనం
బడుటయనెడ వినయభరము తోడ (నారథలు)

అదీ అసలు రహస్యం! తానితరులకు దానంచేసిన సొమ్ము తనది కాదనీ, పరులిచ్చినసొమ్మని, దాన్ని తనకంటె బక్కవారికిచ్చి 'దాత' యనిపించుకొంటున్నానని సవినయంగా నిజాయితీగా 'లోగుట్టు' బయల్వెట్టిన నిర్మలహృదయుడు శ్రీ తుమ్మల! ఏదిఏమైనా తుమ్మలవారు గూడా 'బక్క' కవి అయినా, తనకంటె 'బక్క' వారికి పుదారంగా - జాలిగుండెతో "దానా" లిచ్చేవాడు. ఇవ్వక పోతే యెవరేమీ అనేవారు లేరు! అసలలా యిన్వానివారెందరు! శబల కావ్యానికి పీఠికరాస్తూ విశ్వనాథవారు గూడా "ఈకవి పరమ ధర్మూసముద్రుడు. పదిమందికి బెట్టినవాడు పెట్టించెడివాడు, ఈ

మహాగుణము నేటి యితర కవులలో నింకొకరికిలేదన వచ్చును. ఆయన దాత ! ఆయనవన్నియు గుప్తదానములు. ఈ సంగతి లోకమునకు తెలియద"ని బహుదా ప్రశంసించాడు !

ఇంకో సంఘటన — చిన్నతనంలో గొడ్లను కాయటానికి కాపు బిడ్డలతో చిన్నితమ్మన్న కూడా వెళ్ళేవాడు. బాటసారులు నడిచేడొంక బాటలో పోకిరికుర్రాళ్ళు 'గుంటలు' తీసి వాటిపై చెత్త కప్పి బాటసారుల్ని 'సరదాగా' ఏడ్పించేవారు. ఒకనాడు ఓ పేద కాపు మట్టిబుంగలు పొరుగూరిసంతలో కొనుక్కొనివస్తూ 'గుంట' లో బడ్డాడు. మట్టికుండలు పగిలిపోతే ఆ పేదకాపు 'కుయ్యో మొర్రో' యని మొత్తుకొనసాగాడు. చిన్నారితమ్మన్నల మనస్సు కరిగింది. తన "వెండిగొట్టాల మొలత్రాటినుండి / రెండు / బేడలను ద్రెంచి" - పేదకాపువద్దంటున్నా యిచ్చాడు మనకవిగారు. "చేత నైనమేలు సేయవలయుగాని నవుకొనర్పరాదు పరులకెగ్గు" కుందు వారిజూచి కుల్కు"ట తగదని కవిగార బోధ ! "దీనార్థి లోకంబు దిలకించి కన్నీరుజార్చి" అండకుచేర్చిన నారయ్య కుమారుడుగదా మన కవిగారు.

బాపట్లలో ఉపాధ్యాయుడిగానుండగా పెద్ద గాలివానవచ్చి-పంటపొలాల్ని పల్లెల్ని బీడుచేసింది. భావపురి సేవాసంఘమొకటి ఏర్పాటుకాగా అందులో కవిగారు చేరారు. వస్త్రాలు - వాసాలు-వంటసామానులు సేకరించి బాగాదెబ్బదిన్న గ్రామాల్లో తుపాను బాధితులకు ఉచితంతా పంచిపెట్టింది సేవాసంఘం. ఆ సమయంలో పల్లెవాసుల్లో విలయతాండవమాడుతున్న 'అజ్ఞానా'న్ని కన్నులార చూసాడు కవిగారు. బాపట్ల ప్రక్కనున్న ఓకుగ్రామంలో 'అస్పృశ్యత' కార్యక్రమం కవిగారు స్వయంగా చేపట్టాడు. బాపట్లలో 'బడిపని ముగించినంతన' కవిగారు ఆపాలెం నకు వెళ్ళి అక్కడి పిల్ల

లకు చదువు చెప్పాడు. "గల్లిగవ్వయేని చేతిలోలేని వా / రలకు నేన పలక బలపమిచ్చి "పొత్తమిచ్చి" పేదపిల్లలకు చదువుచెప్పాడు. ఆ పల్లెపిల్లలు "చదువను వ్రాయను" నేర్చుకున్నారు! కొంత "లోకజ్ఞానం" సంపాదించుకొన్నారు. కవిగారికి అదియెంతో తృప్తి నిచ్చింది! నాలుగైదేండ్లకు ఆపల్లెకుర్రాళ్ళల్లో అంజయ్య అనే ఒకడు యింకాపైకి చదువుకొని 'స్కూలు టీచరై'న తర్వాత ఒక నాడు తుమ్మలవారి దర్శనం చేసుకొన్నాడు. తాను చదువుచెప్పిన విద్యార్థి ప్రయోజకుడైనందుకు సంతసించాడు గురువుగారు. "నాబంతి నాతడన్నముదిన్న వెనక / రెండుదోవతులు త్తరీయముల్ రెండునతని కొసంగి" పరమానంద భరితుడైనాడు కవిగారు. ఇలా కవిగారిదగ్గర 'చదువు'కొని "బాగు"పడిన వారెందరో మరి! ఉపాధ్యాయునిగా ఆయన దగ్గర చదువుకొన్నవారు "తుదకబ్బిరి నల్గురు మేటిశిష్య లేనోర్చిన తక్కువోవి" అని చెప్పుకున్నాడు స్వయంగా.

అప్పికట్లలో పనిచేస్తున్న సమయంలో మరొక సంఘటన ఊరికి స్కూలుకు కాస్తదూరం! ఆదారివెంట ఆగ్రామవాస్తులు ఉదయాస్తమయసమయాల్లో కాలకృత్యాలు తీర్చుకొనేవారు. దానితో ఆ బాట పెద్ద పాకీబాట (దొడ్డి) గా తయ్యారయ్యింది. ఆ దారిని నడవాలంటేనే పెద్ద కంపు! ముక్కుమూసుకొని నడవవలసివచ్చేది. ఎవరికిచెప్పినా లాభం లేదు! కవిగారు స్వయంగా స్కూలు సమయానికి ముందుగా - పెందలకడ బయలుదేరివెళ్ళి ఆదారి యిరు ప్రక్కల కంపుకొట్టే పెంటకుప్పల్ని తానే స్వయంగా తీసివేసి- ఒక గుంటతీసి అందు నాపెంటనుపూడ్చిపెట్టి - ఆ గ్రామస్థులు ముఖ్యంగా స్త్రీలను ఆ బాటనెంట మలమూత్రాలు విసర్జించవద్దని" వేడుకొన్నాడు. గ్రామస్థులు కవిగారిసేవకు ఆశ్చర్యపడి - కృత

జ్ఞలు తెల్పుకొన్నారు. తాముచేస్తున్న పనికి సిగ్గుపడ్డారు! ఆ బాటవెంట మలమూత్రాలు విసర్జించడం మానివేసారు. గాంధీగారు దక్షిణాఫ్రికాలోను భారతదేశంలోను 'పాకీ' పనిపట్ల ప్రత్యేకశ్రద్ధ చూపేవాడుకదా! "హలమెత్తిన కలమెత్తిన మలమెత్తినవాని" నొక్కటిగా చూడాలనీ, వృత్తిగౌరవం, స్వయంశ్రమ, సర్వోదయ సూత్రాన్ని పాటించాడు కవిగారు.

ఒకనాడు 'గడ్డం' గొరిగించుకొంటానికి మంగలికి కబురు పెట్టాడు మనకవిగారు ఇంతలో ఆయనకు "తెనుగుతీపి" విషయంపై కవితావేశం వచ్చింది. మూడునాల్గు పద్యాలు రాసాడు. అంతలో మంగలి వచ్చాడు. మంగలి కవిగారి "గెడ్డం" గొరగటానికి సిద్ధమయ్యాడు. కవిగారు కవితరాయడం ఆపేసాడు. మంగి కవిగారి గడ్డం సగంగొరిగేసరికి కవిగారికి మరలా 'కవితావేశం' ముప్పేట ఆవహించింది. ఆ వేశాన్ని ఆపుకోలేకపోయాడు. మంగలిని గడ్డం గీయడం ఆపమన్నాడు. కలంపట్టుకొని పద్యాలు రాయడం మొదలెట్టాడు. ఐదు, పదినిముషాలుగాదు - పావుగంట, అరగుంట గూడా కాదు. ఏకబిగిన ఓ గంటసమయంలో నలుబదిపద్యాలు రాసాడు. కవితావేశం తగ్గింది. మంగలిని పిలిచాడు. గడ్డం పూర్తిగా గీయించుకొన్నాడు. మంగలిని 'అనవసరం'గా ఆపుచేసినందుకు కాస్త బాధపడ్డాడు. గడ్డం గీసినందుకు యివ్వవలసింది పావులాయే! "పావులాతగదంచు రూపాయనిచ్చి / తిండిపెట్టించి వానికి తృప్తి" కూర్చాడు తాను సంతృప్తిచెందాడు. ఒక గంట కాలం మంగలిని అనవసరంగా "ఆపి"వుంచడంవల్ల అతగాడు మరొక చోట 'మంగలిపని' ద్వారా వచ్చే 'ఆర్జన' పోగొట్టుకున్నాడుగదా! దానికి కారణం తాను! తనకది 'అధర్మ' మనిపించింది. అందుకే పావులాకు రూపాయినిచ్చి - భోజనంగూడా పెట్టించాడు దయార్ద్ర హృదయుడైన మనకవిగారు! అదీ తెనుగులెంక ఉదారస్వభావం!

# కాలానుగుణ పరివర్తన - హృదయ పరిణత

మున్నుసడిసన్న పెద్దలు
నన్నలతిగ జూడ గినిసినాడను నేడో
పిన్నలు నీచదురే:పని
యన్నను "ముని"నై యొనర్తు నాత్మపరీక్షన్— "నేను"

యుక్తవయస్సులో వుండగా ఆవేశకావేషా "లెవరికైనా సహజం" వేడిరక్తం ఒంట్లో ప్రవహిస్తూవుండడం వలన ! వయస్సు మీరేకొద్దీ, జీవితంలోని 'ఆట్లుపాట్లు' తట్టుకొని - స్వీయానుభవంతో చాలామందిలో పరివర్తన వస్తుంది ! రానివారు గూడా కొందరుంటారనుకోండి. అది వేరేవిషయం ! తుమ్మలవారిలో వయస్సుతోపాటు కాలానుగుణంగా - కస్సుబుస్సుమను స్వభావంలో మార్పురావడం ఆయన్ని తెలిసినవారికి స్పష్టంగా తెలుస్తుంది. జీవితంలోనేకాదు సాహితీ వ్యాసంగవిషయంలోను మనమీ 'మార్పు' ను తెనుగులెంకలో చూస్తాం ! అందుకే ఆయనంటాడు.

గిఱిగీచుకొన్న కవికృతి
చిరకాలము నిల్వదెల్ల సిద్ధాంతములన్
దరియించి విప్లవముదెస
కరిగిన కృతిసత్యదర్శియై రాణించున్

—సర్వోదయగానం

"గిఱి" గీచుకొని కూర్చోకుండా - సమాజంలో వస్తున్న మార్పుల కనుగుణంగా మారుతున్న సిద్ధాంతాలను ఆకళించుకొని శాంతియుత విప్లవమార్గంలో నడవాలంటాడు !

ప్రాతదంతా రోతగాదని, క్రొత్తదంతా 'సుగుణం' కాదని "ప్రాతక్రొత్తల మేలుకలయిక" సమాజానికి మంచిదంటాడు. "యుగలక్షణము గుర్తించిపలయు గావ్యలేఖనమున" తుమ్మల ఆకాంక్ష.

"పద్యంబు సర్వకవితల - హృద్యంబై"-న దని చెప్పిన తెనుగులెంక - కవితాప్రక్రియలలో వచ్చిన "మార్పుల కనుగుణం"గా - ఛందోబద్ధ పద్యప్రక్రియలలోనే కావ్యాలు మొత్తంమీద వెలయించినా - ముత్యాలసరాల ఛందస్సులో, మాత్రాఛందస్సులో, వచనకవితా ప్రక్రియలోను - కవితలు, గేయాలు, మినీకవితలు (ముక్తకాలు) వెలయించాడు. సాంప్రదాయక శాంతియుత గాంధేయ సర్వోదయ సిద్ధాంతాన్ని నమ్మినా- కాలంతోపాటు సమాజంలో వచ్చినమార్పులకు స్పందించి, సంపన్న వర్గాల్ని తెగనాడుటలోను, శ్రామికుల్ని సమర్థించడంలోనుగాంధికవి వెలుబుచ్చినభావాలు అభ్యుదయ కవులకంటే "తీవ్రమైనవి"గా విప్లవాత్మకమైనవని మరొకచోట విపులంగా చర్చించుకున్నాం !

తెనుగులెంక శాంతియుత గాంధేయవాది అయినా మార్క్సిస్టు గతితార్కిక భౌతికవాదాధార భూతమైన 'కమ్యూనిష్టు' సిద్ధాంత ప్రాతిపదిక వేదికపై నిలబడి 'మరోప్రపంచాన్ని' పిలిచిన అభ్యుదయ (విప్లవ) మహాకవి శ్రీ శ్రీని తెనుగులెంక మెచ్చుకొన్నాడు. "దీనశ్రామికలోక వికసనప్రద కవితా విశ్రుతుడై"న మహాకవి"యనీ "నితనికెనయగు కృతికర్తలు లేరు, రారురేపైన నికన్" అంటూ— "నాయుగమిదియని ఢంకా / వాయించి వచించిన విప్లవకవి" అని శ్రీ శ్రీకి 'జేజేలు' పలికారు తుమ్మలవారు.

"రోతరోతగా వలపులునింపి కబ్బములు" వ్రాసే— ఆత్మాశ్రయ భావకవుల్ని పరోక్షంగా ఎత్తిపొడిచిన తెనుగులెంక, భావ

కవితా వైతాళికుడు రాయప్రోలు వారిని మెచ్చుకోవడం విశేషం! "తెనుగుదనమునకును భారతీయతను సమవికాసమ్మొనలసిన సురసుడ"నీ "రమణీయకవిత" సాధుకవిత వెలయించిన 'సహజభావుకతా వైభవసంపన్నుడని" అభినుతించాడు. భావకవితాచక్రవర్తి అయిన దేవులపల్లి వారినిగూడా తెనుగులెంక మెచ్చుకొన్నాడు— "మానవతాఖని" యనీ "తెనుగురవీంద్రు"డనీ "ప్రేయసీత్వమూని యీశ్వరుముందు భక్తుడై నిజార్తిపలికిన "సమత సర్వయోగసారముగా విశ్వసించునట్టి మధురశీలుడ"నీ లెస్సబలికాడు!

తానుఆస్తిక 'గాంధేయవాది' యైనా నిష్కళంక నాస్తిక నాయకుడైన "గోరా"ను "కులమతవర్గ పిశాచావలి కోఱలు నఱికి మానవతకున్ నవతాకవితస్ఫూర్తి చేకూర్చిన బలుమానిసి" అని ప్రస్తుతించాడు. "గ్రామ్యవాదులు నాస్తికుల్ గాంధిసరణి / మెచ్చమనువారుగలరు నామిత్రులందు / నడ్డగించునె సిద్ధాంతమచ్చమైన / ప్రేమగల రెండుగుండెలు బెరసినపుడు" (నేను)— సిద్ధాంతాలు వేరైనా - ప్రేమపూరిత హృదయాలు - నిష్కల్మషమైన మనస్సులిరువురిని సన్నిహితపరుస్తాయి. "ఒక విప్లవసారస్వత / శకమునకున్ కర్తయయ్యె చౌదరి" అంటూ పుక్కిటి పురాణాల్ని దుయ్యబట్టిన హేతువాదరాజు కవిరాజును, అలానే "సాంకుజంకులేక కొమ్మలు దిరిగిన / మేటిదోసమైన జాలెనితడు" అంటూ మూఢాచారాలపై తిరగబడ్డ "నవయుగాలబాట నార్లిమాట"ని మెచ్చుకున్నాడు తుమ్మలవారు.

ఇక తెనుగులెంక జాషువాల మధ్య కొంత 'రభస' జరిగింది! తన కావ్యాలలోని దోషములు 'ససారమ్ము'ల వ్యాకరణపు రంధ్రమ్ముల జూపి పత్రికలకెక్కాడని జాషువా అంటే— "వ్యాకృతి విరుద్ధరూపము లాకృతి గన్పించె బెక్కు"లని తెనుగులెంక అన్నాడు

ఇంతకీ జాషువాకవి తుమ్మలవారి కైతచూచి "చప్పరించా" డన్న వార్తనెవడో ఒక బాపట్ల పౌరునిద్వారా తెనుగులెంక చెవికిసోకి ఆయన 'ఎద చివుక్కు-రు' మనిపించింది ! దానితో తుమ్మలవారు స్వప్నకథలోని 'దోషాల్ని' ఎత్తిచూపుతూ ప్రజామిత్ర పత్రిక కెక్కాడు. ప్రత్యక్షంగా జాషువాకాదుగాని ఆయన పక్షీయులు తుమ్మలవారు చూపిన 'తప్పు'లకు సమాధానమిచ్చారు ! అదృష్ట వశాత్తు ఇద్దరిమధ్య విభేదాలు త్వరలోనే సమసిపోయాయి. దుగ్గిరాలలో ఒక సాహిత్యసభలో యిద్దరూ కలుసుకొని మంచి మిత్రులయ్యారు. సభికులంతా ఆశ్చర్యానందభరితులయ్యారు. ఇంతగా 'ఒకరికొకరు' కీచులాడుకున్న కవులిరువురు ఒకరినొకరు ఏ విధంగా ఛందోబద్ధంగా 'మెచ్చు'కొన్నారో చూస్తే ఆనంద మేస్తుంది.

"నందనవాటికా కుసుమ నవ్యమరంద ఝరీతరంగముల్ చిందగ నీవలెన్ గృతులు వ్రాసినవారులేరనీ నీదు సృష్టికిన్ జావనుమాట లేదు కులశైలములబ్ధులు క్రుంగిపొంగినన్" అని తెనుగులెంక జాషువా కవిత్వాన్ని మెచ్చుకొంటే— జాషువా "ముగ్గురు సత్కు-వుల్ కరగిపోసిన భారత కావ్యసృష్టిలో / నిగ్గును ఘంటికాగ్రమున నిల్పిన చౌదరి తిక్క-యజ్వ !— "ఉత్పన్న మొనర్చినావు రసవత్కృ తులెన్నియొ వంకలేని నీచన్నపథంబులో నడుగుసాగుట దుస్తరమిట్టి నీ కళాభ్యున్నత మెచ్చదగ్గది" యని తెనుగులెంకను లెస్స ప్రశం సించాడు.

ఒకనాడు జాషువా కవిత్వంలోని 'దోషముల' మీద విరు చుకుబడ్డ తుమ్మలవారు జాషువామీద రాసిన పద్యాలు అమూల్య మైనవి. అనన్యసామాన్యమైనవి ! జాషువామీద కవులెందఱో రాసిన కవితల్లో తుమ్మలవారు రాసినవి 'మేలిముత్యాలసి' అందరూ

ఎరిగినదే. దీనినిబట్టి - తుమ్మలవారిలో వచ్చినమార్పు, వారి సౌజన్యం సహృదయత గమనించదగ్గది. "మున్నుసడిసన్న పెద్దలు/ నన్నలతిగ జూడ గినిసినాడ; నేడో / పిన్నలు నీచపు రేమని/ యన్నను మునినై యొనర్తు నాత్మపరీక్షన్" అని వయసుపైబడిన కొద్దీ తనలో "మార్పు" "పరిణత" వచ్చిందని గ్రహించాడు అదీ తెనుగులెంక సహృదయత ! విశాలహృదయం ! అలానే గేయ కవిచక్రవర్తి డా॥ సి. నారాయణరెడ్డి కవితనుగూర్చి "గేయమనుచు రెడ్డి వ్రాయునుగాని ప / ద్యమునకు కుద్దియగుచు తనరునద్ది" అని అభిభాషించాడు !

ఎంత గొప్పకవి అయినా 'సమకాలీనులు' మెచ్చరన్న చేమకూరి వేంకటకవి అన్నమాట తుమ్మలవారి విషయంలో 'తిరగ బడిందన్నమాట సమకాలీనులైన కవులందరినీ మెచ్చుకొనడమేకాదు, భేదాభిప్రాయాలొచ్చిన జాషువా, ఏటుకూరినంటి వారి కవిత్వాన్ని తెగమెచ్చుకొన్న సహృదయుడు.

కవితచెప్పినాడ గనకాభిషేకాది
పరమ గౌరవములు వడసినాడ
నేల కులుకవలయు నీ సిరి జూచి నే
నెవడనో రవంత యెఱుగనైతి "నేను"

కనకాభిషేకాది ఘనసన్మానాలుపొంది గర్వించేవారు ఎంత మందిలేరు ! "ఏల కులుకవలయు నీసిరిజూచి" అనుకొంటాడు. సిరి సంపదలు శాశ్వతంకాదు ! చరాచర జీవకోటితోపాటు తనను సృష్టించిన ఆ 'అఖండ' దివ్యస్వరూపంముందు - యీ సృష్టిలో-తానెంత ! తన ఉనికెంత ! ఎంతటి హృదయ పరిణత !

ముప్పదేండ్లు తెనుగుముక్కలు పదినేర్చి
నాచికొన్న యొజ్జనము దలంచి
పొంగదేల నాకు, భుక్తికిగాక యీ
చదురు ముక్తికెంత సాయపడియె! —"నేను"

ఉభయభాషా ప్రవీణుడై ముప్పైయేండ్లు ఉపాధ్యాయవృత్తి చేసింది తన పొట్టకోసం! తన సంసారపోషణార్థం! ఈ నేర్పు - ముక్తికేమైనా సాయపడుతుందా! లేదని కవిగారిభావన! మరి జీవన్ముక్తికి పనికిరాని యీ చదువుసంధ్యలు వృత్తులు - గొప్పలు - కీర్తిప్రతిష్టలుచూచి ఎందుకు "పొంగి"పోవడం! వయస్సుమళ్ళేసరికి ఎవరికైనా కాస్తంత వేదాంతస్ఫోరణి అలవడుతుంది! హృదయ పరివర్తన - పరిణత వస్తాయి! తుమ్మలవారు కూడా గొప్పకవి కావచ్చు. గొప్ప గాంధేయవాది కావచ్చు! అయినా అందరివంటి మనిషేకదా! కనక యీ వేదాంతచింతన! హృదయపరిణత!

## నిరాడంబరం - నిర్మొహమోటం

తుమ్మలవారు 'త్రికరణశుద్ధి'గా గాంధేయవాదిగా - చాలా నిరాడంబరంగా జీవించేవాడు. ముతకఖద్దరు వస్త్రాలనే ధరించేవాడు. ఇంటిదగ్గరున్నప్పుడు, ముఖ్యంగా పదవీవిరమణ చేసిన తర్వాత - గాంధిగారిలాగా ఒంటిపైచొక్కా తొడుక్కొనేవాడు కాదు పైనొక తువాలు వేసుకొని నేలపై (గుమాస్తా) వ్రాతబల్ల ముందు కూర్చొని కవిత్వం రాసుకొనేవాడు పనిలేకపోతే 'ఈజీ చైర్'లో నడుంవాల్చేవాడు. అర్ధదిగంబరంగా వుండేవాడు.

పొరుగూరికెళ్ళితే - 'దంపుడు బియ్యం' వెంట తీసుకొని పోయేవాడుతన భోజనం నిమిత్తం. వెళ్ళినచోట్లో దిగినఅతిథేయులకా బియ్యమిచ్చి అన్నం వండిపెట్టమనేవాడు. తన సంచిలో కావలసిన

ముతకఖద్దరు దుస్తులు - దుప్పటి శాలువా - ఆత్మకథ - కొన్ని కాగితాలుండేవి. రైలులో వెళ్ళితే మూడవతరగతి (యిప్పటి రెండవతరగతి) పెట్టెలోనే ప్రయాణించేవాడు గాంధిజీని ఆదర్శంగా తీసుకొని

ఒకసారి ఓ ఊళ్ళో పాఠశాల వార్షికోత్సవానికి 'అధ్యక్షత వహించవలసి వచ్చి, రైల్లో వెళ్ళాడు తుమ్మలవారు. స్కూలు తాలూకు ప్రధానోపాధ్యాయుడు తదితరులు రైలుబండి ఆగగానే- వాళ్ళంత తుమ్మలవారికోసం 'మొదటితరగతి' పెట్టె వెతికారు. కవి గారు మూడవతరగతి పెట్టెనుండి దిగి మెల్లగా తన చేతిసంచితో నడిచివస్తున్నాడు వాళ్ళు నివ్వెరపోయారు. "ఇంత వేసటకోర్చి యీ(ముసలి) వయస్సున నిలావత్తురే" యని అంటూ "ఫస్టుక్లాసులో రమ్మన్నాముగదా ఖర్చులు భరిస్తామన్నాంగదా అని బాధవిస్మయం చెందారు. తన 'నియమం' తనదన్నాడు. వయసుకాదు. ఖర్చులు పరాయివాళ్ళు భరించడంకాదు ముఖ్యం. తన నియమం ! ముఖ్యం!

రైలుస్టేషన్‌నుండి ఊళ్ళోకి మనకవిగార్ని ఘనంగా తోడ్కొనిపోవాలని నాలుగైదు జతల యెడ్లబండి రథం సిద్ధంగా వుంచారు. రథమెక్కమని వేడుకొన్నారు. ససేమిరా రథమెక్క నన్నాడు. నడిచేవస్తానన్నాడు. వాళ్ళకు మతిపోయింది ! ఎంత 'ఆర్భాటం' చేసారు పాపం, కవిగారికోసం ! అయితే నాసరస్వతి "నా తపఃఫలమైన" మహాత్మకథ కావ్యం తనకు బదులు రథంపై అమర్చిన కుర్చీలోపెట్టి - వూళ్ళో వీథివీధుల వూరేగింపుగా వాళ్ళతో తాను నడిచివెళ్ళాడు. ఆవూరివారి కదొకవింత ! విచిత్రంగా తోచింది. కవిగారి 'నిరాడంబర' వింతప్రవర్తన వాళ్ళకొక విచిత్రమైన అనుభూతినిచ్చింది.

ఇక సభ ప్రారంభమైంది. ఎవరో కాస్తవచ్చీరాని ఆంగ్లంలో మాట్లాడారు వక్తలందరు మాట్లాడిన పిదప కవిగారి వంతువచ్చింది. 'పరభాష'పై నున్న మోజు పోవాలని, మాతృభాష అంటే ద్వేష మెందుకని "చవులార తెనుగు చదువుడీ! జనకబాలకులార"! అని మంచిగా చివాట్లుపెట్టి చివరలో తాను వ్రాసిన 'మహాత్మకథ లోని పద్యాలుకొన్ని వినిపించారు. సభ అయిపోయింది. భోజనా నికి రమ్మన్నారు కవిగార్ని తన దంపుడుబియ్యం పొట్లాంమిచ్చారు వారికి. అప్పటికే భోజనాలు సిద్ధమైనాయి! చేసేదిలేక, తన బియ్యం ఖర్చుక్రింద "పావులా" వాళ్ళకిచ్చారు వాళ్ళెంత వద్దం టున్నా! "మోమోటపడి ధర్మమును మానుకొంట / నాకు సాధ్యముకాదు నాకింబుకాద'ంటూ తన నిరాడంబరాన్ని, నియ మాన్ని - నిర్మొహమాటంగా చెప్పారు. ఇట్టి ఘట్టాలెన్నో!

## స్త్రీజాతిపట్ల గౌరవభావం

వేదకాలంలో భారతీయులు స్త్రీలకు సమాజంలో సమాన గౌరవస్థానమిచ్చారు. అయితే దరిమిలా పరిస్థితులు తల్లక్రిందు లయ్యాయి స్త్రీ హిందూసమాజంలో 'వంటింటిపాత్ర' అయ్యింది. మరలా పరిస్థితులిప్పుడిప్పుడే మెరుగౌతున్నాయనుకొండి!

తుమ్మలవారు భారతీయ సంస్కృతిపట్ల - సంప్రదాయంపట్ల అమితగౌరవ మున్నవారు. స్త్రీజాతిపట్ల ఆయనకెనలేని గౌరవ భావం. స్త్రీజాతి "సాధుశకు నాశ్రయము" సంయమమ్మునకాకృతి" అని అంటూ "మగవారలెంత చెడినను / మగువలు రక్షించు చుంద్రు మన ధర్మములన్" అని చెప్పబలికారు— ఇందుకు తార్కాణంగా ఆయన జీవితంలో జరిగిన సంఘటనలు ఒకటిరెండు చూస్తాం.

ఒకనాడు శిష్యుడొకరు తన సతీమణితో తుమ్మలవారికి వీధిలో యెదురయ్యారు. కుశలప్రశ్నలడిగిన తర్వాత "యీమె నీతోపాటు మీస్కూల్లో ఉపాధ్యాయినిగా పనిచేస్తున్నదా" అని అడిగాడు శిష్యుడు ఆశ్చర్యపోయాడు— "గురువుగారూ! యీమె నాఅర్థాంగియే! మాగృహంలో మీరెన్నిసార్లు యీమెవడ్డిస్తే భోంచేయలేదు! గుర్తులేదా" అని అన్నాడు. కవిగారు కాస్త తటపటాయించాడు— "యిపుడె కన్నవాడ నీపె మొగము"ంటూ "కూడుకూర పెట్టుకొవచ్చు పాదపుస్నలు చూడగానిమోము" చూసే అలవాటు తనకులేదు కనుక ఆమెను తానువెంటనే పోల్చుకోలేక పోయానని కాస్తబాధ సిగ్గుపడ్డాడు!

ఒకసారి - తుమ్మలవారు బస్సుల్లో ప్రయాణం చేస్తున్నాడు ఒక "తరుణి" కూర్చోటానికి "చోటు"లేక నిలబడియున్నది పాపం! విద్యార్థులైన యిద్దరు యువకులు కూర్చొని ఆమె 'వంక' తదేక దృష్టితో చూస్తున్నారు! తుమ్మలవారామె అవస్థగ్రహించాడు! "ఇంతమంది మగవారిమధ్య ఆడకూతురొక్కతే నుంచోవడం బాగాలేదు బాబు - మీలోఒకరు లేచి ఆమె కూర్చోటానికి సీటివ్వమని మంచిగా చెప్పాడు. ఆ యువకుడు వెంటనే "రుసరుస" లాడుతూ— "ఇతరులకు నీతులు నేర్పే గురువుగారివి గదా! నీవే నిలబడి ఆమెకు సీటివ్వవచ్చుగా" అని వెటకారంగా మాట్లాడాడు! "నేను నిలుచునే శక్తిలేని వయస్సుమీరిన వాడను కనుక నిన్నులేవ మన్నాను". పైగా "యీమె ముసలివాడైన తన ప్రక్కనకూర్చుండు టకు ఇష్టపడునుగాని కుర్రవాళ్ళప్రక్క కూర్చుండుట సమంజమా" అని కవిగారు ఆ యువకునికి చిన్న చురకంటించాడు. ఆ యువకుడు 'చప్పున' లేచాడు. ఆ విద్యార్థిని పిలిచి తనప్రక్కన కూర్చొబెట్టు కున్నాడు కవిగారు. కవిగారి సంక్రాంతికవితలు బాగున్నాయం టూ మెచ్చుకొందామె! కవిగారికి ఆనందం వేసింది! స్త్రీలను గౌర వించాలన్నది తెనుగులెంక ఆకాంక్ష!

## కావ్యాల ముద్రణ - కావ్యాంకిత ప్రత్యేకత

తన కావ్యాలు తానే స్వంతఖర్చులతో - చిన్నవిగాని- పెద్దవిగాని అచ్చువేయించుకొని - తనకునచ్చిన 'గుణగరిష్టులకు' అంకితం యివ్వడం తెనుగులెంకకు మహాయిష్టం ! అదొక 'కఠోర' నియమం! ఆయన తన కావ్యాలేవీ 'దైవానికి' అంకితం యివ్వలేదు. అన్నీ 'నరాంకితా'లే ! ఆర్థికంగా "స్థితిపరుడు" కాకపోయినా- కుటుంబం పెద్దదైనా - "బడిపంతులు" ఉద్యోగమేఅయినా, తన కావ్యాలను "అంకితం" తీసుకోమని, వారివీరిచుట్టూ "దేబిరికొట్టు" మొగంపెట్టుకొని - పరులపంచలచేరి యాచింతలేదు ! మొట్టమొదటి సారిగా ఆత్మకథ అచ్చువేయించటానికి 'మూడెకరాల మాగాణి' అమ్ముకొన్నాడు.

"సుగుణసంపన్నులైన" వారిని ఆయనే యెన్నుకొని - కావ్య మచ్చువేసి - కావ్యం ఆ 'కృతిపతి'కి పంపగా - ఆ 'అల్లుడు' తనకు "కృతమెఱుక" పఱిస్తే చాల ఎంతో సంతోషించేవాడు ! అల్ప సంతోషి !

కృతమెఱుకచాలు నస్మ
న్మతి కింపద కబ్బమిచ్చి మణిగొంట; జగ
ద్ధిత శీలుండొదవ నయా
చితమ్ముగా నిడుదు నాసృజించిన కవితన్ (నాకథలు)

అదీ ఆయన నియమం ! ఆయన సరదా ! ప్రీతికరం !

స్వంతఖర్చుతో కావ్యం అచ్చువేయించడం - కృతిపతిని తానే ఎంచుకోవడం - అంకితం యివ్వడం అన్నీ ఆయన స్వీయనిర్ణ యాలే. అంతవరకు బాగానేవుంది ! కృతిపతులు 'కృతజ్ఞత'

తెలుపుతూనే - కొంతసొమ్ము "యివ్వజూపితే" దానిని తిరస్కరించడం ఆయనకొక సరదా ! ఛాదస్తం ! కృతిపతులనుండి "పైసా" తీసుకోకూడదన్న "కఠోరనియమ" మాయనిది ! అదే తుమ్మల వారి కావ్యాంకిత ప్రత్యేకత ! విశిష్టత ! విలక్షణమైనదిన్నూ ! పేదవాడైవుండీ పైసాఆశింపక పోవడమే తుమ్మలవారి విశిష్ట వ్యక్తిత్వం ఋజువౌతున్నది. మనకది ఛాదస్తమనిపిస్తుంది !

రచనల ముద్రణ - కావ్యాంకిత విశిష్టతగూర్చి — మరో 'అధ్యాయంలో విపులంగా చర్చించడం జరిగింది ! ఇంకో రహస్యమేమంటే "చక్కట్లు" "దివ్యజ్యోతి" - ఖండకావ్యాలు కృతిపతుల నెన్నుకొని అంకితపద్యాలు రాసుకున్నాడు తుమ్మలవారు. అంతలో అస్వస్థులైనారు. అసువులు బాసారు. వారి కుమారులు ముఖ్యంగా శ్రీనివాసమూర్తి - ఆ రెండుకావ్యాల్ని స్వంతఖర్చులతో అచ్చువేయించి - సభలేర్పాటుచేసి- కావ్యాంకితాలు చేసాడు తనచేతుల మీదుగా ! తండ్రికితగిన తనయుడనిపించాడు ! చక్కట్లు కృతిపతి పొన్నూరులో ప్రముఖవైద్యుడు 'ప్రసాదు'గారి తండ్రి ఆర్థిక స్తోమత బాగావున్నవాళ్ళు. డబ్బిస్తామన్నా తుమ్మలవారి కుమారులు తిరస్కరించారు ! దివ్యజ్యోతి కృతిపతి - అంతకుముందే 'స్వర్గస్థులైనాడు ! అయినా 'కృతిపతి' సుతునికి కృతికర్తసుతుడు"అంకితం" ఇచ్చి తుమ్మలవారి "కఠోరనియతి" పాలించాడు!

## దినచర్య - అలవాట్లు

మానసా, వాచా, కర్మణా, 'గాంధేయవాది' అయిన గాంధికవిగూడా గాంధీజీ "దినచర్య" వలె క్రమపద్ధతిగా - క్రమశిక్షణతో - నియమబద్ధంగా వుండేది. గాంధీజీవలె తుమ్మలవారుగూడా "దినచర్య" (డైరీ) రాసుకొనేవాడు. రాత్రిపూట భోజనం

ముగించాక డైరీరాసుకొనేవాడు - ఆరోజు చేసిన పనులగురించి క్లుప్తంగా - ఆరోజు వచ్చిపోయిన మిత్రులు కవిపండితుల, వివరాలు, వ్రాసిన వుత్తరాలు (యెవరికో) గురించి - యెవరినుండి (ముఖ్యలు) వచ్చిన వుత్తరాలగురించి. అలానే ఏరోజు 'జమాఖర్చులు' ఆరోజే అదీ సాయంత్రం రాసుకొనేవాడు. ఏ "విశేషమూ" లేనినాడు- తారీఖు వేసి ఒక "గీత" (డేష్) గొట్టి వదలిపెట్టేవాడు! గ్రామాంతరం వెళ్ళినపుడు తన దినచర్య విడికాగితాలమీద 'నోటు' (రాసు) చేసుకొని, యింటికివచ్చాక తన డైరీలో దాన్ని రాసుకొనేవాడు!

వ్రాయవలయు లెక్కవచ్చినపోయిన
రూకకును సదా పరాకు లేక
పాణపుణ్యములను బ్రకటించునది, యథ
మర్థతా విపత్తి మాన్పనేర్పు— —ఎక్కట్లు

'జమాకర్చులు' పాపపుణ్యాల్ని తెలియజేస్తాయట! వృథాఖర్చును (దుబారా) 'అదుపుచేయటానికి తోడ్పడుతుంది! పొదుపుచేసుకొంటానికి వీలవుతుంది!

ఏ రోజు వచ్చిన ఉత్తరాలకు ఆరోజే లేదా మరుసటిదినం తప్పనిసరిగా సమాధానం రాసేవాడు. తాను పోస్టాఫీసుకు స్వయంగా వెళ్ళేవాడు. రోజూ సాయంత్రం వీలునుబట్టి - కదురుమీద నూలు వడికేవాడు! అభిప్రాయాలు రాయమని పంపినవారి కృతుల్ని ఓపిగ్గా చదివి- సరిదిద్ది అవసరమైతే పరిష్కరించి తన అభిప్రాయాలు రాసిపంపేవాడు. తన అచ్చయిన కృతుల్ని, ముఖ్యమైన మిత్రులకు, శ్రేయాభిలాషులైన పెద్దలకు (ఫ్రీగా) పోస్టుద్వారా పంపేవాడు! ఉచితంగా - బహుమానంగా! ఒక కావ్యం అచ్చు అయినపుడు అయిన ఖర్చుమొత్తం తేల్చి, లాభదృష్టిలేకుండా,

కేవలం ఖర్చులు తేలేటంతవరకే లెక్కగట్టి "గిట్టుబాటు" ధర (అణాలు - దమ్మిడీలు - పైసాలొచ్చినాసరే) మాత్రమే కావ్యం వెలగాపెట్టేవాడు–

కవితారచనకు వేళాపాళా ఉండేదికాదు. "కవితావేశం" ఎప్పుడువస్తే అప్పుడు - అర్థరాత్రి అయినాసరే - లేచి గ్రుడ్డిబుడ్డి (కిరోసిన్) దీపంముందు కూర్చొని (కరెంటులేని రోజుల్లో) కాగితం కలం పుచ్చుకొని పద్యరచన చేసేవాడు— "కవితావేశం" ఆగిపోయేంతవరకు ! కవితావేశంలో పద్యరచన చేస్తున్నప్పుడు ఎవరొచ్చినా - ఎంతపిలిచినా' పట్టించుకొనేవాడు కాదు ! వినిపించుకొనేవాడు కాదు ! బహుశా ! యిది అందరి కవులకు వర్తిస్తుంది ! "మనంరమ్మంటే వచ్చేదికాదు. ఆగమంటే ఆగేదికాదు. వచ్చినపుడు కాగితంమీద పెట్టకపోతే - తర్వాత ఆ 'భావం' ఆ పద్యధోరణి మరలాగుర్తుకురావు. వాగ్దేవి ప్రసన్నమై కవితావేశం వచ్చినపుడే కాగితంపైపెట్టాలి." అని అంటుండేవాడట కుటుంబ సభ్యులతో - "యిదేమిటి - యీ అర్థరాత్రిపూట - "నిద్రానిర్వాణం" లేకుండా కవిత్వం రాసుకోటానికి ఒక వేళాపాళా అంటూ వుండదా" అని కుటుంబసభ్యులంటూంటే ! పద్యరచన చేయనపుడు తీరికదొరికితే ప్రాచీనకావ్యాలు తిరగేస్తూండేవాడు ! తెనుగులెంకకు మంచి జ్ఞాపకశక్తి - మంచి ధారణవుండేవి ! భారతంలోని పద్యాలు వందలువేలు, ఎప్పుడెవరడిగినా, చదివి వినిపించేవాడు ! అవసానదశలో అనారోగ్యంతో మంచానపడినప్పుడు కూడా - అడిగిన పద్యం టక్కున వినిపించేవాడు. ముఖ్యంగా తిక్కన పద్యాలు!

ఉపాధ్యాయునిగా పనిచేసిన రోజుల్లో "చిరుతిండి" అలవాటుండేదని ఆయనే చెప్పుకొన్నాడు. ఇంట్లోనేకాదు ! బయట కూడా చిరుతిళ్ళుకొని తినేఅలవాటుండేది. గాంధీజీకి 'వేరుశనగ

పప్పు' అంటే మహాయిష్టం కదా ! కవిగారు గుంటూరుజిల్లా వాడుకదా ! పైగా పల్లెటూరి రైతుకుటుంబంలో పుట్టినవాడు కదా ! ఆయనకు 'గోంగూర' అంటే మహాప్రాణం! "కొసరికొసరి యింత గోంగూర తిననిచో / నేమిమెతుకు, వానిదేమి బ్రతుకు" అంటాడు. గోంగూర వంటకంలేని 'భోజనం' ఆయనకు భోజనమే కాదట ! గోంగూరతినని వాడిబ్రతుకు బ్రతుకే కాదంటాడు మన రైతుకవి. "చిన్నప్పుడే నొక్క గోంగూరన్ గుండెడు కూడు మెక్కితి" "నెతాగోతాలతో దూకితిన్" అని సగర్వంగా చెప్పు కొన్నాడు. మంచి వయస్సులో వున్నప్పుడు - కుప్పనూర్పిళ్ళ కాలంలో ఒక్క గోంగూరతోనే కుండెడు కూడుతిని - ధాన్యం బస్తాలు ఎత్తుకొని పరుగులు తీసేవాడట ! అయితే "వింగడించు నాకు గోంగూరముద్దయు / బంతకించి శూలయెంతచేసె" అని "మహాయిష్టమైన" గోంగూర "మితిమీరితింటే - "పరిణామశూల" రోగమొచ్చింది.

తుమ్మలవారికి ఒకేఒక 'దురలవాటుం'డేది ! అది ముక్కు పొడుం పీల్చడం ! "నాచిత్తము దుర్బలమై నీచ వ్యసనంబు ననస్యమునకు లొంగినాడి"నని ఆయనే స్వయంగా చెప్పుకున్నాడు. ఈ వ్యసనం ఆయన్ని 'నల్వదేడులు' పట్టుకొని వదలలేదు ! దాని కోసం 'సిగ్గువిడిచి తోలుత జేతులు' సాచాడు ! పిదప 'సంచికట్టు' వెంటపెట్టుకున్నాడు. గంటకుకాదు. అరగంటకుకాదు, పావు గంటకుకాదు. "నిమేషానకొక్కసారి రేగేది" ఆయనకీ ముక్కు తీట ! "పొడుముగాదిది చదువుల పొలతిమేన.... గంధపుపూత" అని ప్రశంసించేవాడు నస్యాన్నిగూర్చి "అన్నము దినుచున్ బీల్చా డట" ముక్కుపొడుం ! చివరకు "ఉవిదలేని సెజ్జనోర్చితిగాని నస్యంబులేని సెజ్జసైపనైతి" నని సిగ్గువిడిచి తనకున్న 'మాచెడ్డ అల

వాటు గురించి' చెప్పుకున్నాడు. దానినిబట్టి నస్యం దురభ్యాసం నిప్పువంటి గాంధికవికెంతటి వ్యసనమయ్యిందో మనం అర్థం చేసుకో వచ్చు. బజారు పొడుం 'చచ్చుదని' గాంధీకవిగారే నస్యాన్ని స్వయంగా తయారుచేసుకొనేవాడట, కావలసిన మేలిముడిసరుకులు కొనితెచ్చుకొని. "రానురాను బొడుము రాయిడిహెచ్చి" తన 'ముక్కు-మొగము' రోతగా తయారయ్యాయట! "మాటతేట సెడియె-" మడుపుల సొగసెల్ల జాటిపోయె. జూపు సన్నగిల్లిందట! ఒకనాడు దంతధావనం చేసుకొనే 'శుభ' గడియల్లో ఆయనకు 'జ్ఞానోదయ'మైనది! "నల్లమందు చుట్ట నస్యము సిగరెట్టు / మరిగి బాగుపడ్డ మనిషికలడె" అన్న "తెలివిడి" వచ్చింది.

ఉన్నపొడుము రాల్చి మన్నుపాలొనరించి
పగులగొట్టి బుఱ్ఱపొఱవైచి
ముక్కులోని కుదకమెక్కించి యెక్కించి
చీదిచీది శౌచసిద్ధికంటి— (పైరపంట - ఒక గెలుపు)

నస్యం దుర్వ్యసనం పీడావిరగడ అయిందనుకొని సంతోషించాడు. పొడుం పేరెత్తితేనే ఒళ్ళుకంపరం! "అరిషడ్వర్గాల్ని" జయించినంతటి "గెలుపది" ఆయనకు! తుమ్మలవారికి "కస్సుబుస్సుమనే" క్షణభంగురమైన చిరుకోపముండేది! "గంటకైదుసార్లు కస్సని బుస్సని / వాడివేడి చూపువాడనేను/ నాప్రశంసలీపె నాచికొన్నది" అని తన అర్థాంగి అన్నపూర్ణమ్మపై "కస్సుబుస్సుమనడం" ఆయనే చెప్పుకున్నాడు. ఈ "బిఱ్ఱూబుఱ్ఱూ" తన బిడ్డలమీద, యితరుల మీదగూడా వుండేది! అయితే అది క్షణకాలం! తన నియమనిష్టలు తెలిసీ, తన కిబ్బందికరమైన "పనిని చేయమన్నప్పుడే ఆయన "కస్సుబుస్సు"మని చిరాకుపడేవాడు, విసుగుచెందేవాడు—

## కృతజ్ఞతా భావం

తన్నుకన్న తల్లిదండ్రులను, తన్నింతకవిగా చేసిన దైవాన్ని, గురుదేవుల్ని, తన్నాదరించిన తెలుగుప్రజల్ని 'కృతజ్ఞతా' భావంతో తెనుగులెంక స్మరించుకొన్నాడు. కృతజ్ఞతలు తెలుపుకొన్నాడు.

"ఎవ్వనికొల్వు భద్రములకెల్ల నిదానము.... నెవ్వడు సర్వలోకములనేలు.... ఆద్యుడై యెవ్వడెసంగు సత్యమున నెవ్వడువాని భజింతు నిచ్చలున్" అని 'సత్యస్వరూపడైన' దేవుణ్ణి ముందుగా స్మరించాడు. అలానే "సకల స్థావర జంగమాత్మక జగచ్చక్రంబునన్ నిండి".... "నిర్వికల్పకమై నిల్చు నఖండతత్త్వమును సంభావింతు శుద్ధుండనై" అని చరాచరజీవకోటిలో జీవాత్మగా వెలుగొందుచున్న అఖండ నిర్వికల్ప "పరబ్రహ్మ" తత్త్వాన్ని సంభావించాడు !

కాసుకొఱకు నేను గైతపల్కను బ్రజా<br>
సేవకర్థిమై వచింతుగాని<br>
సాగనిమ్ము దీని సైపుము నాపంత<br>
మీవు హార్దనిధివిగావె దేవ ! —కదంబకైత

పైసాకోసంకాక ప్రజాహితార్థం కవిత్వం రాస్తున్నానని, తన ప్రయత్నాన్ని కొనసాగనిమ్మని దైవాన్ని వేడుకొంటున్నాడు.

భావమైనను బలుకైన బలుకులోని<br>
చేవమైనను జెలువైన దావియైన<br>
కవికి నీకృపచేతన కలుగుగాన<br>
నిడెద వాగేశ్వరీ ! నీకు నేటి కోళ్ళు —ఎక్కట్లు

కవిత్వానికి రెండుకన్నులైన 'భావార్థాలు' వాగ్దేవి కృపవల్లనే సంప్రాప్తమౌతాయి కనుక వాగీశ్వరికి "ఏటికోళ్ళు" పలుకుతున్నాడు "భావతార్చకులందునన్ బంతిచివర / వానిగా నుంచి నను దృష్టివడెదనంబ" అని వినయపూర్వకంగా వేడుకొంటున్నాడు.

"మాతకు నాపితకు మన్నమస్యలు దీర్తున్" అని కన్నవారిని స్మరించుకొంటాడు తెనుగులెంక ! "అఖిల కళ్యాణఖనికి / భారత సవిత్రికర్థనై ప్రాంజలింతు" నని భారతమాతను స్మరించాడు. "ఆదరింప గదమ్మ నిన్నాశ్రయించి / యంజలి ఘటించుచున్నాడ నాంధ్రజనని" తెలుగుతల్లిని అంజలి ఘటిస్తున్నాడు.

అలతి వలతి చదువులందించి నాకాంధ్ర
శారదాసపర్య సలుపు భాగ్య
మావహించినట్టి యాచార్యులకు గృత
జ్ఞత వెలార్తునతులు నుతులొనర్తు— **నాకథలు**

చదువులుచెప్పి - తాను కవిగా యెదిగి శారదాదేవికి సేవలు చేయటానికి కారణభూతులైన "గురుదేవులందరికీ" నతులునుతులు తెల్పుతున్నాడు—

అంటుసొంటులేని యందాలు కొలవోని
మాటనేర్చ మాట కోటువడని
బ్రతుకునోంచ కృతులుపల్కిన యానాటి
నేటికవులకెల్ల నేటికోళ్ళ **—మహాత్మకథ - కృత్యాది**

ప్రాచీన - అర్వాచీన కవులందరినీ - పేరుపేరున స్మరించాడు తెనుగులెంక కృతజ్ఞతాభావంతో - ముఖ్యంగా తిక్కన్నను చిన్నయసూరన్నను.

నను దిద్దెను నను మెచ్చెను
నను ప్రాణమువోలె జూచె నా వైభవమే
తన వైభవమని పొగెంను
దెనుగు జగంబీఋణమ్ము దీర్పంగలనా ! "నేను"

తనను వైయక్తికంగా - సాహిత్యపరంగా తీర్చిదిద్ది - మెచ్చి - తన సాహితీవైభవ ప్రాభవాలకు నీరాజనాలందించిన "తెలుగు సాహితీ లోకానికి (తెలుగు కవిపండితులు - తెలుగు సాహితీప్రియులు - తన ఆత్మీయాభిమానులు) తాను 'ఋణ' పడియున్నానని ఆ 'ఋణం' తీర్చలేనిదని తన మనస్సులోని మాట హృదయపూర్వకంగా - సవినయంగా చెప్పాడు. "ఎందరో సజ్జనులు బుధులింతయంత నేర్ప లెక్కకు వచ్చితి నేను నేటి"కని సవినయంగా కృతజ్ఞతాభావంతో అన్నాడు. ఆత్మకథ ఘూర్తికావ్యం ముద్రించిన సందర్భంగా (26-1-51 భారత రిపబ్లిక్ పర్వదినం) — "ముప్పదియేండ్ల నుండి తృణమో కణమో తినుచున్నవాడ నో / యప్ప ! భవద్వచో విభవ; మన్యుడెఱుంగకపోవుగాక, యీయప్పు భరింపరాని బరువై నినునచ్చపు తెన్గుబాస నీ / చొప్పున దీర్చుకొందు ఋణ శుద్ధికి" అని గాంధీకవి గాంధీనుద్దేశించి చెప్పుకున్నాడు ఆత్మకథ మొదటిభాగం రెండుదశాబ్దాలకు పూర్వమే అచ్చు అయ్యింది. తెనుగులెంకకు కీర్తి తెచ్చిపెట్టింది. గాంధీకవి అన్నారందరు. మహాత్ముని ఆస్థానకవి అన్నాడు కట్టమంచివారు. తుమ్మలవారి కవితలకు కావ్యాలకు గిరాకి యేర్పడ్డది. అభినవతిక్కనకు - కనకాభిషేకాది ఘనసన్మానాలు జరిగాయి. ఇదంతా గాంధీజీచలవే ! అందుకే ఋణపడ్డానంటాడు.

తన సాహితీజీవితంలో తన కవిత్వాన్ని మెచ్చుకొన్నవారికి తనకు చిన్నవిగాని - పెద్దవిగాని - సన్మానాలు చేసినవారికి - పేరు

పేరున కృతజ్ఞతలు చెప్పాడు. వారు తనకన్న పెద్దవారుకానీ-పిన్నలుగాని ఆయన కృతజ్ఞతాభావంతో ఉత్తరాలు రాసేవాడు. 'అర్హత'ను బట్టి వ్రాసిన కృతజ్ఞతా పద్యాలు తన కావ్యాలలో పొందుపరిచాడు.

అలానే తన సాహితీ వ్యాసంగకృషిలో ప్రత్యక్షంగానో పరోక్షంగానో తనకు సాయపడిన - తనను ప్రభావితంచేసిన-ప్రాచీనకవులందరినీ - ఆధునిక కవులందరినీ - సమకాలీనంగా-తనకు 'మాటామంతీ' చేదోడువాదోడుగావున్న కవిపండితులను కృతజ్ఞతాభావంతో పేరుపేరున సంస్మరించుకొన్నాడు. ప్రత్యక్ష పరమాచార్యుల్ని - పరోక్షగురువుల్ని సంస్మరించాడు. చివరకు తనకునచ్చిన "శిష్యుల్ని" పిన్నల్నికూడా మెచ్చుకొన్నాడు. అదే తుమ్మలవారి సహృదయత - ప్రత్యేకత !

పరిణామశూల 'వ్యాధి'కి 'వరిఅన్నం' మాని 'గోధుమన్నం' తినమన్నాడు వైద్యుడు. గోధుమలకు 'కటకట'గా వున్నకాలమిది. అయితే మిత్రులద్వారా గుంటూరులోని మద్ది వేంకటసుబ్బారాయుడు మాధవరెడ్డి రాజయ్య అనే వానిచేత తనకుపంపిన గోధుమలపై "కృతమోలుక" కవితాఖండిక (పరిగపంట) లో అరవై పైబడిన పద్యాలు రాసాడంటే కవిగారి 'కృతజ్ఞతా' భావం తెలుస్తుంది.

## నియమబద్ధ వ్యక్తిత్వం - కవిత్వం

తుమ్మలవారితోను, వారి సాహిత్యంతోను సన్నిహితపరిచయం ఉన్నవారికిగాని, లేదా యీగ్రంథం ఆమూలాగ్రంగా శ్రద్ధగా చదివినవారికిగాని, తుమ్మలవారి జీవితానికి - ఆయన సాహిత్యానికి "విడదీయరాని" అవినాభావసంబంధమున్నట్లు గ్రహిస్తారు ఒక

విధంగా చెప్పాలంటే తుమ్మలవారి జీవితమే తుమ్మలవారి సాహిత్య మౌతుందని అనుకున్నా సరిపోతుంది—

"కల్లకసటులేని" "నాగలిదున్ను" రైతు కుటుంబంలో "నిత్య సత్యాలాపనియతి" గల నారయ - "గుణభద్ర" చెంచమాంబలకు గారాబు బిడ్డముగాపుట్టి "నీతి, ధర్మనిరతి" ఉగ్గుబాలతో - పుణికి పుచ్చుకొని గురుదేవుల క్రమశిక్షణలో సత్యనిష్టాగరిష్టుడైన గాంధీజీ వ్యక్తిత్వంచేత "ప్రభావితు"డై తన జీవితాన్ని తన వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దుకొన్నాడు. గాంధీ వ్యక్తిత్వానికి - గాంధేయ సర్వోదయ సిద్ధాంతానికి తెలుగు సాహిత్యంలో జీవంపోసి "గాంధికవితకు" శాశ్వతస్థానం కల్పించాడు. సమకాలీనంగా జాతీయస్థాయిలో గాంధీనాయకత్వాన మహోజ్జ్వలంగాసాగిన (స్వాతంత్ర్య) జాతీయో ద్యమంలో క్రియాశీల కార్యకర్తగా పాల్గొని కవిగా బాపూజీ ఆత్మకథ - మహాత్మకథ సర్వోదయగానంలను తీర్చిదిద్దాడు. అదే సమయంలో రాష్ట్రస్థాయిలో సాగిన ప్రత్యేక రాష్ట్రోద్యమానికి 'ప్రభావితుడై' రాష్ట్రగానం - ఉదయగానం చేసాడు.

రైతు కుటుంబంలోపుట్టి సేద్యంచేసి పంటలు పండించి రైతు కవిగా "వరినాటు" వేసి "పైరపంట" పండించి "పఱిగపంట" నేటి కమ్మని సంక్రాంతి తలుపులు తెలిపి, రైతు జీవితంలోని కష్టసుఖాల్ని అక్షరబద్ధం చేసాడు.

ఉపాధ్యాయుడిగా పిల్లలకు విద్యాబుద్ధులునేర్పి దారితప్పిన మానవసమాజానికి 'తెనుగునీతి' 'గీతాదర్శం' సందేశసప్తశతి- ఎక్కట్లు, చిక్కట్లు ప్రబోధించాడు.

ఈ విధంగా తుమ్మలవారి జీవితం - జీవితాశయాలు ఆయన సాహిత్యంలో ప్రతిబింబిస్తే - తుమ్మలవారి కవితలు - కృతులు

సమకాలీన జీవన - స్థితిగతులకు సామాజిక రుగ్మతలకు 'ప్రతీక' లయ్యాయి. అలానే తుమ్మలవారి సత్యనిష్ట ధర్మనియమబద్ధమైన విశిష్ట వ్యక్తిత్వం ఆయన జీవితానికి "మణిభూషణమైనది. "భాషా విపర్యయమ్ము సైపని" నిర్దుష్ట సంప్రదాయబద్ధమైన - కమనీయ తేటతెనుగు నుడికారపుసొంపులో తొణికిసలాడే తుమ్మలవారి హృద్యంగమైన ఛందోబద్ధ పద్యకవిత్వం - ఆయన సాహిత్యానికి శిరోభూషణమైనది.

నైయక్తికంగా 'సత్యనిష్ట నాకుసాజమై'నట్లుగా - సాహిత్య పరంగా "సాధుశీలమాభిజాత్యమ్ము చెలువమ్ము / ననసి మెఱయు వనిత నాదుకవిత /" అని తుమ్మలవారే స్వయంగా చెప్పుకోవడం బట్టి తుమ్మలవారి ధర్మబద్ధ వ్యక్తిత్వం ఆయన సాహిత్యానికి జీవ కర్ర అయినది. అంటే సత్యధర్మ నియమబద్ధమైన తుమ్మలవారి జీవితం - వ్యక్తిత్వం- సంప్రదాయబద్ధ, సిద్ధాంతబద్ధ, ఛందోబద్ధమైన ఆయన కవిత్వానికి - సాహిత్యానికి నిలువుటద్దాలయ్యాయి.

తుమ్మలవారి జీవితం - వ్యక్తిత్వం - క్రమశిక్షణకు - నిజాయితీకి "కట్టుబడి" యున్నట్లు - ఆయన సాహిత్యం - కవిత్వం- గాంధేయ సర్వోదయ జీవనమార్గానికి - నైతికపునరుజ్జీవనానికి- లోకసేవనానికి - సామాజిక కల్యాణానికి — "అంకిత"మైపోయాయి! తుమ్మలవారి జీవితం గాంధేయ సిద్ధాంతానికి అంకితమైపోతే-ఆయన కవిత్వం ఛందోబద్ధ పద్యకవిత్వానికి 'కట్టుబడి' పోయింది. ఇలా మొత్తంమీద తుమ్మలవారి జీవితం - సాహిత్యం - వ్యక్తిత్వం- కవిత్వం పరిశీలించిచూస్తే - తుమ్మలవారిలో ఒక "కమిట్‌మెంటు" (Commitment) ఒక "నియమబద్ధత" ఉన్నట్లు - ఆయన వైయక్తికంగా నిజాయితీకి - కవిగా గాంధేయ సర్వోదయమార్గానికి అంకితమైపోయి "కమిటెడ్ పొయట్" (Commitied Poet) గా

తనకుతాను స్పష్టంగా ఆవిష్కరించుకొన్నాడు - మనకలా స్పష్టంగా సాక్షాత్కరిస్తాడు.

అలాగే వైయక్తికంగా తుమ్మలవారిలోగాని - ఆయన కవిత్వంలోగాని నిరాశావాదం విధ్వంసక విప్లవధోరణి - హింసావాదం - సంకుచితత్వం స్వార్థం - "కలికం" వేసినా మనకు కనిపించదు. ఆయన యెంతటి సత్యధర్మనియతి గలవాడైనా - సంప్రదాయబద్ధుడైనా "యుగలక్షణ" మెరిగికాలానుగుణమైన సామాజిక "మార్పు" లకు స్పందించి – "సంపన్నవర్గాల స్వార్థాన్ని దోపిడీధోరణిని మంచిగా నిరసించి - కష్టించే నిరుపేదవర్గాలకు సానుభూతి తెలిపి, ఆపేదవర్గాలు "చిచ్చుఅకన్ను" విప్పకముందే మంచిగా మనస్సు మార్చుకొని - హృదయపరివర్తన చెంది - "దారి"కి రమ్మని సంపన్నులకు శాంతియుత సామాజికవిప్లవం ప్రబోధించిన - సాంఘిక సంస్కర్తగా – శాంతిదూతగా చైతన్యమూర్తిగా ఆశావాదిగా.– అభ్యుదయవాదిగా – మనకు గోచరిస్తాడు. శాంతియుత భావ విప్లవకవిగా సూటిగా చెప్పేధైర్యశాలిగా ఆవిష్కరిస్తాడు.

మొత్తంమీద తుమ్మలవారి జీవితం సాహిత్యం పరిశీలించి- ఆయన సాహిత్యం అధ్యయనం చేసినట్లైన - కనీసం నాయీగ్రంథం ఆసాంతం శ్రద్ధగా చదివినట్లైతే తుమ్మలవారు నిజాయితీపరుడుగా- సత్యనిష్ట ధర్మనియతిగల విశిష్టవ్యక్తిగా - ప్రగతిశీలకుడిగా సంప్రదాయవాదిగా – భారతీయ సంస్కృతి సంరక్షకుడిగా – నవసమ సమాజ నిర్మాణకాంక్ష బద్ధుడుగా – సామాజిక శ్రేయస్సు– విశ్వమానవకల్యాణం ఆకాంక్షించే మానవతామూర్తిగా - "బహుజన

హితాయ బహుజన సుఖాయ” సర్వేజనాసుఖినోభవంతు” ఆశించే నవయుగకవిగా – సమతామానవతామూర్తిగా మాతృభాషాభిమానమున్న “అచ్చమైన పదహారణాల” తెనుగుకవిగా - కల్లకపటు లేని రైతుకవిగా - మూర్తీభవించిన శుద్ధగాంధీకవిగా – సర్వోదయ కవిగా - తిరుగులేని జాతీయకవిగా - సంస్కారవంతుడైన భారతీయుడిగా మనకు “బహుముఖంగా” ప్రశాంతచిత్తుడై - నిర్మలహృదయుడై - నిష్కపటమనస్కుడై - నిరాడంబరజీవిగా మనకు సాక్షాత్కరిస్తాడు. ఆయన కవిత్వం - ఆయన సాహిత్యం పరిశీలించినచో తేటతెలుగు ఉట్టిపడే ”ఛందోబద్ధ పద్యాత్మకంగాను - ఆనందదాయకంగాను - సందేశాత్మకంగాను - అభ్యుదయకరంగాను సంప్రదాయబద్ధ సిద్ధాంతబద్ధంగాను ప్రత్యక్షమౌతుంది !

ఈ సందర్భంగా “తన కవితాసందేశంలో ప్రతిబింబించే సత్యాహింసలు నిరాడంబరత్వం - ఖద్దరు ధారణ - ఇంద్రియ సంయమనం విశేషంగా ఆయన (తెనుగులెంక) జీవితంలో ప్రతిబింబిస్తూ ఉంటాయ”న్న పండిత చిన్నము రామయ్యగారి మాటలు, “అతడు మూర్తీభవించిన ఆంధ్రత్వము. అతడు రూపుదాల్చిన భారతీయత అతడు పుంజీభవించిన విశ్వమానవ సౌభ్రాత్రము. అతడు ఆకారములో ఆంధ్రుడు. ధర్మములో భారతీయుడు. భాసములో విశ్వమానవుడు. అతడు సర్మసంరక్షణార్థము కవిత లల్లిన ఋషితుల్యుడని” లెస్సపలికిన గొల్లపూడి ప్రకాశరావుగారి పలుకులు గుర్తుకు తెచ్చుకోవడం సముచితం !

## సన్మానాలు - బిరుదులు

కవిగా నిలదొక్కుంటున్న తొలి దినాల్లోనే "బాలకవి" "ఆశుకవీంద్ర" 'అవధానపండిత' 'సరస కవి శేఖర' వంటి బిరుదు లెన్నో తుమ్మలవారికి లభించాయి.

ఆత్మకథ తొలుపాలు ప్రచురించిన తర్వాత 1939 లో నెల్లూరులోని వర్ధమాన సమాజపక్షాన శ్రీ తిక్కవరపు రామిరెడ్డి ప్రభుతులు ఆనాటి ఆంధ్రవిశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారి అధ్యక్షతన జరిగిన సాహితీ సభలో తుమ్మలవారికి "అభినవతిక్కన" బిరుదు ప్రదానంచేసి ఘనంగా సన్మానించారు. 1942 లో అప్పికట్లలో చల్లపల్లిరాజా వారికి కుప్పుస్వామిగారి అధ్యక్షతన - (ఇనగంటి వెంకటప్పయ్య, కుప్పా వేంకటసుబ్బారావు, ఆచంటి బుచ్చిరాయుడు ప్రభుతులు సాయంతో) తుమ్మలవారు రాష్ట్రగానమంకిత మిచ్చి సన్మానమందిరి!

1949 లో పొన్నూరులో శ్రీయుతులు వెలువోలు సీతా రామయ్య - తుమ్మల కోటయ్య - ఉప్పల నాగయ్య శరణు రామ స్వామిచౌదరి ప్రభుతులు పూనుకొని శ్రీయుతులు విశ్వనాథ-పింగళి కాటూరి - దేవులపల్లివంటి కవుల సమక్షంలో - చల్లపల్లి రాజావారు - జాగర్లమూడి కుప్పుస్వామిగారు - ఆచార్య రంగా గారు ప్రభుతులు మద్రాసు (ఉమ్మడి రాష్ట్ర)మంత్రి సీతారామిరెడ్డి ముఖ్యఅతిథిగా - పాల్గొన్నసభలో తుమ్మలవారికి "గజారోహణ-సువర్ణహస్తకంకణ - గండపెండేర - కనకాభిషేక" ఘనంగా సన్మానం చేసారు.)

1969 లో ఆంధ్రవిశ్వవిద్యాలయంవారు - శ్రీ యల్. బుల్లయ్యగారు ఉపాధ్యక్షులుగా నున్నతరుణంలో తుమ్మలవారికి "కళాప్రపూర్ణ" గౌరవడాక్టరేటు పురస్కారమిచ్చి సన్మానించారు.

1984 లో మద్రాసులో ఎల్. వి. రామయ్య చారిటీస్‌వారు జస్టిస్ చల్లా కొండయ్యగారి అధ్యక్షతన ఘనంగా సన్మానించారు. 1985 లో విశాఖపట్నంలో శ్రీ ఎం. వి. వి. యస్. మూర్తిగారు శ్రీ రంధి సోమరాజుగారి ప్రోత్సాహంతో ప్రస్తుతం మూర్తిగారు ఎం. పి. ఆనాటి "లోకాయుక్త' జస్టిస్ ఆవుల సాంబశివరావుగారి అధ్యక్షతన తుమ్మలవారి "సహస్రపూర్ణ చంద్రదర్శనోత్సవం" ఘనంగా జరిపించి సన్మానించారు. విజయనగర పూర్వప్రభువులు శ్రీ పి.వి.జి. రాజుగారు ఆంధ్రా నాగార్జునవర్శిటీల ఉపాధ్యక్షులు శ్రీ కె.రామకృష్ణారావు, శ్రీయుతులు కె. ఆరార్ మోహనరావుగార్ల సమక్షంలో శ్రీ మూర్తిగారు ఆంధ్ర, నాగార్జునవిశ్వవిద్యాలయాలలో తుమ్మలవారి పేర 20,000/- కీర్తినిధి "యేర్పాటుచేసారు". 1986 లో బెజవాడలో ప్రముఖవైద్యుడు డా॥ పిన్నమనేని వేంకటేశ్వరరావుగారు - నాగళ్ళ గురుప్రసాదరావుగారి ప్రమేయంతో తుమ్మలవారిని ఘనంగా సన్మానించారు. 1987 లో గుంటూరులో శ్రీనాథపీఠంవారి ఆధ్వర్యంలో జరిగిన 'తిక్కన' "జయంతి ఉత్సవాల సందర్భంగా - డా॥ సి. నారాయణరెడ్డిగారి అధ్యక్షతన - ఎల్. వి. ఆర్. క్లబ్బువారు- శ్రీయుతులు బొల్లేపల్లి సత్యనారాయణ - డా॥ కొండబోలు బసవపున్నయ్య ప్రభృతులు "అభినవ" తిక్కన శ్రీ తుమ్మలవారికి ఘనంగా సన్మానించారు.

1952 లో ఉప్పల నాగయ్యగారు ప్రారంభించిన తుమ్మలవారి 'జయంతిసభలు' ఏటేట ఎక్కడో ఒకచోట తప్పక - (తర్వాత తుమ్మలవారి ప్రియశిష్యుడు శ్రీ కాకరపర్తి పూనుకొని) తెలుగు

నాటక నాల్గు చెఱగుల (1990 లో తుమ్మలవారు మరణాంతరం గూడా) జరుపుతూ వుండడం విశేషం !

## ఆత్మీయులు

తుమ్మలవారికి వైయక్తికంగాను - సాహితీపరంగాను - ఆత్మీయులు సన్నిహితులు ఆచార్య రంగాగారివంటి అగ్రశ్రేణి దేశ నాయకులు, శ్రీయుతులు విశ్వనాథ, కాటూరి, మధునాపంతులు గారలవంటి సమకాలీన అగ్రశ్రేణి కవిపండితులెందరో వున్నారు. అయితే తుమ్మలవారికి జీవితంలోను, ఆయన సాహిత్యంతోను 'సన్నిహిత' సంబంధబాంధవ్యాలు గలిగిన ఆత్మీయులైన సహచరులు, స్నేహితులు, అనుయాయులు, శిష్యులు అభిమానులు 'సామాన్య' లెందరెందరో వున్నారు. ఈ సామాన్యులందరూ తుమ్మలవారి విశిష్టవ్యక్తిత్వంవల్లనో లేదా ఆయన సాహిత్యం వల్లనో "ప్రభావితులై"నవారు. అట్టివారిలో తుమ్మలవారి కత్యంతసన్నిహితులైన ఆత్మీయులైన వారిగురించి రెండుమూడు మాటలు చెప్పుకోవడం సముచితంగా వుంటుంది !

అలా ముందుగా చెప్పుకోవలసినవాడు శ్రీ వట్టికూటి వేంకటసుబ్బయ్య. స్వగ్రామంలోని హైస్కూలు స్థాపనకై తన ఆస్తిలో అధికభాగం దానంచేసిన వదాన్యుడాయన. తుమ్మలవారి గాంధేయసాహిత్యం - ఆయన విశిష్టవ్యక్తిత్వం వట్టికూటి వారిని బాగా ప్రభావితం చేసింది. ముఖ్యంగా తుమ్మలవారి 'అమర జ్యోతి'లోని "క్రుళ్ళిన యెముకకై..." అనే పద్యం వట్టికూటివారి జీవనసరళిలో పెద్దమార్పు తెచ్చింది. "త్రెళ్ళజేసెనంట క్రుళ్ళిన యెముకకై / యనెడు పద్యమితని యవగడముల" అని కవిగారే "నేను"లో చెప్పాడు ఆ పద్య "ప్రభావంతో" "కదలె భూదాన

కర్తగా గ్రామసేవ / మరగి మలమెత్తు మనిషిగా మనసుపండి, "(నేను" తుమ్మలవారి మాటలో) ఆనాటినుండి వట్టికూటివారు ఆస్తిపరుడైవుండీ— "అర్థదిగంబరం"గా అతినిరాడంబరంగా - స్వచ్ఛందంగా "పార - పలుగు భుజానపెట్టుకొని - వీధులవెంట తిరుగుతూ- మురికిగుంటలు పూడుస్తూ - వీధులప్రక్కన పెంటకుప్పల నెత్తివేస్తూ దారిప్రక్కన ముళ్ళపొదల్ని తొలగిస్తూ నిజమైన "సర్వోదయ" కార్యకర్తగా "త్రికరణశుద్ధి"గా ప్రజాసేవలో తరించిపోతున్న ధన్యజీవి శ్రీ వట్టికూటివారు. తుమ్మలవారి మరణించిననాడు ఆయన దేహానికి జరిగిన "దహన" కార్యక్రమానికి అందరితోపాటు వట్టికూటివారున్నూ శ్మశానానికి వెళ్ళి - ఆ 'దారి' ఆ శ్మశానస్థలం 'ముండ్లపొదలతో పిచ్చిమొక్కలతో నిండియుండుట చూచి- మరునాడు తానా 'దారి'లో ఆ శ్మశానం' లో నున్న ముళ్ళ పొదల్ని - పిచ్చిమొక్కల్ని తొలగించి ఆ ప్రదేశమంతా 'బాగు' చేసాడు. అదీ వట్టికూటివారి నిష్కామకర్మయోగ సర్వోదయ జీవన విధానం !

శిష్ట్లా రాజశేఖరం సత్యనారాయణ తుమ్మలవారికి అత్యంత ఆత్మీయుడు. శిష్టసనాతన బ్రాహ్మణ కుటుంబంలో పుట్టినా- గాంధీజీ - గాంధికవి ప్రభావంతో - తన కుమార్తెను విద్యావంతుడైన ఓ 'హరిజనునకిచ్చి అర్థశతాబ్దానికి పూర్వమే "కులాంతర" వివాహం జరిపించి సాటికులస్థుల 'వెలి'కి బలియైన ఆదర్శఅభ్యుదయ సంస్కారవంతుడు శ్రీ రాజశేఖరంగారు. బాపట్ల ఎప్పుడువెళ్ళినా శిష్ట్లా వారింటిలోనే తుమ్మలవారి మకాం. "హరిజనునకు గన్నియనిడి / నరదేయ చరిత్రుడైన వసుధామరశే / ఖరులో విశ్వప్రియశా / ర్వరిలో కస్తూరి మగని సందర్శింతున్" (చకట్లు)

అంటూ గాంధీకవి "రాజశేఖరులో గాంధీని దర్శిస్తున్నానని" లెస్స బలికాడు.

శ్రీ దాసరి సోమయ్యగారు మరొకరు తుమ్మలవారి కిష్టుడు. ఆయన పెద్దకమ్యూనిష్టు. తుమ్మలవారు గాంధేయవాది. ఇద్దరి మధ్య సైద్ధాంతిక వైరుధ్యం. తుమ్మలవారికి శిష్యుడై తర్వాత 'ఉపాధ్యాయవృత్తి స్వీకరించాడు. తుమ్మలవారి 'శబల' ఖండ కావ్యం వెలువరించిన సమయంలో సోమయ్యగారికి కుమార్తె కలిగింది. ఆమెకు 'శబల' పేరు పెట్టాడు. సోమయ్యగారిపై తుమ్మల 'మాస్టారి' ప్రభావమెట్టిదో దీనినిబట్టి గ్రహించవచ్చు.

యాజలి గ్రామకాపురస్థుడు ఓ గేటి'పశుపతి'గారుశుద్ధసనాతన శిష్టాచార బ్రాహ్మణ సంపన్నకుటుంబంలో జన్మించినా - తుమ్మల వారితో కలిసి 'కావూరి వినయాశ్రమం'లో జాతీయస్ఫూర్తితో గాంధేయాశయాలకు అంకితమైపనిచేసిన ఆదర్శమూర్తి శ్రీపశుపతి. ఇద్దరూ 'అన్నదమ్ముళ్ళ'గా "శరీరాలు వేరైనా - మనసులొకటిగా మసలినవారు. యాజలి తరచూవెళ్ళి బాల్యమిత్రునింట మకాం పెట్టి "గతమధురస్మృతులు - సాహిత్యచర్చలు చేస్తూ పశుపతి గారితో ఒకటిరెండురోజులు' హాయిగా సరదాగాగడపడం తుమ్మల వారికి ప్రీతిపాత్రం. "హాలముదున్ని పొట్టపోరణగించును / కలము పట్టి దివ్యకవిత వ్రాయు చలముపూని చిత్తజయమందు" లాతిగాడి తండు పోతరాజె" అని పశుపతిగార్ని ప్రస్తుతించాడు.

అలానే కవిగారి ప్రియమైన శిష్యుడుగా చదువుకొని - కవి గారి ప్రమేయంతోనే నరసాయపాలెం హైస్కూల్లో కొంతకాలం పనిచేసి - ప్రస్తుతం జీవితభీమా ఉద్యోగి శ్రీ కాకరపర్తి తుమ్మల వారికి పుత్రసమానుడు. తన చేతులమీదుగా తుమ్మలవారికెన్నో ఘనసన్మానాలు జరిపించి - ప్రతిసంవత్సరం 'బీటు' పోకుండగా

తుమ్మలవారి జయంతిసభలు గత మూడుదశాబ్దాలుపైగా జరిపిస్తున్న తుమ్మలవారి 'వీరాభిమాన' శిష్యుడు. ముడిపై ముడివేయడితం/ డొడగూడిన కల్మికొంతయొసగును వెతలన్ / సుడివడువారికి అని శిష్యుని మెచ్చుకొన్నాడు.

ఇంకా— 1) తుమ్మలవారికి సమీపబంధువు - సాహితీవేత్త "సాహిత్యవిమర్శకామాళి" తుమ్మలవారి సాహిత్యాన్ని 'ఔపోసనం' పట్టినవాడు - తుమ్మలవారి సాహిత్యంపై 'సాధికారికంగా గంటలతరబడి అనర్గళంగా ఉపన్యసించగల శ్రీ నాగళ్ళగురుప్రసాదరావుగారు (విజయవాడ సిద్ధార్థడిగ్రీకళాశాలలో వైస్‌ప్రిన్సిపాల్‌గా పనిచేసాడు) 2) కవిగారితోపాటు ఉపాధ్యాయుడిగా నిడుబ్రోలులో పనిచేసిన 'సాహిత్య విద్యాప్రవీణ' సంస్కృత పండితుడు- 'కాకతీయ తరంగిణి' మొదలగు కావ్యాలు వెలయించిన కవి ఆదర్శరైతు - శ్రీ యార్లగడ్డ వేంకటసుబ్బారావుగారు ("ధృతిదాదృత వీడడహంతకింతయున్ మక్కువచూపని విబుధమాళి) 3) తెనుగులెంకకాప్తుడు నిడుబ్రోలు సంస్కృత కళాశాలలో పనిచేసిన కొండవీటి వేంకటకవి- "విప్లవాత్మకరచనా ప్రవీణుడు) 4) కవిగారితో కలిసి నిడుబ్రోలులో తెలుగుపండితుడుగా పనిచేసిన సాహితీవేత్త - కవి శ్రీ చిన్నము రామయ్యచౌదరి 5) తుమ్మలవారి సాహిత్యాన్ని లోతుగా అవలోడించిన నిడుబ్రోలు పి. బి. యన్ కళాశాల తెలుగు భాషాధిపతిగా పనిచేసిన - కవిపండిత విమర్శకుడు బహుగ్రంథకర్త- మంచివక్త శ్రీ తాళ్ళూరి సత్యనారాయణగారు 6) తెనుగులెంకకు శిష్యుడై తర్వాత నరసరావుపేటలో 'వేంకటేశ్వర ట్యుటోరియల్' కాలేజి వ్యవస్థాపక ప్రిన్సిపాలు, కవి - శ్రీ తోటకూర వేంకటేశ్వర్లు 7) సాహితీప్రియుడు కవి - పలుచోట్ల ఉన్నతపాఠశాలల్లో ప్రధానోపాధ్యాయునిగా పనిచేసిన శ్రీ పెద్ది సత్యనారాయణగారు

8) జాషువా ఏటుకూరివారలకు ప్రియశిష్యుడైనా- తుమ్మలవారితో సాన్నిహిత్యంకలిగి తాను నడుపుతున్న "స్వతంత్రవాణి" వార పత్రికలో తుమ్మలవారి పద్యాలువేసిన కొల్లా శ్రీకృష్ణారావు 9) తుమ్మలవారి శిష్యుడు - రైతుకవి పల్నాటి గామాలపాడు నివాసి శ్రీ చిట్టిప్రోలు కృష్ణమూర్తి 10) తుమ్మలవారి గాంధేయసాహిత్యం పట్ల మిూదుమిక్కిలి తుమ్మలవారి విశిష్ట వ్యక్తిత్వంపట్ల ఆకర్షితుడైన - వృత్తిరీత్యా ఉన్నత ప్రభుత్వోద్యోగం చేసినా - ప్రవృత్తి రీత్యా కవి - రచయిత విమర్శకుడు "అమూల్యశ్రీ" శ్రీ జె. అమ్మలయ్య (యీ గ్రంథరచయిత.)

11) ఇంకా కన్నతండ్రి అడుగుజాడల్లో - నిరాడంబరంగా నిజాయితీగా జీవిస్తూ - కవిగారి సాహిత్యాన్ని వర్గీకరించి - యుగ కవిత - యుగకవి - వంటి పలురచనలు వెలువరించిన - ప్రస్తుతం నిడుబ్రోలు పి.బి.యన్. కాలేజి ప్రిన్సిపాలుగా పనిచేస్తున్న శ్రీ టి. శ్రీనివాసమూర్తి 12) కవిగారి చిన్నకుమారుడు వృత్తిరీత్యా వైద్యుడైనా - సాహితీప్రియుడు శ్రీ టి. రఘునాథరాయలు 13) పశువైద్యుడైన (వెటర్నరీ డాక్టరు) - సాహితీవిమర్శకుడు ప్రత్యేకించి తుమ్మలవారి సాహిత్యంపై పలుపరిశోధక వ్యాసాలు వెలువరించిన డా॥ సూర్యదేవర సూర్యకుమార్ 14) తుమ్మలవారి సభ ఫలానచోట జరుగుతుందన్న వార్తవిని - పిలవకపోయినా, ముదిమిని, అనారోగ్యాన్ని సైతం లెక్కించక - సభలకు హాజరై- సభానిర్వాహకుల్ని మరీమరీ అడిగి- వేదికనెక్కి-- తెలుగులెంక 'రాష్ట్ర గానం'లోని "అయ్యరు గూడకట్టు మనకక్క-అయో" వంటి పద్యాల్ని వినిపించే జాషువా వీరాభిమాని - రేపల్లె జూనియర్ కాలేజి ప్రిన్సిపాలుగా పనిచేసిన శ్రీ గద్దె వీరరాఘవయ్య 15) కవి - తెలుగు హిందీపండిట్ శ్రీ జొద్దులూరి నారాయణరావు.

వీరంతా ప్రతి సంవత్సరం, తుమ్మలవారి జయంతిసభ యెక్కడజరిగినా తప్పక హాజరయ్యే తుమ్మలవారికి ఆత్మీయులు. ఏ సాహితీసభలోనో - ఏ యితర శుభకార్యక్రమాలలోనో - ఎప్పుడైనా - ఎక్కడైనా - వీరంతా లేదా వీరిలోకొందరు కలుసుకోవడం జరిగితే—— తుమ్మలవారి సాహిత్యంపై ముఖ్యంగా తుమ్మలవారి విశిష్ట "వ్యక్తిత్వం" అలవాట్లు.విచిత్ర వింతసంఘటనలు-ముఖ్యంగా కవిగారికీస్నీ తమకు సంబంధించినవి - వింతవింత "కథలు కథలు"గా చెప్పుకొని - ఆనందించడం పరిపాటి !

వీరంతా ఉద్యోగస్థులైనా - ఉపాధ్యాయులైనా - సేద్యం చేసుకొంటున్నా — కొన్ని ఆదర్శాలతో - నిరాడంబరంగా జీవిస్తున్నవారే ! వీరంతా తెనుగులెంకకు 'ఆత్మీయులైనారంటే' 'వంకర' బుద్ధులు లేనివారనే వేరే చెప్పనక్కరలేదు. "మంచి నడవడి" లేనివారిని తుమ్మలవారు దగ్గరకు రానీయరని వేరేచెప్పనక్కరలేదు. అట్టివారు తుమ్మలవారిని సమీపించలేరు గూడా. వీరంతా తుమ్మలవారికి ఆత్మీయులైనారంటే—— వీరికి తుమ్మలవారి సాహిత్యంతోపాటు వారి "విశిష్టవ్యక్తిత్వం" చేత "ఆకర్షింపబడిన" వారనీ - తుమ్మలవారి వ్యక్తిత్వమంతటి 'ఉన్నతమైనది - విశిష్టమైనదనీ చెప్పటానికే వీరి ప్రస్తావన తేవడం జరిగింది.

ఇంకా - యిలా తుమ్మలవారి సాహిత్యంచేత - వ్యక్తిత్వం చేత "ప్రభావితులైన" వారు మరెందరో ! సత్యనిష్ఠ ధర్మనిరతి గల్గి క్రమశిక్షణగల్గిన 'ఉపాధ్యాయుడుగా ఆయన దగ్గర చదువుకొన్నవారు గురువుగారి విశిష్టవ్యక్తిత్వ ప్రభావంతో 'గురువుగారు' నడచిన 'ఒరవడి'లో సన్మార్గంలో జీవిస్తూ తమ జీవితాల్ని మలచుకొన్నవారు - తీర్చిదిద్దుకొన్నవారు - కొనేవారు మరెందరో.

# తుమ్మలవారి ఆశయం - సందేశం

"కళకళకొఱకే" అన్నది నిన్నటిపాట. 'కళ మనిషి వైయక్తిక జీవిత వికసనానికి - సామాజిక వికాసానికి తోడ్పడాలన్నది నేటి మేటిమాట. ఆనందంతోపాటు సందేశాన్ని యివ్వాలన్నీ - జీవితానికి - సమాజానికి కళ తోడ్పడాలనీ నేడందఱూ అంగీకరించిన విషయం. సాహిత్యవిషయంలో కనుకనే 'సామాజిక' స్పృహ వుండాలనీ అభ్యుదయవాదుల శంఖారావం !

శ్రీ తుమ్మలవారు 'యుగలక్షణ' మెరిగి మసలుకొన్నవాడు కనుక "కళకొఱకే కవిత్వమని గంతులు" వేయలేదు. "నైతికపునరుజ్జీవన / జాతీయవికాస విశ్వజనతా శ్రేయః ప్రేతమా" తాను కవిత్వం రాసానని స్వయంగా చెప్పుకున్నాడు. అలానే తుమ్మలవారి 'రాష్ట్రగానం' ప్రత్యేకాంధ్ర రాష్ట్రోద్యమానికి స్ఫూర్తినిచ్చింది. ఆత్మకథ 'తెలుగువారిలో గాంధేయవాదస్ఫూర్తికి - జాతీయోద్యమస్ఫూర్తికి దోహదకారి అయ్యింది.

తుమ్మలవారి సాహిత్యాన్ని అధ్యయనం చేసినవారికి ఆయన ఆశయమేమిటో సందేశమేమిటో స్పష్టంగా కన్పడుతుంది— 1) ఆంధ్రాభిమానం 2) గాంధేయ సర్వోదయ జీవనవిధానం 3) మనిషి వైయక్తిక ఋజువర్తనం ఈ మూడు (3) లక్షణాలు-లక్ష్యాలు తుమ్మలవారి సాహిత్యంలో 'త్రిమూర్త్యాత్మకం'గా 'త్రివేణీసంగమం'గా వెలుగొందుతున్నాయి. మరి కాస్త వివరించి చెప్పాలంటే తుమ్మలవారి సాహిత్యం— 1) ఆంధ్రత్వం 2) వైయక్తిక ఋజువర్తనం 3) జాతీయవికాసం 4) సామాజిక శ్రేయస్సు 5) విశ్వమానవ కల్యాణం— యీ ఐదు (5) లక్ష

ణాలు - లక్ష్యాలతో "పంచప్రాణాలు"గా పరిఢవిల్లుతోంది. ఈ ఐదు లక్షణాలు - మనమీగ్రంథంలో చెప్పుకున్నా ఒకసారి సంక్షిప్తంగా గుర్తుచేసుకొందాం.

**1)** ఆంధ్రత్వం— అంటే - ఆంధ్రభాషాభిమానం ఆంధ్ర భావం దేశాభిమానం - ఆంధ్ర సంస్కృతిపట్ల గౌరవ భావం - ఆంధ్ర సంస్కృతి పరిరక్షణకు ప్రతి ఆంధ్రుడు తనవంతుతాను కృషి చేయడం !

ఆంధ్రుడవై జన్మించితి
వాంధ్రుడవై యనుభవింపు మా యుర్విభవం
బాంధ్రుడవై మరణింపుము
ఆంధ్రత్వములేని బ్రతుకునాసింపకుమీ —రాష్ట్రగానం

అదీ ! తుమ్మలవారి ఆశయం సందేశం. ఆంధ్రుడై పుట్టినవాడు 'ఆంధ్రుడు'గానే జీవించాలనీ - 'ఆంధ్రుడు'గానే మరణించాలంటాడు. "ఆంధ్రత్వం" లేనిబ్రతుకు ఆంధ్రుడనేవాడు ఆసింపకూడదంటాడు. తుమ్మలవారు తాను చెప్పినట్లుగానే "ఆంధ్రుడి"గా పుట్టినవాడు - ఆంధ్రుడిగా జీవించి-ఆంధ్రుడిగానే మరణించాడు కవిత్వంలోగూడా "తెలుగుపాలె"క్కువ వుండేటట్లు రాసాడు. కనుకనే "అభినవతిక్కన" సమ్మాన్యుడు తెలుగువాడుగా పుట్టినందుకు గర్వించాడు - తన పూర్వజన్మ సుకృతమనుకొన్నాడు. తెలుగువారినందఱూ తెలుగువారిగానే బ్రతకాలని తెనుగులెంక ఆకాంక్ష-సందేశం. ఈ విషయం "రాష్ట్ర (గాన) కవిగా" అధ్యాయంలో విపులంగా చర్చించుకున్నాం. తెనుగులెంక రాసిన 'రాష్ట్రగానం-ఉదయగానం కావ్యాలు చూడవచ్చు.

**2)** జాతీయ వికాసం— తెలుగువాడుగా పుట్టినవాడు తెలుగువాడిగా బ్రతకాలని నొక్కిచెప్పినా - "మాతృమహీగౌరవ

ములు, మానవునకు ప్రాణమ్ము" లనీ— మన కాంధ్రత్వము ప్రాణము / తనువుసుమీ భారతీయ ధర్మమ"నీ "దేశభాషకు దోడు జాతీయభాష / యాంధ్రతకు దోడు / భారతీయత్వముం" డాలని నిక్కచ్చిగా చెప్పాడు. "హైందవులు - ముస్లిములు సిక్కులన్నదమ్ములట్లు జీవించా"లని అంటాడు. "మాతృదేశం" దేవుడితో సమానమని- "సుందర భారతదేశం / బందఅకున్ గుడి" మహాతీర్థమనీ" లెస్స బలికాడు. ఈ విషయం "జాతీయకవి" అధ్యాయంలో చూడొచ్చు.

**3) సామాజిక శ్రేయస్సు**— తుమ్మలవారి దృష్టిలో "గాంధేయ సర్వోదయ జీవనవిధానమంటే "అందరికోసం ఒకరు, ఒకరికోసం అందరు "సమాజంలోని వారందరూ కలిసికట్టుగా శ్రమించాలనీ, సుఖజీవనం శాంతియుత సహజీవనం చేయాలనీ వృత్తిగౌరవం సమశ్రమగౌరవం ప్రతివారు పాటించాలని తెనుగులెంక నొక్కిచెపుతాడు. "కులమతవర్గ భేదములుండకూడదనీ - సంఘంలో హెచ్చుతగ్గులు - ఉచ్చనీచభావములుండకూడదని తెనుగులెంక పదే పదే నొక్కిచెబుతాడు "సామాజికకల్యాణం కామించెద నవ్యభవ్య కవితాసృష్టిన్" అంటాడు. "సర్వోదయకవి" "నవ్యసంప్రదాయ భావవిప్లవకవి" అధ్యాయాలలో యీ అంశం విపులంగా చర్చించడం జరిగింది. తుమ్మలవారి 'ఎక్కట్లు — చక్కట్లు - సందేశసప్తశతి - సర్వోదయగానం తెనుగునీతి, గీతాదర్శం తదితర ఖండకావ్యాలు చదువుకోవచ్చు.

**4) విశ్వమానవ కల్యాణం—**

"శీతనగమునుండి సేతువు దనుక నా
మాతృభూమి యనుట మఱచిపొమ్ము
పుడమెల్ల నాదు పుఱుటి గడ్డయటంచు
సోదరా! తలంపు మీదినాన! —కదంబకైత

"మతములెన్నియైన మానవగణమెల్ల / నొక్కజాతి యనుట నిక్కువమ్ము" అనీ "మతకులభేదముల్ మఱచి మానవతాపథ మాశ్రయించ" మంటాడు. "విశ్వజనీన బోధ్ధృతము" విశ్వజనతా శ్రేయః ప్రీతము" తన కవితా లక్షణమంటాడు. "సర్వోదయ మార్గమ్మున నుర్వికి దేవలయు శాంతి" అనీ "వ్యాపారము వ్యవసాయము/ భూపాలన - కావ్యరచన బో / ధ్ధృత సంఘో / దీపనము" వల్లనే యీమహిపై సుఖశాంతులు నెలకొనాలంటాడు. తనమేనంత నలంగిన / తన మనుగడ లోకసేవనమునకే అని తన జీవితలక్ష్యం-తన కవితాధ్యేయం వివరించాడు.

## 5) వ్యక్తి ఋజువర్తనం :-

సత్యనిష్ఠకు, ధర్మనిరతికి, సత్ప్రవర్తనకు తుమ్మలవారిచ్చినంత "ప్రాముఖ్యత" తుమ్మలవారు "కట్టుబడి" పోయినంత ఆధునికాంధ్ర సాహితీజగత్తులో మరే కవిపండితుడు కట్టుబడిపోలేదేమో- "అర్థమైన గామమైన ధర్మువునకు / దూరమైన రోసి త్రోసివైతు" నంటాడు. "తొలుత జీవనసరణికిన్ విలువచూచి / మాటకవ్వల వెలకట్టు మతమునాది" అని అంటాడు. నిజజీవితంలోనే కాదు, తన సాహితీ జీవితంలోను "సాధుశీలమాభి జాత్యమ్ము చెలువమ్ము/ పనసి మెఱయువనిత నాదుకవిత" అని నిర్ద్వంద్వంగా చెప్పాడు.

నిర్భయం బార్జవ నిష్ఠత్యాగమ్ము
ధ్వసరర్మ ప్రీతిశ్రమ మసంగ్రహము
దమము సత్యమహింస దయ వినయమ్ము
సాత్త్వికాన్నము విశ్వజన సోదరత్వ
మొఱుని దూఱమి దేశికొప్పుకోలిడుట
జీవగఱ్ఱలు సుడీ ! జీవిత గళకు
మచ్చుముక్కలు సుడీ ! మనుగడసిరికి —పైరపంట

గాంధీమహాత్ముడు దేశప్రజలకు - కాంగ్రెస్ కార్యకర్తలకు - సబర్మతి ఆశ్రమవాసులకు నిత్యం పాటించవలసిందిగా నిర్దేశించిన 'ఏకాదశ' సూత్రావళితో ప్రతిమనిషి జీవితకళ పెనవేసుకుందని తెనుగులెంక చెప్పుచున్నాడు. "గాంధికవి" అధ్యాయంలో యీ విషయం తెలుసుకున్నాంగదా !

తుమ్మలవారి దృష్టిలో— "సంగీతనర్తన సాహితీ శిల్ప/ వర్తకాదికములర్వది నాల్గుకళలు / నేర్చుట సమ్మాననీయమేకాని/ జీవితకళ నభ్యసింపనినాడు / రిత్తలాకళలిసీ / చెత్తకళలు" అని నిక్కచ్చిగా చెప్పాడు నిప్పువంటి గాంధికవి. పైన పేర్కొన్న "ఏకాదశ" నియమబద్ధ జీవితంలేనిదే - యీ లలితకళలన్నీ "రిత్తకళలు" "చెత్తకళలు" అంటాడు. అంటే - వైయక్తిత 'ఋజువర్తనానికి, సత్యనిష్టకు' యిచ్చినంత ప్రాముఖ్యం 'తెనుగులెంక లలితకళలలో నొకటైన, తాను చేపట్టిన 'సాహిత్యకళ'కు గూడా యివ్వలేదన్నమాట. అంటే వ్యక్తి సత్ప్రవర్తనకే తుమ్మలవారు పట్టం కడుతున్నారన్నమాట ! కవిగారంటే నాకందుకే భక్తి !

ఏలావ్రతములు తీర్థము
లేలాజన్నములు చదువులేలా యోగం
బేలా తపస్సు నరునికి
శీలంబది యింత చెక్కుచెదరకయున్నన్

మనిషి 'శీలానికి' తుమ్మలవారు 'ఫస్టుమార్కు' వేస్తున్నాడు. అత్యంత ప్రాముఖ్యత నిస్తున్నాడు తుమ్మలవారు.

గాంధీజీ ప్రవచించిన 'ఏకాదశ' సూత్రావళిని నియమబద్ధంగా - క్రమంతప్పక - క్రమశిక్షణతో పాటిస్తే - మనిషి జీవితం 'ఉత్తమ జీవితకళ'గా విరాజిల్లుతుందని - అట్టి సత్యనిష్టాగరిష్టుడైన 'శీల'వంతుని జీవితం "సుఖశాంతులతో" సార్థకమౌతుందని సత్యనిష్టాగరిష్టుడైన గాంధికవి శ్రీ తుమ్మల అభిభాషించాడు !

## తెనుగులెంకగా ధన్యుడైన శ్రీ తుమ్మల సీతారామమూర్తి

"కల్లకసటులేని "రైతుకుటుంబంలో పుట్టి "సేద్యపుబనులందు" "కూలివాండ్ర బంతిలో" జేరి "దోయిటబొడి బువ్వందిని" "మజ్జిగబువ్వ" త్రాగి "తృప్తి" చెందిన "క్షేత్రజీవి" శ్రీ తుమ్మల వారు ధన్యుడు! "అన్నము దిన్నచేతి తడియారియు నారకముందె" బరుగుల్ నురుగుల్ తీసి "దిన్నది గొంతుదాటిపోకున్నను పాఠముల్ చెప్పి "నల్వురు మేటిశిష్యుల" బడిసిన ఒజ్జమేల్బంది శ్రీ తుమ్మల వారు ధన్యుడు.

"గాంధియుగమున బుట్టి" గాంధినవుడు నుద్యమంబుల నలగి నోపినంత" - గాంధి నీక్షించి - గాంధికవిత వ్రాసి "నీ జన్మమునకు నీపంటచాలని" సంతృప్తిచెందిన గాంధికవి శ్రీ తుమ్మలవారు ధన్యుడు.

"ఏపుణ్యలేశమ్ము నాపాలదాయెనో / నాపూజ కేలోక నాథుండు పొంగెనో / నీపావనోదర శ్రీ పరంపరలలో / నీపదార్చకులలోనే నొక్కడనైతి"నని తెలుగుతల్లికి జోహారు పలుకుతూ పరమానందభరితుడైన తెనుగులెంక శ్రీ తుమ్మలవారు ధన్యుడు !

"మచ్చమసకలేని మనుగడ" సాగించి - "ప్రజకు నింపునింపు ప్రన్నని కబ్బముల్ వ్రాసి" కాసులకు నాసచేయక / వరణీయ కథాభాసురులకు నర్పించి "తనివి" చెందిన పరిపూర్ణ జీవిత "కళా ప్రపూర్ణుడైన శ్రీ తుమ్మల సీతారామమూర్తిగారి జీవితం ముమ్మాటికీ ధన్యం !



# అనుబంధం

## తుమ్మలవారి కృతుల సంక్షిప్త పరామర్శ

తుమ్మలవారు షుమారు ముప్పై(30) పైగాకృతులు రాసినా-లభ్యమౌతున్నాయి ఇరవై (24) నాల్గు కావ్యాలు 1930 కు పూర్వము ఆయన ఐదారు శతకాలు, నాల్గు హరికథలు, రెండు నాటకాలు, ఒక జంగంకథ ఒక లఘుప్రబంధం వ్రాసినట్లు-అందులో రాఘవ (రామ) శతకం - రామలింగేశ్వరశతకం, పురాంతక శతకం నామదేవ చరిత్ర (హరికథ) మాహేంద్రజననం నాటకం-(మేదరకులస్థుల జన్మగాథ) బిల్హణీయం జంగంకథ, అన్నదాన ప్రభావము, గాంధి తారావళి (చీరాల - పేరాల సత్యాగ్రహఘట్టం) రామకృష్ణస్మృతి (కవిగారి మిత్రుడు - గాంధేయవాది) జాతీయ స్ఫూర్తినిచ్చే మరికొన్ని కవితాఖండికలున్నట్లు చెప్పడం జరిగినా, అవన్నీ వ్రాతప్రతులుగానే వుండిపోయాయి! అందులో కొన్ని "చెదలపాలై" పోయినట్లు మరికొన్ని "పోయి"నట్లు - తెలుస్తుంది.

[ఈ గ్రంథంలో 322 పేజీలో (కవితా కమనీయత అధ్యాయం) తుమ్మలవారు "గజేంద్రమోక్షం - ప్రహ్లాదుని హరిభక్తి" కృతులు రాసినట్లు పొరపాటున చెప్పడం జరిగింది. ఇవి 1906-11 మధ్యకాలంలో బాలతుమ్మల కాపూరు శ్రీరాములు గురుపుదగ్గర వల్లించినవి]

ఇక 1930 తర్వాతరాసి - అచ్చయి లభ్యమౌతున్న పేరెన్నికగన్న కావ్యాల గురించి క్లుప్తంగా తెలుసుకొందాం.

## ఆత్మకథ

"My Experiments with Truth" సత్యసంశోధన ప్రయోగాలు - లేక - సత్యశోధన - పేరున గాంధీజీ రాసుకున్న స్వీయ జీవితచరిత్రను (ఆటోబయోగ్రఫీ) తెనుగులెంక "ఆత్మకథ" పేరున గద్యపద్యాత్మక బృహత్కావ్యంగా తీర్చిదిద్దాము. శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారి 'ఆత్మకథ' తెలుగు వచనరచనను ప్రధానంగా ఆధారంచేసుకొని తుమ్మలవారి కావ్యం వెలయించాము.

ఆత్మకథ "తొలుపాలు" మాత్రమే 1936లో ప్రథమంగా వెలువడింది. 1951 లో పూర్తికావ్యం వెలువరించాము, గాంధీజీ రాసుకున్న "ప్రస్తావన" (ముందుమాట) ను కూడా తెనుగులెంక ఛందోబద్ధం చేసాము. 1936 లో వెలువడ్డ ఆత్మకథ ప్రథమభాగం-ఆంధ్ర - మద్రాసు - అన్నామలై విశ్వవిద్యాలయాలలో పాఠ్యాంశంగా పెట్టబడింది.

ఇందులో గాంధీజీ వంశం 1869లో జననం-విద్యాభ్యాసం-వివాహం-లండన్‌లో బారెట్లా చదువు - స్వదేశం తిరిగిరాక - దక్షిణాఫ్రికా వెళ్ళి ప్లీడరుగా ప్రాక్టీసు - అచటి భారతీయుల 'గౌరవ జీవనానికి' ఉద్యమం నడుపుట - 1915 లో భారతదేశం తిరిగివచ్చుట - జాతీయోద్యమంపట్ల గాంధీజీ అత్యంత శ్రద్ధకనపరచుట కాంగ్రెస్‌తో సంబంధం - గాంధీజీ యావద్దేశ పర్యటన - ఖేడా సత్యాగ్రహం - అహమ్మదాబాద్‌లో ఆశ్రమస్థాపన 1919 వరకు గల యిత్యాది ఘట్టాలీకావ్యంలో ఉన్నాయి.

ఈ కావ్యానికి ఆనాటి ఆంధ్రఆతర్వాత మైసూరు విశ్వవిద్యాలయాల ఉపాధ్యక్షులు ప్రముఖ సాహిత్యవిమర్శకుడు శ్రీ కట్టమంచి

రామలింగారెడ్డిగారు "తిలకరచన" చేసి "కవిత్వము అప్రతిమానము. శైలియించుమించు ఆంధ్రమహాభారత ప్రతిబింబము..." దిక్కనతో సజాతీయుడైనవాడు మన చౌదరి" అని ప్రశంసిస్తూ "తుమ్మల సీతారామమూర్తి మహాత్మునియొక్క ఆస్థానకవి. ఈ స్థానము శాశ్వతము" అని అభిభాషించాడు.

"చేసిన పుణ్యమై తనకుజిక్కిన కైత ఫలింపభక్తిమై" "ఆత్మకథ" రాసినట్లు కవిగారు చెప్పుకున్నారు. "కృత్యాది"లో ప్రాచీన ప్రబంధకవుల చెప్పుకొన్నరీతిగా - దైవస్తుతి భారతమాత - ఆంధ్ర జననిని - వాణిని మాతాపిత - గురుసంస్తుతి - ప్రాచీన అర్వాచీన కవులస్తుతి-వంశావళిగూర్చి చెప్పుకున్నాడు కవిగారు.

ఈ కావ్యం "ప్రబంధశైలి"లో నడిచింది. రమణీయ కమనీయ తెలుగు నుడికారాల సొంపుతో - చిక్కని తెలుగుభాషలో ఛందోబద్ధం గావించబడింది ఇందులో దేశీయఛందోరీతులైన - ఆటవెలది- తేటగీతి - కందం - సీసం - మధ్యాక్కర - మంజరి - ద్విపద- (అటనట వృత్తాలున్నా)లలోనే అధికభాగం కావ్యమంతా నడిచింది.

ఈ కావ్యం ను "నెమకి నెమకి గంటి నీలో సబర్మతీయోగిల క్షణంబులు"న్న ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధుడు - శుద్ధ గాంధేయవాది శ్రీ ఎర్నేని సుబ్రహ్మణ్యంగారికి "అర్చన"గా అంకితమిచ్చాడు గాంధికవి.

తుమ్మలవారి కావ్యాలన్నిటిలో ఆత్మకథ 'ఉత్తమమైనదని కవిగారు చెప్పుకొనుటయేకాక, శ్రీ కట్టమంచి శ్రీ విశ్వనాథ, శ్రీ రాళ్ళపల్లి, శ్రీ కాటూరి ప్రభృతులుగూడా ప్రశంసించారు.

ఈ కావ్యరచనతో తుమ్మలవారికి అఖండ కీర్తిప్రతిష్టలు సంతరించాయి. 'అభినవతిక్కన' బిరుదు "గాంధికవి" యన్న పేరు కనకాభిషేకాది ఘనసన్మానాలు తుమ్మలవారికి లభించాయి.

ఈ విషయమై మరికొంత సమాచారంకోసం యీ గ్రంథ మందలి "గాంధికవి" అధ్యాయం చూడొచ్చు.

## మహాత్మకథ

ఇది పద్యగద్యాత్మక కావ్యం. స్వతంత్ర బృహత్కావ్యం. 19.9 నుండి 1948 వరకు గాంధీజీ నాయకత్వాన సాగిన జాతీయో ద్యమ చరిత్ర ఇది. 1915కు పూర్వం జాతీయోద్యమానికి పునాదులు వేసిన గోపాలకృష్ణగోఖలే - బాలగంగాధర్ తిలక్ - మోతీలాల్ నెహ్రూ - బిపిన్‌చంద్రపాల్ - చిత్తరంజన్‌దాస్ ప్రభృతుల ప్రస్తా వన సూచనప్రాయంగా ఇందులోవున్నా వారుచేపట్టిన కార్యక్రమాలీ కావ్యంలో చోటుచేసుకోలేదు. జాతీయోద్యమానికి గాంధి నాయ కత్వం వహించడంచేతను, గాంధీజీ అంటే కవిగారికున్న 'భక్తి' భావంవల్లను 'మహాత్మకథ' అని నామకరణం చేసాడు.

"పలికెడిది గాంధికథయట / పలికించెడువారు తెలుగు ప్రజ లట" అంటూజాతీయోద్యమనాయకుడైన మహాత్ముని మహత్తర చరి త్రను ఉత్తమరీతిలో ఉత్తమ కావ్యంగా తీర్చిదిద్దాడు గాంధికవి.

ఇందులో - రౌలటుచట్టం-జలియన్ వాలాబాగ్ దురంతాలు (1919 - 20) - ఆలీసోదరుల ఖిలాఫత్ ఉద్యమం - (1920) గాంధి ఆంధ్రదేశ పర్యటన - విదేశీవస్త్ర దహనం - పన్నుల నిరాకరణో ద్యమం - కోర్టుల బహిష్కరణ - శాసనోల్లంఘనం - చౌరీచౌరా దుండగములు - సైమన్‌కమిషన్‌ను దేశప్రజలు బహిష్కరించుట (1927) బార్డోలీరైతు సత్యాగ్రహం (1928) ఉప్పుసత్యాగ్రహం (1930) గాంధి - ఇర్విన్‌సంధి - లండన్‌లో రౌండు టేబిల్ సమా వేశాలు(1931-33)హరిజనసేవా-గ్రామపరిశ్రమలకార్యక్రమం-గాంధి వ్యష్టి - సమిష్టి సత్యాగ్రహం - గాంధీజీ - కాంగ్రెస్ నాయ

కుల నిర్బంధం - జైళ్ళపాలు - బీహారు భూకంపబాధితులను గాంధి ఓదార్చుట - క్రిప్సు రాయబారం నేతాజీ పాత్ర - క్విట్ ఇండియా ఉద్యమం (1942) గాంధీజీతోపాటు దేశనాయకుల నిర్బంధం- దేశంలో పెద్దయెత్తున అల్లరు హింసాకాండచెలరేగుట - క్షామ పీడిత వంగదేశం గాంధీజీ పర్యటన - దేశవిభజనకోసం జిన్నా నాయకత్వాన ముస్లిములు ఉద్యమం తీవ్రతరంచేయుట - నౌకాళీ- బీహారులలో అల్లర్లు - గాంధీజీ పర్యటన - దేశస్వాతంత్ర్యసిద్ధి (1947) దేశవిభజన - పాకిస్తాన్ అవతరణ - ఢిల్లీ కలకత్తాలలో అల్లర్లు - బాపూ పర్యటన - బాపూజీ హత్య (1948) ఇత్యాది ముఖ్యఘట్టాలన్నీ యీ కావ్యంలో పొందుపరచబడ్డాయి. వివిధ చోట్ల - వివిధ సమయాలలో జాతీయ కాంగ్రెస్ సభల్లో చేసిన తీర్మానాలు - నెహ్రూ - పటేలు - రాజేంద్రప్రసాద్ - రాజాజీ- ఆచార్య రంగా - ఆంధ్రకేసరి టంగుటూరి - పట్టాభి - సరోజినీ నాయుడు మదనమోహన మాలవ్య - అబుల్‌కలాంఆజాద్ వంటి దేశనాయకులు గాంధీతోపాటు సత్యాగ్రహంలో పాల్గొనుట- అరెస్టగుట - జైళ్ళపాలుకావడం - మున్నగునవున్నాయి. ఆంధ్రాభి మానంతో కవిగారు - పల్నాటిపుల్లరి - చీరాల - పేరాల - పెద నందిపాడు పన్నుల నిరాకరణం - అల్లూరి సీతారామరాజు పల్నాటి హనుమంతు - పర్వతనేని వీరయ్యల త్యాగనిరతి రాజమండ్రి జెండా ప్లీడరు మొదలగు ఘట్టాలు ప్రత్యేకంగా పొందుపరిచాడు. దీనిని అచ్చమైన గాంధీజీ అనుయాయి - నిస్స్వార్థ స్వాతంత్ర్యసమర యోధుడు, మాజీ భారతప్రధాని - శ్రీ లాల్‌బహాదూర్ శాస్త్రి గారికి ఆయన మరణానంతరం "సస్మృతి"గా అంకితమిచ్చాడు.

తుమ్మలవారి గురువరేణ్యుడు - శ్రీ దువ్వూరి వేంకటరమణ శాస్త్రిగారు సుదీర్ఘమైన (తుమ్మలవారి యితర కృతులనుగూడా

పరామర్శిస్తూ) "అవతారిక" రాస్తూ "ఇది వీరరసోల్బణము. కరుణ రసాల వాలము... మహాత్మకథ రసవంతమయిన రమణీయకావ్యమ" ని అభిభాషించాడు.

ఈ కావ్యంగూడా బృహత్కావ్యం - ఇదియును ప్రబంధ శైలిలో సాగింది. కృత్యాదిలో దైవాన్ని-ఆంధ్రభారతమాతలను-వాణిని, మాతాపితలను - గురువులను సంస్తుతిస్తూ తన వంశావళిని గూర్చి చెప్పి తనకుప్రియులైన ప్రాచీన అర్వాచీన కవుల్ని సంస్మ రించుకొన్నాడు. ఈ కావ్యంగూడా అధికభాగం - దేశీయఛందో రీతులైన - కందం - ఆటవెలది - తేటగీతి - సీసం- ద్విపద-మంజరి-మహాక్కరలలోనే నడిచింది. అయితే "ఆత్మకథ"లో వున్నంత "జిగిబిగి" యీ కావ్యంలోవున్నట్లు అనిపించదు. ఇది 1968లో ప్రచురింపబడింది.

పట్టాభి సీతారామయ్యగారి 'కాంగ్రెస్ చరిత్ర' ప్యారీలాల్ గారి 'మహాత్మగాంధి - చరమఘట్టము (Mahatma Gandhi The Last Phase) అనే గ్రంథాలు తన కావ్యరచనకు మిక్కిలిగా తోడ్పడ్డాయని కవిగారు చెప్పారు.

ఈ గ్రంథంలోని "గాంధికవి" "జాతీయకవి" అధ్యయాలు చూడవచ్చు, మరికొంత సమాచారంకోసం.

## అమరజ్యోతి

బాపూజీ హత్యగావింపబడినప్పుడు రాసిన లఘుకావ్యం. ఇది 1948లో ప్రచురితం. ఇందులో కేవలం 55 పద్యాలున్నాయి. వృత్తాలు - సీసాల ఛందోప్రక్రియలలో రాసిన యీ పద్యాలు చిక్కగా చక్కగా - శైలీవిన్యాసంతో - భావగాంభీర్యంతో ఒప్పా రుతూవున్నాయి. ఇందులో గాంధికవి గాంధీజీ వ్యక్తిత్వానికి పట్టం

కట్టాడు. కవిగారికి గాంధిపైనున్న 'భక్తిభావమెట్టిదో స్పష్టంగా తెలుస్తుంది. దీనిని తన తల్లి 'చెంచమాంబ'కు అంకితమిచ్చాడు. దీనికి ఎవరి అభిప్రాయంలేదు. దీనిని 1951లో "పతిగపంట"లోను తర్వాత 1968లో వెలువడ్డ "మహాత్మకథ" లోను చేర్చాడు.

## గాంధిగానము

ఇది గాంధీ జీవితం మొత్తం సంక్షిప్తంగా కావ్యంగా తీర్చిదిద్దిన కావ్యం. అంటే ఆత్మకథ - మహాత్మకథ - అమరజ్యోతి ల్లోని 'యితివృత్తమే యిందు క్లుప్తంగా ఛందోబద్ధం చేయబడ్డది.

ఇది 1987లో వెలువడ్డది. దీనిని కాట్రగడ్డ అనసూయమ్మకు (కాట్రగడ్డ రాఘురామయ్యగారి సతీమణిగారు విజయవాడలో ప్రముఖవైద్యుడు డా॥ పిన్నమనేని వేంకటేశ్వరరావుగారి అత్తగారు) "అంకితం" యివ్వబడింది. దీనికి ఎవరిచేత అభిప్రాయం రాయించ లేదు.

ఆత్మకథలోని యితివృత్తం (గాంధి జననం నుండి లండన్ చదువు - దక్షిణాఫ్రికా జీవితం - తిరిగి స్వదేశ ఆగమనం) "ముత్యాలసరాలు" "నవాక్కరల" ఛందోస్సుల్లో రాసాడు. మహాత్మకథలోనున్న ఇతివృత్తం (1915 నుండి 1948 వరకుగల చరిత్ర) "మంజరి" - ఛందస్సులో నడిచింది. విశేషమేమిటంటే ఆత్మకథలోని ,యితివృత్తగాథ (1915 వరకు) సాగిన ముత్యాల సరాలు - నవాక్కరలకు ప్రతికవిత చివర 'అనసూయ' అంటూ సంబోధిస్తూ-కథనాకృతిస్వామినితో చెప్పినట్లు ఛందోబద్ధంగా కథనడి పాడు.ఇందులోని భాష చాలాసరళం! శ్రీనాథుడుముందు ప్రౌఢంగా రాసిన శృంగార నైషధానికి - చివరలో సరళంగా ద్విపదలో రాసిన 'పల్నాటిచరిత్రకెంతటి "తేడా" వుందో తుమ్మలవారి 'ఆత్మ కథ' శైలికి 'గాంధిగానం' శైలికి అంత "తేడా" వుంది.

## రాష్ట్రగానము

ఇది ఖండకావ్యం. ప్రత్యేక ఆంధ్రరాష్ట్రంకోసం తెలుగువారు ప్రారంభించిన ఉద్యమానికి స్ఫూర్తినిస్తూ - తెలుగువార్ని నుత్తేజపరుస్తూ - ఉత్సాహపరుస్తూ చేసిన కవితాగానం మీ 'రాష్ట్రగానం' "నాజాతియు నాభాషయు పరతంత్రతములై పరకీయసంస్కారము నాశ్రయించి - ప్రాచీన గౌరవమును కోల్పోయినందులకు నా మనస్సులో అనుక్షణముగ రేగినట్టి యారాటమునకు - నా జీవుడు కదలినాడు. ఆ కదలికయే 'రాష్ట్రగానము"ని కవిగారు "మనవి" చేసుకున్నారు.

ఈ ఖండకావ్యంలో - జోహారు (గేయం) హెచ్చరిక-కైవారము — ప్రశస్తి — అనుతాపము - ప్రబోధము- సంస్కరణము పశ్చిమాంధ్రులు - మాతృభాష - తెలుగుదనము — ప్రమాదము-రాయబారము — కృతజ్ఞత - సాంత్వనము - అవిటలు - పట్టాభిక్షై - తెలుగుతల్లి - ఆహ్వానము - రథోత్సవము ఆశీస్సు - ఆకాంక్ష- కవితాఖండికలున్నాయి.

గతమెంతో గొప్పదనీ — తెలుగురాజుల - రాణుల లలితకళాకారుల - సాహితీమూర్తుల - శ్రీవైభవప్రాభవాల్ని శౌర్యప్రతాపాల్ని - ధైర్యసాహసాల్ని పేరుపేరున అలానే సమకాలీన ప్రజానాయకుల - అగ్రశ్రేణి కవిపండితుల - మేధావుల - వివిధ కళాకారుల, ప్రతిభావిశేషాల్ని పేరుపేరున తెలుగుసోదరులకు గుర్తుచేస్తూ తరుణకర్తవ్య ప్రబోధం గావించాడు— "యావదాంధ్ర విషయమ్ము నొక్క- రాజ్యమ్ముజేసి విజయదుందుభిపై దెబ్బవేయువఱకు' తెలుగు బిడ్డకైన నిద్రింపవగునె" అంటూ ప్రబోధం

చేసాడు. ఆంధ్రుడవై జన్మించి - ఆంధ్రుడిగా జీవించి - ఆంధ్రుడిగా మరణించాలని - 'ఆంధ్రత్వములేని బ్రతుకు నాసింప' వద్దని సాటి తెలుగువారికి విజ్ఞప్తి చేసాడు.

దీనికి విశ్వనాథవారు పీఠికరాస్తూ — "ఈ కవిలో స్వభాషాభిమానము పరాకాష్ఠపొందినది... ఈయన ప్రాణములో హృదయములో మనస్సులో శరీరములో నాంధ్రుడు.... ఓయి ఆంధ్రుడా! నీవీ కవివంటి వాడవగుదువేని పతితమైన యాంధ్రజాతి ఒక్క నిమేషములో తొలినాటి గొప్పదనము పొందదా!" అని ఆంధ్రుల్ని హెచ్చరించాడు.

ఈ కావ్యం1938లో మొదటిసారి అచ్చైనది. చల్లపల్లి రాజా 'యార్లగడ్డ శివరామప్రసాదు బహద్దర్‌గారికి కావ్యం అంకితమీయబడింది. ఇది ఎన్నోకూర్పులు (పునర్ముద్రణ) చేసుకొంది. బహుళప్రచారం పొందిన కావ్యం! ఆత్మకథ తర్వాత తెనుగులెంకకు అంతటికీర్తి తెచ్చిపెట్టిన కావ్యం. ఇందులో కైవారము - ప్రశస్తి - అనుతాపము - ఖండికలలోని 'సీసపద్యాలు శ్రీనాథుని సీసపద్యాలకు సరిజోడుగా ఉన్నాయి! ప్రబోధము - పశ్చిమాంధ్రులు మాతృభాష — అఱవలు మొదలగు ఖండికలలోని 'వృత్తాలు' నృత్యంచేస్తూ పాఠకుని హృదయాన్ని హత్తుకుపోతాయి.

ఈ కావ్యంలోని ప్రతిపద్యంలో ఆంధ్రుల చరిత్ర - గత వైభవం - ఆంధ్రాభిమానం తొణికిలాడుతు వున్నాయి! మరికొంత వివరంకోసం, యీగ్రంథంలోని "రాష్ట్ర (గాన) కవి" అధ్యాయం చూడొచ్చు!

## ఉదయగానము

ఇది ఖండకావ్యము "రాష్ట్రవృద్ధికై యువ్విళ్ళూరుచు హృదగానము బాడితి".... "మహావీరుడు అసురవీరుడు" - పొట్టి

శ్రీరాములుగారి బలిదానముతో రాష్ట్రోదయమైనది. దీనితో ఉదయగానము సాగినది" అని కవిగారే చెప్పుకున్నాడు. "రాష్ట్రీయ సమస్యలు కొన్నింటిని - దేశవికాసమునకు కవిగారికి తోచిన కొన్ని మంచి సూచనలును యీ కావ్యములో చెప్పాడు కవి. "రాష్ట్రము భాషామూలకమగుటం తెనుగుబాసపెంపు సొంపులగూర్చి కొంత నిందు చర్చింతిననియు" కవి సెలవిచ్చాడు.

ఈ కావ్యంలో 'వేగుచుక్క' (పొట్టి శ్రీరాములు) అలమట పిన్నలు - పదవులు - రాష్ట్రోదయము - విశాలాంధ్రము ఎల్లలు - దక్షిణాంధ్రులు - రాచపీడు - సంక్రాంతివేదన - క్రొత్తవెలుగులు - మగువలు - విద్యార్థులు - వినాయకులు - పేదలు - తెలుగుతీపి - వాడుకభాష - కదంబము - కవితాఖండికలున్నాయి. ఇందులో "పొలిమేరదొంగల" గురించి 'దక్షిణాంధ్రుల గురించి, రాజధాని సమస్య గురించి - పదవుల కొట్లాటగురించి - తెలంగాణంతోసహా విశాలాంధ్రం సిద్ధిగురించి - రాష్ట్రసర్వతోముఖాభివృద్ధి గురించి భాషాసమస్య గురించి - యిలా ప్రత్యేకరాష్ట్రం వచ్చాక తల యెత్తిన వివిధాంశాల గురించి తెనుగులెంక ఛందోబద్ధంగా చర్చించాడు.

ఈ కావ్యంనకు ప్రముఖ వకీలు - సాహితీవేత్త శ్రీ పి. వి. సుందరవరదులుగారు సమీక్షరాసారు—— "వీరి కృతులలో నిండు దనము తెలుగునుడికారపు సొంపు - భావపుష్టికిదగ్గ భాషాసమృద్ధి వీరిసొమ్ము. ఆ నడకలోని హుందాతనం - పలుకులోని గంభీరత - పదప్రయోగములోని యౌచిత్యం వీరికావ్యములకొక విశిష్టతనొడ గూర్చినవి" అని గొనియాడారు.

ఈ ఖండకావ్యాన్ని కవిగారి ఆత్మీయుడైన మిత్రుడు శ్రీ ఉప్పల నాగయ్యగారికి అంకితం యిచ్చాడు. ఈ కావ్యం ప్రథమంగా 1954లో వెలువడింది.

## సర్వోదయగానం

ఇది ఖండకావ్యం. ఇది 1960లో ప్రచురించబడింది. గాంధీజీ అనుయాయి; గాంధీజీ సర్వోదయ సిద్ధాంతానికి ఆచరణలో జీవం పోసిన నిష్కళంక కర్మయోగి - భూదానయజ్ఞకుడు ఆచార్య వినోభా బావే ప్రవచనాలు - ఆయన దేశమంతటా తిరిగినప్రదేశాలు భూసేకరణచేసిన సన్నివేశాలు ఇందు పొందుపరచబడ్డాయి.

ఇందులో ఆతడు (వినోబాభావే) రామగంగ - భావే చక్కట్లు ప్రేమ - వర్తకులకు - మనుష్యజన్మము పవిత్రసన్నివేశాలు (భావే వివిధప్రాంతాలలో తిరిగి ప్రజలనుండి భూసేకరణచేసిన సన్నివేశాలు) పేదలు – క్రొత్తసంక్రాంతి–కవితాఖండికలున్నాయి. ఆనాటి రాష్ట్రపతి రాజర్షి శ్రీ రాజేంద్రప్రసాదు వినోభాబావే ఉద్యమాన్ని శ్లాఘించి "దీవన"లిచ్చి తనకు సెంటుభూమిలేక పోయినా తన బిడ్డలకున్న భూమిలో కొంత భూదానంచేసిన సన్నివేశంగూడా ఇందున్నది.

తెలంగాణా నల్గొండ జిల్లా పోచమపల్లె గ్రామభూస్వామి వెదిరె. రామచంద్రారెడ్డి 'శుభమా' అంటూ తనకున్నభూమిలో 'నూరెకరాలను' వినోభాబావేకు సమర్పించిన తర్వాత భావేదేశం నలుమూలలు తిరిగి అన్నివర్గాలనుండి భూసేకరణచేసిన సన్నివేశాలిందున్నవి. భూదానంతోపాటు గోదానం - గ్రామదానం చేసిన సందర్భాలు - కమ్యూనిష్టులు గూడా భూదానం చేసిన సందర్భాలిందున్నవి.

గాంధేయవాది - స్వతంత్ర సమరయోధుడు - కావూరి వినయాశ్రమానికి తన ఆస్తిని విరాళమిచ్చిన 'తుమ్మల బసవయ్య'కు "కానుక"గా అంకితమిచ్చాడు యీ కావ్యాన్ని.

దీనికి రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు 'పీఠిక' రాసారు. "శ్రీ సీతారామమూర్తిగారి కవిత స్వతంత్రమైన మాధుర్యసౌరభ్యములు వెదజల్లగలది. సౌలభ్యగాంభీర్యములు దాని మూలద్రవ్యములు" అంటూ "శ్రీ వినోభా బావేగారి ఉదాత్మాత్మ శ్రీ సీతారామమూర్తి చేతికిజిక్కి తెలుగు మెఱుపులతో ఇందు మెఱయుచున్నద"ని అభిభాషించాడు.

## గీతాదర్శం

'భగవద్గీత'కి "గీతాదర్శం" తెనుగులెంక తెలుగుసేత. "సర్వోదయ తపస్వి వెంపట సూర్యనారాయణగార నువదించిన పూజ్య వినోబా 'గీతాప్రవచనములు' తెనుగులెంకకు భగవద్గీతాంధ్రానువాదానికి స్ఫూర్తినిచ్చాయి. తత్ఫలితంగా తొలిసారి దాదాపు 250 శ్లోకాలు తెలుగుపద్యాలుగా మలిచి 1957లో 'భూదాన' పత్రికలో ధారావాహికంగా ప్రచురించాడు. వాటినే 1959లో "గీతాంగణ" మను పేర నొకగ్రంథముగా ప్రచురించాడు.

తలపండిన తత్త్వవేత్తలకు తప్ప ఒకపట్టాన సామాన్యజనావళి 'బుర్ర' కెక్కని వేదాంతవిషయాలు – ఆధ్యాత్మిక విషయాలున్న 'భగవద్గీత'ను సరళమైనభాషలో అక్షరజ్ఞానమున్న సామాన్య జనావళికి గూడా అర్థమయ్యేరీతిలో దేశీయ ఛందోప్రక్రియలైన ఆటవెలది, తేటగీతి, కందం ఛందస్సులలో తీర్చిదిద్దాడు తెనుగులెంక. మొదటవెలువడ్డ 'గీతాంగణం'ను ప్రజలాదరించుటచేత కవిగారికి కొండంతబలమొచ్చి మిగిలిన శ్లోకాలుగూడా ఛందోబద్ధంగా అనువదించి మొత్తం భగవద్గీతను తెనుగులో "గీతాదర్శమ"ను పేరున 1963లో వెలువరించాడు.

"హృదయ దౌర్బల్యముచే గ్రుంగికుతిలపడుచున్న మానవుని దేర్చి ధర్మవీరునిగా దీర్చుటలో నిది సాటిలేని యోజ్జ" అని తెలుగు

లెంకకు 'భగవద్గీతపట్ల నున్న' ఉన్నత గౌరవభావం దృష్ట్యా మాన వునికి కర్తవ్యబోధ (నిష్కామ కర్మయోగం) చేస్తూ 'మార్గదర్శక మయ్యే భగవద్గీతకు తెనుగులెంక 'గీతాదర్శమ'ని సముచితనామ కరణం చేసాడు.

దీనిని "సామ్యయోగ సాహిత్యధునీ, సర్వోదయ ప్రచార స్వీన్నా" అగు తెనాలిలో ప్రముఖ నేత్రవైద్యుడు డా॥ వెంపటి సూర్యనారాయణగారికి 'పురస్కృతి'గా 'అంకిత' మిచ్చాడు తెనుగు లెంక !

## ఆత్మార్పణము

ఇది లఘుకథాకావ్యం. ఇతిహాసాలకు సంబంధించి, తెనుగు లెంక రాసిన కావ్యమిదొక్కటే, మహాభారతమందలి "లుబ్ధకపోతో పాఖ్యానం కథను స్వల్పమార్పులు - చేర్పులతో తెనుగులెంక "ఆత్మార్పణమ"ను పేర వెలయించాడు. ఇది 1932లో ప్రచురింప బడింది. అంతకుముందు 'భారతి' మాసపత్రికలో ధారావాహికంగా ప్రచురింపబడింది.

ఇందలి యితివృత్తం స్థూలంగా— మేతకోసం వెళ్ళినపెంటి బోయవాడివలలో జిక్కుకొంటుంది. ఎంతకీ తన సతీమణి గూటికి రాకపోయేసరికి వెతుక్కుంటూ పోతుకపోతం ఓ మర్రిచెట్టుదగ్గర వలలో బంధీఅయిన ప్రియభార్యను చూచి - విలపిస్తూ ఆత్మహత్య చేసుకొంటానికి 'చితి' పేర్చుకొంటుంది. వర్షానికితడిసిన బోయవాడా 'మంట' వలన కొంత ఉపశమనం పొందుతాడుగూడా. పోతుకపోతం విలాపం - వేదన గమనించిన బోయవాడు పెంటిని విడిచిపెడతాడు. అప్పటికే పోతుకపోతం చితికాహుతి అయిపోతుంది పెంటిగూడా 'భర్తలేని జీవితం' తనకెందుకని పోతుఆహుతిఅయిన చితిలోనే పెంటిగూడా ఆహుతి (సహగమనం) అయిపోతుంది.

"జ్ఞానము నుపకారేచ్ఛయు / మానవగణమందకాదు మతి యును ఖగసం / తానము నందుంగల"ందులకు కఠినాత్ముడగు కిరాతకుడు ఆశ్చర్యపోతాడు. "ఉత్తమ మానవజన్మం / బెత్తియు నే జెడితి జ్ఞానహీనుడనై తినని" పశ్చాత్తాపం జెంది, భార్యాబిడ్డల్ని దేహాభిమానం విడిచి - "మునివృత్తి" దాల్చి మహాప్రస్థానమై పోతాడు. దేవతలుపంపిన దివ్యవిమానంలో "పెంటీ - పోతుక పోతాలు" స్వర్గ ధామం చేసుకొని శాశ్వతసుఖశాంతులతో జీవిస్తాయి !

ఈ కావ్యంనకు ప్రముఖ పాత్రికేయుడు - సాహితీవేత్త ఆంధ్ర శేషగిరిరావుగారు "ప్రస్తావన" రాసాడు. "ప్రబంధశైలి" పెంచి తెనుగులెంక యిట్లు "క్రొత్త" వెలయించినట్లు ఆంధ్రవారు మెచ్చుకున్నారు. ఇది లఘుకావ్యమైనా - యిందలి పద్యాలు గద్యాలు "పొంకం - బింకం" గల్గిన ప్రబంధశైలిలో నున్నాయి.

ఈ కావ్యరచనకు కొంతకాలం క్రితం "కాలధర్మం" చేసిన తన ప్రథమకళత్రం "రాఘువమ్మ" గారికి "అంకితం"గా సమర్పణం చేసియున్నాడు కవిగారు - కవిగారి సతీవియోగ మనోవేదన-కావ్య మందలి కపోతజంట వియోగవేదనలో "ప్రతిబింబ"మైనదని వేరే చెప్పనక్కరలేదు. ఒకవిధంగా – యిది సతీస్మృతి కావ్యమని నిస్సంశయంగా చెప్పవచ్చును.

## ధర్మజ్యోతి

ఇది లఘుకథాకావ్యం. తండ్రి నారయ్యగారి నిజాయితీని ఋజువుపరచే యథార్థగాథ ! ప్రథమంగా 1943లో యిది ప్రచురింపబడింది. దీనిని కవిగారి కాష్టమిత్రుడు "వెలగపూడి దానయ్య గారికి "అంకితం" చేసాడు.

ఇందులోని యితివృత్తం క్లుప్తంగా :— చందోలుగ్రామ వడ్డెరలు కాలువ త్రవ్వుచుండగా దొరికిన బంగారపుటచ్చులు 'యిత్తడి అచ్చులని' మోసంచేసి ఆవూరి వైశ్యులు అమాయకులైన వడ్డెర్ల చేతిలో 'నాల్గుపైసలు' పెడతారు. ఈ 'నిధి' సంగతి ప్రభుత్వానికి తెలిసి - పోలీసులొచ్చేసరికి అందులో తెలివిగల ఒకవైశ్యుడు తన వాటా బంగారపుటచ్చుల్ని కావూరిలోని నీతిపరుడైన నారయ్యగారి దగ్గర "దాచి" పెడతాడు.

రెండేళ్ళు గడిచినతర్వాత ఆ వైశ్యుడొస్తే నారయ్యగారు "ముద్దరసుద్ది"గా మొత్తం బంగారం తిరిగియిస్తాడు. కృతజ్ఞతా పూర్వకంగా ఆ వైశ్యుడు కొంతబంగారం యివ్వజూపితే - "నీ సొమ్ము నీకొసంగితి...." వలదు బహూకృతిలేశము" అని నారయ్య గారు మంచిగా తిరస్కరిస్తాడు అదే సమయంలో నారయ్య ఆ వైశ్యునికి - సంపన్నులు శ్రామికుల్ని దోచుట ధర్మంకాదని - వర్తకులు న్యాయంగా ఆర్జించుకోవాలని - అనాథల్ని ఆదుకోవాలని కొంత హితబోధ చేస్తాడు.

కవిగారు చందోలువెళ్ళి జనశ్రుతిగా వస్తున్న యీ కథలోని వాస్తవాన్ని తండ్రిగారి నిజాయితీని అప్పటికీ జీవించియున్న ఆవృద్ధ వైశ్యుని ద్వారా తెలుసుకొని సంతోషిస్తాడు. తమ "సుఖసంతోషాలకు" కారణభూతుడైన నారయ్య కుమారుడొచ్చాడని సంబరపడిపోయి ఆవృద్ధ వైశ్యదంపతులు కవిగారికి కమ్మనివిందుచేసి పెడతారు. ఇదీ యితివృత్తం.

ఈ కావ్యానికి శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు "తొలిపలుకు" రాస్తూ "ధర్మజ్యోతిలో వారి కవితాధార దరులొరసికొని నిండారి పార్వాఱినది" అంటూ "ఇందు గథాప్రధాన పాత్రమగు నారయ్య స్వార్థసారిత్యము మూలమున ధర్మజ్యోతియై

వెలిగినాడు ... తథావిధమైన సుకృతపరిపాకమే యీ పుణ్యాత్ముని కడుపుపంట శ్రీ సీతారామమూర్తి చౌదరి" అని లెన్నబలికాడు.

ఇది లఘుకావ్యమైనా ప్రబంధశైలిలో నడిచింది కావ్యం. భావం భాష "సమతుల్యం"గా చెట్టాపట్టాలు పట్టుకొని 'యీడుజోడి'గా సాగాయి. దీనిని ఆంధ్రవిశ్వవిద్యాలయంవారు "ఇంటర్మీడియట్" క్లాసుకు "పాఠ్యాంశంగా" పెట్టారు. తుమ్మలవారు కావ్యం ముగింపులో తా"వ్రాసిన యీ చిఱుగబ్బము / వాసిన్ గడియించుగాత వసుమతి, మాకున్ / నూసంతతికి ధర్మ / వ్యాసక్తియు సిరులకంటె నగ్రయమగుశన్" అంటూ తండ్రిగారి సత్యనిష్ఠ సిరులకంటె తమకు తమ వంశానికి అధికంగా అబ్బాలని ఆకాంక్షిస్తాడు.

## పఱిగపంట

ఇదొక ఖండకావ్యం. మొదట 1943లో వెలువడింది. అయితే 1948లో వెలువడ్డ 'పెదకాపు' ఖండకావ్యాన్ని అమరజ్యోతి (గాంధి నిర్యాణపద్యాలు) తపస్సిద్ధి (నిమ్మబ్రోలు కనకాభిషేక సన్మాన కృతజ్ఞతాపద్యాలు) యితర చిన్నకృతులనన్నిటిని చేర్చి 1951లో సమగ్రంగా పెద్ద ఖండకావ్యసంపుటి "పఱిగపంట"ను పునర్నిర్మించి ముద్రించి వెలువరించాడు. ఈ సంపుటిలో మొత్తం 45 కవితాఖండికలున్నాయి. ఈ ఖండకావ్యాన్ని "నిమ్మబ్రోలు యున్నతపాఠశాలకు తనయెల్ల కల్మిపనప్పనచేసి నిఱుపేదయైన నెఱదాత" కొసరాజు లక్ష్మయ్యగారికి 'నుమగర'గా అంకితమిచ్చాడు.

ఇందులో సంక్రాంతి, ఆదర్శవీరుడు (తేజబహద్దరు) వీరధర్మం (బాలచంద్రునికి తల్లి యుద్ధబోధ) సేవాధర్మము (కాళిదాసుని దిలీపుని కథ) శంకరాచార్యుని 'భజగోవిందమ్ రాష్ట్రీగానం తాలూకు

అనుతాపం గాంధీజీ తాలూకు వంగభస్మము - పాదధూళి - నేతాజీ కర్షకుడు - క్షేత్రజీవి - చిన్నయసూరి - మొల్లకవిరాజువంటి కలకండవంటి కమనీయకవితా ఖండికలున్నాయి. వీటిల్లో సంక్రాంతి కర్షకుడు - క్షేత్రజీవి - ఉత్తమోత్తమ కవితాఖండికలు.

ప్రముఖ కవిపండితుడు "కాటూరి వేంకటేశ్వరరావుగారు యీ కృతికి "పురస్కృతి" నిచ్చినాడు "సంక్రాంతి" అనే కృతిభావనలో భాషలో సర్వోత్తమమై తెలుగునాటి భోగభాగ్యాలను- సరససల్లాపాలను - నడతనాగరీకతలను - కన్నులకుగట్టినట్లు నోరూరునట్లు 'చిత్రించాడని మెచ్చుకొన్నాడు కాటూరివారు. తెలుగు నుడికారము సొంపు - చౌదరిగారెఱిగినంతగా ఇతరులెఱుగరేమో" అంటూ "వేమన్నను - తిక్కన్నను గూడా మఱపిస్తూ ఉంటవి వారి తెలుగుపోకడ"లనీ "చౌదరిగారి వాణి యెప్పటికప్పుడు కాలంతో పాటు, కాలంకంటే ముందునడుస్తూ ఆశాకిరణాలను ప్రసరింపజేస్తూ ఉంటుందని" శ్లాఘించాడు శ్రీ కాటూరివారు.

ఈ ఖండకావ్యంలోని కొన్నిపద్యాలు - ఆనాడు వెలువడిన ఆంధ్రీ - మహితీ - భారతీ - ప్రజామిత్ర - రైతుబిడ్డ సినిమాలో "హాచ్చిన్సు"లో నగు వణిజ్మండలుల శబ్దగ్రాహులలో - రైతుభజనావళి మొదలగు సంపుటాలలో ప్రచురింపబడ్డాయి.

## శబల

ఇది ఖండకావ్యం. ఇది 1955లో ప్రచురించబడింది. ఇందులో 38 ఖండకవితలున్నవి. అందు సంక్రాంతి తలపులు - వీరపూజ- కర్ణుడు - రంగా - వివేకానందుడు - ఉలుపా (ఏటుకూరిపై) ఆశువుగా చెప్పిన 'నాకథ - సీత' (ఆశుకవిత) రైతుమొఱ- దేశభక్తుడు (కొండా వెంకటప్పయ్య) ఆతడు (వినోభా బావే) పైరాసిన కవితలు

యీా ఖండకావ్యంలో మేలిముత్యాలు. వీటిలో సంక్రాంతితలపులు కవిత మేలైన ఆణిముత్యం.

ఈ ఖండకావ్యానికి శ్రీ విశ్వనాథవారు 'పీఠిక' వ్రాసారు. "సంక్రాంతి తలపులు" పరమోత్తమమైన కవితాఖండము... చిత్రమైన కావ్యఖండమిది.... ఈ శీర్షికలో నొకపద్యము బాగున్నదని-యొకపద్యము బాగులేదని లేదు" అనివిశ్వనాథవారు అభిభాషించారు. "భారతీవల్లభా (రంగా) మీాది "కర్ణాటీనవహీరహారము త్రిలింగక్షౌసతీమల్లికా".... అనే పద్యాన్ని కూడా విశ్వనాథవారెంతగానో మెచ్చుకొన్నారు. ఈ కావ్యాన్ని తనమేనల్లుడు జాస్తి వేంకటనరసయ్యకు "ఏదియే నెన్నడుంగోరని మేనల్లుని కోర్కెని" మన్నించి "ఈవి"గా ఇతని జితేంద్రియత్వమున కేనుగరంగి" అంకితమిచ్చాడు.

## నాకథలు

ఇదొక పెద్ద ఖండకావ్యం. కవిగారి నిజజీవితానికి సంబంధించి జరిగిన కొన్ని సంఘటనలు - సన్నివేశాలు కవితాబద్ధం చేసాడుకవి. ఈ 'నాకథలు' చదివితే - శ్రీ తుమ్మల విద్యాభ్యాసం - కవితా పరిశ్రమ - ఋజువర్తనం - తెలుస్తుంది. స్థూలంగా యీా "నా కథలు" శ్రీ తుమ్మలవారి స్వీయజీవితచరిత్రకు అద్దంపడుతుందని చెప్పవచ్చు.

ఈ ఖండకావ్యంలో మొత్తం యాబదియైదు (55) కవితా ఖండికలున్నాయి. ఇందులో టేకన్న - నారయ్యదివ్వె - నాచదువు గండముతప్పుట - జ్ఞానస్నానము - తప్పెటబ్బాయి -కనువిప్పు- పాకీపని- వినినిర్వహణము, అచ్చుతప్పుకాదు - పొలముబువ్వ - జాలి విధినిర్వహణ, కూలివలదు, తోటకూరబాకి, మానుషము, ఆశుకవిత, అవధానకళ, సిగ్గుపాటు- వాత్సల్యము - అలతివాడను-.

కవితలు ప్రముఖంగా చెప్పుకోదగ్గవి. ఈకవితాఖండికల్లో చాలా కథా (సంఘటన) కవితాఖండికలున్నాయి !

ఈ ఖండకావ్యాన్ని అమెరికన్ గాంధిగా విశ్వవిఖ్యాతి గాంచిన నీగ్రోనాయకుడు డా॥ లూథర్ కింగ్"నకు హత్యగావింప బడిన తర్వాత అంకితం యివ్వడం తెనుగులెంక "విశ్వమానవతా" దృక్పథం తేటతెల్లమౌతుంది.

ఈ ఖండకృతికి తెలుగువిశ్వవిద్యాలయం మాజీ ఉపాధ్య క్షులు ప్రముఖ సాహితీవేత్త-సాహితీవిమర్శకుడు అచార్యతూమాటి దోణప్పగారు విపులమైన సమీక్షరాసారు— "చిననాటి బ్రదుకు సొగసులను, పొలముపనుల నాటిపోకడలను - ఒజ్జనమునాటి మను గడతీరులను, కయితలల్లి కనకస్నానములుసేసిన నాటి గాథలను- సం పూర్ణ పూరుషాయుషజీవిగా తుమ్మలవారు సాధించిన జీవితపరమార్థ ములనుచిత్రించు రేఖామాత్రమయిన స్వీయచరిత్రమిది" అంటూ— "శౌచసుందరత వెలయు దివ్యజీవన వికసనము" వెల్లివిరిసే "సహృ దయ జనరంజనముగా ఒత్తుగామత్తుగా పండికైవాలిన బంగరు పంటగా— యీ 'నాకథలు' ఖండకావ్యాన్ని బహుధా ప్రశం సించాడు ఆచార్య దోణప్పగారు !

ఈ ఖండకృతిలోని కవితలుకొన్ని అంతకుముందు - సామ్య యోగము - భారతి - స్రవంతి - గ్రంథాలయసర్వస్వము - తెలుగు విద్యార్థి మున్నగు పత్రికలలో ప్రచురింపబడ్డాయి. ఈ ఖండకావ్యం తొలిసారిగా 1973లో ప్రచురింపబడ్డది.

మరికొంత సమాచారంకోసం యీ గ్రంథంలోని "తుమ్మల వారి జీవితం - సాహిత్యం - వ్యక్తిత్వం" అధ్యాయం చూడొచ్చు.

## తెలుఁగునీతి

భర్తృహరి నీతిశతకము (నీతిచంద్రిక) నకిది తెలుగుసేత. తెనుగులెంకకు "తెలుఁగుభాష" పట్ల - తెలుగు సంస్కృతిపట్ల- తెలుగుదనంపట్ల 'వీరాభిమానమున్న వాఁడుకనుక దీనికి 'తెనుగునీతి' అని పేరిడినాఁడు తెనుగులెంక !

"ముప్పదియేండ్ల యొజ్జనమున" విద్యార్థులకెన్నోసార్లు యీ భర్తృహరి నీతిపద్యాలు బోధించియున్న సుదీర్ఘానుభవం మనకవి గార్ని "యీ నూతనానువాదమునకు బురికొల్పినది" ఈ కృతికి 'సాహిత్య విద్యాప్రవీణ' యార్లగడ్డ వేంకటసుబ్బారావుగారు, (కవి గారికి నిడుబ్రోలు ఉన్నతపాఠశాలలో 'సహోపాధ్యాయు'డు) "తిలకరేఖ" దిద్దారు— "వీరిరచనలో మూలములోని శబ్దార్థములు గుణీభూతములై భావము ప్రాధాన్యము నార్జించుకొన్నది. తెలుఁగు దనమాద్యంతము కూలంకషమై జాలువాఱినది. కొన్నియెడల మూలమందలి 'అస్పష్టతను' బరిహరించెను. కొన్నిపట్టుల మూలము నకే మెరుగులు దిద్దెన"ని శ్రీ యార్లగడ్డవారు అభిభాషించారు.

ఈ కావ్యాన్ని "తన" నుడిలోనడలోగల దేని ఋజుత్వమ్మో దానికెల్లను శౌచశ్రీనిధి" అయిన తన మాతృమూర్తి చెంచ మాంబకు "సమర్పణము" (అంకితం) గావించాఁడు కవిగారు.

ఈ కావ్యం ప్రథమంగా 1961లో ప్రచురింపబడింది.

## నేను

ఇది లఘుకావ్యం - పద్యాలన్నీ ముక్తకాలు - కవిగారి జీవితంనకు - నియమనిష్ఠలకు సంబంధించిన విషయాలిందు పొందుపరచ

బడ్డాయి. ప్రధానంగా కవిగారి 'స్వభావం - గుణగణాలకు' ఇది ప్రతిబింబం !

ఇది 1963లో మొదటసారిగా ప్రచురింపబడింది. ఈచిన్ని కావ్యాన్ని 'కాటూరి వేంకటేశ్వరరావుగారికిఉడుగర'గ నిచ్చాడు- ఆయన 'సంస్కృతి' చిహ్నంగా ! ఈచిన్ని కావ్యానికి ఎవరిచేత 'పీఠిక' రాయించలేదు.

ఒకసారి యొక అధికారిని ఏదోపనిమీాద సందర్శించిన సందర్భంలో ఆ యధికారి కవిగార్ని 'మొగాదిగా' జంకెనచూపులతో చూచి - నీవెవతివి (who are you !) అని అడిగాడట ! ఆ అధికారికి పాపం - తెనుగులెంక గొప్పకవియని - రాష్ట్రగానం - ఆత్మకథ మొదలగు కావ్యాలురాసిన జాతీయకవియని తెలిసివుండదు ! ఆత్మాభిమాని - సత్యనిష్టాగరిష్టుడు - అందునా లబ్ధప్రతిష్టుడైన గాంధికవికి కాస్త 'అహం' దెబ్బతిన్నట్లుంది ! అప్పుడు కవిగారు ఆశువుగా నీక్రింది పద్యంతో నుత్తరమిచ్చాడు.

రాష్ట్రసిద్ధికొఱకు రక్తమ్ముగార్చిన
కవినినేను గాంధికవిని నేను
బడలి బడలి తల్లిబాస కూడెముసేయు
కవినినేను దేశికవిని నేను—అని.

అప్పుడా అధికారి ప్రసన్నుడాయెనట !

దరిమిలా ఇట్లే తనజీవిత కవితానిష్టలను గూర్చి మఱికొన్ని పద్యములు వ్రాయవలయునని కాంక్షకలిగి - కలముపట్టి - "మఱికొన్ని పద్యములు వెలయించి వాటినీ చిన్నికావ్యంగా వెలయించాడు తెనుగులెంక ! ఇందలి పద్యాలు శ్రీనాథుని "చాటువుల్ని" గుర్తుచేస్తాయి.

## పైరపంట

ఇదొక ఖండకావ్యం - ఇది మొదటిసారి 1964-65లో ప్రచు రించబడింది "నామనుగడ యందుత్తరార్థమున సాగిన ఖండకావ్య ములే (కవితలు) యీ సంకలనములో నున్నవి. కాన దీనికి 'పైర పంట' అని పేరిడితిని అని కవిగారు పేర్కొన్నారు - ఇందులో 23 (యిరువదిమూడు) ఖండకవితలున్నాయి. అందు - సంక్రాంతి ముచ్చట్లు - వరినాట్లు - జడికారు - సమాజవికాసము - ఆమంచి రోజులు - (కథాకవితాఖండిక) కవితలు పేర్కొనదగినవి.

ప్రముఖ స్వాతంత్ర్యసమరయోధుడు - గాంధేయవాది- సాహితీమూర్తి - సౌజన్యమూర్తి 'అయిన' శ్రీ 'వెలువోలు సీతా రామయ్య'కీ కావ్యం అంకితంయిచ్చాడు కవి - దీనికి ఎవరిచేతను పీఠిక రాయించలేదు. ఇందులోని 'సంక్రాంతి ముచ్చట్లు - స్వతంత్ర భారతి' కవితలు ఆకాశవాణిలో వచ్చాయి.

## సమదర్శి

ఇది ఖండకావ్యం - ఇందులో షుమారు అరువది (60) కవితాఖండికలున్నవి. బాపూజీ - రాయలు - వివేకానందవాణి- వినోబా వాణివంటి ఉత్తమనాయకులపైని కవితలతోపాటు - రాయ ప్రోలు - జాషువా - వేలూరి శివరామశాస్త్రి - నారాయణరెడ్డి వంటి లబ్ధప్రతిష్ఠులైన కవులమీద రాసినకవితలు - రంగావంటి దేశ నాయకులమీద - కల్లూరి సుబ్బారావు - మేడూరి - తెన్నేటి- గొల్లపూడి సీతారామశాస్త్రి - (మాస్వామి) చంద్రమౌళి - వావి లాల శొంఠి రామమూర్తివంటి అగ్రరాష్ట్రనాయకులమీద కవి

తలు - చెప్పుకోదగ్గవి. ఇందులో సుకవి - కవితాసేవ - రాష్ట్రవాణి ఆత్మజ్ఞానం కవితలుగూడా పేరెన్నదగ్గవి.

"సమకాలిక కవులను మెచ్చుట అరిదియేకాదు అరుదును అంటూ "సీతారామమూర్తిగారు సమకాలిక కవులకు సైతము జయ కారములు పలుకుట "యిదివారి" సమ "దర్శనమునకు "విజయ పతాక" యని ప్రముఖ సాహితీవేత్త నాగళ్ళ గురుప్రసాదరావుగారు అభిభాషించారు.

ఈ కావ్యానికి "ఆముఖము" రాస్తూ ప్రముఖ సాహితీవేత్త విమర్శకుడు శ్రీ నాగళ్ళ గురుప్రసాదరావుగారు "ఈ కావ్యము విలక్షణమయినది. వారి పొగడ్తపొందిన వారిలో గాంధేయవాదులు కానివారున్నారు. నాస్తికులున్నారు ! వావాయూ ధర్మక్షేత్రముల లోని స్వార్థమగు సేవగావించి రాణించినవారు. కావుననే కవిగారి ప్రశంసకెక్కిరి. వాదభేదములను విదళించి విషమదృష్టిని పరిహరించి యితర సుగుణములను గ్రహింపగల ఓర్పునేర్పులున్న కవి" అని ప్రశంసించాడు.

ఈ కావ్యమును నిమ్మబ్రోలులోని పి. బి. యన్ కాలేజి వ్యవ స్థాపకుడు పాములపాటి బుచ్చినాయుడుగారికి "సూడిద"గా అంకిత మిచ్చాడు. ఇది తొలిసారిగా 1967లో ప్రచురింపబడింది.

## ఎక్కట్లు

ఇది "శతకం" వంటిది. ఇందు దాదాపు 340 (మూడువందల నలుబది) పద్యములున్నవి. శతకపద్యమందుండు "స్వతంత్ర ప్రతి పత్తి" యీ 'ఎక్కటి' పద్యములకున్నది. "ఎక్కటి" అంటే పరా పేక్షలేనిదని" రెండవదానితో కలియని (స్వతంత్ర) ముక్తకమని- ఎక్కటికి బహువచనమే "ఎక్కట్లు"ని కవిగారు "మొగమాట"లో వివరించాడు.

ఈ 'ఎకచెట్లు' నీతిప్రబోధకాలు వంటివి. సమకాలీన సమాజమందలి మంచిచెడ్డలను దృష్టిలోపెట్టుకొని కవిగారుచేసిన 'హితోక్తులు' యివి— "ఎదుటనున్న సమాజమును సమీక్షించితిని— ఇదితగునని, అది తగదని కఱదలు పల్కితిని. పెద్దలసూక్తుల నటనట ననుకరించితిని." అని కవిగారే వివరించినారు. పద్యాలన్నీ ఆటవెలది - తేటగీతి - అటనట కందఛందస్సులో సరళమైన భాషలో రాసాడు తెనుగులెంక.

ఈచిన్న కావ్యాన్ని తన ప్రియశిష్యుడు శ్రీ కాకరపర్తి వేంకటేశ్వర్లుకు 'బహుకృతి' గావించాడు. దీనికి ఎవరిచేతా పీఠిక రాయించలేదు. 1976లో మొదటికూర్పుగా వెలుగుచూసింది.

## హనువమాన్‌చాలీసా

ఇది గోస్వామి "తులసీదాసు" హిందీలోరాసిన "హనుమాన్ చాలీసా"కు తెలుగుసేత !

'సీతారామ' నామక తెనుగులెంకకు హనుమాన్‌చాలీసాపట్ల అనురక్తియుండుట సహజం - కారంచేడు హరేరామ జపయజ్ఞసమాజం" వారి సలహాపై తెనుగులెంక 1975లో యీ 'చాలీసా'ను పద్యాత్మకంగా మొదట తెనుగించాడు కని. అయితే 1976లో దీనిని 'చాలీసా' నడకననుసరించంగా గేయకవితలుగా తీర్చిదిద్దాడు. దీనిని గుంటూరులోని శ్రీరామనామక్షేత్ర వ్యవస్థాపకుడు శ్రీరాం ఆంజనేయులుగారికి 'కానుక'గా సమర్పించాడు ఇది 1978లో ప్రచురితం దీనికెవరి అభిప్రాయంలేదు.

## సందేశసప్తశతి

ఇది ఏడువందలపైచిలుకు పద్యములుగల శతకం - "ఆయామహాత్ముల సూక్తులననుసరించియు, అనువదించియు, సంతరించిన పద్యము

లీసప్తశతిలో కొన్ని గలవని "కవిగారు" మొగమాటలో చెప్పారు. ఇది ప్రథమంగా 198 లో ప్రచురితమయ్యింది. దీనికెవరి అభిప్రాయంలేదు. దీనిని నిరాడంబర నిష్కళంక నిష్కామకర్మయోగి- ఆదర్శసర్వోదయ కార్యకర్త శ్రీ వట్టికూటి వేంకటసుబ్బయ్యకు 'మన్నన'గా అంకితమిచ్చాడు.

ఇందులో ప్రథమంగా ఈశ్వర - వాణిని స్తుతించి విద్య నేర్పిన గురువుల్ని - ప్రాచీన - అర్వాచీన - సమకాలీనకవుల్ని - కొందరు నాయకుల్ని స్మరించాడు. సుతిమెత్తగా - సున్నితంగా విమర్శించిన సామాజిక 'అక్రమాలు - ఎత్తిచూపిన సామాజికరుగ్మతలున్నాయి. మేలిముత్యాలవంటి హితవచనాలు- అమృతసూక్తులు - సందేశాలున్నాయి. గాంధీజీ ఆగష్టుపదిహేను పైని కొన్ని కవితలున్నాయి.

సరళమైన తేటతెనుగులో ఆటవెలది- తేటగీతి - కందంలలో అందంగా వెలయించాడు పద్యాలు. ఆటవెలది ఛందస్సులో రాసిన పద్యాలతీరు ప్రత్యేకించి చెప్పుకోవలసిందే ! "పలుకుబడులు సామెతలు నానుడులు - నొడుగడగిన నొయ్యారములుగుల్కు నాటవెలది" అంటూ "అలతి అలతి నుడులనలరు తెలుంగున / నాటవెలది మిగులనందగించు" అని చెప్పి - ప్రజలనాల్కలమీాద నిత్యం తాండవించే తెలుగుసామెతల్ని - తెలుగుపలుకుబడుల్ని - లెక్కకు మిక్కిలి ఆటవెలది 'ఛందస్సు'లో సుందరసుకుమారంగా- హృద్యంగమంగా లయవిన్యాసంగా - నాట్యమాడించాడు తెనుగులెంక. ఒక్కొక్కసారి తెనుగులెంక తేటతెనుగు పద్యాలు తిక్కన్నను వేమన్నను మరిపిస్తూవుంటాయని శ్రీ కాటూరి వేంకటేశ్వరరావుగారన్న మాటగుర్తుకొస్తుంది !

## కదంబకైత

ఖండకావ్యమిది. ఇందులో 47 కవితాఖండికలున్నాయి. గాంధిశతతమ జయంతి - ఉగాది తలపులు - దీపావళి - ఆగష్టుపది

హేనువంటి జాతీయసంబంధ కవితలు- శ్రీయుతులు భావే (స్మృతి) కాళేశ్వరరావు - ఆచార్యరంగా - సంజీవరెడ్డి - బెజవాడ గోపాల రెడ్డి - వంటి అగ్రశ్రేణి నాయకులు - సర్వశ్రీ మధునాపంతుల- కృష్ణశాస్త్రి - శ్రీ శ్రీ - కొత్త సత్యనారాయణ - వంటి మేటి కవులు- భారతీదేవి, కావూరి వెంకయ్య, ఎం.ఆర్. అప్పారావువంటి 'సామాన్యులలో అసామాన్య వ్యక్తులు - పైనిరాసిన కవితలు-యీ కదంబకవితా పూమాలలో సురభిళ పరిమళాలు గుబాళించే కుసుమాలు !

"దేశాభిమానమో దేహాత్మవిచారమో ధార్మికావేశమో నైతికప్రేరణమో పెద్దలయెడం బొడమిన పేర్మియో పిన్నలదెసం దోచినకూర్మియో కారణముగా నపుడపుడీ కైతలువ్రాసితిని" అని కవిగారు సెలవిచ్చారు. దీనికి ఎవరి అభిప్రాయం రాయించలేదు.

ఇది 1983లో మొదటిసారిగా వెలువడింది. దీనిని "పద్యమును గద్యమును హృద్యపద్యనడుపు నోడుపు" గల్గిన "అమూల్యశ్రీ శ్రీ జె. అమ్మలయ్య (యీగ్రంథ రతయిత) గారికి "ఉడుగర"గా అంకితమీయబడింది.

## చక్కట్లు

ఇది ఖండకావ్యం. ఇందు 27 (యిరువదియేడు) కవితాఖండిక లున్నాయి. కొన్ని 'చక్కట్లు' - నీతిముక్తకాలు- హితప్రవచనాలు. ఇందులో భారతీయుడు - బాపూజయంతి - వీరబ్రహ్మేంద్రస్వామి, మట్టి చెన్నారెడ్డి- శ్రీ నార్ల - శ్రీ త్రిపురనేని - ఇందిరాగాంధి- గాంధిదర్శనము - సర్వశ్రీ డా॥ కాసరనేని సదాశివరావు - మరుపూరి కోదండరామరెడ్డి - పండితవేదాంతం జగన్నాధాచార్యులు- యార్లగడ్డ వేంకటసుబ్బారావు - సైనికకవితలు - సత్కాళ - ఉగాది (కవిగారి చివరికవిత) కవితలు చెప్పుకోతగ్గవి.

ఈ కావ్యాన్ని తోడిఉపాధ్యాయుడు స్థితప్రజ్ఞ భావనాశౌచ రాశి - నిరాడంబర నిష్కామకర్మయోగి శ్రీ తాతా వేంకట సుబ్బయ్యగారికి అంకితం యివ్వబడింది. ఈ కావ్యానికి ప్రముఖ పశు వైద్యుడు (వెటర్నరీడాక్టర్) సాహితీపరిశోధకుడు - డా॥ శ్రీ సూర్యదేవర రవికుమార్‌గారు సవివరమైన "ముందుమాట" రాసాడు. "ఈముక్తకములలో కవిగారు అనేక సార్వకాలిక సత్యము లను చక్కని దృష్టాంతములతో చెప్పి పాఠకహృదయములకు స్ఫూర్తి నొసగినారు" అని రవికుమార్‌గారు వివరించాడు.

ఇది 1993లో ప్రచురింపబడింది. అప్పటికే తుమ్మలవారు కాలధర్మంచేసారు. అయితే యీ ఖండకావ్యాన్ని సిద్ధంచేసి - కృతి స్వీకర్తనెన్నుకొని కృతిపతిపద్యాలు రాసాడు కవిగారు. దురదృష్ట వశాత్తు కృతిఅచ్చుకాక పూర్వమే కవిగారు కన్నుమూసారు. అయితే కవిగారిపెద్దబ్బాయి, శ్రీనివాసమూర్తి ప్రస్తుత నిడుబ్రోలు పి. బి. యన్. కళాశాల ప్రిన్సిపాలు) తండ్రిగారికోర్కె తీర్చుట తన యుడిగా తనధర్మమని కావ్యాన్ని అచ్చువేసి అంకితం గావించాడు. తండ్రికోర్కె నెరవేర్చిన సత్పుత్రుడు శ్రీనివాసమూర్తి నిజంగా ధన్యుడు. పరలోకమందున్న తండ్రిగారి దివ్యాత్మకెంతేని ఆనందం-శాంతి చేకూరియుండును !

## దివ్యజ్యోతి

ఇది ఖండకావ్యం. ఇందు 32 (ఇరువదిరెండు) కవితాఖండిక లున్నాయి. రాజావాసిరెడ్డివారి స్మృతి - ఆంధ్రరత్న స్మృతి- కొని యాట (దేశోద్ధారకుని) గాంధిజయంతి - స్వతంత్రభారతి సుద్దులు- మొదలుగు కవితలెన్నదగ్గవి. 1930 - 30 దశకంలో రాసి, భారతిలో ప్రచురింపబడిన కృష్ణావతారం - పోతనస్మృతి- ఆంధ్రలక్ష్మీనృసింహ

స్తోత్రం - డా॥ రవికుమార్ కృషిఫలితంగా - యీఖండకృతిలో చేర్చడం విశేషం.

ఈ ఖండకావ్యం - కవిగారి బాల్యమిత్రుడు - స్వాతంత్ర్య సమరయోధుడు - ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాల కృష్ణయ్యగారి అనుయాయి అయిన శ్రీ జనాబ్ షేక్ గౌసుబేగ్ గారికి 'నజరానా'గా అంకితం గావించబడింది. కృతిపతినెన్నుకొని - అంకిత పద్యాలు రాసాడు కవిగారు. అంతలో అస్వస్థులైనాడు. అనారోగ్యంతో 1990లో అసువులుబాసాడు. కృతిపతిగూడా అంతకుముందే స్వర్గస్థులయ్యాడు. అయితే తుమ్మలవారి పెద్ద కుమారుడు శ్రీ శ్రీనివాసమూర్తి (ప్రస్తుతం నిడుబ్రోలు పి. బి. యన్. కాలేజి ప్రిన్సిపాలు) తండ్రికోర్కె నెరవేర్చుట కుమారునిగా తన విధ్యుక్త ధర్మమనిభావించి - కావ్యాన్ని అచ్చువేయించి - కృతిపతి కుమారులైన జనాబ్ ఖుద్దూస్ బేగ్ గారికి "సవినయముగా" సమర్పించాడు. తండ్రికోర్కె తీర్చిన శ్రీనివాసమూర్తిగారు ధన్యుడు - తండ్రి తరపున కృతిని స్వీకరించిన జనాబ్ ఖుద్దూప్ బేగ్ గారు అదృష్టవంతుడు. తండ్రికిలేని అదృష్టం అబ్బినందులకు జనాబ్ ఖుద్దూస్ బేగ్ గారు గూడా ధన్యుడే. కృతికర్త - కృతిస్వీకర్తల తనయులిద్దరూ 'భూలోకంలో జరిపించిన 'కావ్యాంకిత' కార్యక్రమం స్వర్గలోకంనుండి తిలకించి తుమ్మలవారి — జనాబ్ షేక్ గౌసుబేగ్ గారి 'దివ్యాత్మ' లెంతగా ఆనందించివుంటాయో! వారి ఆత్మలకెంతటి 'శాంతి' చేకూరియుంటుందో నిజంగా ఇదొక అపూర్వ సంఘటన!

ప్రముఖ కవి - విమర్శకుడు (నిడుబ్రోలు పి. బి. యన్. కళాశాల తెలుగు శాఖాధిపతిగా పనిచేసిన) శ్రీ తాఘ్నారి సత్యనారాయణగారు యీఖండకృతిని "సమాలోచనం" చేసాడు— ఈ దివ్యజ్యోతిని - దివ్యమూర్తుల సత్యసత్త్వస్వరూప ప్రశంసాజ్యోతిగా

పేర్కొంటూ— "ఇది దివ్యసందేశాలకు ఖని, కమనీయ భావపారి జాతాలనందనవని. ఆంధ్రకవితాక్షేత్రంలో ముక్కారుపంటలు పండించిన పెద్దకాపు శ్రీ తుమ్మలకాగా - ముక్కారుపంటల సమృద్ధిని మచ్చుగాప్రోవుచేసి అందించిన కృతియిది," అంటూ "ఇందలి సుద్దులు" తెలుగు శారదపాదార్పితములగు పూజాపుష్పములని" తాళ్ళూరివారు ప్రశంసించారు.

## తుమ్మలవారి సాహిత్యంపై ఇతరుల రచనలు

1) శ్రీ గొల్లపూడి ప్రకాశరావు (గుంటూరు జె. కె. సి. కాలేజి లెక్చరర్) తెనుగులెంక - తుమ్మల (జీవితం సాహిత్యం)

2) స్వతంత్రవాణి సంపాదకుడు-కవి - శ్రీ కొల్లా శ్రీకృష్ణారావు గుంటూరు - "తెనుగులెంక" (వివిధకవుల కవితలు - రచయితల వ్యాసాలు)

3) శ్రీ టి. శ్రీనివాసమూర్తి (నిడుబ్రోలు పి.బి.యన్. కాలేజి ప్రిన్సిపాలు) — "యుగకవి" (జీవితం- సాహిత్యం.) తుమ్మలవారి పద్యాల్ని వర్గీకరించి 1) యుగకవిత 2) సంక్రాంతి 3) రైతుజీవనం 4) సత్యం-శివం-సుందరం 5) రంగాభారతి-సంకలనాలు (కథాకవితాఖండికలు - స్మృతికవితాఖండికల-సంకలనాలు త్వరలో వెలుగుచూడనున్నాయి)

4) ప్రముఖస్వాతంత్ర్య సమరయోధుడు- కర్షకసాహిత్యపరిషత్తు వ్యవస్థాపక అధ్యక్షులు శ్రీ దరువూరి వీరయ్య— "తెనుగు లెంక — తుమ్మల సీతారామమూర్తి - జీవితం - సాహిత్యం"

5) శ్రీ చిటిప్రోలు వేంకటరత్నం (మిర్యాలగూడ కాలేజి లెక్చరర్) - ఆత్మకథలో తెనుగుదనంపై ఉస్మానియావిశ్వవిద్యాలయంనుండి "యం.ఫిల్" పట్టం పొందాడు,

6) శ్రీ యఱ్ఱాకుశాల రామయ్య (చీరాల లూథరన్ కాలేజి లెక్చరర్) తుమ్మలవారి కావ్యాలపై విమర్శనాత్మక పరిశీలన చేసి మద్రాస్ విశ్వవిద్యాలయం నుండి "డాక్టరేట్" పట్టం పొందాడు.

7) తెనుగులెంక - శ్రీ తుమ్మల సీతారామమూర్తి సాహితీపరిషత్ చీరాలవారి "తుమ్మలవాణి" (తుమ్మలవారి మేలి ముత్యాలవంటి పద్యాలు)

8) డా॥ సూర్యదేవర రవికుమార్ - తుమ్మలవారి ప్రత్యేక సంస్మరణసంచిక "దీప్తి" త్రైమాసపత్రిక !

## తుమ్మలవారి జయంతిసభలు గురించి

1952లో నిడుబ్రోలులో ఉప్పల నాగయ్యగారు తుమ్మలవారి జయంతి (డిశంబరు 25వ తారీఖు) సభ జరుపుటకు శ్రీకారం చుట్టాడు. తదాదిగా ప్రతిసంవత్సరం ఎక్కడో ఒకచోట తప్పనిసరిగా ఘనంగా జరపడం ఆనవాయితీగా వస్తూనేవుంది (వారి మరణానంతరం గూడా.) అందులో ముఖ్యమైనవాటిని తెల్సుకుందాం-

సంవత్సరం - జయంతిజరిగినస్థలం - సభఏర్పాటుకు ముఖ్యకారకులు.

1) 1954 – చిలకలూరిపేట - శ్రీ యలవర్తి రోశయ్య - జాస్తి వేంకటనరసయ్య

2) 1957–కావూరు - శ్రీ ఓగేటి పశుపతి - తుమ్మల బసవయ్యల ఆధ్వర్యంలో తుమ్మలవారికి పౌరసన్మానం- ఖద్దరుతో తులాభారం పేదలకు ఖద్దరు పంపిణీ.

3( 1960–నరసరావుపేట - శ్రీ కాటూరి వేంకటేశ్వరరావుగారి అధ్యక్షతన - తోటకూర వేంకటేశ్వ

రావు కె. వి. రమణారెడ్డిగార్లు - మరు
పూరి కోదండరామిరెడ్డి ముఖ్యఅతిథి.

4) 1961—తెనాలి - శ్రీ తల్లావఝ్ఝుల శివశంకరశాస్త్రిగారు ముఖ్య అతిథి - కె. వి. రమణారెడ్డి - అధ్యక్షతన-ఆవుల గోపాలకృష్ణమూర్తి జి.వి. కృష్ణారావు-కొండూరు వీరరాఘవాచార్యులువారు.

5) 1964—నరసాయపాలెం - శ్రీ పెద్ది సత్యనారాయణ అధ్యక్షత కన్నెగంట పాపారావు - కాకరపర్తి వేంకటేశ్వర్లు

6) 1966—రేపల్లె - డా॥ వెంపటి సూర్యనారాయణగారి అధ్యక్షత శ్రీ యార్లగడ్డ వేంకటసుబ్బారావు

7) 1971—పామర్రు (కృ. జిల్లా) - శ్రీ దువ్వూరి వేంకటరమణశాస్త్రి (కవిగారి గురువు) అధ్యక్షత- శ్రీఅక్కినేని భాస్కరరావు.

8) 1974—చిలుమూరు - శ్రీ రామమోహనరావు కాలేజి ఆధ్వర్యంలో శ్రీవెలువోలు సీతారామయ్యగారి అధ్యక్షత - కొలసాని మధుసూదనరావు

9) 1977—మాచర్ల - శ్రీ కె.వి. రమణారెడ్డి అధ్యక్షతన - ఉల్లి రామసుబ్బయ్య-చిటిప్రోలు కృష్ణమూర్తి

10) 1979—ఖమ్మం - జస్టిస్ P. A. చౌదరిగారి అధ్యక్షతన-రావెళ్ళ వేంకటరామారావు

11) 1980—గుంటూరు - ఆచార్య బొడ్డుపల్లి పురుషోత్తంగారి అధ్యక్షతన - పెద్ది సత్యనారాయణ.

12) 1981.–చీరాల - ఉప శ్రీ అధ్యక్షతన P. A. చౌదరి ముఖ్య అతిథి - కాకరపర్తి వేంకటేశ్వర్లు-నాగళ్ళ గురుప్రసాదరావు.

ఇంకా పెద్దాపురం (తూ. గో. జిల్లా) బందరు, గుడివాడ, ముదునూరు (కృ. జిల్లా) గూడూరు, ఏలూరు (ప. గో. జిల్లా) ఒంగోలు, గురజాల, హైదరాబాదు, కల్యాణదుర్గం, బ్రాహ్మణ కోడూరు, పచ్చలతాడిపర్రు, మోపర్రు, తెనాలి, బాపట్ల, దొప్పల పూడి, గిద్దలూరు, పాలకొల్లు జయంతి వేడుకలు జరిగాయి.

చీరాలలో 'తుమ్మల సీతారామమూర్తి సాహితీపరిషత్తు వారున్నూ, గుంటూరు సాహితీమిత్రమండలి వారున్నూ - తుమ్మల వారి జయంతి, వర్ధంతి వేడుకలు జరుపుతూనే వున్నారు.

ది 30-3-1990 తుమ్మలవారి (దశాహంకర్మరోజు) సంతాప సభ అప్పికట్లలో శ్రీ రావెళ్ళ వేంకటరామారావుగారి అధ్యక్షతన ఉదయం 10 గం॥నుండి సాయంత్రం 6 గం॥లవరకు ఎందరెందరో ఆత్మీయులైన కవిపండిత రచయితలు - అభిమానులు - శిష్యులు వందలాదిమంది పాల్గొన్నారు.

తుమ్మలవారి జ్ఞాపకార్థం డా॥ సూర్యదేవర రవికుమార్-శ్రీ టి. శ్రీనివాసమూర్తిగార్లు సంయుక్తంగా ప్రతిసంవత్సరం 1992 నుండి ఉత్తమపద్యకావ్యానికి రు. 500/– బహుమతి యేర్పాటు చేసారు.

1969లో గాంధీశతజయంతి సందర్భంగా - మహాత్మకథకు కేంద్రసాహిత్య అకాడమీ అవార్డు ప్రదానం చేసారు.

నాగార్జునవిశ్వవిద్యాలయం వారు డి.లిట్.గౌరవపట్టమిచ్చారు.

# పొరపాట్లు

1) ఈ గ్రంథంలో ఒకచోట (పేజీ 363) తుమ్మలవారు 20-3-90 న తుదిశ్వాస విడిచినట్లు చెప్పడం జరిగింది. ఆయన 21-3-90 రాత్రి 7-30 గం. 8-00 మధ్య స్వర్గస్థులైనారు.

2) తుమ్మలవారు వదాన్యులైన సాహిత్యాభిమానుల ఆర్థికసహాయంతో అప్పికట్లలో గృహవసతి యేర్పాటుచేసుకొన్నట్లు (పేజీ 65) ను మరొకచోట ఎవరిసహాయం లేకుండానే వసతి స్వంతంగా యేర్పరుచుకొన్నట్లు (పేజీ 363) ను చెప్పడం జరిగింది. అయితే పెంకిటిల్లు కట్టుకొన్నదికాదు. కొన్నది. దానికైన ఖర్చు పదొన్నలుగువేలు. మిత్రులు సహాయంచేసింది మూడువేలు మాత్రమే. (నాకథలు - అప్పికట్ల నిలువు)

3) తుమ్మలవారి ఏకైక కుమార్తె శ్రీమతి కల్యాణి ఆయన ప్రథమ సంతానం బిడ్డలందరికంటె పెద్దది. పేజీ 366లో ఆమె చిన్నదని పేర్కొనడం జరిగింది.

4) 19+4లో ముక్త్యాలరాజావారు తుమ్మలవారికి తమ సంస్థానంలో ఘనంగా సన్మానంచేసారు. ఆ విషయం పేర్కొనకపోవడం పొరపాటు.

5) తుమ్మలవారిని రాష్ట్ర కేంద్రప్రభుత్వాలు (పేజీ 92) గుర్తించలేదని ఒకటిరెండుచోట్ల చెప్పడం జరిగింది. 1969లో గాంధీజీ శతజయంతి సందర్భంగా ఆచార్య రంగాగారి కృషివలన తుమ్మలవారి "మహాత్మకథకు" కేంద్రసాహిత్య అకాడమీ పురస్కారగౌరవం లభించింది.

6) తుమ్మలవారు పుట్టిపెరిగిన కావూరులో లైబ్రేరియన్‌గా- తిలక్ జాతీయపాఠశాలలో ఉపాధ్యాయుడిగా పనిచేసిన "వినయాశ్రమం"లోని - "ఆత్మకథ" రచనకు శ్రీకారంచుట్టిన "చోట" తుమ్మలవారి 'విగ్రహం' నెలకొల్పుటకు అన్ని యేర్పాట్లు పూర్తిఅయ్యాయి. విగ్రహాఆవిష్కరణ జరుగుటయే తరువాయి !

# ఉపయుక్త గ్రంథాలు


1) ఆంధ్రసాహిత్య చరిత్ర - ఆచార్య శ్రీ పింగళిలక్ష్మీకాంతం.

2) అధునికాంధ్ర కవిత్వం - సంప్రదాయము - ప్రయోగములు- డా॥ శ్రీ సి. నారాయణరెడ్డిగారు.

3) సాహిత్యచరిత్రలో చర్చనీయాంశాలు - ఆచార్య జి. వి. యస్. సుబ్రహ్మణ్యంగారు

4) తిక్కన - శ్రీమదాంధ్ర మహాభారతం - విరాట- ఉద్యోగ- కర్ణ - శల్య - సౌప్తికపర్వాలు—

5) సమగ్రాంధ్ర సాహిత్యం - రెండవసంపుటం - శ్రీ ఆరుద్ర

6) తెలుగులో జాతీయోద్యమ కవిత్వం - ఆచార్య డా॥మద్దూరి సుబ్బారెడ్డిగారు.

7) తెలుగుకావ్యమాల - కేంద్రసాహిత్య అకాడమీ ప్రచురణ

8) కావ్యాంజలి - గాంధిశతజయంతి సందర్భంలో - గాంధి సాహిత్య ప్రచురణాలయం హైదరాబాదువారి ప్రచురణ.

9) ఆంధ్రప్రశస్తి - తెలుగు విశ్వవిద్యాలయ ప్రచురణ.

10) వైతాళికులు - ముద్దకృష్ణ (వివిధకవుల కవితల సంకలనం)

11) నవకవిత - ఆంధ్రవిశ్వవిద్యాలయ ప్రచురణ.

12) గాంధీజీ రచనలు(Bread Labour)భుక్తిశ్రమ, మరియు (From yera Vada Mandir) మంగళప్రభాతం - ఏకాదశ సూత్రావళి— (నవజీవన్ పబ్లిషింగ్‌హౌస్, అహమ్మదాబాద్.

13) పద్మశ్రీ బోయి భీమన్న షష్టిపూర్తి / సంచిన / సన్మాన

14) యుగకవి - యుగకవిత - శ్రీ టి. శ్రీనివాసమూర్తి

15) అభినవతిక్కన - అప్పికట్ల - నిడుబ్రోలు సంచికలు

# తప్పొప్పుల పట్టిక

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 7 | పాల్కురిని | పాల్కురికి |
| 3 | 11 | పండి | పండితు |
| 8 | 16 | బొబ్బులిపెబ్బులి | బొబ్బిలిబెబ్బులి |
| 10 | 7 | అయన్ని | ఆయన్ని |
| 20 | 8 | తెల్లటంచు | తెల్గటంచు |
| 25 | 1 | చటిన | బట్టిన |
| 28 | 26 | పాది | పాదు |
| 30 | 1 | కవికంటి | కవివంటి |
| 33 | ప 7 పా | డేగాక | డేలుగాక |
| 41 | ప 1 పా | వాగ్ని | వాగ్మి |
| | 3 పా | డయ్యో | డయ్యె |
| 52 | 11 | వంటయిట్టి | వంటయింటి |
| 53 | 1 | సాహంబు | సాహసంబు |
| 54 | 10 | అవి | అది |
| 56 | 12 | కవితరీతిలో | కవితారీతిలో |
| | 14 | పాటి | పాటు |
| 57 | 21 | కలత | కలదు |
| 58 | 3 | చూస్తూ | చూస్తే |
| 59 | 4 | చెప్పాడు | చెప్పాలి |
| 60 | 16 | అహిస | అహింస |
| | 18 | హింపా | అహింసా |
| 62 | ఫ 23 షా | హిష్ము | హోష్ము |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 63 | 1 | శ్రీష్ణుడు | శ్రీకృష్ణుడు |
| | 5 | ప్రభువు | ప్రభువువలె |
| | 9 | ఆత్మగీత | ఆత్మగత |
| 68 | 12 | బానూజీ | బాపూజీ |
| 69 | 21 | మనుజుడవునీవు | మనుజుడవుగావునీవు |
| 70 | 4 | బల్లిదువిద్ధవీర | బల్లిదు లిద్ధవీర |
| 78 | 21 | అడ్డంగా | అండగా |
| 80 | 9 | రాగ | రామ |
| 82 | 6 | ద్రౌపతి | ద్రౌపది |
| 86 | చివరిపంక్తి | కృత్వారి | కృత్యాది |
| 88 | 11 | మొదల్ | మొగల్ |
| 99 | 21 | మతిమీఱి | మితిమీఱి |
| 105 | 21 | పౌలస్త్యహృదయం తొలకరి | తొలకరి |
| 106 | 17 | పూటబడి | బడి |
| | 18 | దాట్టినాడ | దాటినాడ |
| 108 | ప 13 పా | నేర్చితిచే | నేర్చితివే |
| | ప 15 పా | నారికట్ట | నారకట్ట |
| 110 | 12 | వెచ్చా | వెచ్చ |
| 111 | 16 | ప్రాణతఱికి | ప్రాణతతికి |
| 120 | 23 | స్నావాలు | స్నానాలు |
| 121 | 17 | తోటిలోనికి | తోటలోనికి |
| 126 | 24 | తయాగుచేసే | తయారుచేసే |
| 127 | 1 | ఓమా | ఏమా |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 128 | ప 5 పా | పాయస్నానంబు | పాయసాన్నంబు |
| | 12 | ప్రాశత్యాన్ని | ప్రాశస్త్యాన్ని |
| 147 | 9 | అత్పుడాయన | అప్పుడాయన |
| 155 | 8 | కఅవరయ్యో | కఅవయ్యో |
| 167 | 18 | దోహం | దోహాల |
| | ,, | (సమదర్శి) | (పైరపంట) |
| 169 | 18 | శశికవి | శకకవి |
| 172 | 11 | వట్టగల | పట్టగల |
| 174 | 3 | హాయాంతో | సాయంతో |
| 175 | 8 | పర్మములు | పర్వములు |
| 180 | 7 | సంస్కృత | తల్లి సంస్కృత |
| 191 | 6 | మండజి | మంజరి |
| 199 | 21 | నిన్రిత | చిత్ర |
| 200 | 19 | డనురేంద్రుదువచ్చు | డసురేంద్రుడువచ్చు |
| | 20 | మత్యుగ్రత | మత్స్యగ్రత |
| 201 | 21 | గంఫనంతో | గుంఫనంతో |
| | 17 | సుర్ఫ | స్ఫుర |
| 211 | ప 21 పా | నిదుపమ | నిరుపమ |
| 232 | 6 | అలది | అలతి |
| 241 | 22 | సీమ | సీస |
| 252 | 7 | పెంటె | పెంటి |
| 254 | 3 | చుంచివాః | చుంబివాః |
| 256 | 8 | గంఫనాలు | గుంఫనాలు |
| 266 | 8 | ఛెంధ | చెంత |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 270 | 20 | దీ ర్ణలార! | దీర్ఘలార! |
| | 23 | నిర్సరో | నిర్భరో |
| 2 9 | ప 9 పా | పట్టైసుజల్లి | పట్టైనుజల్లి |
| 300 | 4 | పాలిళ్లు పొలగాని | పాలేళ్లు పొలిగాని |
| 310 | 18 | సరతత | సరళత |
| 326 | 12 | గట్టం | గుట్టం |
| 327 | 17 | యాదవని | యాదరువని |
| 349 | 9 | నటుంది | నట్లైంది |
| 361 | 4 | కాని | దాని |
| 366 | 23 | సాహాత్యం | సాహిత్యం |
| 367 | 6 | అనుగ్రహాంపు | అనుగ్రహింపు |
| 386 | 13 | జతపచి | జతపరచి |
| 390 | 4 | నిగర్వదం | నిగర్వం |
| 396 | 2 | వారిక్కిడొక | వారిక్కడొక |
| 398 | 1 | గల్లి గవ్వ | చిల్లి గవ్వ |
| | 15 | గ్రామవాస్తులు | గ్రామస్థులు |
| 403 | 13 | ఝరీతంగముల్ | ఝరీతరంగముల్ |
| 417 | 3 | పొగెంను | పొంగెను |
| 422 | 4 | శుద్గ | శుద్ధ |
| ,, | 19 | భాసము | భావము |
| ,, | ,, | సర్మ | ధర్మ |
| 424 | 21 | ప్రభుతులు | ప్రభృతులు |
| 434 | 20 | ధ్వసరర్మ | సర్వధర్మ |
| ,, | 23 | మొఱుని | మొరుని |
| 435 | ,, | దేశి | స్వదేశి |
| ,, | 8 | చెత్తకళలు | చెత్తలాకళలు |
| 436 | 12 | నాషాల | నాషాళి |